# పీఠిక



ఉ. కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నము లవారితసత్కవికల్పనావిశే
షావహపూర్వవృత్తములు సానలఁ దీరినజాతిరత్నముల్
గావున నిట్టిమిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్.

సంస్కృతమునందు వాల్మీకికాళిదాసాదిమహాకవులు కవిత నెలకొలిపి దానికి వలయు సౌభాగ్యసంపద లన్నియుఁ గూర్చిరి. పిదప నాలంకారికులు చమత్కారబీజములన్నియుఁ బ్రోడీకరించి శాస్త్రరూపంబునఁ బ్రపంచించి యాంధ్రాదిభాషలకు సంచితధనంబుగా నొసంగిరి. మన తెనుఁగునకు సంస్కృతమును దాని వికృతులును, విశేషించి ద్రవిడకన్నడభాషలును, బదపరికరముఁ గూర్చినవి. గీర్వాణ మలంకారమార్గంబులును ద్రవిడాదుల మఱికొన్ని లక్షణంబులును నొసంగినవి. ఇంతకును గవిత్వము గలుగమిచేఁ మన తెనుఁగువారు 'గాసటబీసటే చదివి గాథలు త్రవ్వ' చుండిరి. కవిత్వ మవతరించుటకు వలయుసాధనములు సమకూరుచుండె. అయిన నొకయోజకుఁడు గావలయు. అట్టియెడ నాంధ్రభాషాభాగ్యవిశేషంబున 'ఉభయభాషాకావ్యరచనాభిశోభితుం' డగు నన్నయభట్టారకుం డేర్పడి యట్టిసాధనసంపత్తిం గొని 'మత్యమరాధిపాచార్యుండు' గావున యాంధ్రకవిత నిర్మింపం బూని యొకపాలు తెనుఁగును రెండువంతులు సంస్కృతపదంబులును గోమలముగాను మనోహరముగాను గూర్చి యక్కవిత నవతరింపంజేసె. ఇతని గుంభనము లలితసుకుమారములు.

చ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభముఁ దాల్చి సుధాంశువికీర్యమాణక
ర్పూరపరాగపాండురుచిపూరములం బరిపూరితంబులై.

గాసటబీసటగా నుండిన తెనుఁగు ననుశాసించి యం దింత కోమలముగాఁ గవిత్వమును బుట్టించునంత మాత్రకే యిమ్మహాకవికాలంబు చెల్లె. ఇంతమాత్రమును సామాన్యముగాదు. ఇంతకును మన తెనుఁగు కవితకు వలయు నన్నిచిన్నెలువన్నెలు గుదిరినవిగావు. సంస్కృతపదముల యర్థంపుఁదీయనయే, సంస్కృతసమాసములమిసిమియే వానితోఁ గూర్పంబడిన తెనుఁగుపలుకులకుఁ జేకినవి. కాని ప్రత్యేకముగాఁ దెనుంగుపలుకుల ముద్దులుసుద్దులు తెలియరావయ్యె. అంతఁ గవిబ్రహ్మ నాఁ దగుతిక్కన పొడసూపి యచ్చతెనుఁగుపదములే మిక్కిలికూర్చి యుజ్జ్వలంబైన ప్రతిభావిలసనముచేతను నసదృశమైన కవితాప్రౌఢిమచేతను నపూర్వములు నతిమనోహరములు నగు పెక్కురచనావైచిత్ర్యములు పచరించి యాంధ్రభాషాలలన కగణ్యలావణ్యంబు నొడఁగూర్చి దానిని 'రామణీయకంబు రమియించు నిక్కఁ' గావించె. ఈమహాకవిచేత నీసము తనసొబగువగ లన్నియు తెలిపి యద్భుత మగుచమత్కారసాధనమయ్యె. వేయేల! ఇతనికిఁ బిమ్మటికవులకు నలంకారములందలిరతనముల కితనిరచనలు గనులు. కృతిపతిని దద్వ్యంశావతారమును వర్ణించుట, షష్ఠ్యంతములు, మున్నగునవి యీకవిసార్వభౌమునికడనుండి

వచ్చినసంప్రదాయములు. ఇట్లాంధ్రభాషామణిని భూరిశోభామనోహరత్వమున భువనమోహినింగా జేసె. పిదప తిక్కనార్యుండును వచ్చి యుభయభాషాపదముల సమంబుగాఁ జొనిపి మఱికొన్ని సొంపులుగూర్చె. నాచనసోముఁడు భాస్కరుఁడు పోతన మున్నగువారును సంస్కృతపదములనే విశేషముగాఁ జొనుపుచు ముద్దులు గులుకుమఱికొన్ని రచనలు గూర్చి భాషాసమష్టికి మాధుర్యపుష్టి మిక్కిలియుఁ గలిగించిరి. అయినను వీరందఱును కేవల మచ్చతెనుఁగునకు నంతగా మెచ్చులుగులుకుసొంపులు నించినవారుగారు. పిదప శ్రీనాథుండు వచ్చి యాంధ్రకవితను సంస్కృతపదభూయిష్ఠంబును దీర్ఘసాంస్కృతికసమాసబంధురంబును గావించె. ఈకవికి వెనుకఁ బింగళిసూరనార్యునివఱకును గలకవు లందఱికి నీ సంస్కృతరచనాబాహుళ్య మంటుతెవులువలె వ్యాపించినది. శ్రీనాథునికవనము మిక్కిలి రసవంతంబును బ్రౌఢంబు నగుటచే దాని ననుకరించినకవులకవనంబున కాతని సంస్కృతపదభూయిష్ఠత్వంబును బట్టువడియెఁగాఁబోలు![1] అట్టి కవులలో మన పెద్దనార్యుండు ముఖ్యుండు. ఇతం డొకనాలవయాశ్వాసము తప్పఁ దక్కినగ్రంథము నంతయు శ్రీనాథునివలె సంస్కృతపదప్రచురంబుగా రచించియున్నాఁడు. ఇక్కవికాలంబుననే యన్యదేశీయులతోడిసాంగత్యమువలనఁ గలుగుచు వచ్చినమాఱుపాటులన్నియు ముదిరి, క్రొత్త యగురుచి కుదిరియుండుటచే దాని కనుగుణముగాఁ గవిత్వమును బ్రాచీనపుఫక్కికి గొంతయెడ తెగి యపూర్వకల్పనావిశేషములకుం జొచ్చినదయ్యె. ఇదియే ప్రబంధకవనావతారమునకు మూలము. దీనినిగుఱించి కొన్ని విశేషములు వ్రాయుట యావశ్యకము.

కవనము తాను బుట్టినకాలమందలి రుచివిశేషమును మతస్వరూపమును బ్రతిఫలించు నద్దమువంటిది. అది యప్పటినాగరికత్వప్రబంధమునకు విషయసూచి యనఁదగు. అందుఁ బ్రాఁకిన సంప్రదాయము లారుచిమతాదిమూలములనుండి పుట్టి దానిం బెనఁచుకొని యున్నబలుతీఁగలు. మఱియు సులభముగా మాఱదుగాని రుచిమాత్ర మయ్యైకాలములఁ బూర్ణముగా మాఱుటగాని సంకరము నొందుటగాని కలదు. అందులకు నన్యదేశీయసాంగత్యము, నన్యరాజప్రభుత్వము, నూతనమతసంపర్కము మొదలగునవి కారణములుగాఁ జరిత్రలందు గానంబడుచున్నవి. నన్నయభట్టునకు ముందు బహుకాలమునుండి ద్రవిడుల కార్యులతో నైక్యము కలిమిచే వారివేషభాషలయందుఁ బ్రీతియు గౌరవమును వారివైదికానుష్ఠానవృత్తులును గుదిరియుండె. కాన వారి వ్యవహారములందెల్ల రుచియును ముదిరి యుండె. నన్నయకాలమున మహమ్మదీయసేనాసముద్రము హిమాలయపుఁగట్టలపయిఁ బొంగి యుత్తరహిందూదేశమునందు బొరలుచుండెను గాని వింధ్యపర్వతము దాఁటి ద్రవిడదేశమునకు రాలేదు. ఇట్లన్యదేశీయసాంగత్యము లేమిచేఁ బ్రాచీనాచారములగు పురాణశ్రవణపఠనాదులందు మనవారికిఁ గలరుచికి సంకరముగా మాఱుపాటుగాని కలిగినదికాదు. మఱియు నప్పటికి గీర్వాణకవనము సౌభాగ్యగరిమము నొందియుండె. ప్రౌఢకవనములు గలరామాయణాదిగ్రంథములును, రచనావైచిత్రిం జూపురఘువంశాదికావ్యములును, గనానైపుణ్యము నెఱపు శాకుంతలాదినాటకములును నాంధ్రులు మొదలగువారికిఁ బండినపెరటికీకము లైయుండినవి. అన్ని దెఱఁగులకవిత్వ ముండియు నన్నయభట్టు కల్పనానిబంధన మొకటియు గావింపఁడయ్యె. ఆంధ్రకవిత నప్పుడే క్రొత్తగాను సలక్షణముగాను నవతరింపం జేయుటచేతను, కృతిపతియగు రాజరాజనరేంద్రుఁడు 'మదీయమనంబు భారతకథాశ్రవణ ప్రవణంబ కావునన్, మహాభారతబద్ధనిరూపితార్థ మేర్పడఁ దెనుఁగునరచింపు'మని చెప్పుటచేతను, బవిత్రమైన భారతమునందుఁ దననూతనప్రయత్నముఁ జూపుటవలన నది సర్వసమాదరపాత్ర మగు నను తలంపుచేతను, భారతరచనకుఁ గడ యట్లుచేసి తనకవితను నూత్నకల్పనలకుఁ జొనుప సమర్థుండయ్యు సాహసింపఁడయ్యెఁ గాఁబోలు. కాఁబట్టి యతఁడు నవీనకల్పనలకుఁ జోరకుండుట యుచితము. అది యప్పటి తెనుఁగువారికో రాజున

పురాణశ్రవణాదులందుఁ గలరుచి కనుగుణముగా నుండియుండును. అయినను పిమ్మట వచ్చిన తిక్కనాదులును 'కావ్యేషు నాటకం రమ్యమ్' అను నభియుక్తోక్తిని కల్పనాంశమిళితము లగు శాకుంతలాదుల యుత్కర్షము గర్ణతాడితమయ్యు, నట్టిరచనలకుఁ బ్రౌఢులయ్యు, గతానుగతికముగా నన్నయభట్టమార్గముచేఁ బూర్వగ్రంథము దేనినో భాషాంతరము సేయుటతోఁ దృప్తినొందుచువచ్చిరి గాని ప్రబంధములను రచింపరైరి. మనవారికిఁ బూర్వములైనవానియందు గౌరవప్రతిపత్తియుఁ, గ్రొత్తవానియందు ననాదరదార్ఢ్యమును సహజములు. ఎఱ్ఱన హరివంశమును, సోమన యుత్తరహరివంశమును, భాస్కరుఁడు రామాయణమును, శ్రీనాథుఁడు నైషధకాశీఖండాదులను నాంధ్రీకరించిరి. కల్పనాగ్రంథములపస దెలిసియే యున్నది. అయినను దెనుఁగునం దాదికవులెవ్వరును వానిని రచింపమియే యనుకారైకపరాయణులగు పిమ్మటివారును వానిని రచింపకుండుటకుఁ గారణముగాని మఱి వానివలనియనాదరముగాదు. బహుకాలముగాఁ బురాణాదులఁ దెలిఁగించుచు వచ్చునీయాచారము రూఢమై దన్నుమార్పఁజాలినట్టి రుచిభేదము పుట్టకుండుటచే దానును మాఱినదిగాదయ్యె. పిమ్మటఁ గృష్ణదేవరాయలకాలమునకు మహమ్మదీయులు మొదలగు నన్యదేశీయులును మహమ్మదీయప్రభుత్వములును నిందుఁ బ్రబలి తదనుగుణముగాఁ బెక్కునూతనవిషయములు గలుగుటచే నవీనకల్పనలయందు రుచిపుట్టి యాయాచారమును గొంతఁ గదల్చినది. అయిన నీయాచారము బహుకాలముగా వచ్చుచుండుటచేతను, దెనుఁగునం దాదికవు లెవరును గల్పనాగ్రంథములకుఁ బూనకుండుటచేతను, శుద్ధకల్పనములు దోషప్రాయములుగాఁ దోఁచుటవలన నేమో యట్టివానిని విడిచి సామరస్యముతోఁ బూర్వాచారమునుబట్టి యాద్యసత్కథలను గొని, నూత్నరుచిప్రాబల్యమును బట్టి స్వకపోలకల్పితములను గొంతఁ జేర్చి, ప్రబంధరూపముగాఁ గవనము సేయుట యుపపన్నమయ్యె. కేవలకాల్పనికములగు మాలతీమాధవీయాదిరూపకములకీర్తి ఘంటాపథముగా నుండియుఁ దెనుఁగులోనిశుద్ధకల్పనములకు 'కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము' లని యిట్టి యపకర్షముకలుగుట యీపూర్వాచారమహిమయే కాని వేఱుకాదు. ఇట్లు రుచి, ప్రబంధకవనమునకుఁ బురికొలుపఁగా మొట్టమొదటఁ గలిగిన ప్రబంధము

## మను చరిత్రము.

ఈ ప్రబంధమునకు మనుచరిత్రము, స్వారోచిషమనుచరిత్రము, స్వారోచిషమనుసంభవ మని మూఁడుపేళ్లు గవియే వాఁడి యున్నాఁడు.

'మనుచరిత్రం బందుకొనువేళఁ బురమేఁగఁ, బల్లకి తనచేతఁ బట్టి యెత్తె

'కోరిక నీస్వారోచిష,' చారిత్రము వినిన వ్రాయ' ఆ-౬. పద్య-౧౧౯.

'స్వాయోనర్వం బూనినస్వారోచిషమనుసంభవం బనుమహాప్రబంధమునకు' ఆ-౧. పద్య-౪౧.

ఇం దయిదాశ్వాసములందును నాలవయాశ్వాసమునందు బహుభాగమువఱకును స్వారోచిషుని సంభవమునకుఁ గారణభూతమైన చరిత్రమే యున్నది గాని స్వారోచిషునిచరిత్రము లేదు. అతనిచరిత్రమంతయు నాలవయాశ్వాసముకడపట నిరువదియొకపద్యములలో నిమిడియున్నది. ఇది యొక చరిత్ర కానేరదు కాన 'మనుచరిత్ర' మనుటకన్న మనుసంభవకారణమైనచరిత్ర యగుటచే 'స్వారోచిషమనుసంభవ' మనుటయే యుచితము. ఇదియే పెద్దన యాశ్వాసాంతగద్యములను జెప్పియున్నాఁడు. కావున నిదియే మొదటినామ మగును. తక్కినవి వ్యవహారవశమున వచ్చియుండును. దీనికిఁ గృతిపతి

# కృష్ణదేవరాయలు.

ఈమహారాజు విజయనగరరాజులలో నెల్ల నగ్రగణ్యుఁడు. ఇతనిరాజధాని యగువిజయనగరము బళ్లారి మండలమునం దానెగొందికి సమీపమున నున్నది దక్షిణహిందూస్థానమును బాలించినరాజులలో నింతటి సార్వభౌముఁడును శూరాగ్రేసరుఁడును లేఁడనిచెప్పవచ్చు. ఇతనితండ్రి నరసరాయలు. ఈనరసరాజునకు నాగాంబిక యనుభోగకాంతయందుఁ గృష్ణరాయలు పుట్టెనని కొందఱు వ్రాసియున్నారు గాని యది నిజముగాదు. కృష్ణరాయనిసవతితమ్ముఁ డగునచ్యుతరాయనికి నంకితము సేయఁబడిన 'అచ్యుతరాయాభ్యుదయమ్' అను సంస్కృతకావ్యమున

'తిస్రోనృపస్యే త్యభవన్నభీష్టా, స్తిప్పాంబికా తాసుచ నాగమాంబా
పట్టాభిషిక్తాః పతిదేవతానా, ముత్తంసభూషామణి రోబమాంబా.'
'తిప్పాంబికాయాం ద్విజసంపదేఽభూ, ద్విఖ్యాతిమా న్వీరనృసింహరాయః
నాగాంబికాయాం నరసావనీన్ద్రోః, కీర్త్యైకరోఽజాయత కృష్ణరాయః'

అని తిప్పాంబ, నాగాంబ, ఓబమాంబ యనుముగ్గురు నరసరాజు పట్టపురాణులనియు, నందు నాగాంబికయందుఁ గృష్ణరాయలు పుట్టెననియుఁ జెప్పఁబడినది. కాఁబట్టి నాగాంబ కులకాంతయే కాని భోగకాంత గాదు. కృష్ణరాయలు ౧౪౬౮లో జన్మించెనని యొకరును, ౧౪౮౭ లో జన్మించెనని యొకరును వ్రాసిరి కాని జన్మసంవత్సర మిదియని చెప్పుటకుఁ దగిన యాధారములేదు కృష్ణరాయలు ౧౫౦౯వ సం॥ ఫిబ్రవరి నెల ౪వ తేదిని బట్టాభిషిక్తుఁడయ్యె. ఇతనికి సాళువ తిమ్మరు సనుమంత్రిశిఖామణి యుండెను. ఈతిమ్మరుసు నరసరాయవీరనరసింహరాయలకాలములనుండి మంత్రిత్వము వహించియున్నవాఁడు. ఈతని బుద్ధిబలమునను దనయప్రతిమపరాక్రమమునను రాయ లన్నిదిక్కులను దండయాత్రలుసలిపి యఖండరాజ్యవైభవము ననుభవించె. మొదట ౧౫౧౦వ సం॥ దక్షిణ దిగ్విజయమునకై వెడలి పూర్వకర్ణాటద్రవిడ మళయాళ దేశములన్నియుఁ దనవశముఁ గావించుకొనియె. ౧౫౧౩ లో పూర్వదిగ్విజయాత్రకుఁబోయి నెల్లూరుమండలములో నుదయగిరిని బదునెనిమిదినెలలవఱకు ముట్టడించి పట్టుకొనియె. పిదప గుంటూరుమండలములోని కొండవీటిపైనెత్తె. ఇది దక్షిణహిందూదేశములోని గొప్పపర్వతదుర్గములలో నొకటి. ఇది యుత్కలదేశపురాజైన ప్రతాపరుద్రగజపతికుమారుఁడు వీరభద్రగజపతిపాలనలో నుండెను. వీనికిఁదోడుగా శ్రీనాథరాజు, జన్యాములకసవాపాత్రుఁడు మొదలగు సరదారు లుండిరి రాయలు తన్నెదిరింప వచ్చినప్రతాపరుద్రగజపతి నెదుర్కొని జయించి పిదపఁ గొండవీటిని గైవసముచేసికొనియె. పిదప బెల్లముకొండ మొదలైన దుర్గముల సాధించి కొండపల్లిని గెలిచి ప్రతాపరుద్రగజపతిని దఱుముచు నుత్తరమునకుఁ బోయి కృష్ణాగోదావరీనదీముఖములకు మధ్య నుండువేఁగిదేశముపై దండెత్తి జమ్మిలోయ కోనసీమ కోరాము మొదలగుమన్యసీమలను రాజమహేంద్రవరమును జయించి విశాఖపట్టణమండలములోని పొట్టునూరికడ జయస్తంభము నాటి మాడుగులు మొదలగు మన్యసంస్థానములను వడ్డాదిని వశపఱుచుకొని సింహాద్రిచేరి స్వామిని సేవించి జయస్తంభములువేయించి కటకమునకుఁబోయి దానిఁ గాల్చి మరలి ౧౫౧౫లో విజయనగరము చేరెను. పిదప రాయలకును గజపతికిని సంధి జరుగఁగా రాయలు గజపతికూఁతును బెండ్లాడెను. ఈవిజయములే మనుచరిత్రములో

సీ. తొలుదొల్త నుదయాద్రి • శిలఁ దాఁకి తీండ్రించు, నసిలోహమున • వెచ్చ • నై జనించె
మఱికొండవీడెక్కి • మార్కొని నలిదైన, యలకసవాపాత్రు • నంటిరాఁ జె

నటసాఁగి జెమ్మిగోఁ ♦ యఁబడి వేఁగి దహించెఁ, గోన బిట్టేర్చెఁ గొ ♦ ట్టానఁ బగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ ♦ గరఁచె గౌతమిఁ గ్రాఁచె, నవుల నాపొట్నూర ♦ రిపులుకొనిరెు
మాడెమ్ములు గ్రేల్చె నొడ్డాది ♦ మసిరొునర్చెఁ, గటకపురిఁ గాల్చె గజరాజు ♦ గలఁగి పఱవ
దోఁకచిచ్చన నౌర యు ♦ ద్ధురతఁ గృష్ణ, రాయబాహుప్రతాప జా ♦ గ్రన్మహాగ్ని. ఆ-౧ పద్య-౩౭

ఉత్సాహ. * * దుర్భరానకార్భటీ
ఘూర్ణమాన కొండపల్లి ♦ కొండవీటిమండలా.

మ. ధరకెంధూళులు కృష్ణరాయలచమూ ♦ ధాటీగతిన్ వింధ్యగ
హ్వరముల్ దూఱఁగఁ జూచి తా రచటఁ గాఁ ♦ పై యుండుటం జాల న
చ్చెరువై రొెట్టనివింతచీఁకటులు వ ♦ చ్చెం జూడరే యంచు వే
సారిదిం జూతురు వీరరుద్రగజరా ♦ ట్పుద్ధాంతముగ్ధాంగనల్. ఆ-౧. పద్య-౩౮

క. నిమిషార్ధగృహీత కళింగరాజ ♦ తనయాగ్రణికిన్.

వ. అభిరతిఁ గృష్ణరాయఁడు జ ♦ యాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్టునూరికడ ♦ నిల్పినకంబము సింహభూధర
ప్రభుతిరునాళ్లకుం దిగుసు ♦ రప్రకరంబు కళింగమేదినీ
విభునపకీర్తికజ్జలము ♦ వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్.

శా. ° మాద్యత్కళింగాంగనా
బందీగ్రాహ విగాహితోత్తరకకు ♦ బ్ధాటీసమాటీకనా.

శా. * * * కటకా ♦ ధ్యక్షానుగక్షోణి భృ
త్కాయగ్రావభిదావిధాభిదురదోః ♦ ఖడ్గాగ్ర.

అని తెలియనగును.

కడమ యైదుసంవత్సరములు విద్వత్ప్రసంగములందును భావియుద్ధపరికరసంకలనమందును బుచ్చి ౧౫౨౦ సం॥ రాయలు రాచూరుదండయాత్ర వెడలెను. రాచూరు మున్ను విజయనగరరాజులది దీనికై మున్నె రాజులకును దురుష్కులకును బెక్కుయుద్ధములుజరిగియుఁ గడపట నది తురుష్కులపాలయ్యెను. అది ప్రకృతకాలమున బీజపూర్ ఆదిల్‌షాహావశమున నుండెను. రాయలు పదిలక్షలసైన్యముతో వెడలి ఘోరముగాఁ బోరి యాదిల్‌షాహను బాఱఁదోలి రాచూరిదుర్గమును బట్టుకొనియెను. ఈదాడిలోనే రాయలు కలబరిగిదుర్గమును ధ్వంసముచేసి లోఁబఱచుకొనియెను. అందు ఆదిల్‌షాహా చెఱపెట్టిన బహమనీ రాజపుత్రుల ముగ్గురిని జెఱ విడిపించి యందుఁ బెద్దవానికి రాజ్యముగట్టెను. ఇదియె

ప్రశయఘనాఘనఘోషజయానక ♦ భాంకృతిభీమచపేటలుఠత్
కలుబరగీకటకక్షితిరక్షక ♦ కన్నడరాజ్యరమారమణా.

శా. యవనక్షోణీధవస్థాపనా.

అని మనుచరిత్రమునఁ గానంబడియెడి. ఈదండయాత్రలయందుఁ గృష్ణరాయలసైన్యమునఁ బెక్కునూఱుల యేనుంగులును బహుసహస్రసంఖ్యల గుఱ్ఱములును భయంకరముగా నెలసియుండె నని పోర్చుగీసుచరిత్రకారులు వ్రాసియున్నారు. దాని కనుగుణముగా

'పుంఖానుపుంఖసైంధవ, రింఖాసంఘాతజాత ♦ రేణూగ్రతమో
రింఖద్రిపున్నృప'

ఘీంకారసా

సాఘూళీపోద్భటఘాటీకాగజఘటా ♦ శక్త్యక్షుణ్ణవిశ్వంభరా

మాలిని. సరభసజయధాటీ ♦ చండవేదండకోటీ

కరపమధుహిమానీ ♦ కంపితాశావధూటీ.

అని పెద్దనవర్ణించినాఁడు ఇతఁడు విద్వాంసుఁడును విద్వద్గోష్ఠిలోలుఁడును గవియు నగు. కావున

క కవితాస్త్రీలోలునకున్. క. విద్యాఖేలనభోజ సుధీలేఖద్రుమ. మ. భోజక్షమాపతి విదా

పరిపాక. క. కల్పకద్రుమాధికదాన, శ్రీకుతుకాగతలోకా, లోకాంతరసకలసుకవి♦లోకస్తుత్యా.

రాయలు మిక్కిలిపొట్టియును బొడుగునుగాక కొలఁది యగునెత్తుగలవాఁడై మంచిముఖవ

ర్చస్సును సుందరాకృతియుఁ గలిగియుండె నని చరిత్రకారులు వర్ణించియున్నారు పెద్దనయు

'శ్రీనందనసౌందర్య' 'కాంతాలతాంతశర' 'పంకజదృగంగీకార ధీరాకృతీ'

అని వర్ణించినాఁడు. రాయలు గరిడీసాదన చక్కఁగాఁ జేసినవాఁడు. ప్రతిదినమును వ్యాయామము

సేయుచుండును కావుననే 'వ్యాయామస్థిరసంధిబంధ' యని యున్నది. ఇతఁడు వైష్ణవుఁడు. మఱియ

విష్ణుభక్తాగ్రేసరుఁడు. అందును దిరుపతి వేంకటేశ్వరస్వామియెడ విశేషభక్తిగలవాఁడు. కాఁబ

భావభరిత శ్రీకాంత' 'కరుణాకర వేంకటవిభు, చరణస్మరణ ప్రసంగసంగతమతి' 'శ్రీవేంకటే

పదపద్మావేశితసదయహృదయ' అని పెద్దనయుఁ జెప్పినాఁడు

ఇట్లుఖండజయములనొంది యపారరాజ్యవైభవమును బాలించి కవుల నాదరించియుఁ దా

గవియయ్యు నాంధ్రభాషామణి నత్యంతభూషితం జేసి యీవిద్వచ్చక్రవర్తి ౧౫౩౦ ■ సంవత్సరములో

గీర్తిశేషుఁడయ్యె. మనుచరిత్రకృతికర్త

## అల్లసాని – పెద్దన్న.

ఇతఁడు నందవరీకుఁడు; చొక్కనామాత్యునిపుత్రుఁడు. కృష్ణదేవరాయల యాస్థానకవీశ్వరులఁ

నెల్ల నగ్రగణ్యుఁడు. తెనుఁగునందుఁ బ్రబంధరచనమునకు మార్గదర్శకుఁడు. ఇతఁడు మొట్టమొదట స్మా

ర్తుఁడైయుండినను బిదప వైష్ణవమును బుచ్చుకొని శఠకోపయతికి శిష్యుఁడయ్యె. రాయలు తనకిచ్చిన కో

కటగ్రామమును వైష్ణవుల కగ్రహారముసేసి దానికి శఠకోపపురమని పేరుపెట్టె. ఇతండు మనుచరిత్రము

కాక హరికథాసారమను గ్రంథమునుగూడ రచించెనని లక్షణగ్రంథములవలనఁ దెలియవచ్చుచున్న

కాని యది యిప్పుడు నామావశిష్టము. మార్కండేయపురాణమందలి స్వారోచిషమనుసంభవకథ

గొని స్వకపోలకల్పనలను గూర్చి తొలుదొలుత మనుచరిత్రమును ప్రబంధరూపమున రచించుటచే నా

ంధ్రకవితాపితామహుఁ డనుబిరుద మితనికిఁ గలిగినది. రాయ లొకనాఁడు కవిగండపెండేరమును బ

డిపళ్లెరమున నుంచుకొని సంస్కృతాంధ్రములందు సమానముగాఁ గవనము సేయువాఁడు దీని ధరిం

పర్హుఁ డనఁగాఁ బెద్దనార్యుఁడు వీఁది యుత్పలికమాలికను జదివెనఁట.

ఉ. పూఁత మెఱుంగులుం బసరు ♦ పూపబెడంగులుఁ జూఁపునట్టిచా

కైతలు జగ్గునిగ్గు నెన ♦ గావలెఁ గమ్మనఁ గమ్మనక్కవలెన్

రాతిరియుం బవల్ మఱపు ♦ రానిహొయల్ చెలివోరజంపుని

ద్దాతరితీపులంబలెను ♦ దారసిలన్ వలె లోఁ దలంచినన్

బాఁతిగాఁ బైకొనఁ వలెను • బైదలిపత్తుకలోనిపల్లటీ
కూఁత లనన్యలేక సొగసు • కోయిఁక్కులు రావలె నాలకింపఁగన్
డాతొడ సున్న మిన్నులమి •టారపుముద్దులగుమ్మకమ్మ నా
వాతెఅదొండపండువలె • వాచవిగావలెఁ బంట నూఁదినన్
గాతలఁ దమ్మిచూలిదొర•కైవసపుంజవరాలిసిబ్బెపు
న్మేతెలియబ్బురంపుజిగి • నిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బపొం
బూఁతల సున్న కాయసరి•పోఁడిమి కిన్నెర మెట్లబంతిసం
గాతపు నన్నతంతిబయ•కారపుఁగన్నడ గౌళపంతుకా
సాతతతాన తానలప•సం దివుటాడెడు గోటమీటుబల్
మోఁతలునుంబలేక హరువు • మొల్లము గావలె నచ్చతెన్గు లీ
రీతిగ సంస్కృతంబు పచ•రించినపట్టున భారతీవధూ
టీతపనీయగర్భనిక•టీభవదాననపర్వసాహితీ
భౌతిక నాటకప్రకర • భారతభారతసమ్మతప్రభా
శీతనగాత్మజాగిరిశ•శేఖరశీతమయూఖరేఖికా
పాతసుధాప్రపూరబహు•భంగఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతకతాళయుగ్మలయ•సంగతిచుంచువిపంచికామృదం
గాతతతేహితత్తహిత•హాధితధింధణు ధాణుధింధిమి
వ్రాతనయానుకూలపద•వారకుహూద్వహ హారికింకిణీ
నూతనఘల్లఘల్లాచరణ • నూపురఝంఝళఝుళీమరందసం
ఘాతవియద్ధునీచకచ•కద్వికచోత్పలసారసంగ్రహా
యాతకుమారగంధవహ • హారిసుగంధవిలాసయుక్తమై
చేతము చల్లఁజేయవలె • జిల్లునఁ జల్లవలెన్ మనోహర
ద్యోతకగోస్తనీఫలము•ధుద్రవగోఘృతపాయసప్రసా
రాతిరసప్రసారరుచి•రప్రతిమంబుగ సారెసారెకున్.

దీనికి రాజుమెచ్చి కవిపాదమునఁ దానే గండపెండేరమును దొడిగెనఁట. ఇది పెద్దన్న రచించె ననఁబడునీచాటుపద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. ఎదురైనచోఁ దన•మదకరీంద్రము నిల్పి, కేలూఁత యొసఁగి యె•క్కించుకొనియె
మనుచరిత్రం బందు•కొనువేళఁ బురమేఁగఁ, బల్లకి తనకేలఁ • బట్టియెత్తె
బిరుదైనకవిగండ•పెండేరమున కీవె, తగు దని నాదుపా•దమునఁ దొడిగెఁ
గోకటిగ్రామాద్య•నేకాగ్రహారము, లడిగినసీమల•యందు నిచ్చె
నాంధ్రకవితాపితామహ•యల్లసాని, పెద్దనకవీంద్ర యని నన్నుఁ • బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి • కేఁగలేక, వసుధ బ్రతికితి జీవచ్ఛ•వంబ నగుచు

ఈపద్యమువలనఁ గృష్ణరాయలకుఁ గవియందుఁ గలగౌరవాదరములు దెలియుటయేకాక రాయలయనంతర మీతఁడు బ్రతికియున్నట్లును గానవచ్చుచున్నది.

జిలిబిలిమోవి నంటినజుంటీఁగయుఁ, జందురునికరములు సోఁకినకలువయు, సూర్యునికిరణములు తాఁకిన విరిదమ్మియుఁ, గవిత్వంపుమాయచే నింత లైనకాముకీకాముకులై యపూర్వశోభ గాంచి శృంగారరస ముప్పొంగఁ జేయుచుండును

సీ. కటికిచీఁకటితిండి ◆ కరములగిలిగింత, నెవ్వాఁడు దొగకన్నె ◆ నవ్వఁ జేయు

వేవెలుంగులదొరజోడు ◆ రేవెలుంగు. మనుచరిత్రము.

సీ. తేఁటికాటుకరేక ◆ నీటు మీఱఁగఁ దీర్చి, మిసిమిగాఁ బుప్పొడి ◆ పసుపుఁ బూసి

పద్మినీ, కాంతపతికన్న మున్న మేల్కాంచియుండె.

తారాశశాంకము.

ఇవి యెల్ల యథార్థమా? కాదు కవితాదేవత పన్నినయింద్రజాలము.

కవిత్వము తనశిల్పకౌశల్యము లన్నియుఁ బచరింపక కేవల మొకస్వభావమును మిక్కిలి తేటగాను సూటిగాను నిరూపించునెడ నీటుమాత్రముచేతను మెత్తందపుముద్దుచేతను, దద్దయు సాధారణములైన వానిని సయితము చెలువములు గావించి చవు లొలికించుచుండును. ఆతేటయందే తీయందనము మిటారించుచుండును. ఆమెత్తందనమే యొకయందము.

ఉ. కడుఁ బసిబిడ్డ వీఁడొకటి ◆ గా దపునా నెఱుఁగండు ముందఱ

య్యెడ నొకపాటెఱుంగఁ డెద ◆ యెంతయుఁ గోమల మెప్పుడైన నేఁ

గుడువఁగఁ బిల్తుఁగాని తన ◆ కుం గలయాఁకటిప్రొద్దెఱుంగఁడీ

కొడుకిటు పోకకుఁ మనము ◆ గుందెడు నీ వని యాడిపల్కెనున్.

తే. ఎప్పు డెయ్యెడ నేమిట ◆ నెట్టు లరయ, వలసె నమ్మెయి నారయు ◆ మలసి డస్సి

నొచ్చి యయినను నేమఱ ◆ కిచ్చ దలఁచి, తడమి నాచేత దీవన ◆ వడయు మమ్మ.

భారతి. విరాట. ౨. ఆశ్వా.

సీ. పాలుపారఁగా బోర ◆ గిలి పాన్పు నాల్గుమూ, లలసను పచ్చుచు ◆ మెల్లఁగి మెలఁగి

లలిఁ గపోలంబులు ◆ గిలిగిలింతలు పుచ్చి, నవ్వింపఁ గలకల ◆ నవ్వి నవ్వి

ముద్దులు దొలుకాడ ◆ ప్రోఁకాలఁ గేలను, దడవుచు నెందును ◆ దాఁటి దాఁటి

నిలుచుండఁబెట్టి యం ◆ గుళియూఁత నూపఁగాఁ, ప్రీతిఁ దప్పడుగులు ◆ వెట్టి పెట్టి

యన్నఁ గంటెఁ దండ్రిని గంటి ◆ నయ్యఁ గంటి, నిందు రావయ్య విందులు ◆ విందు లనుచు

నర్థిఁ దనుఁ బిలువఁగ నడ ◆ యాడి యాడి, యుల్లసిల్లెఁ గృష్ణుఁడు శైశ ◆ వోత్సవముల.

హరివంశము. పూర్వభాగము. ४. ఆశ్వా.

ఇందలిపస కవిత్వంపుమిసిమియే కాని మఱేమియుఁ గాదు అది ప్రతిపాద్యవస్తువునకుఁ బెట్టిన చికిలినును మెఱుంగు, అది దానికిఁ బూసినబంగరుమొలాము.

కవిత్వమున కిట్టియపూర్వరంజకశక్తి యెట్లుగలిగె? కవుల కనన్యసామాన్య మగుభావనాశక్తివిశేష మొకటిగలదు. దానిమహిమచే వారియందతివిలక్షణమై యపూర్వచిత్రమైన యొకమానసప్రపంచము విలసిల్లుచుండు. అందలివస్తువు లపూర్వమనోహరములును నత్యాశ్చర్యములు నగు సౌందర్యవీర్యాది గుణంబుల రాణించుచుండు. అందలిమృత్తికయెల్ల బంగరుమయము. రాలన్నియు రత్నములు. దీపములు జీవమణులు. గంధపురొంపి కలయంపి. ఆణిపాణిముత్తియపుమ్రుగ్గులు అచటికరులు 'మండి గాత్రశ్రీ నంతనుండాగ్రహించి జలధ్వరాంభమున్న జల్లులాడు' అందలి వీరులపరాక్రమోద్ధతికి

'ధరణీచక్రము దిర్దిరందిరుగు' 'అర్ణవముల్ ఘూర్ణిలు' 'గిరివర్గంబెల్ల నూటాడు.'.

కవిప్రతిభాకల్పితమైన యిట్టిభావనాత్మక ప్రపంచము లోకోత్తరచమత్కారకారియగుటఁ గావ్యసృష్టి యని మనయాలంకారికు లందురు. వస్తువేదిగాని కవిహృదయపీఠిం జొచ్చెనేని యది యందలి ప్రపంచములోని యనన్యాదృశశోభావిలసనములందు మునిఁగి యపూర్వమనోజ్ఞముగాఁ బ్రకాశించుచుండును. చెలువలమోవి యందలి తేనియలును, వారిపలుకులందలి పచ్చకపురమును నాప్రపంచములోని యంగడిసరకులు. వారి తళతళలును, నిగనిగలును, జకచకలును గవిహృదయఫలకమం దాయపూర్వశక్తి దిద్ది పూసినవింతవన్నియల మెఱుఁగులు! ఇట్టిచెలువలే

ఉ. 'జంగమవల్లులో యమృత♦సాగరవీచులొ రత్నమూర్తులో
యంగజుమోహనాస్త్రములొ♦ యంచితహేమశలాకలో మహీ
రంగనటత్తటిల్లతలొ♦ రాజకళాసఖులో' యనం బరఁగుదురు — భాస్కరరామాయణము.

ఇట్లు రసోద్దీపనములనఁ దనంతఁ దొరిఁగి ప్రతిభావికాసమువలన బయింబయి మురువుగాఁ జెరిఁగి భావనాశక్తివై లక్ష్యంబున వింత లగుచిన్నెలు వన్నెలు చూపుచు నిర్గమించినకవిత్వధార సరళమై స్వభావమధురమై చిత్రమై మకరందఝరివలె జాలుగొనుచుండును. అది తనంతఁ దొరిఁగినదగుటచే శ్రమంపడి చెఱిచి విఱిచి తెచ్చుకొన్నశబ్దములును, జప్పిడిసందుగొందులును జూపట్టవు. పయింబయిఁ బొంగి పొరలి వచ్చినదగుటచే నెందును గుంటు గానిపింపదు. వింతవింతగాఁ బొలయుచుండుటచే నొక్కటే పాడినపాటగా విసువుఁ బుట్టింపదు. కావున వట్టిపదాడంబరములును వ్యర్థపూరణములును గనఁబడవు. అర్థము క్రిక్కిఱిసి రసపారవశ్యమునఁ బయింబయి మురువుగా నురవడించుచుండఁగా నాయర్థంపుఁ బెనుభారమును వహించునంతియపరిమితిగల యల్పశకటములవలె శబ్దములు పరిచరించుచుండుంగాని యనవసరములైనవి యెల్ల వచ్చి మునుకొననేరవు.

ఉ. పెట్టనికోట నీకు హరి♦భీముఁడు నర్జునుఁడున్ రణంబునం
దొట్టినమంట లాకొలఁది♦యోధులె సాత్యకియున్ విరాటుఁడుం
జుట్టపుమేరు వుగ్రరణ♦శోభితుఁ డీద్రుపదుండు నిన్ను ని
ట్టట్టన వచ్చునే సురల♦కైనను నొల్లవుగాక చివ్వకున్. — భార.విరాట.

సీ. తొలుదొల్త నుదయాద్రి♦శిలఁ దాఁకి తీండ్రించు, నసిలోహమున వెచ్చ♦నయి జనించె
మఱికొండవీ డెక్కి♦ మారెక్కెని నలియైన, యలకసవాపాత్రు♦నంటి రాఁజె
నట సాఁగి జమ్మిలో♦యఁ బడి వేఁగి దహించెఁ, గోన బిట్టేర్చెఁ గొ♦ట్టానఁ దగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ♦ గరఁచె గౌతమిఁ గ్రాఁచె, నవుల నాపొట్నూర♦ రవులుకొనియె
మాడెములు ప్రేల్చె నొడ్డాది♦ మసి యొనర్చెఁ, గటకపురిఁ గాల్చె గజరాజు♦ గలఁగి పఱవఁ
దోఁకచిచ్చన నార యు♦ద్ధురతఁ గృష్ణరాయబాహుప్రతాపజా♦గ్రన్మహాగ్ని. — మనుచరిత్రము.

ఇప్పద్యంబుల నొక్కవ్యర్థపద మేనియుఁ గానిపింపదు. అర్థసంపదయుఁ గ్రిక్కిఱిసి మిక్కిలియు సొంపులు నింపుచున్నది. అర్థబాహుళ్యము గలయల్పపదపరికరమే ప్రౌఢిమకు శరీరము. అర్థవ్యక్తి కతిమాత్రమైనపదచ్ఛటాపటలము కవితారమణికి రోగంపుబలుపువంటిదే కాని సౌందర్యపుష్టి గానేరదు. కొన్నిపదముల యొకసొగసైన పొందికచేతనే యర్థములు కుప్పలుగొనఁ జేయుటయు, రెండొకపదముల సొబగైన యొకకులుకుచేతనే రసములు చిప్పిలఁ జేయుటయుఁ బ్రతిభాశిల్పములు.

తే. మిసిమిపరసీమ వలరాజు♦మేనమామ, వేవెలుంగులు దొరజోడు♦ రేవెలుంగు. — మనుచరిత్రము.

ఉ. ఒక్కొకతఱిం బువుబోండ్లు దుటారికత్తియల్. — కళాపూర్ణోదయము.

ఉ. క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్ — మనుచరిత్రము.

క. మీ సేగు లెల్ల నచ్చెద, వేసరకుఁడు మీరు లేక • వేగున్నె మాపం
జేసెం జేయఁడు బాలకుఁ, డాసురపుంబనులు నిజము • లని యెంచి [illegible]

[illegible]

ఇందుఁ బదపరికరము స్వల్పము. అర్థము నిబిడము. మహాకవులు దీర్ఘ[illegible] [illegible] ముసు లేక కొన్ని పదముల చేతనే రసము మిక్కిలియుఁ గూర్తురు.

క. నరుఁ డలుక వొడమియును సుస్థిరుఁడై తన యెత్తు సెరిల • గెలువుఁ [illegible]
మరలం దెగడెడు కన్నుల, నరుణచ్ఛవి సెఱయ నిట్టు • లనియె నరేంద్రా

క. నాయున్న బాము దలఁపవ, యీ యెడ లీచీర యిట్టి • యే వఁ[illegible]
బో యన్న మదనవికృతిం, జేయు ననుట యెంతయును ని • ష్పిద్ధము [illegible].

క. వసివాళ్లు వాడి యప్పుడు, వసంతసమయంపు టెండ • వలన [illegible]
గసుగందులు గందినవవ, కుసుమలతికవోలె మిగులఁ • గోమలి యొప్పెన్ [illegible]

వాచ్యాద్యర్థములలో వ్యంగ్యము మిక్కిలి హృదయంగమము. వ్యంగ్యప్రధాన[illegible] యుత్తమ కావ్యముగదా. కాన వ్యంగ్యమె కవితాచమత్కృతికిఁ బరికరము. కవితా[illegible] అర్థగాంభీర్యమే కావ్యశోభాకరము. అర్థగాంభీర్యముతో మృదుమధురపదగుంభనమును గూడినచో [illegible] దగును. ఇట్టిపదసందర్భముతే 'శిరీషకుసుమపేశలసుధామయోక్తులు' మృదుమధురపద[illegible]మును రసోద్దీపకము.

క. సాటి చదలేటినీటికి, హాటకగర్భునివధూటి • కమరద్రుపనీ
వాటికి మధుకైటభరిపు, వీటికి శ్రీపోలమంత్రి • విశదయశంబుల్ — భీమఖండము.

క. వాలికలై వెలిదమ్ముల, పోలికలై చందమామ • పులుఁగులకును దా
మేలికలై ననిరీక్షణ, మాలికల నృసింహుఁ జూచె • మదపతి వేడ్కన్. — నరసింహపురాణము.

క. జటివరుఁ డిటువలెఁ గనలుచుఁ, జిటజిటనిప్పుకలు సెదర • జిగికనుఁగొనలం
దటతట కటకటు లదరఁగ, గిటగిటమన రదనపటలి • గీఁటుచుఁ బలికెన్. — [illegible]చరిత్ర.

క. నాళీకమఘూర్ణత్తమ, రాళీముఖరాళిసుఖక • రం బగుకొలనం
గేళీలాలసగతి డిగి, యాళీనివహంబు లోల • లాడెడు వేళన్. — [illegible]చరిత్ర.

సామాన్యమైన యొకపదమే దానిని వాడిన విన్యాసముచేతఁ బదసందర్భమునందు నర్థసంపదకును మిక్కిలియు సొంపు గూర్చుచుండును. ఆపదమును విడదీసి మఱియే పర్యాయము నుంచినను నాసారస్యము గుదురదు. అట్టియెడ నాపదంబును నర్థంబును నవినాభావమున రెండునొక్కటియై యర్థసౌభాగ్యగరిమకుఁ గారణమగును.

ఉ. భీవలమూఁకపులావు మును • నేల వహించిన నాగకూర్మగో
త్రావనిభృద్దిశాకరుల • కారయ నూరటపట్టు గాదె సం
భావన భూజనంబులకుఁ • బండువు గాదె మహోగ్రకోపరే
ఖావిభవంబు వైరులకుఁ • గాలము చేరువగాదె పావనీ. — భారత. విరాట.

'అచటఁ బుట్టినచిగురుఁ గొ • మ్మైనఁ జేవ'
'పొంటువై చితే మిన్నులు • పడ్డచోట'
'పద్మసంభవవైకుంఠ • భర్గసభల, సాముసేడీలు మాకు' — మనుచరిత్రము.
'ఎక్కడనుండి వచ్చెఁ దర • శేక్షణకుక్షినుసిగ్గుదొంతరల్' — విజయవిలాసము

'నోసలిపై ముంగురుల్ ♦ మసలి ముద్దులు నూప' విజయవిలాసము.

'తామరసనేత్రలిండ్ల ఝం♦దాలు' మనుచరిత్రము.

నాగరికత హెచ్చుకొలఁదిని రుచిసౌష్ఠవమును, రచనావైచిత్ర్యమును, గల్పనాప్రౌఢిమయుఁ బరిపక్వము లగుచుఁ గవితాంగనకుఁ గ్రొత్తసొంపులు నింపుచుండును. రుచి సంస్కారవశమునఁ బరిపక్వమై కవిత్వపాకము నతిభోగ్యముఁగావించును. రచనావైచిత్రివలన శబ్దములును,విశేషించియర్థములును, జమత్కారకరములగు విచిత్ర ప్రకారముల రచనము సేయఁబడుచుండు. ఇట్టి రచనాప్రకారములు గావ్యలక్ష్మిని నలంకరించునవిగాన యలంకారములండ్రు. అవి శాబ్దంబులగు ననుప్రాసాదులు నార్థంబులగు నుపమాదులు నగు. ఇట్లు

సీ. పొసఁగ ముత్తైపుసరుల్ ♦ పోహళించిన లీలఁ, దమలోన దొరయుశ♦బ్దములఁ గూర్చి
యర్థంబు వాచ్యల♦క్ష్యవ్యంగ్యభేదంబు, లెఱిఁగి నిర్దోషత ♦ నెసఁగఁజేసి
రసభావములకు స♦ర్వాంబుగ వైదర్భి, మొదలైనరీతు లి♦మ్ముగ నమర్చి
రీతుల కుచితంబు♦లై తనరారెడు, ప్రాణంబు లింపుగాఁ ♦ బాదు కొల్పి
యమర నుపమాదులును యమ♦కాదులు నగు
నట్టియర్థశబ్దాలంక్రి♦యలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చున♦త్కవివరునకు
వాంచితార్థంబు లొసఁగని♦వారుఁ గలరె.

అని పూర్వోక్తలక్షణలక్షితంబై రసంబు నుద్దీపింపఁజేయుచు రామణీయకవైభవవిలాసభాసమానంబై యొప్పుకవనంబునకు మించినసిద్ధియు నానందంబును గలుగదు.

ఈసుకవిత్వలక్షణములం గొని యీప్రబంధపుఁగవనమును బరిశీలింపఁ దగు. 'శిరీషకుసుమపేశల సుధామయోక్తు' లను నీమృదుమధురగుంభితము తనచొప్పుననే యిందలిరచన యుండు నని మనుమట్టఁ జాటుచున్నది. మెచ్చులు గులుకు నీపదసందర్భ ముత్తరప్రబంధమాధుర్యగరిమకు మచ్చు. ఇది యెన్నిమాఱులు చదివినను దిరిసెంపుఁబూవులే తెచ్చి గ్రుచ్చినట్లు మృదువై సుధ లొలుకుచునే యుండును గాని విసువుఁ బుట్టింపదు. 'నవరసార్థ, గుంభగంభీరతరవచోజృంభణముల' ననురచన శబ్దాలంకారకలితమై యున్నను బ్రకృతపదగుంభిత మంత మధురముగాదు, అంత మనోహరమును గానేరదు.పిదపఁ గృతిపతితద్వంశావతారవర్ణనము కవిసేయుచున్నాఁడు. ఇది తిక్కన మొట్టమొదటఁ జూపినమార్గమై రాజాశ్రయము గలశ్రీనాథాదికవులకు సంప్రదాయముగా వచ్చుచుండె. ప్రాయికముగాఁ గవులు దీనిని మొదట సీసముచేతఁ బ్రారంభించి దానిగీతమంతయు నించుమించుగ శ్లోకదీర్ఘసమాసముగాఁ బదార్భటితో వీరరసోత్కటముగా రచియింతురు. ఇట్టి గీతమును,

'అతఁడు భూరిప్రతాప మ♦హాప్రదీప, దూరవిఘటితగర్వాంధ♦కారవైరి
వీరకోటీరమణిఘృణి♦వేష్టితాంఘ్రి, తలఁడు శేవలమర్త్యుఁడే ♦ ధర్మసుతుఁడు. భార.విరాట.

అని తిక్కనయే రచించిచూపినాఁడు. దీనివలెనే,

'అతిశితకృపాణ కృత్తమ♦త్తారివీర, మండలేశసకుండల♦మకుటనూత్న
మస్తమాల్యపరంపరామండనార్చి, తేశ్వరుం డగు నారసిం♦హేశ్వరుండు. మనుచరిత్రము.

అని పెద్దనయు రచించినాఁడు. పిదపఁ బురాదివర్ణనము గవి చేసినాఁడు. ఇందలి పురము భావనాశక్తినైపుణ్యముచేఁ గట్టఁబడిన యపూర్వశిల్పములు గలది. కోట మిన్నుముట్టుచుండును. మేడలతెలిగచ్చు మెఱుఁగు చంద్రమండలము నచ్చదెలుపుగాఁ జేయుచుండును.

ఇంకఁ దక్కినవి చెప్ప నేల? అది యొప్పిదములకుప్ప. కావుననే 'సుహృ[illegible]పటి
చతుర్వర్ణఘులను వారాంగనాజనముల గొని యింద్రోత్సాహ కలికిన రెం[illegible]తె గిలు
గునట్టు లతిచతురముగా వర్ణించి పయిపెచ్చులకుఁ బోరక [illegible]టఁ
బుట్టిన చిగురుఁగొమ్మైనఁ జేవ' అని యొక్క పలుకులోఁ బ్రాహ్మణ[illegible]ట్టి
పురంబునఁ బ్రకృతగ్రంథకథావతారమునకు మూలమగు ప్రవరు[illegible]నాఁడు
ప్రవరుఁ డను బ్రాహ్మణుఁడు వరూథిని "యక్షతనయేందు జయంత [illegible]
గెలువఁజాలెడువాఁ' డని మెచ్చుకొనునట్టి 'మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి,' [illegible]
సుఁడు.' ఆలలనపలలకుం జిక్కని 'వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీక్షా[illegible]', [illegible]ప్రవన
తత్పరుండు. ఇచట నుత్తరకథావిస్తృతికి బీజములగు ప్రవరునిగాంభీర్య[illegible]
గా నుంచినాఁడు. కావుననే,

ఆ. వానిచక్కఁదనము • వైరాగ్యమునఁ జేసి, కాంతు సేయుజార•కామినుఁ[illegible]
భోగబాహ్య మయ్యెఁ • బూచినసంపెంగ, పోలుపు మధుకరాంగ•[illegible].

అని వరూథినీయత్నవైయర్థ్యమునకు మొదటిహేతువగు ప్రవరువైరాగ్య[illegible].
ఈపద్యమునఁడ యొకతీరైనహుటాహుటి గలిగి హాయలుగులుకుచున్న[illegible] 'సాగి [illegible]చి
చేసినకూరిమిసోమిదమ్మ'. ఇందలిజాతీయము మిక్కిలి యుచితార్థము సొంపుని[illegible]
వహాయై' యనుటచే నితని వైరాగ్యము విషయభోగవైముఖ్యము [illegible]
వసిత మగునిష్ఠాతిశయమే యగు. 'కూరిమిసోమిదమ్మ' యనుటచేఁ బత్నీవి[illegible]
ద్రులు దేవియుం దేవరవోలె' ననుటచే మాతాపితృభక్త్యతిశయమును, 'సచ్ఛాత్రు[illegible]' డనుటచే [illegible]వా
త్సల్యమును నిందుబీజరూపమున నుంపఁబడినవి. ఇవియ పయింబయిఁ గ[illegible]ముగా వెలివి
రియింపఁబడు. ఆయాస్వభావవిశేషంబులును, దత్తద్గుణవైచిత్ర్యంబులును, [illegible]లకి
ములందు యథావస్థితముగాఁ బ్రతిఫలించుచుండు నిది వారకు[illegible]మహత్త్వము. [illegible]
చుకొన్న పాత్రమున కత్యంతనైజములగు గుణవిశేషము లభినయించి, [illegible]ములతో మొసల
నాపాత్రమును జిత్రించి పిదప వాని నందందు వెలివిరియించుచు నాపాత్రము [illegible] రచించుట
మహాకవికల్పనాశిల్పము. వారు తమపాత్రములఁ దామై యభినయించి తదీయ[illegible] దామే
యనుభవించుచు రచించుటచేఁ బాత్రములం దేప్రకృతి కాప్రవృత్తియు, [illegible] కావ్యాపాదిము
ను, నేభావమున కారసమును దమంతఁ దుదివఱకుఁ బొసఁగి యొసలారుచుండునుగా [illegible]సంగతి
చూపట్టదు. ఇట్టివిశేషమే యియ్యెడను దెలియుచున్నది. ఇట్లు పాత్రస్వరూపమును [illegible] పిదప
సిద్ధుం డతిథియై రాకకు మూలమగు నతిథిసంతర్పణమునకు సాధనములుగాఁ, [illegible]దిపంటల పంపు
ను దత్పత్నియన్నదానగుణమును మృదుశైలిని రచించి సిద్ధాగమమున కుపపత్తిఁ గుదుర్చి[illegible]నాఁడు.
పిదప హిమాచలమునకుఁ బోకకుఁ జిరకాలముగాఁ బెరుఁగుచున్నకారణసంపత్తిని,

సీ. తీర్థసంవాసు లే•తెంచినా రని విన్న, నెదురుగా నేఁగు ద•వ్వేంతిదైన
నేఁగి తత్పదములఁ•కెరఁగియింటికిఁ దెచ్చుఁ, దెచ్చి సద్భక్తి నా•తిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్నసం•తృప్తులఁగాఁ జేయుఁ, జేసి కూర్చున్నచోఁ•జేరవచ్చు
వచ్చి యిద్ధరఁ గల్గు • వనధిపర్వతసరి, త్తీర్థమాహాత్మ్యముల్ • దెలియనడుగు
నడిగి యోజనపరిమాణ • మరయు నరసి, పోవలయుఁ జూడ ననుచు నా•ర్పుల నిగుడ్చు
ననుదినము తీర్థసందర్శ•నాభిలాష, మాత్మ నుప్పొంగ నత్తరు•ణాగ్నిహోత్రి.

అని వర్ణించినాఁడు. ఇందులకు మార్కండేయపురాణమున

'అతిథిజనార్చనాభిరతుఁ ♦ డై చరియించుచు శైలకాననా
చితసకలావనీతలవి♦శేషము లెల్లను బ్రీతిఁ గన్గొనన్
మతిఁ గడుఁ గోరుచుండ.'

ననుమక్కడియే మూలము. ఇది యింతరసోజ్జ్వలముగా రచింపఁబడినది. ఇందుఁ గ్రియాపదముల యావృత్తి పద్యగమనికకు నొకహొయలుగూర్చుచు రస మొలికించుచున్నది ఇదియెపదములయొకసొబగైనకులుకు. సిద్ధుండు రాఁగా నతనికి నలయుపరిచర్యలు నడపి తన్మహిమలుపొగడి పిదపఁ దీర్థయాత్రాప్రశ్నమున కవతారికగా,

'హానినాథకుటుంబ జం♦బాలపటల, మగ్నమాదృశగృహమేధి ♦ మండలంబు
నుద్ధరింపంగ నౌషధ ♦ మొండుగలదె, యుష్మదంఘ్రిరజోలేశ ♦ మొకఁడు దక్క'.

అని యడిగినాఁడు. ఇందలి వినయానుసంధానమును, భక్త్యతిశయమును, భాషాచమత్కృతియు, మిక్కిలి హృదయాకర్షకములు సిద్ధుఁడును 'మాయింటితైర్థికావళి కెల్లన్, మీయింటి గృహస్థుల సుఖజీవనముఁగాదె తీర్థసేవయు' నని తీర్థసేవాప్రస్తావమునకుఁ దెలిపిచూపి 'మాదృశగృహమేధి' అని ప్రవరుండు నికృష్టముగాఁ జెప్పిన గార్హస్థ్యమును నిరతిశయమైనదని నానారూపణ వైచిత్ర్యమున నతిరమణీయముగా

సీ. 'కొలఁకుల నున్నతం♦గేటిజున్ను గృహమేధి, యజమానుఁ డంకస్థి♦తార్థపేటి
పండిన పెరటికం♦ల్పకము వాస్తవ్యుండు, దొడ్డిఁ బెట్టినవేల్పు♦గిడ్డి కాపు
కడలేని యమృతంపు♦నడబావి సంసారి, సవిధమేరునగంబు ♦ భవనభర్త
మరుదేశపథమధ్య♦మప్రప కులపతి, యాఁకటి కొదవుస♦స్యము కుటుంబి
బధిరపంగ్వంధభిక్షుక♦బ్రహ్మచారి, జటిపరివ్రాజకాతిథి♦క్షపణకావ
ధూతకాపాలికాద్యసా♦ధులకుఁ గాన, భూసురోత్తమ గార్హస్థ్య♦మునకు సరియె.
అని వర్ణించినాఁడు. ఈతంగేటిజున్ను

ఆ. పరమ మగుప
దంబు తంగేటిజున్ను చం♦దంబు నొందు.

శాంతి- ౫. ఆ.

అని తిక్కనచెప్పి యిచ్చినది. ఇందలి 'అంకస్థితార్థపేటి' 'పండిన పెరటికల్పకము' మొదలైనవి పండితులు మిక్కిలి వాడుకొను నుడువులు. పిదప 'తైర్థికావళి' 'తీర్థసేవ' యను సిద్ధునిమాట లూఁతగాఁ బ్రవరుఁడు తీర్థయాత్రాప్రసంగమును దెచ్చి 'పోయి సేవింప లేకున్నఁ బుణ్యతీర్థ, మహిమ వినుటయు నఖిలకల్మషహరంబ, కాన వేఁడెద' నని యనునయోక్తిచాతుర్యధుర్యముగాఁ బ్రార్థించుటయు సిద్ధుండు నన్నిదేశంబుల నద్భుతంబుల 'నీశ్వరానుగ్రహంబున నల్పకాలంబునఁ గనుఁగొంటి' ననియె. ప్రవరుం డదికల్లగాఁ దలఁచి దానిచే వెలికిఁ గొంతపిక్కటిల్లిన వెడనవ్వును జెక్కులలోఁ గాఁచినవాఁ(డీషదంకురితహాసగ్రసిష్ణుగండయుగళుం)డయ్యె. ఈసమాసంపు నర్థసారస్యమునకు 'గ్రసిష్ణు' శబ్దము జీవము. అవిశ్వాసముతో నడుగుట దోషము. వింతపాటో యడుగకుండ నీయదు. అవిశ్వాసంపుఁగటుత్వమునకు భక్తిరసము నుత్కటంపుఁదీపిని జేర్చుటకై తద్రసవ్యంజకముగా 'వెఱపక' యని చెప్పినాఁడు.

..ఱవక మీకొనర్తు నొక • విన్నప మిట్టివి యెల్లఁ జూచి రా
నెఱకలు గట్టుకొన్న మఱి • యేండ్లును బూండ్లును బట్టుఁ బ్రాయపుం
జిఱుతతనంబు మీ మొగము • చెప్పక చెప్పెడు నద్దిరయ్య మా
కెఱుఁగఁ దరంబె మీ మహిమ • లీర యెఱుంగుదు రేమి సెప్పుదున్.

భక్తిచే వెఱపు పుట్టినది, అయినను 'వెఱవక' యడిగెదనని యాకూతము. 'వెఱవక' యొనర్చినది ప్రశ్నము గాదు, 'విన్నపము' ఈపద మవిశ్వాససంగతిచే నయిన భక్తిరసంపుఁ గసటును 'ఓషధీశ గరళ సోదర్యాత్తకరసుధాకళుకత్వము నుడుపు తేనె' పోలె నుడుపుచున్నది. అవిశ్వాసముచేఁ జేయు ప్రశ్నము గాదు, జిజ్ఞాసచేఁ జేయు విజ్ఞాపనమని భావము. ఈ విన్నపమును గౌణముగాను భావగర్భముగాను 'ఇట్టివి యెల్లఁ జూచి రా నెఱకలు గట్టుకొన్న మఱి యేండ్లును బూండ్లును బట్టు' ననియు 'ప్రాయపుం జిఱుతతనంబు మీ మొగము చెప్పక చెప్పెడు' ననియు రెండు వాక్యములఁ బచరించి యా రెంటికి నిగమమును జెప్పక యూహనీయముగాఁ దెల్చినాఁడు. ఇప్పలుకుపొందిక యందును నవినయగంధము నాశంకించి యది వాయుటకై యవి యెల్లఁ దన్మహిమలుగాఁ జెప్పి యబ్బురపడినాఁడు సిద్ధుండును దాను మున్ను సెప్పిన 'యీశ్వర సత్కృప' చేఁ గలుగు పాదలేపనము మహిమను జెప్పఁగాఁ బ్రవరుండు విని

'మీ దివ్యప్రభావం బెఱుం
గని నాప్రల్లదముల్ సహించి మునిలో • కగ్రామణీ సత్కృపన్
నను మీ శిష్యునిఁ దీర్థయాత్రవలనన్ • ధన్యాత్ముఁగాఁ జేయరే'

అని వినయోద్వేలంబగు శైలిని వేఁడి దానిం బూయించుకొని 'తుహినభూధరశృంగ, శ్యామలకోమల కానన, హేమాద్యదరీఝరీనిరీక్షాపేక్షం' బోయె. కవి, బిందువులుగాఁ బడుచున్న యమృతము నొక్కస్మడిగాఁ గుమ్మరించినట్టు లీనిడుద సమాసంపు దాటిని గడపట దీటుకొలిపినాఁడు. ఈ సిద్ధప్రవరసంవాదమున, భక్తికరుణారసోల్లసితము లగు రచన లతిప్రౌఢములును స్వభావోక్తిలలితములు నగు. ప్రవరుని వినయోచితపరిభాషావైదుష్యమును, గరుణారసోద్దీపకమగు సూక్తినైపుణ్యమును, నగణ్యములు. ఇవియ వాని 'భాషాపరశేషభోగి'త్వమును బట్టి యిచ్చుచున్నవి. సిద్ధునిగార్హస్థ్యవర్ణనమును హృదయంగమము

ఆ ప్రవరుఁడు పోయి యందలి వేడుకలం జూచుటయు స్థలమహిమలం బొగడుటయు నతిచిత్రముగాను నాశ్చర్యరసపరిప్లుతముగాను వర్ణింపఁబడినవి. అందు మృదుమధురములైన దీర్ఘసమాసములును, ముద్దుమురిపములు గులుకు నచ్చతెనుంగుపదములును మంచిస్వభావోక్తులును నెఱసి బెరసియున్నవి. ఇందు 'నడ్డంబు నిడుపుటాబడ్డలగతి మన్నుఁబిల్లు డొంకలనుండి క్రేళ్లుదాఁటు' టఁ జదువునపు డవి ముందట దాఁటుచున్నట్లే యుండును. 'పరిపరివిధంపు జన్నంపుఁ బరికరంపు సొంపు నంపద' యని వినినంతనే యా పరికరము లెదుట సమకట్టినట్లే తోఁచును. 'నళినీబాంధవభానుతప్త రవికాంతస్యందినీహారకందళ చూత్కారపరంపర' లను నప్పుడే యా చూత్కారములు వినఁబడుచుండును. 'నిఖిలనిలింపసభయు నప్పటప్పటికిని జిహ్వాగ్రత్రుప్పడుల్ల నా మెత లెఱింగె' ననుమాట కేవలయజ్వనోటనుండియే వచ్చునది.

ఇట్లు కుతూహలముతోఁ బోవఁగా మంచుదగిలి పాదలేపము కరఁగిపోయె. దానిచేఁ బ్రవరునికిఁ గలిగిన శోకరసమును గవి మిక్కిలి స్వభావానుగుణముగా వర్ణించి ప్రవరునియం దారోపించిన గుణబీజముల నిచట వెలివిరియించుచున్నాఁడు.

సీ. నను నిముసంబు గా♦నక యున్న నూరెల్ల, నరయు, మజ్జనకుఁ డెం♦తడలునొక్కొ
యెపుడు సంధ్యలయందు ♦ నిలువోనీక న,న్నోమెడుతల్లి యెం♦తొరలునొక్కొ
యనుకూలవతి సాధు♦మనసులో వర్తించు, కులకాంత మది నెంతఁ ♦ గుందునొక్కొ
గెడతోడునీడలై ♦ క్రీడించు సచ్ఛాత్రు, లింతకు నెంతఁ జిం♦తింతురొక్కొ
యతిథిసంతర్పణంబు లే♦మయ్యెనొక్కొ, యగ్ను లేమయ్యెనొక్కొ ని♦త్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబ♦కినుక నిట్లు, పాఱవైచితె మిన్నులు ♦ పడ్డచోట.

ముం దాశ్రోత్రియు నెయ్యెగుణములతో నెయ్యెకృత్యములతోఁ గవి చిత్రించెనో యవియే యిందును వెలయింపఁబడినవి. 'దేవియుం దేవరవోలెనుండు' తలిదండ్రులవలని గురుత్వమును 'గూరిమి'సోమిదమ్మవలనివలపును, 'దోడునీడలై' వర్తించు శిష్యులవలనివాత్సల్యమును, బ్రవరుని నింటికిఁ దెచ్చిన 'యతిథిసంతర్పణవ్రతమును', 'దరుణాగ్నిహోత్రి' వేలుచునగ్నులనే యిచటం జూపట్టునవి. రసపారవశ్యము మర్మములను దాఁపదు. ఆశ్రోత్రియునిహృదయమునుండి యింతకంటె శోకరస మేమి వెలిపుచ్చఁగలదు. 'దైవంబకినుక నిట్లు, పాఱవైచితె మిన్నులు పడ్డచోట' ననునది శోకరసప్రవాహము. ఇట్లు 'చింతాసాగరమున మునిఁగి భయంబుగదురఁ' బోవుచుండఁగా

సీ. 'కులిశధారాహతి♦పొలుపునఁ బైనుండి, యడుగు మోవఁగ జేగు ♦ రైనతటులఁ
గనుపట్టులోయ గం♦గానిర్ఝరము వాఱఁ, జలువ యా నయ్యేటి♦ కెలఁకులందు
నిసుకవెట్టిన నేల ♦ నేచి యఱ్ఱాఁకులఁ, జొరనీక దట్టమై ♦ యిరులుగవియు
క్రముకపున్నాగనా♦రంభరంభానారి, కేరాదివిటపికాం♦తారవీథిఁ
గెరలుపికశారికాకీర♦కేకిభృంగ, సారసధ్వని దనలోని♦చంద్రకాంత
దరులు ప్రతిశబ్దమీన గం♦ధర్వయక్ష, గానఘూర్ణిత మగునొక్క♦కోనఁ గనియె

ఒకకోన గనుపట్టె. ఇది కవికల్పితము. కల్పనాపటిమయు భావనాసౌభాగ్యమును జేరి నిర్మించి దీనికి నిసర్గసిద్ధములైన యపూర్వమనోజ్ఞత్వముల నెల్లఁ గూర్చినవి. కవి యీకోనయం దొకలోయ(చీలిక)ను గల్పించి యందు గంగానిర్ఝరమును బ్రవహింపఁజేసినాఁడు. ఆలోయ చూడ్కికి వేడ్కగా నుండుటకై దాని రెండుప్రక్కలును బయినుండి యడుగువఱకు నెఱుపుగావించినాఁడు. ఇట్టిప్రదేశము, వృక్షవాటి యొకటిలేనిచో సొంపు నింపదు అవి గోముగాఁ బెరుఁగుటకు గంగనీటిచలువయున్నది దట్టముగా మొలచుటకు నిసుకనేల గావలయును. కాన యాయేటియొడ్డుల 'నిసుకవెట్టిన నేల'యు నందుఁ బోఁకలు పొన్నలు మొదలగు మ్రాఁకులతోఁపులను గలిగినవి ఇంకఁ దక్కినసొంపులు కఱవా? శుకశారికాదులు కెరలి కలధ్వనులు సేయుచున్నవి వానిప్రతిశబ్దములు చంద్రకాంతపుగుహలనుండి శ్రావ్యముగా వీతెంచుచున్నవి. ఇంతియకాదు. గంధర్వయక్షగానమును గర్ణపర్వముగా వినఁబడుచున్నది. ఇట్టిది యెట్టివారికిని రామణీయకంపుసొంపులు నింపదే! దీనిం జూచియే వసుచరిత్రమునందును,

'శైలెల్ల నమృతమ♦రీచినంటున నంటఁ, గరఁగి నిర్మలపయో♦ఝరుల దొరఁగి
బలువిడి పెనులోయఁ♦బడిన క్రొన్నెలరాల, చరులలో నిరుగడఁ ♦ దఱచు మెఱచు
పటికంపుఁబణకుల♦పజ్జ గొజ్జఁగనీటి, యేటిశ్రేవలఁ జలి♦యిసుక వెట్టు
నేడాకుటనఁటుల ♦ నెలమావిగుమురుల, సురపొన్న కూటాలఁ ♦ జుట్టుకొనిన
బండిగురివెందతీఁగె చ♦ప్పరము లెనసి, మడిగొనిన ద్రాక్షపందిళ్ల♦నడుమఁ గిన్నె
నినాదానుకారిఝా♦రీశుకాది, ఘోషఘుమఘుమితం బైన♦కోనఁ గనియె.

అని యొకకోన మనోహరముగా రచించినాఁడు. ఇందు శిల్పాడంబర మెక్కుడయ్యుఁ బెద్దగాకో నవలె నంత స్వభావరమణీయముగాదు. అట్టికోనఁ జూచి యందు గంధర్వయక్షగానము వినియు భాం దనమున కనుగుణముగా నది యొక 'మునియాశ్రమ' మనియే తలఁచి పోవఁ జూచె. దిగుటకు సూఁత యొట్లు. ఇచటఁ గల్పనకు మఱియుఁ బని గుదిరినది.

చ. నికటమహీధరాగ్రతట•నిర్గతనిర్ఝరధారఁ బాసి లో
యకుఁ దలక్రిందుగా మలక•లై దిగుకాలువవెంటఁ బూచుమ
ల్లిక లవలంబనంబుగ న•లిప్రకరధ్వని చిమ్మిరేఁగ లో
నికి మణిపట్టభంగసర•ణిం ధరణీసురుఁ డేఁగి చెంగటన్.

దాపున కొండకొమ్మునుండి యొక సెలయేఱు పాఱుచున్నది. దానినుండి యొక కాలువ చీలి లోయలోనికిఁ దలక్రిందుగా నిటునటువంపులు దిరిగి ప్రవహించుచున్నది. ఆకాలువవెంబడిని మల్లెతీఁగలు మొలచి పూచియున్నవి. దానిం బట్టుకొని కోనలోనికి దిగినాఁడు. అందలి 'మణిపట్టభంగసరణి' యది మునియాశ్రమము గా దనుటకు సూచకము. ఆ మెట్లవరుసను గోనలోనికి దిగి యందొక చెంగలువమడియోరగా మావిళ్లు క్రోవిచెట్లు దట్టముగాఁ బెనఁచుకొని నీడలుగ్రమ్ముచున్న యొకవనముఁ గాంచె. అచటఁ జంద్రకాంతపురాళ్లపందిరియందు నల్లుకొని పండ్లగుత్తులు వ్రేలుచున్న ద్రాక్షతీఁగలును బూదీఁగలును నావరించియున్న యొకమందిరముగలదు. వసుచరిత్రలోని 'ముడిగొన్న ద్రాక్షపందిళ్లును జెంగలువయొరికలును నిందుండి కొనిపోయి నాటినయంట్లవలనఁ బెరిఁగినవే. ఆమందిరము గరుడపచ్చలు దాపినది. దానినిజూచి యచ్చెరుపడుచుఁ జేరఁబోవఁగా

క 'మృగమదసౌరభవిభవ, ద్విగుణితఘనసారసాంద్ర•వీటీగంధ
స్థగితేతరపరిమళమై, మగువపొలుపుఁదెలుపు నొక్క•మారుత మొలసెన్.

ఆమారుత మెలయుటయే కాదు. తదీయ 'పరంపరాపరిమళవ్యాపారలీల'యుఁ గలిగినది. అట్టి మారుత మట్లు పొలసియు నాశ్రోత్రియుఁ డప్పటిభయాతిశయముననో శాంతరసంపుగ్రుడ్డితనముననో స్త్రీలున్నారని స్ఫుటముగాఁ గనుఁగొనక యెవరో జనులున్నారని యెన్ని 'జనాన్విత' మన్నాఁడు. ఇదియె వాని కప్పటికిఁ దగినది. మహాకవివర్ణనములం జూపట్టుస్వభావానుగుణ్య మిదియ. ఇట్లు చేరఁబోయి

మ. మృల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురం • జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొకమరు•న్నారీశిరోరత్నమున్.

గాంచినాఁడు. ఇదియ ప్రథమనాయికాపాత్రము. దీనిం జూచియే రామరాజభూషణుఁడు,

చ. తరువులపొంతఁ బొంచి వసు•ధావరమిత్రుఁడు గాంచె నచ్చటం
దరుణిఁ దమోవినీలకచఁ • దామరసోదరసోదరప్రభం
దరళవిలోచనం దతని•తంబఁ దటిన్నిభగాత్రవల్లరిం
దరుణశశాంకఫాల నొక • దన్విఁ దరంగవళిం దలోదరిన్.

అని తనకథానాయికను వర్ణించినాఁడు. ఆతరుణియు దేవకాంత. అందును వేశ్య. అది దనయింటితియ్యమామి డిగున్న క్రిందియరుఁగునఁ గూర్చుండి

సీ. తతనితంబాభోగ•ధవళాంశుకములోని, యంగదట్టపుఁ గావి•రంగువలన
శశికాంతమణిపీఠి • జాజువాఱఁగఁ గాయ, లుత్తుంగకుచపాళి • నత్తమిల్లఁ

సరుణాంగుళీఘాతతంత్రీస్వనంబుతోఁ, జిలిబిలిపాటముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁగనుదోయి, రతిపారవశ్యవిభ్రమముఁ దెలుపఁ
బ్రౌఢిం బలికించుగీతప్రబంధములకుఁ, గ్రమకరపంకరుహారత్నకటకఝణఝ
ణధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప, నింపుదళుకొత్త వీణ వాయించుచుండె.

ఇట్టివీణియనే వసుచరిత్రకారుఁడు గిరికచేతఁ బెట్టినాఁడు. ఇందు వేశ్యాసముచిత మగువేష వైఖరిని గవి రచించినాఁడు. వస్త్రము కావిపావడ. దానికావిరంగు పయి నలమి యున్నపయఁటగుండ శశికాంతమణిపీఠిని జాజువాఱఁ జేసినదనుటచే నాపయంట జిలుఁగుదని సెల్లా గానలయు. పయఁట యలముకొనియుండుటను జెప్పుటతోఁ బిఱుఁదుల వైశాల్యమును, కాయ లత్తమిల్లుటను జెప్పుటతోఁ గుచములయౌన్నత్యమును సరసముగాఁ గూర్చినాఁడు. అనఁగాఁ బిఱుఁదులవిశాలత్వము'తత' శబ్దముచే స్ఫురించుకంటె ధవళాంశుక మలమికొనుటచే మఱింత మనోహరముగాను, గుచములయున్నతత్వ 'సుతుంగ'శబ్దముచే స్ఫురించుకంటెఁ గాయ లత్త మిల్లుటచే మఱింత మోహాకరముగాను స్ఫురించుచున్నవి. అవయవములకు విశేషణములు గూర్చపస యాయాప్రసక్తివిశేషములచే మఱింతపుష్టినొంది సౌందర్యసమష్టిని మిక్కిలియు హెచ్చించుచున్నది. ఇదియ మహాకవులవర్ణనాచమత్కృతిమర్మము. ఇట్లుగాక కచమున కొకటి కుచమునకొకటిగా శిప మెత్తినట్లు పద్యముల ల్లి రస మొలికించుట యీావలికవనసంప్రదాయమైయున్నది. అవయవములన్నిటిని నొక్కొక్కటిగా వేఱు వేఱ వర్ణించుటచే సౌందర్య మంతగా స్ఫురింపదు. అప్పటికి వన్నెగూర్చ నయ్యె యవయవములవర్ణించి యాకారమును జిత్రించుటచేఁ దదీయసౌందర్యమంతయు నొక్కమ్మడిని స్ఫురించును. పిదపఁ బ్రసక్తివశమున నాయాయవయవముల వర్ణనలచే నాసౌందర్య మతిశయించుచు వచ్చును. ఈరీతియ యిప్పద్యమునను జూపట్టుచున్నది. తతనితంబములును సుతుంగకుచములును జెప్పి, కావియంగదట్టముపై ధవళాంశుకమును జుట్టి, జిలిబిలిపాటముద్దులును గనుదోయియరమోడ్పును గ్రమకరపంకరుహారత్నకటకఝణఝణధ్వనిస్ఫూర్తినిని బచరించి, యావేశ్యయాకృతి కపూర్వసౌందర్యస్ఫూర్తిని గూర్చినాఁడు. మీఁదఁ గన్నులు మొదలగువాని నయ్యైప్రసక్తుల వర్ణించుచు దాని నద్భుతమోహనముఁ గావించినాఁడు. పిదప

ఉ. అబ్బురపాటుతోడ నడుమ్మానాంబుజముల్ వికసింపఁ గాంతి పె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులు గుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁజన్గవ గగుర్పొడువన్ మదిలోనఁ గోరికల్
గుబ్బటిలంగఁ జూచె నలకూబరసన్నిభు నద్ధరామరున్.

ఇది వరూథినీప్రథమదర్శనము నాయిక యబ్బురపాటుచే కనుఁదమ్ములు మిక్కిలివిచ్చిచూచె. అట్లు చూచునపుడు కనీనికలకాంతులు వెల్లిగొని నల్లగలువలచాలువలె నిగుడె. సుందరాకృతిని జూచుటవలనఁ గామము పొటకరించుటచే గుబ్బచనుఁగవ గగురుపొడిచె. ఇఁక మరుఁ డూరకుండునా? కోరికలు పయిఁబయి గుబ్బటిల్లె. ధరామరునిపయి నింత వలపేల? వాఁడు నలకూబరసన్నిభుఁడుగదా. పిదప

ఉ. చూచి ఝళంఝళత్కటకనూచితవేగపదారవింద యై
లేచి కుచంబులుం దుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడం
బూచినయొక్క పోఁక నునుబోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలం దదీయపదవీకలశాంబుధి వెల్లి గొల్పుచున్.

నూత్నపురుషదర్శనమున స్త్రీ సామాన్యమునకు స్వాభావిక మగులజ్జ విడువదు. వేశ్యయయ్యు నెంట్టమొదటనె లజ్జవీడుట రసహీనము. లజ్జాత్యాగమునకు వలయూరససారవశ్య మింకను బరిపక్వము

కాలేదు. కాన చూచినంతనే లేచి పూచినపోఁకబోఁదియమాటును జేరె. ఇచ్చట విచ్చలవిడిగాఁ దేఁటిచూడవచ్చును. కాన 'విలోకనప్రభావీచికలం దదీయపదవీకలశాంబుధిని వెల్లిగొలిపినది'. 'చెలువగువానిఁ గన్గొనినఁ దెల్వకుఁ జూపుల కావె కూటముల్' అనువచన మపార్థకమా! ఈ పూర్వపద్యములు రెంటను గన్నులును, జూడ్కులును, గుచములు, నడుమును బెడఁగుగాఁ బ్రసక్తివశమున రూపింపఁబడి యాకారమును నిరతిశయమనోహరముం గావించినది. మఱియు

మ. మునుమున్ పుట్టెడుకొంకు లౌల్యము నిడన్ • మోదంబు విస్తీర్ణతం
జొనుపం గోర్కులు గ్రేళ్లు ద్రిప్ప మది మెచ్చుల్ ఱెప్ప లల్లార్ప న
త్యనుషంగస్థితి తిచ్చపా టొసఁగ నొయ్యారంబునం జంద్రికల్
దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్.

ఇందుఁ బ్రవరుని దొలుత దర్శించినది మొదలుగా నాయికకనుదమ్ము లయ్యైకారణములచే దశావిశేషములు పొందుచుఁ బరిపూర్ణవికాసమును జెందుచు వచ్చుట నత్యంతసైజముగాను రసభాజనముగాను బదమాధురితోఁ గవి రచించినాఁడు. ఇట్లు గన్నులు నెఱయవిచ్చుచు నాతనిపూర్ణసౌందర్యమును మఱిమఱి చూడఁగా మదనాగ్ని వ్యాపించి మున్ను 'గుబ్బమెఱుంగుఁజన్గవ' యందుమాత్రము గలిగినపులకలిపుడు మైనెల్ల నంకురితములయ్యె. వీనిని 'ఆవిష్కృతమీనాంకానలసూచకధూమాంకురము' లనుట నెంతయుఁ బొసఁగును. ఆవిప్రకుమారు సౌందర్యామృత మెంత గ్రోలియుఁ దనివినొందక కన్నుంగవ 'తొంగలిఱెప్పలం దొలఁగఁ ద్రోయుచుఁ బైపయివిస్తరిల్లుచుండె'. దానిం జూడఁగా నది 'యాక్రమించుకొనునో ముఖచంద్రునటంచుఁ' దోఁచె. అనఁగా మొగమెల్లఁ గన్నులేయగునేమో యని శంక పుట్టె. ఎవరి కీశంక? కవిసృష్టిలోనిశృంగారరసాధిదేవత యగునంగజునికే యీశంక. తనవిజయధ్వజ మగుముఖచంద్రుని చేటునకుఁ దానోర్చునా? కనుక వాఁడు లేఁజెమటచేఁ గరఁగినకస్తురిబొట్టునుగొని లలాటమునుండి చెక్కులవఱకు గుఱివ్రాసి యాగుఱిని కన్నులుదాఁటకుండున ట్లానవెట్టినాఁ డఁట. కన్నులు మీఁదుమిక్కిలి విచ్చుచు వానినిజూడంజూడఁగా మన్మథతాపాగ్ని మిక్కిలి యతిశయించుటవలన లలాటమున లేఁజెమటగ్రమ్మి కస్తురిబొట్టును గరఁగింపఁగా నదిగీఱగాఁ జెక్కులవఱకు స్రవించెనని భావము. ఇది యొకఁడు మఱొకని నాక్రమించుటలు, ఇంకొకఁ డానపెట్టుటలు, గుఱి వ్రాయుటలు నని యొకవింతకతయయ్యె. ఆ! కావ్యసృష్టివైచిత్ర్యము. ఇట్లాకాంత వాని 'రూపరేఖావిలాసంబులకుం జొక్కి' నేయువర్ణనము గర్ణామృతము. అందు

'నేరెటేటియసల్ దెచ్చి • నీరజాప్తు, సానఁబట్టినరాపొడి • చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో • పద్మభవుఁడు, వీనిఁ గాకున్నఁ గలదె యీ • మేనికాంతి.'

అని మేనికాంతికి నిష్పత్తి నుత్ప్రేక్షించినాఁడు. ఇది భావనాశక్తిపన్నిన యపూర్వశిల్పము. ఈమేలు బంతిని జూచియె రామరాజభూషణుఁడు

తే. మేటిజమ్మేటి యసలఁ గ్రొ • మ్మించుమించుఁ
బోదివి మదనప్రతాపాగ్నిఁ • బుటము వెట్టి
తమ్మిగద్దియదాకట • గ్రమ్మి యట్టి
కొమ్మఁ గావింపఁ బోలు నె • త్తమ్మిచూలి.

అని తననాయికను దిద్దినాఁడు. ఇట్లు

మ. 'అని చింతించుచు మీనకేతనధనుర్జ్యాముక్తనారాచదు
ర్దినసమ్మూర్ఛితమానసాంబుజుఁ డై • దీపించుపెందత్తఱం

మునఁ జేపెట్టినలజ్జ నంత్రిక్లికటకం•బులఁ ద్రోయ నడ్డంబు ని
ల్చిన నయ్యచ్చరఁ జూచి 'చేరఁ జని' ప•ల్కెన్ వాఁడు విభ్రాంతుఁడై.

ఇందు 'మీనకేతన...దుర్దిన సమ్మూర్ఛిత మానసాంబురుహ' యనుచో 'దుర్దిన'శబ్ద మర్థనిబిడము. మనస్సు మూర్ఛనొందఁగాఁ జెంద త్తఱము గలిగె. తత్తఱము మీఱఁగా లజ్జపేటెత్తె; అనఁగాఁ బేటులవలె పీడియు పీడకయుండె. మున్ను లజ్జ పాటమరించినపుడు పోఁకమాటునకుఁ బోయినది. ఇపుడులజ్జపే టెత్తఁగా, అనఁగాఁ గొంతపీడుటచే, నడ్డంబునిల్చినది. ఇంక నది పూర్ణముగా పీడలేదు. అంతటిరసపార వశ్యము ముంచుకొన్న యెడల నిపుడే 'ప్రాంచద్భూషణ బాహుమూలరుచితో' పయిఁబడదా. కాలియందియలు గల్లుగల్లుమని మొరయ నది యడ్డంబు నిలువఁగాఁ బ్రవరుఁడును 'జేరఁ జని'యె. శృంగారరస ముప్పొంగియా? కాదు. విభ్రాంతుఁడై. దానిసౌందర్యాతిశయమునకా యీవిభ్రాంతి? కాదుకాదు. కాదని మీఁదిపద్యమే ఘోషించుచున్నది.

ఉ. ఎవ్వతె వీవు భీతహరి•ణేక్షణ యొంటిఁ జరించె దోట లే
కివ్వనభూమి భూసురుఁడ • నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిం
గ్రొవ్వున నిన్నగాగ్రమున•కుం జనుదెంచి పురంబుఁజేర నిం
కెవ్విధిఁ గాంతుఁ జెల్పఁగద•వే తెరువెద్ది శుభంబు నీ కగున్.

ఎవరు? ఎక్కడ? అని రెండొకప్రశ్నలు. పుట్టువిది, పేరది, తప్పివచ్చితి నని చరిత్రపుముక్కలు రెండు. పురమునకుఁ దెరువెద్ది యని దీనప్రార్థనమొకటి. 'శుభంబునీకగున్'అనియాశీర్వాదము. ఇదియ వారిద్దఱి ప్రథమసంభాషణము. తప్పివచ్చిన శ్రోత్రియునికి శృంగారనాయికతో నింతకన్న నెక్కుడు మాట లేమివచ్చు? శృంగారరస మిం దొకబొట్టును గానరాదు 'అనుకూలపతి నాదుమనసులో వర్తించు కులకాంత మదినెంతఁగుందునో కొ?' యన్నవాఁడు శృంగారరసానభిజ్ఞుఁడుగాఁడు. అయిననువాఁడు కేవలశాంతరసమగ్నుఁడు. వానిశాంతరసమునకు శృంగారరసము గులాము. అది దానిని గూరిమిసోమిదమ్మకడ నే పచరించును. వరూథినికో యట్టితెలికపిండియే ఇఁకమతియెవ్వతెకును 'మధుకరాంగనకుఁ బూచినసంపెంగపొలు' పనుట యిట ముమ్మాటికిసత్యమైనది. శృంగారరస ముద్రేకించుచున్న నాయికకు నీచప్పిడిదీనత్వములును ఛాందసపుదీవెనయును రుచించునా? ఇఁక వాని కారసమును గలిగింపవలసినపని వరూథినిది. వరూథినియందో యారసమునకుఁ గొఱతలేదు అపుడు దానికిఁ గనుఁగవ మెఱుఁగులుబ్బె. తాటంకములును జనుఁగవయు నడుమునుపడఁకె. ఇచటఁ గన్నుఁగవను జన్నుఁగవను వర్ణింపక యూరకవచించినను నిప్పటిప్రసంగపుసోయగమే వానికిని జోకఁగా నవి యతిసుందరములుగాఁ బిసాళించుచున్నవి. ఇట్లు శృంగారరము కలుగునట్లు నాయికను లగునొయ్యారిచిన్నెలు నెఱపినది. అది చిప్పిలునట్లు సెలవి వాఱ నవ్వును నవ్వినది. ఇఁక వాచికము లగువగలు చూపవలదా.

ఉ. ఇంతలు కన్ను లుండఁ దెరు • వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్నజవ•రాండ్ర నెపం బిడి పల్కరించులా
గింతియకాక నీ వెఱుఁగ•వే మునువచ్చినత్రోవచొప్పు నీ
కింతభయంబు లే కడుగ • నెల్లిద మైతిమి మాటలేటికిన్.

ఇందవినర్మోక్తిచాతుర్యము నిరతిశయము వానిదిగులును మరునివగలుగా రూపించినది 'ఏకాంత'మనుటచే భయసంకోచాదుల కవకాశములేమియు, 'జవరాండ్ర' ననుటచేఁ దనయత్యంతభోగ్యత్వమును సూచించినది. ఇంతమాత్రకు రస మూరదు. ఇంకను దనయతిశయములు వర్ణించుకొనవలయును.

సీ. చిన్నివెన్నెలకందు • వెన్నుదన్ని సుధాబ్ధిఁ, బొడమినచెలువ తో • బుట్టు మాకు
రహిఁ బుట్టు జంత్రగా • త్రముల కొల్లరఁగించు, విమలగాంధర్వంబు • విద్య మాకు
ననవిల్తుశాస్త్రంపు • మినుకు లావర్తించు, పని వెన్నతోఁ బెట్టినది మాకు
హయమేధరాజసూ • యము లనఁ బేర్వడ్డ, సవనతంత్రంబు లుం • కువలు మాకుఁ
గనకనగసీమఁ గల్పవృ • క్షములనీడఁ, బచ్చరాచట్టుగమి రచ్చ • పట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ • భర్గసభలు, సాముగరిడీలు మాకు గో • త్రామరేంద్ర.

పాలసముద్రము పుట్టినిల్లు చంద్రుఁడును లక్ష్మియుఁ దోఁబుట్టువులు. విద్య రాలునుగూడఁ గరఁగించునది. మన్మథశాస్త్రము పిన్ననాటినుండిపరనము. ఉంకువలు యాగములు. ఇంటిపునాది బంగరుకొండ. కల్పవృక్షములు పెరటిచెట్లు. ఇవన్ని వేయునేల. కార్యస్థానములో హరిహరబ్రహ్మసభలు' ఇంతకన్న నతిశయమెక్కుడిది? ఇఁకఁ జెలిమికత్తియలో స్మరించినమాత్రనే శృంగారరసమును విజృంభింపఁజేయు రంభాదులు. ఇంతకును రసమూరదా? పోనీ. కాంతారసంతానములో 'నభోవాహినీలహరీ శీతలగంధవాహ పరిఖేలన్మంజరీ సౌరభగ్రహణేందిందిరతుందిలంబులు'. వీనినిబట్టియైన నిందునిలుచునా? ఇంతవఱకుఁ దన యతిశయములన్నియుఁ దెలిపి తనయభిలాషను నర్మగర్భముగా సూచించినది నిలువుమనియు నభిప్రాయమును సూచించినది. ఈనర్మసూచనము లీనైష్ఠికశిరోమణికడఁ బనికిరావు. మఱికొంత తేటగాఁ జెప్పవలయు.

క. భూసుర కైతవకుసుమశ, రాసన మాయింటివింద • వైతివి గైకొ
మ్మా సముదంచన్మణిభవ, నాసీనత సేదదేఱి • యాతిథ్యంబున్.

'కైతవకుసుమశరాసన' అని యభిలాషము మఱికొంత తేటపఱచినది. 'ఆతిథ్యము గైకొమ్మా' యనియు స్పష్టముగా నిలుపుచున్నది. 'భూసుర' యనుటచే నాతిథ్యమీయవలసినధర్మమును దెలిపినది, 'కైతవకుసుమశరాసన' యనియుఁ జెప్పుటయేల? కేవలాతిథ్యమునకా? అట్లైన పట్టియతిథిమేను 'కుందనమువంటి' దనునా? వదన 'మొప్పులొలుకు' ననుట తగునా? 'అస్మద్గృహంబు పావనము సేయు' మనుట యొప్పునుగాని. ఇట్లు తళుకులు బెళుకులన్నియుఁ జూపినది. పలుకులకులుకు లన్నియుఁ బచరించినది. మన్మథుఁ డనియు వర్ణించినది. ఆమన్మథునికిఁ దాను రతియైనదా? ప్రాపతిమకుఁ జక్కిలిగింతలు! బదులు వింతము 'సేవాసంగునట్టిసపర్యలు మాకువచ్చె' నన్నాఁడు. 'ఏసురాకుండ నొకండువచ్చి మఱియొండుసె' యని సమాధానము చెప్పినాఁడు. 'భక్తియచాలు. సత్క్రియాకాండము తీర్పవేగ చనఁగా వలయు' నని శుద్ధశ్రోత్రియత్వము చూపినాఁడు. 'కరుణింపు' మని వేఁడినాఁడు. 'మీమహత్త్వముల్ దివ్యము' లని పొగడినాఁడు. ఇప్పటికి శృంగారరసశూన్యుఁడైనను 'భాషాపరశేషభోగి' కదా. ఇదెవింత ! అది 'కైతవకుసుమశరాసన' అని పిలిచ్చినందులకు మాఱుగా తాను 'తల్లి' అని సంబోధించినాఁడు. ఇఁక సందేహమేల ? 'కూరిమి' సోమదేవమ్మరసికుఁడు 'తల్లి' వరూథినికిఁ 'జెక్కుగీటిన పసవల్చుబాలకుఁడె'. ఆ ! హరిహరబ్రహ్మలక్రిందఁ గొలువున్నది రంభాదులు చెలులన్నది. మన్మథుఁడన్నది ఇంతటి మహిమాతిశయమును, భోగ్యతాసౌభాగ్యమును, అభిలాషవిశేషమును దెలిపి యిన్నిపోఁకలుపోయియు శృంగారరసము వెల్లిఁగురిసియుఁ దుదకుఁ దల్లియయ్యెనా ! ఇట్టి చప్పిడిబేలయు నుండునా? కాన వరూథినికి 'లేఁతనవ్వాననసీమఁదోఁచి' నది. ఇఁకఁ దనముద్దులును మహిమలును వానికిఁ బనగూర్పవని తలఁచి వానిని మాని 'యక్కడిరత్నకందరములు' 'నందనచందనోత్కరము' 'గాంగసైకతములు' 'లవలీనికుంజములును' జెప్పి నిలుపఁజూచినది ఇవన్నియుఁ బనికిరావు అలిగోలుమాటలచేతను సంబోధనల చేతను నభిప్రాయము చూపినను, కానిశాంతభీయరసములలో నవి మనసునాటవు స్పష్టముగాఁ దన తలంపుఁజెప్ప వలయును. 'నిక్కముదాపనేల'. చల్లకుఁబోయి ముంతదాఁపరాదు. నిక్కమేమి?

'నీపయిం
జిక్కె మనంబు నాకు ననుఁ జిత్తజుబారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యముల చూఱలఁ బాటలు వాడు తేంట్లు సొం
పెక్కినయట్టిపూవుఁబొదరిండ్లను గౌఁగిట గారవించెదో.

ఇందుల శ్రోత్రియుఁడు 'వ్రతులై, దినములు గడపెడువిప్రులఁ' గామింపరాదనియు, 'జననీజనకుల్ కడువృద్ధు లాఁకట సోలు' చుందురనియు 'నే డీలు నేరకుండిన సమస్తధర్మములు దూలు' ననియుఁ జెప్పినాఁడు. ఈశాంతరసమహాప్రవాహములో శృంగారరసము మొలకొత్తునా!.

వరూథినికి మున్ను వానిచేలతనమునకు లేఁతనవ్వుపుట్టినది. ఇపుడు వానిదృఢవైరాగ్యమునకు నిరాశగలిగి 'విన్నఁబాటు వదనంబున నించుక' దోఁచినది. ఇఁక వర్ణనములు పనికిరావని తెలిసి యుక్తివాదము నకుఁజొచ్చి "మీకర్మనిష్ఠలు యజ్ఞకోటులును మాకవుఁగిళ్ల సుఖింపనేకదా. 'సశరీరస్వర్గము సమకొని యుండఁ' గష్టపడి శరీరము విడిచి వానిని బడయనేల?" యనఁగా వాఁడు "నీవు చెప్పునదెల్లఁ 'గాముక' నికే కాని నాకుఁ గాదు. ఈయానందమును జూచినయెడ నా 'బ్రహ్మానందాధిరాజ్య'ము దప్పిపోవు" నని కామ్యమగు స్వర్గభోగము నాశింపక నిష్కామమగు నపవర్గఫలముఁ గాంక్షించుటఁ దెలిపినాఁడు. 'ఎతెఁగితేని నగరమార్గంబుఁజూపి పుణ్యమునఁబొ' మ్మన్నాఁడు. ఇది 'తెరువెద్ది శుభంబునీకగుఁ' అనుటకుఁ బర్యాయము. ఇందులకు వరూథిని 'డెందము నిశ్చలమై యొక్కెడ నిర్వృతినొందునో యట్టియానందమే బ్రహ్మముగాని నీవుచెప్పు బ్రహ్మానందము వేఱొకటిలే' దని ఖండనముసెప్పియిందులకు 'ఆనందో బ్రహ్మ' యన్న శ్రుతిముక్కను బ్రమాణీకరించినది. ఇంకను దన్నొడఁబఱచుట కయ్యమర కాంతపడుతత్తఱమునుసూచి 'సిగ్గు వెగటును నిస్పృహతఁ దెలుపు నవ్వు' నే కలిగినది. ఇతఁడు గదా శ్రోత్రియుఁడు! ఇదిగదా శాంతరసము! అతఁడు 'త్రయీధర్మముల్ పాపములు రతి పుణ్యమంచుఁ దర్కమేల? నాకుఁగరణుల్ దర్భలు నేప్రియములు. తక్కినవితుచ్ఛము'లని యొక్కమాటను ఖండించివైచె. ఇట్లన్న పిదప నింకయుక్తివాదము పసమాలినదయ్యె. బద్దులు 'మాటలేక' పోయె. 'హృదయాబ్జముజ' ల్లనియె. 'మోము వెల్ల' నయ్యె. తానై వలచివచ్చినది తప్పు. మించిపోయినది. ఇఁక బలాత్కృతి యుపాయమని పయిఁబడి కౌఁగిలించినది. శ్రీహరిపుత్రునికిలోనైయతఁడును గౌఁగిలించెనా? లేదు 'హా శ్రీహరీ' యనిపట్టిత్రోసె. బుద్ధినిజలింపఁజేయుట కింతకంటెబలవంతమైన మోహనపరికరముగలుగదు గదా. ఇంతటికిని గలఁగినవాఁడుగాఁడు. ఇదియ శాంతరససర్వస్వము. ఇట్టివైరాగ్యనిష్ఠయె దానిషరాకాష్ఠ. ఇఁకఁ 'గలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్' అని ఢంకాకొట్టి చాటవచ్చును గదా.

ఇఁక వరూథిని యేమిచేయును. వేదనసెపంబిడి 'యతికరుణముగాం గన్నుఁగవగధవళరుచుల్ 'గావిగొన' సేడ్చినది. దయలేదని దూఱినది. పరాశరాదుల పోకలన్నియు జూపి యట్టి 'మునిముచ్చులెల్లఁ దామరసనేత్ర లిండ్లబందాలుగారె' యని మర్మము దూఱనాడినది. ఎంతపిండిన నేమి! ఇసుకలో నూనియ యూరునా? ప్రవరుఁ 'డేమియు నన' కుండె. 'అప్పనజగంధి మేనిజవాద్విపస' యది కౌఁగిలించినపుడు వానియొడలియందుఁ గదంబించినది. అది రసజ్ఞజనుల కత్యంతభోగ్యము. ప్రవరుఁడో దానిని 'గడిగికొన్నాఁడు. ఆ! ఏమివైరాగ్యాతిశయ మిది! ఈనిరూపణ మెంతసైజము అవసరము పొనఁగినపుడెల్ల నిట్లు దానిని మిక్కిలి సూటిగాను స్వాభావికముగాను వర్ణించుటయే కవితాతత్త్వవిత్త్వము. ఇది యాంధ్రకవితాపితామహునికే తగు.

పిదప నగ్నినిస్తుతించి తదీయప్రసాదమునఁ బ్రవరుఁడు స్వగృహంబుఁజేరుట విదితమే.

తం. తే.

# కథాసంగ్రహము.

---

## ప్రథమాశ్వాసము.

ఆర్యావర్తదేశమున వరణానదీతటమున నరుణాస్పద మను పుర మొండుగలదు. అందు బ్రవరుఁడను విప్రకుమారుఁడు తన తల్లిదండ్రులతోడను, భార్యతోడను, శిష్యవర్గముతోడను నివసించుచుండెను. అతండు యజనాధ్యాదిషట్కర్మనిరతుఁడై యతిథిపూజాధురంధరుఁడై విలసిల్లుచుండెను అతని భార్యయన్ననో యన్నపూర్ణాదేవియుంబోలె నభ్యాగతుల కన్నదానముంజేయుచుండెను. ఇట్లుండ మంత్రౌషధసిద్ధుఁ డొకఁ డాపట్టణమునకు వచ్చి యాప్రవరునియింటికింబోయెను. ప్రవరుఁడు నతని నతిథిసత్కారంబులందనిపి యాతం డద్దానం దృప్తినొంది సుఖాసీనుఁడైయున్నతఱి నతనిం జేరఁబోయి "స్వామీ మీ రేయేదేశములఁజూచినా"రని ప్రశ్న చేయఁగా నాసిద్ధుఁ "డోవత్సా! ఈయాదేశ మని చెప్పుటకు వీలులేదు. నేను సమస్తప్రపంచమును జుట్టివచ్చితి" నని చెప్పఁగాఁ బ్రవరుఁ డచ్చెరువంది "యోమునిలోకగ్రామణీ! మీరు రూపమునందుఁ దరుణవయస్కులై యున్న ట్లగపడుచున్నారు. ఇట్టి చిఱుతప్రాయములోన నెట్లు భూప్రదక్షిణముంజేయ సమకూరె నెఱింగింపుఁ" డనవుడు నాసిద్ధుఁ "డోభూసురవతంసా! మాసంచారమునకు సాధారమురహస్యమైన సంగతియైననూ నీయందు నాకుఁగల యనురాగముచేత నేది దాఁచక చెప్పెదను. ఈశ్వరప్రసాదమునఁ బాదలేప మనుదివ్యౌషధ మొకటి మాకు లభించెను. ఆరసమును బాదములకుఁబూసికొని తన్మాహాత్మ్యమున నెచ్చటికిఁబోవ నిచ్చవొడమ నచ్చటి కేఁగుచుండెదము" అని చెప్పెను. దాన నివ్వెఱఁగుపడి ప్రవరుఁ డోయతిసత్తమా! "దివ్యక్షేత్రసందర్శనాభిలాష నామనస్సు నెంతకాలమునుండియో బాధించుచున్నది. మీరు నన్ను శిష్యునిఁగా భావించి నాయం దాదరణగలవారయి నన్నుఁ దీర్థయాత్రవలన ధన్యునిఁగాఁజేయుఁ"డని పలువిధములఁ బ్రార్థింప నాసిద్ధుం డొక పసరు నిదియదియని చెప్పక యాప్రవరునికాలికిం బూసి తనమార్గమునంబోఁగా దివ్యక్షేత్రసందర్శనాభిలాషి యగు నవ్విప్రకుమారకుండు హిమవత్పర్వతనిరీక్షాపేక్ష నచటికింబోయెను.

## ద్వితీయాశ్వాసము.

ఇట్లుపోయి నరనారాయణాశ్రమ మగుబదరీవనమార్గమునం జని యపరిమితజంతుసంతానాంచితంబులును నానావిధతరులతాశోభితంబులు నగునరణ్యంబులఁ గడచి చని మున్ను భగీరథుఁడు తప మాచరించినప్రదేశమును, గంగానది భూమికిం దిగినచోటును, పార్వతి యీశ్వరసేవాపరతం జొక్కిన చోటును, మన్మథుఁడు ఫాలలోచనుకంటిమంటం గాలి బూడిదయైనచోటును, మునిపత్నులయం దనురాగముచే మున్నగ్నిహోత్రుఁడు విరహవేదనంబడినచోటును, కుమారస్వామి పుట్టినచోటును మొదలగు పుణ్యస్థలములం గాంచి యందుంగలవిశేషములనెల్లం దిలకించుచు నానగమహాత్మ్యంబును వేనోళ్లం బొగడుచుండ మధ్యాహ్నము ప్రాపించెను. ఇంకఁ దడవు మసలినఁ దననిత్యకర్మానుష్ఠానమునకు భంగము కలుగుననిభావించి నాఁటి కింటికిం జని మఱునాఁడు మరల వచ్చి తక్కినవిశేషములం జూడ నిశ్చయించి పోవను గమనింపఁగా నతనిపాదములకుం బూయఁబడిన లేపముమంచువలనఁ గరఁగిపోయి కదలుటకు వీలులేకపోయెను. దాన మిగులఁ బరితాపమునొంది మార్గాన్వేషియై తిరుగుచుం

జఁగి నొక్కెడ దివ్యభవన మొకటి గాన్పించెను. అందు నివసించువారు తపస్వులైయుండురని భావించి వారి నడిగి దారిదెలిసికొనిపోవ సమకట్టి యచ్చోటికింబోయి యచట నొకయుద్యానవనమందుఁ జంద్రకాంతశిలావేదికపైఁ గూరుచుండి వీణవాయించుచున్న వరూథిని యనునచ్చరలేమ నొకతెం గని నిశ్శంక నామె చేరనరుంబోయి తనవృత్తాంత మామెకుం దెలిపి నగరమార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొమ్మని పరిపరివిధములఁ బ్రార్థించెను. అవ్వరూథినియుం బ్రథమదర్శనముననే యత్తరుణవయస్కునందుఁ దనచిత్తము తగిలినకతన నదనుగని మదనుఁడు పదనగుతూపులం దనయెద నొవ్వనేయఁ దద్వేదనం గుంది యతనిం గవయ నభిలషించి మెల్లగ నతనితో సరసమాడ నారంభించెను. ప్రవరుఁడును మార్గాన్వేషణమే తన ముఖ్యోద్దేశమగుట నామె మాటలం బెడచెవిఁ బెట్టఁగా నామె తననేర్పుకొలంది కామశాస్త్రోపన్యాసములఁ జేయ నారంభింపఁగా నతండు పరస్త్రీవిముఖుఁడగుటం దనవేదాంతోపన్యాసముల నవ్వరూథినివాదమును ఖండింప నామె యొండుతెఱంగు గానక మోహోద్రేకమున నతనిపైఁబడి యాలింగన మాచరింపఁబోఁగా దానికి నతఁడు చలింపక యామె నవ్వలకుం ద్రోచిపోయి యామె శరీరస్పర్శముచేఁ దనదేహమున కంటినకళంకమును జేరువనున్న పవిత్రతోయములం గడిగికొని యాచమనముచేసి నిత్యమును దాను బూజించుగార్హపత్యాగ్నిం దలంచి తత్ప్రభావంబునం దనగృహంబునకుం బోయి చేరెను.

## తృతీయాశ్వాసము.

ఇట్లా బ్రాహ్మణకుమారునిచే నిరాకృతయై యాశాభంగము నొందిన యచ్చెలువ యతనిసాంగత్యము లభింపమికి నత్యంతవిరహవేదననొంది మైఁదెలియక యతని న్వేదకఁ దలంచి యతఁడు మున్ను సంచరించిన ప్రదేశములనెల్ల నరసి యటఁ గానక నెవ్వగఁజెంది యట్టి రూపలావణ్యాతిశయములుగల యావనవంతుని కౌఁగిటఁ గూడియుండని బ్రతుకేల యని గోసి కుందుచుండ నింతలో సూర్యాస్తమయమగుడు నామెచెలులెల్లఁ జేరవచ్చి శీతలోపచారము లాచరించి యోదార్పం దలంచి యామె నుద్యానవనమునకుం గొంపోయి నిండారఁ బండువెన్నెలగాయుచుండ శశికాంతశిలావేదికాతలంబులందును చారునికుంజాంతరంబులను, సరోవరతటంబులను విహరించుచున ట్లాచరించి యారాత్రిం గడిపిరి. ఇంతలో మున్నే వరూథినీసంగమం బపేక్షించి యామెచే నిరాకృతుఁడైన గంధర్వకుమారుఁ డొక్కఁ డీవృత్తాంతము నంతయు నాత్మ నెఱింగి యదియ యామెం గదియ నదనని మదినెంచి మాయచే నామెను వంచింపం దలంచి గంధర్వులు కామరూపధరులగుటం దా నాప్రవరునియాకృతిం దాల్చి మున్నాతఁడు సంచరించిన ప్రదేశములం దల్లనల్లఁ దిరుగుచుండెను. వరూథినియు వనవిహారము తనవిరహతాపము నతిశయింపంజేయ నస్వస్థచిత్తయై వేకువనులేచి యున్మాదినియుంబోలె నందందుఁ దిరుగుచు నొక్క దేవపూజకుం బూవులుగోయుమిషచేఁ దిరుగు నమ్మాయావిప్రకుమారునిం గాంచి యచ్చపడి పట్టరానితమకంబున నేకతంబ యతనిని సమీపించి గద్గదకంఠియై యతనిం బలువిధములఁ బ్రార్థింప నెట్టకేల సమ్మతించినవాఁడునుంబోలె నతండు తనప్రథమనిరాకరణమునకుఁ దనయగ్నిహోత్రాదికృత్యములు నిజగృహంబున మాతాపితృసేవాసక్తియు, నతిథిపూజాపరత్వమును గారణంబులుగ నిరూపించి వ విరహసంతప్తాంగియైన యామె నాదరింపకుండుటయు దోషముగా భావించి యామెం గవయవచ్చిన ఖినయించి యామెను దనవశముచేసికొనెను. మఱియు సంభోగకాలమున నిజస్వరూపము నామె తెలిసికొను నను భయముతో నానసమయంబున నామె కన్నులుమూసికొనియుండునట్లును, దా నామె సమ్మతింపఁజేసి తానుగాఁబోవునపుడు నామె తన్నువిడనాడకుండునట్లు నామె నొడంబఱిచి యా

తోఁగూడి క్రీడింపం గొంతకాలమున కాయింతి చూలాలయ్యెను. ఆగంధర్వుఁ డది గాంచి యొక నామెను విడిచి చనువాఁడై యొకనాఁ డామెతో నిట్లనియెను: "చెలియా! నీకొఱకు స్వగృహమును, భార్యను, మాతాపితలను, శిష్యవర్గమును, మడిమాన్యములను, అగ్నిహోత్రాదులను, విడిచి వచ్చి యుంటిని ఏమహాత్ముఁడు నాకుఁ బాదలేప మొసంగి యిచ్చటికివచ్చి నీతో సుఖింప ననుకూలించున ట్లొనర్చెనో యాతఁడు నేఁ డిచటికివచ్చి యచటివృత్తాంతమునెల్ల నాకు వివరించి చెప్పెను మడిమాన్యము లెండిపోయెనఁట. తల్లిదండ్రులు పుత్త్రవియోగముచేఁ దపించుచుం గడుఁ గృశించియున్నారఁట. శిష్యులెల్లరు నధ్యయనశూన్యులైపోయిరఁట. ఇట్టి విపత్తులనెల్ల నేనువేగంబ పోయి చక్కఁబెట్టుకొనవలసియున్నది. అచ్చటఁ గుదురుపాటొనరించి మరల నీకడకు వచ్చి నిన్ను సంతసిల్లఁజేసెదను. నేఁటికిఁ బోయిరా ననుమతింపుము" అని యనేకవిధంబుల నామె మనస్సుకరఁగున ట్లొనర్చి తనవియోగమును సహింపఁజాలని యామె నెట్టకేలకు నొడంబఱిచి కృతార్థుఁడై యామెను విడిచి తనమార్గమునఁ బోయెను.

## చతుర్థాశ్వాసము.

ఇచట వరూథిని నెలలునిండఁగ శుభగ్రహవీక్షణము గల యొకశుభలగ్నమందు సురరాజవర్చస్వుఁడైన కుమారుం గనియెను. ఆసమయంబున దేవతలు కుసుమవృష్టిం గురిసిరి. తేజోద్దీపితుఁడగు నక్కుమారునకు నచ్చటిమునులు స్వరోచి యనుపేరిడి, జాతకర్మ మాచరించి, యుపనయనాదికృత్యములం దీర్పం బెరఁగి యక్కుమారుండు రణశూరుఁడై ధనుర్విద్య నభ్యసించి మందరపర్వతపార్శ్వమందు విశ్వకర్మనిర్మితమైననగరియందుఁ జెంచులు మొదలగునాటవికులు తన్నుం బరివేష్టించియుండఁ గాఁపురముండెను. ఇట్లుండ నొకనాఁడు జడివానగురిసి సెలయేళ్లు జలజల ప్రవహించుచుండఁ బక్షిరవసంకులంబైనయక్కొండసెత్తపుభూమిని జూచుటకై యతఁ డాకొండనెక్కి తదగ్రమున నొకచంద్రకాంతవేదిపై నాప్తజనపరివృతుండై కూర్చున్నతఱి నొక్క కిరాతప్రభు వతనియొద్దకు వచ్చి నక్కకొమ్ము చాఱపప్పు మొదలగువస్తువులను గానుకపెట్టి తత్సమీపారణ్యంబున భల్లూకాది క్రూరమృగంబులు నిండియుండి యుపద్రవము గలుగఁజేయుచున్నవని విన్నవింప విని యాఖేటకౌతుకంబు చిత్తంబునం దతిశయింప బ్రయాణసన్నద్ధుండై తనదండుతోఁగూడ నయ్యరణ్యంబునకుం జని పలుదెఱంగుల మృగయావినోదంబు సలిపి వేట చాలించి పురంబునకు మగిడివచ్చుచు నొక్కెడ విశ్రమించి యుండ శుభాశుభమిశ్రములగు శకునంబు లనేకంబులు గానరా నం దశుభశకునంబులవలనఁ బ్రాణరక్షాసంశయంబగు రణం బగుననియు శుభశకునంబులవలన మీఁద నెట్టకేలకు మితిపెట్టరానిజయమంగళంబు లగుననియు నంతరంగంబున నిశ్చయించియున్నంతఁ జేరువ నొక్కయాఁడుకూయి వినవచ్చెను. అంత నతం డధిజ్యశరాసనుండగుచు నిదియేమని వితర్కించుచుండుతఱి భయార్తయు దీనాననయునైన యొక్కయబల యతనిని సమీపించి "యోరాజేంద్రా నన్నురక్షింపు" మని ప్రార్థింప నతం డామె నోడకుండుమని చెప్పి తద్వృత్తాంతముం దెలియ నడుగుటయు నామె యిట్లనియె. "రాజేంద్రా! నేను మరుదశ్వపుత్త్రి కిందీవరాక్షు గంధర్వరాజువలనం బుట్టినదానను. పేరు మనోరమ యందురు. నాపై నీఁగనైనవాలనీక నాతండ్రి యెల్లప్పుడును నన్నుఁ బ్రేమతోఁ బెంచుచుండును. మందారవిద్యాధరతనూభవయగు విభావసియుఁ, బారర్షిపట్టి కళావతియు నాకుఁ బ్రియసఖులు వారును నేనును గలసి యొకదినమునఁ గైలాసపర్వతశిఖరమునఁ బుష్పాపచయాపేక్ష నికుంజాంతరంబులం దిరుగుచుండి యొకబిలమునందు వికృతస్వరూపుఁడైన యొకమునిం గని యతనిముఖమును బాల్యచాపలమునం బట్టిఁ

గా నతండు నాకరస్పర్శమువలన ధ్యానము చెడి కన్నులు దెఱచి 'యోదుర్మార్గురాలా! సమస్తసుఖము లం బరిత్యజించి నిర్జనప్రదేశమునం దప మాచరింపుచు మిట్లపహసింప నేమివచ్చెను ఎలప్రాయమున నున్న నీవు నీకుందగిన యౌవనపురుషులతో సరసమాడం జనునుగాని మాబోంటిముసలివాండ్రతో నీ కేమి. జరాభారమున శ్రమనొందియున్న మ మ్మిట్లలసటపెట్టితివి గావున నీ వొకరాక్షసునికిం బట్టువడు' మని శపించి యంతంబోక యమ్ముని తనచేత నున్న నాగబెత్తముతోఁ బశువునుగొట్టినట్లు నన్నుం గొట్టెను. ఇట్లు తిట్టువడియుం గొట్టువడియు నేడ్చునన్నుం జూచి నాచెలు లాగ్రహించి యమ్మునిని దూషింప నతఁడు వారిని రాజయక్ష్మక్షోభం బెనఁగ నశింపుఁడని శపించెను. అప్పుడే వారి కావ్యాధిసంప్రాప్త మయ్యెను. నన్ను వారత్రయమునుండి యొక రాక్షసుఁడు తఱుముకొని వచ్చుచున్నాఁడు చూడుము. నాయొద్ద నస్త్రహృదయ మనువిద్యగలదు సకలరిపునాశకరము యశస్కరము నైన యవ్విద్యయొం దున్నను గొనవలయును గాన నేనాఁడుదానను నావలన విద్యగ్రహించుట సరిగాదని యెంచక దానిం బరిగ్రహించి యీయసురునిం బరిమార్పు'' మని వేఁడెను. ఇంతలో నారాక్షసుఁడును రాజును సమీపించెను. అంత నారాక్షసునికిని స్వరోచికిని ఘోరయుద్ధము జరగి రాక్షసుఁడు చెంచులబలము నెల్లను సంహరించి స్వరోచి నెదిర్చి యతనిప్రయత్నములనెల్ల విఫలము చేయఁగా స్వరోచి విస్మయంబంది రోష మతిశయింప నాగ్నేయాస్త్రంబు నతనిపైఁ బ్రయోగింప దాన నయ్యసురుఁ డారాక్షస రూపము న్విడిచి గంధర్వుఁడయ్యెను.

## పంచమాశ్వాసము.

ఇట్లు రాక్షసరూపమును విడిచి గంధర్వమూర్తిం జేకొనినయతండు భూమికి డిగ్గి స్వరోచిని సమీపించి ''యోయయ్యా! నే నిందీవరాక్షుఁడను గంధర్వుఁడను. మీతల్లికిం దోడఁబుట్టినవాఁడను గాని యన్యుఁడనుగాను. నేనొక్క ముని యొసఁగిన శాపముచే రాక్షసుఁడనై యీనాకూర్మినందనను భక్షింపం దలంచితి'' నని చెప్పుచుండఁగా మనోరమ వచ్చి తండ్రిపాదములకు నమస్కరింపఁగా నతఁ డామె నెత్తి యాదరమున మూర్ధఘ్రాణము గావించెను. అంత స్వరోచి యిట్టిశాపము నీ కేలవచ్చెనని యడుగుటయు నతం డిట్లనియె. ''బ్రహ్మమిత్రుఁ డనుమునియొకండు తనశిష్యులకు నిరంతరము నాయుర్వేదముం జెప్పుచుండ నే నది చూచి యవ్విద్యం బడయఁ గాంక్ష నొడమ నతని సమీపించి నన్ను శిష్యునిగా గ్రహించి యాయుర్వేదముం జెప్పుఁడని వేఁడితిని. అతండు నన్ను దూషించి నిరాకరింప నతనిని వంచింపం దలంచి శాంబరీవిద్యచే నొరులకుఁ గానరాక యతనిచేరువనే శిష్యవర్గముతోఁ గూరుచుండి యాయుర్వేదము నంతయు సాంగముగా నభ్యసించి యందుం బ్రవీణుఁడనై యంతం బోక యమ్ముని నపహసింపం దలంచి శాంబరిం బాసి యతనికిం బొడసూపి ''యో వెఱ్ఱితపసీ! సవినయముగ వచ్చి విద్య నేర్పుమనియడుగ నిరాకరించి దూషించితివి. ఇదె చూడుము విద్య నభ్యసించితిని. విద్యాభ్యాసమునం దపేక్షగలవారికి విద్య యెట్లయినను వచ్చు'' నని నిష్ఠురోక్తులాడితిని. దాన నతఁడు గలుషించి ''మాయోపాయంబున నన్ను వంచించి విద్య నభ్యసించినదే కాక గురువునగు నాయెదురఁ బరిహాసోక్తులు పల్కుచున్నావుగదా. కానిమ్ము. ఆసురియగు మాయ నాయెడం బ్రయోగించి వంచించి యపహసించితివి గావున నసురవై పిశితం బశనంబుగా నును''మని శపించెను దానికి నే నులికిపడి యతని పదములపైఁబడి ''మహాత్మా! బుద్ధిదోషమున మీకడఁ గాఱు లఱచిన నన్ను మన్నించి శాపవిమోచనముం గరుణింపవే'' యని వేఁడుకొంటిని. అందుల కాతఁడు ప్రసన్నుఁడై నన్ను లేవనెత్తి ''పశ్చాత్తాపముంబొందితివి గానఁ నీకుఁ గొన్నినాళ్లకు నిజకుమారిని మింగఁబోయి యొక్కమహాత్ముని దివ్యశరార్చిఁ బ్రేలి

స్వస్వరూపముం బొందెద'' వని యనుగ్రహించెను. వెంటనే నేనును బురంబునకు వచ్చి నా శపథప్రకారం ము మరింపఁ బురంబునంగలవారి నెల్ల మ్రింగ నారంభించితిని. ఈ రాక్షసభయమునకు వెరచి యున్న నా భార్యలను బుట్టినింటివారు పిలుచుకొనిపోయిరి. పురి మెల్ల జనశూన్యము గాఁజేసి యాహారంబు గాన కైలాసశిఖరంబునం బూవులు గోయుచున్న యీ కన్నెను గూఁతురనియైన భావింపక క్షుత్పిపాసావహిం పనోపక మ్రింగఁ దలఁచుకొని వచ్చి మహాత్ముఁడగు నీశస్త్రధారం బవిత్రుండనై నిజస్వరూపముం బొందితి'' నని తనయుదంతం బంతయుం జెప్పి మఱియు నిట్లనియె. ''నీవు నాకొనర్చిన యుపకృతికిం బ్రత్యుపకార మొనర్పం జాలను. నాయొద్దనున్న యాయుర్వేదముతోడ మత్కుమారియగు నీ కన్నె మిన్నం బరిగ్రహించి నన్నుఁ గృతార్థుం జేయు'' మని వేఁడఁగా స్వరోచి దానికి సమ్మతించెను. అంత సూర్యాస్తమయం బగుటయు వారు విశ్రమించిరి. ప్రభాతమున నయ్యిందీవరాక్షుని పూర్వపుభృత్యు లతఁడు శాపవిముక్తుఁ డగుట విని సంతోషించి యచటికిఁ దెచ్చియిచ్చిన కానుకల నతండు గ్రహించి వారు తెచ్చిన తనదివ్యరథంబును స్వరోచితోడ నధిరోహించి కూఁతును నొక విమానంబున నెక్కించి భృత్యజనులు గొలిచి రాఁ గతిపయప్రయాణంబులఁ దిమానారాయణపరిణయగేయమానగంధర్వమైన మందరపర్వతంబునకుం జని నిజనివాసంబుఁ జేరి యమాత్యులం బిలిపించి వివాహసన్నాహముం జేయ నియమించి స్వరోచి నొకదొరయింట విడియించి యొకశుభలగ్నంబున నాతనికి మనోరమ నిచ్చి వివాహము చేసెను. అల్లునకు నేకాభరణాదుల నొసంగెను. తక్కుంగల బంధువర్గము నానావిధ వస్తువులను గానుకలొసంగిరి. స్వరోచి యారేఁగునప్పు డతని చక్కఁదనముం గాంచి యప్పురమునం గల స్త్రీలందఱును మోహపరవశలైరి. నలకూబరుఁడు మొదలగువారుగూడ నవ్వివాహమునకు వస్త్రాభరణాదులొసంగి గౌరవించిరి. ఇట్లు మహావైభవమున స్వరోచి మనోరమం బరిగ్రహించెను.

## షష్ఠాశ్వాసము.

నాఁటిరాత్రి చెలులెల్ల మనోరమకు మజ్జనం బాచరించి చందనాదిపరిమళద్రవ్యంబుల మేన నలంది దివ్యాంబరాభరణభూషితం జేసి శయనగృహంబును బ్రవేశపెట్టి తామటనుండి కదలిపోయిరి. స్వరోచియు మోహాతిశయమున నామెం గవయ గమకింప నమ్ముగుద దీనాస్యయై తపించుటం దిల కించి ''తోయజాక్షీ! యక్షయానందసంధాయకం బగు నిట్టిక్రీడాసమయంబున వగపునకుం గారణం బేమి? ఏమిసాధింపవలయుం జెప్పు మది వేధ చేనున్న సాధించెద'' నని పలుక నాతనిఁ జూచి మనోరమ ''నాథా! నాయెడ మిగులఁ గూరిమిగలిగి చరించు సఖు లిద్దఱును రాజయక్ష్మబాధితలై తపించుచుండఁగా నేనెట్లు సుఖించెదను. నీవు వారిరుగ్ణత మాన్పితివేని నేనానందము నొందెదను అట్లు చేయ వేని నాకు సౌఖ్యము కలుగ నేరదు'' అని చెప్పెను. దాని కతం ''డోహరిణాక్షీ! ఇంతమాత్రమున కీపరి తాపమేల? నావెంటవచ్చి వారెచట నున్నారో చూపుము. మదీయసంచితాయుర్వేదస్ఫురణమునం దదీయరోగబాధఁ బరిహరించెద'' నని చెప్పి యామెను వెంటఁబెట్టుకొనిపోయి కైలాసానల్పప్రాంత కాంతారంబునం గుందుచున్న సఖులం గాంచి తదామయవ్యథాభారమును మాన్పెను. ఇట్లు వ్యాధి విముక్తలయిన యారజనీశబింబరుచిరాస్యలు రాజుం జూచి ''స్వామీ! నీవు మా కొనర్చిన యుపకారమునకుఁ బ్రతిసేయ నేరమయిన మావలనం జేకొను కార్యములు కొన్ని గలవు చెప్పెదము అందు మా వృత్తాంతమాకర్ణింపుము'' అని యందు విభావసి యనునది యిట్లనియె ''అనఘా! నేను మందారుఁడను విద్యాధరునికూఁతురను. పేరు విభావసి యందురు. ఈజగంబునంగల మృగపక్షిజాతులభాషలెల్ల నాకుం

తెలియును. ఈవిద్య నాచే నెఱింగి నన్ను వివాహమగుము" అని చెప్పనంతలో రెండవదియగు కళావతి యిట్లనియె. "స్వాయఁడవే బ్రహ్మర్షి మాతండ్రి. అతండు సకలవిద్యల నభ్యసించి తపమాచరింపం దలంచి యొక్కయరణ్యమధ్యంబునకుంబోయి యాశ్రమం బొండు కల్పించుకొని కందమూలఫలభక్షణుండై పంచాగ్నిమధ్యమున ఘోరంబగు తపం బాచరింప నతనితపోయుక్తికిం బెగడి పురుహూతుండు తపోభంగ మాచరింపఁ దలంచి యతనియొద్దకుఁ బుంజికస్థల యను నచ్చరలేమం బంచెను. అవ్వేల్పువెలఁదియు మన్మథవసంతమలయానిలులు తనకుం దోడుగ నునుసానఁబట్టిన యనంగునిమోహనబాణమో యనునట్లు మందగమనవిలాసంబున నమ్మునిం జేరవచ్చుటయు నతండు ప్రథమదర్శనముననె మోహపరవశుండై తపంబెల్ల నేటఁగలపి యామెతోడ నిరంతరక్రీడారతిం దవిలియుండం గొన్నాళ్లకామె గర్భముం దాల్చుటయైన నునుంగాంచి విపినాంతరమునఁ బడవైచిపోయెను. మునియు నన్నుపేక్షించెను. ఇట్లు తల్లిదండ్రులచే విడువఁబడిన నేను శశిమండలంబున వెడలుశిశిరకిరణప్రణాళికామిళదమృతరసగ్రాసంబునంజేసి కొన్నిపూఁటలం బుటపుటనైన నన్నుఁ గనుంగొని మునీంద్రుండు ప్రియం బంది నిజాశ్రమంబునకుం గొని చని శశికళాసంవర్ధిత నగుటంజేసి నాకుం గళావతి యనునామం బిడి పెనుచుచుండ నేనును జనకసేవాపరతం బ్రవర్తిల్లుచుండి కొంతకాలమునకు యౌవనవతినైతిని. అంత దేవాపి యను గంధర్వుఁడు బంధువర్గముతోడ మాతండ్రికడకువచ్చి నన్నుఁ దనకిమ్మని యడుగ మాతండ్రి యతనికులమును దూషించి నటవిటగాయకులైన గంధర్వులకుఁ గన్నె నిచ్చుటలేదని యతని నిరాకరింప నతఁడు క్రోధోద్రేకముతో వెడలిపోయి యొక్కనాఁటినిశాసమయమున మాయాశ్రమంబుఁ బ్రవేశించి కామక్రోధాంధుఁడు గాన మాతండ్రిపట్టుకఁ గోయ నతఁడు రోఁజు టాలకించి నేను మేలుకొని దీపము వెలిఁగించిచూచి రోదనము చేయుటయుఁ బొరుగుననున్న తపసులందఱు వచ్చి నన్నుం బొదివి యోదార్చిరి. ఆదుర్మార్గుఁ డంతకుముందె పరుగెత్తిపోయెను. పిమ్మట మాయయ్యకు నేనగ్నిసంస్కార మాచరించి దుఃఖార్తనై తల్లివిడిచి చనినపిదపఁ దానె తల్లిమాఱుగాఁ బెనిచినజనకుఁడు మృతినొందె నింకేటిజీవనమని యాత్మహత్యం గావించుకొనఁ జూచుచున్న నంతరిక్షమునం దెచ్చటికోపోవుచున్న పార్వతి చూచి భూమికవతరించి 'ఓతన్వీ! అలభ్యమగు నిట్టిసౌందర్యనిశాంతమయిన తనువు నన్యాయముగా విడువవలదు. అతిలోకుండగు స్వరోచి నీకు భర్తయగును. అతనిసంగమంబువలన నప్రతిమశ్రీవిభవంబు గాంచెదవు. ఇదియునుంగాక పద్మిని యనువిద్య నొకటినీకిచ్చెదను. దానివలన నీకభీష్టసౌఖ్యములు సిద్ధించును' అని చెప్పి యవ్విద్య నాకుపదేశించి యాముక్కంటివాల్గంటి మింటికెగెఁ. జనిన నేనును బ్రాణంబులు నిల్పుకొని యున్నదానను. ఆస్వరోచి నీవేయని తోఁచెడిని. వంచనాలాపంబు లుడిగి యప్పద్మినీవిద్యారత్నంబుతోఁగూడ నన్నుం బరిగ్రహింపుము." అన నంగీకరించి యమ్మహావిభుండు వారిద్దఱివలన నవ్విద్యలం గైకొని యొకశుభముహూర్తంబున వారినిరువురం బరిణయంబై యప్పువ్వుంబోఁడుల మువ్వురతో వివిధవిహారసంగతులఁ దత్పరుఁడై పద్మినీవిద్యాప్రభావఘటితాన్నపానభూషావిశేషమాల్యవస్త్రానులేపసామగ్రినొంది క్రీడించుచుండెను. ఇట్లువిహరించుచు నతం డొకనాఁ డొక్కసరోవరసమీపంబునకుంబోయి యున్నతఱి నొకకలహంసిక చక్రవాకినొకతెం జూచి యీయిందునిభాస్యలుం బతియు నేకమతిం గవగూడియుండ నెంత తపంబొనర్చిరో కదా యని ముచ్చటించెను దానికిఁ జక్రవాకి పలువుర భార్యలుగల యితనికి వారివలన సుఖ మెక్కడిది. వారి కితనివలన సుఖమున్ను లేదు ఒక్కతరుణికిం దగులువాఁడును, ఒక్కపతిని వలచు మెలఁతయు నే ధన్యులుగాని యిట్టివారు గారు ఈవిషయమున ధన్యులము నేనును నాభర్తయునే" యనినచక్రవాకిపలుకు లాలకించి స్వరోచి తలవాంచి యుస్సురని తలపోయుచు మానరానితమకమున నాచెలఁతలతో మరల నూ

ఆండ్లు క్రీడించి యొక్కనాఁడు వనవిహారమునకుంజని లేడిపిండుతోఁ గూడియున్న యొకయిఱ్ఱింజూచి దానిం దనసతులకుం జూపెను. ఆయిఱ్ఱియు నా లేడులంజూచి "మీయందు నిరంతరసంభోగరతిని సంచరించుటకు నేను స్వరోచినిగాను. ఇట్టికృత్యము స్వరోచికిఁ జెల్లునుగాని నాకుఁ జెల్లదు. నేను భోగేచ్ఛ నివారించితిని. మీరింక నన్ను విడిచిపోయి వేఱొక్కనిఁ బరింపుఁ" డనిచెప్పఁగా నవి యాయిఱ్ఱిని విడిచి పోయెను. ఆమాటలనువిని స్వరోచి ముందు చక్రవాకిపలికినపలుకులు నిప్పుడీ యిఱ్ఱిపలికినపలుకులును దనమనమును గలఁతపెట్టఁ దనసతులను విడనాడఁదలంచియుఁ దోన దుర్వారము లయినకోరికలకంక వివేకముచొప్పు దక్కి మఱియు నాలుగురాండ్లు వారితో సంభోగించి వారిలో మనోరమయందు విజయుండును, విభావసియందు మేరునందనుండును, కళావతియందు విభావసుండు నను సుతత్రయముం గాంచి వారికిఁ బద్మినీవిద్యాప్రభావంబున వేఱువేఱుపట్టణంబులఁ గట్టించియిచ్చి వారి నప్పట్టణంబులకుం బట్టంబుగట్టి కృతార్థుండై యొక్కనాఁడు మృగయావినోదార్థ మడవికిం బోయి యచ్చట నొక వరాహముంగాంచి బాణమెక్కుపెట్టి వేయఁబోవుచున్న తఱి నొక్కయాఁడుజింక యతనిని సమీపించి "రాజా నిరాపరాధియైన యావరాహము నేల చంపెదవు ఆశరమును నాపైఁ బ్రయోగింపు" మని చెప్పఁగా నతండు "నీకేల యీశరీరముపై నింతరోఁత పుట్టెనని యడుగ "రాజా! అన్యసతులం దాసక్తుఁడగువానిఁ దమక మొదవి కూడఁదలఁచుకంటె మరణమే శ్రేయ" మనుటయు, స్వరోచి, "నీ హృదయ మెవ్వనిపై నిలిచె. నీభావము తెలియంజెప్పు" మన నయ్యది "నీయందే నాకనురాగముగల" దనెను. దాన నతఁడు విస్మయంబంది, "నేను నరుఁడను. నీవు మృగివి మనకిద్దఱకు సమాగమం బెట్లగు" ననిన నాలేడి "రాజా నీవొక్కసారి నన్నాలింగన మాచరింపు" మనఁగా నతఁ డట్లు చేసెను. వెంటనే యది దివ్యస్త్రీరూపము ధరించి "నృపశేఖరా! నే నీవనదేవతను సకలభూభువనరక్షాదక్షుండైన మనువర్యు నీయందుఁ బడయుటకై సమస్తదివిజులు నన్నుఁ బ్రార్థించిన వచ్చితిని. నన్నుఁగూడి యభీష్టసిద్ధిం బొందు మనెను. స్వరోచియు నామెను బరిగ్రహించెను. అయ్యువతి యంతం గొంతకాలమునకు గర్భిణియై శుభదినమునఁ దేజోవంతుఁడగు పుత్రునిం గనెను. ఆకుమారకుండు స్వారోచిషాఖ్యం బెరిఁగి శాంతిదాంతిదయాసత్యశౌచనిరతుండై యకామత నచ్యుతుంగూర్చి చిరతపం బాచరింప నారాయణుండు ప్రసన్నుండైన నక్కుమారుం డతనిం బెక్కుతెఱంగుల సంస్తుతింప నతండు ప్రసన్నుండై నీవు రెండవమనువవై యీమహి నేలి మ్మట సాలోక్యముం బడయుమని వరంబిచ్చి మనుత్వముం గాతనిఁ బట్టముగట్టి యంతర్హితుండయ్యెను. స్వారోచిషుఁడును సుఖస్థితిని బ్రజాపరిపాలన మాచరించెను.

కోపల్లి - వేంకటరమణరావు.



# కథాదివిమర్శనము.

—०◯०—

ఇందలికథ 'మార్కండేయపురాణోక్తప్రకారంబునఁ జెప్ప' మన్నట్లు లప్పురాణంబునఁ గయికొనఁబడినది. మారన తన తెనుఁగుమార్కండేయపురాణమునందు రచించిన యీకథాభాగ మాటించియే పెద్దన యీప్రబంధమును గావించినాఁడు. కావున నందలివాక్యములు గొన్ని యిఁ గానంబడుచున్నవి. ఎట్లన:—

ఉ. ఈసుకుమారుఁ డెవ్వఁడొకొ • యిందుల కెందులనుండి వచ్చెనో
భాసురరూపకాంతిజిత • భావజచంద్రుఁ డితండు రాగలీ
లాసరసత్వ మెప్పఁ గడు • లాలసుఁ డై ననుఁ జూచెనేని నేఁ
జేసినపుణ్య మెవ్వరును • జేయరు కాముని దక్క నేలుదున్. మార్క-

ఉ. ఎక్కడివాఁడొ యక్షతన • యేందువసంతజయంతకంతులం
జక్కఁదనంబునం గెలువఁ • జాలెడివాఁడు మహీసురాన్వయం
బెక్కడ యీతనూవిభవ • మెక్కడ యేలనిబంటుగా మరున్
డక్కఁ గొనంగరాదె యక • టా నను వీఁడు పరిగ్రహించినన్.

సీ. అనలునియందు రే • పును మాపు వేల్వంగఁ, బడుహవ్యములఁ జేసి • పడయవచ్చు
పుణ్యలోకంబులు • పాలతి నీ వెఱుఁగవె, త్రిజగంబు హవ్యప్ర • తిష్ఠితంబ
* * * * * * * * *
వినుము దర్భలు నరణులు • వేదికలును, నగ్నులును నాకుఁ గరముఁ బ్రియం బొనర్చుఁ
గాని యొంటిను బ్రియము మెదఁ • గలుగ దనిన. మార

మ. తరుణీ రేపును మాపు హవ్యములచే • తం దృప్తుఁ డౌవహ్ని స
త్కరుణాదృష్టి నొసంగుసౌఖ్యము లెఱుం • గక్ శక్యమే నీకు నా
కరణుల్ దర్భలు నగ్నులుం బ్రియము లై • న ట్లన్యముల్ గా వొడ
ల్దిరమే చెప్పకు మిట్టితుచ్ఛసుఖము • ల్మీసాలపై తేనియల్.

తే. అనఘ మందారవిద్యాధ • రాత్మజన్మ, నే విభావసి యనుదాన. మ

తే. అనఘ మందారవిద్యాధ • రాత్మభవను, నను విభావసి యండ్రు.

మఱియు నిట్టివి పెక్కులుగలవు. దీనిచేఁ బెద్దనరచనమునకుఁ గొఱంతరాదు. ఆతఁ డింత్రముగాఁ జూపిన రచనావైచిత్ర్యమును గల్పనాప్రౌఢిమనుఁ బట్టిచూడఁగా నివి స్మరణవశము కాని యశక్తిచేఁ దెచ్చుకొన్నవిగావని తేటపడును. అందు ౧౫౦పద్యములలో నిమిడినకథ మించుగా ౪౦౦పద్యముల నిబంధించినాఁడు. స్వబుద్ధికల్పితములగు పెక్కువిశేషము లిందు చే నిది యింతవిపులి నొందినది అయినను గథాంశమున రెంటికిని గొంత భేదము కానిపించుచు పరాత్ముఁ డాయుర్వేదవిద్యను స్వరోచికిచ్చి తనకూఁతురగు మనోరమను బెండ్లియాడుమని పుడే మనోరమ తనసఖులు రోగపీడితులైయుండఁ దానెట్లు సుఖింపంగూడునని చెప్పి స్వరో రుగ్ణత మాన్పించెనని మార్కండేయపురాణమం దున్నది. ఇం దీవిషయము స్వరోచిమనోరః

సంగమనమయమున జరిగినట్లున్నది. మఱియు స్వారోచి హంసమిథునసంవాదమువిని విరక్తుఁడై వనంబునఁ దపంబుఁ గావించి స్వర్గమున కరిగినవిషయ మిందుఁ గానరాదు. భేదమింతియ. ఇదియుఁ జమత్కారపుష్టికిన్ని రసపాటవమునకును ననురూపమగు నిరంకుశవిహార మేకాని నెఱసుగాదు.

తిక్కనయచ్చతెనుంగుతేటలనీటులును శ్రీనాథునిసంస్కృతసమాసడంబరమును గూడి పెద్దన కవనంబయ్యె. ఇతనిసీసము లచ్చతెనుంగుమురిపముల మూటగట్టుచుండు. ఇవి స్వభావోక్తిరచనను మనోజ్ఞ సాధనమై తిక్కనసీసములం బోలియుండును

సీ. ముదమున నెలమిసొం • పొదవి చెమ్మొగమునఁ, దోఁపంగ వచ్చినఁ • ద్రోచి త్రోచి
లలి నుల్లసిల్లుచు • లలితలోచనదీప్తు, లడర నుంకించిన • నాఁగి యాఁగి
సంతసంబున బాలి • కేము లగుచెయ్వులు, దొడరఁ జూచినఁ జేయ • కుడిగి యుడిగి
మనమున నుబ్బుమై • మాట నాలుకకు రాఁ, గడఁగిన నాడక • కడపి కడపి
ధీర యై యిట్లు సమ్మద • పూరమునకు, గఱువతన మనుబలితంపుఁ • గట్ట వెట్టి
వెలఁది యెఱుఁగనియదివోలె • వికృతి లేక, యల్ల నెప్పటియట్టుల • యుసుగుటయును భార-విరా.

సీ. కొనసాఁగి కామినీ • గోష్ఠిఁ బ్రౌఢము లైన, యుమటుఁజూపుల నెప్పు • టుదల నాఁచి
సంతసంబున ముఖా • బ్జమునందుఁ జిఱునవ్వు, కందళింపక యుండ • డిందుపఱిచి
పొంగారు మైఁ దోఁచు • శృంగారచేష్టల, తమిఁ దెచ్చికోలుమా • ర్గమున డాఁచి
పొడముర సావేశ • మున వచ్చునర్మోక్తు, లొదివి నాలుకకు రా • కుండఁ గ్రుక్కి
మస్తకము వాంచి యుసురని • మౌనముద్ర, నేల బొటవ్రేల వ్రాయుచు • నిలిచి కొంత
సేపు వెడవెడ చింతించి • శిర సొకింత, యెత్తి సన్నంపుటెలుఁగుతో • నిట్టు లనియె   మనుచరి.

తిక్కనయచ్చతెనుంగులను మెచ్చి కవి యిందు నాలుగవయాశ్వాసమును జాలఁ దన్మయముఁ జేసినాఁడు. శ్రీనాథునిగీర్వాణరచనలకుఁ జొక్కి దీనిని పెక్కుచోట్ల సంస్కృతభూయిష్ఠముఁ గావించినాఁడు. గీర్వాణరచన కొకయుదాహరణము.

మ. పవమానప్లవమానపంకజరజః • పాళీపిశంగచ్ఛవి
భవదభ్యర్ణవికీర్ణకృత్రిమసరి • త్పాథస్తరంగాహతిం
దవపాంపాణవితర్దికాతలమునన్ • నాళీకపత్రాక్షులు
త్సవ మొప్పన్ విహరించుచున్ సరసవా • చాప్రౌఢిమల్ మీఱఁగన్   మనుచరి.

ఈకవి శ్రీనాథునికృతులను జక్కఁగాఁ జదివియే తనప్రబంధమును గావించినాఁడు. కావున శ్రీనాథునిరచనలు గొన్ని యిందుఁ గాన్పించుచున్నవి. శ్రీనాథునిశృంగారనైషధములోని తొలుపద్యమును జూచి తనగ్రంథాదిపద్యమును నిబంధించినాఁడు. అందు,

శా. శ్రీరామాకుచమండలీమృగమద • శ్రీగంధసంవాసిత
స్ఫారోదారభుజాంతరుండు ధరణీ • సంశ్లేషసంభావనా
పారీణుండు కృతార్థుఁ జేయుఁ గరుణా • పాథోధి పద్మాక్షుఁ డిం
పారన్ మామిడిపెద్దమంత్రిసుతు సిం • గామాత్యచూడామణిన్.   శృంగార

అను నీపద్యమందలివిషయముం గొని 'ధరణీసంశ్లేషసంభావన' కు సనందనాదుల నెక్కుడుగ జేర్చుకొని యొక్కింతభేదముతో నత్యంతమనోహరముగా

శా. శ్రీవత్సోజకురంగనాభ మెదపైఁ • జెన్నొందు విశ్వంభరా
దేవిం దక్కమలాసమీపమునఁ బ్రీ • తిన్ నిల్పినాఁడో యనం

గోవిందాయసనందనాదినిజభ♦క్తశ్రేణికిం దోఁచురా
జీవాతుండు కృతార్థుఁ జేయు శుభదృ♦ష్టిం గృష్ణరాయాధిపున్.

అని రచించినాఁడు. మఱికొన్ని యుదాహరింపఁదగు

సీ. నలినసంభవువాహ♦నము వారువంబులు, కులముసాములు మాకుఁ ♦ గువలయాక్షి
చదలేటిబంగారు ♦ జలరుహంబులతూండ్లు, భోజనంబులు మాకుఁ ♦ బువ్వుఁబోఁడి
సత్యలోకముదాఁక ♦ సకలలోకంబులు, నాటపట్టులు మాకు ♦ నబ్జవదన
మధురాక్షరము లైన ♦ మామాటల వినంగ, నమృతాంధసులు యోగ్యు ♦ లనుపమాంగి
భారతీదేవిముంజేతి♦పలుకుచిలుక, సమదగజయాన సబ్రహ్మ♦చారి మాకు
వేదశాస్త్రపురాణాది♦విద్యలెల్లఁ, దరుణి నీయాన ఘంటాప♦థంబు మాకు. శృంగా.

సీ. చిన్నివెన్నెలకందు♦వెన్నుఁదన్నిసుధాబ్ధిఁ, బొడమిన చెలువ తోఁ♦బుట్టు మాకు
రహిపుట్టి జంత్రగా♦త్రముల రాల్గరఁగించు, విమలగాంధర్వంబు♦విద్య మాకు
నవవిల్తుశాస్త్రింపు♦మిసుకు లావర్తించు, పని వెన్నతోడఁ బె♦ట్టినది మాకుఁ
హయమేధరాజసూ♦యము లనఁ బేర్పడ్డ, సవనతంత్రంబు లుం♦కువలు మాకుఁ
గనకనగసీమఁ గల్పవృ♦క్షములనీడఁ, బచ్చరాచట్టుగమి రచ్చ♦పట్టు మాకుఁ
బద్మసంభవవైకుంఠ♦భర్గసభలు,సాముగరిడీలు మాకు గో♦త్రామరేంద్ర. మను.

ఉ. వానిఁ బ్రశంససేయఁ దగు♦వాఁడు కృతార్థతముండు వానిచే
నీనిఖిలంబు పావన మ♦హీనకృపావిభవం బెలర్పనె
వ్వానిగృహాంగణంబునకు ♦ వచ్చినత్రోవరజంబులందు నీ
మానితపాదయుగ్మక మ♦మర్చుఁ బ్రఫుల్లసరోజధామమున్. శృంగా.

ఉ. వానిది భాగ్యవైభవము ♦ వానిది పుణ్యవిశేష మెన్నయిన్
వానిదవంధ్యజీవనము ♦ వానిదె జన్మము వేఱు సేయకె
వ్వానిగృహాంతరంబున భ♦వాదృశయోగిజనంబు పావన
స్నానవిధాన్నపానముల ♦ సంతస మందుచుఁ బోవు నిచ్చలున్. మను.

సీ. త్ర్యంబకాచలకన్య♦కాంబుపూరంబున, నఘమర్షణస్నాన ♦ మాచరించి. కాశీఖండము.
సీ. సచ్ఛాత్రుఁ డగుచు ని♦చ్చలు నేఁగి యయ్యేట, నఘమర్షణస్నాన ♦ మాచరించి. మనుచరిత్ర.
సీ నిద్ద మైనమడుంగు♦నీర్కావిదోవతిఁ, గనకమేఖలతోడఁ ♦ గటి ఘటించి. కాశీ.
సీ. సరిలేనిరాకట్టు♦జాళువామొలకట్టు, బెడఁగారునీర్కావి♦పింజెతోడ మను.
సీ డాకాలిగండపెం♦డేరంబుదాపున, బొమ్మలై వైరిభూ♦భుజులు వ్రేల. కాశీ.
సీ. కనుబంతనిఖిలరా♦ణ్ణికరంబుఁ గరణమం, జీరంబుసాలభం♦జికలఁజేసె. మను.

ఇట్టివి పెక్కులు చూపవచ్చును ఈమహాకవికవనము ప్రౌఢము ‘అల్లసానివాని యల్లికబిగియును’ అనువాక్యమే యీకవిగుంభనములు గుత్తములై గొనబుసూపుట తెలుపుచున్నది. ఆయాపాత్రముల స్వభావరూపగుణాదులను నయ్యెయెడల వానిబీజరూపములకు మిక్కిలి యనురూపముగాను నత్యంత సైజముగాను నిరూపించుటయందును, నాయారసమునకుఁ బొసఁగునట్లుగా వానిని స్థూలసూక్ష్మాకారముల నొందించుటయందును, నాయాప్రసంగవిశేషములవలన వాని నపూర్వశోభాకలితములుగా వెలయించి లోనిమర్మములవెలిపుచ్చి పాత్రాకారముఁ బూర్ణముగాఁ బ్రకాశింపఁజేయుటయందును నీకవి యసమానుఁడు. దీనింబట్టి యితనికి మానవస్వభావమర్మములం దతిగాఢప్రవేశముకలిమిఁ దెలియుచున్నది. ప్రవరవరూథినీసంవాదమునఁ బరస్పరవిరుద్ధములగు శాంతశృంగారరసములకు నొండొంటికి మిగులు

పోలాటఁ గల్పించి యీ రెంటిస్వరూపములను మిక్కిలిస్ఫుటముగా వెలయించినాఁడు. ఆశ్రోత్రియునిదృఢనైష్ఠికత్వమూలమగు విజ్ఞానమును, ఆశృంగారనాయిక కామోద్రేకమువలని మోహమును, పరస్పరసంఘర్షణముచే మిక్కిలియుఁ బ్రకాశితములైనవి. వరూథిని పయిపాటునఁ గౌఁగిలించుట శృంగారరసంపునెల్ల. ప్రవరుఁడు జవాదిగదంబించునోడలుగడిగికొనుట శాంతరసంపు వెల్లి. మఱియుఁ బ్రవరుని శాంతరసము వరూథినికి విసపువిత్తగునట్లు గడుసుగానుండినను గూరిమిసోమిదమ్మయెడఁ గొంత శృంగారరసముతో సంకరముగలిగి పొంకముగానున్నది మనోరమ చెప్పిన 'బూచివోలెనున్న వాచంయముని'యందో యది 'తిమిరంపు వయసుగుబ్బలకోమలాం'లని తెలిపియు దానిని దిట్టి కొట్టునట్లుగావించి తాను మిట్టిపడినది. పుంజికస్థలను జూచి 'యనంగగ్లాని' పడినపారర్షియందో యది యాతని 'తపమంతయుఁ బొలివోవఁగఁ' దాను భంగము నొందినది. 'ముసపుకోనుజరభరంబున నసురుసురైయున్న' వాచంయమునియం దారసము కోపరసముచేఁ దూలె 'మూఁడుగాళ్లముసలి'యగు పారర్షియం దదిశృంగారరసముచేత బ్రుంగుడుపడియె. ఇట్టిముదుకముదుసళ్లయందును నదివిరుద్ధమగు మిశ్రణమునొంది యుండఁగా నట్టిలేఁబ్రాయపుగోవాళ్లయం దది విహితమగు సంకరమునొంది సార్థకమైనది 'తపమంతయుఁ బొలివోవుట' యీమిశ్రణమునకు ఫలము. 'పవనజవనంబున నిజమందిరంబున కరిగి నిత్యకృత్యసత్కర్మకలాపంబులు నిర్వర్తించుట' యీసంకరము ప్రభావము. 'నాగబెత్తముగొని యదయుఁడై కొట్టిన' వగ్గుతపసికన్నను, 'బ్రోవవే నన్నుచుక్కఁ జెయ్యివట్టిన' ముదియతికన్నను, 'హా శ్రీహరీ యని పొమ్మంచుఁ ద్రోసిన' ప్రాయపుగృహస్థే మేలు. వయస్సు ముదిరినంతనే రాగద్వేషములు ముదురవు ప్రవరునికి నొకప్రాయమే కాదు, ప్రత్యేక మసర్థదాయకములైన రూపము సిరి, కులము, విద్యయుఁ గలిగియున్నవి. శృంగారరసంపుఁజవియుఁ గూరిమిసోమిదమ్మ తెలిపియున్నది. మీఁదుమిక్కిలి యొకదేవవేశ్య 'తనంతఁ దా వలచి వచ్చినది'. మిక్కిలిబలవత్తరములైన యిట్టిమోహపరికరము లన్నియుండియు నణుమాత్రమేని చిత్తము కలంగనియాధీరశ్రోత్రియుపాలిసొమ్మే గదా శాంతరసము! స్వరోచియందు శృంగారరసము సర్వాధిపత్యమువహించి శాంతిరసమును గాలూఁదనిచ్చినదిగాదు. చక్రవాకిపలుకులు బహ్వాసక్తివలని రసాభాసమునెత్తిదూఱియు 'తలవాంచియుస్సురనుటే' కాని 'తమకమువూనరాదు' హంసమిథునసంవాదము శాంతిరసమును నూరిపోసియు 'వీరలతోడిసంగమిఁక వీడెదనంచుఁ దలంచుటే' కాని 'దుర్వారములైనకోరికలవంక వివేకముచొప్ప దక్క'నది గాదు. ఈయంకువపుఁబోటు లోపదపులేసుఁగును గుదియింప వయ్యె. మార్కండేయపురాణమున హంససంవాదము విన్నపిదప స్వరోచి విరక్తుఁడై యడవికిఁ దపంబు సేయఁ బోయినాఁడని యున్నది. శృంగారరసార్ణవంబునంబడి తెప్పలఁదేలి తూలి దరిజేరి దృఢవైరాగ్యప్రవృత్తికిం బూనినవానికి మగుడ వనదేవతాసంగతిరూపమగు శృంగారరసావృత్తి గూర్చుటగాని, యీసంగతికి వలయు శృంగారరసపౌష్కల్యముఁ గుదుర్చుటగాని, యొప్పిదము గానేరదని తలఁచి కవి స్వరోచిని నడవికిఁ దపము సేయుటకుఁ గాక వేఁటాడుటకే పంపినాఁడు. రుచివైశిష్ట్యముచేఁ గలిగిన యీమాఱుపాటును రమణీయముగానే యున్నది. కావున స్వరోచియందు శృంగారరసము శాంతిరసము నడంచి మించి యున్నను నది కేవలముగానుండక వీరకరుణహారసములతోఁ బొంకముగా సంకరముగలిగి రాక్షసరూపుఁడగు నిందీవరాక్షుని గెలిచిన కీర్తిని, మనోరమాదుల బాధ లుడిపినసుకృతమును, గలిగించినది. కళావతిని గామించినదేవాపియందో యది రౌద్రబీభత్సరసములతోఁగూడి కళావతితండ్రియగు పారర్షి పుత్త్రుకను గోయించి వానిని బ్రహ్మహత్యపాలు గావించినది. తమ నేర్చినవిద్యను నడిగినవారికెల్లఁ జెప్పరాదనునభిమానాతిశయమును నాయుర్వేదగురుఁడగు బ్రహ్మదత్తునియందును, దమకన్నకూఁతును దక్కువవారికియ్యరాదను నాభిజాత్యగర్వమును గళావతిపితయగు పారర్షియందును, మాయలు పన్ని పెద్దల నవమానించుటవలని ఫలము నిందీవరాక్షునియందును,

గల్గి తత్తదుచితభాషావిశేషముతోను, దదితరపరికరసామగ్రితోను, గడునిపుణముగా నిరూపించి నాఁడు. ప్రవరుఁడు కామ్యకర్మఫల మగుస్వర్గమును గోరక నిష్కామత్వఫలిత మగు మోక్షమునుగూర్చి గార్హస్థ్యమును జరుపుటను గవి దెలిపినాఁడు. దీనిచే,ఫలాపేక్షారహితమగు శాస్త్రవిహితకర్మానుష్ఠానము మోక్షసాధనము నగునను విశిష్టాద్వైతసిద్ధాంతము నాశఠకోపయతిశిష్యుఁడు ప్రతిపాదించినాఁడు. స్వారోచివలె శృంగారరసైకమగ్నుఁడుగాక, వాచంయమునివోలె కోపావేశమునను బారర్షివలెఁ గామపారవశ్యమునను బ్రతమునుఁ జెఱుపుకొనక, నిష్కామ మగునిష్ఠగలిగి యైహికసుఖము ననుభవించుచు నాముష్మికసామ్రాజ్యమునకుఁ బాత్రుం డైనప్రవరుఁడే యిందలి పురుషపాత్రములం దెల్ల నుత్తముఁడు.

స్త్రీపాత్రములలో వరూథిని శృంగారరసాలవాలము. పురుషులను వశ్యలఁ గావించుకొనుటకు వేశ్యలు పచరించు కులుకుబెళుకులును, గరువంపుమురువులును, మాటనెఱనీటులును నిందుఁ జూడవచ్చును. కాముకురాండ్ర చిట్టకంపుఁజదురులును, దిట్టతనంపుఁజేయువులును, మిట్టవేదాంతములునుగూడఁ జూపట్టును. వరూథిని తనవలపుకాని నోడఁబలుచుచుఁ దోడిచెలులను దగ్గఱకు రాకుండ 'జంకెనలవారించినది' మనోరమ తనచెలువుని కౌఁగిలియందుండియు 'నెచ్చెలులదశ మాన్పకున్న నాకేకూడిసౌఖ్య' మన్నది. అదియ స్వప్రయోజనైకపరమగు చాపల్యము. ఇదియ పరహితైకాసక్తమగు సౌహార్దము. మనోరమతండ్రి యగు నిందీవరాక్షుఁడు వానిని స్వరోచికిచ్చెద నన్నప్పుడే యాలలన తనచెలులమాట స్వరోచికిఁ జెప్పెనని మార్కండేయపురాణమునన్నది ఇందీవరాక్షుఁడు స్వరోచితోఁ దనకూఁతు నిచ్చెద నన్నప్పుడు మనోరమ యించుమించుగాఁ బెండ్లికూఁతురే యైనది గావున నెంతయు స్వరోచియెడ లజ్జఁబొందియుండును. అట్టియెడ,నది తండ్రియెదురఁ దనవరునితోఁ జెలులనుగుఱించి మాటలాడెననుట యొప్పదనితలఁచి పెద్దన యాసంభాషణమును మరలవారిరువురును దొలుదొలుత మాటాడికొను ప్రథమసంగమము నాఁటికిఁ బెట్టినాఁడు. ఇదియౌచిత్యమునకు మిక్కిలియనుగుణముగానున్నది. మనోరమయె స్త్రీపాత్రములం దెల్లఁ గీర్తనీయురాలు

ఈకవిస్వభావోక్తులు మిక్కిలిసుభగములు. వేఁటలాడుటను వర్ణించుటఁ జూడఁగా నితఁడు గన్నాఁకఁజూచి వ్రాసినవాఁడని తెలియుచున్నది. చక్కనిలోకోక్తులును జాతీయములును నీతనికవనంబున కందంద కొమరు గూర్చుచుండును. 'ముల్లువుచ్చికొఱ్ఱడిచినచందము' 'గుండ్రాడాఁ దినఁ బెండ్లియేమిటికిఁజిక్కెను' 'కంటనువత్తిబెట్టికొని' 'రెంటికిం జెడినరేవఁడు' 'వేళ్లఁగొల్చుగ విఱ్ఱవీఁగిపండె' 'రాకుండనో కండువచ్చి మఱియొండునె' అని పెక్కులు గాన్పించుచున్నవి. ప్రౌఢములగు పెక్కువర్ణనములును గల్పనలును గావించి యీకవి యాంధ్రభాషాలలనకు విలాసప్రౌఢిఁ గూర్చినాఁడు. తొలుదొలుత నన్యభాషాపదములను

సీ. 'పచ్చనిహుంరుమంజి పనివాగెపక్కెర, పారసీపల్లంబు పట్టమయము
రాణ నొప్పారుపై రాణంపుసింగిణి, తళుకులకోరుల తరకసంబు
మిహిపసిండిపరుంజా మొహదా కెలంకుల, రావుగుజ్జరిసేత కేవడంబు
డాకెలంకున సిరా జీకరాచురకత్తి, కుఱుఁగటఁ గ్రొవ్వాడి గొగికలపాది

అని తెనుఁగునం దీకవియే చేర్చినవాఁడు. ఇతనింజూచి పిమ్మటికవులును వానిని బ్రయోగింపఁజొచ్చిరి. భాషావిస్తృతి కావశ్యకములగు నిట్టిప్రయోగములు సామాన్యకవులకుఁ జేయ సాహసము పుట్టదు గాని కవియు సార్వభౌముండు నగు ప్రభువుప్రాపున నున్న పెద్దన కవిచెల్లె ఇటు లీవలిప్రబంధరచనముల కెల్ల మార్గదర్శియైన మనచరిత్రముం రచించి యీకవిశిరోమణి యశఃకాయుం డై యున్నవాఁడు.

ఇమ్మహాకవిరచనలను బెక్కండ్రు పిమ్మటికవు లనుసరించియున్నారు.

శా. శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ జెన్నొందఁ విశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీతిన్ నిల్పినాఁడో యనన్ — మను.

శా. శ్రీవృత్తస్తననిస్తులైణమదసంసిక్తం బురోవీథి బా
గై విన్నాణపుఁబుట్టుమచ్చ రవికన్యాసన్న విశ్వంభరా
దేవీవిభ్రమలక్ష్మిఁ దేటపఱుపన్. — పంచతంత్రము.

మ. ... ... ... ... ... ... రతిరాంతాంగనానేత్రకో
ణనికాయంబుల డాఁచి తద్ధవళిమందాఁ బూనెనో చొప్పమూ
ర్ప ననన్ వెల్వెలఁబాఱె దీపకలికాప్రాతంబు. — మను.

శా. నానాదీపమరీచికల్ గొనియెనో నాఁ జూడ నిద్రాపరా
చీనస్త్రీనయనంబులుం జపాసుమముఁ జెన్నారెన్ నిశాంతంబునన్. — పంచతంత్ర.

మ. సకలాశాగతినర్మకోపవిరతిక్రౌత్క్రియారంభణా
త్మకవర్గత్రయికిన్ . .. . . బల్లెలం
గ్రుకవాకుల్ మొరసెం గృహోపరిఁ ద్రిభంగిన్ భుగ్నకంఠధ్వనిన్

మ. తొలి దేవేంద్రుఁడు మాపులంబుఁ జొరలేఁదో మేము నార్మోమురా
యలయంకస్థితిఁ గాంచ లేదొ స్వరవిద్యల్ మున్ను మావారిశి
ఖులచేఁ బాణిని నేర్వఁడో యని కులస్థానప్రతిష్ఠల్ ద్రిభం
గుల ఘోషించెను నాఁగఁ గోళ్లు గలయం గూసెన్ ధరామండలిన్ — తారాశశాంక.

మఱియు నిట్టివి పెక్కులు గనుపట్టెడిని. ఇందుఁ బ్రక్షిప్తములును గొన్ని గానిపించుచున్నవి. ఆఱవయాశ్వాసమున నింద్రుఁడు పుంజికస్థలను బారఱితపోభంగమునకై పంపుఘట్టమునఁ గల ౨౮ వపద్యమును బ్రక్షిప్తము. ఏలన నిందుఁగల

.. .. .. .. ... 'అమ్మునిపాలికి వచ్చె వేల్పుఁదొ
య్యాలినసుసానఁ బట్టినయనంగుని మోహనబాణమో యనన్'.

అనునదియే మీఁద ౩౧ వపద్యమున

... ... ... ... ... 'ప్రతికిం బొడకట్టె వేల్పుఁదొ
య్యాలి చిఱుసానఁ బట్టినయనంగుని మోహనబాణమో యనన్'.

అనియున్నది ఈరెంటను నుపమానవాక్యమొకటియె 'అమ్మునిపాలికివచ్చె'ననుటయు, 'ప్రతికిం బొడకట్టె' ననుటయు నించుమించుగా సమానార్థకములే. ఈపౌనరుక్త్య మావశ్యకము గాదు కానఁ నీరెంటిలో నొకటి ప్రక్షిప్తకము గానోపు అయినను ౩౧ వపద్యమునందలి 'పొడకట్టె' ననుక్రియ యవ్యవహితముగా ౩౨ వ పద్యమునందును 'అత్తెఱంగునఁ ... ... బొడకట్టె' యని ప్రయోగింపఁబడి యుండుటయే ౩౧ వ పద్యము కవికృత మని చాటుచున్నది. మఱియుఁ బారఱితపమును జెఱుచుటకు సాధనములుగా పుంజికస్థల యనునాలంబనవిభావమును వసంతగ్రుసమాగమమను నుద్దీపనవిభావమును జెప్పఁ బడినవి. ఈరెండువిభావములను రూపించి రసోద్దీపనసామగ్రిని సవరించి పిదప వేల్పుఁదొయ్యాలిని 'అనంగుని మోహనబాణమో యనన్' ప్రతికిఁ బొడకట్టినట్లు సేయుట మిక్కిలి సరసమును మఱింత కార్యసిద్ధికరము నగును. కాని, మొదట నాలంబనమును జెప్పి, యావేల్పుఁదొయ్యాలిని ౨౮ వ పద్యమున నే 'మునిపాలికి వచ్చె' నట్లు సేసి, పిదప నుద్దీపనమును జెప్పి, మరల నావేల్పుఁ దొయ్యాలిని ప్రతికిఁ బొడ

కట్టునట్లు సేయుట సరసము గాదు. ఈకారణములం బట్టి అరవపద్య మనవసరముగా నుండుటచేఁ బ్రక్షిప్తము గాకతప్పదు.

సిద్ధుఁడు కుతపకాలమునందు వచ్చెననుటచే నొకసందర్భవిరోధము కానిపించుచున్నది. కుతప మనఁగా పగటి పదియేనుముహూర్తములలో నెనిమిదవముహూర్తము. అనఁగాఁ బగటిపదియేనవ పదియాఱవగడియలు. అప్పుడు వచ్చినవాఁడే యతిథియగును గాన సిద్ధుఁ డావేళకు వచ్చె నని కవి చెప్పినాఁడు. ప్రవరుఁ డాసిద్ధుని నిష్టమృష్టాన్నకలన సంతుష్టుఁ జేసి తీర్థయాత్రాప్రసంగములు జరిపి ముగించునంతకు మధ్యాహ్నము చాలఁ గడచిపోయి యుండును. పిదప వాఁడు పాదలేపమును బూసికొని హిమవంతమునకుఁ బోయి యందలివేడుకలు సూచుచుఁ గొంత ప్రొద్దుపుచ్చిన వెనుక

‘నళినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకం
దళచూత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముం దెల్పెడిన్’

అన్నాఁడు. మధ్యాహ్నము చాలఁ గడచినవెనుకఁ గొండకుఁ బోయి యచ్చటను మఱికొంత ప్రొద్దుపుచ్చి కడపట మధ్యాహ్నమే యైన దనుట యసంగతము. అయినను మార్కండేయపురాణమునం దీయంశమును బరిశీలింపఁగా నీవిరోధమునకు సరియైన పరిహారమొకటి కనుపట్టుచున్నది. అందుఁ బ్రవరుఁడు ‘సహస్రయోజనానాంహి దినార్ధేన వ్రజామియత్ । ఆయాస్యామి సంచిన్త్య తదర్ధేనాపరేణహి’ ఒకదినార్ధమున (ఒకపూఁట) సహస్రయోజనములుపోయి యపరదినార్ధమున (రెండవపూఁట)కుఁ దిరిగివచ్చెదనని తలఁచి పాదలేపమునుబూసికొని పోయినాఁడు. మారనయు ‘నరుఁ డేఁగు యోజనసహస్రము సాఁబగలింటిలోపలన్’ అనిచెప్పినాఁడు. సిద్ధునికిఁ బూజలుసలిపి వానితో సంభాషించునప్పుడు రెండవపూఁటయగును గాన నపుడు ప్రవరుఁడు వెళ్లియుండఁడు. తీర్థయాత్రాప్రసంగములచే సిద్ధునితో నారాత్రిగడపి మఱునాఁడు దాననుకొన్నట్లు మొదటిపూఁటనే కొండకుఁ బోయినాఁడు. అందలివేడుకలు చూచునంతకు మధ్యాహ్నమయ్యె. నాఁటిరెండవపూఁటనే మరలి రాఁదలఁచుకొన్నవాఁడు గావునఁ బాదలేపము కరఁగిపోవుటచే నట్లు రా నశక్యమయ్యె. పిదప నగ్నిదేవునిప్రసాదమున నాఁడే యిలుసేరి నిత్యకర్మకలాపములు నిర్వర్తించినాఁడు. కథనిట్లు గ్రహించుటయే మూలానుగుణముగా నున్నది. కథయిట్టిదని పెద్దన యీతనప్రబంధమున సువ్యక్తముగాఁ దెలుపకపోయినను దాని నిల్లే మనసున నుంచుకొని దీనిని రచించినవాఁడు గావున ‘మధ్యాహ్నముం దెల్పెడిన్’ నన్నాఁడు. ఇట్లుగాక సిద్ధుఁడు వచ్చిననాఁడే ప్రవరుఁడు పాదలేపమును బూయించుకొని యారెండవపూఁటనే కొండకుఁబోయినాఁడని మనుచరిత్రమాత్రపరిశీలనమున గ్రహించినయెడల నిది మూలవిరుద్ధమగుటయే కాక నీప్రబంధమునకుఁ గళంకాపాదకము నగుటం జేసి యనుపపన్న మగుచున్నది.

ఈప్రబంధమునకు ‘స్వారోచిషమనుసంభవ’ మనుటయే యర్థనామమని శ్రీ-కోపల్లి- వేంకటరమణరావుగారు నిరూపించినకారణముల నిందు వ్రాసియున్నవాఁడ. శ్రీనాథునిరచనలవంటివి యిందును గలవని బ్రహ్మశ్రీ-కం-వీరేశలింగము పంతులవారెత్తి చూపినపద్యములను గొన్నింటిని నేనుదాహరించిన పద్యములతోఁ గూడ నిందుఁ బొందుపఱిచియున్నవాఁడ. సిద్ధుఁడు కుతపకాలమునవచ్చెననుట సంగతమే యని రాజశ్రీ-బోడపాటి-రాజన్నపంతులుగారు చేసినసిద్ధాంతమును నిందు నిరూపించినాఁడను. కావున వారికెల్లను గృతజ్ఞతాపూర్వకములగు వందనము లర్పించుచున్నాఁడ.

తం. తేపి పెరుమాళ్ళయ్య.



శ్రీ

# స్వారోచిషమనుచరిత్రము

## సటీకము



### ప్రథమాశ్వాసము.

వక్షోజకురంగనాభ మెదపైఁ జెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీతిన్ నిల్పినాఁడో యనం
గా వందారుసనందనాదినిజభక్తశ్రేణికిం దోఁచురా
జీవాక్షుండు గృతార్థుఁ జేయు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్. 1

పెద్దనార్యుఁ డీకావ్యమును గృష్ణరాయల కంకితముగా రచించువాఁడై 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే' అనుప్రమాణముం బట్టియు, శిష్టపరంపరాగతమైన యాచారముంబట్టియు, విఘ్నములు దొలంగి యిది పయింబయిఁ బుష్టినొందుటకును, దొలుత మంగళ మాచరింపఁ బూని, యదియు 'ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్' (కావ్యారంభము ఆశీర్వాదమైనను నమస్కారమైనను వస్తునిర్దేశమైనను గావచ్చును) అని మూఁడువిధము లగుటంజేసి యం దాశీర్వాదరూపమైన మంగళమును శిష్యశిక్షార్థము గ్రంథరూపముగా నీపద్యముచే రచించెను.

అర్థము. శ్రీవక్షోజకురంగనాభము-శ్రీ=లక్ష్మీదేవియొక్క, వక్షోజ=స్తనములయందలి, కురంగనాభము=కస్తూరి-నాభిశబ్దము సమాసాంతమగు నేని అకారాంతమగును, ఎదపైన్=ఱొమ్ముమీఁద, చెన్నొందన్=ఒప్పుచుండఁగా, విశ్వంభరాదేవిన్=భూదేవిని, తత్కమలాసమీపమునన్=ఆలక్ష్మీదేవిదగ్గఱ, ప్రీతిన్=ప్రేమచేత, నిల్పినాఁడో=ఉంచుకొన్నాఁడో, అనంగాన్=అనునట్లు, వందారు. శ్రేణికిన్-వందారు=మ్రొక్కుచున్న, సనందన=సనందనుఁడు, ఆది=మొదలుగాఁగల, నిజ=తనవారైన, భక్త=భక్తులయొక్క, శ్రేణికిన్=సమూహమునకు, తోఁచు=అగపడునట్టి, రాజీవాక్షుండు = కమలములవంటి కన్నులుగల విష్ణువు, శుభదృష్టిన్=మంగళకరమైన చూపుచేత, కృష్ణరాయాధిపున్=కృష్ణరాయప్రభువును, కృతార్థున్ = చేయఁబడిన ప్రయోజనముగలవానిఁగా-ఇష్టసిద్ధిగలవానిఁగా ననుట, చేయున్=చేయునుగాక.

తా॥ లక్ష్మీదేవిని గౌఁగిలించుకొన్నప్పు డామె స్తనములందలి కస్తూరి విష్ణువుఱొమ్మునపయి నంటుకొని భూమివలె నల్లగా నగపడుటవలన, విష్ణువు తనఱొమ్మునందు లక్ష్మీదేవితోడ భూదేవినిగూడఁ బ్రీతిచే నుంచుకొన్నాఁడో యన్నట్లు, ఆదేవునకు నమస్కరించునట్టిసనకాదిభక్తులకుఁ దోఁచెను. అట్టివిష్ణు వీకృతిపతి యయినకృష్ణదేవరాయని శుభవీక్షణమునఁ జూచి ధన్యునిం జేయుఁగాక యని తాత్పర్యము.

పద్యము మొదట శ్రీశబ్దమును మగణమును బ్రయోగించుట మంగళకరంబు కవి తనకును, గృతిపతికిని, జదువువారికిని బరమాభ్యుదయము గలుగుటకై లక్ష్మీదేవ్యాలింగనోత్తరకాలరూపమైన విష్ణుదేవుని

వర్ధమానందసమయ మనుసంధించెను. విష్ణువునందు లక్ష్మీపతిత్వముగాక భూపతిత్వమును స్ఫురింపఁజేయు టవలన 'నావిష్ణుః పృథివీపతిః' అనువచనముచొప్పున భూపతియయినకృతిపతి విష్ణ్వంశసంభూతుఁ డగుట వ్యంజితమగుచున్నది. ఎవ్వనికేది సమృద్ధముగాఁగలదో యదియ వానివలనఁ గోరఁబడును గావున లక్ష్మిని భూమినిం దాల్చినవిష్ణుదేవుండు కృష్ణరాయలకు లక్ష్మీభూముల సమృద్ధముగా నిచ్చుఁగాక యని కవిహృదయము. లక్ష్మీదేవిని గౌఁగిలించుటచే నంటినకస్తురిని ప్రియాలింగనసంక్రాంతముగాఁ గ్రహింపఁ జాలమియు, విష్ణుభార్యాంతరమగు భూమి గాభ్రమించుటయు, నిత్యబ్రహ్మచర్య ధుర్యులగు సనందనాదులయందు వర్ణించుట మిక్కిలియు నొప్పిదము. రాజీవాక్షుఁడనుట, శుభదృష్టిపాతమున కత్యంత శోభావహము కరుణారస సముత్ఫుల్ల సుందరనయనారవిందుఁడై కటాక్షించుఁగాక యని యాశయము.

ఇందు కస్తూరియందు భూభ్రాంతిగలుగుటను వర్ణించుటవలన భ్రాంతిమదలంకారము. భూమిని లక్ష్మీదేవితోఁగూడ నిల్పినట్లు సంభావించుటవలన వస్తూత్ప్రేక్ష. రెంటికిని సంకరము.

ఉ. ఉల్లమునందు నక్కటికమూనుట మాకులమందుఁ గంటి మం
చల్లన మేల మాడునచలాత్మజమాటకు లేఁతనవ్వు సం
ధిల్లఁ గిరీటిఁ బాశుపతదివ్యశరాఢ్యునిఁ జేయుశాంబరీ
భిల్లుఁడు కృష్ణరాయల కభీష్టశుభప్రతిపాది గావుతన్. 2

అ. ఉల్లమునందున్ = మనస్సునందు, అక్కటికము = కనికరమును, ఊనుటన్ = పొందుటను, మాకులమందున్ = మాజాతియందు, కంటిమి = చూచితిమి, అంచున్ = అనుచు, అల్లనన్ = మెల్లగా - నేర్పుతోననుట, (ఈశబ్దము మందస్మితసిద్ధికిఁ గడుం బోషకముగానున్నది.), మేల మాడునచలాత్మజ మాటకున్ - మేలము=కోడిగపుమాటలు, ఆడు=చెప్పునట్టి, అచలాత్మజ=పార్వతియొక్క, మాటకున్ = పలుకునకు, లేఁతనవ్వు=చిఱునగవు, సంధిల్లన్=కూడుకొనఁగా, కిరీటిన్=అర్జునుని, పాశుపతదివ్యశ రాఢ్యునిన్ - పాశుపత = పశుపతి యగునీశ్వరునిసంబంధించిన దగుటచేఁ బాశుపత మను పేరుగల, దివ్యశర=దివ్యాస్త్రముచేత, ఆఢ్యునిన్ = సంపన్నునిగా - ఆ దివ్యాస్త్రముకలవానినిగా ననుట, చేయు శాంబరీభిల్లుడు = చేయునట్టిమాయాకిరాతుఁడు - మాయచే బోయవానివేషము దాల్చినశివుఁ డనుట, కృష్ణరాయలకున్ = కృష్ణదేవరాయలకు, అభీష్టశుభప్రతిపాది = కోరఁబడిన మంగళములను బొందించువాఁడు, కావుతన్ = అగుఁగాక.

తా. పాశుపతాస్త్రముకై తపస్సు చేయుచున్నయర్జునుని ననుగ్రహింపఁ దాను గిరాత రూపముతోఁ బొడసూపి, క్రీడార్థ మాతనితోఁ బోరునపుడు, తా నతని జయింప సమర్థుండయ్యును, గారుణ్యంబున నతనిచే జయింపఁబడినట్లు అభినయింపఁగా, నవ్వు డాకరుణను బార్వతిచూచి, 'కనికర మెంతమాత్రమును లేనిమాబోయజాతియందుఁ గనికరముదాల్చుట గనబడినది. ఇదేమివింత' అని కోడిగము సేయఁగాఁ జిఱునవ్వునవ్వుచు, నర్జునునకుఁ బాశుపతాస్త్రమునిచ్చి యనుగ్రహించిన మాయాకిరాతుం డగు శివుఁడు కృష్ణదేవరాయలయభీష్టముల నెఱవేర్చుఁగాక.

కటికికిరాతుండయ్యు నక్కటికమూనినాఁ డనుటచే దయాసముద్రుఁడనియుఁ, బాశుపతాస్త్ర మొసంగినాఁ డనుటచే దానశౌండుఁడనియు సూచితమగుచున్నది. ఇట్లు దయానిధియై పాశుపతాస్త్ర మంతటివి దానినొసంగినట్టివాఁడు కృష్ణరాయల యభీష్టముల నొడఁగూర్చుననుట చెప్పనేల యని భావము. నిష్కరుణమగు బోయజాతియందుఁ గరుణపుట్టుట యను విరూపకార్యోత్పత్తిచే నిందు విషమాలంకారము

ఉ. నాలుగుమోములన్ నిగమనాదము లుప్పతిలం బ్రచండవా
తూలహతిం జనించురొదతోడిగుహావళి నొప్పుమేరువుం
బోలెఁ బయోజపీఠి మునిముఖ్యులు గొల్వఁగ వాణిఁ గూడి పే
రోలగ మున్నధాత విభవోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్. 3

అ. నాలుగుమోములన్ = నాలుగుముఖములందును, నిగమనాదములు = వేదములధ్వనులు, ఉప్పతిలన్ = పుట్టుచుండఁగా, ప్రచండవాతూలహతిన్ - ప్రచండ = మిక్కిలిపెడగల, వాతూల= వాయుసమూహముయొక్క, హతిన్ = అధికమయినతాఁకుడుచేత, జనించురొదతోడిగుహావళిన్ - జనించు=పుట్టునట్టి, రొదతోడి = ధ్వనితోఁగూడిన, గుహావళిన్ = కొండగవులవరుసచేత, ఒప్పుమేరువుంబోలెన్ = ప్రకాశించునట్టిమేరుపర్వతమువలె, పయోజపీఠిన్ = కమలాసనమునందు, మునిముఖ్యులు = మునిశ్రేష్ఠులు, కొల్వఁగన్ = సేవింపఁగా, వాణిన్ = సరస్వతిని, కూడి = పొంది, పేరోలగము = పెద్దకొలువునందు, ఉన్నధాత = ఉన్నట్టిబ్రహ్మ, కృష్ణరాయనిన్ = కృష్ణదేవరాయలను, విభవోజ్జ్వలున్ = సంపదచేఁ బ్రకాశించువానినిగా, చేయుతన్ = చేయునుగాక.

తా. వేదధ్వని గలనాలుగుముఖములతోఁ గూడినతాను పెనుగాలిగొట్టుటచేఁ బ్రతిధ్వనిగలిగి మ్రోఁగు గుహలతోఁ గూడినమేరుపర్వతమువలె నొప్పుచు సరస్వతీసమేతుఁడై పద్మాసనంబునందుఁ గూర్చుండి మహర్షులు సేవింపఁగాఁ బెద్దకొలువుతీరియున్న బ్రహ్మదేవుఁడు కృష్ణదేవరాయలకు నైశ్వర్యాభివృద్ధి కలుగఁజేయుఁగాక.

ఇచట మేరువునకును బ్రహ్మకును, మోములకును గుహలకును, వేదధ్వనికిని వాతధ్వనికిని, ఉపమానోపమేయభావముంబట్టి యలంకార ముపమ. బ్రహ్మయందు 'నాలుగుమోములన్ నిగమనాదము లుప్పతిలన్' అనుటచే విద్యాసమృద్ధి చెప్పఁబడినది ఆ నిగమనాదములకు మహావాయువుచే మేరుగుహలయందుఁ గలుగుధ్వని యుపమానముగాఁ జెప్పుటవలన, ఆ విద్యాసమృద్ధి యనర్గళమయినదని సూచింపఁబడినది 'మేరువుంబోలె' ననుటచే దానిస్థైర్యమును ధైర్యమును గాంచినసమృద్ధియు సూచితములైనవి. 'పయోజపీఠిన్' అని తామరపయిఁ గూర్చుండుటను జెప్పుటచే నతిమృదుల సుఖాసనసమృద్ధి సూచింపఁబడినది 'మునిముఖ్యులు గొల్వఁగ' అని నిగ్రహానుగ్రహసమర్థు లగుమహర్షులచే సేవింపఁబడునట్లు వచించుటచే సర్వాతిశాయిమహిమ తెలుపఁబడినది. 'వాణిఁగూడి' యనుటచే సర్వదేవదుర్లభమయిన భోగము సూచితమైనది. 'పేరోలగమున్న' అనుటచే ప్రభుత్వవైభవము చెప్పఁబడినది. ఇట్లు సర్వవిధవిభవములుగల బ్రహ్మయె కృష్ణరాయలకు సర్వవిభవముల నీయఁ గలవాఁడని భావము. అలంకారము ఉపమ.

ఉ. అంకముఁ జేరి శైలతనయాస్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున నవ్వలిచన్గబళింపఁ బోయి యా
వంకఁ గుచంబు గాన కహివల్లభహారముఁ గాంచి వేమృణా
ళాంకురశంక నంటెడుగజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్. 4

అ. అంకమున్ = ఒడిని-ఒడిలోననుట, చేరి = చేరుకొని-కూర్చుండి, శైలతనయాస్తనదుగ్ధములు = పార్వతియొక్కచనుఁబాలను, ఆనువేళన్ = త్రాగునప్పుడు, బాల్యాంకవిచేష్టన్ = పసితనపుగుఱుతైనవిశేషచేష్టచేత, తొండమునన్ = తొండముతో, అవ్వలిచన్ = మఱియొకప్రక్కదైన

చంటిని, కబళింపఁబోయి = పట్టుకొనఁబోయి - బిడ్డలు స్తన్యపానము చేయునప్పుడు త్రాగుచున్న చన్ను నోటనుండఁగా రెండవచంటిని జేతులతోఁ బుణుకుట స్వాభావికచేష్ట గనుక కబళింపన్ అనఁగా మ్రింగఁగా ననియర్థమైనను ఇచటఁ బట్టుకొనఁగా నని చెప్పుట యుక్తము, అవంకన్ = ఆప్రక్కను, కుచంబున్ = స్తనమును, కానక = పొడగనక, అహివల్లభహారమున్ = సర్పరాజరూపమైనదండను, కాంచి = చూచి, వే = శీఘ్రముగా, మృణాళాంకురశంకన్ = లేఁతతామరతూఁడ నెడిభ్రాంతిచేత, అంటెడుగజాస్యునిన్ = తాఁకునట్టి యేనుఁగుమొగముగల విఘ్నేశ్వరుని, అభీష్టసిద్ధికిన్ = కోరిక నెఱవేఱుటకొఱకు, కొల్తున్ = సేవించెదను

తా. విఘ్నేశ్వరుఁడు పార్వతియొడిలోఁ గూర్చుండి యొకచన్ను త్రావుచు బిడ్డలయలవాటు చొప్పున రెండవ స్తనముఁ బుణుక నావలిప్రక్కకుఁ దొండముసాఁపఁగా నర్ధనారీశ్వరత్వముచే నాప్రక్క సగముదేహము శివరూపముగనుక స్తనముచిక్కక సర్పహారము దొరకెను తాను గజముఖుఁడు గనుక గజమునకు తూఁడు త్రెంచుపని స్వాభావికమగుటచే నాసర్పహారమును దామరతూఁడనుకొని పట్టఁబూనిన విఘ్నేశ్వరునిఁ గృష్ణదేవరాయలకోరికలు తీర్చుటకై సేవించెద

బాల్యమందుఁ జేసినచేష్టలను, అందును దలిదండ్రులయెడఁ గావించినవానిని జెప్పుట మిక్కిలి యు నానందకరముగావున, గణాధిపతి తనకుఁ బ్రసన్నుఁడగుటకై కవి తదీయశైశవక్రీడ నభివర్ణించినాఁడు. అలంకారము భ్రాంతిమంతము

సీ. చేర్చుక్కగా నిడ్డ చిన్నిజాబిల్లిచే, సిందూరతిలకంబు చెమ్మగిల్ల
నవతంసకుసుమంబునం దున్నయెలదేఁటి, రుతి కించిదంచితశ్రుతులు నీన
ఘనమైనరారాపుఁ జనుదోయిరాయిడిఁ, దుంబీఫలంబు తుందుడుకుఁ జెందఁ
దరుణాంగుళిచ్ఛాయ దంతపుసరకట్టు, లింగిలీకపువింతరంగు లీన
నుపనిషత్తులు బోటులై యోలగింపఁ, బుండరీకాసనమునఁ గూర్చుండి మదికి
నింపువేడుక వీణ వాయించుచెలువ, నలువరాణి మదాత్మలో వెలయుఁగాత. 5

అ. చేర్చుక్కగాన్ = పాపటబొట్టుగా, ఇడ్డచిన్నిజాబిల్లిచేన్ = పెట్టుకొనినబాలచంద్రునిచేత, సిందూరతిలకంబు = చెందిరపుబొట్టు, చెమ్మగిల్లన్ = తడియఁగాను, అవతంసకుసుమంబునందు = కర్ణాభరణముగా నుంచికొన్నపువ్వునందు, ఉన్నయెలదేఁటి = ఉన్నట్టికొదమతుమ్మెదయొక్క, రుతి = ఝుంకారధ్వని, కించిదంచితశ్రుతులన్ = ఇంచుక యొప్పుచున్న సుతులను, (సుతి యనఁగా సఙ్గీతమునందుఁ గంఠధ్వనికి సహాయమయిన తంబుర మొదలయిన వానిధ్వని), ఈనన్ = కలుగఁజేయఁగాను; ఘనము = గొప్పది, ఐనరారాపుచనుదోయిరాయిడిన్ - ఐన = అయినట్టి, రారాపు = మిక్కిలియొరపిడి గల, చనుదోయి = చన్నులజంటయొక్క, రాయిడిన్ = ఒరపిడిచేత, తుంబీఫలంబు = వీణకు నమర్చినయెండుసొఱకాయ, తుందుడుకున్ = మిక్కిలియైన యదరును, చెందన్ = పొందఁగాను; తరుణాంగుళిచ్ఛాయన్ = కోమలము లయినవ్రేళ్లకాంతిచేత, దంతపుసరకట్టులు = దంతముతోఁ జేసినవీణ మెట్లు, ఇంగిలీకపు వింతరంగులు = ఇంగిలీకముయొక్క యాశ్చర్యకరమయిన వన్నెవంటి యెఱ్ఱనివన్నెలను, ఈనన్ = కలిగించుచుండఁగాను, ఉపనిషత్తులు = వేదాంతములు, బోటులై = చెలికత్తెలై, ఓలగింపన్ = సేవింపఁగాను; పుండరీకాసనమునన్ = తెల్లదామరగద్దియమీఁద, కూర్చుండి = కూర్చున్నదై, మదికిన్ = మనస్సునకు, ఇంపువేడుకన్ = ఇంపగునట్టియుల్లాసముతో, వీణన్ = వీణెను, వాయించు

చెలువ=వాయించునట్టియందకత్తెయైన, నలువరాణి = బ్రహ్మయొక్క భార్య-సరస్వతి, మదాత్మలోన్ = నామనస్సునందు, వెలయుఁగాతన్ = ఒప్పునుగాక తాత్పర్యము సుగమము

సీసము మొదటి మూఁడుపాదములందు అతిశయోక్తియు, దంతపుసరకట్లు తమ తెలుపునుమాని వ్రేళ్లకాంతియెఱుపును బొందెననుటచే తద్గుణమును అలంకారములు

క. కొలుతున్ మద్గురు విద్యా,నిలయుం గరుణాకటాక్షనిబిడజ్యోత్స్నా
దళితాశ్రితజనదురిత, చ్ఛలగాఢధ్వాంతసమితి శరకోపయతిన్. 6

అ. విద్యానిలయున్ = విద్యల కునికిపట్టయినవానిని, కరుణా సమితిన్ - కరుణా = దయతోడి, కటాక్ష = కడగంటిచూపులనెడు, నిబిడ = దట్టమైన, జ్యోత్స్నా = వెన్నెలచేత, దళిత= పోఁగొట్టఁబడిన, ఆశ్రితజన = భక్తజనులయొక్క, దురిత = పాపములనెడి, ఛల = వ్యాజముగల, గాఢధ్వాంత = దట్టపుఁజీఁకట్లయొక్క, సమితిన్ = సమూహముగలవానిని - కరుణాకటాక్షములచేత భక్తులపాపములను పోఁగొట్టువాని ననుట, శరకోపయతిన్ = శరకోపనామకుఁడయిన సన్యాసిని, మద్గురున్ = నాయాచార్యుని, కొలుతున్ = సేవింతును

“యస్యదేవే పరాభక్తిర్యథాదేవే తథాగురౌ, తస్యైతేకథితాహ్యర్థాః ప్రకాశన్తే మనీషిణః” అనువచనముంబట్టి గురూపదిష్టములైన యర్థము లెప్పుడు మఱపునొందక స్ఫురించుచుండుటకై గురుధ్యానము గావింపఁబడినది. కటాక్షములందు చంద్రికాత్వమును ఆరోపించుటచే రూపకమును, ఛలశబ్దముచే దురితమును అసత్యముగాఁ బ్రతిపాదించి ధ్వాంతారోపము సేయుటచే అపహ్నుతియు గ్రాహ్యములు.

మ. వనజాక్షోపము వామలూరుతనయున్ ద్వైపాయనున్ భట్టబా
ణుని భాసున్ భవభూతి భారవి సుబంధున్ బిల్హణుం గాళిదా
సుని మాఘున్ శివభద్రు మల్హణకవిం జోరున్ మురారిన్ మయూ
రుని సౌమిల్లిని దండిఁ బ్రస్తుతులఁ బేర్కొందున్ వచశ్శుద్ధికిన్. 7

అ. ఇందు సంస్కృతకవులను గవి స్తుతించుచున్నాఁడు. వనజాక్షోపమున్ = విష్ణువుతో సమానుఁడయిన, వామలూరుతనయున్ = పుట్టకుఁ గొడుకైనవాల్మీకిని, ద్వైపాయనున్ = వేదవ్యాసుని, భట్టబాణునిన్ = భట్టబిరుదము గలబాణకవిని, భాసున్ = భాసుఁడనుకవిని, భవభూతిన్ = భవభూతియనుకవిని, భారవిన్ = భారవియనుకవిని, సుబంధున్ = సుబంధువనుకవిని, బిల్హణున్ = బిల్హణుఁడనుకవిని, కాళిదాసునిన్ = కాళిదాసకవిని, మాఘున్ = మాఘకవిని, శివభద్రున్ = శివభద్రుఁడనుకవిని, మల్హణకవిన్ = మల్హణుఁడనుకవిని, చోరున్ = చోరకవిని, మురారినిన్ = మురారికవిని, మయూరునిన్ = మయూరకవిని, సౌమిల్లినిన్ = సామిల్లికవిని, దండిన్ = దండికవిని, (ఈకవులను) వచశ్శుద్ధికిన్ = మాటలయొక్క పరిశుద్ధత్వమునకు-అపశబ్దములు లేకుండుటకు, ప్రస్తుతులన్ = స్తోత్రములచేత, పేర్కొందున్ = స్మరించెదను

ఆ. వ్యాసరచితభారతామ్నాయమాంధ్రభా, షగ నొనర్చి జగతిఁ బొగడుఁ గనిన
నన్నపార్యుఁ దిక్కనను గృతక్రతు శంభు, దాసు నెఱ్ఱసుకవిఁ దలఁతు భక్తి. 8

అ. ఆంధ్రకవులను స్తుతించుచున్నాఁడు. వ్యాసరచిత భారతామ్నాయము=వ్యాసునిచేఁ జేయఁబడిన భారతమనెడివేదమును, “భారతః పంచమోవేదః” అనువచనమువలన భారతమునకు వేదసంజ్ఞ, ఆంధ్రభాషగన్ ఒనర్చి=తెనుఁగుభాషగాఁ జేసి, జగతిన్ = లోకమునందు, పొగడున్ = పొగడ్తను,

కన్నిన=పొందిన, నన్నపార్యున్=నన్నయభట్టారకుని, కృతక్రతున్=చేయఁబడిన యాగములుగల, తిక్కనన్=తిక్కనసోమయాజిని, శంభుదాసున్=శంభుదాసుఁడను నామాంతరముగల, ఎఱ్ఱసుకవిన్=ఎఱ్ఱాప్రెగడ యనుసత్కవిని, భక్తిన్=భక్తితో, తలఁతున్=స్మరించెదను

మ. భరమై తోఁచుకుటుంబరక్షణమునం గాఁ* బ్రాల్మాలి చింతన్ నిరం
తరతాళీదళసంపుటప్రకరకాంతారంబునం దర్థపుం
దెరువాటుల్ దెగి కొట్టి తజ్జ్ఞపరిషద్విజ్ఞాతచౌర్యక్రియా
విరసుండై కొఱఁతం బడుం గుకవి పృథ్వీభృత్సమీపక్షితిన్. 9

అ. ఇందుఁ గుకవిని జోరునిఁగా రూపించి యుభయులయందు నభేదారోపమును జేయుచున్నాఁడు. భరమై=బరువై, తోఁచు కుటుంబరక్షణమునఁ గాన్=తోఁచునట్టి పెండ్లాముబిడ్డలు మొదలయినవారిపోషణమునకై, ప్రాల్మాలి = ప్రాలుమాలి=ఓపలేక, చింతన్=విచారముచేత, నిరంతర . కాంతారంబునందున్ - నిరంతర=దట్టమయిన, తాళీదళసంపుట=తాటియాకుల పుస్తకములయొక్క, ప్రకర=సమూహమనెడి, కాంతారంబునందున్=అడవియందు, అర్థపుందెరువాటుల్ = పరకవిత్వపద్యార్థములనెడి యర్థముల (ధనముల) యొక్కమార్గములను, తెగి=సాహసించి, కొట్టి=అడ్డగించి కొట్టివోఁచి, (కుకవిపక్షమునందు అర్థములనుజెఱిచి యపార్థములుచేసికాని యొకరుచేసినదానిని దానేచేసినదానినిఁగా జెప్పుకొనికాని యనుట,) తజ్జ్ఞ . విరసుండై-తజ్జ్ఞ=ఆయర్థములను దెలిసిన-లేక అందులనిజమును దెలిసినవారియొక్క, పరిషత్=సభలచే, విజ్ఞాత=తెలియఁబడిన, చౌర్యక్రియా=దొంగతన మనువ్యాపారముచేత, విరసుండై=ద్వేషింపఁబడినవాఁడై, పృథ్వీభృత్సమీపక్షితిన్ = రాజసన్నిధాన మనెడిపర్వత సమీపప్రదేశమునందు, కుకవి=దుష్టకవి, కొఱఁతన్=తక్కువయనెడి కొఱ్ఱునందు, పడున్=పడినవాఁడగును.

తా. కుకవియనుదొంగ కుటుంబరక్షణమునకై కక్కుర్తిపడి, తాటియాకుపుస్తకముల సమూహములనెడియడవియం దాపుస్తకములలోనియర్థము లనెడిధనములను దోఁచుకొని, అర్థముస్వరూపము దెలిసినవా రనెడిధనముగలుతు దెలిసినవారు, తనయపార్థకరణ మనుదొంగతనమును గనుంగొనుటవలన ద్వేషింపఁబడి, రాజసన్నిధాన మనెడిపర్వతముయొక్కసమీపమునందు నవమాన మనుకొఱ్ఱునం బడును.

కుకవి కుటుంబరక్షణకై ప్రాలుమాలుటకును దొంగ కుటుంబరక్షణకై ప్రాలుమాలుటకును, తాళీదళసంపుటప్రకరమునకు కాంతారమునకు, అభిధేయవాచకమైన యర్థశబ్దమునకును ధనవాచకమైన యర్థశబ్దమునకును, శబ్దార్థజ్ఞపరమైన తజ్జ్ఞులకును ధనజ్ఞపరమైన తజ్జ్ఞులకును, గమ్యమైన యపార్థకరణమునకును చౌర్యక్రియకును, అవమానవాచియగు కొఱఁతశబ్దమునకు కొఱ్ఱునకు వాచకమైన కొఱఁతశబ్దమునకును, రాజవాచకమైన పృథ్వీభృచ్ఛబ్దమునకు పర్వతవాచకమైన పృథ్వీభృచ్ఛబ్దమునకును అభేదారోపము సేయఁబడినది కాఁబట్టి, ఇది సావయవరూపకము అవయవి యగు కుకవికి చోరత్వారోపణము కంఠోక్తముకాక గమ్యమగుటచే ఏకదేశవివర్తియు, 'కొఱఁతన్' ఇత్యాదులందు శ్లేషానుప్రాణితము నగు దొంగ, కుటుంబభరణమునకై యడవులందు దారికొట్టి ధనముదోఁచుకొని పిదప దానిని గుఱుతుపట్టినవారిచేఁ బట్టుకొనఁబడినవాఁడై కొండదాపునఁ గొఱుతవేయఁబడునట్లు, కుకవి కుటుంబభరణమునకై తాటియాకు పుస్తకములలోని యర్థములకు నపార్థములు సేసి పిదప శబ్దార్థము చక్కఁగాఁ దెలిసిన

* ఈశబ్దము కొట్టు అనునర్థమున 'కొఱుతన్' అనియుండఁదగును. 'కొఱఁతన్' అనుట విచార్యము.

చే బోధింపఁబడినవాఁడై రాజసన్నిధానమున నవమానమునొందునని భావము. కుకవికి నిట్లు అర్థాలుసేసి యవమానపడుట కొఱుతవేయఁబడుటతో సాటియే యగునని ధ్వని.

అని యిష్టదేవతావం, దనసుకవిస్తుతులుఁ గుకవితతినిక్రృతియుఁ జే
సి నవీనకావ్యరచనకు, ననుకూలకథల్ దలంచు నాసమయమునన్. 10

అ. అని=ఈప్రకారముగా, ఇష్టదేవతావందన సుకవిస్తుతులున్=ఇష్టదేవతలయొక్క నమస్కారంటలను సత్కవులయొక్క పొగడుటలను, కుకవితతినిక్రృతియున్=కుత్సితకవుల సమూహముయొక్క కరణమును, చేసి=చేసినవాఁడనై, నవీనకావ్యరచనకున్ - నవీన=క్రొత్తయయిన, కావ్య=ప్రబంధముక్క, రచనకున్=నిర్మాణమునకు, అనుకూలకథల్ = తగినకథలను, తలంచు నాసమయమునన్=ఆంచునట్టి యాకాలమునందు పైపద్యములో నన్వయము

ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వనికుమా, రతకుఁ గ్రౌంచాచలరాజమయ్యె
నావాడపతికంధరసింధురాధ్యక్షు, లరిగాఁపు లెవ్వానిశిఖరతరాసి
కాపంచగౌఢధాత్రీపదం బెవ్వాని, కసివాఱుగా నేఁగునట్టిబయలు
సకలయాచకజనాశాపూర్తి కెవ్వాని, ఘనభుజాదండంబు కల్పశాఖి
ప్రబలరాజాధిరాజవీరప్రతాప, రాజపరమేశబిరుదవిభ్రాజి యెవ్వఁ
డట్టిశ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁ, డొక్కనాఁడు కుతూహలంబుప్పతిల్ల. 11

అ. ఎవ్వనికుమారతకున్=ఏ కృష్ణరాయలయొక్క చిన్నతన మునెడికుమారస్వామి భావమునకు, దలన్=మొదట, ఉదయాచలేంద్రంబు= ఉదయగిరిదుర్గము, క్రౌంచాచలరాజము=క్రౌంచమను పర్వతశ్రేష్ఠము, అయ్యెన్=ఆయెనో; ఎవ్వానిఖరతరాసికిన్=ఎవనియొక్క మిక్కిలి వాఁడియయిన కత్తికి, నావాడపతికంధర సింధురాధ్యక్షులు=నావాడ దేశపురాజును శకంధరదేశపురాజును గజపతి నెడి కళింగరాజును, అరిగాఁపులు=కప్పముకట్టునట్టి కాఁపులయిరో; ఎవ్వానికిన్=ఏకృష్ణరాయనికి, పంచగౌఢ ధాత్రీపదంబు=పంచగౌడ దేశములతోఁగూడిన భూభాగము-అనఁగా గౌడులు కన్నోజు సారస్వతులు ఉత్కలులు మైథిలులు అను పంచగౌడుల దేశములతోఁగూడిన హిందూస్థానపురాజుల మియంతయు, అసివాఱుగాన్=సవారీగా, ఏఁగునట్టిబయలు=పోవునట్టి బయలో - పంచగౌడదేశతోఁగూడిన హిందూస్థానమంతయు నే కృష్ణరాయలకు విహారముగాఁ దిరుగుచోటుగా నుండెనో యు; ఎవ్వాని ఘనభుజాదండంబు=ఎవనియొక్క గొప్పదైన దండమువంటిచేయి, సకలయాచక జనాపూర్తికిన్ = సమస్తమైన యాచకజనులయొక్క కోరికలనునిండించుటకు, కల్పశాఖి=కల్పవృక్షమో; ఁడు=ఎవఁడు, ప్రబల . విభ్రాజి- ప్రబల=అధికమయిన, రాజాధిరాజవీరప్రతాప రాజపరమేశబిరు=రాజాధిరాజ వీరప్రతాప రాజపరమేశ అనియెడుబిరుదులచేత, విభ్రాజి=ప్రకాశించుచుండువాఁడో, శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁడు=అట్టిశ్రీకృష్ణదేవరాయశ్రేష్ఠుఁడు, ఒక్కనాఁడు = ఒకదినము, కుతూహలంబు=వేడుక, ఉప్పతిల్లన్=ఉదయింపఁగా పైమూఁడవపద్యములోని పల్కె ననుక్రియతో నన్వయము.

తా. కృష్ణదేవరాయలు మొట్టమొదటఁ గుమారస్వామి క్రౌంచపర్వతమును భేదించినట్టు లుదయగిరిదుర్గమును సాధించి పిమ్మట నావాడపతి మొదలయినరాజులను దనకుఁ గప్పముకట్టునట్టుగా నొప్పించి హిందూస్థానపర్యంతమైన పంచగౌడదేశముల స్వారీతిరుగుభూములవలె నిష్కంటకముగా నేలి కల్ప

ప్రత్యక్షమువలె యాచకులు కోరినవానినెల్లఁ దనివిదీరనిచ్చుచు రాజాధిరాజాదిబిరుదములు చెలఁగఁగా రాజ్యము నేలుచుండి యొకనాఁడు వేడుకపుట్టఁగా అలంకారములు రూపకాతిశయోక్తులు.

సీ. ఇందీవరంబుల నీనుక్రాల్గన్నుల, శరదిందుముఖులు చామరము లిడఁగఁ
బణినసూనుకణాదబాదరాయణసూత్ర, ఫక్కి విద్వాంసు లుపన్యసింపఁ
బార్శ్వభూమి నభీరుభటకదంబకరాళ, హేతిచ్ఛటాచ్ఛాయ నిరులు గొనఁగ
సామంతమండనోద్దామమాణిక్యాంశు, మండలం బొలసి యారెండ గాయ
మూరురాయరగండ పెండారమణిమ, రీచిరింఛోళిఁ గలయ నావృతము లగుచు
నంకపాళి నటద్దుకూలాంచలములు, చిత్రమాంజిష్ఠవిభ్రమశ్రీ వహింప 12

అ. ఇందీవరంబులన్ = నల్లగలువలను, ఈనుక్రాల్గన్నుల శరదిందుముఖులు - ఈను=పుట్టించునట్టి, క్రాలు=ప్రకాశించుచున్న, కన్నుల = కన్నులుగలిగిన, శరదిందుముఖులు=శరత్కాల చంద్రునివంటి ముఖములుగల స్త్రీలు, చామరములు=వింజామరలను, ఇడఁగన్=వీవఁగాను, విద్వాంసులు = పండితులు, పణిన . ఫక్కిన్ - పణినసూను=పాణినియొక్కయు, కణాద=కణాదునియొక్కయు, బాదరాయణ=వ్యాసుని యొక్కయు, సూత్ర=సూత్రములయొక్క, ఫక్కిన్=మార్గమును-వ్యాకరణ వైశేషిక (తర్క) వేదాంతశాస్త్రములయొక్క మతములననుట, ఉపన్యసింపన్=ప్రసంగించు చుండఁగాను, పార్శ్వభూమిన్=ఇరుప్రక్కల ప్రదేశమునందు, అభీరు ఛాయన్ - అభీరు=భయములేని, భట=భటులయొక్క, కదంబ=సమూహముయొక్క, కరాళ=భయంకరములయిన, హేతి=కత్తులయొక్క, ఛటా=సమూహముయొక్క, ఛాయన్=కాంతిచేత, ఇరులు గొనఁగన్=చీఁకట్లులు క్రమ్మఁగా; సామంత మండలంబు - సామంత=ఇరుగుపొరుగు రాజులయొక్క, మండన=సొమ్ములయందలి, ఉద్దామ=అధికమయిన, మాణిక్య=కెంపులయొక్క, అంశు=కాంతులయొక్క, మండలంబు=సమూహము, ఒలసి=నలుప్రక్కలఁ జుట్టుకొని, ఆరెండ=లేఁతయెండ, కాయన్=వెలుఁగఁగా - వేఁడిమి లేనియెండవలెఁ బ్రకాశింపఁగా - రత్నాభరణములుదాల్చిన సామంతరాజులు కొలిచియుండిరని భావము. మూరురాయరగండ పెండారమణిమరీచిరింఛోళిన్ - మూరురాయర=అశ్వపతి గజపతి నరపతి యనుమువ్వురు రాజులకు, గండ=మగఁడనెడిబిరుదును దెలిపెడి, పెండార = కాలియందెయొక్క, మణి = రత్నములయొక్క, మరీచి = కాంతులయొక్క, రింఛోళి = సమూహముచేత, కలయన్ = అంతటను, ఆవృతములు = కప్పఁబడినవి, అగుచున్ = అవుచును, అంకపాళిన్ = ఒడియందు, నటత్ = కదలుచున్న, దుకూల = తెల్లపట్టువస్త్రముయొక్క, అంచలములు = చెఱఁగులు, చిత్రమాంజిష్ఠవిభ్రమశ్రీన్ - చిత్రమాంజిష్ఠ = చిత్రవర్ణము గలసి యెఱుపు మించినపసుపురంగుయొక్క, విభ్రమ = విలాసముయొక్క, శ్రీన్=సంపదను, వహింపన్ = పొందఁగాను - కాలిలో ధరించినబిరుదుబంగారపుటందెయందలిరత్నములకాంతులు ప్రసరించుటవలన తొడపై నుండు తెల్లపట్టువస్త్రముచెఱఁగులు నానావర్ణమై యెఱుపుమించిన పసుపుకాంతిగలిగియుండఁగా ననుట. పైపద్యముతో నన్వయము.

అలంకారము - తద్గుణము.

క. భువనవిజయాఖ్యసంస, ద్భవనస్థితసింహపీఠిఁ బ్రాజ్ఞులగోష్ఠిం
గవితామధురిమ డెందము, దవులం గ్రోలుచు వుండి సదయతర్క నను బల్కెన్.

అ. భువన. పీఠిన్ - భువనవిజయ = భువనవిజయ మనెడి, ఆఖ్య = పేరుగల, సంసద్భవన=సభాగృహమునందు, స్థిత = ఉన్నట్టి, సింహపీఠిన్ = సింహాసనమునందు, ప్రాజ్ఞులగోష్ఠిన్ -

పండితులప్రసంగమువలన, కవితామధురిమ = కవిత్వముయొక్క తియ్యఁదనము, డెందము = మనస్సును, తవులన్ = అంటఁగా, కొలువుండి = కొలువుదీరియుండి, సదయతన్ = కృపతోఁగూడినతనముచేత, ననున్ = నన్నుఁగూర్చి, పల్కెన్ = ఒకపలుకుపలికెను దీనికిఁ బైపద్యము కర్మము.

తే. సప్తసంతానములలోఁ బ్రశస్తిగాంచి, ఖిలముగాకుండునదిధాత్రిఁ గృతియ కానఁ
గృతి రచింపుము మాకు శిరీషకుసుమ, పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య.

అ. పెద్దనార్య=పూజ్యుఁడవైన పెద్దనా, ధాత్రిన్ = భూమియందు, సప్తసంతానములలోన్ = తటాకము, నిధి, అగ్రహారము, దేవాలయము, వనము, ప్రబంధము, పుత్త్రుఁడు, అనునీయేడుసంతానములలోపల, ప్రశస్తిన్ = ప్రసిద్ధిని, కాంచి= పొంది, ఖిలముగాకుండునది = చెడకయుండునట్టిది, కృతియ=ప్రబంధమే, కానన్ = కనుక, శిరీషకుసుమ ... . ఉక్తులన్ - శిరీషకుసుమ = దిరిసెనపుఁబువ్వువలె, పేశల=మృదువైన, సుధామయ=అమృతమయములయిన-అనఁగా రసవంతములయిన, ఉక్తులన్ = మాటలచేత, కృతిన్ = ప్రబంధమును, మాకున్ = మాకొఱకు - మాకంకితముగాననుట, రచింపుము= చేయుము అలంకారము-ఉపమ.

క. హితుఁడవు చతురవచోనిధి, వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా, పితామహుఁడ వెవ్వ రీడు పేర్కొన నీకున్.

అ. హితుఁడవు=మా మేలుకోరువాఁడవు, చతురవచోనిధివి=సరసములయిన మాటలకుఁ జోటయినవాఁడవు, అతుల . యుతుఁడవు-అతుల=సాటిలేని, (ఇది స్మృతికివిశేషణము), పురాణ=భాగవతాది పురాణములయొక్కయు, ఆగమ=పాంచరాత్రము మొదలయిన యాగమములయొక్కయు, ఇతిహాస=భారతము మొదలయిన పూర్వరాజచరిత్రములయొక్కయు, కథా = కథలయొక్క, అర్థ=అభిప్రాయముయొక్క, స్మృతి=జ్ఞప్తితో, యుతుఁడవు=కూడినవాఁడవు, ఆంధ్రకవితాపితామహుఁడవు= ఆంధ్రకవిత్వమునకు బ్రహ్మవు, నీకున్ = నీతో, పేర్కొనన్ = సాటిగాఁజెప్పుటకు, ఈడు=సాటి, ఎవ్వరు=ఎవరున్నారు - ఎవ్వరును లేరనుట

క. మనువులలో స్వారోచిష, మనుసంభవ మరయ రససమంచితకథలన్
విన నింపు కలిధ్వంసక, మనఘ భవచ్చతురరచనకనుకూలంబున్. 16

అ. అనఘ=పాపములేనివాఁడవయిన పెద్దనార్యా, మనువులలోన్ = స్వాయంభువుఁడు మొదలుగాఁగల పదునలుగురుమనువులలోపల, స్వారోచిషమనుసంభవము = రెండవవాఁడైన స్వారోచిషమనువుయొక్క జన్మకథ, అరయన్ = విచారింపఁగా, రససమంచితకథలన్ - రస = శృంగారాది రసములచేత, సమంచిత=ఒప్పుచున్న, కథలన్ = కథలచేత, వినన్ = వినుటకు, ఇంపు=ఇష్టమైనదియు, కలిధ్వంసకము=పాపములను నశింపఁజేయునదియు, భవచ్చతురరచనకున్ = నీయొక్క ప్రౌఢమయినకూర్పునకు, అనుకూలంబున్ = తగినదియు(అగును)

వ. కావున మార్కండేయపురాణోక్తప్రకారంబునం జెప్పుమని కర్పూరతాంబూలంబు వెట్టినం బట్టి మహాప్రసాదం బని మోదరంబున నమ్మహాప్రబంధనిబంధనంబునకుఁ బ్రారంభించితి నేతత్కథానాయకరత్నం బగునమ్మహీనాథు వంశావతారం బెట్టి దనిన. 17

కావునన్=కనుక, మార్కండేయపురాణోక్తప్రకారంబునన్=మార్కండేయపురాణము నందుఁ జెప్పఁబడినవిధమున, చెప్పుము=ప్రబంధరచన చేయుము, అని=ఇట్లని, కర్పూరతాంబూలంబు=పచ్చకర్పూరముతోఁ గూడిన తాంబూలమును, పెట్టినన్=ఈయఁగా, పట్టి=గ్రహించి, మహాప్రసాదంబు=గొప్పయనుగ్రహము, అని=అనుకొని, మోదంబునన్=సంతోషముతో, అమ్మహాప్రబంధనిబంధనంబున కున్=ఆగొప్పకావ్యమును రచించుటకు, ప్రారంభించితిన్=మొదలుపెట్టితిని. ఏతత్కథానాయక రత్నంబు=ఈకృతిపతిశ్రేష్ఠుఁడు, అగునమ్మహీనాథునివంశావతారంబు=అయినయాకృష్ణదేవరాయనివంశ మునుయొక్క పుట్టుక, ఎట్టిది=ఎటువంటిది, అనినన్=అనఁగా వైపద్యముతో నన్వయము

సీ. కలశపాథోరాశిగర్భవీచిమతల్లి, కడుపార నెవ్వానిఁ గన్నతల్లి
యనలాక్షుఘనజటావనవాటి కెవ్వాఁడు, వన్నె వెట్టు ననార్తవంపుఁబువ్వు
సకలదైవతబుభుక్షాపూర్తి కెవ్వాఁడు, పుట్టు గానని మేనిమెట్టపంట
కటికిచీఁకటితిండికిరణములగిలిగింత, నెవ్వాఁడు తొగకన్నెనవ్వఁ జేయు

నతఁడు పొగడొందు మధుకైటభారిమఱఁది, కళలనెలవగువాఁడు చుక్కలకుఱేఁడు
మిసిమిపసిఁడి యెలరాజు మేనమామ, వేవెలుంగులదొరజోడు రేవెలుంగు. 18

అ. కలశ ... మతల్లి-కలశపాథోరాశి = పాలసముద్రముయొక్క, గర్భ = లోపలిభాగమనెడి కడుపునందలి, వీచిమతల్లి=తరంగశ్రేష్ఠము, కడుపారన్=కడుప్రీతియునట్లు, ఎవ్వానిన్ = ఏచం ద్రుని, కన్నతల్లి=కనినతల్లియో, అలం పర్యాయోక్తి. ఎవ్వాఁడు=ఏచంద్రుఁడు, అనలాక్షు వాటి కిన్-అనలాక్షు (నిప్పుకన్నుగల) శివునియొక్క, ఘన=గొప్పవయిన, జటా=జడలనెడు, వన=అడవుల యొక్క, వాటికిన్=పంక్తికి, వన్నెవెట్టు ననార్తవంపుఁబువ్వు-వన్నె=అలంకారమును, పెట్టు=కలుగఁ జేయునట్టి, అనార్తవంపు=ఋతుసంబంధములేని, పువ్వు = పుష్పమో-ఇతరపుష్పము లాయాఋతువు లందుఁ బుట్టునవి ఈచంద్రుఁడనుపుష్పమో యట్టిదిగాదు అనఁగా నీచంద్రుఁడు సర్వకాలమును శివుని శిరస్సునకుఁ బుష్పాలంకారమై యుండునో యనట (వన్నెవెట్టెడునార్తవంపుఁబువ్వు అను పాఠమున, ఆర్తవంపుఁబువ్వు=పసిమిమైనపుష్పము అని యర్థము); అలం రూపకము ఎవ్వాఁడు= ఏచంద్రుఁడు, సకల ... పూర్తికిన్-సకల=సమస్తమైన, దైవత=దేవతలయొక్క, బుభుక్షా=ఆఁకలి యొక్క, పూర్తికిన్=తీరుటకు, పుట్టు గానని మేనిమెట్టపంట-పుట్టు=మొలకెత్తుట, కానని = తెలి యని, మేని=దేహరూపమయిన, మెట్టపంట=మెరకనేలపంటయో, 'మెట్టపంట' అనుటచే వర్ష ప్రతిబంధనముచేఁ జెడని దని సూచితము - ఎన్నఁడును జెడని యాహారమగునో యనుట. ఎవ్వాఁడు = ఎవ్వఁడు, కటికి గిలిగింతన్-కటికిచీఁకటి=గాఢాంధకారమే, తిండి=ఆహారముగాఁగల - చీఁకటి నణఁచివేయునట్టి యనుట, కరముల=కిరణము లనెడి చేతులచేనైన, గిలిగింతన్ = చక్కిలిగింతచేత, తొగకన్నెన్ = కలువయనుపడుచును, నవ్వన్ = నవ్వునట్లు-వికసించునట్లు, చేయున్=చేయునో; అలం రూపకము మధుకైటభారిమఱఁది = మధుకైటభులకు శత్రు వయినవిష్ణువుయొక్క-భార్యకుఁ దోడఁబుట్టినవాఁడును, కళలనెలవగువాఁడు = షోడశసంఖ్యగలకళలకుఁ జోటయినవాఁడును, చుక్క లకున్ = అశ్విన్యాదినక్షత్రములకు, ఱేఁడు = నాథుఁడును, మిసిమిపసిఁడి = కాంతికిఁ జరమావధి యును-అనఁగా దాని కడపటిహద్దయినవాఁడును, ఎలరాజు మేనమామ=మన్మథునితల్లితోఁ బుట్టువయిన వాఁడును, వేవెలుంగులదొరజోడు=వేయికిరణములు గలసూర్యునికి జతయైనవాఁడును, రేవెలుంగు=రాత్రి

యందుఁ బ్రకాశమునుగల వాఁడును-రాత్రిని బ్రకాశించువాఁడనుట (అగు) అతఁడు=ఆచంద్రుఁడు, పొగడు=పొగడ్తను, ఒందున్=పొందెను

తా. పాలసముద్రమునందుఁ బుట్టినవాఁడును, శివుని జటాజూటమునకుఁ బుష్పాలంకారమైన వాఁడును, దేవతలకుఁ దనకళల నాహారముగా నిచ్చువాఁడును, కలువలను వికసింపఁజేయువాఁడును, లక్ష్మీదేవికిఁ దోడఁబుట్టినవాఁడును, బదియాఱుకళలకుఁ జోటయినవాఁడును, నక్షత్రములకు భర్తయుఁ, గాంతికి నిధియు, సూర్యునికి జతకాఁడు నయినచంద్రుఁడు పొగడొందును

తే. ఆసుధాధాముఁ విభవమహాంబురాశి, కుబ్బుమీఱంగ నందనుఁ డుదయ మయ్యె
వేదవేదాంగశాస్త్రార్థవిశదవాస, నాత్తధిషణాధురంధరుం డైనబుధుఁడు. 19

అ. ఆసుధా అంబురాశికిన్-ఆసుధాధాము = అమృతకిరణుఁడైన యాచంద్రునియొక్క, విభవమహాంబురాశికిన్=సంపదయనెడు గొప్పసముద్రమునకు, ఉబ్బు = ఉబుకుట-అధిక్యము, మీఱంగన్=అతిశయించునట్లు, వేద . ధురంధరుండు-వేద=నాలుగువేదములయొక్కయు, వేదాంగ=శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అనెడియాఱువేదాంగములయొక్కయు, శాస్త్ర=మీమాంసాదిశాస్త్రములయొక్కయు, అర్థ=అభిప్రాయములందలి, విశద=స్పష్టమయిన, వాసనా=పరిచయముచేత, ఆత్త=పొందఁబడిన, ధిషణా=బుద్ధియొక్క, ధురంధరుండు=భారమును వహించువాఁడు-నిర్వాహకుఁడు, ఐనబుధుఁడు=అయినట్టిబుధుఁడు, ఇట బుధనామ మన్వర్థసంజ్ఞయని తెలియనగును (అను) నందనుఁడు=అనెడికొడుకు, ఉదయమయ్యెన్=పుట్టెను

తా. ఆచంద్రునియైశ్వర్యము మఱియు నతిశయించునట్లు లతనికి వేదశాస్త్రార్థములు చక్కఁగాఁ దెలిసినట్టి బుధుఁడను పేరుగలపండితుఁ డయినకొడుకుపుట్టెను

క. వానికిఁ బురూరవుఁడు ప్ర, జ్ఞానిధి యుదయించె సింహసదృశుఁడు తదూ్భ
జానికి నాయువు తనయుం, డై నెగడె నతండు గనె యయాతినరేంద్రున్ 20

అ. వానికిన్ = ఆబుధునకు, ప్రజ్ఞానిధి = బుద్ధికి స్థానభూతుఁడయిన-మిక్కిలి బుద్ధిమంతుఁడయిన, పురూరవుఁడు=పురూరవుఁడనురాజు, ఉదయించెన్=పుట్టెను తదూ్భజానికిన్=ఆపురూరవుఁడనురాజునకు, సింహసదృశుఁడు=సింహముతో సమానుఁడయిన - మిక్కిలి పరాక్రమశాలియైన, ఆయువు=ఆయువనువాఁడు, తనయుండై=కుమారుఁడై, నెగడెన్=ఎర్థిల్లెను అతండు=ఆయాయువు, యయాతినరేంద్రున్=యయాతియనురాజును, కనెన్=కనియెను

తా. ఆబుధునకుఁ బురూరవుఁడును బురూరవునకు నాయువును నాయాయువునకు యయాతియుఁ బుట్టిరి

క. అతనికి యదుదుర్వసులను, సుతు లుద్భవ మొందిరహితసూదనులు కళా
న్వితమతులు వారిలో వి, శ్రుతకీర్తి వహించె దుర్వసుఁడు గుణనిధియై 21

అ. అతనికిన్ = ఆయయాతికి, అహితసూదనులు = శత్రువులను జంపువారును, కళాన్వితమతులు=విద్యతోఁ గూడినబుద్ధిగలవారును నయిన, యదుదుర్వసులు=యదువు దుర్వసుఁడు, అను సుతులు=అను పేళ్లుగలకొడుకులు, ఉద్భవమొందిరి=పుట్టిరి వారిలోన్=ఆయిద్దఱిలోను, దుర్వసుఁడు=దుర్వసుఁడనువాఁడు, గుణనిధియై=మంచిగుణములకు స్థానమయినవాఁడై, విశ్రుతకీర్తిన్=ప్రసిద్ధమయినయశస్సును, వహించెన్=పొందెను.

తే. వానివంశంబు తుళువాన్వవాయ మయ్యె
నందుఁ బెక్కండ్రు నృపు లుదయంబు నొంది
నిఖిలభువనప్రపూర్ణనిర్ణిద్రకీర్తి
నధికు లైరి తదీయాన్వయమునఁ బుట్టి. 22

అ. వానివంశంబు = ఆదుర్వసునియొక్క వంశము, తుళువాన్వవాయము = తుళువవంశము, అయ్యెన్ = ఆయెను అందున్ = ఆతుళువవంశమునందు, పెక్కండ్రు=అనేకులు, నృపులు=రాజులు, ఉదయంబునొంది = పుట్టి, నిఖిల కీర్తిన్ - నిఖిల = సమస్తమయిన, భువన = లోకములయందు, ప్రపూర్ణ=నిండిన, నిర్ణిద్ర=ప్రకాశించుచున్న, కీర్తిన్=యశస్సుచేత, అధికులైరి=గొప్పవారైరి తదీయాన్వయమునన్ = ఆతుళువరాజుల దైనవంశమునందు, పుట్టి=పుట్టినవాఁడై.- దీనికిఁ గర్త పైపద్యమునందలి తిమ్మక్షితీశాగ్రణి.

మహాస్రగ్ధర. ఘనుఁడై తిమ్మక్షితీశాగ్రణి శరకమఠగ్రావసంఘాతవాతా
శనరాడాశాంతదంతిస్థవిరకిరులజంజాటముల్ మాన్పి యిమ్మే
దిని దోర్దండైకపీఠంబి దిరము పటిచి కీర్తిద్యుతుల్ రోదసిం బ
ర్వ నరాతుల్ నమ్రులై పార్శ్వములఁ గొలువఁ దీవ్రప్రతాపంబు సూపెన్. 23

అ. తిమ్మక్షితీశాగ్రణి = తిమ్మరాజశ్రేష్ఠుఁడు, ఘనుఁడై=గొప్పవాఁడై, శర . జంజాటముల్ - శర=కృత్రిమమయిన, కమఠ = తాఁబేటియొక్కయు - కూర్మావతార మెత్తినవిష్ణువుయొక్క యనుట, గ్రావసంఘాత = కొండలసమూహములయొక్కయు - కులపర్వతములయొక్కయు ననుట, వాతాశనరాట్ =గాలియన్నముగాఁగల సర్పములకు రాజైనయాదిశేషునియొక్కయు, ఆశాంతదంతి = దిక్కులకొనలయందలి యేనుఁగుల్లయొక్కయు-దిగ్గజములయొక్కయనుట, స్థవిరకిరుల=ఆదివరాహముయొక్కయు, జంజాటముల్ = మాననిసంబంధములను, మాన్పి = పోఁగొట్టి, ఇమ్మేదినిన్ = ఈభూమిని, దోర్దండైకపీఠిన్ = దండమువంటిబాహువనెడి ముఖ్యమయినపీఠమునందు, తిరముపటిచి=స్థిరముగాఁ బాదుకొలిపి, కీర్తిద్యుతుల్ = యశస్సుయొక్కకాంతులు, రోదసిన్=భూమ్యాకాశములయందు, పర్వన్ = వ్యాపింపఁగాను, అరాతుల్=శత్రువులు, నమ్రులై=వంగినవారై, పార్శ్వములన్ = ఇరుప్రక్కలయందును, కొల్వన్=సేవింపఁగాను, తీవ్రప్రతాపంబు=తీక్ష్ణమయినపరాక్రమము, చూపెన్=కనఁబఱిచెను

తా. తిమ్మరాజు తాను దనబాహువుచేతమాత్రమే భూమిని జక్కఁగా భరించుటచేత నాదికూర్మము మొదలుగా భూమినిమోచువారు భూమిని మోయవలసినయక్కఱలేక సుఖింపఁగా నధికపరాక్రమముచేత శత్రువులనందఱను జయించి మిక్కిలి కీర్తిమంతుఁ డయ్యెను. అలం.అతిశయోక్తి.

క. వితరణఖని యాతిమ్మ, క్షితిపగ్రామణికి దేవకీదేవికి నం
చితమూర్తి యీశ్వరప్రభుఁ, డతిపుణ్యుఁడు వుట్టె సజ్జనావనపరుఁ డై. 24

అ. వితరణఖని = దానమునకు గనియయిన, ఆతిమ్మక్షితిపగ్రామణికిన్ =ఆతిమ్మరాజశ్రేష్ఠునకు, దేవకీదేవికిన్ = దేవకియనురాణికిని, అంచితమూర్తి= ఒప్పిదమయిన యాకారము గలవాఁడును, అతిపుణ్యుఁడు = మిక్కిలి పుణ్యముగలవాఁడునునైన, ఈశ్వరప్రభుఁడు=ఈశ్వరరాజు, సజ్జనావనపరుఁడై= సాధువులను రక్షించుటయం దాసక్తుఁడై, పుట్టెన్ =పుట్టెను

చ. బలమదమత్తదుష్టపురభంజనుఁ డై పరిపాలితార్యుఁ డై
యిలపయిఁ దొంటియీశ్వరుఁడె యీశ్వరుఁ డై జనియింప రూపఱెన్
జలరుహనేత్రలం దొఱఁగి శైలవనంబుల భీతచిత్తు లై
మెలఁగెడుశత్రుభూపతులమేనులఁ దాల్చినమన్మథాంకముల్ 25

అ. బల . భంజనుఁడై- బల = బలముచేతను, మద = క్రొవ్వుచేతను, మత్త = మత్తుగొన్న, దుష్ట=చెడ్డరాజులయొక్క - దుష్టులయినరాక్షసులయొక్క యని శివపరమైన యర్థాంతరము, పుర=పట్టణములను-త్రిపురములను అని యర్థాంతరము, భంజనుఁడై=నాశముచేసినవాఁడై, పరిపాలితార్యుఁడై= కాపాడఁబడిన పూజ్యులుగలవాఁడై- కాపాడఁబడినపార్వతిగలవాఁడై అని యర్థాంతరము, తొంటి యీశ్వరుఁడె=మునుపటిశివుఁడె, ఇలపయిన్=భూమిమీఁద, ఈశ్వరుఁడై = ఈశ్వరరాజయి, జనియింపన్ = పుట్టఁగా, జలరుహనేత్రలన్ = కమలములవంటి కన్నులుగల స్త్రీలను-భార్యలను, తొఱఁగి= విడిచి, శైలవనంబులన్ = కొండలయందును నడవులయందును, భీత-చిత్తులై=భయము నొందినమనస్సుగలవారలై, మెలఁగెడు శత్రుభూవరులమేనులన్=తిరుగునట్టి శత్రురాజులయొక్క శరీరములయందు, తాల్చిన మన్మథాంకముల్ = ధరించిన మన్మథచిహ్నములు, రూపఱెన్ = నశించెను. (ఈశ్వరుఁడు మన్మథునిఁగాల్చి భస్మముచేసినవాఁడుగనుక మన్మథాంకములు నశించెనని సంబంధము.)

తా. ఈశ్వరరాజు, మునుపు త్రిపురములను బాడుచేసి లోకములకు మేలుచేసిన పార్వతీపతియైన శివునివలె దుష్టరాజుల నందఱను జయించి సత్పురుషులను గాపాడుచు దుష్టులను శిక్షించుచు భూమినంతయుఁ జక్కఁగాఁ బాలించుచుండుటవలన నతనిశత్రురాజులు భార్యలను వదలి యడవులందు భయంబునఁ దిరుగుచుండుటచే వారికి స్త్రీలవలనంగలుగు మన్మథవికారములు బొత్తిగా మాని పోయెను. అలం. రూపకము.

సీ. నిజభుజాశ్రితధారుణీవజ్రకవచంబు, దుష్టభుజంగాహితుండికుండు
వనజేక్షణామనోధనపశ్యతోహరుం, డరిహంససంసదభ్రాగమంబు
మార్గణగణపికమధుమాసదివసంబు, గుణరత్నరోహణక్షోణిధరము
బాంధవసందోహపద్మవనీహేళి, కారుణ్యరసనిమ్నగాకళత్రుఁ
డన జగంబుల మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచె, ధరణిధవదత్తవివిధోపదావిధాన
మార్జితశ్రీవినిర్జితనిర్జరాల, యేశ్వరుఁడు తిమ్మభూపతియీశ్వరుండు. 26

అ. ధరణి. ఈశ్వరుఁడు- ధరణీధవ = రాజులచేత, దత్త = సమర్పింపఁబడిన, వివిధ=నానావిధములయిన, ఉపదా = కానుకలయొక్క, విధా = రీతిచే, సమార్జిత=సంపాదింపఁబడిన, శ్రీన్=సంపదచే, వినిర్జిత=జయింపఁబడిన, నిర్జరాలయేశ్వరుఁడు=స్వర్గమునకుఁ బ్రభువైనయింద్రుఁడుగలవాఁడైన-దేవేంద్రభోగమును మించినభోగముగలవాఁ డనుట, తిమ్మభూపతి యీశ్వరుండు = తిమ్మరాజుకుమారుఁడైన యీశ్వరరాజు, నిజ . కవచంబు-నిజ=తనదైన, భుజ = బాహువున్ను, ఆశ్రిత=పొందిన, ధారుణీ= భూమికి, వజ్రకవచంబు = వజ్రమణులతోఁ జేయఁబడిన కవచమువంటివాఁడును, దుష్ట . అహితుండికుండు-దుష్ట=దుర్మార్గులనెడు, భుజంగ=పాములకు, అహితుండికుండు= పాములవానివంటివాఁడును, వనజేక్షణా. పశ్యతోహరుఁడు-వనజేక్షణా =కమలములవంటికన్నులు గల స్త్రీలయొక్క, మనః=మనస్సనెడు, ధన = ధనమునకు, పశ్యతోహరుఁడు = చూచుచుండునప్పుడే దొంగిలించుకొనిపోవునట్టి

గాంగయు, అరి . అభ్రభాగమంబు-అరి = శత్రువులనెడి, హంస = అంచలయొక్క, సంసత్ = సమూహమునకు, అభ్రభాగమంబు = వర్షాకాలమువంటివాఁడును, (హంసలకు వర్షర్తువు వినాశకరము), మార్గణ దివసంబు-మార్గణ = యాచకులయొక్క, గణ=సమూహమనెడు, పిక=కోయిలలకు, మధుమాసదివసంబు=చైత్రమాసపు దినమువంటివాఁడును-వసంతఋతువైనవాఁడనుట, గుణ ధరము-గుణ=సద్గుణము లనెడి, రత్న=మణులకు, రోహణక్షోణిధరము=రోహణపర్వతమువంటివాఁడును, (రోహణ పర్వతమునందు రత్నపుగను లెక్కువగా నుండును), బాంధవ . హేళి-బాంధవ = బంధువులయొక్క, సందోహ = సమూహమనెడు, పద్మినీ = తామరలసమూహమునకు, హేళి = సూర్యునివంటివాఁడును, కారుణ్య. కళత్రుఁడు-కారుణ్యరస = దయారసమనెడినీళ్లకు, నిమ్నగాకళత్రుఁడు=(నదులుభార్యలుగాఁగల) సముద్రునివంటివాఁడును, అనక్ = అనునట్లు, జగంబులక్=లోకములయందు, మిగులక్=అధికముగా, ప్రఖ్యాతిక్=ప్రసిద్ధిని, కాంచెక్=పొందెను. అలం రూపకోల్లేఖములు

క ఆయీశ్వరనృపతికిఁ బు, ణ్యాయతమతి యైనబుక్క-మాంబకుఁ దేజ
స్తోయజహితు లుదయించిరి, ధీయుతు లగునారసింహ-తిమ్మనరేంద్రుల్. 27

అ. ఆయీశ్వరనృపతికిక్ = ఆ యీశ్వరరాజునకును, పుణ్యాయతమతి=పుణ్యములయం దతిశయించినబుద్ధిగలది, వినబుక్కమాంబకుక్=అయినట్టి బుక్కమదేవికిని, తేజస్తోయజహితులు = ప్రతాపమునందుసూర్యులును, ధీయుతులు=దొడ్డబుద్ధితోఁగూడినవారును, అగు నారసింహతిమ్మనరేంద్రుల్=అగునట్టి నారసింహరాజును దిమ్మరాజును, ఉదయించిరి=పుట్టిరి.

క అందు నరసప్రభుఁడు హరి, చందనమందారకుంద-చంద్రాంశునిభా
స్పందయశస్తుందిలదిక్, కందరుఁడై ధాత్రి యేలెఁ-గలుషము లడఁగన్. 28

అ అందుక్=ఆ యిద్దఱిలోను, నరసప్రభుఁడు = నరసింహరాజు, హరిచందన . కందరుఁడై-హరిచందన = శ్రీగంధముతోను, మందార = కల్పవృక్షముతోను, కుంద = మొల్లపువ్వులతోను, చంద్రాంశు=చంద్రకిరణములతోను, నిభ=సమానమైన, అస్పంద=చలనములేని, యశః=కీర్తిచేత, తుందిల=బలిసిన-నిండుకొన్న, దిక్కందరుఁడై=దిక్కులనెడి గుహలుగలవాఁడై, కలుషములు=పాపములు, అడఁగక్=నశించునట్లు, ధాత్రి=భూమిని, ఏలెక్=పరిపాలించెను. అలం. ఉపమ, అతిశయోక్తియు.

ఉ. శ్రీరుచిరత్వభూతిమతి-జిత్వరతాకృతిశక్తికాంతులక్
ధీరత సారభోగముల-ధీనిధి యీశ్వరనారసింహుఁడా
వారిజనాభశంకరుల-వారికుమారుల వారితమ్ములక్
వారియనుంగుమామలను-వారవిరోధులఁ బోలు నిమ్మహిన్. 29

అ. ఇమ్మహిక్ = ఈభూమియందు, ధీనిధి = బుద్ధికిఁ జోటయిన, ఈశ్వర నారసింహుఁడు=ఈశ్వరరాజుకుమారుఁడైననరసరాజు, శ్రీ కాంతులక్ - శ్రీరుచిరత్వ=లక్ష్మిచేఁ బ్రకాశించుటచేతను, భూతి=ఐశ్వర్యముచేతను, మతి = బుద్ధిచేతను, జిత్వరతా = జయించుస్వభావముచేతను, ఆకృతి=రూపముచేతను, శక్తి = సామర్థ్యముచేతను, కాంతులక్ = ప్రకాశముచేతను, ధీరతక్ = ధైర్యముచేతను, సారభోగములక్ = చేవచేతను భోగముచేతను, ఆవారిజనాభశంకరులక్ = ప్రసిద్ధు లగువిష్ణుశివులను, వారికుమారులక్ = ఆవిష్ణుశివులకొడుకు లగుబ్రహ్మకుమారస్వాములను, వారితమ్ములక్ =

ఆ బ్రహ్మయొక్కయు కుమారస్వామియొక్కయుఁ దమ్ము లయినమన్మథవీరభద్రులను, వారియనుంగు మామలన్ = ఆ మన్మథవీరభద్రులకుఁ బ్రియము గల మేనమామ లగుచంద్రమైనాకులను, వారివిరోధులన్=ఆ చంద్రమైనాకుల శత్రువులగు రాహువును నింద్రునిని, పోలున్=సరిపోలును

తా. నరసరాజు లక్ష్మికలిమిచేత విష్ణువు, నైశ్వర్యముకలిమిచేత శివునిని, బుద్ధిచేత బ్రహ్మను, జయశీలత్వముచేతఁ గుమారస్వామిని, జక్కఁదనముచేత మన్మథునిని, సామర్థ్యముచేత వీరభద్రునిని, గాంతిచేతఁ జంద్రునిని, ధైర్యముచేత మైనాకపర్వతమును, జేవచేత రాహువును, భోగముచేత నింద్రునిని, సరిపోలును అలం ఉపమాయథాసంఖ్యములు

సీ. అంభోధివసనవిశ్వంభరావలయంబుఁ, దనబాహుపురిమరకతకముఁ జేసె
నశ్రాంతవిశ్రాణనాసారలక్ష్మికిఁ, గవికదంబముఁ జాతకములఁ జేసెఁ
గకుబంతనిఖిలరాణ్ణికరంబుఁ జరణమం, జీరంబుసాలభంజికలఁ జేసె
మహనీయనిజవినిర్మలయశస్సరసికి, గగనంబుఁ గలహంసకంబుఁ జేసె
నతిశితకృపాణకృత్తమత్తారివీర, మండలేశసకుండలమకుటనూత్న
మస్తమాల్యపరంపరామండనార్చి, తేశ్వరుం డగునారసింహేశ్వరుండు. 30

అ. అతిశిత...ఈశ్వరుండు-అతిశిత=మిక్కిలి వాఁడియయిన, కృపాణ = కత్తిచేత, కృత్త= నఱకఁబడిన, మత్త=మదించిన, అరి = శత్రువులందు, వీర=శూరులైన, మండలేశ = రాజులయొక్క, సకుండల = చెవిపోఁగులతోఁగూడిన, మకుట=కిరీటములుగల, నూత్న = క్రొత్తలయిన, మస్తమాల్య= శిరస్సులమాలికలయొక్క, పరంపరా=సమూహములనెడు, మండన = అలంకారములచేత, అర్చిత= పూజింపఁబడిన, ఈశ్వరుండు=శివుఁడుగలవాఁడు, అగు నారసింహేశ్వరుండు = అగునట్టి నరసరాజు, అంభోధి. వలయంబున్-అంభోధివసన = సముద్రమునే వస్త్రముగాఁగల, విశ్వంభరా=భూమియొక్క, వలయంబున్=మండలమును, తనబాహుపురిమరతకమున్ = తనయొక్క భుజకీర్తులకు మరకతమణిగా, చేసెన్ = చేసెను-అనాయాసముగా భూమిని బాలించెననుట. అతిశయోక్తి అశ్రాంత. లక్ష్మికిన్- అశ్రాంత=ఎడతెగని, విశ్రాణన = ఈవియనెడి, ఆసార=ధారారూపమైన యెడతెగని వానయొక్క, లక్ష్మికిన్=కలిమికి, కవికదంబమున్=కవులయొక్క సమూహమును, చాతకములన్=వానకోయిలలనుగా, చేసెన్=చేసెను. రూపకము కకుబంత...నికరంబున్-కకుబంత = దిగంతములయందలి, నిఖిల=సమస్తమయిన, రాట్=రాజులయొక్క, నికరంబున్=సమూహమును, చరణమంజీరంబు సాలభంజకలన్= కాలిగండపెండేరమునందుఁ జెక్కఁబడిన బొమ్మలనుగా, చేసెన్=చేసెను. అతిశయోక్తి మహనీయ.. సరసికిన్-మహనీయ=పూజ్యమైన, నిజ=తనదైన, వినిర్మల=మిక్కిలి స్వచ్ఛమైన, యశః=కీర్తియనెడు, సరసికిన్=కొలనికి, గగనంబున్ = ఆకాశమును, కలహంసకంబున్ = హంసపక్షినిగా, చేసెన్=చేసెను. రూపకము, అతిశయోక్తియు

తా. నరసరాజు భూమిని దనబాహుబలముచే ననాయాసముగా నేలె ననియుఁ, గవులను నిరంతరము నీవు లిచ్చి మనిచెననియు, సకలదేశాధిపతులను గెలిచినందులకు బిరుదుగాఁ దనకాలిగండపెండేరమునందు నారాజులరూపములు చెక్కించెననియు, ఆకాశమును దాఁటునట్లు వ్యాపించిన కీర్తి గలవాఁ డయ్యెననియు, శివుఁడు కపాలమాలికలు ధరించువాఁడుగనుకఁ దనశత్రువులతలలు నఱికి సరములుగాఁగూర్చి శివునికి సమర్పించెను.

తే. ఆనృసింహప్రభుండు దిప్పాంబవలన, నాగమాంబికవలన నందనులఁ గాంచె
వీరనరసింహరాయభూవిభుని నచ్యు, తాంశసంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు. 31

అ ఆనృసింహప్రభుండు = ఆనరసరాజు, తిప్పాంబవలనన్ = తిప్పమ్మవలనను, నాగమాంబికవలనన్ = నాగమ్మవలనను, వీరనరసింహరాయభూవిభునిన్ = వీరనరసింహరాజును, అచ్యుతాంశసంభవున్ = విష్ణువుయొక్క యంశమునందుఁ బుట్టిన, కృష్ణరాయక్షితీంద్రున్ = కృష్ణరాయప్రభువును, నందనులన్ = (ఈయిద్దఱు) కొడుకులను, కాంచెన్ =కనియెను.

క. వీరనృసింహుఁడు నిజభుజ, దారుణకరవాలపరుషధారాహతవీ
రారి యగుచు నేకాతప, వారణముగ నేలె ధర నవారణమహిమన్. 32

అ వీరనృసింహుఁడు=వీరనరసింహరాజు, నిజ అరి-నిజ=తనదైన, భుజ=బాహువునందలి, దారుణ=తీక్ష్ణమయిన, కరవాల = కత్తియొక్క, పరుష=కఠినమైన, ధారా=వాదరచేత, హత=నఱికి చంపఁబడిన, వీర = శూరులయిన, అరి=శత్రువులుగలవాఁడు, అగుచున్ = అవుచును, అవారణమహిమన్=అడ్డులేని ప్రభావముచేత, ఏకాతపవారణముగన్ = ఏకచ్ఛత్రాధిపత్యముగా, ధరన్=భూమిని, ఏలెన్ =పాలించెను.

క. ఆవిభునవంతరంబ ధ, రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల, దేవియునుం దనకుఁ గూర్చుదేవేరులు గాన్. 33

అ ఆవిభునవంతరంబ = ఆవీరనరసింహరాయని పిమ్మటనె, కృష్ణరాయఁడు=కృష్ణదేవరాయఁడు, చిన్నాదేవియున్ = చిన్నాదేవియనునామెయు, శుభమతి=మంచిబుద్ధిగల, తిరుమలదేవియునున్ = తిరుమలదేవియనునామెయు, తనకున్ =కృష్ణరాయఁడయిన తనకు, కూర్చుదేవేరులుగాన్ =ప్రియులయిన పట్టపుభార్యలు కాఁగా, ధరావలయమున్ =భూమండలమును, తాల్చెన్ =ధరించెను

సీ. తొలఁగెను ధూమకేతుక్షోభ జనులకు, నతివృష్టిదోషభయంబు వాసెఁ
గంటకాగమభీతి గడచె నుద్ధతభూమి, భృత్కటకంబెల్ల నెత్తువడియె
మానె నఘస్ఫూర్తి మరుభూములందును, నెలమూఁడువానలు నిండఁ గురిసె
నాబాలగోపాల మఖిలసద్ద్విజమును, నానందమున మన్కి నతిశయిల్లెఁ
బ్రజలకెల్లను గడు రామరాజ్య మయ్యెఁ, జారుసత్త్వాఢ్యుఁ డీశ్వరనారసింహ
భూవిభునికృష్ణరాయఁ డభ్యుదయ మొంది, పెంపుమీఱంగ ధాత్రిఁ బాలింపుచుండ.

అ చారుసత్త్వాఢ్యుఁడు = ఒప్పుచున్న బలముగలవాఁడయిన, ఈశ్వరనారసింహభూవిభునికృష్ణరాయఁడు= ఈశ్వరనారసింహరాజుకొడుకైన కృష్ణరాయఁడు, అభ్యుదయము= రాజ్యాధిపత్యసంబంధమైన మేలును, ఒంది=పొంది, పెంపు=అభివృద్ధి, మీఱంగన్ = అతిశయింపఁగా, ధాత్రిన్ =భూమిని, పాలింపుచుండన్ = ఏలుచుండఁగా (ఇట ఇంపుగాగమము విచార్యము), జనులకున్ =భూప్రజలకు, ధూమకేతుక్షోభ=అరిష్టసూచకమయిన యగ్నియొక్క యుపద్రవము, తొలఁగెను=లేకపోయెను. అతివృష్టిదోషభయంబు=అధికమయిన వానవలనిభయము, పాసెన్ =తొలఁగిపోయెను కంటకాగమభీతి=అల్పశత్రువుల రాకవలనిభయము – అనఁగా బందిపోటుదొంగ మొదలగువారివలని భయము, కడచెన్ =తొలఁగిపోయెను. ఉద్ధత .కటకంబు – ఉద్ధత=దురహంకారులైన, భూమిభృత్ =రాజుల

యొక్క, కటకంబు=స్థానము, ఎల్లన్=అంతయు, ఎత్తుపడియెన్=అణఁగిపోయెను అఘస్ఫూర్తి=పాపములయొక్క విజృంభణము, మాసెన్=స్వరూపనాశనమొందెను మరుభూములందును=నిర్జలప్రదేశములందుఁగూడ, నెలమూఁడువానలు=నెలకు మూఁడువానలు, నిండన్=కొఱఁత లేకుండునట్లుగా, కురిసెన్=వర్షించెను, ఆబాలగోపాలము=చిన్నవాండ్రు గొల్లవాండ్రు మొదలుకొని, అఖిలసద్ద్విజమును=సమస్తమయిన సత్పురుషులసమూహమును,ఆనందమునన్=సంతోషముతో, మన్కికిన్=జీవించుటచేత-(పా. అఖిలసత్ప్రజయును ఆనందమగుమన్కికిన్ = ఎల్లసజ్జనులును సంతోషమైన మనుగడతోనుండుటచేత.) అతిశయిల్లెన్=మించెను ప్రజలకున్=జనులకు, ఎల్లను=అందఱకును, కడున్=మిక్కిలి, రామరాజ్యము=రామునిరాజ్యమువంటి సుఖమయినరాజ్యము, అయ్యెన్=ఆయెను.

మ. అలపోత్రిప్రభుదంష్ట్ర భోగివరభోగాగ్రాళిరా లుద్భటా
చలకూటోపలకోటిరూపుచెడ నిచ్చల్ రాయఁగా నైనమొ
క్కలు భూకాంతకు నున్న నయ్యె నరసక్ష్మాపాలుశ్రీకృష్ణరా
యలబాహామృగనాభిసంకుమదసాంద్రాలేపపంకంబునన్. 35

అ. భూకాంతకున్=భూదేవికి, అల. దంష్ట్రి - అల=ప్రసిద్ధుఁడయిన, పోత్రిప్రభు=ఆదివరాహస్వామియొక్క, దంష్ట్రి=కోఱయును, భోగివర . రాలు-భోగివర=ఆదిశేషునియొక్క, భోగ=పడగలయొక్క, అగ్ర=కొనలయొక్క, ఆళి=పంక్తియందలి, రాలు=రాళ్లును - (ఇచట రాలనఁగా రత్నములు), ఉద్భట . కోట-ఉద్భట=గొప్పవైన, అచల=పర్వతములయొక్క,కూటోపల=శిఖరములందలి రాళ్లయొక్క, కోటి=సమూహమును, రూపుచెడన్=చక్కఁదనము చెడునట్లు, నిచ్చల్=ఎల్లప్పుడును, రాయఁగాన్=ఒరసికొనఁగా, ఐనమొక్కలు = ఏర్పడినట్టిగాయపుగుంటలు, నరసక్ష్మాపాలు పంకంబునన్-నరసక్ష్మాపాలుశ్రీకృష్ణరాయల = నరసరాజుకొడుకైనశ్రీకృష్ణరాయనియొక్క, బాహా = భుజమునందలి, మృగనాభి=కస్తురిచేతను, సంకుమద=జవ్వాజిచేతను, సాంద్ర=గట్టిపడిన, ఆలేపన = పూయునట్టిగంధమునొక్క, పంకంబునన్=బురదచేత, నున్ననయ్యెన్=నునుపుగానేర్పడెను.

తా. మునుపు భూమిని వహించిన యాదివరాహముకోఱ యాదిశేషుని శిరస్సునందలిరాళ్లు కులపర్వతశిఖరములందలిరాళ్లసమూహము నీమూఁడు నొరయుటచేత భూమియందు నొక్కులుకలిగెను. ఇప్పుడు కృష్ణరాయలు, తనభుజముచేత భూమిని వహించుటవలన నాయనభుజమునకుఁ బూసియున్న మంచివాసనతోడిగంధముతగిలి యాభూమియొక్కనొక్కులుమాసి నున్ననయ్యెను. అనఁగాఁ గృష్ణదేవరాయఁడు భూమిని భరించినయాదివరాహమును నాదిశేషునిఁ గులపర్వతములను గ్రిందుపఱిచి తనబాహువుచేత సర్వభూభారమును వహించినాఁడని తాత్పర్యము. చందనము పట్టించినయెడ గాయములు మాయుటస్వభావము. భూమిని జక్కఁగా నేలెననియు నతం డెప్పుడు సుగంధిచందనాలంకృతుఁడై యుండుననియు భావము అలం. అతిశయోక్తి

ఉ. క్రూరవనేభదంతహతికుడ్యపరిచ్యుతవజ్రపంక్తిఁ బొ
ల్పారుమిడుంగురుంబురువు కలంచు వెసం గొనిపోయి పొంత శ్రం
గారవనద్రుమాళి గిజిగాఁడులు గూఁడులఁ జేర్చు దీపికల్
గా రహిఁ గృష్ణరాయమహికాంతునిశాత్రవపట్టణంబులన్. 36

అ. కృష్ణరాయ పట్టణంబుల౯ - కృష్ణరాయ మహీకాంతుని = కృష్ణరాయమహారాజు యొక్క, శాత్రవపట్టణంబుల౯ = శత్రువులయొక్క పట్టణములయందు, క్రూర..పంక్తి౯ - క్రూర = కఠినములయిన (ఇది దంతములకు విశేషణము), వనేభ = అడవియేనుఁగులయొక్క, దంత = కొమ్ములచేత, హత = కొట్టఁబడిన, కుడ్య = గోడలనుండి, పరిచ్యుత = అంతటను రాలిన, వజ్రపంక్తి౯ = వజ్రములయొక్క సమూహమును, పొల్పారుమిడుంగురుం బురువులు = ప్రకాశించునట్టి మిణుఁగురుఁబురుఁగులు, అంచు౯ = అనుకొనుచు, గిజిగాఁడులు = బంగారుపిచ్చుకలనెడిపక్షులు, వెస౯ = శీఘ్రముగా, కొనిపోయి = తీసికొని పోయి, ప్రాంత౯ = సమీపమునందునుండెడి, శృంగారవనద్రుమాళి౯ = ఉద్యానవనమునందుఁ గల చెట్ల యొక్క సమూహమునందలి, గూఁడుల౯ = తమగూండ్లయందు, దీపికల్ గా౯ = దీపములుగా, రహి౯ = ఆసక్తితో, చేర్చు౯ = పెట్టును. (గిజిగాఁడులు తమగూఁడులలో రాత్రి వెలుతురుకై మిణుఁగురుఁబురుఁగుల నుంచుకొనుట ప్రసిద్ధము.)

తా. కృష్ణరాయల శత్రువులయొక్క పట్టణములు పాడుపడి యేనుఁగులు నివసించుటకు యోగ్యమవునంతటి యడవులు కాఁగా, నందడవియేనుఁగులు గోడలను దంతములతోఁ బొడుచుటవలన యా గోడలనుండి రాలినవజ్రములను గిజిగాఁడు లనుపక్షులు మిణుఁగురుఁబురుఁగులని భ్రమించి వానిని దీసికొనిపోయి తమగూండ్లలో రాత్రికాలములయందు వెలుతురునిమిత్త ముంచుకొనును. అలంకారము. అతిశయోక్తి, భ్రాంతిమంతమును

సీ. తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాఁకి తీండ్రించు, నసిలోహమున వెచ్చనయి జనించె
మఱి కొండవీ డెక్కి మార్కొని నలిదైన, యలకసవాపాత్రు నంటి రాఁజె
నట సాఁగి జమ్మిలోయఁ బడి వేగ దహించెఁ, గోన బిట్టేర్చెఁ గొట్టానఁ దగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ గరఁచె గౌతమిఁ గ్రాఁచె, నవుల నాపొట్నూరఁ గరవులుకొనియె
మాఁడెములు వ్రేల్చె నోడ్ఢాదిమసియొనర్చెఁ, గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగిపఱవఁ
దోఁకచిచ్చన నౌర యుద్ధురతఁ గృష్ణ, రాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని.

అ. కృష్ణరాయ మహాగ్ని - కృష్ణరాయ = కృష్ణరాయనియొక్క, బాహు = భుజములయొక్క, ప్రతాప = పరాక్రమముయొక్క, జాగ్రత్ = ప్రకాశించుచున్న, మహాగ్ని = గొప్పనిప్పు (ఇది కర్త), ఉద్ధురత౯ = పరవి కమ్ముకొనుటచేత, తోఁకచిచ్చన౯ = నిప్పురగిలించిన పిడుకలవరుసయో యన్నట్లు, (ఉత్ప్రేక్ష), తొలుదొల్త౯ = మొట్టమొదట, ఉదయాద్రిశిల౯ = ఉదయగిరి యనెడు చెకుముకి రాతిని, తాఁకి = తగిలి, తీండ్రించునసిలోహమున౯ = తీక్ష్ణమగు ఖడ్గమనెడి యుక్కునవలన, వెచ్చనయి = వేఁడియయి, జనించె౯ = పుట్టెను - కృష్ణరాయలు మొట్టమొదట నుదయగిరి యనుపట్టణమును జయించె ననుట (రూపకము) మఱి = పిమ్మట, కొండవీడు = కొండవీడనెడి పట్టణమును, ఎక్కి = ఆక్రమించి, మార్కొని = ఎదుర్కొని, నలిదైన యలకసవాపాత్రు౯ = నలఁగియున్న ప్రసిద్ధుఁడైన కసవాపాత్రుఁడనెడురాజును, అంటి = తగులుకొని - కసవాపాత్రునంటి యనుటచే గడ్డియనుటకుఁ దగిన కసవాపాత్రునంటి యనుట, రాఁజె౯ = రగులుకొనెను - ఉదయగిరిని జయించినపిమ్మట కసవాపాత్రుఁడనెడు కొండవీటిరాజును జయించె ననుట (రూపకము). అట౯ = అటుపిమ్మట, సాఁగి = అందుండి వెడలి, జమ్మిలోయ౯ = జమ్మువంటిజమ్మిలోయ యనుమన్నెములో, పడి = పడినదై, వేగ = త్వరగా, దహించె౯ = కాల్చెను. (పా వేఁగిదహించె౯ = వేఁగిదేశమును కాల్చెను) కోన౯ = కోనయనెడిమన్నె

మును, బిట్టేర్చెన్ = శీఘ్రముగాఁ గాల్చెను. కొట్టానన్ = కొట్టామను దేశమున, తగిలెన్ = అంటుకొనెను కనకగిరిస్ఫూర్తిన్ = కనకగిరిదుర్గమనెడిబంగారుకొండయొక్క యతిశయమును, కరఁచెన్ = కరఁగించెను గౌతమిన్ = గోదావరిని, క్రాఁచెన్ = తపింపఁజేసెను, అవులన్ = అటుపిమ్మట, ఆపొట్నూరన్ = పొట్నూరనెడి ప్రసిద్ధపట్టణమునందు, రవులుకొనియెన్ = చక్కఁగా మండెను. మాడెములు = మాడెము లనెడి మన్నెపుభూములను, ప్రేల్చెన్ = ప్రేలించెను ఒడ్డాది = ఒడ్డాదియనెడి పట్టణమును, (ఓఢ్రదేశము నని కొందఱు) మసియొనర్చెన్ = బొగ్గుగాఁజేసెను. గజరాజు = గజపతి, కలఁగి = కలఁతనొంది, పఱవన్ = పరుగెత్తునట్లు, కటకపురిన్ = కటకమనుపట్టణమును, కాల్చెన్ = దహించెను. ఔర = ఆశ్చర్యము

తా. కృష్ణదేవరాయలు మొట్టమొదట నుదయగిరిపై దండెత్తి జయించి పిమ్మట క్రమముగా కొండవీటిని, జమ్మిలోయను, వేఁగిదేశమును, కోనదేశమును, కొట్టామదేశమును, కనకగిరిని, గోదావరీతీరదేశమును, పొట్నూరిని, మాడెములను, ఒడ్డాదిపురమును, కటకమును జయించెనని తాత్పర్యము ఇట్లుదయగిరి మొదలు కటకమువఱకు బహుదీర్ఘముగా నాప్రతాపాగ్ని ప్రాఁకుటవలన తోఁకచిచ్చుగా నుత్ప్రేక్షింపఁబడెను ఇట ప్రతాపమును అగ్నిగా రూపించుటవలన అగ్నిధర్మములగు 'రాజె' 'దహించె' మొదలగు క్రియాపదములు దానికిఁ బ్రయుక్తము లయ్యెను. ఇందు రూపకమునకు నుత్ప్రేక్షకును సంకరము

మ. ధరఁ గెంధూళులు కృష్ణరాయలచమూధాటీగతిన్ వింధ్యగ
హ్వరముల్ దూఱఁగఁ జూచి తా రచటఁ గాఁకన్ పై యుండుటం జాల న
చ్చెరువై యెట్టనివింతచీఁకటులు వచ్చెం జూడరే యంచు వే
సొరిదిం జూతురు వీరరుద్రగజరాట్శుద్ధాంతముగ్ధాంగనల్. 38

అ. వీరరుద్ర అంగనల్ - వీరరుద్రగజరాట్ = వీరరుద్రగజపతిరాజుయొక్క, శుద్ధాంత = అంతఃపురమునందలి, ముగ్ధాంగనల్ = లోకధర్మము నెఱుఁగని స్త్రీలు, తారు = తాము, కృష్ణరాయల చమూధాటీగతిన్ = కృష్ణరాయల సైన్యముయొక్క దాడి నడచుటచేత, ధరఁ గెంధూళులు = భూమియందలి యెఱ్ఱని దుమారములు, వింధ్యగహ్వరముల్ = వింధ్యపర్వతముగుహలను, దూఱఁగన్ = చొరఁబాఱఁగా, చూచి = ఆదుమారమును జూచి, అచటన్ = ఆపర్వతగుహలయందు, కాఁకపై = కాఁపురమయి, ఉండుటన్ = ఉండుటచేత, చాలన్ = మిక్కిలి, అచ్చెరువై = ఆశ్చర్యము కలిగి-ఆశ్చర్యపడి, ఎట్టనివింతచీఁకటులు = ఎఱ్ఱనివా నుండెడి క్రొత్తచీఁకట్లు, వచ్చెన్ = వచ్చెను, చూడరే = మీరు చూడుఁడు, అంచున్ = ఒకరితో నొకరను కొనుచు, వే = శీఘ్రముగా, సొరిదిన్ = వరుసగా (నిలిచి), చూతురు = చూచుచుందురు

తా. వీరరుద్రగజపతి, కృష్ణరాయలు దండెత్తివచ్చుట విని యంతకుమును పే భయపడి వింధ్యపర్వతమునకుఁ బాఱిపోఁగా నావింధ్యగుహలందు వాసము నేయునట్టి యారాజుభార్యలు, కృష్ణరాయల దండువచ్చుటచే నేలనుండి రేఁగి యాగుహలకు దట్టముగా వ్యాపించిన యెఱ్ఱనిదుమ్మును జూచి యట్టిదుమ్ము నెన్నఁడును జూచియెఱుఁగనివారగుటచే నది దుమ్మని తెలిసికోలేక యెఱ్ఱనిచీఁకటి యని భ్రమించి యొకరితో నొకరు చెప్పుకొనిరని తాత్పర్యము వీరరుద్రగజపతి కృష్ణదేవరాయలు తనపైదండెత్తివచ్చెడివృత్తాంతము విని యంతఃపురస్త్రీలతోడ వింధ్యపర్వతమునకుఁ బాఱిపోయి యందలిగుహలలో డాఁగియుండెనని భావము. ఇట్లు ధూళులను నెఱ్ఱనిచీఁకటులనుగా భ్రమించుట వానిబాహుళ్యమును నిబిడత్వమును దెలుపుచున్నవి. అలం. సంబంధాతిశయోక్తి. మఱియు. 'ముగ్ధ' యను

విశేషణము సాభిప్రాయమ్ము గాన పరికరము ఎట్టనిదుమ్ము నెట్టని చీఁకటులుగా భ్రమించుటచే భ్రాంతిమంతము పరికరభ్రాంతిమంతములకు సంగాంగిభావము • కృష్ణరాయలు దండుతో వచ్చు నను హేతుప్రసక్తిచేతనే వీరరుద్రగజపతి భార్యాసహితముగా వింధ్యపర్వతమునకుఁ బాఱి వసించియున్న కార్యము గలిగినట్లు వర్ణించుటం జేసి చపలాతిశయోక్తి

చ. అభిరతిఁ గృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్నూరికడ నిల్పినకంబము సింహభూధర
ప్రభుతిరునాళ్లకుం దిగుసురప్రకరంబు కళింగమేదినీ
విభునపకీర్తికజ్జలము వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్. 39

అ. కృష్ణరాయఁడు=కృష్ణదేవరాయఁడు, అభిరతిన్=ఆసక్తితో, జయాంకములన్=తన గెలుపు బిరుదాంకములను, లిఖియించి=వ్రాసి, తాళసన్నిభముగన్ = తాటిచెట్టుతో సమానముగా-మిక్కిలి పొడుగుగా ననుట, పొట్నూరికడన్=పొట్నూరియొద్ద, నిలిపినకంబమున్=నాటినట్టి స్తంభమును, సింహభూధరప్రభుతిరునాళ్లకున్ = సింహాచలనాథుఁడైన వరాహనరసింహస్వామియుత్సవమునకు, దిగుసుర ప్రకరంబు=స్వర్గమునుండి భూమికిదిగివచ్చునట్టి దేవతలయొక్క సమూహము, కళింగ ..కజ్జలము-కళింగ మేదినీవిభు=కళింగరాజుయొక్క, అపకీర్తి=అపయశస్సనెడి, కజ్జలమున్=మసిని, వేమఱున్=మాటిమాటికి, పెట్టి=పూసి-అనఁగా కప్పువేసి, నిచ్చలున్=ఎల్లప్పుడును, పఠించున్=చదువును. ఇట 'వేమఱున్' 'నిచ్చలున్' అను శబ్దములచే దేవతలు ప్రతిసంవత్సరము నుత్సవమునకు వచ్చునపు డెల్లఁ జదువుచుందు రనియుఁ, గళింగరాజునపయశస్సు అనుమసి యెల్లప్పుడు నా యక్షరములపం బూయుటకుఁ జాలినట్టు లపరిమితముగా నున్నదనియు సూచితము.

తా. కృష్ణరాయలు, తా నాయాయిదేశములను జయించినవృత్తాంతములు వ్రాసి పొట్నూరియొద్ద జయస్తంభము నాటఁగా నాపొట్నూరిసమీపమునందు సింహాచలమునందలి వరాహనరసింహస్వామి యుత్సవమునకుఁ బ్రతిసంవత్సరమును స్వర్గమునుండి దిగువచ్చునట్టిదేవతలు దారిలో నత్యున్నతమయి యొప్పునట్టి యాజయస్తంభమును జూచి యందలిజయవార్తలను గళింగరాజు పరాజయము నొందుటచే నతనికిఁ గలిగిన యపారమయిన యపకీర్తి యను మసిచేఁ గప్పువేసి చదువుచుందురు. అలం. అతిశయోక్తి, రూపకమును. కళింగరాజు కృష్ణరాయలచే జయింపఁబడె నని ధ్వని.

మహాస్రగ్ధర. ఎకరాలన్ మండువాసాహిణములఁ గలభద్రేభసందోహవాహ
ప్రకరంబుం గొంచుఁ దత్తత్ప్రభువులు వనుపన్ రాయబారుల్ విలోకో
త్సుకులై నిత్యంబు శ్రీకృష్ణునియవసరముల్ చూతు రందంద కొల్వాం
దక యాప్రత్యూష మాసంధ్యము పనివడి తన్మందిరాళిందభూమిన్. 40

అ. తత్తత్ప్రభువులు=ఆయాయిరాజులు, వనుపన్=పంపఁగా, రాయబారుల్=దూతలు, ఎకరాలన్ = మొగసాలలయందును, మండువాసాహిణములన్ = ఒకతట్టుగోడ లేనిదూలముల సరియెత్తుకంబములు గలగుఱ్ఱపుశాలలయందును, కల ప్రకరంబుల్-కల = ఉన్నట్టి, భద్రేభ=భద్రజాతియేనుఁగుల యొక్క, సందోహ= సమూహమును, వాహ=గుఱ్ఱములయొక్క, ప్రకరంబున్ = సమూహమును, కొం

చుఁ=కానుకలు పెట్టుటకై తీసికొనుచు, విలోకోత్సుకులై=దర్శనము చేయుటయందాసక్తిగలవారై, నిత్యంబున్=ఎల్లప్పుడును, కొల్వందక=దర్శనము దొరకక, ఆప్రత్యూషము=తెల్లవారినది మొదలుకొని, ఆసంధ్యము=సాయంకాలమువఱకును, పనిపడి=ప్రయత్నపడి, తన్మందిరాళిందభూమిన్=ఆకృష్ణరాయల యొక్క యింటివాకిటిప్రదేశమునందు, శ్రీకృష్ణనియవసరముల్ = శ్రీకృష్ణమూర్తి యయినశ్రీకృష్ణ రాయని సమయములను, అంపంద=మఱిమఱి, చూతురు=ఎదురుచూచుచుందురు కానుక పంపినవి ఏకరాలలోని యేనుఁగులును మందువాలలోని గుఱ్ఱములు ననుటచే నవి మిక్కిలి యుత్తమము లైనవని యాశయము.

తా. ఆయాదేశపురాజులచేఁ బంపఁబడినదూతలు కృష్ణరాయలకుఁ గానుకఁగా సమర్పించుటకై కొనివచ్చినయేనుఁగులను గుఱ్ఱములను ముందిడుకొని శ్రీకృష్ణరాయల నగరివాకిట దర్శనార్థు లయి యుండి దర్శనము లభింపమిచే సమయము నిరీక్షించుచుఁ బ్రతిదినము నుదయము మొదలు సాయంకాలమువఱకుఁ గాచియుందురని తాత్పర్యము. కృష్ణరాయలకు ననేకులురాజులు కానుకలతోడ రాయబారము లంపుచుందురని భావము

చ. మదకలకుంభికుంభనవమౌక్తికముల్ గనుపట్టు దట్టమై
వదలక కృష్ణరాయకరవాలమునం దగుధారనీట న
భ్యుదయము నొంది శాత్రవులపుట్టి మునుంగఁగ ఫేనపంక్తితోఁ
బొదిగొని పైపయిన్ వెడలుబుద్బుదపంక్తులువోలెఁ బోరులన్ 41

అ. పోరులన్=యుద్ధములయందు, కృష్ణరాయకరవాలమునన్=కృష్ణరాయనికత్తియందు, తగుధారనీటన్ = ఒప్పునట్టివాదర యనునీటియందు, మద మౌక్తికముల్ - మదకల = మదముచే నొప్పుచున్న, కుంభి = ఏనుఁగులయొక్క, కుంభ = కుంభస్థలములయందలి, నవ=క్రొత్తవైన, మౌక్తికముల్ = ముత్తెములు, అభ్యుదయమున్ = శుభోదయమును, ఒంది=పొంది-విశేషమయి, శాత్రవులపుట్టి = శత్రురాజులయొక్కపుట్టి, మునుంగఁగన్ = మునిఁగిపోవుచుండఁగా-(పుట్టి యనఁగా వెదురుబద్దలు లోనగువానితో నిడుపాటితొట్టెవలె నల్లి మీఁదఁ దోలుకట్టి యేఱు దాఁటుట కుపయోగించు సాధనము), ఫేనపంక్తితోన్=నురుఁగులసమూహముతో, పొదిగొని=జతకూడి, పైపయిన్=మీఁదమీఁద, వెడలు బుద్బుదపంక్తులువోలెన్ =లేచునట్టి నీరుబుగ్గలసమూహములవలె, వదలక =ఎల్లప్పుడు, దట్టమై=తఱుచై, కనుపట్టున్ =అగపడుచుండును.

తా. యుద్ధములందుఁ గృష్ణదేవరాయలు కత్తితో శత్రురాజులయేనుఁగులకుంభస్థలములు పగుల నఱకినప్పుడు వానివలననుండి వెడలునట్టి ముత్యములు కత్తివాదర యనెడినీటియందుఁ బగవారిపుట్టి మునుఁగఁగా నురుఁగుతో లేచెడినీటిబుగ్గలవలెఁ గానవచ్చుచుండెను.

ఒకవస్తువు నీటిలో మునుఁగఁగా నురుఁగును నీటిబుగ్గలును లేచునట్లు కృష్ణరాయల కత్తివాదర యనునీట పగవారిపుట్టి మునుఁగఁగా లేచిన నురుఁగును నీటిబుగ్గలునుంబోలి దానికి నేనుంగు తలలనుండి యంటిన ముత్తెములు గానిపించె ననియర్థము. ఆముత్తెములలో సన్నవి నురుఁగుగాను, పెద్దవి నీటిబుగ్గలుగాను నుత్ప్రేక్షింపఁబడినవి పుట్టి మునుఁగుట యనఁగా ప్రవాహమునందుఁ బుట్టి యొక్క దాఁటుచుండఁగా నది మునిఁగినట్లు మనుష్యులు తమవ్యాపారములందుఁ బ్రవర్తించుచుండఁగా నాపనులు చెడి యాపదలువచ్చుచుండుటయని యర్థము. కనుక, ఇప్పు డేమిపుట్టిమునిఁగెను అని జనులు వాడుట వాడుకగా

మున్నది 'శాత్రవులపుట్టి! మునింగె' ననుచోఁ గృష్ణరాయ లనేకశత్రువుల నడంచెననియు, శాత్రవులు గాక శాత్రవులపుట్టియే మునింగె ననుటవలన వారు తమ రాజ్యాదికములే కోలుపోయిరి గాని శరణుఁ జొచ్చుటచేఁ బ్రాణములు గోలుపోవలేదనియు ధ్వనించెడిని దీనిచేఁ గృష్ణరాయలకు శత్రువుల నడంచు ప్రచండపరాక్రమముతోఁ గూడ శరణన్నఁ గాచు కారుణ్యాతిశయమును సూచిత మగుచున్నది. కుంభికుంభమౌక్తికము లతనికరవాలధారఁ గనుపట్టుననుటచే నతం డసంఖ్యాము లయినశత్రురాజగిజములఁ గత్తిచే నఱకినాఁడనియు వ్యంజితము. జలము మహావేగముతోఁ బ్రవహించుటచేఁ గలిగిన సుళ్లయందే పుట్టి మునుంగును గాన యిట్టిసుళ్లకుఁ బ్రతియైన ఖడ్గము మిక్కిలి తీక్ష్ణమయినదనియు వేగవత్ప్రవాహస్థానీయ మైన ఖడ్గధారికృష్ణరాయబాహువు మహాబలాఢ్య మైనదనియుఁ దెలియఁదగు. ఏనుఁగుల కుంభస్థలములందు ముత్తెములు పుట్టుననుట సుప్రసిద్ధము ముత్తెముల నురుఁగుతోఁగూడిన నీటిబుగ్గలుగా నుత్ప్రేక్షించుటచే నలం. ఉత్ప్రేక్ష. 'ధారనీటన్' అనుచో రూపకము. ఖడ్గధారయందు కుంభికుంభమౌక్తికము లంటె ననుచో నతిశయోక్తి. రూపకాతిశయోక్తులకును ఉత్ప్రేక్షకును అంగాంగిభావము

సీ. వేదండభయదశుండాదండనిర్యాంత, వమథుపుల్ పైఁ జిల్కు వారిగాఁగఁ
దత్కర్ణవిస్తీర్ణతాళవృంతోద్ధూత, ధూళి చేటలఁ జల్లుదుమ్ముగాఁగ
శ్రమబుర్బురత్తురంగమనాసికాగళ, త్పంకంబు వైచు కర్దమముగాఁగఁ
గుపితయోధాక్షిప్తకుంతకాంతారఖే, లనములు దండఘట్టనలుగాఁగఁ
జెనఁటిపగఱప్రతాపంబుచిచ్చులార్చు, కరణిగడిదేశములుచొచ్చికలఁచియలఁచు
మూరురాయరగండాంక వీరకృష్ణ, రాయభూభృద్భయంకరప్రబలధాటి. 42

అ. మూరురాయర... ధాటి-మూరురాయరగండ=అశ్వపతి గజపతి నరపతులను ముగ్గురురాజులను జయించినశూరుఁ డనెడు, అంక=బిరుదుపేరుగల, వీర=శూరుఁడైన, కృష్ణరాయభూభృత్=కృష్ణరాయప్రభువుయొక్క, భయంకర=వెఱపునుగలుగఁజేయునట్టి, ప్రబల = అధికమయిన, ధాటి-దాడి=యుద్ధయాత్ర(ఇదికర్త), వేదండ...వమథుపుల్ - వేదండ=ఏనుఁగులయొక్క, భయద=వెఱపునిచ్చునట్టి, శుండాదండ=కఱ్ఱలవంటితొండములనుండి, నిర్యాంత=వెడలిన, వమథుపుల్=తుంపురులు, పైఁజిల్కువారిగాఁగన్=పయిని జల్లునట్టిజలమగుచుండఁగా; తత్కర్ణ. ధూళి-తత్=ఆయేనుఁగులయొక్క, కర్ణ=చెవులనెడు, విస్తీర్ణ=విరివియయిన, తాళవృంత=విసనకఱ్ఱలచేత, ఉద్ధూత=ఎగురఁగొట్టఁబడిన, ధూళి=పరాగము, చేటలన్ = చేటలతో, చల్లుదుమ్ముకాఁగన్ = చల్లునట్టి దుమ్మగుచుండఁగా, శ్రమ. పంకంబు - శ్రమ = అలఁతచేత, బుర్బురత్ = బురబురయని ధ్వనిచేయుచున్న, తురంగమ = గుఱ్ఱములయొక్క, నాసికా=ముక్కులనుండి, గళత్ = జాఱుచున్న, పంకంబు=బురదవంటిచీమిడి, వైచు. కర్దమముగాఁగన్=(నిప్పు చల్లాఱుటకై) వేయునట్టిబురదయగుచుండఁగా; కుపిత. .ఖేలనములు- కుపిత = కోపించిన, యోధ = యుద్ధవిరులచేత, ఆక్షిప్త = చిమ్మఁబడిన, కుంతకాంతార = వెదురుటడవివంటియీఁటెలయొక్క, ఖేలనములు = ఆటలు, దండఘట్టనలుకాఁగన్ = కఱ్ఱలతోకొట్టుటలగుచుండఁగా; చెనఁటి చిచ్చులు- చెనఁటి = దుష్టులైన, పగఱ = శత్రువులయొక్క, ప్రతాపంబుచిచ్చులు=పరాక్రమ మనెడునిప్పులను, ఆర్చుకరణిన్=చల్లార్చుచున్నదోయన్నట్లు, గడిదేశములన్=పరిహద్దుదేశములను, చొచ్చి=ప్రవేశించి, కలఁచి=కలఁతపెట్టి, అలఁచున్=అలయునట్లుచేయును.

తా. శ్రీకృష్ణదేవరాయలు దండయాత్రచేయునపుడు దండ్డునందలియేనుఁగుల తొండములనుండి ...డు చున్నతుంపురులును, ఆయేనుఁగుల చెవులువీఁచుటచే లేచెడుదుమ్మును, గుఱ్ఱములలసి బురబుర యనుచుండఁగా వానిముక్కులనుండి కారెడుచీమిడియు, యుద్ధవీరులు ప్రయోగించునట్టియాఁటెలశాఖను, శత్రురాజులప్రతాపాగ్ని నార్పుటకై చల్లునట్టినీళ్లును జేటలతోఁబోయునట్టి దుమ్మును మీఁదవేసెడి బురదయు నణఁగఁగొట్టునట్టికట్టలు నై యొప్పెనని తాత్పర్యము కృష్ణరాయలు ఏనుఁగులతోను, గుఱ్ఱములతోను, భటులతోను గడిదేశములమీఁదికి దండెత్తిపోయి వానినెల్ల జయించెననిభావము. ఇట పైఁ • జిల్కువారి మొదలైనవి యగ్నిని జల్లార్పు సాధనములగుట గ్రాహ్యము. అలం ఉత్ప్రేక్ష, రూపకమును.

## షష్ఠ్యంతములు.

క. ఏవంవిధగుణవంతున, కావల్గత్తురగబహువిధారోహకళా
రేవంతున కతిశాంతున, కావిష్కృతకీర్తిధవళితాశాంతునకున్. 43

అ ఏవంవిధగుణవంతునకున్ =ఇట్టిగుణములు గలవానికి, ఆవల్గత్ రేవంతునకున్-ఆవల్గత్= అంతటను దుముకులాడుచున్న, తురగ=గుఱ్ఱములయొక్క, బహువిధ=పలువిధములయిన, ఆరోహకళా =ఎక్కుట యనువిద్యయందు, రేవంతునకున్=అశ్వశిక్షకుఁ డయినవానికి, అతిశాంతునకున్=మిక్కిలి శాంతిగలవానికి, ఆవిష్కృత్ . ఆశాంతునకున్-ఆవిష్కృత=వ్యాపింపఁజేయఁబడిన, కీర్తి = యశస్సుచేత, ధవళిత=తెల్లగాఁజేయఁబడిన, ఆశా=దిక్కులయొక్క, అంతునకున్=కొనలుగలవానికి- దిగంతములవఱకు వ్యాపించినకీర్తిగలవానికి

క. పుంఖానుపుంఖసైంధవ, రింఖాసంఘాతజాతరేణూగ్రతమో
రింఖద్రిపునృపదహర, ప్రేంఖదసుగ్రసనజరరభృత్యసిఫణికిన్. 44

అ. పుంఖానుపుంఖ ఫణికిన్ - పుంఖానుపుంఖ=ఎడతెగని, సైంధవ = గుఱ్ఱములయొక్క, రింఖా=గిట్టలయొక్క, సంఘాత=చెక్కఁగానలఁగఁద్రొక్కునట్టి త్రొక్కుడులవలన, జాత=పుట్టిన, రేణు= దుమ్మనెడు, ఉగ్ర=భయంకరమయిన, తమః=చీఁకటియందు, రింఖత్ =తొట్రుపడుచున్న, రిపునృప = శత్రురాజులయొక్క, దహర= హృదయములందు, ప్రేంఖత్=చలించుచున్న, అసు = ప్రాణములయొక్క, గ్రసన=మ్రింగుటయను, జగర=ఉదరముయొక్క, భృతి=నిండించుకొనుటగల, అసిఫణికిన్= కత్తియనెడి సర్పముగలవానికి-అశ్వసైన్యముతోఁగూడినవాఁడై శత్రువులను ఖడ్గముచేఖండించి హృదయగతములైన ప్రాణవాయువులన్ను దీసినాఁడనుట. వారిని వధించినవాఁడని భావము. అలం రూపకము.

క. అవిరళవితరణవిద్యా, నవరాధేయునకు సజ్జనవిధేయునకుం
గవితాస్త్రీలోలునకున్, ఖవిటంకనటద్యశోబ్ధికల్లోలునకున్. 45

అ అవిరళ రాధేయునకున్-అవిరళ=ఎడతెగని, వితరణవిద్యా= దానవిద్యయందు, నవరాధేయునకున్=క్రొత్తకర్ణుఁడైనవానికి-కర్ణునివలెదానముచేయువానికిననుట, సజ్జనవిధేయునకున్=సత్పురుషులకుఁ బరతంత్రుఁడైనవానికి, కవితాస్త్రీలోలునకున్=కవితయనుస్త్రీయందాసక్తుఁ డయినవానికి-కవితయందు మిక్కిలిప్రీతిగలవానికిననుట, ఖవిటంక కల్లోలునకున్ -ఖవిటంక=ఆకాశముయొక్క ముందటిభాగమునందు, నటత్=నటించుచున్న-చలించుచున్న, యశోబ్ధి=కీర్తియను సముద్రముయొక్క, కల్లోలునకున్=అలలుగలవానికి-ఆకాశమంతయు వ్యాపించినకీర్తి గలవానికి ననుట.

క. దిగధీశాసహ్యాధగ, ద్ధగితేద్ధరుచిప్రతాపతపనస్ఫురణ
స్థగితద్యుమణికి నిమిషా, ర్ధగృహీతకళింగరాజతనయాగ్రణికిన్ 46

అ. దిగధీశ ..ద్యుమణికిన్ - దిగధీశ=దిక్పాలురైన యింద్రాదులకు, అసహ్య = ఓర్వఁగూడని, ధగద్ధగిత=ధగధగాయమానమై, ఇద్ధ=ప్రకాశించుచున్న, రుచి=కాంతిగల, ప్రతాపతపన=పరాక్రమమనెడి సూర్యునియొక్క, స్ఫురణ=ప్రకాశముచేత, స్థగిత=కప్పఁబడిన, ద్యుమణికిన్ =సూర్యుఁడుగలవానికి- అధికమయిన పరాక్రమము గలవానికనుట, నిమిష అగ్రణికిన్ -నిమిషార్ధ = అర్ధనిమిషకాలముచేత, గృహీత=పట్టుకోఁబడిన, కళింగరాజ=కళింగదేశపురాజుయొక్క, తనయాగ్రణికిన్ = కుమారశ్రేష్ఠుఁడు గలవానికి-అతిస్వల్పకాలమునఁ గళింగరాజును జయించినవానికనుట

క. కరుణాకరవేంకటవిభు, చరణస్మరణప్రసంగసంగతమతి కీ
శ్వరనరసింహమహీభృ, ద్వరనందనకృష్ణరాయధరణీపతికిన్. 47

అ కరుణాకర మతికిన్ -కరుణా=దయకు, ఆకర=గనియయిన, వేంకటవిభు= వేంకటేశ్వరునియొక్క, చరణ=పాదములయొక్క, స్మరణ=తలంచుటయొక్క, ప్రసంగ=ప్రస్తావమునందు, సంగత=సంబంధించిన, మతికిన్ =బుద్ధిగలవానికి- వేంకటేశ్వరునియందు భక్తిగలవానికనుట. ఈశ్వర .పతికిన్ -ఈశ్వరనరసింహమహీభృత్ =ఈశ్వరనారసింహరాజుయొక్క, వర=శ్రేష్ఠుఁడైన, నందన= కుమారుఁడైన, కృష్ణరాయధరణీపతికిన్ =కృష్ణరాయఁడనుభూపతికి పైవచనముతో నన్వయము

కథాప్రారంభము.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనినస్వారోచిషమనుసంభవం
బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదన్నన జైమినిముని స్వాయంభువ
మనుకథాశ్రవణానంతరంబున మీఁద నెవ్వండు మను వయ్యె నెఱింగింపు మన
వుడుఁ బక్షులు మార్కండేయుండు క్రోష్టికిం జెప్పినప్రకారంబున నిట్లని
చెప్పం దొడంగె 48

అ అభ్యుదయపరంపరాభివృద్ధిగాన్ =మంగళపరంపరయొక్క యభివృద్ధి కలుగునట్లుగా, నాయొనర్పం బూనినస్వారోచిషమనుసంభవంబు= నేను రచియింపయత్నించిన స్వారోచిషమనుసంభవము, అనుమహాప్రబంధంబునకున్ =అనునట్టి మహాకావ్యమునకు, కథాక్రమంబు=కథయొక్కవరుస, ఎట్టిది= ఎటువంటిది, అనినన్ =అన్నను, జైమినిముని=జైమిని యను పేరుగలఋషి, స్వాయంభువమనుకథాశ్రవణానంతరంబునన్ -స్వాయంభువమను=స్వాయంభువుఁడనెడిమనువుయొక్క, కథ=కథను, శ్రవణానంతరంబునన్ =విన్నపిమ్మట,మీఁదన్ =స్వాయంభువునకుఁ బిమ్మటికాలమునందు,ఎవ్వండు=ఏపురుషుఁడు, మనువయ్యెన్ =మనువాయెను, అనవుడున్ =అనియడుగఁగా,పక్షులు=ధర్మపక్షులు,మార్కండేయుండు= మార్కండేయమహాముని,క్రోష్టికిన్ =క్రోష్టియనువానికి, చెప్పినప్రకారంబునన్ =చెప్పినట్లు, ఇట్లని= ఈప్రకారమని, చెప్పందొడంగెన్ = చెప్పుటకు నారంభించెను.

మ వరణాద్వీపవతీతటాంచలమునన్ వప్రస్థలీచుంబితాం
బర మై సౌధసుధాప్రభాధవళితప్రాలేయరుఙ్మండలీ
హరిణం బై యరుణాస్పదం బనఁగ నార్యావర్తదేశంబునం
బుర మొప్పున్ మహికంఠహారతరళస్ఫూర్తిన్ విడంబించుచున్. 49

ఆ యార్యావర్తదేశంబునన్ = ఆర్యావర్తమనెడిదేశమునందు - హిమవత్పర్వతమునకును వింధ్యపర్వతమునకును నడుమనుండుదేశ మార్యావర్తమనఁబడును, వరణాద్వీపవతీతటాంచలమునన్ = వరణా=వరణయనెడి, ద్వీపవతీ=నదియొక్క, తట=తీరముయొక్క, అంచలమునన్ = సమీపమునందు, వప్రస్థలీచుంబితాంబరమై - వప్ర = ప్రాకారములయొక్క, స్థలీ = ప్రదేశములచేత, చుంబిత=తాఁకఁబడిన, అంబరమై = ఆకాశముగలదై, సౌధ హారిణంబై - సౌధ = మేడలయందలి, సుధా=సున్నపుగచ్చుయొక్క, ప్రభా = కాంతులచేత, ధవళిత = తెల్లగాఁ జేయఁబడిన, ప్రాలేయరుక్ = చంద్రునియొక్క, మండలీ = బింబమునందలి, హరిణంబై = జింకగలదై, మహీకంఠహారతరళస్ఫూర్తిన్ - మహీ=భూమియొక్క, కంఠ=మెడయందలి, హార = ముత్యాలహారముయొక్క, తరళ=నాయకమణియొక్క, స్ఫూర్తిన్=ప్రకాశమును, విడంబించుచున్=అనుకరించుచు, అరుణాస్పదంబనఁగన్=అరుణాస్పదము అనుపేరితో, పురము=ఒకపట్టణము, ఒప్పున్ = ఒప్పిదమగుచుండును

తా. ఆర్యావర్తదేశమందు వరణానదిగట్టున నరుణాస్పదమనుపట్టణమొకటి కలదు అది యాకాశము నొరయునట్టి మిక్కిలి యున్నతములయిన ప్రాకారములును, చంద్రమండలము నొరయుచు నందలి జింకనుగూడఁ దెల్లగాఁజేయునట్లు తళతళ వెలిఁగెడిపాలగారచేతఁ దెల్లనివై యున్నతములైన మేడలును గలిగి, భూదేవి ధరించినకంఠహారముయొక్క పతకమో యనునట్లుండెను. [ అలం అతిశయోక్తి, ఉత్ప్రేక్ష, ఉపమయును.

సీ. అచటివిప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి, ముదిమది దప్పినమొదటివేల్పు
నచటిరాజులు బంటు నంపి భార్గవునైన, బింకానఁ బిలిపింతు రంకమునకు
నచటిమేటికిరాటు లలకాధిపతినైన, మునుసంచిమొదలిచ్చి మనుప దక్షు
లచటినాలవజాతి హాలముఖాత్తవిభూతి, నాదిభిక్షువు భైక్షమైన మాన్చు
నచటివెలయాండ్రు రంభాదులైన నొరయఁ, గాసెకొంగున వారించి కడపఁగలరు
నాట్యరేఖాకళాధురంధరనిరూఢి, నచటఁ బుట్టినచిగురుఁగొమ్మైనఁ జేవ. 50

అ. అచటివిప్రులు = ఆయరుణాస్పదపురమునందలి బ్రాహ్మణులు, అఖిలవిద్యాప్రౌఢిన్ = ఎల్ల విద్యలయందలి నేర్పుచేత, ముదిమదిదప్పిన మొదటివేల్పున్ - ముది=ముసలివాఁడయి, మది = మనస్సు, తప్పిన=నిలుకడచెడిన, మొదటివేల్పున్ = బ్రహ్మను, మెచ్చరు = లక్ష్యముచేయరు-అచటి బ్రాహ్మణులు తాము సర్వవిద్యలయందు మిక్కిలి పండితులగుటచే ముసలివాఁడయి చిత్తభ్రమ నొందినవాఁడని బ్రహ్మను సరకుసేయరనుట-అనఁగా నచటిబ్రాహ్మణులు మిక్కిలి విద్యావంతులని భావము. అచటి రాజులు=ఆపట్టణమునందలి రాచవారు, బంటున్ = సేవకునిని, అంపి=పంపి, భార్గవునైనన్ = పరశురామునినయినను, బింకానన్=గర్వముచేత, అంకమునకున్=తమదగ్గఱకు, పిలిపింతురు=పిలువనంపుదురు-అచటిక్షత్రియులు మహాబలశాలురు కాఁబట్టి పరశురామునినైనను లక్ష్యముచేయక బంటునంపి తమ యొద్దకు బలవంతముగాఁ బట్టితెప్పింతురనుట అనఁగా నచటిరాచవారు మిక్కిలి పరాక్రమవంతులని భావము అచటి మేటికిరాటులు=ఆపట్టణమునందలి ప్రముఖులయిన కోమట్లు, అలకాధిపతినైనన్ = అలకాపురికి రాజైనకుబేరునైనను, మును=ముందుగా, సంచి మొదలు=బండవలమును, ఇచ్చి = తామే యిచ్చి, మనుపన్=రక్షించుటకు, దక్షులు=సమర్థులు-అచటివైశ్యులు కుబేరునకుఁగూడ బండాలమిచ్చి కాపాడఁదగినవారనుట-అనఁగా మిక్కిలి ధనవంతులనిభావము. అచటి నాలవజాతి = ఆపట్టణము

నందలి శూద్రకులము-శూద్రజనులు, హాలముఖా త్తవిభూతిక్-హాలముఖ = నాగేటిమొనచేత, ఆత్త= పొందఁబడిన, విభూతిక్=ఐశ్వర్యముచేత, ఆదిభిక్షువు భైక్ష్యమైనక్=మొదటిబిచ్చగాఁడయిన శివుని యొక్క భిక్షాసమూహమునయినను, మాన్పుక్=పోఁగొట్టును-అచటిశూద్రులు సేద్యముచే మిక్కిలి సంపదగలవారును దాతృత్వముగలవారునని భావము. అచటి వెలయాండ్రు=ఆపట్టణములోని వేశ్యలు, నాట్య నిరూఢిక్-నాట్యరేఖా=నృత్యపద్ధతియనెడు, కలా=విద్యయొక్క, ధురంధర=భారమును వహించిన, నిరూఢిక్=సామర్థ్యముచేత, రంభాదులైనక్=రంభ మొదలగు నప్సరసలైనను,ఒరయక్= సరిపోలవలయు నని వచ్చినయెడ,కాసె కొంగునక్=వెనుకదోఁపుకొనెడి కొకచెఱఁగుచేత, వారించి= కొంతదూరమునందే నిలుచునట్లుచేసి-తిరస్కరించి, కడపఁగలరు=తఱుమఁగలరు-అచటివేశ్యలు నాట్య విద్యయందు రంభ మొదలగు నప్సరసలను సయితము నవమానపఱుపఁగలరనుట, అనగా అచటివేశ్యలు నాట్యమందు మిక్కిలి సమర్థ లనిభావము అచటక్ = ఆపట్టణమునందు, పుట్టినచిగురుఁగొమ్మైనక్= పుట్టినట్టి చిగురుతోడి లేఁతకొమ్మయైనను,చేవ=సారముగలది-ఆయూరఁబుట్టినవన్ని యు మిక్కిలి సార వంతములని భావము అలం అతిశయోక్తి

ఉ. ఆపురిఁ బాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి భా
షాపర శేషభోగి వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీ
క్షాపరతంత్రుఁ డంబురుహగర్భకులాభరణం బనారతా
ధ్యాపనతత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్యతనూవిలాసుఁ డై. 51

అ. ఆపురిక్=ఆపట్టణమునందు, మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి-మకరాంక=మన్మథునివలెను, శశాంక=చంద్రునివలెను,మనోజ్ఞ=సుందరమయిన,మూర్తి=ఆకారముగలవాఁడును, భాషాపర శేషభోగి-భాషా=మాటలయందు, అపర=రెండవవాఁడయిన, శేషభోగి=శేషాహియయినవాఁడును, వివిధ. .పర తంత్రుఁడు-వివిధ=నానావిధములయిన,అధ్వర=యాగములనెడి,నిర్మల=దోషరహితములయిన, ధర్మ= పుణ్యములయిన, కర్మ=క్రియలయందలి, దీక్షా=నియమమునకు, పరతంత్రుఁడు=అధీనుఁడును,అంబురుహ గర్భకులాభరణంబు-అంబురుహగర్భకుల=బ్రాహ్మణజాతికి, ఆభరణంబు = అలంకారమయినవాఁడును, అనారతాధ్యాపనతత్పరుండు-అనారత=ఎల్లప్పుడును, అధ్యాపన=వేదములుచదివించుటయందు, తత్ప రుండు=ఆసక్తిగలవాఁడునునైన, ప్రవరాఖ్యుఁడు = ప్రవరుఁడు అనుపేరుగలవాఁడు, అలేఖ్యతనూవిలా సుఁడై=చిత్తరువునందు వ్రాయ నలవిగానిరూపరేఖ గలవాఁడై, పాయక=విడువక,ఉండుక్=వాసము చేయుచుండును అలం. ఉపమ, రూపకము

ఆ. వానిచక్కఁదనము వైరాగ్యమునఁ జేసి, కాంక్ష సేయుజారకామినులకు
భోగబాహ్య మయ్యెఁ బూచినసంపెంగ, పొలుపు మధుకరాంగనలకుఁబోలె.

అ. వానిచక్కఁదనము=ఆప్రవరాఖ్యునిసౌందర్యము, వైరాగ్యమునఁజేసి=విషయేచ్ఛలేమిచేత, కాంక్షసేయు జారకామినులకుక్=వలచునట్టి అంకుటాండ్రకు, పూచినసంపెఁగపొలుపు=వికసించిన సంపెఁగపువ్వుయొక్క వికాసము, మధుకరాంగనలకుఁబోలెక్=ఆఁడుతుమ్మెదలకువలె, భోగబాహ్యము= అనుభవమునకు వెలియయినది, అయ్యెక్=ఆయెను

తా ఆప్రవరుఁడు విరక్తుఁడైనందున వానిసౌందర్యమును వలచివచ్చిన జారస్త్రీలకు నబ్బకయుం డెను గావున వికసించినసంపెఁగపువ్వు తుమ్మెదలకు నుపయోగపడనట్లు వానిసౌందర్య మాజారస్త్రీలకు

ననుభవింప నలవిగానిదయ్యెనని తాత్పర్యము. తు మ్మెదలకును సంపెంగకును విరోధమగుట సుప్రసిద్ధము.
అలం. ఉపమ.

ఉ. యౌవనమందు యజ్వయు ధనాఢ్యుఁడు నై కమనీయకౌతుక
శ్రీవిధిఁ గూఁకటుల్ గొలిచి చేసినకూరిమిసోమిదమ్మ సౌ
ఖ్యావహ యై భజింప సుఖులై తలిదండ్రులు గూడి దేవియున్
దేవరవోలె నుండి యిలుదీర్పఁగఁ గాఁపుర మొప్ప వానికిన్ 53

అ యౌవనమందున్ = వయసునందు, యజ్వయున్ = యాగముచేసినవాఁడును-సోమయాజియును, ధనాఢ్యుఁడు నై = ధనవంతుఁడు నై, కమనీయకౌతుకశ్రీవిధిన్ - కమనీయ = మనోహరమయిన, కౌతుక = కంకణబంధముయొక్క, శ్రీ = సంపత్కరమయిన, విధిన్ = క్రియయందు - వివాహమునందనుట, కూఁకటుల్ = పిల్లజుట్లను, కొలిచి = కొలఁత పెట్టి - ఈడుచూచియనుట - ఇద్దఱియందును ఈడుకొంచెము హెచ్చుతక్కువగాఁ జూచి యనిభావము, చేసిన = పెండ్లిచేసినట్టి, కూరిమి సోమిదమ్మ = ప్రియురాలైన సోమిదేవి - అనఁగా భార్య (సోమిదమ్మ యనఁగా సోమయాజిభార్య), సౌఖ్యావహ యై = సుఖముగలిగించునది యై, భజింపన్ = సేవింపఁగా, సుఖులై = సుఖముగలవారలై, తలిదండ్రులు = అతనితల్లియుం దండ్రియు, కూడి = జతగూడి, దేవియున్ దేవరవోలెన్ = పార్వతీపరమేశ్వరులవలె, ఉండి = ఇంట నున్నవారై, ఇలుతీర్పఁగన్ = గృహకృత్యములు చక్కఁబెట్టుచుండఁగా, వానికిన్ = ఆప్రపనునికి, కాఁపురము = సంసారము, ఒప్పన్ = చక్కఁగా జరుగుచుండును

తా అప్రవరుఁడు, ధనవంతుఁడయి తనకు నీడయిన ప్రియభార్య సేవింపఁగా, యౌవనమునందె యజ్ఞముచేసి, పార్వతీపరమేశ్వరులవలెఁ దనతలిదండ్రులు క్షేమముగా నింటనుండి గృహకృత్యములు విచారించుకొనుచుండఁగా సుఖముగాఁ గాఁపురము చేయుచుండెను.

సీ. వరణాతరంగిణీదరవికస్వరనూత్న, కమలకషాయగంధము వహించి
ప్రత్యూషపవనాంకురములు పైకొనువేళ, వామన స్తుతిపరత్వమున లేచి
సచ్ఛాత్త్రుఁ డగుచు నిచ్చలు నేఁగి యయ్యేట, నఘమర్షణస్నానమాచరించి
సాంధ్యకృత్యముఁ దీర్చి సావిత్రి జపియించి, సైకతస్థలిఁ గర్మసాక్షి కెఱఁగి
ఫలసమిత్కుశకుసుమాదిబహుపదార్థ,తతియునుదికినమడుఁగుదోవతులుఁగొంచు
బ్రహ్మచారులు వెంటరా బ్రాహ్మణుండు,వచ్చునింటికిఁ బ్రజ దన్ను మెచ్చిచూడ.

అ వరణా. ంధమున్ - వరణాతరంగిణీ = వరణానదియొక్క, దరవికస్వర = ఇంచుక వికసించిన, నూత్న = క్రొత్తవైన, కమల = తామరపూవులయొక్క, కషాయ = ఒగరుతోఁడిదయిన, గంధమున్ = వాసనను, వహించి = పూని, ప్రత్యూషపవనాంకురములు = వేకువయందలి గాలిమొలకలు - మందమారుతములనుట, పైకొనువేళన్ = మీఁదసోఁకునట్టిసమయమునందు - తెల్లవాఱుసమయమునందనుట, వామనస్తుతిపరత్వమునన్ = వామనమూర్తిస్తోత్రమునందలి యాసక్తిచేత - విష్ణుమూర్తిస్తోత్రపారాయణముతోననుట, లేచి = నిద్రలేచి, సచ్ఛాత్త్రుఁడు = శిష్యులతోఁ గూడినవాఁడు, అగుచున్ = అవుచును, నిచ్చలున్ = ఎల్లప్పుడును - ప్రతిదినము ననుట, ఏఁగి = పోయి, అయ్యేటన్ = ఆవరణానదియందు, అఘమర్షణస్నానము = అఘమర్షణసూక్తములు పఠించుచుఁ జేయునట్టిస్నానమును, ఆచరించి = చేసి, సాంధ్యకృత్యమున్ = సంధ్యావందనాదికార్యమును, తీర్చి = జరపి, సైకతస్థలిన్ = ఇసుకదిన్నెయందు,

సావిత్రిన్ = గాయత్రీమంత్రమును, జపియించి = జపముచేసి, కర్మసాక్షికిన్ = సూర్యునకు, ఎఱఁగి = నమస్కరించి-సూర్యోపస్థానముచేసి యనుట, ఫల తతియున్-ఫల=పండ్లు, సమిత్ = సమిధలు, కుశ = దర్భలు, కుసుమ = పువ్వులు, ఆది = మొదలుగాఁగల, బహుపదార్థ = పెక్కువస్తువులయొక్క, తతియున్ = సమూహమును, ఉదికినమడుఁగుదోవతులున్ = ఉదికి మడఁచి పెట్టినగోవలులును, కొంచున్ = తీసికొనుచు, బ్రహ్మచారులు = శిష్యులైనవడుగులు, వెంటరాన్ = తనతోడరాఁగా, ప్రజ = జనసమూహము, తన్నున్ = తన్ను, మెచ్చి = మెచ్చుకొని, చూడన్ = చూచుచుండఁగా, బ్రాహ్మణుండు = ప్రవరుఁడు, ఇంటికిన్ = తనయింటికి, వచ్చున్ = వచ్చుచునుండును

శా. శీలంబుం గులమున్ శమంబు దమముం ॥ జెల్వంబు లేఁబ్రాయముం
బోలం జూచి యితండు పాత్రుఁ డని యే ॥ భూపాలుఁ డీ వచ్చినన్
సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు మా ॥ న్యక్షేత్రముల్ వెక్కుచం
దాలం బండు నొకప్పుడుం దఱుఁగ దిం ॥ టం బాఁడియుం బంటయున్. 55

అ శీలంబున్ = సదాచారమును, కులమున్ = మంచివంశమును, శమంబున్ = బహిరింద్రియనిగ్రహమును, దమమున్ = అంతరింద్రియ మగుమనస్సుయొక్క నిగ్రహమును, చెల్వంబున్ = చక్కఁదనమును, లేఁబ్రాయమున్ = లేఁతవయస్సును, పోలన్ = పొసఁగియుండఁగా, చూచి, ఇతండు = ఈ బ్రాహ్మణుఁడు, పాత్రుఁడు = దానమిచ్చుటకుఁదగినవాఁడు, అని, ఏభూపాలుఁడు = ఏరాజు, ఈ వచ్చినన్ = దానమియ్యవచ్చినను, సాలగ్రామము మున్నుగాన్ = సాలగ్రామము మొదలుకొని-సాలగ్రామ దానము దోషములేనిదనుట, కొనఁడు = తీసికొనఁడు. మాన్యక్షేత్రముల్ = మాన్యపుభూములు-పూజ్యులని గౌరవించి యినాముగా రాజులు మొదలగువారిచ్చునట్టిభూమి మాన్య మనఁబడును, పెక్కుచందాలన్ = బహువిధములుగా, పండున్ = ఫలించును ఇంటన్ = ఇంటియందు, పాఁడియున్ = పాలసమృద్ధియు, పంటయున్ = పైరులు పండుటవలని ధాన్యసమృద్ధియు, ఒకప్పుడున్ = ఒకకాలమందును, తఱుఁగదు = తగ్గదు.

తా. ప్రవరునియోగ్యతనుజూచి రాజులు నానావిధములయిన దానములఁజేయవచ్చిన, అతఁడు ప్రతిగ్రహము పాపముకలిగించునని నిర్దోషమైనసాలగ్రామదానము నయినను తీసికొనకుండును అయినను మాన్యపుభూములు తప్పక పండుచుండును గావున నతనియింటఁ బాఁడిపంటలు కొఱఁతలేక యుండును

తే. వండ నలయదు వేవురు ॥ వచ్చి రేని, నన్నపూర్ణకు నుద్ది యా ॥ యతనిగృహిణి
యతిథు లేతేర నడికిరే ॥ యైనఁ బెట్టు, వలయుభోజ్యంబు లింట స ॥ దా వ్యవారిగాఁగ.

అ అన్నపూర్ణకున్ = అన్నపూర్ణాదేవికి, ఉద్ది = ఈడు, ఆ యతనిగృహిణి = అగునట్టి యా ప్రవరునిభార్య, వేవురు = వేయిమంది, వచ్చిరేనిన్ = అన్నార్థులయి వచ్చినను, వండన్ = వంటచేయుటకు, అలయదు = విసుగుకొనదు అతిథులు = అగంతుకులు (లేక) విందులు, ఏతేరన్ = రాఁగా, నడికిరేయైనన్ (పా. నడిరేయియైనన్) = అర్ధరాత్రిసమయమైనను, ఇంటన్ = ఇంటియందు, వలయుభోజ్యంబులు = కావలసిన భోజనవస్తువులు, సదావ్యవారిగాఁగన్ = సమృద్ధము అగునట్లుగా, పెట్టున్ = ఆయతిథులకుఁ బెట్టును.

సీ. తీర్థసంవాసు లేతెంచినా రని విన్న, నెదురుగా నేఁగు దవ్వెంత యైన
నేఁగి తత్పదములన్ కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ, దెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్నసంతృప్తులఁ గాఁ జేయుఁ, జేసి కూర్చున్నచోన్ జేర వచ్చు
వచ్చి యిద్ధరఁ గల్గువనధిపర్వతసరి, త్తీర్థమాహాత్మ్యముల్ దెలియ నడుగు
నడిగియోజనపరిమాణమరయు నరసి,పోవలయుఁజూడ ననుచునూర్పులునిగుడుచ్చు
ననుదినము తీర్థసందర్శనాభిలాష, మాత్మ నుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి. 57

అ. అత్తరుణాగ్నిహోత్రి= ఎలప్రాయముగల ఆయాహితాగ్ని-అగ్నిహోత్రి యనఁగా నియతితో నగ్నిహోత్రమును వేల్చుచుండువాఁడు-ప్రవరుఁడు, అనుదినము=ప్రతిదినమును, తీర్థసందర్శనాభిలాషము=తీర్థములఁజూచుటయందలికోరిక, ఆత్మన్=మనస్సునందు, ఉప్పొంగన్=అతిశయింపఁగా, తీర్థసంవాసులు=పుణ్యతీర్థములందు వాసముచేయువారు-తీర్థయాత్రలుసలుపువారనియుఁ జెప్పవచ్చును, ఏతెంచినారు=వచ్చినారు, అనివిన్నన్==అని యెవరేని చెప్పఁగా వినినయెడల, దవ్వు=దూరము,ఎంతయైనన్=ఎంతయధికమయినను, ఎదురుగాన్=వారికి నెదురుకొలుగా, ఏఁగున్=పోవును. ఏఁగి, తత్పదములకున్=ఆతీర్థవాసులపాదములకు, ఎఱఁగి=మ్రొక్కి, ఇంటికిన్=తనయింటికి, తెచ్చున్ = వారిని దీసికొనివచ్చును. తెచ్చి, సద్భక్తిన్ = మంచిభక్తితో, ఆతిథ్యము = అతిథిపూజను, ఇచ్చున్ = సమర్పించును-చేయుననుట. ఇచ్చి, ఇష్టాన్నసంతృప్తులఁగాన్ = ప్రియమయిన యన్నముచేఁ దృప్తినొందినవారలనుగా, చేయున్=చేయును చేసి, కూర్చున్నచోన్=వారుభోజనముచేసి కూర్చుండినప్పుడు, చేరవచ్చున్=వారిదగ్గఱ వచ్చును. వచ్చి,ఇద్ధరన్=ఈభూమియందు,కల్గు మాహాత్మ్యముల్ -కల్గు=ఉండునట్టి, వనధి=సముద్రములయొక్కయు, పర్వత=కొండలయొక్కయు, సరిత్=నదులయొక్కయు, తీర్థ=పుణ్యనదీక్షేత్రములయొక్కయు, మాహాత్మ్యముల్=ప్రభావములను, తెలియన్ = విశదముగా, అడుగున్ = అడుగును. అడిగి, యోజనపరిమాణము = ఆతీర్థములకును దా నుండుచోటునకును గల యామడలకొలఁదిని, అరయున్=విచారించును అరసి=విచారించి, చూడన్ = ఆ తీర్థక్షేత్రములను జూచుటకు, పోవలయున్ = తానుబోవలయును, అనుచున్ = అని, ఊర్పులు = నిట్టూర్పులను, నిగుడుచ్చున్=పుచ్చును.

క. ఈవిధమున నభ్యాగత, సేవాపరతంత్రసకలజీవనుఁడై భూ
దేవకుమారకుఁ డుండఁగ, గా విను మొకనాఁడు కుతపకాలమునందున్. 58

అ. ఈవిధమునన్=ఈరీతిని, అభ్యాగత జీవనుఁడై-అభ్యాగత = భోజనార్థులయి యింటిని గూర్చివచ్చిన యతిథులయొక్క, సేవా=పరిచర్యకు, పరతంత్ర=అధీనమయిన, సకల = సమస్తమయిన, జీవనుఁడై=బ్రతుకుఁదెరువుగలవాఁడై-తనబ్రతుకున కంతయు నతిథిసేవయే ముఖ్యము గాఁదలఁచినవాఁడై, భూదేవకుమారకుఁడు = బ్రాహ్మణపుత్త్రుఁ డయినప్రవరుఁడు, ఉండంగాన్=ఉండఁగా, వినుము-దీనికిఁ గర్త కృతిపతి, ఒకనాఁడు=ఒకదినము, కుతపకాలమునందున్= మధ్యాహ్ననంతరకాలమునందు-పగటిలోఁబదునాఱుగడియలకు మీఁదిముహూర్తము కుతపకాల మనఁబడును పైపద్యముతో నన్వయము

సీ. ముడిచినయొంటికెంజడ మూయ మ్మువ్వన్నె, మొగముతోలు కిరీటముగధరించి
కకపాలకేదారకటకముద్రితపాణిఁ, గుఱుచలాతాముతోఁ గూర్చి పట్టి

యైణేయ మైనయొడ్డాణంబులవణిచే, నక్కళించినపొట్ట నుక్కళించి
యారకూటచ్ఛాయ నపఘళింపఁగఁ జాలు, బడుగుదేహంబున భస్మ మలఁది
మిట్టయురమున నిడుయోగపట్టె మెఱయఁ, జెవులరుద్రాక్షపోఁగులు చవుకళింపఁ
గావికుబుసంబు జలకుండికయును బూని, చేరెఁ దద్గేహ మౌషధసిద్ధుఁ డొకఁడు.

అ. ముడిచినయొంటికెంజడమూయన్ - ముడిచిన=ముడివేసిన, ఒంటి=ఒక్కటయిన, కెంజడ= యెఱ్ఱనిజడ, మూయన్ = కమ్ముకొనునట్లు, ముప్పన్నె మెగముతోలు = మూఁడురంగులుగల మృగమైనపులియొక్క చర్మమును, కిరీటముగన్ = కుళ్లాయగా, ధరించి = పెట్టుకొని, కకపాల=కక్షపాలను- సన్న్యాసులు చంకనుంచుకొనునట్టి యొకవిధమైనసంచిని, కేదారకటక = పంచలోహములు చేర్చి చేసిన కడియముచేత, ముద్రిత = గుఱుతుగలదిగాఁ జేయఁబడిన-ఆకడియమును ధరించిన యనుట, పాణిన్ = హస్తముచేత, కుఱుచలాతామతోన్ = పొట్టిదయిన యోగదండముతో, కూర్చి= చేర్చి, పట్టి= పట్టుకొని, ఐణేయము = ఆఁడుజింకతోలుతోఁ జేసినది, ఐనయొడ్డాణంబులవణిచేన్ = ఇనట్టినడికట్టు పట్టెయొక్క బిగువుచేత, అక్కళించినపొట్టన్ = లోపలికి నణఁగినకడుపును, ఉక్కళించి = ఉబ్బించి, ఆరకూటచ్ఛాయన్ = ఇత్తడిచాయను, అపఘళింపఁగన్ = అతిక్రమించుటకు, చాలుబడుగు దేహంబునన్ = చాలిపట్టి బక్కటిల్లినశరీరమునందు, భస్మము = విభూతిని, అలఁది = పూసికొని, మిట్టయురమునన్ = ఎత్తయినఱొమ్మునందు, నిడుయోగపట్టె=యోగాభ్యాససమయమునందు యజ్ఞోపవీతమువలె వేసికొనెడి నిడుపయినపట్టుపట్టె, మెఱయన్ = ప్రకాశింపఁగా, చెవులన్=చెవులయందు, రుద్రాక్షపోఁగులు = రుద్రాక్షలు గ్రుచ్చినరాగిచెవిపోఁగులు, చవుకళింపన్ = ఊఁగులాడఁగా, కావికుబుసంబున్ = ఎఱ్ఱమట్టిచాయ చొక్కాయయును, జలకుండికయును = నీళ్లతొడికమండలువును, పూని = ధరించి, ఔషధసిద్ధుఁడు = ఓషధులసిద్ధిగలయోగీశ్వరుఁడు, ఒకఁడు, తద్గేహము=ఆప్రవరుని యింటిని, చేరెన్=ప్రవేశించెను

తా. పులితోలుతోఁ జేయఁబడినకుళ్లాయయుఁ బంచలోహములు చేర్చి చేసినకడియమును గక్షపాలయును యోగదండమును ఆఁడుజింకతోలుతోఁ జేసిన నడికట్టు పట్టెయు యోగపట్టమును ధరించి, పసుపువన్నెగల దేహమునందు విభూతిపూసికొని రుద్రాక్షపోఁగులు పెట్టుకొని కావిచొక్కాయతొడిగి నీళ్లతొడికమండలువును జేతఁబట్టినవాఁడయి యొకసిద్ధపురుషుఁడు ప్రవరునియింటికి వచ్చెను. అలం. స్వభావోక్తి

తే. ఇట్లు చనుదెంచుపరమయోగీంద్రుఁ గాంచి, భక్తిసంయుక్తి నెదురేఁగి ప్రణతుఁ డగుచు
నర్ఘ్యపాద్యాదిపూజనం బాచరించి, యిష్టమృష్టాన్నకలన సంతుష్టుఁ జేసి. 60

అ. ఇట్లు = ఈరీతిని, చనుదెంచుపరమయోగీంద్రున్ = వచ్చుచున్న యుత్తమయోగీశ్వరుని, (ప్రవరుఁడు), కాంచి = చూచి, భక్తి సంయుక్తిన్=భక్తితోడికూడికచేత-భక్తితోఁ గూడినవాఁడై యనుట, ఎదురేఁగి = ఎదురుగాఁబోయి, ప్రణతుఁడు = నమస్కరించినవాఁడు, అగుచున్=అవుచును, అర్ఘ్యపాద్యాదిపూజనంబు=అర్ఘ్యము పాద్యము మొదలుగాఁగల యుపచారములతోఁ బూజ చేయుటను, (అర్ఘ్యము = పూజకొఱకైనది, పాద్యము=పాదములకొఱకైనది, కాళ్లుచేతులు కడుగుకొను నీళ్లిచ్చి పుష్పాదులతోఁ బూజించి యనుట), ఆదరించి = ఆదరణచేసి, ఇష్టమృష్టాన్నకలనన్ = ఇష్టమును బరిశుద్ధమయినదియు నగునన్నము పెట్టుటచేత, సంతుష్టున్=సంతోషించినవానిఁగా, చేసి.- దీనికిఁ బైపద్యముతో నన్వయము.

క. ఎందుండ యెందుఁ బోవుచు, నిందుల కేతెంచినార లిప్పుడు విద్వ
ద్వందిత నేఁడు గదా మ, న్మందిరము పవిత్రమయ్యె మాన్యుఁడ నైతిన్. 61

అ. విద్వద్వందిత = పండితులచేఁ గొనియాడఁబడినవాఁడా, (మీరలు) ఎందుండి=ఎక్కడనుండి, ఎందుఁబోవుచున్ = ఎక్కడికిఁబోవుచు, ఇందులకున్ = ఇక్కడికి, ఇప్పుడు = ఈసమయమునందు, ఏతెంచినారలు = వచ్చినారు. నేఁడుగదా=ఈదినమునఁ గదా, మన్మందిరము=నాయిల్లు, పవిత్రము = పరిశుద్ధము, అయ్యెన్ = ఆయెను, మాన్యుఁడన్ = పూజింపఁదగినవాఁడను, ఐతిన్ = (నేను) అయితిని

తా. ఓయోగీంద్రుఁడా! మీరెచటనుండి యెచటికిఁ బోవుచు నిచటికి వచ్చినారు పెద్దలయిన మీరాకచేత మాయిల్లు పరిశుద్ధమయినది, మీదర్శనముచేత నేను బూజ్యతను బొందితిని.

క మీమాటలు మంత్రంబులు, మీమెట్టినయెడ ప్రయాగ మీపాదపవి
త్రామలతోయము లలఘు, ద్యోమార్గఝురాంబుపౌనరుక్త్యము లుర్విన్. 62

అ ఉర్విన్ = భూమియందు, మీమాటలు = మీరుచెప్పెడిమాటలు, మంత్రంబులు=మంత్రములవంటివి మీమెట్టినయెడ = మీరుత్రొక్కినచోటు-మీరడుగుపెట్టినతావు, ప్రయాగ=ప్రయాగక్షేత్రమువంటిది మీపాదపవిత్రామలతోయములు = మీపాదములు కడిగిన పరిశుద్ధములును నిర్మలములు నయిననీళ్లు, అలఘు . పౌనరుక్త్యములు-అలఘు=అధికమయిన, ద్యోమార్గఝుర = ఆకాశమార్గమునఁ బోవునే అయినగంగయొక్క, అంబు=జలములకు, పౌనరుక్త్యములు=పునరుక్తములైనవి అనఁగా అవియే మరలఁ జెప్పఁబడినవి వానిని జెప్పినవెనుక వీనిని జెప్పుట పునరుక్తియే (వానినే మరలఁ జెప్పుట) యగుననుట మీపాదతీర్థము లాకాశగంగాజలములతో సమానములని భావము.

ఉ. వానిది భాగ్యవైభవము వానిది పుణ్యవిశేష మెమ్మెయిన్
వాని దవంధ్యజీవనము వానిది జన్మము వేఱు సేయ కె
వ్వానిగృహాంతరంబున భవాదృశయోగిజనంబు పావన
స్నానవిధాన్నపానముల సంతస మందుచుఁ బోవు నిచ్చలున్. 63

అ భవాదృశయోగిజనంబు = మీవంటి యోగులసమూహము, ఎవ్వానిగృహాంతరంబునన్ = ఎవనియింటిలోపల, వేఱుసేయక = భేద మెంచక, పావన ...పానములన్ -పావన=పవిత్రమయిన, స్నానవిధా = స్నానవిధిచేతను, అన్న = భోజనముచేతను, పాన = నీళ్లుత్రాగుటచేతను, నిచ్చలున్ = ఎల్లప్పుడును, సంతసము = సంతోషమును, అందుచున్ = పొందుచు, పోవున్ = పోవుచుండునో, వానిది = అటువంటివానిది, భాగ్యవైభవము = అదృష్టసంపద, వానిది = ఆపురుషునిది, పుణ్యవిశేషము = సుకృతాతిశయము, వానిది = ఆపురుషునిది, ఎమ్మెయిన్ =ఏవిధముచేతను, అవంధ్యజీవనము = వ్యర్థముగానిబ్రదుకు, వానిది = ఆగృహస్థునిది, జన్మము=పుట్టుక- అటువంటి గృహస్థుని పుట్టుకయే సార్థకమనుట.

తా. ఓ యోగీశ్వరా! మీవంటి పెద్ద లెవనియింట భేదములేక స్వబంధువులవలెనే స్నానభోజనపానములుచేసి తృప్తినొంది పోవుచుందురో యాగృహస్థుఁడు భాగ్యవంతుఁడును బుణ్యవంతుఁడు నగును. అటువంటి గృహస్థునిదే సార్థకజీవనమును సార్థకజన్మము నగును

తే. మౌనినాథ కుటుంబజంబాలపటల, మగ్నమాదృశగృహమేధిమండలంబు
నుద్ధరింపంగ నౌషధం బొండు గలదె, యుష్మదంఘ్రిరజోలేశ మొకటి దక్క.

అ. మౌనినాథ = మునిశ్రేష్ఠుఁడా, కుటుంబ . . మండలంబున్ - కుటుంబ=సంసారమనెడి, జంబాల = బురదయొక్క, పటల= సమూహమునందు, మగ్న = మునిఁగిన, మాదృశ = నావంటి, గృహమేధి = గృహస్థులయొక్క, మండలంబున్ = సమూహమును, ఉద్ధరింపంగన్ = ఆయదమును నుండి లేవనెత్తుటకు, యుష్మదంఘ్రిరజోలేశము-యుష్మత్ = మీదైన, అంఘ్రి = పాదములయొక్క, రజోలేశము = దుమ్మురవ, ఒకటితక్కన్ = ఒకటితప్ప, ఔషధము=మందు, ఒండు = ఇతరము, కలదె = ఉన్నదా-లేదనుట.

తా. ఓమునీంద్రా! బురదయందుఁబలెనే పెట్టినకాలూడఁదీసికొన శక్యముకానిసంసారమునందు మునిఁగియున్న మావంటివారి నుద్ధరింపఁ జాలినది మీపాదధూళి యొకటేకాని మఱి యేదియుఁ గాదని తాత్పర్యము! మీపాదధూళి సోఁకినమాత్రమున సంసారబంధము వీడిపోవునని భావము.

'కుటుంబ జంబాల పటలమగ్న' అనుటచే 'మేము సంసారమునందగులుపడి యిల్లు వదలి పోవుటకు వీలులేనివారము కావున మీరలై మాయింటికివచ్చి మీపాదధూళిచే మమ్ము సంసారమునుండి యుద్ధరింపవలయు' నని ధ్వని. పటలశబ్దముచే సంసారముయొక్క బాహుళ్యమును సులభముగాఁ బరిహరింపరామియు సూచితము 'జంబాలమగ్న'లకు 'అంఘ్రిరజ' మే యుద్ధారకముగాఁ జెప్పుటచే బురదయందు రజము పడి నిండినయెడ యందలి నీరింకునుగాన నందు మరల దిగఁబడునట్లు గలుగదు కనుక నదియే మనుబోఁటులకు నుద్ధారకమగునని సారస్యము మిముబోఁటివారిపాద సేవచే మాసంసారబాధ నివృత్తమగునని ధ్వని అలం. రూపకము.

క. నా విని ముని యిట్లను వత్సా విను మావంటి తైర్థికావళి కెల్లన్
మీవంటిగృహస్థులసుఖ, జీవనమునఁ గాదె తీర్థసేవయుఁ దలఁపన్. 65

అ. నాన్ = అని ప్రవరుఁడుచెప్పఁగా, విని = విన్నవాఁడై, ముని = సిద్ధుఁడు, ఇట్లనున్ = ఇట్లు పలికెను, వత్సా=ఓయిచిన్నవాఁడా, విను=నామాటవినుము, మావంటితైర్థికావళికిన్ =మాబోఁటి తీర్థయాత్ర చేయువారిసమూహమునకు, ఎల్లన్ = అందఱకును, తీర్థసేవయున్ =గంగాప్రయాగాది పుణ్యతీర్థముల సేవించుటగూడ, తలఁపన్ =విచారింపఁగా, మీవంటిగృహస్థుల సుఖజీవనమునఁ గాదె= మీబోఁటి గృహస్థులు సుఖముగా జీవించుటచేతనే కదా

తా. ప్రవరుఁ డిట్లు విన్నవింపఁగా సిద్ధుఁడు 'ఓ చిన్నవాఁడా! మీవంటిగృహస్థులు సుఖముగా జీవించుచుండుటవలననే మావంటితీర్థయాత్రాపరు లాతిథ్యము మొదలయినవి పడసి తీర్థయాత్రలు సేయఁగల వారైరి. మీవంటివారే లేనియెడ నూరక యున్నతావుననే యుండవలసిన వారమేకదా' యని పలికెను.

సీ. కెలఁకుల నున్నతంగేటిజున్ను గృహమేధి, యజమానుఁ డంకస్థితార్థపేటి
పండినపెరటికల్పకము వాస్తవ్యుండు, దొడ్డిఁ బెట్టినవేల్పుగిడ్డి కాఁపు
కడ లేనియమృతంపునడబావి సంసారి, సవిధమేరునగంబు భవనభర్త
మరుదేశపథమధ్యమప్రప కులపతి, యాఁకటికొదవుసస్యము కుటుంబి

బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి, జటి పరివ్రాజ కాతిథి క్షపణ కావ
ధూత కాపాలికాద్యనాథులకుఁ గాన, భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె.

అ. గృహమేధి = గృహస్థుఁడు, బధిర . అనాథులకున్ - బధిర = చెవిటివారు, పంగు=కుంటివారు, అంధ = గ్రుడ్డివారు, భిక్షుక = బిచ్చగాండ్రు, బ్రహ్మచారి = వడుగులు, జటి = వానప్రస్థులు, పరివ్రాజక = సన్న్యాసులు, అతిథి=ఆగంతుకులు, క్షపణక = క్షపణకమతస్థులు- అనఁగా బౌద్ధులయిన భిక్షుకులు, అవధూత = దిగంబరులు, కాపాలిక = కాపాలికమతస్థులు- తలపుర్రె పెంకుతో భిక్షమెత్తి జీవించువారు, ఆది = మొదలుగాఁగల, అనాథులకున్ = దిక్కులేనివారలకు, కేలఁకులన్ =పార్శ్వములయందు, ఉన్న=ఉన్నట్టి, తంగేటిజున్ను = తంగేటిచెట్టునందుఁ బెట్టఁబడిన తేనెపెరవంటి వాఁడు. యజమానుఁడు = గృహస్థుఁడు, అంకస్థితార్థపేటి=తొడపైనుండెడి రూకలపెట్టెవంటివాడు. వాస్తవ్యుఁడు = గృహస్థుఁడు, పండినపెరటికల్పకము = ఫలించిన యింటివెనుకటిదొడ్డియందలి కల్పవృక్షమువంటివాఁడు. కాఁపు = గృహస్థుఁడు, దొడ్డిన్ = పసులదొడ్డియందు, పెట్టినవేల్పు గిడ్డి= కట్టివేసి యుంచినకామధేనువు వంటివాఁడు సంసారి = గృహస్థుఁడు, కడలేని యమృతంపు నడబావి -కడలేని = అంతములేని, అమృతంపు = అమృతముయొక్క, నడబావి = నడవరేర్పఱిచినట్టి బావి వంటివాఁడు భవనభర్త = గృహస్థుఁడు, సవిధమేరునగంబు- సవిధ = సమీపమునందున్న, మేరు నగంబు = మేరుపర్వతము వంటివాఁడు, కులపతి = గృహాధిపతి - గృహస్థుఁడు, మరుదేశపథమధ్యమ ప్రప-మరుదేశ = నీళ్లులేని ప్రదేశమునందలి, పథ = మార్గముయొక్క, మధ్యమ = నడుమనుండెడి, ప్రప = చలిపందిరివంటివాఁడు కుటుంబి = గృహస్థుఁడు, ఆఁకటికిన్ =ఆఁకలి యెత్తినవేళకు, ఒదవు సస్యము = ఉపయోగించునట్టి పైరువంటివాఁడు. కానన్ = కాఁబట్టి, భూసురోత్తమ = బ్రాహ్మణశ్రేష్ఠుఁడా, గార్హస్థ్యమునకున్ = గృహస్థధర్మమునకు, సరియె = (ఇతరాశ్రమధర్మములు ) సమానములా - కావనుట ఇందుఁ దంగేటిజున్ను మొదలగునవి యనాయాసముగా లభించు ననునర్థముం దెలుపును.

తా. చెవిటి కుంటి గ్రుడ్డి మొదలయిన దిక్కుమాలినవారికెల్లను గృహస్థుఁడే రక్షకుఁడు కాఁబట్టి గృహస్థాశ్రమమువంటి యాశ్రమములేదు. అలం. రూపకము, ఉల్లేఖమును.

క. నావుడుఁ బ్రవరుం డిట్లను, దేవా దేవర సమస్తతీర్థాటనముం
గావింపుదు రిలపై నటు, గావున విభజించి యడుగఁ గౌతుక మయ్యెన్. 67.

అ. నావుడున్ = అని సిద్ధుఁడు చెప్పఁగానే, ప్రవరుండు = ప్రవరాఖ్యుఁడు, ఇట్లు, అనున్ = అనెను దేవా=స్వామీ, దేవర = దేవరవారు-మీరు, ఇలపైన్ =భూమిమీఁద, సమస్తతీర్థాటనమున్ =ఎల్ల తీర్థములనుగూర్చి తిరుగుటను - సకలతీర్థయాత్రయు ననుట, కావింపుదురు= చేయుచుండుదురు అటు గావునన్ = కాఁబట్టి, విభజించి = (ఒక్కొక్క విషయమును) వేఱుపఱిచి- వేఱువేఱుగాననుట, అడుగన్ -అడుగుటకు, కౌతుకము=వేడుక, అయ్యెన్ =కలిగెను.

శా. ఏయే దేశములన్ వసించితిరి మీ రేయే గిరుల్ చూచినా
రేయే తీర్థములందుఁ గ్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టినా
రేయే పుణ్యవనాళిఁ గ్రిమ్మరితి రేయే తోయధుల్ డాసినా
రాయా చోటులఁ గల్గువింతలు మహాత్మా నాకెఱింగింపరే. 68

అ. మహాత్మా = ఓమహానుభావా, మీరు, ఏయేదేశములన్ = ఏయేదేశములయందు, వసించితిరి=ఉంటిరి, (పా- చరించితిరి = తిరిగితిరి,) ఏయేగిరుల్=ఏయేపర్వతములను, చూచినారు=చూచితిరి. ఏయేతీర్థములందున్ = ఏయేపుణ్యోదకములందు, క్రుంకిడితిరి = స్నానముచేసితిరి ఏయేద్వీపముల్=ఏయేదీవులను, మెట్టినారు=త్రొక్కితిరి - ప్రవేశించితిరి ఏయేపుణ్యవనాళిన్ = ఏయే పుణ్యారణ్యపంక్తియందు, త్రిమ్మరితిరి=విహరించితిరి. ఏయేతోయధుల్ = ఏయేసముద్రములను, దాటినారు=అతిక్రమించితిరి-స్నానార్థము చేరఁబోయితిరనుట. ఆయాచోటులన్ =ఆయాప్రదేశములందు, కల్గువింతలు=కలయట్టి యాశ్చర్యములను, నాకున్, ఎఱింగింపరే= తెలియఁజేయరయ్యా.

తా. ఓమహానుభావా! మీరుండినదేశములను మీరాడినతీర్థములను చూచినకొండలను పోయిచ్చిన దీవులను విహరించినపుణ్యారణ్యములను స్నానార్థముపోయినసముద్రములను వానివానియందుఁ గల వింతలను నాకు విశదముగా నానతీయవలయును.

క. పోయి సేవింప లేకున్నఁ బుణ్యతీర్థ, మహిమ వినుటయు నఖిలకల్మషహారంబ
కాన వేఁడెద ననిన నమ్మౌనివర్యుఁ, డాదరాయత్తచిత్తుఁడై యనియె నెనయ.

అ. పోయి=పుణ్యతీర్థయాత్రకుపోయి, సేవింపలేకున్నన్=ఆపుణ్యతీర్థములను సేవింపలేక యున్నను, పుణ్యతీర్థమహిమ=పుణ్యతీర్థములయొక్క ప్రభావమును, వినుటయున్=(మీవలన) వినుటకూడ, అఖిలకల్మషహారంబ=ఎల్లపాపములను పోఁగొట్టునదే, (అగును) కాన=కనుక, వేఁడెదన్=ప్రార్థించెదను, అనినన్=అనిప్రవరుఁడువేఁడఁగా, అమ్మౌనివర్యుఁడు=ఆమునిశ్రేష్ఠుఁడు, ఆదరాయత్తచిత్తుఁడై=ఆదరమునకు నధీనమయిన మనస్సుగలవాఁడై-ఆదరణతో, అనున్=ప్రవరునితో, అనియెన్=చెప్పెను.

ఉ. ఓచతురాస్యవంశకలశోదధిపూర్ణశశాంక తీర్థయా
త్రాచణశీలినై జనపదంబులు పుణ్యనదీనదంబులుం
జూచితి నందు నందుఁ గలచోద్యములుం గనుఁగొంటి నాపటీ
రాచలపశ్చిమాచలహిమాచలపూర్వదిశాచలంబులన్. 70

అ. ఓచతురాస్య ... శశాంక-ఓ=ఓయి,చతురాస్యవంశ=బ్రహ్మదేవుని వంశమనెడు, కలశోదధి=పాలసముద్రమునకు,పూర్ణశశాంక=నిండుచంద్రుఁడయినప్రవరుఁడా, తీర్థయాత్రాచణశీలినై=తీర్థయాత్రలు చేయుటయందుఁ బ్రసిద్ధమయిన స్వభావముగలవాఁడనై, జనపదంబులు=దేశములను, పుణ్యనదీనదంబులున్=పవిత్రములయిన నదులను నదములను, (తూర్పుదిక్కు ప్రవహించునవి నదులు, పడమరదిక్కు ప్రవహించునవి నదములు అని తెలియునది.) చూచితిన్ = చూచినాఁడను ఆపటీరాచల పశ్చిమాచలహిమాచల పూర్వదిశాచలంబులన్-ఆ=ప్రసిద్ధములయిన, పటీరాచల=మలయపర్వతము, పశ్చిమాచల=అస్తపర్వతము, హిమాచల = హిమవత్పర్వతము, పూర్వదిశాచలంబులన్=ఉదయపర్వతములను (ఈ నాలుగుపర్వతములందు), అందునందున్=అక్కడక్కడ, కలచోద్యములున్=ఉన్నట్టివింతలను గూడ, కనుఁగొంటిన్ = చూచితిని.

శా. కేదారేశు భజించితిన్ శిరమునం గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్ ప్రయాగనిలయుం బద్మాక్షు సేవించితిన్

యాదోనాథసుతాకళత్రు బదరీనారాయణుం గంటి నీ
యాదేశం బన నేల చూచితి సమస్తాశావకాశంబులన్. 71

అ. కేదారేశుఁ = కేదారేశ్వరుఁడనెడి శివమూర్తిని, భజించితిఁ = సేవించితిని హింగుళాపాదాంభోరుహంబుల్ = హింగుళయనెడి మహాదేవియొక్క పాదకమలములను, శిరమునఁ = తలయందు, కీలించితిఁ = చేర్చితిని - నమస్కరించితి ననుట. ప్రయాగనిలయుఁ = ప్రయాగక్షేత్ర మునికిపట్టుగాఁగల, పద్మాక్షుఁ = మాధవస్వామిని, సేవించితిఁ = కొలిచితిని యాదోనాథసుతాకళత్రుఁ - యాదోనాథ = సముద్రునియొక్క, సుతా = కూఁతురైనలక్ష్మీదేవి, కళత్రుఁ = భార్యగాఁగల, బదరీనారాయణుఁ = బదరికాశ్రమమునందలి నారాయణదేవుని, కంటిఁ = చూచితిని ఈయాదేశంబు = ఈదేశమాదేశము, అనఁ = అనుట, ఏల = ఏమిటికి, సమస్తాశావకాశంబులఁ = ఎల్లదిక్కులమధ్యప్రదేశములను, చూచితిఁ = నేనుజూచినాఁడను

వ. అది యట్లుండె వినుము గృహస్థరత్నంబ లంబమానరవిరథతురంగశృంగారచారుచామరచ్ఛటాప్రేక్షణక్షణోద్గ్రీవచమరసముదయం బగునుదయంబునం గల విశేషంబులు శేషఫణికి నైన లెక్కింప శక్యంబె, యంధకరిపుకంధరావాసవాసుకివియోగభవదుర్వ్యథాభోగభోగినీభోగభాగ పరివేష్టితపటీరవిటపివాటికావేల్లద్వేల్లాలతాపలయం బగుమలయంబునం గలచలువకు విలువ యెయ్యది, యకటకట నికటకూటకోటివిటంకిశృంగాటకాఘాకమానజరదిందుబింబగళదమృతబిందుదుర్దినార్ద్రీకృతసల్లకీపల్లవప్రభంజనపరాంజనహస్తిహస్తం బగునస్తంబునం గల మణిప్రస్తరంబుల విశ్రాంతిఁ జింతించిన మేనం బులక లిప్పుడుం బొడమెడు, స్వస్వప్రవర్ధితపరివర్ధితధరణీరుహసందోహదోహదప్రధానాసమాన్యఖేలదైలబిలవిలాసినీవిలాసవాచాలతులాకోటికలకలాహూయమానమానసముదాలసమరాళంబగు రజతశైలంబునోలంబులం గాలగళువిహారప్రదేశంబులం గన్నసంసృతిక్లేశంబులు వాయవే సతతమదజలస్రవణపరాయణైరావణవిషాణకోటిసముట్టంకితకటకపరిస్ఫురత్కురువిందకందళవ్రాతజాతాలాతశంకాపసర్పదభ్రము భ్రమీవిభ్రమధుగంధరం బగుమేరుధరాధరంబుశిఖరంబులసోయగంబులు గలయం గనుంగొనుట బహుజన్మకృతసుకృతపరిపాకంబునంగాక యేల చేకూఱు నేర్చు నే నిట్టిమహాద్భుతంబు లీశ్వరానుగ్రహంబున నల్పకాలంబునం గనుంగొంటి ననుటయు నీపుడిందురితిహాసనగ్రస్తీష్ణుగండయుగళుం డగుచుఁ బ్రవరుం డతని కిట్లనియె. 72

అ. గృహస్థరత్నంబ = గృహస్థులలో శ్రేష్ఠుఁడవయినయోప్రవరుఁడా, అది = ఆవృత్తాంతము, అట్లుండెఁ = అటుండనిమ్ము, వినుము = నేనిఁకమీఁదఁజెప్పఁబోవువృత్తాంతము వినుము, లంబమాన . సముదయంబు - లంబమాన = వ్రేలుచున్న, రవిరథ = సూర్యునితేరివైన, తురంగ = గుఱ్ఱములకు, శృంగార = అలంకారముగానున్న, చారు = సుందరములయిన, చామర = వింజామరలయొక్క, ఛటా = గుదులను, ప్రేక్షణ = చూచుటయనెడి, క్షణ = ఉత్సవము చేత, ఉద్గ్రీవ = పైకెత్తఁబడిన మెడలుగల, చమర = సవరపుమృగములయొక్క, సముదయంబు = సమూహముగలది, అగునుదయంబునఁ = అగునట్టియుదయపర్వత

ఘునందు, కలవిశేషంబులు = కలిగినయతిశయములు, శేషఫణికైనన్ = (వేయినోళ్లుగల) యాదిశేషునికైనను, లెక్కింపన్ = ఇన్నియని లెక్క పెట్టుటకు, శక్యంబె = తరమా అంధక విలయంబు - అంధకరిపు = అంధకాసురునిశత్రువైనశివునియొక్క, కంధరా = మెడయే, ఆవాస = ఉనికిపట్టుగాఁగల, వాసుకి = సర్పరాజైనవాసుకియొక్క, వియోగ = ఎడఁబాటువలన, భవ = పుట్టిన, దుర్వ్యథా = చెడ్డవిచారముయొక్క, ఆభోగ = అతిశయముగల, భోగినీ = సర్పస్త్రీలయొక్క, భోగభాగ = శరీరభాగములచేత, పరివేష్టిత = అంతటను జుట్టుకోఁబడిన, పటీరవిటపి = గంధపుమ్రాఁకులయొక్క, వాటికా = వరుసలయందు, వేల్లత్ = అల్లుకొనుచున్న, ఏలాలతా = ఏలకితీఁగెలయొక్క, వలయంబు = సమూహములుగలది, అగుమలయంబునన్ = అగునట్టిగంధపుఁగొండయందు, కలచలువకున్ = కలిగినట్టిచల్లఁదనమునకు, విలువ = వెల, ఎయ్యది = ఏదిలేదనుట. అకటకట = అయ్యయ్యో, (ఇది యిక్కడ మెచ్చుకొనుటను దెలుపును) వికట...హస్తంబు - వికట = హెచ్చుతగ్గులైయుండెడి, కూటకోటి = శిఖరసమూహములయందలి, విటంక = మంచూరులందలి గువ్వగూండ్లసందులవంటిసందులందుఁ గల, శృంగాటక = నాలుగుత్రోవలుసకలియుమార్గములందు, ఆధ్వాకమాన = అంతటనుసంచరించుచున్న, జరత్ = ముదిసిన = అస్తమింపఁబోవుచున్న, ఇందుబింబ = చంద్రమండలమువలననుండి, గళత్ = జాఱుచున్న, అమృతబిందు = అమృతపుబొట్లచేతనైన, దుర్దిన = మబ్బుకమ్మినదినముచేత, ఆర్ద్రీకృత = తడిసినదిగాఁ జేయఁబడిన, సల్లకీపల్లవ = అందుగుఁజిగుళ్లయొక్క, ప్రభంజనపర = మిక్కిలి ధ్వంసముచేయుటయందాసక్తిగల, అంజనహస్తి = అంజనమనెడిపడమటిదిగ్గజముయొక్క, హస్తంబు = తొండముగలది, అగున స్తంబునన్ = అయినట్టియస్తమయపర్వతమునందు, కలమణిప్రస్తరంబులవిశ్రాంతిన్ = కలిగినమానికపుఱాళ్లపై విశ్రమించుటను, చింతించినన్ = తలఁచుకొన్ననే, మేనన్ = దేహమునందు, పులకలు = గగుర్పాటులు, ఇప్పుడున్ = ఇప్పుడుగూడ, పొడమెడున్ = పొటమరించుచున్నవి. స్వస్వ మరాళంబు - స్వస్వప్రవర్ధిత = తమతమచేతఁ బెంపఁబడినవై, వర్ధిష్ణు = పెరుఁగునట్టి స్వభావముగల, ధరణీరుహ = వృక్షములయొక్క, సందోహ = సమూహముయొక్క, గోహద = అకాలమునందుఁ బుష్పింపఁజేయుక్రియయే, ప్రధాన = ముఖ్యమైనట్టుగాను, అసమాన = సరిలేనట్టుగాను, ఖేలత్ = క్రీడించుచున్న, ఐలబిలవిలాసినీ = కుబేరునియంతఃపురస్త్రీలయొక్క, విలాస = వినోదవిహారములయందు, వాచాల = మ్రోఁగుచున్న, తులాకోటి = అందెలయొక్క, కలకల = కోలాహలధ్వనులచేత, ఆహూయమాన = పిలువఁబడుచున్న, మానస = మానసమనెడి సరోవరమునందున్న, మదాలస = మదముచే మందములగుచున్న, మరాళంబు = హంసలుగలది, అగురజతశైలంబునోలంబులన్ = అయినట్టివెండికొండయొక్క మఱుఁగుతావులైన, కాలగళవిహారప్రదేశంబులన్ = శివుని వినోదసంచారస్థానములను, కన్నన్ = చూచినయెడల, సంసృతిక్లేశంబులు = సంసారదుఃఖములు, పాయువె = తొలఁగిపోవా - (స్త్రీలు నడచునప్పుడు కాలియందెలుమ్రోఁగుట హంసలు కూయునట్లుండును గనుక కుబేరస్త్రీలు విహరించునప్పటియందెలచప్పుళ్లు విని హంసలు తమజాతిపక్షులధ్వని యని భ్రమించి వారివారిం జేరవచ్చునని సంబంధము) సతత.. ధురంధరంబు - సతత = ఎల్లప్పుడు, మదజల = మదపునీటిని, స్రవణ = జాఱ్చుటయందు, పరాయణ = ఆసక్తమయిన, ఐరావణ = ఇంద్రుని యేనుఁగైన యైరావతముయొక్క, విషాణకోటి = కొమ్ములకొనలచేత, సముట్టంకిత = చక్కఁగాఁ బొడువఁబడిన, కటక = కొండనడిమిసేలలందు, పరిస్ఫురత్ = మిక్కిలి వెలుఁగుచున్న, కురువింద = (మదకోకిలముల నేత్రకాంతివంటి కాంతిగల) కెంపులయొక్క, కందళ = వెలుఁగుమొలకలయొక్క, వ్రాత = సమూహమువలన, జాత = పుట్టిన, అలాతశంకా = కొఱవులనెడిసందేహముచేత, అపసర్పత్ = ఎడముగాఁ దొలఁగిపోవు

చున్న, అభ్రము = ఐరావతగజముభార్యయయిన యభ్రమువుయొక్క, భ్రమి = గిరగిరఁదిరుగుట్లవలని, విలాస = ఒయ్యారముయొక్క, ధురంధరంబు = భారమును వహించినది, అగు మేరుధరాధరంబుశిఖరంబులసోయగంబులు- అగు=అయినట్టి, మేరుధరాధరంబు=మేరుపర్వతముయొక్క, శిఖరంబుల=శృంగములయొక్క, సోయగంబులు = చక్కఁదనములను, కలయన్ = అంతటను, కనుంగొనుట=చూచుట, బహు.. పాకంబునన్ - బహు=అనేకములయిన, జన్మ=జన్మములయందు, కృత=చేయఁబడిన, సుకృత =పుణ్యములయొక్క, పరిపాకంబునన్ = పరిపక్వమైన ఫలముచేత, కాక=కాని, ఏల=ఎందులకు, చేకూఱ నేర్చున్ =సిద్ధింపఁగలదు. (అభ్రమువు కురువిందమణులను గొఱ్ఱవులనుగా శంకించె నన్నచోట నలంకారము భ్రాంతిమంతము ) నేను-(ఇది సిద్ధునికన్వయము), ఇట్టి మహాద్భుతంబులు=ఇటువంటి దొడ్డవింతలను, ఈశ్వరానుగ్రహంబునన్ =దేవుని యనుగ్రహముచేత, అల్ప కాలంబునన్ =కొంచెపుఁగాలముననే, కనుఁగొంటిన్ =చూచితిని, అనుటయున్ =అని సిద్ధుఁడు చెప్పఁగా, ఈషత్ యుగళుండు - ఈషత్=కొంచెము, అంకురిత=మొలచిన, హాసన=నవ్వును, గ్రసిష్ణు=మ్రింగునట్టి స్వభావముగల- అణఁచుచున్న, గండయుగళుండు=చెక్కిళ్ల జంటగలవాఁడు, అగుచున్ =అవుచును, ప్రవరుండు, అతని కిట్లనియెన్ =ఆసిద్ధునితో నిట్లు పలికెను

తా. సూర్యుని తేరిగుఱ్ఱముల కలంకారముగా వేసియున్న సీవిరులగుదులను జూచి మోరలువిూఁది కెత్తుకొని తమజాతిమృగములే యందున్నవని భ్రమించుచున్న సవరపుమృగములుగలయుదయపర్వతమునందలివింతలు లెక్కలేనివనియు, తమభర్తయయినవాసుకి శివుని మెడయం దాభరణమైయుండుటవలన విరహావేదనపడుచున్నసర్పస్త్రీలచేతఁ జుట్టుకోఁబడిన గంధపుమ్రాఁకు లేలకితీఁగెలఁదుల్లుకొనుటచేత మిక్కిలి చల్లఁదనము నిచ్చుచుండఁగా నొప్పెడిమలయపర్వతమునందలి చల్లఁదనమునకు వెల యింతని చెప్పఁదరముకాదనియు, శిఖరాగ్రములందు ముంజూరులగువ్వగూండ్లంబోలెడి సందులం దస్తమింపఁబోవుచంద్రబింబమువలననుండి జాఱునట్టియమృతంపుఁజినుకుల చెమ్మచేఁ బెరిఁగినయందుగుమ్రాఁకులచిగుళ్లను దొండముచే నొడిసిపట్టి తినుచుండెడియంజనమనెడిదిగ్గజము సంచరించుచుండునట్టియస్తమయపర్వతప్రదేశములందుఁ గలరత్నపుశిలలపయిం బరున్నప్పటిసుఖమును దలఁచుకొన్నప్పుడెల్ల దేహమునందు గగురు చిగురొత్తుచుండుననియు, కుబేరునిభార్యలు తాము పెంచినవృక్షములకు దోహదక్రియలు చేయుచు విహరించునప్పుడు మ్రోఁగుచున్న యందెలమ్రోఁతలు విని వారిం జేరవచ్చుచున్నహంసలకు నెలవులయిన శివునివిహారప్రదేశములు చూచువారికి సంసారదుఃఖములు పాయుననియు, ఐరావతము తన దంతములచేఁ బొడిచి పెల్లగించి వెదచల్లఁగాఁ గోకిలములకన్నులవలె వెలుఁగుచుండెడి కురువిందరత్నములనే జూచి యైరావతముయొక్కభార్యయయిన యభ్రమువనెడి యాఁడేనుఁగు కొఱ్ఱవులని భ్రమసి త్రోలం గెడిప్రదేశములుగల మేరుపర్వతశిఖరములం జూచునంతటిభాగ్యము బహుజన్మములందుఁ జేసిన పుణ్యఫలముచేతనే కాని లభింపదనియు, ఇట్టిమహాశ్చర్యంబుల నెల్ల నీశ్వరానుగ్రహమువలన నల్పకాలముననె చూడఁగంటి ననియు సిద్ధుఁడు చెప్పఁగా నించుక నవ్వువచ్చినను దాని నణఁచుకొని ప్రవరుండు సిద్ధునితో నిట్లు వచియించె నని తాత్పర్యము (సూర్యుని గుఱ్ఱములకు నలంకారముగా వ్రేలవేసిన వింజామరలకు దమజాతిమృగములని చమరమృగములు భ్రమయుట, హంసలు స్త్రీల యందెలచప్పుడు తమజాతిపక్షులకూఁత లని భ్రమయుట, అనునిట్టిచోట్ల భ్రాంతిమదలంకారము గమ్యము వాసుకి వియోగమువలని తాపముచేత సర్పస్త్రీలు గంధపుమ్రాఁకులం జుట్టుకొనె నన్నచోట అలంకారము ఉత్ప్రేక్ష.)

చ. వెఱవక మీకు నొనర్తు నొకవిన్నప మిట్టివి యెల్లఁ జూచి రా
నెఱకలు గట్టుకొన్న మఱి యేండ్లును బూండ్లును బట్టుఁ బ్రాయపుం
జిఱుతతనంబు మీ మొగము సెప్పక చెప్పెడు నద్దిరయ్య మీ
కెఱుఁగఁ దరంబె మీమహిమ లీర యెఱుంగుదు రేమి చెప్పుదున్. 73

అ. వెఱవక=భయపడక, ఒకవిన్నపము=ఒకవిజ్ఞాపనము, మీకున్=మీకు, ఒనర్తున్=చేయుదును-మిమ్ము నొక్కవిషయ మడిగెద ననుట, ఇట్టివియెల్లన్=ఇటువంటివింతలన్నియు, చూచిరాన్=చూచివచ్చుటకు, ఎఱకలు=ఱెక్కలను, కట్టుకొన్నన్=కట్టుకొనినను-ఱెక్కలుకట్టుకొని యెగిరిపోయినను, మఱి=ఇంకను, ఏండ్లునుబూండ్లును=అనేకసంవత్సరములకాలము, పట్టున్=చెల్లును మీ మొగము=మీదైనముఖము, ప్రాయపుంజిఱుతతనంబున్=వయస్సుయొక్క లేఁతఁదనమును, చెప్పక చెప్పెడున్ = ఒకరుచెప్ప నక్కఱలేకయే తెలియఁజేయుచున్నది- మీముఖమే మీ లేఁతవయస్సును దెలుపుచున్నదనుట అద్దిరయ్యా=ఆశ్చర్యము, మీమహిమలు = మీప్రభావములు, మీకున్ = మీవంటివారికి, ఎఱుఁగన్=తెలిసికొనను, తరంబె=శక్యమా, ఈర=మీరే ఎఱుంగుదురు=గుర్తెఱుఁగుదురు-మీమహిమ మీకేగాని యితరులకుఁ దెలియదనుట, ఏమిచెప్పుదున్=ఇఁక నేనేమి చెప్పఁగలను

తా. నేను భయపడక మిమ్ము నొక్కవిషయ మడిగెదను మీరు చెప్పినవిశేషములను ఱెక్కలు గట్టుకొనిపోయి చూచి రాఁ దలఁచినను బెక్కుసంవత్సరములు పట్టును ఇఁక నడచిపోయి చూచి రావలయు నన్నఁ జెప్పవలయునా. ఇది యిట్లుండ మీమొగమును జూడఁగా మీరు మిక్కిలి పసివారగుట తనంతటనే తెలియుచున్నది ఇంతలో వానినెల్ల నెట్లు చూడఁజాలితిరో ఔరా ! మీమహిమ మీకేకాక మఱి యెవ్వరికిఁ దెలియును.

క. అనినఁ బరదేశి గృహపతి, కనియెన్ సందియముఁ దెలియ నడుగుట తప్పా
వినవయ్య జరయు రుజయును, జెనకంగా వెఱచు మమ్ము సిద్ధుల మగుటన్. 74

అ. అనినన్ = ఇట్లని ప్రవరుఁ డడుగఁగా, పరదేశి = సిద్ధుఁడు, గృహపతికిన్=గృహస్థుఁడైన ప్రవరునితో, అనియెన్ = ఇట్లుచెప్పెను, సందియమున్ = కలిగిన సందేహమును, తెలియన్ = విశదముగాఁ దెలియునట్లు, అడుగుట, తప్పా=నేరమా - కాదనుట, వినవయ్యా = వినుము, సిద్ధులము=ఔషధసిద్ధిగలవారము, అగుటన్ = అవుటచేత, మమ్ము, జరయున్ = ముసలితనమును, రుజయున్ = వ్యాధియును, చెనకంగాన్=ముట్టుటకు, వెఱచున్ = భయపడును-మాకు ముసలితనమును వ్యాధియు రావనుట.

మ. పరమం బైన రహస్య మౌ నయిన డాఁపం జెప్పెదన్ భూమిని
ర్జరవంశోత్తమ పాదలేప మను పేరం గల్గుదివ్యౌషధం
బురసం బీశ్వరసత్కృపం గలిగెఁ దద్భూరి ప్రభావంబునం
జరియింతుం బవమానమానసతిరస్కారిత్వరాహంకృతిన్. 75

అ. భూమినిర్జరవంశోత్తమ = బ్రాహ్మణకులశ్రేష్ఠుఁడవైన ప్రవరుఁడా, పరమంబు = గొప్పది, ఐనరహస్యము=అయినట్టిగోప్యవిషయము, ఔన్ = అవును, అయినన్=ఐనప్పటికిని, డాఁపన్ = నేను దాఁచను, చెప్పెదన్=నీకుఁ జెప్పెదను. పాదలేపమను పేరన్=పాదములేపమనెడి పేరితో, కల్గుదివ్యౌషధంబురసంబు = కలిగిన శ్రేష్ఠమయిన యౌషధరసము, ఈశ్వరసత్కృపన్=దేవునిదైన మంచిదయ-

చేతి, కలిగెక్ = నాకులభించెను తద్భూరిప్రభావంబునక్ = దానిదయిన గొప్పమహిమచేతి, పవమాన..
అహంకృతిక్ - పవమాన=వాయువును, మానస=మనస్సును, తిరస్కారి=అవమానపఱచునట్టి, త్వరా=
వేగముచేతనయిన, అహంకృతిక్ =గర్వముచేత, చరియింతుక్ =తిరుగుదును

తా ఓ బ్రాహ్మణోత్తమా! నాకు నింతటిమహిమగలిగినవిషయము చిక్కిలిరహస్యము. అయినను దానిని దాఁపక చెప్పెదను పాదలేపము అనుపేరుగల దివ్యౌషధరసమొకటి నాకు నీశ్వరానుగ్రహమువలన దొరకినది దానిచే వాయువుకన్నను మనస్సుకన్నను హెచ్చయిన వేగములతో నెల్లదేశములను నేను దిరుగుదును

క. దివి బిసరుహబాంధవసైంధవసంఘం బెంత దవ్వు దగ లేక రుగుక్
భువి నంత దవ్వు నేమును, రవరవ లేకరుగుదుము హుటాహుటినడలన్. 76

అ. దివిక్ =ఆకాశమునందు, బిసరుహ ..సంఘంబు- బిసరుహ=కమలములకు, బాంధవ=చుట్టమయినసూర్యునియొక్క, సైంధవ = గుఱ్ఱములయొక్క, సంఘంబు=సమూహము, ఎంతదవ్వు= ఎంతదూరము, దగలేక = దప్పిలేక-అనాయాసముగా, అరుగుక్ =పోవునో, భువిక్ = భూమియందు, అంతదవ్వుక్ =అంతదూరమును, ఏమును=మేమును, రవరవలేక = ఆయాసములేక, హుటాహుటినడలక్ =
అతిత్వరితములైనగమనములచేతి, అరుగుదుము=పోవుదుము

మ అనినక్ విప్రవరుండు కౌతుకభరవ్యగ్రాంతరంగుండు భ
క్తినిబద్ధాంజలిబంధురుండునయి మీదివ్యప్రభావం బెఱుం
గనినా ప్రల్లదముల్ సహించి మునిలోకగ్రామణీ సత్కృపక్
నను మీశిష్యునిఁ దీర్థయాత్రవలనక్ ధన్యాత్ముఁగాఁ జేయరే. 77

అ. అనినక్ =అని సిద్ధుఁడు చెప్పఁగా, విప్రవరుండు=బ్రాహ్మణశ్రేష్ఠుఁడైనప్రవరుఁడు, కౌతుక అంతరంగుండును- కౌతుక = కుతూహలముయొక్క, భర=అతిశయముచేతి, వ్యగ్ర=తొట్రుపడుచున్న, అంతరంగుండును=మనస్సుగలవాఁడును, భక్తి .బంధురుండునయి- భక్తి=భక్తిచేత, నిబద్ధ = కట్టఁబడిన, అంజలి=దోసిలిచేత, బంధురుండునయి=రమ్యమైనవాఁడునై, మీదివ్యప్రభావంబు=మీయొక్కఘనమయినమహిమను, ఎఱుంగనినాప్రల్లదములను= తెలియని నాయొక్క దుర్భాషణములను-వ్యర్థవాక్యములనుట,సహించి=ఓర్చి, మునిలోకగ్రామణీ=మునిసమూహమునందు శ్రేష్ఠుఁడయినసిద్ధుఁడా, సత్కృపక్ =
మంచిదయచేత, మీశిష్యుక్ =మీశిష్యుఁడనయిన, ననుక్ =నన్ను, తీర్థయాత్రవలనక్ =తీర్థములనుగూర్చిపోవుటవలన, ధన్యాత్ముఁగాక్ = కృతార్థమయినమనస్సుగలవానిఁగా-మనసులోనికోఱితతీఱినవానిఁగా, చేయరే=చేయుఁడు

క. అనుటయు రసలింగము నిడు, తనపట్టువ ప్రేఁపసజ్జదంతపుఁబరణిక్
నినిచినమొకపస రిది యది, యని చెప్పక పూసెఁ దత్పదాంబుజయుగళిన్ 78

అ అనుటయుక్ =ప్రవరుఁ డిట్లనుగఁగా, (సిద్ధుఁడు) రసలింగముక్ = రసముతోఁజేసినగుళికను,ఇడుతనపట్టువప్రేఁపసజ్జక్ =గుఱుతుగా ఉంచునట్టి తనయొక్క గుండ్రముగానుండు ప్రేముతోనల్లినబుట్టలోని, దంతపుబరణిక్ =దంతపుఁగరాటమునందు, నినిచినమొకపసరు = నిండించిన యొకవిధమయినయాకుపసరసమును ఇదియదియని చెప్పక=పేరుచెప్పక, తత్పదాంబుజయుగళిక్ = ఆప్రవరునికమలములవంటి యడుగులజంటయందు, పూసెక్ =రాచెను.

క. ఆమం దిడి యతఁ డరిగిన, భూమీసురుఁ డరిగెఁ దుహినభూధరశృంగ
శ్యామలకోమలకానన, హేమాఢ్యదరీఝరీనిరీక్షాపేక్షన్. 79

అ. ఆమందున్ = ఆపసరును, ఇడి = పెట్టి-పూసి, అతఁడు = ఆసిద్ధుఁడు, అరిగినన్ = పోఁగా, భూమీసురుఁడు = బ్రాహ్మణుఁడు-ప్రవరుఁడు, తుహిన. అపేక్షన్ - తుహినభూధర = మంచుకొండయొక్క, శృంగ = శిఖరములయందలి, శ్యామల = పసరుమించిననలుపు వన్నెగల, కోమల = లేఁతవైన, కానన = అడవులయొక్కయు, హేమ = బంగారుచే, ఆఢ్య = నిండిన-సువర్ణమయములైనయనుట, దరీ = గుహలయొక్కయు, ఝరీ = సెలయేళ్లయొక్కయు, నిరీక్షా = చూచుటయందలి, అపేక్షన్ = కోరికచేత, అరిగెన్ = పోయెను (దరీశబ్దమునకు కొండలు లోయ యని యర్థము చెప్పెదరు)

వ. అనిన విని యమ్మహీసురవరుఁ డట్లరిగి యెట్లు ప్రవర్తించె నతనిపుణ్యవర్తనశ్రవణంబు మనంబునకు హర్షోత్కర్షంబు కల్పించెఁ దర్వాతివృత్తాంతంబు గృపాయత్తచిత్తంబున నానతీయ వలయు నని యడుగుటయును. 80

అ. అనినన్ = అని పక్షులు చెప్పఁగా, (జైమిని) విని, అమ్మహీసురవరుండు = బ్రాహ్మణోత్తముఁ డయినయాప్రవరుఁడు, అట్లు = ఆవిధముగా, అరిగి = పోయి, ఎట్లు = ఏరీతిని, ప్రవర్తించెన్ = నడచెను అతనిపుణ్యవర్తనశ్రవణంబు = ఆప్రవరుని దయినధర్మప్రవర్తనముయొక్క వినికి, మనంబునకున్ = మనస్సునకు, హర్షోత్కర్షంబు = సంతోషాతిశయమును, కల్పించెన్ = పుట్టించెను. తర్వాతివృత్తాంతంబు = ఆటుపిమ్మటిసమాచారమును, కృపాయత్తంబు = దయకు నధీనమయినది, అగుచిత్తంబునన్ = అగునట్టిమనస్సుతో, ఆనతీయవలయున్ = చెప్పవలయును, అనియడుగుటయున్ = అని జైమినిముని యడుగఁగా- దీనికి రెండవయాశ్వాసమునందలి 'అవధరింపుము' అను క్రియతో నన్వయము.

శా. గంగాస్వచ్ఛతరంగభంగికయశోగాఢచ్ఛవిచ్ఛన్నసా
రంగాంకాంక నిరంకుశప్రతికళాప్రౌఢిప్రియంభావుకా
గాంగేయాచలచాపనూపురవచోగాంభీర్యలీలాస్పదా
బంగాళాంగకళింగభూపసుభటాభ్రశ్రేణిఝంఝానిలా. 81

అ. గంగా. అంక - గంగా = గంగానదియొక్క, స్వచ్ఛ = నిర్మలమయిన, తరంగ = అలలయొక్క, భంగిక = రీతివంటిరీతిగల, యశః = కీర్తియొక్క, గాఢ = దట్టమయిన, ఛవి = కాంతిచేత, ఛన్న = కప్పఁబడిన, సారంగాంక = చంద్రునిదయిన, అంక = చిహ్నముగలవాఁడా - అలం. ఉపమ, అతిశయోక్తియు. నిరంకుశ.. భావుకా - నిరంకుశ = అడ్డములేని ప్రతికళా = ప్రతివిద్యయందలి, ప్రౌఢి = సామర్థ్యముచేత, ప్రియంభావుకా = ప్రియుఁడగునట్టివాఁడా, గాంగేయ. .ఆస్పదా - గాంగేయాచల = బంగారుకొండయే, చాప = విల్లుగాఁగలశివునియొక్క, నూపుర = అందెయయిన యాదిశేషునియొక్క, వచః = మాటలయొక్క, గాంభీర్య = గంభీరభావముయొక్క, లీలా = విలాసమువంటి విలాసమునకు, ఆస్పదా = స్థానమయినవాఁడా - అలం. పదార్థవృత్తినిదర్శన బంగాళ. అనిలా - బంగాళాంగకళింగ = బంగాళము అంగము కళింగము అను దేశములయొక్క, భూప = రాజులయొక్క, సుభట = మంచిబంట్లనెడు, అభ్రశ్రేణి = మేఘములవరుసకు, ఝంఝానిలా = మహాధ్వనితోఁగూడిన పెనుగాలి యయిన వాఁడా. (ఝంఝాశబ్దమునకు వానతోఁగూడినగాలి యనునర్థము ప్రసిద్ధము.)-అలం. రూపకము.

తా. చంద్రమండలమువఱకు వ్యాపించినగంగయందలి యలలవలెఁ దెల్లనైన కీర్తిగలవాఁడును, ఎల్లవిద్యలందునుగల మిక్కుటమయిన పాండిత్యముచే మేలొందినవాఁడును, ఆకాశే ఘనాఘనాస్త్రమును వాగ్వైఖరిగలవాఁడును, అంగకళింగబంగాళదేశములరాజులసేనలను గెలిచినవాఁడు నైనట్టి కృష్ణరాయా యని తాత్పర్యము.

క. మండలికతపనశోభిత, కుండలిపతిశయన కర్ణకుండలితరసా
ఖండకవికావ్య దిగ్వే, దండశ్రుతిదళనకలహతాడితపటహా. 82

అ. మండలిక శయన-మండలికతపన= మండలికతపనుఁడు (సామంతులకు సూర్యుఁడైనవాఁ డిట్టివాఁడను చేత, శోభిత=ప్రకాశించునట్టివాఁడా, కుండలిపతిశయన=సర్పరాజైన శేషుఁడు శయ్యగాఁ గలవిష్ణువుయొక్క, కర్ణ. కావ్య-కర్ణ=చెవులకు, కుండలిత = పోఁగులుగాఁజేయఁబడిన, రసా = శృంగారాదినవరసములచేతనునిండిన, కవి=కవులయొక్క, కావ్య = ప్రబంధములుకలవాఁడా, కృష్ణువున కంకితముగాను దక్కర్ణానందముగాను గవులచేఁ బెక్కుకావ్యములు సేయించినవాఁడా యనుట. దిగ్వేదండ...పటహా-దిగ్వేదండ=దిగ్గజములయొక్క, శ్రుతి=చెవులను, దళన=పగుల్చునట్టి, కలహ తాడిత=యుద్ధమునందుఁగొట్టఁబడిన, పటహా = పటహమనెడి వాద్యవిశేషముగలవాఁడా. (మండలికుఁ డనఁగా వింశతియోజనవిస్తృతిగలదేశము నేలువాఁడు అని శబ్దార్థకల్పతరువు.)

ఉత్సాహ. కుకురుకాశకురుకరూశకోసలాంధ్రసింధుబా
హ్లికశకాంగవంగసింహళేశకన్యకామణి
ప్రకరపాణిఘటితరత్నపాదుకాకలాచికా
ముకురవీటికాకరండముఖ్యరాజలాంఛనా. 83

అ. కుకురు లాంఛనా=కుకురు, కాశ, కురు, కరూశ, కోసల, ఆంధ్ర, సింధు, బాహ్లిక, శక, అంగ, వంగ, సింహళ దేశములకు, ఈశ = ప్రభువులయినరాజులయొక్క, కన్యకామణి= కన్యారత్నములయొక్క, ప్రకర = సమూహముయొక్క, పాణి = చేతులయందు, ఘటిత = కూర్పఁబడిన-పట్టుకోఁబడిన, రత్నపాదుకా = రత్నములుపొదిఁగినపావకోళ్లు, కలాచికా = తమ్మపడిగెను, ముకుర=అద్దము, వీటికాకరండ = తాంబూలపుబరణి- అడపము, ముఖ్య=మొదలుగాఁగల, రాజ లాంఛనా = రాజచిహ్నములుగలవాఁడా.

తా. కుకురుకాశకరూశాదిదేశముల రాజులను గెలిచి వారికన్యకలను గొనివచ్చి పరిచారికలను జేసికొనియెను గనుక నాకన్యకలు పావకోళ్లు మొదలయినవానిని చేతుల ధరించి కొలువుచేయుఁగా నొప్పువాఁడని తాత్పర్యము

గద్యము ఇది శ్రీమదాంధ్రకవితాపితామహసర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస- శఠకోపతాపసప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లి కొల్లసానిచొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్య ప్రణీతం బైన స్వారోచిషమనుసంభవం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథ 84
మాశ్వాసము

అ. ఇది, శ్రీమత్ . ప్రణీతంబు-శ్రీమత్=విద్యాసంపత్తిచేనైన,ఆంధ్రకవితాపితామహ=ఆంధ్రకవిత్వమునకు బ్రహ్మయనెడు, సర్వతోముఖ=అంతటనువ్యాపించిన, అంక=పెద్దపేరుగలవాఁడును, పంకజాక్ష=విష్ణువుయొక్క, పాదాంబుజ=పాదములనెడుకమలములందు, అధీన=ఆసక్తమయిన, మానసేందిందిర= మనస్సనెడితుమ్మెదగలవాఁడును, నందవరపురవంశోత్తంస=నందవర మనుపట్టణమువారి వంశమునందు శ్రేష్ఠుఁడును- నందవరీకులవంశమునందు శ్రేష్ఠుఁడును, శఠకోపతాపస = శఠగోపయతి యొక్క, ప్రసాద = అనుగ్రహముచేత, ఆసాదిత = పొందఁబడిన, చతుర్విధ=నాలుగువిధములయిన, కవితామతల్లిక = శ్రేష్ఠమయిన కవిత్వముగలవాఁడును, (చతుర్విధకవిత్వములు-బంధము, చిత్రము, గర్భము, ఆశువు.) అల్లసానిచొక్కయామాత్యపుత్త్ర = అల్లసానిచొక్కయమంత్రియొక్క కుమారుఁడు నగు, పెద్దనార్యప్రణీతంబు = పెద్దనార్యునిచేఁ జేయఁబడినది, ఐనస్వారోచిషమనుసంభవంబు, అనుమహాప్రబంధంబునందుఁ=అనునట్టిమహాకావ్యమునందు, ప్రథమాశ్వాసము=మొదటియాశ్వాసము.



శ్రీ

# స్వారోచిషమనుచరిత్రము.

## సటీకము.

### ద్వితీయాశ్వాసము.



శ్రీఖండశీతనగమ
ధ్యాఖండక్షోణిమండలాఖండల వి
ద్యాఖేలనభోజ సుధీ
లేఖద్రుమ కృష్ణరాయ లీలామదనా. 1

అ. శ్రీఖండ.. ఆఖండల - శ్రీఖండశీతనగ=గంధపుఁగొండ మంచుకొండ యను నీరెండుకొండల యొక్క, మధ్య=నడుమనుండెడి, అఖండ=సమస్తమయిన, క్షోణిమండల = భూమండలమునకు, ఆఖండల=ఇంద్రుఁడైనవాఁడా - పాలకుఁడా యనుట, విద్యాఖేలనభోజ - విద్య=చదువుచేత, ఖేలన=క్రీడించుటయందు, భోజ = భోజరాజైనవాఁడా - భోజరాజువలె విద్యావినోదముచేతఁ బ్రొద్దుపుచ్చువాఁడా యనుట, సుధీలేఖద్రుమ=విద్వాంసులకు దేవవృక్షమైనవాఁడా - విద్వాంసులు కోరినవి కోరిన ట్లిచ్చువాఁడా యనుట, లీలామదనా=విలాసమునందు మన్మథుఁడా, కృష్ణరాయ=కృష్ణదేవరాయా, (అని కృతిపతిసంబోధనము.) అవధరింపు మని పైపద్యముతో నన్వయము

వ. అవధరింపుము జైమినిమునీంద్రునకుం బ్రజ్ఞాసాంద్రంబు లగుపక్షీంద్రంబు లవ్వలికథ యిట్లని చెప్పం దొడంగె. 2

అ. అవధరింపుము=చిత్తగింపుము - వినుము, జైమినిమునీంద్రునకున్ = జైమినిమునిశ్రేష్ఠునితో, ప్రజ్ఞాసాంద్రంబులు=బుద్ధిచేత నతిశయించినవి, అగుపక్షీంద్రంబులు=అయినట్టిపక్షిశ్రేష్ఠములు, అవ్వలికథన్ = తరువాతికథను, ఇట్లని = ఈమీఁదఁ జెప్పెడివిధముగా, చెప్పందొడంగెన్ = చెప్పనారంభించెను

చ. అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లురదభంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూపపరిఫుల్లకలాపకలాపిజాలముం
గటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్. 3

అ. భూమిసురుఁడు = బ్రాహ్మణుఁడు - ప్రవరుఁడు, చని = పోయి - ముందుచెప్పినచొప్పున హిమవత్పర్వతమునకుఁ బోయి యనుట, అటన్ = అక్కడ, అంబర...జాలమున్ - అంబర = ఆకా

శమును, చుంబి = ఒరయుచున్న, శిరః = శిఖరములందుండి, సరిత్=ప్రవహించుచున్న, ఝరీ = సెలయేళ్లయొక్క, పటల = సమూహమునందు, ముహుర్ముహుః = మాటిమాటికి, లురత్=పొరలుచున్న; అభంగ = ఎడతెగని, తరంగ = అల లనెడి, మృదంగ = మద్దెలలయొక్క, నిస్వన=ధ్వనులచేత, స్ఫుట=స్పష్ట (ప్రకట) మగుచున్న, నటన=నాట్యమునకు, అనురూప=తగినట్టుగా, పరిఫుల్ల=లెస్సగా విప్పఁబడిన, కలాప=కుంచెలుగల, కలాపి = నెమిళ్లయొక్క, జాలమున్ = సమూహములుగలదానిని, కటక ..సాలమున్-కటక = కొండనడిమిప్రదేశములందు, చరత్=తిరుగుచున్న, కరేణు=ఏనుఁగులయొక్క, (కరేణుశబ్దము ఆఁడుఏనుఁగునుదెలుపును.) కర=తొండములచేత, కంపిత=వడఁకింపఁబడిన- కదలింపఁబడిన, సాలమున్=వృక్షములుగలదానిని, శీతశైలమున్ = హిమవత్పర్వతమును, కాంచెన్=చూచెను.

తా. ప్రవరాఖ్యుఁ డట్లుపోయి పోయినచోట నాకాశము నంటెనశిఖరములయందుండి దిగువకుఁ బాఱుచున్న సెలయేళ్ల యలలచప్పుడు మద్దెలమ్రోఁతవలె వినఁబడఁగా నందులకుఁ దగినట్టు కుంచెలు విరియించి యాడుచున్న నెమిళ్లగుంపులుగలదియు, కొండ నడిమి నేలలయందలి వృక్షములను దొండములతోఁ బట్టి యాడించుచున్న యేనుఁగులుగలదియునైన మంచుకొండను జూచెను అలం. రూపకము

వ. కాంచి యంతరంగంబునఁ దరంగితం బగుహర్షోత్కర్షంబున. 4

అ. కాంచి=చూచి, అంతరంగంబునన్ = మనస్సునందు, తరంగితంబు = అలలుగొట్టినది-ఎడతెగక పైపయి నుప్పొంగుచున్నది, అగుహర్షోత్కర్షంబునన్ = అయినసంతోషాతిశయముచేత.

క. నరనారాయణచరణాం, బురుహద్వయభద్రచిహ్నశోముద్రితబదరీ
తరుషండమండలాంతర, సరణిన్ ధరణీసురుండు సనఁ జన నెదుటన్. 5

అ ధరణీసురుండు=బ్రాహ్మణుఁడయినప్రవరాఖ్యుఁడు, నర ..సరణిన్ — నరనారాయణ=నరుఁడు నారాయణుఁడు నని విష్ణువునంశమున జనించిన ఋషులయొక్క, చరణాంబురుహద్వయ=పాదపద్మములజంటయొక్క, భద్ర=శుభకరములైన, చిహ్న=హలకులిశాదిరేఖలయొక్క, గుఱుతులచేత, ముద్రిత=ముద్రింపఁబడిన-గుఱుతిడఁబడిన-ఇది సరణికి విశేషణము, బదరీతరు=రేఁగుమ్రాఁకులయొక్క, షండ=సమూహముయొక్క, మండల=ఆవరణరూపమయిన ప్రదేశముయొక్క, అంతర=మధ్యభాగమునందలి, సరణిన్=త్రోవను, చనఁజనన్ = పోఁగాఁబోఁగా- చాలదూరముపోఁగా, ఎదుటన్=ముందట-పైపద్యముతో నన్వయము

తా. అట్లు హిమవత్పర్వతమును జూచి సంతోషించినప్రవరుఁడు పూర్వకాలమునందు విష్ణుదేవునంశమున నీభూమియం దవతరించిన నరనారాయణు లనుమహామునులు తపస్సుచేసిన బదరీవనముఁ జొచ్చి దానినడుమ నొకత్రోవఁ గని యాత్రోవను బహుదూరముపోవునప్పు డెదుటిభాగమునందు.

క. ఉల్లలదలకాజలకణ, పల్లవితకదంబముకుళశోపరిమళలహరీ
హల్లోహలమదబంభర, మల్లధ్వను లెసఁగ విసరె శోమరుదంకురముల్ 6

అ. ఉల్లల .ధ్వనులు-ఉల్లలత్=గట్లమీఁదికెగయుచున్న, అలకా=అలకయనెడి యేటియొక్క, జలకణ=నీటిబిందువులచేత, పల్లవిత=చిగిరించిన, కదంబ=కడిమిచెట్లయొక్క, ముకుళ=మొగ్గలయొక్క, పరిమళ=మంచివాసనలయొక్క, లహరీ=ప్రవాహమునందు, ఈహత్=ఇచ్ఛగలవగుచున్న, లోహల=

అస్ఫుటవాక్కులుగల - అనఁగా నలకయనెడి యేటియొడ్డుననున్న కడిమిచెట్లయందలి పూఁదేనెలు త్రాగుటచే నవ్యక్తమధురధ్వనులు చేయుచున్న యనుట, మదబంభరమల్ల = మత్తుగొన్న తుమ్మెద మిన్నలి యొక్క, ధ్వనులు = ఝుంకారప్రవోఁలలు, ఎసఁగన్ = అతిశయించునట్లుగా, మరుదంకురముల్ = గాలి మొలకలు - తిన్ననిచల్లగాలి, విసరెన్ = వీఁచెను - అనఁగా అలకానదిమీఁదుగాఁ గడిమిపువ్వుల వాసనల తోఁగూడి వచ్చిన తిన్నని చల్లగాలి యావాసనలకుఁ దుమ్మెదలఝుంకారధ్వను లతిశయింపఁగా వీఁచెను.

సీ. తొండముల్ సాఁచియం దుగుఁజిగుళ్లకు నిక్క, కరులదంతచ్ఛాయ గడలుకొనఁగ
సెలవుల వనదంశములు మూఁగి నెఱవెట్టఁ, గ్రోల్పులుల్ పొదరిండ్ల గుఱక లిడఁగ
సెలయేటియిసుకలంకల వరాహంబులు, మొత్తంబులై త్రవ్వి ముస్తె లెత్త
నడ్డంబు నిడుపు నాపడ్డలగతి మనుఁ, బిళ్లు డొంకల నుండి క్రేళ్లు దాఁటఁ
బ్రబలభల్లుకనఖభల్ల భయదమథన, శిథిలమధుకోశవిసరవిశీర్ణమక్షి
కాంతరాంతరదంతురితాతపమునఁ, బుడమి తిలతండులన్యాయమున వెలుంగ.

అ. తొండములు = తొండములను, సాఁచి = సాఁగించి, అందుగుఁజిగుళ్లకున్ = అందుగుచెట్లయొక్క చిగురులకొఱకు, నిక్క . ఛాయ - నిక్క = మునికాళ్లచేనిలుచునట్టి, కరుల = ఏనుఁగులయొక్క, దంత = కొమ్ములయొక్క, ఛాయ = కాంతి, కడలుకొనఁగన్ = వ్యాపింపఁగాను, సెలవులన్ = పెదవులమూలలయందు, వనదంశములు = అడవియీఁగలు, మూఁగి = ముసరి, నెఱవెట్టన్ = సందులేర్పడఁదొలుచుచుండఁగా, క్రోల్పులుల్ = పెద్దపులులు, పొదరిండ్లన్ = తీఁగలులోనగునవి యల్లుకొనుటచే నిండ్లవలెనుండెడిపొదలయందు, గుఱకలిడఁగన్ = గుఱ్ఱుపెట్టి నిద్రింపఁగాను, సెలయేటియిసుకలంకలన్ = కొండయేళ్లలోనియిసుకదిబ్బలయందు, వరాహంబులు = పందులు, మొత్తంబులై = గుంపులై - గుంపులుగుంపులుగాఁగూడి, త్రవ్వి = ముట్టెలతోఁద్రవ్వి, ముస్తెలు = తుంగగడ్డలను, ఎత్తన్ = పైకెత్తఁగాను, అడ్డంబు = వీఁపుమీఁదిపఱపును, నిడుపును = నిడివియును (గల), ఆపడ్డలగతిన్ = ఆవుపెయ్యలవలె, మనుఁబిళ్లు = పెంటిమెన్నులు, డొంకలనుండి = నడచుటచేతఁ బల్లముగా నేర్పడిన పెద్దత్రోవలనుండి, క్రేళ్లుదాఁటన్ = గంతులువేయుచుండఁగాను - మన్నుఁబిళ్లు అనుటచేత ఆఁడుమన్నులే యందుఁ ద్రుళ్లుచుండఁగా నిఁక మనుఁబోతులు దుముకులాడుట చెప్పవలసినదే లే దని భావము, ప్రబల.. ఆతపమునన్ - ప్రబల = మిక్కిలిబలముగలిగిన, భల్లుక = ఎలుఁగుగొడ్లయొక్క, నఖభల్ల = బల్లెములవంటిగోళ్లచేనైన, భయద = భయమునుబుట్టించునట్టి, మథన = త్రచ్చుటలచేత - కోరాడుటలచేత, శిథిల = చెదరిన, మధుకోశ = తేనెపెరలయొక్క, విసర = సమూహమునుండి, విశీర్ణ = రేఁగిన, మక్షికా = తేనెటీఁగలయొక్క, అంతరాంతర = నడుమనడుమగల సందులనుండి, దంతురిత = వ్యాపించినదైన, ఆతపమునన్ = ఎండచేత, భూమి = నేల, తిలతండులన్యాయమునన్ = నువ్వులుబియ్యము కలిసిన న్యాయమువంటిన్యాయముతో - నువ్వులుబియ్యముకలసినట్లు, వెలుంగన్ = ప్రకాశింపఁగాను - దీనికి మీఁదిపద్యమునందలి 'పరికించుచున్' అనుక్రియతో నన్వయము

తా. ఏనుఁగు లందుగుఁజిగుళ్లకై నిక్కి తొండములు సాఁచునప్పుడు వానిదంతముల కాంతు లతిశయించుచుండెననియు, పెద్దపులులు నిద్రపోవుచుండఁగా వాని పెదవులమూలలఁగా నొడిబొల్లునకు నడవియీఁగలు ముసరుకొనుచుండెననియు, పందులు సెలయేళ్లలోని యిసుకదిబ్బలు త్రవ్వి తుంగగడ్డలు పెల్లగించి తినుచుండెననియు, ఋశ్యమృగములు బలిసినయావుపెయ్యలవలె డొంకలయందు దుముకులాడుచు మెలఁగెననియు, ఎలుఁగుగొడ్లు తేనెపెరలను గోళ్లతోఁ గోరాడఁగా నందున్న తేనెటీఁగలు రేఁగి యాడు

చుండెననియు, వానినీడలు నల్లగాను వానినడుమనడుమ వ్యాపించునట్టియెండపొడలు తెల్లగాను గనఁబడుటచే నవిరెండును భూమిమీఁద నువ్వులు బియ్యము వెదచల్లినట్లుండెననియుఁ దాత్పర్యము

క. పరికించుచు డెందంబునఁ, బురికొను కౌతుకముతోడ భూమీసురుఁ డ-
గ్గిరికటకతటనిరంతర, తరుగహనగుహావిహారతత్పరమతి యై. 8

అ. పరికించుచున్ = చూచుచును, భూమీసురుఁడు = బ్రాహ్మణుఁడైన ప్రవరాఖ్యుఁడు, డెందంబునన్ = మనసునందు, పురికొను తోడన్ - పురికొను = అతిశయించుచున్న, కౌతుకముతోడన్ = కుతూహలముతో, అగ్గిరి మతియై - అగ్గిరి = ఆమంచుకొండయొక్క, కటక = మధ్యప్రదేశమందును, తట = చఱులయందును, నిరంతర = దట్టమయిన, తరు = వృక్షములుగల, గహన = అడవులయందును, గుహా = గవులయందును, విహార = వినోదముగాఁ దిరుగుటయందు, తత్పర = ఆసక్తమయిన, మతి = బుద్ధిగలవాఁడై.

సీ. నిడుదపెన్నెఱిగుంపు జడగట్ట సగరుము, మ్మనుమందు తపముగైకొనిన చోటు
జరఠకచ్ఛపకులేశ్వరువెన్ను గానరా, జగతికి మిన్నేఱు దిగిన చోటు
పుచ్చడీకతనంబు పోఁబెట్టి గిరికన్య, పతిఁ గొల్వ నాయాసపడిన చోటు
వలరాచరాచవాఁ డలికాక్షుకనువెచ్చఁ, గరఁగిన యలకనికరపుఁజోటు
తపసియిల్లాండ్రచెలువంబుఁ దలఁచితలఁచి, మున్ను ముచ్చిచ్చు విరాళిఁ గొన్న చోటు
కనుపపులు వేల్పుఁబడవాలుఁ గన్న చోటు, హర్షమునఁ జూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన.

అ. ప్రవరాఖ్యుఁడు = ప్రవరుఁడను పేరుగలవాఁడు (ఇది కర్త), సగరుముమ్మనుమఁడు = సగరచక్రవర్తి మనుమనికొమారుఁడు - భగీరథుఁడు, నిడుదపెన్నెఱిగుంపు = నిడుపైన పెద్దలల వెండ్రుకలసమూహము, జడగట్టన్ = జడవలెఁ బెనఁచుకొనునట్టుగా, తపము = తపస్సును, కైకొనిన చోటు = పూనిన ప్రదేశమును, మిన్నేఱు = ఆకాశగంగానది, జరఠ . వెన్ను - జరఠ = ముదిసిన, కచ్ఛపకులేశ్వరు = తాఁబేళ్లకులమునకు రాజైన యాదికూర్మముయొక్క, వెన్ను = వీఁపుఁజిప్ప, కానరాన్ = కనఁబడునట్లుగా - అంటలోఁగునట్లు భూమి తెగునట్లనుట, జగతికిన్ = భూమిమీఁదికి, దిగిన చోటు = అవతరించిన ప్రదేశమును, గిరికన్య = పార్వతీదేవి, పుచ్చడీకతనంబు = సిగ్గరితనమును - లజ్జగలదానితనమును, పోఁబెట్టి = విడిచిపెట్టి, పతిన్ = పెనిమిటిని, కొల్వన్ = సేవింప, ఆయాసపడిన చోటు = శ్రమపడిన ప్రదేశమును - తపస్సు చేసిన ప్రదేశమనుట, వలరాచరాచవాఁడు = మన్మథుఁడనెడి క్షత్రియుఁడు, అలికాక్షుకనువెచ్చన్ - అలికాక్షుని = నొసటఁగన్నుగలశివునియొక్క, కనువెచ్చన్ = నేత్రాగ్నిచేత, కరఁగిన . చోటు - కరఁగిన = నీఱైన భస్మమయిన, అల = ప్రసిద్ధమయిన, కనికరపుఁజోటు = జాలిఁబుట్టించునట్టి ప్రదేశమును - ఆచోటును గాంచినవారు అయ్యో యీచోటనా మన్మథుఁడు కాలిపోయె నని జాలిఁబొందుదు రనిభావము, మున్ను = మునుపు, తపసి చెలువంబు - తపసియిల్లాండ్రు = సప్తమహాఋషులభార్యలయొక్క, చెలువంబు = అందమును, తలఁచితలఁచి = పలుమాఱు తలఁచుకొని, ముచ్చిచ్చు = మూఁడగ్నులును, (మూఁడగ్నులు = గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని) విరాళిగొన్న చోటు = మోహమునొందిన ప్రదేశమును, కనుపపులు = రెల్లుగడ్డి, వేల్పుఁబడవాలున్ = దేవసేనాధిపతి యైనకుమారస్వామిని, కన్న చోటు = ప్రసవించినప్రదేశమును - కుమారస్వామికి జన్మస్థానమైన రెల్లుగంటననుట, హర్షమునన్ = సంతోషముతో, చూచి = చూచినవాఁడై, ఆత్మలోనన్ = తనమనసునందు - మీఁదిపద్యముతో నన్వయము

చ. విలయకృశానుకీలములఁ బేడిమిఁ బోఁడిమి మాలి వెల్వడిం
గలసినభూతధాత్రి మఱి క్రమ్మఱ రూపయి నిల్చి యోషధుల్
మొలవఁగఁ జేయునట్టినయముం బ్రతికల్పము నెట్లు గాంచు నీ
చలిమలవల్ల నుల్లసిలుచల్లఁదనంబును నూనకుండినన్. 10

అ. విలయ . పేడిమిన్ - విలయ=ప్రళయకాలమునందలి, కృశానుకీలముల=నిప్పుమంటలయొక్క, పేడిమిన్=తాపముచేత, పోఁడిమి=సౌష్ఠవము-బాగు, మాలి = చెడి, వెల్వడిన్=భస్మముతో, కలసినభూతధాత్రి=కలసిపోయినభూమి, మఱి=మఱియును, క్రమ్మఱన్=మరల, రూపయి=స్వరూప మేర్పడి, నిల్చి=ఎప్పటివలెనిలిచి, ఓషధులు=మూలికలు-వృక్షలతాదులు, మొలవఁగన్ = మొలచునట్లుగా, చేయునట్టినయమున్ = చేయునట్టిలాభమును - మేలునుటు, ప్రతికల్పమున్ = ఒక్కొక్క బ్రహ్మాగినమునందును- ఒక్కొక్కసృష్ట్యారంభసమయమునందును, ఈచలిమలవల్లన్=ఈహిమవత్పర్వతమువలన, ఉల్లసిలుచల్లఁదనంబును= ఒప్పునట్టిశైత్యమును, ఊనకుండినన్ =అవలంబింపకున్నను- పొందకున్నను, ఎట్లు=ఏవిధముగా, కాంచున్=పొందును

తా. ప్రళయకాలమునందుఁ గాలి భస్మమయిపోయినభూమి యీహిమవత్పర్వతముయొక్క చల్లఁదనమును దాల్పకున్నయెడల మరలఁ దనయందు వృక్షలతాదులు మొలచునట్టి మేలునుబొంది యుండనేరదు అలం.| కావ్యలింగము

సీ. పసుపునిగ్గులు దేఱుఁ బాంచజన్నిద మొప్పఁ, బ్రమథాధిపతియింటిపట్టెఱింగె
శచి కీఁత గఱపుచుఁ జదలేట సురరాజు, జలకేళి సవరించుచెలు వెఱింగె
సదనుతోఁ జేఁపి చన్నవిసి యోషధుల మన్నోదవు కొండల కెల్లఁ బిదుక నెఱిఁగె
వేల్పుటింతులలోన విఱ్ఱవీఁగుచు మేన, నవరత్నరచనలఁ దవణ మెఱిఁగెఁ
బరిపరివిధంపుజన్నంపుఁ బరికరంపు, సొంపుసంపద నిఖిలనిలింపసభయు
నప్పటప్పటికిని జిహ్వాఁ దృప్పుడుల్ల, నామెఱ లెఱింగె నీతుషారాద్రికతన. 11

అ ఈతుషారాద్రికతనన్ = ఈ మంచుకొండయొక్క కారణముచేత, పసుపునిగ్గులు= పసుపురయొక్క కాంతులు, తేఱు= తేటగాఁదోఁచుచున్న,(పా పసుపుసగ్గులు మీఱు=పసుపుకాంతు లతిశయించు), పాంచజన్నిదము=సర్పయజ్ఞోపవీతము, ఒప్పన్ = ఒప్పుచుండఁగా-బ్రహ్మచర్యమునందు వర్తించుచున్న అనుట, ప్రమథాధిపతి = ప్రమథగణములకు నధిపతియైన శివుఁడు - ఇంటిపట్టు = గృహస్థధర్మము ను, ఎఱింగెన్ = తెలిసికొనెను-అనఁగా హిమవంతుఁడు తనకూఁతు నియ్యఁగా శివుఁడు గృహస్థుఁడయ్యెన నుట, సురరాజు=దేవేంద్రుఁడు, శచికిన్ =శచీదేవికి, ఈఁత = నీళ్లయందీఁదులాడుటను,కఱపుచున్ = నేర్పుచు, చదలేటన్ =ఆకాశగంగానదియందు, జలకేళిన్ =జలక్రీడను, సవరించుచెలువు= చేయునట్టివిధమును, ఎఱింగెన్ = తెలిసికొనెను-అనఁగా హిమవంతుఁడు గంగను ధరించుటచేతనే యింద్రుని కానదియందుఁ గ్రీడింప నవుపుపడియెననుట, మన్నోదవు=గోరూపముధరించిన భూదేవి, అదనుతోన్ =సమయమతిక్రమింపకుండునట్లుగా, చేఁపి=పాలుపొదుఁగులోనికిదింపి, చన్ను= స్తనము (ఇది జాత్యేకవచనము), అవిసి = మొనవిరిసి- మొనవిరియఁగాననుట, కొండలకెల్లన్ =ఎల్లకొండలకును, ఓషధులన్ =తృణగుల్మ తరులతాదులను, పిదుకనెఱిఁగెన్ =పిదుకుటకు నేర్చెను - అనఁగా హిమవంతుఁడు దూడకాఁగా భూమియావై యోషధరూపమైన పాలను గొండలకై పిదికెననుట, మేన=మేనక యనెడి యప్సరస, వేల్పుటిం

నిలులోనన్ = దేవతాస్త్రీలలోపల, విఱ్ఱవీఁగుచున్ = మిక్కిలినిక్కుచు, నవరత్న రచనము-నవ=(వజ్రము వైడూర్యము నీలము గోమేధికము మరకతము మాణిక్యము పుష్యరాగము మౌక్తికము ప్రవాళము ను) తొమ్మిదివిధములయిన-లేక, క్రొత్తయైన, రత్న=మణులయొక్క, రచనల=చెక్కడపుఁబనులుగల రాభరణమును=ఆభరణమును, ఎఱిఁగెన్=ఇట్టిదని తెలిసికొనెను-అనఁగా హిమవంతుఁడు మేనకకు భర్తయగుటచేతను హిమవంతునందు రత్నములగనులు మెండుగా నుండుటచేతను మేనకరత్నాభరణములు దాల్చి దేవతాస్త్రీలలోపల మిక్కిలి నిక్కుచుండెననుట, నిఖిలనిలింపసభయున్=సమస్తదేవతాసమూహమును, పరిపరి సంపదన్ - పరిపరివిధంపు=బహువిధములయిన, జన్నంపు=యజ్ఞములయొక్క, పరికరంపు=ఉపకరణములయొక్క, సొంపుసంపదన్=సౌష్ఠవముయొక్క కలిమిచేత, అప్పటప్పటికిన్=ఆయాసమయములకు, జిహ్వాగ్రముప్ప=నాలుకయందుఁ బొందినయరుచి, డుల్లన్=విడిచిపోవునట్లుగా-మానునట్లుగా,(పా. జిహ్వాగ్రుప్పటిల్లన్=నాలుక యరుచి చెడఁగా), ఆమెతలు=విందులను, ఎఱిఁగెన్=గుర్తెఱిఁగెను-అనఁగా ననేకులు రాజులు మొదలగువారు యజ్ఞములుచేయుటకు నీమంచుకొండ చోటగుటంబట్టి యెడపాదడపా దేవతలకు హవిర్భాగము లారగింపననుకూలించెననుట, అలం॰ రూపకము, ఉదాత్తమును.

మ. తలమే బ్రహ్మకునైన నీనగమహత్త్వం బెన్న నే నియ్యెడం
గలచోద్యంబులు రేపు గన్గొనియెదం గాకేమి నేఁ డేఁగెదన్
నలినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకం
దళచూత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముం దెల్పెడిన్. 12

అ. ఈనగమహత్త్వంబు=ఈపర్వతముయొక్కమహిమను, ఎన్నన్=ప్రశంసింపను, బ్రహ్మకునైనన్=బ్రహ్మదేవునికైనను, తలమే=తరమా-శక్యముకాదనుట, ఇయ్యెడన్=ఇచ్చట, కలచోద్యంబులు=కలిగిన వింతలను, నేను, రేపు=రేపటిదినము, కన్గొనియెదంగాకేమి=చూడనేచూచెదఁగాక, నేఁడు=నేటిదినము, ఏఁగెదన్=పోయెదను, నలినీ పరంపరలు - నలినీబాంధవ=సూర్యునియొక్క, భాను=కిరణములచేత, తప్త=కాలిన, రవికాంత=సూర్యకాంతపురాళ్లమీఁద, స్యంది=కాఱుచున్న, నీహారకందళ=మంచుబొట్లవలననైన, చూత్కార=చుంయి చుంయి మనెడు ధ్వనులయొక్క, పరంపరలు=సమూహములు, పయిపయిన్=మీఁదమీఁద - క్రమక్రమముగా, మధ్యాహ్నమున్=పట్టపగలగుటను, తెల్పెడిన్=తెలియఁజేయుచున్నవి

తా. ఈహిమవత్పర్వతమహిమను నెంచ బ్రహ్మకునయితము శక్యముకాదు ఇప్పుడు సూర్యకిరణములచేత వేఁడిమినొందిన సూర్యకాంతపురాళ్లమీఁదఁ బడునట్టిమంచుచినుకల చుంయిచుంయిమను శబ్దములు మధ్యాహ్నకాలమయ్యె ననుటను స్పష్టముగాఁ దెలుపుచున్నవి కాఁబట్టి నేఁటికిఁబోయి రేపువచ్చి చూచెద.

తే. అనుచుఁ గ్రమ్మఱువేళ నీహారవారి, బెరసి తత్పాదలేపంబు గరఁగిపోయెఁ
గరఁగిపోవుట యెఱుఁగఁడు ధరణిసురుఁడు, దైవకృతమున కిల నసాధ్యంబు గలదె.

అ. అనుచున్=ఇట్లని తనలోననుకొనుచు, క్రమ్మఱువేళన్=వెనుకకుఁదిరుగునప్పుడు, నీహారవారి=మంచునీరు, బెరసి=అంటి, తత్పాదలేపంబు=ఆతనియడుగులపసరుపూఁత, కరఁగిపోయెన్=ద్రవమయి యంటులేకపోయెను కరఁగిపోవుట=అట్లు కరఁగిపోవుటను, ధరణిసురుఁడు=ఆబ్రాహ్మణుఁడు-

ప్రవరాఖ్యుఁడు, ఎఱుఁగఁడు=తెలిసికొన్నవాఁడుకాఁడు, (కనుక) ఇలన్=భూమియందు, దైవకృత్యమునకున్=దైవయత్నమునకు, అసాధ్యంబు=సాధ్యముకానిది, కలదె=ఉన్నదా ? లేదు - అనఁగా నేపనియయినను దైవముతలఁచినట్లేయగును గాని మఱియొకవిధముగాఁ గానేరదనుట. అలం. అర్థాంతరన్యాసము

మ. అతఁ డట్లౌషధహీనుఁడై నిజపురీయాత్రామిళత్కౌతుకో
ద్ధతిఁ బోవన్ సపదిస్ఫుటార్తిఁ జరణద్వంద్వంబు రాకుండిన
న్మతిఁ జింతించుచు నవ్విధం బెఱిఁగి హా నన్నిట్లు దైవంబ తె
చ్చితె యీఘోరవనప్రదేశమునకున్ సిద్ధాపదేశంబునన్. 14

అ. అతఁడు=ఆప్రవరాఖ్యుఁడు, అట్లు=ఆవిధముగా, ఔషధహీనుఁడై=అడుగులకుఁబూసినపసరుచేతఁ దక్కువైనవాఁడై-పసరుపోయినవాఁడై, నిజ ..ఉద్ధతిన్ - నిజ=తనదయిన, పురీ=పట్టణమునుగూర్చి, యాత్రా=ప్రయాణముచేయుటయందు, మిళత్=కూడిన- పొందిన, కౌతుక=కుతూహలముయొక్క, ఉద్ధతిన్=ఎగవుచేత, పోవన్=ఎగిరిపోవుటకు, చరణద్వంద్వంబు=కాళ్లజత - రెండుకాళ్లను, రాకుండినన్=లేచిరాకయుండఁగా, సపదిస్ఫుటార్తిన్ = అప్పుడే స్పష్టమగుచున్న దుఃఖముచేత, (పా. సపరిస్ఫుటార్తిన్=చక్కఁగాఁదోఁచుచున్న దుఃఖముతోఁ గూడుకొనుటచేత), మతిన్ = బుద్ధియందు, చింతించుచున్=విచారపడుకొనుచు,అవ్విధంబు=ఆపాదలేపము కరఁగిపోయినవిధము, ఎఱిఁగి=తెలిసికొని,హా=అయ్యో, దైవంబ=దైవమా, నన్ను, ఇట్లు=ఈవిధముగా, సిద్ధాపదేశంబునన్=సిద్ధునినెపముచేత, (పా. సిద్ధోపదేశంబునన్ = సిద్ధుని యుపదేశముచేత), ఈఘోరవన ప్రదేశమునకున్=భయంకరమైన యీయడవిభూమికి, తెచ్చితె = తీసికొనివచ్చితివా.

తా. ప్రవరాఖ్యుఁ డట్లు పాదలేపము లేకపోఁగాఁ దనపట్టణమును గూర్చి యెగిరిపోవుటకుఁ గాళ్లు లేవకపోవుటచేతఁ బాదలేపము పోయినదని తెలిసికొని తత్క్షణమే పుట్టినవిచారముతో దైవమా! సిద్ధునిరాకయొక్క నెపముచేత నన్నీభయంకరమైన యడవికిఁ దెచ్చి చేర్చితివా? యని దుఃఖించెను. అలం. కావ్యలింగము

క. ఎక్కడియరుణాస్పదపుర, మెక్కడితుహినాద్రి క్రొవ్వి యే రాఁ దగునే
యక్కట మును సనుదెంచిన, దిక్కిది యని యెఱుఁగ వెడలుతెరు వెయ్యదియో.

అ. ఎక్కడి యరుణాస్పదపురము = అరుణాస్పదపుర మెక్కడనున్నది, ఎక్కడి తుహినాద్రి = ఈమంచుఁగొండ యెక్కడనున్నది - దీనికి దానికి నెంతో దూరము కలదనుట, క్రొవ్వి = మదించి, ఏన్=నేను, రాన్=వచ్చుట, తగునే = తగునా, అక్కట=అయ్యో, మును=మునుపు, చనుదెంచిన దిక్కు = ఇక్కడికివచ్చిన దిశ, ఇది=ఇట్టిది, అనియెఱుఁగన్=అని నేనుగుర్తెఱుఁగను. వెడలుతెరువు=ఇక్కడినుండి బయలుదేఱిపోవుమార్గము (పా. వెడలుతెఱఁగు=బయలు వెడలువిధము), ఎయ్యదియో = ఏదో.

మ. అకలంకౌషధసత్త్వముం దెలియ మాయాద్వారకావంతి కా
శి కురుక్షేత్ర గయా ప్రయాగములు నే సేవింప కుద్దండగం
డకి వేదండవరాహవాహరిపుఖడ్గవ్యాఘ్రఘ మిమ్మంచుఁగొం
డకు రాఁ జెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్. 16

అ. నేన్ = నేను, అకలంక . . సత్త్వమున్ - అకలంక = నిర్దోషమయిన, ఔషధ = మందుయొక్క, సత్త్వమున్ = బలమును - ప్రభావమును, తెలియన్ = తెలిసికొనుటకు, మాయా . ప్రయాగములు - మాయా = మాయానగరము - హరిద్వారము, ద్వారక = ద్వారవతీపట్టణము, అవంతి = ఉజ్జయినీపట్టణము, కాశీ = కాశీపట్టణము, కురుక్షేత్ర = కురుక్షేత్రము, గయా = గయాక్షేత్రము, ప్రయాగములు = ప్రయాగక్షేత్రము, (వీనిని) సేవింపక = చూడఁబోవక, ఉద్దండ వ్యాఘ్రము - ఉద్దండ = మిక్కిలి క్రూరములైన, గండక = గండములనెడి మృగములు, వేదండ = ఏనుఁగులు, వరాహ = అడవిపందులు, వాహరిపు = కారుదున్నపోతులు, ఖడ్గ = ఖడ్గమృగములు, ('గండకే ఖడ్గఖడ్గినౌ' యని నామలింగానుశాసనమునందు గండకఖడ్గశబ్దములు పర్యాయములుగాఁ జెప్పబడియున్నవి. ఇందు భిన్నములుగాఁ గానఁబడుచున్నవి ఇందులకుఁ బ్రమాణమేమో తెలియలేదు.) వ్యాఘ్రము = పెద్దపులులునుగలదైన, ఇమ్మంచుఁగొండకున్ = ఈహిమవత్పర్వతమునకు, రాన్ = వచ్చుట, చెల్లునే = నాకుఁదగునా, శ్రోత్రియులు = వేదముచదివి వైదికనిష్ఠగలవారు - ఛాందసులనుట, బుద్ధిజాడ్యజనితోన్మాదులు = బుద్ధిమాంద్యము వలనఁ బుట్టిన చిత్తవిభ్రమముగలవారు, కదా = కాదా - చిత్తవిభ్రమముకలవారే యనుట.

తా. నేను సిద్ధుఁ డిచ్చినమందుమహిమ తెలియవలెనన్న మాయ ద్వారక యవంతి కాశి కురుక్షేత్రము గయ ప్రయాగము మొదలయిన పుణ్యక్షేత్రములకుఁబోయి వానిని సేవింపక గండకములేనుఁగులడవిపందులు కారుదున్నలు పెద్దపులులు మొదలుగాఁ గలక్రూరమృగములు విశేషముగా నుండెడియీ మంచుఁగొండకు రావచ్చునా. కేవలవైదికులయిన నావంటివారు బుద్ధిమాంద్యమువలని చిత్తవిభ్రమము గలవారైయుందురు. కాఁబట్టి నేను నట్టిచిత్తభ్రమముచేత నీరానిచోటికి వచ్చితి అలం. అర్థాంతరన్యాసము.

సీ. నను నిముసంబుగానకయున్న నూరెల్ల, నరయుమజ్జనకుఁ డెంతడలు నొక్కొ
యెపుడు సంధ్యలయందు నిలువెళ్లనీక న, న్నోమెడుతల్లి యెంతో యలునొక్కొ
యనుకూలవతి నాదుమనసులోవర్తించు, కులకాంత మది నెంత కుందునొక్కొ
గెడఁ దోడునీడలై క్రీడించుసచ్ఛాత్రు, లింతకు నెంత చింతింతురొక్కొ
యతిథిసంతర్పణంబు లేమయ్యెనొక్కొ, యగ్ను లేమయ్యెనొక్కొ నిత్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబు కినుక నిట్లు, పాఱవైచితె మిన్నులు పడ్డచోట. 17

అ. ననున్ = నన్ను, నిముసంబు = నిమిషకాలము, కానకయున్నన్ = చూడకున్నయెడ, ఊరెల్లన్ = గ్రామమంతయు, అరయుమజ్జనకుఁడు = వెదకునట్టి మాతండ్రి, ఎంతడలునొక్కొ = ఎంత దుఃఖపడునో, (నన్ను) ఎపుడున్ = ఎల్లప్పుడును, సంధ్యలన్ = సంధ్యాకాలములయందు, ఇలువెళ్లనీక = ఇల్లువెడలి బయటఁబోనియ్యక, ఓమెడుతల్లి = కాపాడునట్టిమాయమ్మ, ఎంతో అలునొక్కొ = ఎంతవిలపించునో, అనుకూలవతి = అనుకూలప్రవర్తనముగలదై, నాదుమనసులోన్ = నాతలఁపు ననుసరించి, వర్తించు కులకాంత = నడుచుకొనునట్టి యిల్లాలు - నాభార్య, మదిన్ = మనస్సునందు, ఎంతకుందునొక్కొ = ఎంతగా శోకించునో, గెడన్ = దగ్గఱ, తోడునీడలై = సహాయులై, క్రీడించుసచ్ఛాత్రులు = విహరించునట్టి మంచిశిష్యులు, ఇంతకున్ = ఇప్పటికి, ఎంతచింతింతురొక్కొ = ఎంతగావిచారపడుచుందురో, అతిథిసంతర్పణంబులు = అన్నార్థులై యింటికివచ్చిన పెద్దలయారాధనములు, ఏమయ్యెనొక్కొ = ఏమియాయెనో, అగ్నులు = గార్హపత్యాదులయిన యగ్నులు, ఏమయ్యెనొక్కొ = ఏమియాయెనో, దైవంబ = ఓ,

దేవుఁడా, కినుకన్ = కోపముతో, నిత్యంబులు = ప్రతిదినముతప్పక నడపఁదగినవి, ఐనకృత్యములన్ = అయినట్టివ్యాపారములనుండి, పాపి = ఎడబాపి, మిన్నులుపడ్డచోటన్ = ఆకాశములు వాలినతావునందు - మిక్కిలిదూరమైనయూర్ధ్వభాగమునందు, పా. వైచితె = విసరివైచితివా - అనఁగా మిక్కిలి దూరము నందుఁ జేర్చితివా యనుట అలం సందేహము

క. నను నిలుసేరునుపాయం, బొనరింపఁగఁ జాలుసుకృతి యొకఁ డొదవఁ డో
యనుచుం జింతాసాగర, మున మునిఁగి భయంబు గదురఁ బోవుచు నెదురన్.

అ. ననున్ = నన్ను, ఇలుసేరునుపాయంబు = ఇంటికిఁబోయి చేరునట్టి యుపాయమును, ఒనరింపఁగన్ = చేయుటకు, చాలుసుకృతి = చాలునట్టి పుణ్యాత్ముఁడు, ఒకఁడు = ఎవఁడేనొకఁడు, ఒదవఁడో = కలుగఁడోయేమో, అనుచున్ = అనుకొనుచు, చింతాసాగరమునన్ = విచారమనెడి సముద్రమునందు, మునిఁగి = మునిఁగినవాఁడై, భయంబు = వెఱపు, కదురన్ = కలుగఁగా, పోవుచున్ = ఏదోయొక దారిఁబట్టిపోవుచు, ఎదురన్ = ఎదుటిభాగమునందు. - పైపద్యముతో నన్వయము. అలం. రూపకము, సందేహమును.

సీ. కులిశధారాహతిఁ బోలుపునఁ బైనుండి, యడుగుమోవఁగ జేగు బైనతటులఁ
గనుపట్టులోయ గంగానిర్ఝరము వాఱఁ, జలువ యానద్యేటి కెలఁకులందు
నిసుకవెట్టిననేల నేచి యర్కాంశులఁ, జొరనీక దట్టమై యిరులు గవియు
క్రముకపున్నాగనారంగరంభానాళి, కేరాదివిటపికాంతారవీథిఁ
గెరలు పిక శారికాకీర కేకి భృంగ, సారసధ్వనిఁ దనలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్దమీన గంధర్వయక్ష, గానఘూర్ణిత మగునొక్కకోనఁ గనియె.

అ. కులిశ... పోలుపునన్ - కులిశ = వజ్రాయుధముయొక్క, ధారా = వాయిచేనైన, హతి = దెబ్బయొక్క, పోలుపునన్ = విధమున - ఇంద్రుఁడు వజ్రాయుధముతో నఱకిన నఱకుడో యనునట్లు, పైనుండి = మీఁదితట్టునుండి, అడుగుమోవఁగన్ = దిగువతట్టానునట్లు, జేగుఱు = ఎఱ్ఱనివి, ఐనతటులన్ = అయినట్టిదరులతో, కనుపట్టులోయన్ = అగపడుచున్న కొండచీలికయందు, (పా. కనుపట్టి లోనన్ = కనఁబడి లోపలిభాగమందు), గంగానిర్ఝరము = గంగానది, పాఱన్ = ప్రవహించుచుండఁగా, చలువ = చల్లఁదనము గలది, ఐ = అయిన, అద్యేటి = ఆగంగానదియొక్క, కెలఁకులందున్ = రెండుప్రక్కలందును, ఇసుకవెట్టిననేలన్ = యిసుకక్రమ్మిన నేలయందు, ఏచి = పెరిఁగి, అర్కాంశులన్ = సూర్యకిరణములను, చొరనీక = ప్రవేశింపనియ్యక, దట్టమై = తఱుచై, ఇరులుగవియు... వీథిన్ - ఇరులు గవియు = చీఁకటిక్రమ్ముచున్న, క్రముక = పోఁక, పున్నాగ = పొన్న, నారంగ = నారింజ, రంభా = అనఁటి, నాళికేర = టెంకాయ, ఆది = మొదలుగాఁగల, విటపి = వృక్షములయొక్క, కాంతారవీథిన్ = వనపంక్తియందు, కెరలు... ధ్వనిన్ - కెరలు = కూయుచున్న, పిక = కోయిలలయొక్కయు, శారికా = గోరువంకలయొక్కయు, కీర = చిలుకలయొక్కయు, కేకి = నెమిళ్లయొక్కయు, భృంగ = తుమ్మెదలయొక్కయు, సారస = బెగ్గురుపక్షులయొక్కయు, ధ్వనిన్ = ధ్వనిచేత, తనలోని దరులు - తనలోని = తనలోపలివైన, చంద్రకాంత = నెలరాలయొక్క, దరులు = గుహలు, ప్రతిశబ్దము = మాఱుమ్రోఁతను, ఈనన్ = పుట్టింపఁగా, గంధర్వ... ఘూర్ణితము - గంధర్వ = గంధర్వులయొక్కయు, యక్ష = జక్కుల

యొక్కయు, గాన=సంగీతధ్వనులచేత, ఘూర్ణితము=తిరుగుడుపడుచున్నది, అగునొక్కకోనన్=అగునట్టియొక్కకొండసందుగొందిని, కనియెన్=చూచెను.

తా ఇంద్రుఁడు వజ్రాయుధముచే నఱకఁగా నేర్పడినగాయపుఁబగులో యన్నట్లు చివరనుండి యడుగువఱకు నెఱ్ఱగా నగపడుచున్న యిరుపార్శ్వములు గలకొండచీలికయందుఁ బ్రవహించుచున్న గంగయొక్క యిరుదరులందును నిసుకపాతైనయెడల మిన్నంటఁ బెరిఁగి దట్టముగాఁ గదిసియుండ చారనీనిమ్రాఁకులతోఁపులందుఁ గలకలకూయుచున్నకోయిలలు చిలుకలు మొదలైన వానిధ్వనులచేతను, ఆధ్వనులకుఁ బ్రతిధ్వను లిచ్చుచున్న గుహలచేతను, అచ్చట విహరించుచున్న యక్షగంధర్వుల సంగీతధ్వనులచేతను నొప్పుచున్న యొకకొండసందుగొందిని ప్రవరాఖ్యుఁడు చూచెను

అలం. ఉత్ప్రేక్ష

క. కనుఁగొని యిది మునియాశ్రమ, మనుతహాతహ వొడమి యిచటికి నరిగిననాకుం
గనసగు నొక తెఱుగువ యని, మనమునఁ గలదిగులు కొంత సమ్మట్టువడంగన్. 20

అ. కనుఁగొని=ఆకోననుజూచి, ఇది=యీకానవచ్చునది, మునియాశ్రమము=మునులు తపస్సుచేయుచోటు, అనుతహాతహ=అనునట్టితమకము-అనియెడిభ్రాంతి, పొడమన్=పుట్టఁగా, ఇచటికిన్=ఈచోటికి, అరిగినన్=పోయినను, నాకు, ఒక తెఱువ=ఒక్కయుపాయము, కనసగున్=కానవచ్చును-కలుగును, అని=అనుకొని, మనమునన్=మనస్సునందు, కలదిగులు=కలిగినయధైర్యము, కొంత=కొంచెము, మట్టుపడంగన్=తగ్గఁగా-పైపద్యముతో నన్వయము.

చ. నికటమహీధరాగ్రతటనిర్గతనిర్ఝరధారఁ బాసి లో
యకుఁ దలక్రిందుగా మలఁకలై దిగుకాలువవెంటఁ బూచుమ
ల్లికలవలంబనంబుగ నళిప్రకరధ్వని చిమ్మిరేఁగ లో
నికి మణిపట్టభంగసరణిన్ ధరణీసురుఁ డేఁగి చెంగటన్. 21

అ. ధరణీసురుఁడు=బ్రాహ్మణుఁడు- ప్రవరాఖ్యుఁడు, నికట ధారన్-నికట=సమీపమునందలి, మహీధర=కొండయొక్క, అగ్ర=చివరయందుఁగల, తట=ప్రదేశమునుండి, నిర్గత=వెడలిన, నిర్ఝరధారన్=సెలయేటిధారను, పాసి=విడిచి-దానినుండి చీలియనుట, లోయకున్=కోనతట్టునకు, తలక్రిందుగాన్=పైభాగము క్రిందికివాలునట్టుగా, మలఁకలై=మెలికలై-వంపువంపుగాఁ దిరిగినదై, దిగుకాలువవెంటన్=దిగువకుఁ బాఱుచున్న కాలువవెంబడిని, పూచుమల్లికలు=పుష్పించినట్టి మల్లెతీఁగలు, అవలంబనంబుగన్=చేతిపట్టుకాఁగా, అళిప్రకరధ్వని=తుమ్మెదగుంపులమ్రోఁత, చిమ్మిరేఁగన్=మిక్కిలియతిశయింపఁగా, మణిపట్టభంగసరణిన్=రత్నములమెట్లదారిని, లోనికిన్=ఆకోనలోపలికి, ఏఁగి=పోయి, చెంగటన్=సమీపమునందు-పైపద్యముతో నన్వయము

తా ప్రవరాఖ్యుఁడు తానున్నతావునకుఁ దాపునఁ గొండకొమ్మునుండి లోయలోనికి వంపులు దిరిగి తలక్రిందుగాఁ బ్రవహించుచున్న సెలయేటికాలువ యిరుదరులందును మొలచి పూచి పరిమళించుచున్న మల్లెతీఁగలను బట్టుకొని వానియందు మూఁగినతుమ్మెదలు రేఁగి ఝుంకారము చేయుచుండఁగా నచ్చటఁ గట్టఁబడి యున్న రత్నపుమెట్లమార్గమునఁ గోనలోనికి దిగి సమీపమునం దసి తాత్పర్యము.

శా. తావుల్ క్రేవలఁ జల్లుచెంగలువకేదారంబుతీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొనుకాంతారంబునం దైందవ

గ్రావాకల్పితకాయమానజటిలద్రాక్షాగుళుచ్ఛంబులం
బూవుందీవెల నొప్పునొక్కవిభవనంబుం గారుడోత్కీర్ణమున్. 22

అ. కేవలన్ = పార్శ్వములందు, తావుల్ = పరిమళములను, చల్లు తీరంబునన్ - చల్లు= ప్రసరింపఁజేయునట్టి, చెంగలువ = ఎఱ్ఱగలువలుగల, కేదారంబు = వరిమడియొక్క, తీరంబునన్ = చేరువను, మావులు=మామిడిమ్రాఁకులును, క్రోవులు=ఎఱ్ఱపువ్వులగోరంటచెట్లును, అల్లిబిల్లిగొనుకాంతారంబునందున్=ఒకటితో నొకటి పెనఁగొన్నవనమునందు, ఐందవ. గుళిచ్ఛంబులన్ - ఐందవగ్రావ= చంద్రకాంతపుఱాళ్లచేత - ఆఱాళ్లతోఁ జేయబడిన కంబములు మొదలైన వానిచేత ననుట, ఆకల్పిత= చక్కఁగా రచింపఁబడిన, కాయమాన=పందిటియందు, జటిల=దట్టముగా నల్లుకొన్న, ద్రాక్షా= ద్రాక్షతీఁగలయొక్క, గుళుచ్ఛంబులన్=పండ్లగుత్తులచేతను, పూవుందీవెలన్ = పుష్పించిన తీఁగెలచేతను, ఒప్పునొక్కభవనంబున్=ఒప్పునట్టియొకయింటిని, గారుడోత్కీర్ణమున్=గరుడ పచ్చలచేఁ బొదుఁగఁబడినదానిని- దీనికిఁ గ్రియ పైపద్యములోని 'కాంచి' అనునది

తా ఎఱ్ఱగలువల పరిమళములు చుట్టుపట్లఁ బ్రసరింపఁజేయుచున్న వరిమడివెంబడి, మామిళ్లు గోరంటలు నొకటితో నొకటి పెనఁగొన్న యొకవనమునడుమఁ జంద్రకాంతపుఱాళ్లచే రచింపఁబడిన పందిటియందు ద్రాక్షతీఁగలును బువ్వుఁదీఁగలును నల్లుకొని ద్రాక్షపండ్లగుత్తులును పూగుత్తులును వ్రేలఁబడి పరిమళించుచుండఁగా నొప్పునట్టిదియు గరుడపచ్చలు దాఁపినట్టిదియు నగునొకయింటిని బ్రవరాఖ్యుఁడు చూచెను

క. కాంచి తదీయవిచిత్రో, దంచితసౌభాగ్యగరిమ కచ్చెరువడి య
క్కాంచనగర్భాన్వయమణి, యించుక దఱియంగ నచటి కేఁగెడువేళన్. 23

అ. కాంచి=(అట్టిదివ్యభవనమును) చూచి, తదీయ...గరిమకున్ - తదీయ=దానిదైన, విచిత్ర= వింతయైన, ఉదంచిత=మిక్కిలియొప్పిదమైన, సౌభాగ్య=చక్కఁదనముయొక్క, గరిమకున్=గొప్పతనమునకు- అతిశయత్వమునకు, అచ్చెరువడి=ఆశ్చర్యపడి, అక్కాంచనగర్భాన్వయమణి= బ్రాహ్మణవంశశ్రేష్ఠుఁడైన యాప్రవరాఖ్యుఁడు, ఇంచుక=కొంచెము, దఱియంగన్=దగ్గఱగా, అచటికిన్=ఆతావునకు, ఏఁగెడువేళన్=పోవునప్పుడు- పైపద్యముతో నన్వయము

క. మృగమదసౌరభవిభవ, ద్విగుణితఘనసారసాంద్రవీటీగంధ
స్థగితేతరపరిమళమై, మగువపొలుపు దెలుపునొక్కమారుత మొలసెన్. 24

అ మృగమద పరిమళమై-మృగమద=కస్తూరియొక్క, సౌరభ=పరిమళముయొక్క, విభవ=వైభవముకంటె, ద్విగుణిత=రెండింతలుగాఁజేయఁబడిన, ఘనసార=పచ్చకర్పూరముతోఁ గూడిన, సాంద్ర=దట్టమయిన, వీటీ=తాంబూలముయొక్క, గంధ=పరిమళముచేత, స్థగిత=కప్పఁబడిన-అణఁచివేయఁబడిన, ఇతరపరిమళమై=అన్యములయిన పువ్వులు మొదలైనవాని వాసనలుగలదై, మగువపొలుపు= స్త్రీయొక్కజాడను, తెలుపునొక్కమారుతము=తెలియఁజేయునట్టి యొకగాలి, ఒలసెన్=వీచెను.

తా అప్పుడు కస్తూరి పచ్చకర్పూరము మొదలయిన పరిమళద్రవ్యములతో విడెముచేసిన వాసన తక్కినవాసనల నెల్ల నణఁచివేయఁగా నట్టివాసనచేత స్త్రీయొకతె యచ్చట నున్న దనుజాడను దెలుపునట్టి గాలి మెల్లగా వీచెను. అలం. కావ్యలింగము. ('ద్విగుణితఘనసారసాంద్రవీటి' యనియు 'మగువ

పోలుపు తెలుపు' అనియు నన్నందున స్త్రీలు తాంబూలము చేయునప్పు డొకపాలు కస్తూరియు రెండుపాళ్లు పచ్చకర్పూరమును గూర్పవలయు ననుశాస్త్రము సూచిత మగుచున్నది.)

మ. అతఁ డావాతపరంపరాపరిమళవ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁ బోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురం జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొకమరున్నారీశిరోరత్నమున్. 25

అ. అతఁడు = ఆప్రవరాఖ్యుడు, ఆవాత .లీలన్ - ఆవాతపరంపరా = ఆగాలితెరలవలని, పరిమళ = మంచివాసనయొక్క, వ్యాపారలీలన్ = ప్రవర్తనవిలాసముచేత, ఇచ్చోటు = ఈప్రదేశము, జనాన్వితము=జనులతోఁగూడినది - జనులుగలది, అని=అనుకొని, చేరఁబోయి = దగ్గఱఁబోయి, విద్యుల్లతావిగ్రహన్ = మెఱపుఁదీఁగవంటి శరీరముగలదానిని, శతపత్రేక్షణన్ = తామరలవంటి కన్నులుగలదానిని, చంచరీకచికురన్ = తుమ్మెదలవంటితలవెండ్రుకలు గలదానిని, చంద్రాస్యన్ =చంద్రుని వంటిముఖముగలదానిని, చక్రస్తనిన్ = చక్రవాకములవంటిచన్నులు గలదానిని, నతనాభిన్ = లోఁతయిన బొడ్డుగలదానిని, ఒకానొకమరున్నారీశిరోరత్నమున్ = ఒకానొకదేవతాస్త్రీలలో శ్రేష్ఠురాలయిన, నవలాన్ = స్త్రీని, కనియెన్ = చూచెను

తా. ఆప్రవరాఖ్యుఁ డాగాలితెరలవలనిమంచివాసనలు పయింబయి వ్యాపించుటచేత నిది జనులుండు తావనుకొని దగ్గఱఁబోయి మెఱపుఁదీఁగెను బోలినదేహమును దామరలను బోలినకన్నులును, దుమ్మెదలను బోలినతలవెండ్రుకలును జంద్రునిఁ బోలినముఖమును జక్రవాకపక్షులం బోలినచన్నులును లోఁతైన పొక్కిలియుఁ గలిగియొప్పుచున్న యొకదేవతాస్త్రీని గనియెను

తే. అమలమణిమయనిజమందిరాంగణస్థ, తరుణసహకారమూలవితర్దిమీఁద
శీతలానిల మొలయ నాసీన యైన, యన్నిలింపాబ్జముఖియు నయ్యవసరమున 26

అ. అమల మీఁదన్ - అమలమణిమయ = తెల్లగావెలుఁగునట్టి వజ్రమణి వికారమయిన-వజ్రమణులుపఱిచిన, నిజ=తనదైన, మందిర= ఇంటియొక్క, అంగణస్థ=ముంగిటియందున్న, తరుణసహకార = తియ్యమామిడిగున్నయొక్క, మూల = మొదటవేయఁబడిన, వితర్దిమీఁదన్ = అరుఁగుమీఁద, శీతలానిలము = చల్లగాలి, ఒలయన్ = ప్రసరింపఁగా-వీవఁగా, ఆసీన = కూర్చున్నది, ఐనయన్నిలింపాబ్జముఖియున్ = అయినట్టియాదేవతాస్త్రీయును, అయ్యవసరమునన్ = ఆసమయమునందు-పైపద్యముతో నన్వయము.

సీ. తతనితంబాభోగధవళాంశుకములోని, యంగదట్టపుఁగావిరంగువలన
శశికాంతమణిపీఠి జాజువాఱఁగఁ గాయ, లుత్తుంగకుచపాళి నత్తమిల్లఁ
దరుణాంగుళీఘాతతంత్రీస్వనంబుతో, జిలిబిలిపాట ముద్దులు నటింప
నాలాపగతిఁజొక్కియరమోడ్పుఁగనుదోయి, రతిపారవశ్యవిభ్రమముఁ దెలుపఁ
బ్రౌఢిఁబలికించుగీతప్రబంధములకుఁ, గమ్రకరపంకరుహరత్నకటకఝుణఝు
ణధ్వనిస్ఫూర్తి తాళమానములుగొలుప, నింపుదళుకొత్త వీణ వాయించుచుండి.

అ. తత వలనన్ - తత = విరివియైన, నితంబ=పిఱుఁదులయొక్క, ఆభోగ = పరిపూర్ణత్వము మీఁది-విశాలమగు పిఱుఁదుల యుపరిప్రదేశముపైనంతయు నిండారియున్న, (లేక) తత=వ్యాప్తమైన-

ఆవృత మైన, సితంబాభోగ=పిఱుఁదుల పూర్ణవిస్తారయుగల-పిఱుఁదులవిరివి పైనంతయు వ్యాపించిన-స్థి శాలములగు పిఱుఁదులనంతయుఁ గప్పియున్న యనుట, ధవళాంశుకములోని=తెల్లనియ స్త్రములోపలి,అం గదట్టపు=పావడయొక్క, కావిరంగువలనన్ =ఎఱ్ఱని వన్నెవలన, చంద్రకావి వన్నెవలన, శశికాంతమణి పీఠి=చంద్రకాంతమణులు పొదిఁగినపీఠము, జాజువాఱఁగన్ =ఎఱుపువన్నెగలది యగుచుండఁగాను, ఇటఁ దెల్లనివస్త్రము పిఱుఁదులనంతయు నావరించియున్నదనుటచే దానిలోపలి యెఱ్ఱపావడ కూర్చున్న పీఠికిఁ దగులలేదనియుఁ గావున దానియెఱ్ఱనివన్నె యావస్త్రము మూలముననే పీఠిపైఁ బ్రసరించుచుండె ననియు, నిట్లు ప్రసరించియు నాపీఠి యెఱ్ఱజాతియుండె ననుటచే నాపావడ మిక్కిలి ర క్తిమగలది గాను దానిపైనావరించియున్నవస్త్రము మిక్కిలిసన్నమైన రవసెల్లాగాను నుండవలయుననియు గ్రాహ్య ము. కాయలు=వీణెకు నమర్చిన సొఱకాయలు, ఉత్తుంగకుచపాళిన్ = ఉన్నతమయిన స్తనప్రదేశము నందు, అత్తమిల్లన్ =ఆనఁగాను, తరుణ ..స్వనంబుతోన్ -తరుణ=లేఁతవైన-కోమలమైన, అంగుళీ-వ్రేళ్లచేత, ధూత=మీటఁబడిన, తంత్రీ=ఉక్కుతీఁగెలయొక్క, స్వనంబుతోన్=నాదముతోడ, జిలిబిలి పాట=సన్నగొంతువలన నవ్యక్తమధురమయినపాట, ముద్దులు=మనోజ్ఞతలను, నటింపన్=ప్రవర్తిల్లఁజే యఁగాను, ఆలాపగతిన్=రాగము నాలాపనచేయురీతిచేత, చొక్కి = పరవశయై-పరవశ యగుటచే తననుట, అరమోడ్పుఁగనుదోయి=సగము మూయుట గలకన్నులజంట-సగము మూసినరెండుకన్నులును, రతి ..విభ్రమమున్ -రతి=సంభోగకాలమందలి, పారవశ్య=చొక్కుఐంటిచొక్కుయొక్క, విభ్రమ మున్ = విలాసమును, తెలుపన్ = తెలియజేయఁగాను, ప్రౌఢిన్ = నేర్పుతో, పలికించు=వీణె యందుఁ బలికించునట్టి, గీతప్రబంధములకున్ =సంగీతపుఁగృతులకు, క్రమ. స్ఫూర్తి-క్రమ=అందమైన, కరపంకరుహ=హ స్తకమలములయొక్క, రత్నకటక= మణుల చెక్కినకడియములయొక్క, ఝణఝ ణధ్వని=ఝణఝణయనెడి నాదముయొక్క,స్ఫూర్తి=తోఁచుట- వినికి,తాళమానములు=తాళప్రమాణ ములను, కొలుపన్=పొందింపఁగాను, ఇంపు=హాయి,తళుకొత్తన్ = ప్రకాశింపఁగా-మీఱఁగా,వీణ=వీణె యను, వాయింపుచుండి=మీటుచునుండి- పైద్యముతో నన్వయము.

తా. మొలను జంద్రకావిపావడగట్టి దానిపై నాణెమైనరవసెల్లా చుట్టి పైఁటవేసికొని చంద్ర కాంతమణులు పొదిఁగినపీఁటపైఁ గూర్చుండి యుండఁగాఁ బావడయొక్క యెఱ్ఱనివన్నె చేతఁ గూర్చు న్న పీఁటసయితి మెఱ్ఱగాఁ దోఁచుచుండెననియు, వీణ మీటుటకై ఱొమ్మున నానించుకొనఁగా నావీ ణకు నమర్చిన సొఱకాయలు స్తనములపై నొఱగియుండెననియు, వ్రేళ్లతో మీటునపుడు తంత్రులవల నఁ బుట్టిననాదములో నవ్యక్తమధురమయినసన్ననికంఠనాదము లయించి మనోహరముగా వినఁబడు చుండెననియు, రాగ మాలాపనచేయునప్పుడు గలిగినయానందపరవశత్వము సంభోగకాలమునందలిపర వశత్వమును బోలియుండె ననియు, వీణయందుఁ బలికించునట్టికృతులకుఁ జేతికంకణములయొక్క ఝణ ఝణయనెడి ధ్వనులు తాళములువేసినట్టుండె ననియు, ఇట్లు హాయిగా వీణవాయించుచుండి యని తా త్పర్యము. అలం తద్గుణము, నిదర్శన, రూపకమును

ఉ. అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ గొంతి వె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁజన్నవ గగుర్పొడువన్ మదిలోనఁ గోరికల్
గుబ్బటిలంగఁ జూచె నలకూబరసన్నిభు నద్ధరామరున్. 28

అ. అబ్బురపాటుతోడన్ = ఆశ్చర్యపాటుతో, నయనాంబుజములన్ = కన్నుఁదామరలు, వికసింపన్ = విరియునట్లుగా, కాంతి = శోభ, పెల్లు = మిక్కిలిగా, ఉబ్బి = అతిశయించి, కనీనికల్ = కంటినల్లగ్రుడ్లు, వికసితోత్పలపంక్తులన్ = పూచినకలువలమాలికలను, క్రుమ్మరింపఁగాన్ = నిండుకొలుపఁగా, గుబ్బ. కవ-గుబ్బ = వట్రువైన, మెఱుఁగు = నిగనిగనికాంతిగల, చన్గవ = స్తనద్వయము, గగుర్పొడువన్ = పులకాంకురములుకలదికాఁగా, మదిలోనన్ = మనస్సులో, కోరికల్ = వాంఛలు, గుబ్బటిలంగన్ = ఎంపడింపఁగా, (పా. గుబ్బతిలంగన్ = అతిశయింపఁగా), నలకూబరసన్నిభున్ = (చక్కఁదనముచేత) నలకూబరునిఁబోలిన, అద్ధరామరున్ = ఆబ్రాహ్మణుని-ప్రవరాఖ్యుని, చూచెన్ = కనుఁగొనెను

తా. ఈవిధముగా వీణ వాయించుచున్న యాదేవతాస్త్రీ యితరు లెవ్వరును లేనితా నున్నచోటికి సుందరుఁడైన యాబ్రాహ్మణుఁడు రాఁగానే చూపులు భ్రమింప దేహము గగుర్పొడువఁగా మనసునందు లేనికోరికలు పుట్టుచుండఁగా నతని నాశ్చర్యముతోఁ జూచెను. అలం. పరిణామము.

ఉ. చూచి ఝళంఝళత్కటకసూచితవేగపదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడం
బూచినయొక్కపోఁక నునుబోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలం దదీయపదవీకలశాంబుధి వెల్లిగొల్పుచున్ 29

అ. చూచి = చూచినదై, ఝళంఝళ..నిందయై-ఝళంఝళత్ = ఝళంఝళయని మ్రోఁగుచున్న, కటక = అందెలచేత, సూచిత = తెలియఁజేయఁబడిన, వేగ = వడిగల, పదారవిందయై = పాదకమలములుగలదై, లేచి = కూర్చున్నపీఠమునందుండి లేచి, కుచంబులున్ = స్తనములును, తుఱుమున్ = కొప్పును, లేనడుము = సన్ననినడుమును, అల్లలనాడన్ = జవజవలాడఁగా-చలింపఁగా, అయ్యెడన్ = ఆచ్చోటనున్న, పూచిన...బోదియన్-పూచిన = పుష్పించిన, ఒక్క = ఒకటియయిన, పోఁక = పోఁకమ్రానియొక్క, నునుబోదియన్ = నునుపైనమొదటిభాగమును, చేరి = చేరుకొని, విలోకనప్రభావీచికలన్ = చూపులయొక్క కాంతిపరంపరలచేత, తదీయ కలశాంబుధిన్ = తదీయ = ఆప్రవరునియొక్క, పదవి = వచ్చునట్టిమార్గమనెడి, కలశాంబుధిన్ = పాలసముద్రమును, వెల్లిగొల్పుచున్ = పొంగిప్రవహింపఁజేయుచును-వరూథిని యత్యంతాసక్తిచేఁ బొరింబొరి నవ్వారిగాఁ బ్రవరుని దెసఁ జూడ్కులు నిగుడ్చుటచే నాచూపులతెల్లనికాంతులు వాఁడువచ్చుమార్గమునందు మిక్కిలి బ్రసరించుచుండెను గాన నామార్గమును బాలసముద్రముగాను నందుఁ బ్రసరించు నాచూపులతెల్లకాంతులు ప్రవహింపఁజేయు దానియలలుగాను వర్ణింపఁబడెను. తెల్లనికాంతులు ప్రసరించుట పాలవెల్లువ ప్రవహించినట్లుండె నని భావము. ఇచట చూపులతెల్లనికాంతులను వీచికలనుగా వర్ణించుటకుఁ బోషకముగా నది ప్రసరించుపదవి పాలసముద్రముగాఁ బరిణమించుట నెఱుంగునది (ఇక్కడ పదవీశబ్దమునకు సౌందర్యవైభవమనికొందఱు అర్థము వ్రాసియున్నారు అది ప్రకరణమునకుఁ దగియున్నను పదవీశబ్దమునకు నాయర్థము సంస్కృతమునందున్నట్లు తోఁచలేదు. కనుక మార్చి వ్రాయనయ్యెను.)-పైపద్యముతో నన్వయము

తా. ఆయప్సరస్స్త్రీ యచ్చటికివచ్చినప్రవరాఖ్యునిఁ జూచి కాలియందెలు గల్లుగల్లని మ్రోయఁగాఁ దటాలున లేచి యచ్చటనున్న పూచినపోఁకమ్రానిమొదలునకుఁ బోయి ప్రవరాఖ్యుఁడు వచ్చుచున్న మార్గము నేచూచుచు నిలిచెను. అలం. పరిణామము.

మ. మునుమున్ పుట్టెడుకొంకు లౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతం
జొనుపం గోర్కులు గ్రేళ్లుద్రిప్ప మదిమెచ్చుల్ ఱెప్పలల్లార్ప న
త్యనుషంగస్థితి తెచ్చపాటొసఁగ నొయ్యారంబునం జంద్రికల్
దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్ర పద్మంబులన్. 30

అ. లతాంగి = ఆ స్త్రీ, మునుమున్ = ముందుముందు, పుట్టెడుకొంకు = పుట్టుచున్న సంకోచము, లౌల్యమున్ = చంచలభావమును, ఇడన్ = ఇయ్యఁగా-కలిగింపఁగా, మోదంబు = సంతోషము, విస్తీర్ణతన్ = విశాలత్వమును, చొనుపన్ = పొందింపఁగా- విరివిగా విప్పఁజేయఁగా ననుట, కోర్కులు = కోరికలు, క్రేళ్లుద్రిప్పన్ = గంతులాటకుఁ ద్రిప్పఁగా-మిక్కిలి చలింపఁజేయఁగా ననుట - కన్నులు మొదటఁ గొంకుచేతను నిపుడు కోర్కులచేతను జంచలములయ్యెనని తెలియునది మది మెచ్చుల్ = మనసులోని మెచ్చుకొనుటలు, ఱెప్పలల్లార్పన్ = కనుఱెప్పలను జలింపఁజేయఁగా, అత్యనుషంగస్థితి = మిక్కిలి చేరికగలయునికి, తెచ్చపాటు = నిశ్చేష్టత్వమును, ఒసఁగన్ = ఇయ్యఁగా-కలిగింపఁగా, ఒయ్యారంబునన్ = విలాసముచేత, చంద్రికల్ = వెన్నెలలు, తనుకన్ = ప్రకాశింపఁగా, ప్రఫుల్లన్నేత్ర పద్మంబులన్ = మిక్కిలి వికాసము పొందుచున్న కన్నుఁదామరలతో, తామరలవంటి కన్నులను జక్కఁగా విచ్చియనుట, భూసురున్ = బ్రాహ్మణుని-ప్రవరాఖ్యుని, చూచెను.

తా. ప్రవరాఖ్యునిఁజూడఁగానే పుట్టినసంకోచముచేతఁ గన్నులు మఱింత చంచలములయ్యెను. ఇట్టివాఁడు లభించెనను సంతోషాతిశయముచేత నవి విచ్చి విశాలములయ్యెను మీఁదమీఁదఁ బుట్టెడు కోరికలచేత నవి మిక్కిలి చలింపసాగెను మనసులో మెచ్చుకొనుటలు వాని ఱెప్పలనాడింపసాగెను. అతఁడు మిక్కిలి సమీపింపఁగా వానిచక్కఁదనమునకుఁ గలిగినయాశ్చర్యముచే నవి స్తిమితములయ్యెను. ఒయ్యారముగా నతనిఁ జూచునపుడు వానిధవళకాంతులు హెచ్చి వెన్నెలగాయునట్లయ్యెను ఇట్లు రానురాను దశలుమాఱుచున్న కన్నుఁదమ్ములను జక్కఁగా విచ్చుచు నా స్త్రీ యతనిని దేఱి చూచెను. అలం పరిణామము

క. పంకజముఖి కప్పుడు మై, నంకురితము లయ్యెఁ బులక లావిష్కృతమీ
నాంకానలసూచకధూ, మాంకురములుఁబోలె మఱియు నతనిం జూడన్. 31

అ మఱియును = మరల, అతనిన్ = ఆ ప్రవరాఖ్యుని, చూడన్ = చూడఁగా, అప్పుడు = ఆచూచునప్పుడు, పంకజముఖికిన్ = తామరలవంటి మొగముగలదైన యాయప్సరసకు, మైన్ = దేహమునందు, ఆవిష్కృత అంకురములు-ఆవిష్కృత = వెల్లడిచేయఁబడిన, మీనాంకానల = మన్మథాగ్నిని, సూచక = తెలియఁజేయునట్టి, ధూమ = పొగయొక్క, అంకురములు = మొలకలను, పోలెన్ = పలెనే, పులకలు = గగుర్పాటులు, అంకురితములు = పొటమరించినవి, అయ్యెన్ = ఆయెను-అనఁగాఁ బ్రవరాఖ్యుని మఱియొకసారిచూడఁగానే యతనివలన జనించిన మోహముచేత మన్మథాగ్ని వ్యాపింపఁగా నాయగ్ని వ్యాపించుటను సూచించుచున్నట్టి పొగమొలకలో యనునట్లు దానిదేహమునందు గగుర్పాటుమొలకలు గాన నయ్యెను అలం ఉత్ప్రేక్ష.

ఉ. తొంగలిఱెప్పలం దొలఁగఁ ద్రోయుచుఁ బైపయి విస్తరిల్లుక
న్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రు నటంచుఁ బోవ నీ

కంగజుఁ డానవెట్టి కదిసియున్ గుఱి వ్రాసె ననంగ జాతి సా
రంగమదంబు లేఁజెమటఁ గ్రమ్మె లలాటము డిగ్గి చెక్కులన్. 32

అ. తోరంగలిఱెప్పలన్ = వాలుగలఱెప్పలను, తొలఁగన్=ఎడగలుగ, త్రోయుచున్ = త్రోయుచును, పైపయిన్ = మీఁదమీఁద, విస్తరిల్లు కన్నుఁగవ = వ్యాపించుచున్న కన్నుదోయి, ముఖచంద్రమున్=చంద్రునివంటి ముఖమునుగూడ, ఆక్రమించుకొనునో=క్రమ్ముకొనునో, అటంచున్=అని, పోనీక=అంతలసాగిపోనీయక, అంగజుఁడు=మన్మథుఁడు, ఆనపెట్టి=దురాయిపెట్టి, కదియన్=కదిసికొనునట్లు, గుఱి=గుఱుతు, వ్రాసెన్=వ్రాసెనో, అనంగన్=అని యెంచునట్లు, సారంగమదంబు=(బొట్టుపెట్టుకొన్న) కస్తూరి, లేఁజెమటన్=చిఱుచెమటచేత, జాతి=క్రిందికిజాఱి, లలాటమున్=నొసటనుండి, డిగ్గి=దిగి, చెక్కులన్=చెక్కిళ్లను, క్రమ్మెన్=ఆవరించుకొనెను.

తా. ఱెప్పలువాల్పక చూచుచున్న వరూథినికన్నులు విశాలములై యుండుటచేత ఱెప్పల నెగ సనఁద్రోచి మీఁదికిఁ బరవుచున్నవి యిఁక ముఖమునుగూడ నావరించుకొనునేమో యని తలఁచి మన్మథుఁ డంతకుమీఁద నది యెక్కిపోఁగూడదని దురాయిపెట్టి గీచినగీఁతయో యనునట్లు నొసటఁబెట్టుకొన్న కస్తురిబొట్టు కరఁగి చెక్కిలిమీఁదికి స్రవించినచాఱ దోఁచెను అలం. ఉత్ప్రేక్ష.

మ. అనిమేషస్థితి మాన్చె బిత్తరపుఁజూ పస్వేదతావృత్తి మా
న్పె నవస్వేదసమృద్ధి బోధకళ మాన్పెన్ మోహవిభ్రాంతి తో
డనె గీర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయ మొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వము మెయిం జూపట్టె నా నత్తఱిన్. 33

అ. గీర్వాణవధూటికిన్ = ఆదేవతాస్త్రీకి, అత్తఱిన్=ఆసమయమునందు, భ్రమరకీటన్యాయము = పచ్చపురుగు (తుమ్మెదనే మనసునభావించి) తుమ్మెద యగునట్టిన్యాయము, ఒప్పన్ = ఒప్పునట్టుగా- తార్కాణమగునట్టుగా, మనుష్యునిన్ = మనుష్యుఁడయిన ప్రవరాఖ్యుని, భావించుటన్ = మనసునఁదలఁచుటచేత, తోడనే=వెంటనే, మానుషత్వము=మనుష్యత్వము, మెయిన్ = తనదేహము నందును, చూపట్టెన్=కనఁబడెనో, నాన్=అనునట్లు, బిత్తరపుఁజూపు=శృంగారముగాఁ జలించునట్టి చూపు, అనిమేషస్థితిన్ = ఱెప్పపాటులేనియునికిని, మాన్చెన్ = పోఁగొట్టెను, నవస్వేదసమృద్ధి= క్రొత్తచెమటయొక్క నిండు, అస్వేదతావృత్తిన్=చెమటలేనితనము నునికిని, మాన్పెన్=పోఁగొట్టెను, మోహవిభ్రాంతి=వలపువలని విశేషమైనభ్రమము, బోధకళన్ = జాగరూకతాంశమును, మాన్పెన్ = పోఁగొట్టెను

తా. దేవతాస్త్రీయైన వరూథినికి మనుష్యుని మనసునఁ గోరినందున భ్రమరకీటన్యాయము చేత స్వాభావికములయిన దేవజాతిధర్మములు పోయి మనుష్యజాతిధర్మములన్నియు సిద్ధించెను. (దేవజాతిధర్మములు-అనిమేషస్థితి, అస్వేదతావృత్తి, బోధకళ. మానవధర్మములు-బిత్తరపుఁజూపు, నవస్వేదసమృద్ధి, మోహవిభ్రాంతి అని యెఱుంగునది.) అలం, ఉత్ప్రేక్ష, తద్గుణమును

వ. ఇట్లతనిరూపరేఖావిలాసంబులకుం జొక్కి యక్కమలపత్త్రేక్షణ యాత్మగతంబున.

అ. ఇట్లు=ఈవిధముగా. అతనిరూపరేఖావిలాసంబులకున్ - అతని=ఆ ప్రవరాఖ్యునియొక్క, రూప = అవయవసౌష్ఠవమునుయొక్క, రేఖా=క్రమమునకును, విలాసంబులకున్ = ఒయ్యారమునకును, చొక్కి=పరవశయై, అక్కమలపత్త్రేక్షణ = తామరఱేకులవంటి కన్నులుగలదైన యాయప్సరస, ఆత్మగతంబునన్=తనలో, (ఇట్లు తలఁచెను.)

ఉ. ఎక్కడివాఁడొ యక్షతనయేందుజయంతవసంతకంతులం
జక్కఁదనంబునం గెలువఁజాలెడువాఁడు మహీసురాన్వయం
బెక్కడ యీతనూవిభవ మెక్కడ యేలనిబంటుగా మరుం
డక్కఁగొనంగరాదె యకటా నను వీఁడు పరిగ్రహించినన్ 35

అ (ఈబ్రాహ్మణుఁడు) యక్ష ...కంతులన్ - యక్షతనయ = కుబేరునికొడుకైన నలకూబరుని, ఇందు=చంద్రుని, జయంత=ఇంద్రునికొడుకైన జయంతుని, వసంత=వసంతఋతుపురుషుని, కంతులన్ = మన్మథుని, చక్కఁదనంబునన్ =సౌందర్యముచేత, గెలువన్ =జయింప, చాలెడువాఁడు = శక్తుఁడగువాఁడు, ఎక్కడివాఁడొ=ఎక్కడనుండివచ్చినవాఁడో, మహీసురాన్వయం బెక్కడ = బ్రాహ్మణకుల మెక్కడ, ఈతనూవిభవ మెక్కడ=ఈదేహసౌందర్యసంపత్తియెక్కడ- దేవతాంశమునందుఁ బుట్టిన మహాపురుషులందుఁ గాక సామాన్యులైన బ్రాహ్మణులలో నిట్టిసౌందర్యవంతుఁ డుండుట యరుదనుట, అకటా=అయ్యో, వీఁడు=ఈపురుషుఁడు, ననున్ =నన్ను, పరిగ్రహించినన్ =చేపట్టినట్టయిన, మరున్ = మన్మథుని, ఏలనిబంటుగాన్ =జీతబత్తెములిచ్చి పోషింపకయే కొలువుచేయునట్టిసేవకుఁ డగునట్టుగా, డక్కఁగొనంగరాదె=స్వాధీనునిఁ జేసికొఁగూడదా

తా. ఈబ్రాహ్మణుఁడు నలకూబరచంద్రజయంతమన్మథులకంటెఁ జక్కఁదనముగలవాఁడై యున్నాఁడు. వీఁడు దేవగంధర్వాదులలో నెవఁడో యొకఁడు కావలయు కాకున్న బ్రాహ్మణమాత్రున కింతటిచక్కఁదన మెక్కడనుండి వచ్చును ఇటువంటివీఁడు నన్నుఁ బ్రియురాలిఁగా గ్రహించినయెడ మన్మథవేదనను లక్ష్యముచేయక సుఖింపవచ్చునుగదా యని యనుకొనియెను అలం,విషమము.

సీ. వదనప్రభూతలావణ్యాంబుసంభూత, కమలంబు లన వీనికన్ను లమరు
నిక్కి వీనులతోడ నెక్కసక్కెములాడు, కరణి నున్నవి వీనిఘనభుజములు
సంకల్పసంభవాస్థానపీరిక వోలె, వెడఁద యై కనుపట్టు వీనియురము
ప్రతిఘటించుచిగుళ్లపై నెఱ్ఱవాఱిన, రీతి నున్నవి వీనిమృదుపదములు
నేరెళేటియసల్ తెచ్చి నీరజాప్తు, సానఁబట్టినరాపొడి చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు, వీనిఁ గాకున్నఁ గలదె యీమేనికాంతి.

అ (ఆసౌందర్యము నీపద్యముచే వివరించుచున్నది.) వీనికన్నులు = ఈపురుషునివైనకన్నులు, వదన...కమలంబులు—వదన=ముఖముయొక్క, ప్రభూత=అధికమైన, లావణ్య=కాంతియనెడు-అణిముత్తెముల నిగ్గునుబోలినదేహచ్ఛాయ యనెడు, అంబు=నీటియందు, సంభూత=పుట్టిన, కమలంబులు=తామరలు, అనన్ =అనునట్లు, అమరున్ =ఒప్పుచున్నవి, వీనిఘనభుజములు = ఈపురుషునిదొడ్డవైన బుజములు-ఎగుబుజములనుట, నిక్కి=ఎగపుగలిగి, వీనులతోడన్ =చెవులతో, ఎక్కసక్కెములు= వికటపుఁబలుకులు, ఆడుకరణిన్ =పలికెడివిధమున-పరిహాసముచేయునట్లు, ఉన్నవి=అగపడుచున్నవి, వీని యురము=ఈపురుషునిఱొమ్ము, సంకల్ప...వోలెన్ - సంకల్పసంభవ=మన్మథునియొక్క, ఆస్థాన= కొలువుకూటమునందలి, పీరికవోలెన్ =సింహాసనమువలె, వెడఁదయై=విశాలమై, కనుపట్టున్ =కానఁబడుచున్నది, వీనిమృదుపదములు=ఈపురుషునివైనమెత్తనిపాదములు, ప్రతి. చిగుళ్లపైన్ - ప్రతిఘటించు=ఎదిరించునట్టి, చిగుళ్లపైన్ =చిగురులమీఁద, ఎఱ్ఱవాఱినరీతిన్ = రోషించి యెఱ్ఱనయినవిధమున, ఉన్నవి=ఎఱ్ఱగానున్నవి, వీనిన్ =ఈపురుషుని, పద్మభవుఁడు=బ్రహ్మ, నేరెళేటియసలు=జంబూ

నదిలోని యిసుము, తెచ్చి = తీసికొనివచ్చి, నీరజాప్తుర్ = సూర్యుని, సానఁబట్టినరాపొడి=సానయందు అరుగఁ బట్టఁగా రాలినపొడిని, చల్లి=కలియఁజల్లి, మెదిపి=మేదించి, పదను=తడి- చేతికంటుకోకుండుటెంత గా కలిపినంతపదను, సుధన్ =అమృతము చేత, ఇడి=పెట్టి- కలుగఁజేసికొని, చేసెనో=సృజించెనో యేమెరా, కాకున్నన్ =అట్లు కానిపక్షమున, ఈ మేనికాంతి=ఈదేహలావణ్యము, కలదే=కలుగునా- కలుగదనుట.

తా. ఈపురుషునికన్నులు ముఖకాంతియనెడి తేటనీటఁబుట్టిన కమలములవలె నున్నవి. వీనియొ గా బుజములు వీఁగి నిక్కి చెవులతోఁ బరిహాసములాడుచున్నట్లున్నవి వీనిఱొమ్ము విశాలమయి మన్మథరాజ్యసింహాసనమువలె నున్నది వీనిపాదములు చిగుళ్లను దిరస్కరించునట్లు మెత్తఁదనము నెఱ్ఱఁదనమును గలిగియున్నవి. ఇట్టి యీపురుషుని సృజించినప్పుడు బ్రహ్మ జంబూనదిలోని బంగారుబురద దెచ్చి దానికి సూర్యుని సానఁబట్టినరాపొడి తెచ్చి కలిపి యమృతముతోఁ జేతికిఁ దేమ కలుగఁజేసికొని యిట్లు సృజించినాఁడో యేమో యని యాదేవతాస్త్రీ వితర్కించెను. ( సూర్యునిభార్యయైన సంజ్ఞాదేవి పెనిమిటిశరీరమువేఁడిమికిఁ దాను దాళలేకపోఁగా నామెతండ్రి త్వష్ట యనువాఁడు సూర్యునివేఁడిమిని సానయందు నలుగి రాచి తగ్గించెనని పురాణకథ ) అలం. ఉత్ప్రేక్ష

క. సురగరుడోరగనరఖే, చరకిన్నరసిద్ధసాధ్యచారణవిద్యా
ధరగంధర్వకుమారుల, నిరతము గనుఁగొనమె పోల్పనేర్తురె వీనిన్ 37

అ. సుర...కుమారులన్=దేవతలు గరుడులు నాగులు మానవులు ఖేచరులు కిన్నరులు సిద్ధులు సాధ్యులు చారణులు విద్యాధరులు గంధర్వులునైన యౌవనపురుషులను, నిరతము=ఎల్లప్పుడు, కనుఁగొనమె=చూడమా- ఎంతయినో చూచితి మనుట, వీనిన్=ఈ పురుషుని, పోలనేర్తురె=వారు సరిపోలఁ జాలుదురా - సరిపోలఁజాలరనుట.

మ. అని చింతించుచు మీనకేతనధనుర్జ్యాముక్తనారాచదు
ర్దినసమ్మూర్ఛితమానసాంబురుహ యై దీపించు పెందత్తఱం
బునఁ జేటెత్తినలజ్జ నంఘ్రికటకంబుల్ మ్రోయ నడ్డంబు ని
ల్చిన నయ్యచ్చరఁ జూచి చేరఁ జని పల్కెన్ వాఁడు విభ్రాంతుఁడై 38

అ. అని=ఇట్లని, చింతించుచున్=విచారించుచు, మీనకేతన...రుహయై - మీనకేతన=మన్మథునియొక్క, ధనుః=వింటియొక్క, జ్యా=అల్లెత్రాటివలననుండి, ముక్త=విడువఁబడిన, నారాచ=నారసములవలననైన - నారాచములనెడి వర్షధారలచేతనైనయనుట, దుర్దిన= సూర్యరశ్మి లేనిదినము చేత, సమ్మూర్ఛిత=చక్కఁగా మూర్ఛనొందిన- వికాసము చెడిన, మానసాంబురుహయై=మనస్సనెడి కమలముగలదై- మన్మథవేదనచేతఁ జిన్నవోయినమనసుగలదైయనుట, దీపించు పెందత్తఱంబునన్=ప్రకాశించు (స్పష్టముగా నుల్లసిల్లు) చున్న మిక్కుటపుఁదొందఱచేత, చేటెత్తినలజ్జన్=చిటిలినలజ్జచేత- సిగ్గుపడిచియనుట, అంఘ్రికటకంబుల్=కాలియందెలు, మ్రోయన్=మొరయఁగా, అడ్డంబు=(ప్రవరుఁడు వచ్చునట్టిత్రోవకు) అడ్డముగా, నిల్చినన్=నిలువఁబడఁగా, అయ్యచ్చరన్=ఆయప్సరసను, చూచి=కనుఁగొని, వాఁడు=ప్రవరాఖ్యుఁడు, విభ్రాంతుఁడై=మిక్కిలిభ్రమసినవాఁడై, చేరఁ(జని)=దగ్గఱఁబోయి, పల్కెన్= ఇట్లు పలికెను.

తా. ఈవిధముగా వితర్కించుచున్న యాదేవతాస్త్రీని మన్మథవేదన యతిశయింపఁగాఁ దాన్ని మిచెడి సిగ్గువిడిచి మిక్కుటమైనత త్తఱపాటుతోఁ గాలియందెలు మ్రోయఁగాఁ దాసిన్నపోకమ్రాని మఱుఁగుననుండి ప్రవరాఖ్యుఁడు వచ్చుచున్నత్రోవ కడ్డముగావచ్చి నిలిచెను అదిచూచి ప్రేమసినవాఁడై యతఁడు దానివద్దకుఁబోయి యీమాఁటఁజెప్పఁబోవురీతిని పలికెను అలంకారము రూపకము

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోట లే
కివ్వనభూమి భూసురుఁడ నే ప్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిం
గ్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగదవే తెరు వెద్ది శుభంబు నీకగున్ 39

అ భీతహరిణేక్షణ=వెదరిన జంకచూపులవంటిచూపులు గలయోచిన్నదానా, ఈవు=నీవు, ఎవ్వతెవు=ఎవరిచిన్నదానవు, ఓటలేక=భయములేక, ఇవ్వనభూమిన్=ఈయడవినేలను, ఒంటిఁజరించెదు=ఒంటరిగాఁ దిరుగుచున్నావు, నేన్=నేను, ప్రవరాఖ్యుఁడన్=ప్రవరుఁడను పేరుగలవాఁడను, భూసురుఁడన్=బ్రాహ్మణుఁడను, క్రొవ్వునన్=మదముచేత, ఇన్నగాగ్రమునకున్=ఈకొండకొమ్మునకు, చనుదెంచి=వచ్చి, త్రోవతప్పితిన్=మార్గముతప్పినవాఁడనైతిని, ఇంకన్=ఇఁకను, పురంబుఁజేరన్=నా పట్టణముచేరుటను, ఎవ్విధిన్=ఏవిధమున, కాంతున్=పొందుదును, తెరువు = నేనుబోవలసినత్రోవ, ఎద్ది=ఏది, తెల్పఁగదవే=తెలియఁజేయుమా, నీకు, శుభంబగున్=మేలగును

తా ఓ చిన్నదానా ! నీ వెవతెవు. భయమువిడిచి తోడులేక యీయడవిలో నొక్కదానవే తిరుగుచున్నావు నేను ప్రవరుఁడనెడు బ్రాహ్మణుఁడను కండకావరముచేత ముందువెనుకవిచారింపక యీ కొండకొమ్మునకువచ్చి త్రోవతప్పి చిక్కులఁబడుచున్నాను నాకు దారిచూపుము. నీకు మేలగు ననియె

క. అని తనకథ నెఱిఁగించినఁ, దనకనుఁగవ మెఱుఁగు లుబ్బఁ దాటంకములుం
జనుఁగవయు నడుము నడఁకఁగ, వనిత సెలవివాఱ నవ్వి వానికి ననియెన్. 40

అ. అని=ఇట్లని, తనకథన్=తనవృత్తాంతమును, ఎఱిఁగించినన్=ప్రవరుఁడు తెలియఁజేయఁగా, వనిత=ఆదేవతాస్త్రీ, తనకనుఁగవ మెఱుఁగులు = తనవైనరెండుకన్నులయొక్క కాంతులు, ఉబ్బన్=మీఁదికివ్యాపింపఁగా, తాటంకములున్=చెవికమ్మలును,చనుఁగవయున్=స్తనద్వయమును, నడుమున్=మధ్యమును, వడఁకఁగన్=చలింపఁగా, సెలవివాఱన్ = పెదవులమూలలువిచ్చునట్లుగా - చక్కఁగా నోరుతెఱచి, నవ్వి=నవ్వినదై, వానికిన్=ఆప్రవరాఖ్యునితో, అనియెన్=ఇట్లుపలికెను - కనుఁగవమెఱుఁగునని చలించుట తమకమతిశయించుటచేత నని యెఱుంగునది

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్నజవరాండ్ర నెపం బిడి పల్కరించులా
గింతియకాక నీ వెఱుఁగవే మునువచ్చినత్రోవ చొప్పు నీ
కింతభయంబులే కడుగ నెల్లిద మైతిమి మాటలేటికిన్ 41

అ. భూసురేంద్ర=ఓబ్రాహ్మణశ్రేష్ఠుఁడా, ఇంతలు=ఇంతవిశాలములయిన, కన్నులు, ఉండన్=కలిగియుండఁగా, తెరువు=త్రోవ, ఎవ్వరిన్=ఎవరిని, వేఁడెదు=అడిగెదవు, నెపంబిడి=ఏదోనొక మిష పెట్టుకొని, ఏకాంతమునందున్=ఇతరులెవ్వరును లేనిచోట, ఉన్న జవరాండ్రన్=ఉండునట్టి యౌవన

స్త్రీలను, పల్కరించులాగు = మాట్లాడించునట్టిరీతియిది, ఇంతియకాక = ఇంతేకాని, మును = మునుపు, వచ్చినత్రోవచొప్పు = వచ్చినట్టిదారియొక్క జాడ, నీవు ఎఱుఁగవే = గుర్తెఱుఁగవా, మాటలేటికిన్ = పలుమాటలేల, ఇంత భయంబులేక = కొంచెమైననుభయములేక, అడుగన్ = ఇట్లడుగుటకు, నీకు, ఎల్లిదమైతిమి = చులుకనైతిమి – మేము నీకుఁ జులుకనఁగాఁ గనఁబడితిమి. ఇచ్చట ఏకాంతమునందనుటచే భయసంకోచాదుల కవకాశములేమియు జవరాండ్ర ననుటచేఁ దనయత్యంతభోగ్యత్వమును నాయికచే సూచితమనుట తెలియఁగఁదగును

తా. ఓ బ్రాహ్మణుఁడా ! యింత పెద్దకన్నులు పెట్టుకొని నీవు వచ్చినత్రోవ గానవా? ఒకరి నడుగవలయునా ? ఈయొకమిషకల్పించుకొని యొంటరిపాటున నున్న ప్రాయపుఁబడుచుల మైన మాతో మాటలాడ నారంభించితివి. ఏల పలుమాటలు? మేము నీకంటికి నింతచులకనివారమై కనఁబడుచున్నాము. కావున్న నీవిట్లు భయములేక మమ్ముఁ బలుకరింతువా యనియె అలం. అపరాహ్నఎము.

వ. అని నర్మగర్భంబుగాఁ బలికి క్రమ్మఱ నమ్మగువ యమ్మహీసురున కిట్లనియె 42

అ. అని = ఇట్లని, నర్మగర్భంబుగాన్ = పరిహాసగర్భముగా – నిజాభిప్రాయములోపలఁ గలిగియుఁ బైకి సరసమని తోఁచునట్టివిధముతో ననుట, పలికి = మాటాడి, క్రమ్మఱన్ = మరల, అమ్మగువ = ఆచెప్పఁ తా స్త్రీ, అమ్మహీసురునకున్ = ఆబ్రాహ్మణునితో, ఇట్లనియెన్ = ఇట్లు పలికెను

సీ. చిన్నివెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ, బొడమినచెలువ తోఁ బుట్టుమాకు
రహిపుట్ట జంత్రగాత్రములరాల్ గరఁగించు, విమలగాంధర్వంబు విద్య మాకు
ననవిల్తుశాస్త్రంపుమినుకు లావర్తించు, పని వెన్నతోఁ బెట్టినది మాకు
హయమేధరాజసూయము లనఁ బేర్పడ్డ, సవనతంత్రంబు లుంకువలు మాకుఁ
గనకనగసీమఁ గల్పవృక్షములనీడఁ, బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠభర్గసభలు, సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర.' 43

అ. గోత్రామరేంద్ర = ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా, చిన్ని . కందున్ – చిన్ని = మనోహరమైన, వెన్నెలకందున్ = బాలచంద్రుని, వెన్నుదన్ని = వెంబడించి, సుధాబ్ధిన్ = పాలసముద్రమునందు, పొడమిన చెలువ = పుట్టినస్త్రీ – లక్ష్మీదేవి, మాకు, తోఁబుట్టు = తోడఁ బుట్టినది, రహి = రక్తి, పుట్టన్ = పుట్టునట్టుగా, జంత్రగాత్రములన్ = వీణానాదముచేతను గంతనాదముచేతను, రాల్ = రాళ్లను, కరఁగించువిమలగాంధర్వంబు – కరఁగించు = ద్రవింపఁజేయునట్టి, విమల = నిర్మలమైన – ఏలోపమునులేని, గాంధర్వంబు = పాట, మాకు, విద్య = చదువు, నన . మినుకులు – ననవిల్తు = మన్మథునియొక్క, శాస్త్రింపు = శాస్త్రిసంబంధమయిన, మినుకులు = వాక్కులను – మాటలను – అనఁగాఁ గళాశాస్త్రిమును సంబంధించిన మాటలను, ఆవర్తించుపని = వల్లించునట్టి వ్యాపారము, మాకు, వెన్నతోడన్ = చిన్నప్పుడు పెట్టునట్టివెన్నతోఁ జేర్చి, పెట్టినది = తినుటకై పెట్టినది, హయమేధరాజసూయములు = అశ్వమేధము రాజసూయము, అనన్ = అనఁగా, పేర్పడ్డ = ప్రసిద్ధినొందిన, సవనతంత్రంబులు = యజ్ఞకర్మములు, మాకు, ఉంకువలు = ఓలిపెట్టెడిధనములు, కనకనగసీమన్ = మేరుపర్వతప్రదేశమునందు, కల్పవృక్షములనీడన్ = కోరినకోరికల నిచ్చునట్టిదేవవృక్షములనీడయందు, పచ్చరాచట్టుగమి = మరకతమణిరూపములైన చాపరాళ్లసమూహము, మాకు, రచ్చపట్టు = సభగూడెడిచోటు, పద్మసంభవ...సభలు – పద్మసంభవ = బ్రహ్మదేవునియొక్క

యు, వైకుంఠ=విష్ణుదేవునియొక్కయు, భర్గ=శివునియొక్కయు, సభలు=కొలువుకూటములు, మాకు, స్థా ముగరిడీలు=సాము నేర్చెడిశాలలు.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! మావృత్తాంతమువినుము. మేము చంద్రునితోడఁ బుట్టినలక్ష్మీదేవికిఁ దోడఁబుట్టువులము తాళ్లుసయితము రక్తిపుట్టి కరఁగునట్లు వీణవాయించుచుఁ బాటపాడెడి నేర్పుగలవారము కామశాస్త్రమర్యాద చిన్నప్పటినుండి నేర్చిగడిదేఱినవారము రాజసూయాశ్వమేధాదులయిన మహాయజ్ఞములుచేసినవారికే లభింపఁగలవారము మేరుపర్వతముమీఁదికల్పవృక్షములనీడలోఁ బచ్చలచాఁపరాళ్లపైఁ గొలువుతీరి కూర్చుండువారము. బ్రహ్మవిష్ణుమహేశ్వరులసభలలో నాట్యముచేయువారము (కనుక మమ్ము సామాన్యస్త్రీలనుగా నెంచవలదు దేవవేశ్యలముగాని మానవస్త్రీలముగామని భావము.)

క. పేరు వరూథిని విప్రకు, మార ఘృతాచీతిలోత్తమాహారిణీహే
మారంభాశశిరేఖలు, దారగుణాఢ్యలు మదీయ లగుప్రాణసఖుల్. 44

అ. విప్రకుమార=ఓబాఁపనచిన్నవాఁడా, పేరువరూథిని=వరూథినియనునది నాపేరు, ఉదారగుణాఢ్యలు=దొడ్డగుణముగలవారు, ఘృతాచీ.. శశిరేఖలు=ఘృతాచి తిలోత్తమ హారిణి హేమ రంభ శశిరేఖ యనెడి యప్సరసలు, మదీయలు=నావారు, అగుప్రాణసఖులు=అగునట్టి ప్రాణపదమయిన చెలిమికత్తెలు.

మ. బహురత్నద్యుతిమేదురోదరదరీభాగంబులం బొల్చు ని
మ్నిహికాహార్యమునం జరింతు మెపుడుం బ్రేమన్ నభోవాహినీ
లహరీశీతలగంధవాహపరిఖేలన్మంజరీసౌరభ
గ్రహణేందిందిరతుందిలంబు లివి మత్కాంతారసంతానముల్. 45

అ. బహు ..భాగంబులన్-బహు=అనేకములయిన, రత్న=మణులయొక్క, ద్యుతి=కాంతులచేత, మేదుర=దట్టములైన, ఉదర=లోపలిభాగములుగల, దరీభాగంబులన్=బిలప్రదేశములచేత,బొల్చు నిమ్నిహికాహార్యమునన్=ఒప్పునట్టియీమంచుకొండయందు, ఎపుడున్=ఎల్లప్పుడును, ప్రేమన్=ప్రియముతో, చరింతుము = సంచరించుచునుందుము, నభో తుందిలంబులు-నభోవాహినీ = ఆకాశగంగయొక్క, లహరీ=ప్రవాహమువలని, శీతల=చల్లని, గంధవాహ=గాలివలన, పరిఖేలత్=అంతటను గదలుచున్న, మంజరి=పూగుత్తులయొక్క, సౌరభ=పరిమళములయొక్క, గ్రహణ=గ్రహించుటగల, ఇందిందిర=తుమ్మెదలచేత, తుందిలంబులు=బలిసినవి-నిండుకొన్నవి, (అయిన) ఇవి=ఈకానవచ్చునవి, మత్కాంతారసంతానముల్=మావిహారవనసమూహములు.

క. భూసుర కైతవకుసుమశ, రాసన మాయింటివిందవై తివి గైకొ
మ్మా సముదంచన్మణిభవ, నాసీనత సేదదేఱి యాతిథ్యంబున్. 46

అ. కైతవ శరాసన- కైతవ = కపటపు, కుసుమశరాసన = మన్మథుఁడవైన-మన్మథునివలెనే యున్నయనుట, భూసుర=బ్రాహ్మణుఁడా, మాయింటివిందవు=మాయింటికివచ్చినచుట్టమవు, ఐతివి=నీవైనావు, సము . సీనతన్-సముదంచత్=మిక్కిలియొప్పుచున్న, మణిభవన=రత్నవికారమైన యీ యింటియందు, ఆసీనతన్=కూర్చుండుటచేత, సేదదేఱి=శ్రమమువలనఁ జెడినవాఁడవై-శ్రమతీర్చుకొని యనుట, ఆతిథ్యంబున్=అతిథిపూజను, కైకొమ్ము=అంగీకరింపుము-అనఁగా మాయింటికి నతిథివై వచ్చి

తివి గనుకఁ గొంచెము నేపు కూర్చుండి యాయాసము తీర్చుకొని మేము చేయు నతిథిపూజలు గ్రహించి పొమ్మని తాత్పర్యము

తే. కుందనమువంటిమేను మధ్యందినాత, పోష్మహతిఁ గందె వడదాఁకె నొప్పులొలుకు
వదన మస్మద్గృహంబు పావనము సేసి, బడలికలు వాసి చను మన్న బ్రాహ్మణుండు.

అ॥ కుందనమువంటి మేను=అపరంజివలెఁ దళతళలాడెడి దేహము, మధ్యందినాతపోష్మహతిన్ = మధ్యాహ్నకాలమునందలి యెండవేఁడిమిదెబ్బచేత, కందెన్=నల్లపడియెను, ఒప్పులు=ముద్దులు, ఒలుకువదనము = కారుచున్నట్టిముఖము, వడదాఁకెన్=వడసెను, అస్మద్గృహంబు=మాయిల్లు, పావనము=పరిశుద్ధము, చేసి=అగునట్లుచేసి-పుణ్యాత్ముఁడవు గనుక నీవు కొంతసే పున్న మాయిల్లుపరిశుద్ధమగుననుట, బడలికలు = శ్రమములు, వాసి=తీర్చుకొని, చనుము=పొమ్ము, అనన్=అనఁగా, బ్రాహ్మణుండు=బ్రాహ్మణుఁడైన ప్రవరాఖ్యుఁడు, -పలికెనను క్రియ యధ్యాహార్యము.

ఉ అండజయాన నీ వొసఁగునట్టిసపర్యలు మాకు వచ్చె నిం
దుండఁగ రాదు పోవలయు నూరికి నింటికి నిప్పు డేను రా
కుండ నొకండు వచ్చి నటులైయుండునె భక్తియ చాలు సత్క్రియా
కాండముఁ దీర్ప వేగ చనఁగా వలయుం గరుణింపు నాపయిన్ 48

అ. అండజయాన = హంసనడకవంటి మనోహరమైననడకగల యోచిన్నదానా, నీవొసఁగునట్టిసపర్యలు = నీవుచేయునట్టి యతిథిమర్యాదలు, మాకువచ్చెన్ = మాకుఁజెందినవి- నేను గ్రహించినట్టే యనుకొనుమనుట ఇందున్=ఇక్కడ, ఉండఁగరాదు=ఉండఁగూడదు, ఊరికిన్ = మాగ్రామమునకు, పోవలయున్=తప్పకపోవలయును, ఇప్పుడు=ఈసమయమునందు, ఇంటికిన్=మాయింటికి, ఏను=నేను, రాకుండనొకండున్=రాకున్ననొకటియు, వచ్చినటులైయుండునె=రాఁగానింకొకటియగునా, భక్తియ=ప్రీతియే, చాలును, సత్క్రియాకాండము = మాధ్యాహ్నికస్నానము మొదలయినసత్కార్యసముదాయమును, తీర్పన్ = జరపుటకు, వేగ = శీఘ్రముగా, చనఁగావలయున్=పోవలయును, నాపయిన్ = నామీఁద, కరుణింపు = దయచేయుము

తా॥ ఓచిన్నదానా! నీవు చేయఁదలఁచినట్టి మర్యాదలన్నియుఁ జేసినట్టే యనుకొనుము. ఇప్పుడిక్కడ నిలుచుటకు సరిపడదు మీయింటికి నేనువచ్చిననొకటి రాకున్న నొకటి కాదు. ప్రీతియే చాలును నేను శీఘ్రముగా మాయూరికిఁ బోవలయు. దయచేసి త్రోవచూపి నన్నుఁ బంపుము.

ఉ. ఏ నిఁక నిల్లు సేరుటకు నెద్దియుపాయము మీమహత్త్వముల్
మానిని దివ్యముల్ మదిఁ దలంచిన నెందును మీ కసాధ్యముల్
గానము గానఁ దల్లి ప్రజలన్ ననుఁ గూర్పు మటన్న లేఁతన
వ్వాననసీమఁ దోఁప ధవళాయతలోచన హాని కిట్లనున్. 49

అ॥ ఏన్=నేను, ఇఁకన్=ఇఁకమీఁద, ఇల్లుసేరుటకున్ = మాయిల్లుచేరుటకు, ఉపాయము=మార్గము, ఎద్ది=ఏది, మానిని=ఓమానవతీ, మీమహత్త్వముల్=మీప్రభావములు, దివ్యముల్=దేవసంబంధమైనవి, మదిన్=మనస్సునందు, తలంచినన్=మీరుతలఁచినపక్షమున, ఎందును=ఎక్కడను, మీకు, అసాధ్యముల్=సాధింపరానివి, కానము=కనఁబడవు, కానన్=కాఁబట్టి, తల్లి=ఓయమ్మా, ప్రజలన్ =

నావారైనజనులను, నన్నున్ =నన్నును, కూర్పుము=చేర్పుము, అట్టన్నన్ =అనఁగా, ధవళాయతలోచన=తెల్లనై (అనగా తెల్లనికాంతులుగలవై) విశాలములైనకన్నులుగలదైనవరూథిని, లేఁతనవ్వు=చిఱునవ్వు, ఆననసీమన్ =ముఖప్రదేశమునందు, తోఁపన్ =కనఁబడఁగా-చిఱునవ్వునవ్వియనుట, వానికిన్ =ఆప్రవరునితో, ఇట్లనున్ =ఇట్లు పలికెను.

తా. అమ్మా! మీరుదేవతలు గనుక మీప్రభావములు దొడ్డవి. ఏకార్యములైనను మీరు చేయఁదలఁచినపక్షమునఁ దప్పక చేయఁగలరు. మీకు నసాధ్యములులేవు కాఁబట్టి యిప్పుడు నేను హాయిల్లుచేరునట్టి యుపాయము నాకుఁదెలిపి నన్ను నావారితోఁ జేరునట్లు చేయుము. అనఁగానే వరూథిని చిఱునవ్వునవ్వుచు నతనితో నీవిధముగాఁ బలికెను.

ఉ. ఎక్కడియూరు కాల్ నిలువ కింటికిఁ బోయెద నంచుఁ బల్కెదీ
వక్కట మీకుటీరనిలయంబులకున్ సరిరాక పోయెనే
యిక్కడిరత్నకందరము లిక్కడినందన చందనోత్కరం
బిక్కడిగాంగసైకతము లిక్కడియాలవలీనికుంజముల్. 50

అ. ఎక్కడియూరు=ఊరనఁగా నెక్కడిది- నీయూరిలో నేమున్నదనుట, కాల్నిలువక=కాలూని నిలువనోపక, ఈవు=నీవు, ఇంటికిఁబోయెదను, అంచున్ =అని,పల్కెదు=చెప్పెదవు,అక్కట=అయ్యో, ఇక్కడిరత్నకందరములు=ఇక్కడఁ గలమణిమయము లయినగుహలును, ఇక్కడి...త్కరంబు- ఇక్కడి=ఇచ్చటఁగల, నందన=ఉద్యానవనములలోని, చందన=గంధపుమ్రాఁకులయొక్క, ఉత్కరంబు=సమూహమును, ఇక్కడిగాంగసైకతములు=ఇచ్చటఁగల గంగానదిలోనియిసుకదిబ్బలును, ఇక్కడి యాలవలీనికుంజముల్ =ఇచ్చటఁగల యీవెన్నెలతీఁగె లల్లుకొన్న పొదరిండ్లును, మీకుటీరనిలయంబులకున్ =మీరుండెడిగుడిసెలతో, సరిరాకపోయెనే=సమానములు కాకపోయెనా.

తా. ఓబ్రాహ్మణుఁడా! ఊరికిఁబోవలయుననియు నిల్లుచేరవలెననియుఁ గలవరించెదవు మీయూరేమి యంత హెచ్చైనదా? ఇక్కడనుండెడి యీరత్నములతో నిండుకొన్న గుహలు గంధపుమ్రాఁకులతోడి యుద్యానవనములు గంగానదిలోని యిసుకదిన్నెలు వెన్నెలతీఁగలల్లుకొన్న పొదరిండ్లు నివియన్నియు మీరు వసించునట్టి యిక్కడిగుడిసెలతో సరిపోలఁజాలవా యనియె.

ఉ. నిక్కము దాఁపనేల ధరణీసురనందన యింక నీపయిం
జిక్కె మనంబు నాకు ననుఁ జిత్తజుబారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యములఁ చూఁటలఁ బాటలు పాడు తేఁటుల సొం
పెక్కినయట్టిపూఁపొదరిండ్లను గౌఁగిట గారవించెదో. 51

_. ధరణీసురనందన=ఓబ్రాహ్మణకుమారా, ఇఁకన్ =ఇంకను,నిక్కము=నిజమును, దాఁపనేల=దాఁచిపెట్టనేల- చెప్పక మనసులో నేయుంచుకొన్న ప్రయోజనములేదనుట నాకు, నీపయిన్ =నీమీఁద, మనంబుచిక్కెన్ =మనసుతగిలెను, ననున్ =నన్ను, చిత్తజుబారికిన్ =మన్మథునిబాధకు, అప్పగించెదో=ఒప్పగించెదవో - లోఁబఱిచిపోయెదవో, మరందమద్యముల చూఁరలన్ =పూఁదేనెయనెడిసారాలయొక్క కొల్లలచేత - మితిలేకదొరకుపూఁదేనెలను ద్రాగుటలచేత, చొక్కి=పారవశ్యమునొంది,పాటలుపాడుతేఁటులన్ =గానముచేయుచున్నతుమ్మెదలచేత, సొంపు=మనోజ్ఞత, ఎక్కినయట్టి పూఁపుఁబొద

రిండ్లన్ = అతిశయించినపువ్వులతోడి పొదరిండ్లయందు, కౌఁగిటన్ = ఆలింగనముచేత, గారవించెదో = సన్మానించెదవో.

తా. ఓబ్రాహ్మణుఁడా! నామనసులోనిమాట దాఁపక చెప్పెద. నీయందు నాకు మోహముపుట్టె. నీవిఁక నన్ను మన్మథునిబాధకు లోఁబఱిచి వెడలిపోయెదవా? లేక పూఁదేనెలు కొల్లలుగాఁ ద్రాగి మైమఱచి ఝుంకారము చేయుచున్న తుమ్మెదలచే మనసునకు నింపుపుట్టించుచుండెడి యీపూచినపొదరిండ్లలోఁ జేరి యాలింగనసుఖమిచ్చి యాదరించెదవా? చెప్పుము.

క. అనుటయుఁ బ్రవరుం డిట్లను, వనజేక్షణ యిట్లు వలుక వరుసయె వ్రతులై
దినములు గడపెడువిప్రులఁ, జనునే కామింప మది విచారము వలదే. 52

అ. అనుటయున్ = అని వరూథిని యనఁగానే, ప్రవరుండు = ప్రవరాఖ్యుఁడు, ఇట్లనున్ = ఇట్లు ప్రత్యుత్తరము చెప్పెను, వనజేక్షణ = తామరలవంటికన్నులు గలయోచిన్నదానా, ఇట్లు = ఈవిధముగా, పలుకన్ = మాటలాడుట, వరుసయె = క్రమమా, వ్రతులై = ఉపవాసాదివ్రతములుజరుపువారై, దినములు = దినసములను - కాలమును, కడపెడువిప్రులన్ = జరపునట్టిబ్రాహ్మణులను, కామింపన్ = కలయఁగోరుట, చనునే = తగునా, మదిన్ = మనసునందు, విచారము = ఇదియుక్తమిది యయుక్తమను నాలోచన, వలదే = ఉండవలదా.

ఉ. వేలిమియున్ సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె జననీజనకుల్ కడు వృద్ధు లాఁకటన్
సోలుచుఁ జింతతో నెదురుసూచుచు నుండుదు రాహితాగ్ని నేఁ
దూలు సమస్తధర్మములుఁ దొయ్యలి నేఁ డిలు సేరకుండినన్. 53

అ. తొయ్యలి = ఓచిన్నదానా - వరూథినీ, వేలిమియున్ = వైశ్వదేవము మొదలుగాఁగల హోమకార్యమును, సురార్చనయున్ = దేవతారాధనమును, విప్రసపర్యయున్ = బ్రాహ్మణపూజయును, చిక్కెన్ = తప్పెను, భుక్తికిన్ = భోజనమునకును, వేళ = సమయము, అతిక్రమించెన్ = మించిపోయెను, జననీజనకుల్ = తల్లిదండ్రులు, కడున్ = మిక్కిలి, వృద్ధులు = ముసలివాండ్రు, ఆఁకటన్ = క్షుత్తుచేత, సోలుచున్ = లేవలేకపడిపోవుచు, చింతతోన్ = విచారముతో, ఎదురుసూచుచున్ = నారాకకై యెదురు చూచుచు, ఉండుదురు = ఉందురు, నేన్ = నేను, ఆహితాగ్నిని = అగ్నిహోత్రవ్యాపారములుంచుకొనియుండువాఁడను, నేఁడు = ఈదినము, ఇలుసేరకుండినన్ = ఇల్లుచేరనివాఁడనైయున్నయెడ, సమస్తధర్మములును = ఎల్ల విహితాచారములును, తూలున్ = చెడును

ఉ. నావుడు విన్నఁబాటు వదనంబున నించుక దోఁపఁ బల్కె నో
భావజరూప యిట్టియెలప్రాయము వైదికకర్మనిష్ఠలం
బోవఁగ నింక భోగములఁ బొందుట యెన్నఁడు యజ్ఞకోటులం
బావను లౌటకున్ ఫలము మాకవుఁగిళ్ల సుఖించుటే కదా. 54

అ. నావుడున్ = అని ప్రవరాఖ్యుఁడనఁగా, వదనంబునన్ = ముఖమునందు, ఇంచుక = కొంచెము, విన్నఁబాటు = చిన్నపోయినతనము, తోఁపన్ = కనఁబడఁగా, పల్కెన్ = వరూథినిపలికెను, ఓభావజరూప = ఓమన్మథునిరూపమువంటి మోహనరూపముగలవాఁడా - ఓబ్రాహ్మణుఁడా, ఇట్టియెలప్రాయము =

ఇటువంటివే(ఐనయిన్ను), వైదికకర్మనిష్ఠలన్ = వేదవిహితములయిన క్రియలను నడపుటలచేత, పోవఁగన్ = కడచిపోఁగా, ఇంకన్ = ఇఁకను, భోగమ్ములన్ = సుఖములను, పొందుట = అనుభవించుట, ఎన్నఁడు = ఎప్పుడు, యజ్ఞకోటులన్ = అగ్నిష్టోమము మొదలుగాఁగల యజ్ఞసమూహముల చేత, పావనులు = పరిశుద్ధులు, ఔటకున్ = అవుటకు, ఫలము = ప్రయోజనము, నాకవుఁగిళ్లన్ = మాభుజాంతరములయందు, సుఖించుటే = సుఖమునొందుటయే, (పా. సుఖింపనే), కదా = కాదా - సుఖించుటయే యనుట

తా అనఁగా విని పరూథిని ప్రవరాఖ్యునితో నో బ్రాహ్మణుఁడా ! చక్కదనముతోఁగూడిన యిటువంటిలేఁతప్రాయమును వ్యర్థముగా వైదికక్రియలచేతఁ బోఁగొట్టి పిమ్మట సుఖము ననుభవించుటయెప్పటికి? మీబోఁటివారనేకములయినయజ్ఞములు చేసి పరిశుద్ధులగుట యప్సరసలమైన మాతోఁగూడి సుఖించుటకే కాని మఱియెందులకును గాదు

సీ. సద్యోవినిర్భిన్న సారంగనాభికా, హృతమై పిసాళించు మృగమదంబు
కసటువోఁ బీఁటెండఁ గరఁగి కల్జల నంటి, గమగమ వలచుచొక్కపుజవాజి
పొరలెత్తి ఘనసార తరువులఁ దనుఁదాన, తొరఁగినపచ్చకప్పురపుసిరము
గొజ్జంగపూఁబొదల్ గురియంగఁ బటికంపు, దొనలనిండినయట్టితుహినజలము
వివిధకుసుమకదంబంబు దివిజతరుజ, మృదులవసనఫలాసవామేయరత్న [బు.
భూషణంబులుగలవిందు భోగపరుఁడ, వయి రమింపుము ననుఁగూడి యనుదినం

అ. ఇందున్ = ఇక్కడ, సద్యో..హృతమై - సద్యః = అప్పుడే, వినిర్భిన్న = విరియఁబాఱిన, సారంగ = కస్తురి మెకముయొక్క, నాభికా = పొక్కిటివలననుండి, హృతమై = హరింపఁబడినదై - తీసికోఁబడినదై, పిసాళించుమృగమదంబు = పరిమళించుచున్న కస్తూరియు, కసటు = మఱికి, పోన్ = తొలఁగిపోవునట్లుగా, బీఁటెండన్ = తీక్ష్ణమయిన యెండచేత, కరఁగి = నీరుగాద్రవించి, కల్జలన్ = కల్జపుల్లలయందు, అంటి = అంటుకొని, గమగమ ... జవాజి - గమగమ = గమగమయని, వలచు = పరిమళించునట్టి, చొక్కపు = స్వచ్ఛమయిన, జవాజి = జవ్వాజియును, పొరలెత్తి = పైపట్టలూడి, ఘనసారతరువులన్ = కర్పూరపుటరఁటిచెట్లనుండి, తనుఁదాన = తనకుఁదానే - ఒకరిప్రయత్నములేకయే, తొరఁగిన .. సిరము - తొరఁగిన = క్రిందరాలిన, పచ్చకప్పురము = పచ్చకర్పూరముయొక్క, సిరము = పొడియును, (పా. రజము), గొజ్జంగపూఁబొదల్ = పన్నీరుపూవుఁబొదలు, కురియంగన్ = వర్షింపఁగా - ధారలుధారలుగాఁ గార్చుటచేత, పటికంపుదొనలన్ = స్ఫటికపురాతినేలలయందలి దొనలయందు, నిండినయట్టితుహినజలము = నిండియుండెడిపన్నీరును, వివిధకుసుమకదంబంబు = నానావిధము లయినపువ్వులసమూహమును, దివిజ . భూషణంబులు - దివిజతరుజ = దేవవృక్షముల (కల్పవృక్షముల) వలనఁగలిగిన, మృదుల = మెత్తనైన, వసన = వస్త్రములును, ఫల = పండ్లును, ఆసవ = పానద్రవ్యములును, అమేయ = ఇన్నియని యూహించిచెప్పశక్యముగాని - మేరలేని, రత్నభూషణంబులు = రత్నములుపొదిఁగినసొమ్ములును, కలవు = ఉన్నవి. భోగపరుఁడవై = సుఖమునందాసక్తిగలవాఁడవై, అనుదినంబు = ప్రతిదినమును, ననున్ = నన్ను, కూడి = కలసి, రమింపుము = సంభోగింపుము.

తా. ఓ బ్రాహ్మణుఁడా ! భోగవస్తువు లయినకస్తూరి జవాజి పచ్చకర్పూరము పన్నీరు పువ్వులు పండ్లు మృదుతరములయినవస్త్రములు రత్నపుసొమ్ములు త్రాఁగఁదగినమద్యములు నివన్నియు మిక్కిలి శ్రేష్ఠములైనవి యిక్కడసమృద్ధములుగా నున్నవి. వీనివలనిభోగములనెల్ల ననుభవించుచు నాతోఁగూడి యిక్కడఁ బ్రతిదినమును సంభోగించుచుండుము. అలం. ఉదాత్తము.

క. అంధునకుఁ గొఱయె వెన్నెల, గంధర్వాంగనలపొందు గాదని సంసా
రాంధువునఁ బడియె దకట ది, వాంధము వెలుఁగు గని గొందినడఁగినభంగిన్.

అ. అంధునకున్=గ్రుడ్డివానికి, వెన్నెల = చంద్రప్రకాశము, కొఱయె = ప్రయోజకమా- ఉపయోగింపదనుట అక్కట=అయ్యో, దివాంధము=పగలు కన్నుగానని దైన గ్రుడ్లగూబ, వెలుఁగు= వెలుతురును, కని=చూచి, గొందిన్=చీఁకటిమూలయందు, అడఁగినభంగిన్ = ముడుఁగుకొన్నరీతిని, గంధర్వాంగనలపొందు = గంధర్వస్త్రీలమయిన మాకూటమి, కాదని = సరిపడదని, సంసారాంధువునన్ = కాఁపురపు నూతియందు, పడియెదు=పడుచున్నావు.

తా. గ్రుడ్డివానికి వెన్నెల పనికిరానియట్లు మావలనిసంభోగసుఖ మెఱుఁగని నీవు నామాటలుపనికి రానివయ్యెను. నీవు వెలుతురు చూడనొల్లక గ్రుడ్లగూబ చీఁకటి క్రమ్ముకొన్న యిఱుకుమూలలో దాఁగు నట్లు గంధర్వస్త్రీల మయిన మాకూటమి నొల్లక సంసార మనెడినూతిలోఁ బడియుండఁగోరు చున్నావే. అయ్యో యిది తగునా యని యడిగెను. అలం ప్రతివస్తూపమ, ఉపమయు

ఉ. ఎన్నిభవంబులం గలుగు నిక్షుశరాసనసాయకవ్యథా
ఖిన్నత వాడి వత్తలయి కేలఁ గపోలము లూఁది చూపులన్
విన్నఁదనంబు దోఁపఁ గనువేఁదుఱునం బయిగాలి సోఁకినన్
వెన్నవలెం గరంగునలివేణులఁ గౌఁగిటఁ జేర్చుభాగ్యముల్. 57

అ. ఇక్షు . . ఖిన్నతన్ - ఇక్షుశరాసన = చెఱకువింటివాఁ డయినమన్మథునియొక్క, సాయక=బాణములయొక్క, వ్యథా=బాధవలననైన, ఖిన్నతన్=దుఃఖముచేత, వాడి=నవకముచెడి, వత్తలయి=వరుగులై-మిక్కిలి కృశించి, కేలన్ = చేతులయందు, కపోలములు=చెక్కిళ్లు, ఊఁది=చేర్చి, చూపులన్=చూపులయందు, విన్నఁదనంబు = దీనభావము, తోఁపన్ = కానరాఁగా, కనువేఁదుఱునన్=కంటిపిచ్చిచేత-చూచుటవలని యత్యంతాపేక్షచేత, పయిగాలిసోఁకినన్ = (తాము వలచిన పురుషుని) మీఁదిగాలి తగిలినను-ఏప్రయత్నమును జేయనక్కఱలేక యత్యంతసులభముగాననుట, వెన్నవలెన్ = నిప్పుసోఁకినవెన్నవలె, కరంగునలివేణులన్ = మనసుకరఁగునట్టి స్త్రీలను-అనురక్తలయినట్టి స్త్రీలను-అతిసులభముగా మనస్సుకరఁగి తమంతట వశంవద లగునట్టిస్త్రీలననుట, కౌఁగిటన్=భుజాంతరమునందు, చేర్చుభాగ్యముల్ = చేర్చుకొనునట్టి యదృష్టములు, ఎన్నిభవంబులన్ = ఎన్నిజన్మములందు, కలుగున్=లభించును-అనేకజన్మములెత్తి తపస్సుచేసినను లభింప నేరవనుట.

తా. ఎవ్వరికిఁగాని తమ్ముఁజూచి మోహించి మన్మథబాధచే మిక్కిలి కృశించి చింతచేఁ జెక్కిటఁ జెయ్యిసేర్చి కోర్కెయీడేర్ప వేఁడుకొనునట్లు దీనదృష్టులనిగుడ్చుచును, దమ్ముఁజూచుటవలనఁ బిచ్చి యెత్తినట్లు మిక్కుటమైన యపేక్ష యుల్లసిల్లుటచేఁ దమగాలి సోఁకినంతన కరఁగియు,నతిసులభముగా వశంవద లగునట్టిస్త్రీలను గౌఁగిటఁ జేర్చి సుఖించునట్టి యదృష్టము పెక్కుజన్మములెత్తినను లభింపదు.

క. కుశలత యే వ్రతముల నగు, నశనాయాసమున నింద్రియనిరోధమునం
గృశుఁడ వయి యాత్మ నలఁచుట, సశరీరస్వర్గసుఖము సమకొని యుండన్. 58

అ. సశరీరస్వర్గసుఖము = ఈశరీరముతోనే (అనుభవించునట్లు) స్వర్గమునందలి సుఖము, సమకొని=సిద్ధించి, ఉండన్=ఉండఁగా, వ్రతములన్ = ఉపవాసాదినియమములతోఁ జేయు పుణ్యకర్మ

ములచేత, అగునశనాయాసమునన్ =అగునట్టియాహార (ఆర్జనమువలని) శ్రమచేతను, (పా. అశనాయాపీడన్), ఇంద్రియనిరోధమునన్ =చక్షురాదులయిన యింద్రియములను యథేచ్ఛముగా విషయములందుఁ బ్రవర్తింపనీక నిర్బంధించుటచేతను, కృశుఁడవయి = చిక్కిపోయినవాఁడవై, ఆత్మన్ =జీవాత్మను, అలఁచుట=శ్రమపెట్టుట, కుశలతయే = ఇదియొక నేర్పరితనమా.

తా. ఈదేహము విడిచినపిమ్మట నిప్పుడు చేయునట్టిపుణ్యకర్మముల ఫలముచేత లభింపఁబోవు స్వర్గసుఖ మీశరీరముతో నుండునప్పుడే యనాయాసముగా లభించుచుండఁగా వ్యర్థముగ వ్రతచర్యలవలని యాయాసమును బొందుట యొక నేర్పరితనముకాదని తాత్పర్యము నేనప్సరసను గనుక నాతోడి సంభోగమే స్వర్గభోగమని సంబంధము. అలం. కావ్యలింగము.

తే. అనినఁ బ్రవరుండు నీ వన్నయర్థమెల్ల, నిజము కాముకుఁ డైనవానికి నకాముఁ
డిదిగణించునె జలజాక్షి యెఱిఁగితేని, నగరమార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొమ్ము.

అ అనినన్ =అనియిట్లు పలుకఁగా, ప్రవరుండు = ప్రవరాఖ్యుఁడు, జలజాక్షి=ఓచిన్నదానా, నీవు, అన్నయర్థము=చెప్పినవిషయము, ఎల్లన్ =అంతయు, కాముకుఁడు = విషయాపేక్షగలవాఁడు, ఐనవానికిన్ =అయినట్టి పురుషునికి, నిజము = (అపేక్షితమగుట) సత్యము. అకాముఁడు=విషయాపేక్షలేనివాఁడు, ఇది=ఈనీవుచెప్పినవిషయమును,గణించునె= లెక్కసేయునా-నీవలనఁ గలుగుస్వర్గభోగమునుగూడ లక్ష్యపెట్టఁడనుట ఎఱిఁగితేని = నీవెఱిఁగియున్నపక్షమున, నగరమార్గంబున్ = మాపట్టణమునకుఁ బోవుత్రోవను, చూపి=కనఁబఱిచి, పుణ్యమునఁబొమ్ము=పుణ్యముఁగట్టుకొమ్ము-దానివలనిపుణ్యమును సంపాదించుకొని పొమ్మనుట.

తా. ఓవరూథినీ ! నీవుచెప్పినదంతయు విషయాపేక్షగలవాని ధర్మముగాని యాయపేక్ష లేనివాని ధర్మముకాదు. నాకు స్వర్గసుఖాపేక్షసయితములేదు గనుక వ్యర్థముగా నిట్టిమాటలచేతఁ బ్రొద్దుపుచ్చకుము నీకుఁ దెలిసియున్నయెడల మాయూరిదారిచూపుము. లేదా యూరకపొమ్మనుము.

క. బ్రాహ్మణుఁ డింద్రియ వశగతి, జిహ్మాచరణైకనిపుణచిత్తజనిశితా
జిహ్మగములపాలై చెడు, బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుఁ డై. 60

అ బ్రాహ్మణుఁడు=బ్రహ్మజ్ఞానసంపన్నుఁ డయినద్విజుఁడు, ఇంద్రియవశగతిన్ = ఇంద్రియములకు లోఁబడినవాఁ డగుటచేత, జిహ్మా...పాలై-జిహ్మాచరణ=వక్రవ్యాపారములు చేయుటయందు ఏక=ముఖ్యముగా, నిపుణ=నేర్పుగలవాఁడైనట్టి, చిత్తజ=మన్మథునియొక్క, నిశిత=వాఁడియయిన, అజిహ్మగములపాలై=బాణముల కధీనుఁడై, బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుఁడై-బ్రహ్మానంద=పరమాత్మానుభవమువలనిసంతోషముయొక్క, అధిరాజ్య = అధిష్ఠించినప్రభుత్వముయొక్క, పదవీ = మార్గమువలననుండి, చ్యుతుఁడై=జాఱినవాఁడై - దిగఁబడినవాఁడై, చెడున్ = నశించును- అనఁగా బ్రాహ్మణుఁడగువాఁ డెవఁడు విషయాపేక్షగలవాఁడగునో వాఁడు మోక్షమార్గమువలన భ్రష్టుఁడయి చెడిపోవునని తాత్పర్యము. అలం. కావ్యలింగము.

వ. అనిన నత్తెఱవ యక్కఱకరిపలుకుల కులికి గఱిగఱిం గఱవఁ గరకరిం జెఱకువిల్లు
కాఁడు పరఁగించువిరిదమ్మిగొరకలు నెఱఁకులఁ జాఱుకుచుఱుక్కునం గాఁడినఁ
గడుం గెరలి పరిణతవివిధవిబుధతరుజనితమధురమధురసం బానుమదంబు నద

టునం జిదిమిన నెఱుంగక మదనహరుసైనఁ జదురునం గదియ గమకించుతిమి రునం గోమిరెప్రాయంపు మదంబునను ననన్యకన్యాసామాన్యలావణ్యరేఖా మదంబునను నొంటిపాటునం గంటికిం బ్రియుం డై తంగేటిజుంటి చందంబునం గొం టుఁదనం బెఱుంగక కుఱంగట నున్న యమ్మహీసురవరకుమారు తారుణ్య మాహాత్మ్యం బులం జేసి తన వైదగ్ధ్యంబు మెఱయఁ గలిగె నని పల్లవించు నుల్లంబునుల్లాసం బునం గదురుమదంబున నోసరించక చంచలదృగంచలప్రభ లతనిముఖాంబు జంబునం బొలయ వలయమణిగణచ్ఛాయాకలాపంబు లుప్పరం బెగయఁ గొప్పు చక్కం జెక్కుచు జక్కవగిబ్బలుం బోనిగబ్బిగుబ్బలం జొబ్బిల్లుకుంకుమరసం బునం బంకిలంబు లగుహారముక్తాతారకంబుల నఖకోరకంబులం గీఱి తీరువడం జేయుచుఁ బతితవనతరుకుసుమకేసరంబులు రాల్చు నెపంబునం బయ్యెద విదిల్చి చక్క సవరించుచు నంతంతం బొలయుచెలులం దలచూపక యుండఁ దత్తఱం బునం జేసి బొమముడిపాటుతో మగిడిమగిడి చూచుచుఁ జిఱుముడిపాటుచూపుల నంకురించుజంకెనలవారించుచుం జేరి యి ట్లనియె. 61

అ. అనినన్ =ప్రవరాఖ్యుఁ డిట్లుపలుకఁగా, అత్తెఱవ=ఆ స్త్రీ) - వరూథిని, అక్కఱకరిపలుకుల కున్ =ఆప్రవరాఖ్యుని కఠినపుమాటలకు, ఉలికి = బెదరి, చెఱకువిలుకాఁడు = మన్మథుఁడు, కరకరిన్ = క్రూరభావముతో, గఱి గఱిం గఱవన్ = ఱెక్కతో ఱెక్క పెనఁగొనునట్లు-ఎడ తెఱపిలేక, పఱఁ గించు...గొరకలు-పఱఁగించు=ప్రయోగించునట్టి, విరిదమ్మిగొరకలు=విరిసిన తామరబాణములు, నెఱఁ కులు=మర్మస్థానములందు, చుఱుకుచుఱుక్కునన్ =చుఱుకుచుఱుకు మనునట్టుగా - నొప్పిపుట్టునట్లుగా, నాఁడినన్ =నాటుకొనఁగా, కడుం గెరలి=మిక్కిలి రేఁగి, పరిణత...రసంబు- పరిణత=పరిపక్వమైన, వివిధ=బహువిధములయిన, విబుధతరు=దేవవృక్షములవలన, జనిత=పుట్టిన, మధుర=తియ్యని, మధు రసంబు=మద్యమును, ఆను...టునన్ -ఆనుమదంబు =త్రాగినమత్తుయొక్క, అదటునన్ =ఉద్ధతిచేత, చిదిమినన్ =గిల్లినను, ఎఱుంగక = తెలియక, మదనహరుసైనన్ =మన్మథునిహరించిన శివుసైనను-ఇంద్రియ నిగ్రహముగల శివునంతవానినైన ననుట, చదురునన్ =చతురత్వముచేత, కదియన్ =తారసింప, గమకించు తిమురునన్ =యత్నించునట్టి కండగరువము చేతను, కోమిరెప్రాయంపు మదంబునన్ =యౌవన ప్రాయము వలని మదము చేతను, అనన్య...మదంబునన్ -అనన్య=తనకంటె నితరులయందు లేని, కన్యాసామాన్య= పడుచులకు సాధారణమైన, లావణ్యరేఖా = దేహకాంతి సౌష్ఠవముయొక్క, మదంబునన్ =క్రొవ్వు చేతను, ఒంటిపాటునన్ =ఒంటరిపాటున, కంటికిన్ =తనచూపునకు, ప్రియుండై=ఇంపైనవాఁడై, తంగేటి జుంటిచందంబునన్ =తంగేడుచెట్టునందుఁ బెట్టఁబడిన తేనెపెరవలె, గొంటుఁదనంబు=ధూర్తత్వము, ఎఱుంగక = తెలియక - లేక, కుఱుంగటన్ =సమీపమునందు, ఉన్న చేసి-ఉన్న=ఉండిన, అమ్మహీసుర వరకుమారు=బ్రాహ్మణశ్రేష్ఠునికుమారుఁడయిన యాప్రవరాఖ్యునియొక్క, తారుణ్యమాహాత్మ్యంబులం జేసి= యౌవనము చేతను జక్కఁదనము చేతను - వయసును జక్కఁదనమునుగలిగియుండుటచేత, తన వైదగ్ధ్యంబు= తన్నదైన నేర్పు, మెఱయన్ = ప్రకాశింప, కలిగెనని = అనువుకలిగెనని, పల్లవించు...నుల్లాసంబునన్ - పల్లవించు = చిగిరించుచున్న - పుట్టుచున్న, ఉల్లంబునుల్లాసంబునన్ = మనస్సుయొక్క సంతోషము చేత, కదురుమదంబునన్ = కలుగుచున్న గర్వము చేతను, ఓసరించక = ఇటునటుఁ బొలఁగక, చంచల

దృగంచలప్రభలు=చలించుచున్న కన్నుఁగొనలకాంతులు, అతనిముఖాంబుజంబునన్ = ఆప్రవరాఖ్యుని ముఖకమలమునందు, పొలయన్ = ప్రసరింపఁగా, వలయ కలాపంబులు-వలయ=ముంజేతికడియముల యొక్క. మణిగణ=రత్నసమూహముల యొక్క, ఛాయా=కాంతులయొక్క, కలాపంబులు=సమూహములు, ఉప్పరంబెగయన్=మీఁదికివ్యాపింపఁగా, కొప్పు=వీడినకొప్పును, చక్కన్=చక్కఁగా, చెక్కుచున్=చెరుపుచు, జక్కవగిబ్బలుంబోని = లేఁబ్రాయపుజక్రవాకపక్షులవంటి, గబ్బిగుబ్బలన్=నిక్కుఁజన్నులందుండి, జాలువాఱుకుంకుమరసంబుచేన్=స్రవించుచున్న కుంకుమపువ్వుతోడి చందనద్రవముచేత, పంకిలంబులు=బురదయంటుకొన్న వానివంటివైన, హారముక్తాతారకంబులు=ముత్యాలపేరుయొక్క నక్షత్రములవంటి ముత్యములను, నఖాంకురకంబులన్ = మొగ్గలవంటిగోళ్లచేత, గీటి=గీఁచి, తీరుపడంజేయుచున్ = చక్కఁగా దిద్దుకొనుచు, పతితవనతరుకుసుమకేసరంబులు- పతిత=తనపైరాలిన, వనతరుకుసుమ=అడవిమ్రాఁకులపువ్వులయొక్క, కేసరంబులు=కింజల్కములను, రాల్చునెపంబునన్=దులుపుకొనుట యనునెపముచేత, పయ్యెద=పయఁట, విదిల్చి=విదిలించి, చక్కసవరించుచున్=చక్కఁగా దిద్దుకొనుచు, అంతంతన్=అంతటంతట, పొలయుచెలులన్=సమీపింపవచ్చుచెలికత్తెలను, తలచూపకయుండన్=తలకనఁబడకుండునట్లు-తనయెదుటికి రాకుండునట్లుగుట, తత్తఱంబునంజేసి=తొందరచేత, బొమముడిపాటుతోన్ = కనుబొమ్మలుముడిపడియెడిసంజ్ఞతో, మగిడిమగిడిచూచుచున్ = తిరిగితిరిగిచూచుచును, చిడిముడిపాటుచూపులన్ = తొట్రుపడుచున్న చూపులందు, అంకురించుజంకెనలన్ = పొటమరించునట్టి బెదరింపులచేత, వారించుచున్ = ఆచెలికత్తెలను దగ్గఱ రాకుండ నిలుపుచు, చేరి = ప్రవరునిదగ్గఱ, ఇట్లనియెన్ = ఇట్లుపలికెను.

శా. ఎందే డెందము గందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగతప్రదీపకళికాశ్రీ దోఁప నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుఁ గను నాకెయింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా. 62

అ. ఎంగేన్=ఏవిషయమునందు, డెందము=మనస్సు, రహిచేన్=రక్తిచేత, కందళించున్=చిగుర్చునో-వికాసమువహించునో, ఎందున్=ఏవిషయమునందు, ఏకాగ్రతన్=కలఁకఁబాఱనితనముచేత-నిశ్చలత్వముచేత, కుంభగతా.. శ్రీ-కుంభగత=కుండనుబొందిన-కుండలలోపల నుంపఁబడిన, ప్రదీపకళికా=దీపపుమొగ్గయొక్క, శ్రీ=కలిమి, తోఁపన్=కనఁబడఁగా, నిర్వృతిన్=ఊఱటను, చెందున్= పొందునో, (దీనికిఁగర్త డెందము.) ఎందేని=ఏవిషయమునందు, ఇంద్రియములు=త్వక్కు చక్షుస్సుమొదలయినయింద్రియములు, ఎందున్ = దేనియందును, పోక-చేరఁబోవక, సుఖంబున్=సౌఖ్యమును, కనున్=పొందునో, ఆయింపే=ఆవిషయానందమే, పరబ్రహ్మము=పరతత్త్వము, ఆనందో బ్రహ్మ=ఆనందమే బ్రహ్మము, అటన్న ప్రాఁజదువుర్=అనిప్రతిపాదించుచున్న శ్రుతిని, అంతర్బుద్ధిన్=నీబుద్ధిలో, ఊహింపుమా=విచారింపుమా.

తా. ఏవిషయమునందు మనస్సు నింద్రియములను జలింపక వికాసమును నూఱటను వహించి సుఖించునో యావిషయమువలని యానందమే పరబ్రహ్మమని వేదములు ప్రతిపాదించుచున్నవి. ఆశ్రుతుల యర్థములు నీలోనీవే విచారింపుము. అట్టిబ్రహ్మానందము సిద్ధమైయుండఁగా వేఱేదో బ్రహ్మానందము తప్పిపోవునని తలఁచి వెనుదీసెద వేల.

తే. అనుచుఁ దన్నొడఁబఱుచు నయ్యమరకాంత
తత్తఱముఁ జూచి యాత్మ నతండు దనకు
సిగ్గు వెగటును బొడమ నిస్పృహతఁ దెలుపు
నొక్కచిఱునవ్వు నవ్వి యయ్యువిద కనియె. 63

అ. అనుచున్ = ఇట్లుచెప్పుచు, తన్ను, ఒడఁబఱుచు తత్తఱమున్ - ఒడఁబఱుచు=సమ్మతింపఁజేయునట్టి, అయ్యమరకాంత = ఆదేవతాస్త్రీయొక్క, తత్తఱమున్=తొట్రుపాటును, చూచి, అతండు = ఆప్రవరాఖ్యుఁడు, ఆత్మన్ = మనసునందు, తనకు, సిగ్గున్ = లజ్జయును, వెగటును=విరసత్వమును,పొడమన్=పుట్టఁగా, నిస్పృహతన్=విరక్తిని, తెలుపునొక్కచిఱునవ్వు= తెలియఁ జేయునట్టి యొకవిధమయినచిఱునవ్వు, నవ్వి, అయ్యువిదకున్=ఆజవరాలితో, అనియెన్=ఇట్లు పలికెను.

తా. ప్రవరాఖ్యుఁ డట్లు తన్నుఁ గలయికకు సమ్మతింపఁజేసెడి మాటలాడుచున్న యావరూథిని తత్తఱమును జూచి తనలో సిగ్గును విరసత్వమును బొంది విరక్తిని దెలియఁబఱుచునట్లుగా నొకచిఱునవ్వు నవ్వి యీవిధముగాఁ బ్రత్యుత్తర మిచ్చెను.

శా. ఈపాండిత్యము నీకుఁ దక్క మఱియెవ్వరి కేదీ కంటిమే కామశా
స్త్రోపాధ్యాయివి నా వచించెదవు మేలోహో త్రయీధర్మముల్
పాపంబుల్ రతి పుణ్య మంచు నిఁక నేలా తర్కముల్ మోక్షల
క్ష్మీపథ్యాగమసూత్రపంక్తి కివె పో మీసంప్రదాయార్థముల్. 64

అ. ఈపాండిత్యము=ఈచదువరితనము, నీకుఁదక్కన్=నీకుమాత్రమే తప్ప,మఱియెవ్వరికేన్=ఇఁక నెవరియందైనను, కంటిమే=చూచితిమా, కామశాస్త్రోపాధ్యాయివి-కామశాస్త్రి=మన్మథశాస్త్రమునకు, ఉపాధ్యాయివి = ఉపాధ్యాయత్వముచేయుదానవు- కామశాస్త్రము చదివించుదానవు, నాన్=అనునట్లుగా, త్రయీధర్మములు=వేదవిహితాచారములు, పాపంబుల్=పాపమును గలిగించునవి, రతి=సంభోగము, పుణ్యము=సుకృతము, అంచున్=అని, వచించెదవు = చెప్పుచున్నావు, మేలు= మంచిది, ఓహో=సెబాసు, తర్కముల్=చర్చలు, ఇఁకన్=ఇంకను, ఏలా=ఎందుకు- అక్కఱలే దనుట, మోక్ష .పంక్తికిన్ - మోక్షలక్ష్మీ=ముక్తిసంపదయొక్క, పథి=మార్గమయిన- ముక్తిబోధకము లైన యనుట, ఆగమసూత్ర=వేదాంతసూత్రములయొక్క, పంక్తికిన్=వరుసకు, (పా. ఫక్కికిన్= రీతికి), మీసంప్రదాయార్థముల్ = మీయుపదేశపరంపరచే వచ్చిన యర్థములు, ఇవెపో = ఇవియే- ఇవేకాఁబోలుననుట.

తా. ఈచదువరితనము నీకుఁదప్ప మఱియెవరికిని లేదు నీవు కామశాస్త్రిబోధకురాలివలె వేదమునందు విధింపఁబడినధర్మములు పాపము నిచ్చునవి నీతోడిసంభోగము పుణ్యము నిచ్చునది యని చెప్పుచున్నావు. ఇది మిక్కిలి బాగుగానున్నది. మీ పరంపరవారియుపదేశక్రమముచొప్పున మోక్షమార్గమును దెలుపునట్టి వేదాంతసూత్రముల కర్థము లిట్టివే కాఁబోలుననియె అలం వ్యాజస్తుతి.

మ. తరుణీ రేపును మాపు హవ్యములచేతం దృప్తుఁ డౌవహ్ని స
త్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము లెఱుంగన్ శక్యమే నీకు నా
కరణుల్ దర్భలు నగ్నులుం బ్రియము లైనట్టి నయ్యముల్ నావ్రతల్
తిరమే చెప్పకు మిట్టితుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్. 65

అ. తరుణీ=ఓ చిన్నదానా, రేపును = ప్రాతఃకాలమునందును, మాపును = సాయంకాలమునందును, హవ్యములచేతన్ = హోమద్రవ్యములచేత, తృప్తుఁడు=తనిసినవాఁడు, ఔపహ్ని=అగునట్టి యగ్నిదేవుఁడు, సత్కృపణాదృష్టిన్=మంచిదయతోడిచూపుతో, ఒసంగుసౌఖ్యములు = ఇచ్చునట్టి సుఖములు, నీకు, ఎఱుంగన్ = తెలిసికొనుటకు, శక్యమే=సాధ్యమా-సాధ్యముకాదు, నాకు, అరణుల్=త్రచ్చినిప్పునుబుట్టించెడి కొయ్యలును, దర్భలు=కుశలును, అగ్నులున్=అగ్నిహోత్రములును, ప్రియములు=ఇష్టములు, ఐనట్లు=అయినరీతిని, అన్యములు=ఇతరములు, కావు=ఇష్టములుకావు, ఒడలు=ఈదేహము, తిరమే=స్థిరమా-ఎన్నటికిని కెడకయుండునదియా, (కాదుగనుక) ఇట్టితుచ్ఛసుఖముల్ = ఇటువంటియల్పభోగములను, చెప్పకు=నాకు నుపదేశింపకుము, మీసాలపైఁదేనియల్ = ఇవి మీసముల మీఁద నంటించుకొన్న తేనెవంటివి-అనఁగాఁ దేనె మీసములకుఁ దాఁకించుకొని యవి నాలుకకు సోఁకినమాత్రము చేతనే యెంతో తేనె తృప్తిగాఁ ద్రాగిన ట్లెంచుకొనుటవంటి వనుట. అతిస్వల్పములుగాన నిజముగాఁ దృప్తికరములుకాని వని భావము. అలం వ్యతిరేకము, ప్రతివస్తూపమయు.

చ. అనుటయు మాట లేక హృదయాబ్జము జల్లన మోము వెల్లనై
కనలుచు నీరు దేఱు తెలిగన్నుల నాతనిఁ బుల్కుపుల్కనం
గనుఁగొని మాటలం బొదువుగద్గదికం దలయూఁచి యక్కటా
వనితఁ తనంతఁ దా వలచి వచ్చినఁ జుల్కనగాదె యేరికిన్. 66

అ. అనుటయున్ =అని ప్రవరాఖ్యుఁ డనఁగానే, మాటలేక=బదులు చెప్పుటకు మాటతోఁచక, హృదయాబ్జము=హృదయకమలము-గుండెకాయ, జల్లనన్ =జల్లుమని యదురఁగా, మోము=ముఖము, వెల్లనై =వెలవెలఁబోయి - తెల్లఁబోఁగాననుట, కనలుచున్ =లక్షించుచు, నీరుదేఱు తెలిగన్నులన్ = నీరుగ్రమ్ముచున్న తెలుపుమించినకన్నులతో, ఆతనిన్=ఆప్రవరాఖ్యుని, పుల్కుపుల్కనన్=కన్నులు మూసిమూసి తెఱచుటలతో, కనుఁగొని = చూచి, మాటలన్ = మాటలయందు, పొదువుగద్గదికన్ = ఆవరించుకొన్న డగ్గుత్తికతో- దుఃఖాతిశయముచేత డగ్గుత్తికపడి మాట వెడలకపోఁగా ననుట, తల యూఁచి = తలయాడించి, అక్కటా=అయ్యో, వనిత=ఆఁడుది, తనంతఁదాన్ =తనకుఁదానే, వలచి= వలపుగొని, వచ్చినన్ = వచ్చినపక్షమున, ఏరికిన్ = ఎవరికైనను, చుల్కనగాదె = లాఘవముకాదా- లాఘవమే యనుట.

తా. ప్రవరాఖ్యుఁ డిట్లు తెగనాడఁగా వరూథిని బదులేమి చెప్పుటకును శక్యముగాక మనసున దిగులుపడి మొగము చిన్నపుచ్చుకొని సంతాపముతోఁ గన్నుల నీళ్లుగ్రమ్మగా ఱెప్పలల్లార్చుచు నతనిం జూచి డగ్గుత్తికతోడిమాటలతో నెవరికైనఁగాని యాఁడుది తనంతఁ దాను కామించి వచ్చునెడఁ జులకగాఁ దోఁచు ననియె. అలం. అర్థాంతరన్యాసము.

మ. వెతలం బెట్టకు మింక న న్ననుచు నీవీబంధ మూడన్ రయో
ద్ధతి నూర్పుల్ నిగుడన్ వడిన్ విరులు చిందం గొప్పు వీడం దనూ
లత తోడ్తోఁ బులకింపఁగా ననునయాలాపాతిదీనాస్య యై
రతిసంరంభము మీఱ నిర్జరవధూరత్నంబు పైఁ బాటునన్. 67

అ. నిర్జరవధూరత్నంబు = (శ్రేష్ఠురాలైనయాదేవతాస్త్రీ)- వరూథిని, ఇంకన్ = ఇఁకను, నన్ను, వెతలంబెట్టకుము = బాధలఁబెట్టకుము, అనుచున్=అనిపలుకుచు, నీవీబంధము = పోఁకముడి,

ఊఁడన్=వదలఁగా, రయోద్ధతిన్ = వడియొక్క యతిశయముచేత, ఊర్పులు=నిట్టూర్పులు, నిగుడన్ = హెచ్చఁగా, వడిన్ =వడిచేత, విరులు=పువ్వులు, చిందన్ =రాలఁగా, కొప్పు = తుఱుము, వీడన్ = సడలఁగా, తోడ్తోన్ =వెంటవెంటనే, తనూలత = తీఁగవంటిశరీరము, పులకింపఁగాన్ = గగుర్పొడువఁగా, అనున ..ఆస్యయై - అనునయాలాప = ఊఱడింపుమాటలతో, అతి=మిక్కిలి, దీనాస్యయై = చిన్నవోయినమొగముగలదై, రతిసంరంభము = సంభోగాపేక్షవలనితొందర, మీఱన్ = అతిశయింపఁగా, పైపాటునన్ = పైఁబడుటచేత- పైపద్యముతో నన్వయము. అలం. స్వభావోక్తి.

శా. ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై
యంచుల్ మోవఁగ గౌఁగిలించి యధరం బాసింప హా శ్రీహరీ
యంచున్ బ్రాహ్మణుఁ డోరమోమిడి తదీయాంసద్వయం బంటి పో
మ్మంచుం ద్రోచెఁ గలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్. 68

అ. ప్రాంచ .రుచితోన్ - ప్రాంచత్=మిక్కిలియొప్పుచున్న, భూషణ = ఆభరణములయొక్కయు, బాహుమూల = చంకలయొక్కయు, రుచితోన్ = ప్రకాశముతోడ, పాలిండ్లు= స్తనములు, పొంగారన్ = ఉబ్బఁగా, పైయంచుల్ =చనుమొనలు, మోవఁగన్ = ఆనునట్టుగా, కౌఁగిలించి= ఆలింగనముచేసి, అధరంబు = మోవిని, ఆసింపన్ = అపేక్షింపఁగా, బ్రాహ్మణుఁడు = ప్రవరాఖ్యుఁడు, హా = అయ్యో, శ్రీహరీ, అంచున్ = అనిపాపపరిహారార్థము దేవుని స్మరించుచు, ఓరమోమిడి = ముఖమొకప్రక్కకుఁ ద్రిప్పుకొని, తదీయాంసద్వయంబు=దానిదైన రెండుమూఁపులను, అంటి=తాఁకి, పొమ్మంచున్ = అవతల పొమ్మనుచు, ద్రోచెన్ = తొలఁగఁద్రోసెను. ధీరచిత్తంబులన్=తాలిమిగలవారిమనసులను (లేక) పండితులమనసులను, సతులమాయల్ = స్త్రీలయొక్క కపటచేష్టలు, కలంచునే = కలఁతపెట్టునా- కలఁతపెట్టఁజాలవనుట. అలం అర్థాంతరన్యాసము.

క. త్రోపువడి నిలిచి ఘనల, జ్జాపరవశ యగుచుఁ గొప్పు సవరించి యొడల్
దీపింప నతనిఁ జుఱచుఱఁ, గోపమునం జూచి గ్రేఁటు కొనుచుం బలికెన్. 69

అ. త్రోపువడి=త్రోయుటనుబొంది- ఈవిధముగా నతనిచేతఁ ద్రోయఁబడి, నిలిచి=తొలఁగి నిలిచి, ఘనలజ్జాపరవశ=మిక్కుటమైనసిగ్గుచేతఁ బరాధీనురాలు, అగుచున్ = అవుచును, కొప్పుసవరించి=వీడినకొప్పు చక్కఁగా దిద్దుకొని, ఒడలు=తనశరీరము, దీపింపన్ = ప్రకాశింపఁగా- అవయవములన్నియు వానికన్నులకుఁ దెలియునట్లుగాఁ బైఁటచెఱఁగుతొలఁగించి యనుట, అతనిన్ = ప్రవరాఖ్యుని, చుఱచుఱన్ = చుఱచుఱలాడునట్లు- వేఁడిచూపులతో, కోపమునన్ = కోపముతో, (పా. కోపన=కోపముగలదియైన యాయాఁడుది. ఈపాఠమునం దిది కర్తృపదము.) చూచి,(పా.వీక్షించి= చూచి), గ్రేఁటుకొనుచున్=గొంతుసవరించుకొనుచు, (వెక్కుచునని కొందఱు.)పలికెన్=ఇట్లుపలికెను.

తా. అట్లు ప్రవరాఖ్యుఁడు తొలఁగఁద్రోయఁగాఁ దొలఁగి నిలువఁబడి యవమానమువలనిసిగ్గు హెచ్చఁగా దేహమంతయు నతనికిఁ గానవచ్చునట్లు పైఁటచెఱఁగుతొలఁగించి వీడినకొప్పు చక్కఁగా ముడుఁచుకొనుచుఁ గోపముతోడివేఁడి చూపులతో నతనిఁజూచుచు డగ్గుత్తికపడినగొంతు సవరించుకొనుచు నీవిధముగాఁ బలికెను.

ఉ. పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక నీవు త్రోవ ని
చ్చోట భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొను మంచుఁ జూపి య

ప్పాటలగంధి వేదన నెపం బిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీఱిన విచ్చుగుబ్బచనుమిట్టల నశ్రులు చిందువందఁగన్. 70

అ. కృపారహితాత్మక = ఓయి దయమాలినమనసుగలవాఁడా, పాటునకున్ = పడుటకు-త్రోయఁబడుటకు, ఇంతులు=ఆఁడువారు, ఓర్తురె=తాళుదురా, నీవుత్రోచినన్ = నీవు నన్నుఁబట్టిత్రోయునపుడు, ఇచ్చోటన్=ఇక్కడ, భవన్నఖాంకురము =నీగోటికొన, సోఁకెన్ = తగిలెను, కనుంగొనుము=చూడుము. అంచున్ = అని, చూపి=అగోటినొక్కుగనఁబఱచి, అప్పాటలగంధి = పాదిరిపువ్వులపరిమళమువంటి దేహపరిమళముగలది- అవరూథిని, వేదననెపంబిడి = ఆగాయమువలని నొప్పినినెపముచేసికొని, మీఱినన్ = గోటితోఁజిమ్మినను, విచ్చు .. మిట్టలన్ - విచ్చు = విరియనట్టి - అంతవిరిగిలిగిన, గుబ్బ=వర్తులమైన, చనుమిట్టలన్=ఉన్నతములైన స్తనప్రదేశములయందు, అశ్రులు=కన్నీళ్లు, చిందువందఁగన్ = పడిచెదరఁగా, కలస్వనంబుతోన్ =అవ్యక్తమధురధ్వనితో, ఏడ్చెను.

తా ఓయిదయమాలినవాఁడా! త్రోయఁగా నగుబాధకు స్త్రీలు తాళఁజాలుదురా? ఇది యోచింపక త్రోసితివే నీవు త్రోయునప్పు డిక్కడ నీగోరుతగిలి గాయమయ్యెను జూడుమని చెప్పి గోటినొక్కుచూపుచు దానివలననొప్పికిఁ దాళలేనిదానివలె నది మిషచేసికొని చెవి కింపైనధ్వనితో నేడువసాగెను.

క. ఈవిధమున నతికరుణము, గా వనరుహనేత్ర కన్నుఁగవధవళరుచుల్
కావిగొన నేడ్చి వెండియు, నావిప్రకుమారుఁ జూచి యలమటఁ బల్కెన్. 71

అ. వనరుహనేత్ర = తామరలవంటికన్నులుగలది- వరూథిని, ఈవిధమునన్ = ఇట్లు, అతికరుణముగాన్ =మిక్కిలి జాలిపుట్టునట్లుగా, కన్నుఁగవధవళరుచుల్ - కన్నుఁగవ=రెండుకన్నులయొక్క, ధవళరుచుల్=తెల్లనికాంతులు, కావిగొనన్=ఎఱ్ఱవాఱఁగా, ఏడ్చి=ఏడ్చినదై, వెండియున్ = మఱియును, ఆవిప్రకుమారున్=ఆప్రవరాఖ్యుని, చూచి, అలమటన్=విచారముతో, పల్కెన్ = పలికెను.

ఉ చేసితి జన్నముల్ దపము చేసితి నంటి దయావిహీనతం
జేసినపుణ్యముల్ ఫలము సెందునె పుణ్యము లెన్ని యేనియుం
జేసినవానిసద్గతియె చేకుఱు భూతదయార్ద్రబుద్ధి కో
భూసురవర్య యింతియ తలంపోయవు నీచదు వేల చెప్పుమా. 72

అ. ఓభూసురవర్య=ఓబ్రాహ్మణశ్రేష్ఠుఁడా, జన్నములు = యజ్ఞములు, చేసితిని, తపము=తపస్సును, చేసితిని, అంటి = అని చెప్పితివి, దయావిహీనతన్ = దయలేనితనముతో - దయలేక, చేసినపుణ్యముల్=చేసినట్టిధర్మకార్యములు, ఫలము సెందునే = సార్థకములగునా, పుణ్యములు=ధర్మములు, ఎన్ని యేనియున్ = ఎన్నియో - అనేకములు, చేసినవానిసద్గతియె = చేసినట్టిపురుషునిదైన మంచిగతియే, భూతదయార్ద్రబుద్ధికిన్ = ప్రాణులయందలిదయచేతఁ దడిసిన బుద్ధిగలవానికి - ప్రాణులయందు దయగలవానికి, చేకుఱున్ = సిద్ధించును, ఇంత = ఇంతమాత్రము, తలపోయవు = ఆలోచింపవు- ఈవిషయ మిట్టిది యని విచారించినవాఁడవు కావనుట, నీచదువు=నీవుచదివినచదువు, ఏల=ఎందుకు- దేనికినుపయోగము, చెప్పుమా = నీవేచెప్పుము.

తా. ఓబ్రాహ్మణోత్తమా! యజ్ఞములుచేసితి నని తపస్సు చేసితి నని చెప్పుకొంటివి ఏమిచేసిన నేమి? భూతదయలేనిపక్షమున నవియన్నియు నిష్ఫలములే ఎన్నియో లెక్కలేనిపుణ్యకార్యములు

చేసినవాఁడు పొందునట్టిసద్గతి యవి యేవియుఁ జేయక భూతదయమాత్రముగలవానికి సిద్ధించును ఈవిషయము కొంచెమయినవిచారించి తెలిసికోలేని నీపాండిత్య మేమిటికిఁ బనికివచ్చును. వ్యర్థమేకదా అలం. కావ్యలింగము.

సీ. వెలిపెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి, దాశకన్యాకేళిఁ దప్పు సేసి
కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధి, పట్టికి మేనకచుట్టఱికము
ననుపుకాఁడై వేల్పునాగవాసముఁ గూడి, మహిమగోల్పడియెనే మాందకర్ణి
స్వారాజ్య మేలంగ నీరైరె సుర లహ, ల్యాజారుఁ డైనజంభాసురారి
వారికంటెను నీమహత్త్వంబు ఘనమె, పవనపర్ణాంబుభక్షులై నవసి యినుప
కచ్చడాల్ గట్టుకొనుమునిముచ్చులెల్ల, తామరసనేత్రలిండ్లబందాలుగారె.

అ. బాడబులు=బ్రాహ్మణులు, దాశకన్యాకేళిన్ =దాశరాజుకూఁతు రైనయోజనగంధియొక్క కూటమిని, తప్పుసేసి=నేరముగాగ్రహించి, పరాశరున్ =పరాశరమహామునిని, పట్టి=పట్టుకొని, వెలిపెట్టిరే=వెలివేసిరా-వెలివేయలేదుగదా యనియర్థము. గాధిపట్టికిన్ =విశ్వామిత్రమునికి, మేనకచుట్టఱికము= మేనకయనునప్సరః స్త్రీయొక్కసంబంధము, కులములోన్ = తమవారితెగలో, వన్నెతక్కువ = గౌరవములోపముగలది, అయ్యెనే = ఆయెనా-కాలేదుగదా, మాందకర్ణి = మాందకర్ణి యనుమునీశ్వరుఁడు, ననుపుకాఁడై = విటకాఁడై, వేల్పునాగవాసమున్ = దేవవేశ్యాసమూహమును, కూడి = కలసి, మహిమన్ =తనమహత్త్వమును, కోల్పడియెనే =పోఁగొట్టుకొనెనా-పోఁగొట్టుకోలేదుకదా, సురలు= దేవతలు, అహల్యాజారుఁడు = అహల్యకు అంకుమగఁడు, ఐనజంభాసురారిన్ = అయినట్టిదేవేంద్రుని, స్వారాజ్యమున్ = స్వర్గరాజ్యమును, ఏలంగనీరైరె=పాలింపనీయకపోయిరా-ఎప్పటివలెఁబాలింపనిచ్చిరికదా యనుట, వారికన్నన్ = ఆపరాశరుఁడు మొదలైనవారికంటెను- వారిమహత్త్వముకంటెననుట, నీమహత్త్వంబు = నీదైనప్రభావము, ఘనమె = హెచ్చా, పవనపర్ణాంబుభక్షులై -పవన = గాలియు, పర్ణ = ఆకులును, అంబు=నీళ్లును, భక్షులై = ఆహారముగాఁ జేసికొని, నవసి = కృశించి, ఇనుపకచ్చడాలు = ఇనుముతోఁజేసిన గోచులు, కట్టుకొనుమునిముచ్చులెల్లన్ =కట్టుకొన్నదొంగమునులందఱును- మేము నిర్జితేంద్రియులమని మునివేషము వేసికొన్నవారందఱుననుట, తామరసనేత్రలిండ్లన్ = కమలములవంటికన్నులుగల (చక్కఁదనముగల) స్త్రీలయిండ్లలో, బందాలు[illegible]లలోనుంపఁబడిన వారివంటివారు, కారె=కారా - అగుదురు, అనఁగాఁ దపస్సులుచేసి స్వర్గమునుబొందియు వారు దేవతాస్త్రీలతో సంభోగించువారె యనిభావము. అలం అర్థాంతరన్యాసము. (ఇందుఁ జెప్పబడినపరాశరుని కథ భారతములో నాదిపర్వమందును, విశ్వామిత్రుఁడు, మాందకర్ణి, దేవేంద్రుఁడు వీరికథలు రామాయణ బాలకాండాయోధ్యాకాండములయందును జూడవచ్చును.)

తే. అనిన నేమియు ననక యవ్వనజగంధి, మేనిజవ్వాదిపస గదంబించునొడలు
గడిగికొని వార్చి ప్రవరుండు గార్హపత్య, వహ్ని నిట్లని పొగడె భావమునఁ దలఁచి

అ. అనినన్ =అని వరూథిని యనఁగా, ప్రవరుండు = ప్రవరాఖ్యుఁడు, ఏమియుననక=ప్రత్యుత్తరమేమియుఁ జెప్పక, అవ్వనజగంధి.. పసన్ -అవ్వనజగంధి = ఆ స్త్రీయొక్క, మేని = శరీరసంబంధమైన, జవ్వాదిపస=జవ్వాజియొక్కసారము, కదంబించునొడలు = అంటుకొన్న దేహమును, కడిగికొని = కడిగివేసికొని-స్నానము చేసి, వార్చి=ఆచమనము చేసి, గార్హపత్యవహ్నిన్ = తానుబ్రతిదినము

నారాధించునట్టిశ్రౌతాగ్నిని, భావమునన్ = మనసునందు, తలఁచి = ధ్యానించి, ఇట్లని = ఈమీఁదఁ జెప్పఁబోవురీతిని, పొగడెన్ = స్తుతించెను.

శా. దివిషద్వర్గము నీ ముఖంబునన తృప్తిం గాంచు నిన్నీశుఁగా
స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్తజగదంతర్యామివిన్ నీవ యా
హవనీయంబును దక్షిణాగ్నియును నీయం దుద్భవించుం గ్రతూ
త్సవసంధాయక నన్నుఁ గావఁ గదవే స్వాహావధూవల్లభా. 75

అ. క్రతూత్సవసంధాయక = యజ్ఞరూపమయినయుత్సవమునుగూర్చువాఁడా- యజ్ఞకార్యమునకు ముఖ్యసాధనమైనవాఁడాయనుట, స్వాహావధూవల్లభా = స్వాహాదేవికిఁ బ్రియుఁడా- అగ్నిదేవుఁడా, దివిషద్వర్గము=దేవతలసమూహము, నీముఖంబునన= నీవనెడిమొగముచేతనే - దేవత లగ్నిరే ముఖముగాఁగలవారనిచెప్పుదురు గనుక నీవైనముఖముచేతనే యని యర్థము, తృప్తిన్ =తనివిని, గాంచున్ =పొందును, శ్రుతులు= వేదములు, నిన్నున్ = తేజోమూర్తివయిననిన్ను, ఈశుఁగాన్ =ఈశ్వరునిఁగా, స్తవముల్ = స్తోత్రములను, చేయును, సమస్తజగదంతర్యామివిన్ - సమస్త = సకలమైన, జగత్ =లోకములయొక్క, అంతర్యామివిన్ = లోపలవర్తించువాఁడవును- అంతరాత్మవును, నీవ=నీవే, ఆహవనీయంబున్ = వైశ్వదేవాదిక్రియలకై గార్హపత్యాగ్ని నుండి గ్రహింపఁబడి క్రియాపరిసమాప్తిపర్యంతము హోమముచేయఁదగినయగ్నియును, దక్షిణాగ్నియున్ = వేదికి దక్షిణభాగమునందుఁ బ్రాయశ్చిత్తాదికార్యమునకై యుంచుకోఁబడునట్టియగ్నియు, నీయందున్ = నీయందే, ఉద్భవించున్ = పుట్టును, (కనుక) నన్నున్ = నిన్నారాధించువాఁడనైననన్ను, కావఁగదవే = ఈయాపదవలననుండి కాపాడవయ్యా.

ఉ. దానజపాగ్నిహోత్రపరతంత్రుఁడ నేని భవత్పదాంబుజ
ధ్యానరతుండ నేనిఁ బరదారధనాదులఁ గోర నేని స
న్మానముతోడ నన్ను సదనంబున నిల్పు మినుండు పశ్చిమాం
భోనిధిలోనఁ గ్రుంకకయ మున్న రయంబున హవ్యవాహనా. 76

అ. హవ్యవాహనా=హవ్యమునువహించువాఁడా- అగ్నిదేవుఁడా, దాన... నేని- దాన=ఈవికిని, జప = మంత్రావృత్తిచేయుటకును, అగ్నిహోత్రి = వైశ్వదేవాదిహోమకార్యములకును, పరతంత్రుఁడ నేని - పరాధీనుఁడనైనయెడల- వీనియం దాసక్తిగలవాఁడనైనపక్షమున ననుట, భవత్ ...రతుండ నేని- భవత్ =నీవైన, పదాంబుజ = పాదకమలములయొక్క, ధ్యాన=చలింపక తలఁచుటయందు, రతుండ నేని=ఆసక్తుఁడ నయినపక్షమునను, పరదారధనాదులన్ =పరులభార్యలు పరులధనము మొదలగువానిని, కోర నేని= నేను గోరనివాఁడనైనపక్షమునను, నన్ను, ఇనుండు= సూర్యుఁడు, పశ్చిమాంభోనిధిలోనన్ =పడమటిసముద్రములోపల, క్రుంకకయమున్న = మునుఁగకమును పే- పొద్దుగ్రుంకకమును పేయనుట, రయంబునన్ =వడిగా - శీఘ్రముగా, సన్మానముతోడన్ = గౌరవముతో- ఈయవమానమువలన గౌరవహానికలుగకుండునట్లు, సదనంబునన్ = నాయింటియందు, నిల్పుము=నిలుచునట్లు చేయుము- నాయింటఁ జేర్పుమనుట.

వ. అని సంస్తుతించిన నగ్ని దేవుం డమ్మహీదేవు దేహంబున సన్నిహితుం డగుటయు నమ్మహాభాగుండు గండు మీఁటి పొడుపుఁగొండ నఖండసంధ్యారాగప్రభామండ

లాంతర్గతుం డగుపుండరీకవనబంధుండునుంబోలె నుత్తప్తకనకద్రవధారాగౌ
రం బగుతనుచ్ఛాయాపూరంబున నక్కాన వెలింగించుచు నిజగమననిరోధిని
యగునవ్వరూథినిహృదయకంజంబున రంజిల్లునమందానురాగరసమకరందంబు
నందంద పొంగం జేయుచుం బావకప్రసాదలబ్ధం బగుపవనజవనంబున నిజ
మందిరంబున కరిగి నిత్యకృత్యసత్కర్మకలాపంబులు నిర్వర్తించె నని మా
ర్కండేయుండు క్రోష్టికిం జెప్పె నని చెప్పిన 77

అ. అని=ఇట్లని, సంస్తుతించినన్ = పొగడఁగా, అగ్నిదేవుండు, అమ్మహీదేవుదేహంబునన్ = ఆబ్రాహ్మణునిశరీరమునందు, సన్నిహితుండు = ఉంపఁబడినవాఁడు-చేరినవాఁడు, అగుటయున్ = కాఁగా, అమ్మహాభాగుండు = పూజ్యుఁడయిన యాప్రవరాఖ్యుఁడు, గండు = దేహపుష్టి, మీఱి=అతిశయించి-ఉత్సాహము హెచ్చి యనుట, పొడుపుఁగొండన్ = ఉదయపర్వతమునందు, అఖండ.. గతుండు – అఖండ = ఖండముకాని-నిండిన, సంధ్యారాగ = సంధ్యాకాలమునందలి యెఱ్ఱఁదనము యొక్క, ప్రభా=కాంతులయొక్క, మండల = సమూహముయొక్క, అంతర్గతుండు = లోపలనణఁగి యున్నవాఁడు, అగు ..పోలెన్ - అగు=అయినట్టి, పుండరీకవనబంధుండునుంబోలెన్ = (తెల్లదామరల సమూహమునకు చుట్టమయిన) సూర్యుఁడో యనునట్లు, ఉత్తప్త. .గౌరవంబు-ఉత్తప్త = పుటము తీరిన, కనకద్రవధారా = బంగారునీటిధారయొక్క, గౌరంబు = పసిమివంటిపసిమిగలిగినది, అగు తనుచ్ఛాయాపూరంబునన్ =అగునట్టిదేహకాంతిప్రవాహముచేత, అక్కానన్ = ఆయడవిని, వెలింగించుచున్ =ప్రకాశింపఁజేయుచు, నిజగమననిరోధిని = తనపోకనడ్డగించునది, అగు...కంజంబునన్ - అగు=అయినట్టి, అవ్వరూథిని = ఆవరూథినిదైన, హృదయకంజంబునన్ = మనఃకమలమునందు-మనస్సునందు, రంజిల్లు . మకరందంబున్ -రంజిల్లు=రాగిల్లునట్టి, అమంద = తక్కువకాని-మిక్కుటమైన, అనురాగరస=స్నేహరసమనెడి, మకరందంబున్ = పూఁదేనెను, అందంద=మఱిమఱి, పొంగఁజేయుచున్ = హెచ్చుగాఁజేయుచు-పెంచుచు, పావకప్రసాదలబ్ధంబు=అగ్నిదేవునను గ్రహమువలన లభించినది, అగుపవనజవనంబునన్ = అగునట్టివాయువేగమువంటి వేగముతో, నిజమందిరంబునకున్ = తనయింటికి, అరిగి=పోయి, నిత్య. .పంబులు-నిత్య=ప్రతిదినమును, కృత్య=చేయఁదగిన, సత్కర్మ = సత్క్రియలయొక్క, కలాపంబులు = సమూహములను-తాను ప్రతిదినము చేయుచున్న వైశ్వదేవాది సత్కర్మముల నన్నిటి ననుట, నిర్వర్తించెన్ = జరపెను, అని, మార్కండేయుండు = మార్కండేయముని, క్రోష్టికిన్ = క్రోష్టియనెడుమునితో, చెప్పెను, అని, చెప్పినన్ = పక్షులు జైమినిమునితోఁ జెప్పఁగా-దీనికిఁ బైపద్యముతో నన్వయము

తా. అని ప్రవరాఖ్యుఁడు స్తోత్రము చేయఁగా నగ్నిదేవుఁ డతనిదేహమునం దావేశించి సాటిలేని తేజోబలవేగములను గలిగింపఁగా నాబ్రాహ్మణుఁ డాయడవినంతయు వెలిఁగించు దేహకాంతితో నందుండి కదలి వరూథిని యడ్డగింతకు లోఁబడక దానిమనసులోనియనురాగము మఱిమఱి పెరుఁగునట్లు చేయుచు వాయువేగముతోఁ దక్షణమే తనయూరికిఁ జని యిల్లుచేరి స్నానసంధ్యావందనవైశ్వదేవాదినిత్యకర్మములన్నియు జరపుకొనెను. అలం. ఉత్ప్రేక్ష, రూపకము

క. జైమిని యాదివ్యఖగ, గ్రామణులరి జూచి వేడ్కఁ గడలుకొనంగా
నామీఁద వరూథినివిధ, మేమయ్యె నెఱుంగఁ జెప్పరే నాకనుడున్. 78

అ. జైమినీ = జైమినిమహామునీ, ఆదిన్యత్యఖగగ్రామణుల్ = దేవతాసంబంధు లయినయా పక్షిశ్రేష్ఠములను, చూచి, వేడ్క = కుతూహలముతో, కడలుకొనంగాన్ = అతిశయింపఁగా, ఆమీఁదన్ = అటుమీఁద, ఏతత్కథానివిధము = ఏతత్కథయొక్క ప్రకారము, ఏమి మ్యెన్ = ఏమిగా జరిగెను, నాకున్, తెలియన్ = విశదముగునట్లు, చెప్పరే = మీరు చెప్పుఁడు, అనుచున్ = అనిజైమినియడుగఁగా - దీనికిఁ బైయాశ్వాసమునందలి 'అవధరింపుము' అనుదానితో నన్వయము

శా. నిస్తంద్రప్రతిభా సుధీనుత దిశోకస్మీలద్యశశ్శ్రీఘనా
హస్తాగ్రామలకాయమానమహనీయాంభోజగర్భాండ సై
న్యస్తోమోత్థరజోవ్రజస్థగితకృష్ణాగౌతమీమధ్యభూ
మ్యస్తోకోత్కలరాట్పురీహరణలీలావార్యశౌర్యోదయా. 79

అ. నిస్తంద్రప్రతిభా-నిస్తంద్ర=చొరవగల, ప్రతిభా=అప్పటప్పటికి వికాసమునొందెడి బుద్ధిగలవాఁడా, సుధీనుత=విద్వాంసులచేతఁ బొగడఁబడినవాఁడా, దిశోకస్మీలత్. గర్భాండ- దిశా = దిక్కులయందు, ఉన్మీలత్ = వ్యాపించుచున్న, యశః = కీర్తియొక్క, శ్రీ = శోభాసంపత్తి కాంతిసంపద) యనెడు, ఘనా = స్త్రీయొక్క, హస్తాగ్ర = చేతికొనయందలి-అఱచేతియందలి, ఆమలకాయమాన = ఉసిరికకాయ యగుచున్న, మహనీయ=మిక్కిలి దొడ్డదయిన, అంభోజగర్భాండ =బ్రహ్మాండముగలవాఁడా-ఎల్లదిక్కులందును వ్యాపించి బ్రహ్మాండమును దనచేతిలోని యుసిరికకాయవలెఁ దోఁపించునట్టి కీర్తిసంపదగలవాఁడా యనుట, సైన్య శౌర్యోదయా-సైన్య = సేనలయొక్క, స్తోమ=సమూహమువలన, ఉత్థ=పుట్టిన, రజః=దుమ్మయొక్క, వ్రజ=సమూహముచేత, స్థగిత=గాదుగఁబడిన-కప్పఁబడిన, కృష్ణా = కృష్ణానదియొక్కయు, గౌతమీ = గోదావరీనదియొక్కయు, మధ్య = నడుమనుండెడి, భూమి = నేలయందలి - భూభాగమందలి, అస్తోక = అల్పముకాని-అధికమైన, (ఇది పట్టణమునకు విశేషణము) ఉత్కలరాట్ = ఉత్కలదేశపురాజుయొక్క, పురీ-పట్టణముయొక్క, హరణ = హరించుటయనెడి, లీలా = విలాసమునందు-అనాయాసముగా దొడ్డయిన యుత్కలదేశపురాజుయొక్క పట్టణము నాక్రమించుటయం దనుట, అవార్య=నివారింపశక్యముగాని, శౌర్యోదయా=శౌర్యసమృద్ధికలవాఁడా

తా. హె... తోడి బుద్ధివిశేషమును బండితులవినుతియు బ్రహ్మాండము నలమి వెలుఁగుచున్న కీర్తియుఁ గలిగి కృష్ణాగోదావరీనదులమధ్యభాగమునందుఁ గలదేశమునంతయు నాక్రమించి యుత్కలదేశపురాజుదైనపట్టణము ననాయాసముగ వశపఱుచుకొని యడ్డములేనిశౌర్యాతిశయమును బొందినవాఁడా. అలం. రూపకము, అతిశయోక్తియు

. బిసరుహనయనానవవిధ, కుసుమాయుధ యవధిధరకూటాంచలభూ
విసృమరతేజశ్చంపక, భసలదసత్కీర్తిమలినపరిపంథినృపా. 80

అ. బిసరుహ యుధ - బిసరుహనయనా = తామరలవంటి కన్నులుగలవారికి - చక్కఁదనముగలస్త్రీలకు, నవవిధ = క్రొత్తరీతిగల, కుసుమాయుధ = మన్మథుఁడా, అవధి. . నృపా-అవధిధర = చక్రవాళపర్వతముయొక్క, కూట = శిఖరములయొక్క, అంచల = కొనలయందలి, భూ = భూమియందు, విసృమర=వ్యాపించిన, తేజః=ప్రతాపమనెడు, చంపక = సంపెఁగపువ్వులకు,

శసలత్ = తుష్మైదవలె నాచరించుచున్న, అనత్కీర్తి=అపకీర్తిచేత, మలిన = మాలిన్యమునొందిన, సపత్నినృపా=శత్రురాజులుగలవాఁడా.

తా. చక్కఁదనముచేత మన్మథునివలె స్త్రీలను మోహింపఁజేయువాఁడవును, చక్రవాళపర్వతము శిఖరములఁటుకు వ్యాపించినప్రతాపముచేత శత్రురాజులను దఱుమఁగొట్టినవాఁడవు నైనవాఁడా. అలం. రూపకము

కవిరాజవిరాజితము నలనృగురంతిభగీరథభారతవంశనందనకల్ప యనల్పయశ
శ్చులుకితలోక విలోకివధూజనసూనశరాసన మానఘనీ
ప్రళయఘనాఘనఘోషజయానకభాంకృతిభీమచపేటలుఠ
త్కలబరిగీకటకక్షితిరక్షక కన్నడరాజ్యరమారమణా. 81

అ. నల. కల్ప = నలుఁడు నృగుఁడు రంతిదేవుఁడు భగీరథుఁడు భరతవంశమునందుఁబుట్టిన ధర్మరాజాదులు మొదలగురాజులను బోలినవాఁడా, అనల్ప లోక - అనల్ప=తక్కువకాని, యశః= కీర్తిచేత, చులుకిత = పుడిసిలింపఁబడిన, లోక = జగత్తుగలవాఁడా, విలోకి . శరాసన - విలోకి= చూచునట్టి, వధూజన = స్త్రీసమూహమునకు, సూనశరాసన = పూవింటివాఁడా - మన్మథుఁడా, మానఘనీ = చిత్తౌన్నత్యమునకు (గొప్పతనమునకు) గనియైనవాఁడా, ప్రళయ .. రక్షక — ప్రళయ = విలయకాలమునందలి, ఘనాఘన = వానకురియుచున్న మేఘముయొక్కయు, ఘోష = ధ్వనివంటిధ్వనిగలిగిన, జయానక = జయభేరియొక్క, భాంకృతి = భాంకారమనెడి, భీమ = భయంకరమయిన, చపేట = చెంపదెబ్బచేత, లుఠత్ = నేలమీఁదఁబడిపొరలాడుచున్న, కలబరిగీకటక = కలబరిగియనెడిరాజధానియొక్క, క్షితిరక్షక = రాజుగలవాఁడా, కన్నడరాజ్యరమారమణా - కన్నడ=కన్నడదేశముయొక్క, రాజ్యరమా = ప్రభుత్వలక్ష్మికి, రమణా = ప్రియుఁడా- పాలకుఁడా యనుట

తా. నలుఁడు నృగుఁడు రంతిదేవుఁడు భగీరథుఁడు ధర్మరాజు మొదలుగాఁగల పూర్వరాజులతో సరిపోల్పఁదగినసచ్చరిత్రము గలవాఁడవును లోకాతీతమయినకీర్తి గలవాఁడవును స్త్రీలచూపులకు మన్మథునివలెఁ దోఁచునట్టిచక్కఁదనము గలవాఁడవును మానమునకు నునికిపట్టయినవాఁడవును జయభేరీధ్వని విన్నమాత్రముననే కలబరిగిరాజును బెదరి నేలఁబడి పొరలాడునట్లు చేసినవాఁడవును కర్ణాటదేశము నేలువాఁడవునైన కృష్ణదేవరాయా.

గద్యము ఇది శ్రీమదంధ్రకవితాపితామహసర్వతోముఖాంక పక్వడుస్తారుపాదాంబు
జాతీసమానసేందిందిర నందవరపురవంశోత్తంస శఠగోపతాతప్రసాదాసాదిత
చతుర్విధకవితామతల్లి కాల్లనానిచొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్యప్రణీతం
బైనస్వారోచిషమనుసంభవం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

ఈగద్యమునకు నర్థము ప్రథమాశ్వాసగద్యమునకుంబోలె గ్రహించునది.



శ్రీ

# స్వారోచిషమనుచరిత్రము.

## సటీకము.

## తృతీయాశ్వాసము.



క. శ్రీవేంకటేశపదప
ద్మావేశితసదయహృదయ శ్రీహరనిటలనట
త్పావకపరిభావిమహః
ప్రావృతనిఖిలాశ కృష్ణరాయమహీశా 1

అ. శ్రీవేంక . హృదయ – శ్రీ = లక్ష్మీసమేతుఁడయిన, వేంకటేశ = వేంకటేశ్వరస్వామి యొక్క, పదపద్మ = పాదకమలములయందు, ఆవేశిత = పొందింపఁబడినదియు, సదయ=దయతోఁ గూడినదియు నైన, హృదయ = మనస్సుగలవాఁడా, హర . నిఖిలాశ – హర = రుద్రునిదైన, నిటల = నొసటియందు, నటత్=నటించుచున్న – వర్తిల్లుచున్న, పావక=అగ్నిని, పరిభావి=తిరస్కరించునట్టి, మహః = తేజస్సు (ప్రతాపము) చేత, ప్రావృత = చక్కఁగా నావరింపఁబడిన, నిఖిల=సమస్తమైన, ఆశ=దిక్కులుగలవాఁడా, కృష్ణరాయమహీశా=కృష్ణరాయమహారాజా – ఇది కృతిపతికి సంబోధనము

తా. శ్రీవేంకటేశ్వరస్వామిని ధ్యానించువాఁడవును, ఆశ్రితులయందు దయగలవాఁడవును, రుద్రనేత్రాగ్నికంటె నెంతెంద్రమును జూపునట్టిప్రతాపమును దిక్కులందు వ్యాపింపఁజేసి శత్రువులనణఁచినవాఁడవు నైన శ్రీకృష్ణదేవరాయమహారాజా. అలంకారము ఉపమ .

వ. అవధరింపు మమ్మహాత్మునకుం బక్షు లిట్లనియె. 2

అ. అవధరింపుము = చిత్తగింపుము – వినుము, అమ్మహాత్మునకున్ = దొడ్డవాఁడయిన యాజైమినిమునితో, పక్షులు = కథచెప్పెడిపక్షులు, ఇట్లనియెన్ = ఈవిధముగాఁ జెప్పెను

శా. ఆభూదేవకుమారుఁ డేఁగినఁ దదీయానూనరమ్యాకృతిం
దా భావంబున నిల్పి యంగభవకోదండోగ్రనారీరవ
క్షోభాకంపితధైర్య యై యలఁత నాచ్చో నిల్వక చ్చెల్వ త
ద్భూభృన్మేఖలవెంటఁ గానలబడెన్ దుఃఖాబ్ధినిర్మగ్న యై. 3

అ. ఆభూదేవకుమారుఁడు = ఆబ్రాహ్మణకుమారుఁడు– ప్రవరాఖ్యుఁడు, ఏఁగినన్ = అక్కడ నిలువక వెడలిపోఁగా, అచ్చెల్వ = ఆస్త్రీ–వరూథిని, తాన్ = తాను, తదీయ . కృతిన్ –తదీయ=వాని

మైన, అనూన=తక్కువకాని, రమ్య=అందమయిన, ఆకృతిన్ = రూపమును, భావంబ నందు, నిల్పి=నిలుపుకొని-ఎల్లప్పుడు తలఁచుచున్నదై, అంగ, ధైర్యయై- అంగభక్క, కోదండ=వింటియొక్క, ఉగ్ర=భయంకరమైన, మౌర్వీరవ = అల్లెత్రాటి క్షోభ=కలఁతచేత, ఆకంపిత=మిక్కిలి వణఁకింపఁబడిన- చలింపఁజేయఁబడిన, ధైర్యలదై- తాలిమితూలఁగాననుట, అలంతన్ =ఆయాసముచేత, దుఃఖాబ్ధినిర్మగ్నయై-దుఃఖ అబ్ధి=సముద్రమునందు, నిర్మగ్నయై=మునిఁగినదై, అచ్చోన్ =ఆచోట-అప్పుడుతానక=నిలిచియుండక, తద్భూభృన్మేఖలవెంటన్ - తద్భూభృత్ =ఆకొండయొక్క, మేమిభాగమువెంబడిని, కానలబడిన్ =అడవులమార్గమునందు - పైపద్యముతోనన్వయము బడెన్ = అడవులలోఁబడెను- ఇది పైపద్యమునందలి 'తిరుగుచున్' అనుదానితో గ్రాహ్యముకాదని తోఁచుచున్నది )

తా. ఆ బ్రాహ్మణుఁడట్లు తన్ను నిరాకరించి పోఁగా వరూథిని యేమియుఁ దోఁదనను నే తలఁచుచు మన్మథవేదన హెచ్చఁగాఁ దాలిమిమాలి యున్న తావుననుండ మన దుఃఖించుచు నాహిమవత్పర్వతము నడిమియడవులత్రోవలందుఁ జొచ్చి.

క. తిరుగుచు ధరణీసురవరుఁ, డరిగినచో ప్పరసి యరసి యటఁ గానక
హరిణాంకముఖి సఖీజన, పరివృత యై మగిడి వచ్చి భావములోన్.

అ. తిరుగుచున్ = సంచరించుచు, ధరణీసురవరుఁడు=బ్రాహ్మణశ్రేష్ఠుఁడు-ప్రగినచోప్పు=పోయినజాడను, అరసియరసి = వెదకివెదకి - బహుమారము వెదకి యన యడవులయందు, కానక = కనుఁగొనలేక, ఆహరిణాంకముఖి = చంద్రునివంటి వ యావరూథిని, సఖీజనపరివృతయై = (అంతలోఁ దన్ను వెదకుకొనివచ్చిన) చెలికత్తెల బడినదై- చెలికత్తెలతోఁ గూడుకొన్నదై యనుట, మగిడివచ్చి = తిరిగి (తనయునికిఁ (పా మరలివచ్చి), భావములోనన్ = తనమనసునందు-పైపద్యముతో నన్వయము.

తా. అట్లడవులత్రోవలందుఁ జొచ్చినవరూథిని ప్రవరుండు పోయినజాడ బ కనుఁగొననేరక యందందుఁ దిరుగుచుండి యంతలోఁ జెలికత్తెలు తన్ను వెదకుచు వచ్చి వారితోడ మరలి తననివాసస్థానమునకువచ్చి తనమనసులో.

ఉ. అక్కట వాఁడు నాతగుల మారడి సేసి దయావిహీనుఁడై
చిక్కక త్రోచి పోయె దరిఁ జేరఁగ రానివియోగసాగరం
బెక్కడ నీఁదుదాన నిఁక నీకొఱనోములు నోచినట్టినే
నెక్కడ వానికౌఁగి లది యెక్కడ హా విధి యేమి సేయుదున్.

అ. అక్కట=అయ్యో, వాఁడు = ఆప్రవరాఖ్యుఁడు, నాతగులము = నావసి=వ్యర్థముచేసి, (అల్లరిచేసి యని కొందఱు. అల్లరిచేసె యనఁగా దాను దేవతాస్త్రీ(య మాత్రుని వలచి వాని వలపింపలేకపోవుటచేత సరివారు ఇది యింతవ్యర్థురాలా యని యుభావము), దయావిహీనుఁడై = కనికరములేనివాఁడై, చిక్కక = నాచేతికిఁజిక త్రోపాడి, పోయెన్=పోబడిలేకపోయెను- నేను పైబడి పోయి కౌఁగిలించుకొన్నను పోయెననుట, ఇఁకన్=ఇంకను, దరిన్=తీరమునందు, చేరఁగన్ = చేరుటకు, రాని

బు=శక్యముకాని విరహసముద్రమును- ఎక్కడన్ = ఎంతవఱకని, ఈఁదుద్ధాన = ఈఁదఁగలదానను- ఇంతదూర మీఁదిన దరిఁజేరవచ్చు నన్న మితియున్న నీఁదవచ్చును గాని మితిలేనిపక్షమున నీఁదశక్యమగునా యనుట ఈ నేను- ఈ = ఈవిధమైన దశనొందినయట్టి, కొఱనోములు=తక్కువైనవ్రతములు, నోఁచునట్టి నేను = ఆచరించిన నేను, ఎక్కడ = ఎచ్చట, వానికౌఁగిలది = ఆసుందరునియాలింగనము, ఎక్కడ=ఎచ్చట- నాకును వానికౌఁగిటికిని బహుదూరమనుట,-అనఁగా నట్టిసుందరునికౌఁగిలి యెన్నెన్నో దొడ్డనోములు నోఁచినపుణ్యవతులకుఁగాక నావంటి తక్కువనోములునోఁచినసామాన్యులకు లభింపనేరదని యర్థము హా=అయ్యో, విధి=దైవమా, ఏమిసేయుదున్ = ఈవిరహవేదనమూనుట కేమిచేయుదును. (పా విధి నేమి సేయుదున్ = నాకిట్టిదశగలుగ వ్రాసిన బ్రహ్మదేవు నేమిచేయుదును )

తా అయ్యో! ఆబ్రాహ్మణుఁడు నాయంత నేనే పైఁబడిపోయినను నాకుఁ జక్కఁగ నాయపేక్ష వ్యర్థము చేసి నన్నుదరిగానని విరహసముద్రమునందుఁ ద్రోసిపోయెను. నేనెట్లీవిరహసముద్రమును దాఁటుదును వానినెట్లుచేరుదును. చేరఁదగిననోము నేమియు నోమనైతిని కాఁబోలు దైవమా వానికౌఁగిలి నాకులభించుమార్గమేదో దానింజూపి కావుమని వరూథిని దుఃఖించెను అలం పరిణామము,విషమమును.

ఉ. కమ్మనికుందనంబు కసుఁగందనిమే నెలదేఁటిదాఁటులన్
బమ్మెరవోవఁ దోలుఁ దెగబారెఁడువెండ్రుక లిందుబింబమున్
గిమ్మన నీదు మోము గిరిక్రేపులు మూఁపులు కౌను గానరా
దమ్మకచెల్ల వానివికచాంబకముల్ శతపత్రజైత్రముల్. 6

అ, అమ్మకచెల్ల=ఔరా, వాని=వానివైన (ఇది మీఁదివానికన్నిటికిని జేర్చుకోఁదగినది), కసుగందనిమేను=కొంచమైనవాఁడు (లేక నైల్యము)లేనిశరీరము, కమ్మనికుందనంబు=పరిమళించునట్టియపరంజివలెమనోహరమైనది, తెగబారెఁడువెండ్రుకలు- తెగ=నిడుపునందు, బారెఁడు=బారకొలఁదియైన, వెండ్రుకలు=తలవెండ్రుకలు, ఎలదేఁటిదాఁటులన్=కొదమతుమ్మెదలబారులను, బమ్మెరవోవన్=భ్రమపడునట్టుగా, తోలున్=తఱుమును, మోము = ముఖము, ఇందుబింబమున్ = చంద్రమండలమును, కిమ్మననీదు=ఏమియని నోరెత్తిమాటాడనీయదు- తిరస్కరించుననుట. మూఁపులు = భుజశిరస్సులు- బుజములమీఁద నెత్తుగానుండెడి యవయవములు, గిరిక్రేపులు = పర్వతశిఖరములు- మిక్కిలియున్నతములనుట కౌను=నడుము, కానరాదు=అగపడ నేయగపడదు- మిక్కిలిసన్నమనుట, వికచాంబకముల్=వికసించిన (తేటలయిన) కన్నులు, శతపత్రజైత్రముల్=కమలములను జయించునవి.

తా ఔరా యాబ్రాహ్మణుని సౌందర్య మేమనవచ్చును! వానిదేహము పరిమళించునట్టిమేలిమి బంగారువలె మనోహరము వానితలవెండ్రుకలు తుమ్మెదలబారో యనునట్లు నెఱుఁగలిగి నల్లనై బారెఁడునిడుపుగలిగి యొప్పుచున్నవి. మొగము కళాతిశయముచేతఁ జంద్రబింబమును దిరస్కరించుచున్నది. మూఁపులు కొండకొమ్ములవలె మిక్కిలి యున్నతములై యున్నవి కన్నులు తేటలై తామరలను దిరస్కరించుచున్నవి అలం. ఉత్ప్రేక్ష, ఉపమ, రూపకము, అతిశయోక్తియును.

ఉ. చొక్కపుఁబ్రాయమున్ మిసుల సోయగమున్ గలప్రాణనాయకున్
నెక్కుడువశ్యతన్ రతుల నేకట దీర్చి సమేళ మొప్పఁగా
నక్కున గారవించి ప్రియ మందఁగ నోఁచనియింతి నైనయా
చక్కఁదనం బదేమిటికి జవ్వన మేటికిఁ బ్రాణ మేటికిన్

అ. చొక్కపుఁబ్రాయముఁ = స్వచ్ఛమయినయౌవనమును - నిండినయౌవనమును, మిగులన్ = మిక్కిలి, సోయగముఁ = సౌందర్యమును, కలప్రాణనాయకుండు = కలిగినట్టిప్రియభర్త, ఎక్కుడు వశ్యతన్ = మిక్కిలిస్వాధీనత్వముతో, రతులన్ = సంభోగములందు, ఏఁకట = అపేక్షను, తీర్చి = నెఱవేర్చి, సమేళము=ఏకీభావము-ఒకటిగాఁ గలసియుండుట, ఒప్పఁగాన్ =అమరునట్లు, అక్కునన్ = ఱొమ్మునందు - ఱొమ్ముపైని జేర్చుకొని యనుట, గారవింపన్ = గౌరవముచేయఁగా, ప్రియము = ప్రేమను, అందఁగన్ = పొందునట్లు, నోఁచని=నోఁచుకొనని - అట్టియదృష్టములేని, ఇంతిది= స్త్రీది, ఐనయాచక్కఁదనంబది = అయినట్టియాసౌందర్యము, ఏమిటికిన్ = ఎందులకు, జవ్వనము=యౌవనము, ఏటికిన్ =ఎందులకు, ప్రాణము=ఊసులు, ఏటికన్ =ఎందులకు-వ్యర్థమనుట.

తా. చక్కఁదనముగలదైన యౌవనస్త్రీకిఁ దానువలచినపురుషుఁడు మిక్కిలి స్వాధీనుఁడై సంభోగమునందలియపేక్ష తీర్చి ఱొమ్మున నదిమి కౌఁగిలించుకొని లాలించునట్టియదృష్టమును బొంది సుఖింపఁ వలయుఁగాని యట్టియదృష్టము లేనిదానిచక్కఁదనమును యౌవనమును బ్రదుకును వ్యర్థములగును గనుక నట్టియువతి జీవించియుండుటకంటెఁ జచ్చుటయే మేలు. అలం. అప్రస్తుతప్రశంస

ఉ. ఎంతతపంబుసేసి జనియించినవారొకొ మర్త్యభామినుల్
కాంతుఁ డవజ్ఞ సేసినను గాయము వాయుదు రేనమర్త్యనై
చింతల వంతలం జివికి సిగ్గఱితిన్ మృతి లేనినాఁడు చె
ల్వింతయు శూన్యగేహమున కెత్తినదీపిక యయ్యె నక్కటా 8

అ. మర్త్యభామినుల్ =మనుష్యస్త్రీలు, ఎంతతపంబుసేసి = ఎంతటిఘోరమయిన తపస్సుచేసి, జనియించినవారొకో = పుట్టినవారో, కాంతుఁడు = ప్రియుఁడు, అవజ్ఞ=అవమానము, చేసినన్ =చేసినపక్షమున, కాయము=దేహమును, వాయుదురు = విడుతురు, ఏన్ = నేను, అమర్త్యనై = చావులేనిదేవతాస్త్రీనై, చింతలన్ = విచారములచేతను, వంతలన్ =అవిచారములచేనైన సంతాపములచేతను, చివికి = నవసి, సిగ్గఱితిన్ = సిగ్గుచెడినదాననైతిని, అక్కటా=అయ్యో, మృతి = చావు, లేనినాఁడు చెల్వు = లేకుండునట్టి నాయొక్క సౌందర్యము, ఇంతయున్ = ఈయంతయును-సర్వమును, శూన్యగేహమునకున్ = పాడుపడినయింటికి, ఎత్తినదీపిక=పెట్టినట్టి దివ్వెవంటిది, అయ్యెన్ =ఆయెను

తా. మనుష్యస్త్రీలు చావుగలవారు గనుకఁ దమకుఁ బ్రియుఁడు[illegible]పురుషుఁ డవమానము చేసినయెడలఁ దోడనే దేహత్యాగముచేయుదురు. అంతటితో వారివిచారము తీఱును. [illegible] దేవతాస్త్రీనగుటచేతఁ జావు లేనిదాననై బహువిధముల విచారపడి తపించుచు సిగ్గుమాలి యలయుచున్నాను అయ్యో! ఇట్లు చావులేనిదాననైన నాచక్కఁదన మెంతగలదో యంతయుఁ బాడింటికి [illegible]యుండియుఁ బ్రయోజనము లేనట్లు ప్రయోజనములేని దాయెనే మనుష్యస్త్రీలు చావనెడి సాధనము[illegible]డుటకై యెంతకఠినతపస్సుచేసి జనించిరోకదా అలం. ఉత్ప్రేక్ష, లేశము, పరికరాంకురము, నిదర్శనయును

వ. అని వితర్కించుచుం గ్రించుఁదనంబునం బునఃపునఃపరిభవకారి యై కాఱియుం బెట్టుసిరిపట్టి బెట్టేయుం గాఁడి చనునలరంపకట్టియుల గుట్టు చెడి వెచ్చవెచ్చనై హెచ్చి విచ్చలవిడిం గాయునుద్దామవిరహదవదహనదాహంబున దేహంబు తల్లడిల్ల మల్లడి గొని పెల్లడరునిట్టూర్పుగాడ్పువిసరులం గస రెత్తి యంతకంత

కంతురంగంబున నింతం దనరాక పొంగి చింతాసాగరంబు వేగిరంబ వెల్లివొడిచె ననం దుడిచిన నడంగక సారెకుం దారకల నీరిక లెత్తుపొగరన నిగనిగ లినుమడిగ నిగుడ మిగులువగల బుగులుబుగుల్లున నెగసి యెగసి యొప్పులకుప్ప లగుతెప్పలం జిప్పిలుకాటుక లప్పళించి కరంచి దరదళదరుణకమలదళశోణంబు లగుదృక్కోణంబులం దిగువాఱుకన్నీరు చెన్నారుకర్ణద్వయీగోళంబులు నిండి తనుతాపతప్తం బగుహాటకతాటంకయుగళంబునం బడి క్రొంబొగ లెగయింప బిసకిసలయసగంధం బగుమణిబంధంబునఁ జికురబంధంబుఁ జేర్చుకొని పొరలం దుఱిమిన విరు లురుల నరవిరిసి కవిసి యిరులుకొనుగరగరని నెఱికురులు గుఱి గడవఁ బెరిఁగిన వగుటం జేసి రాశి వడి మెయి మూసికొని గ్రహగణంబులం జెన్నగుమిన్ను విఱిగి పయిం బడినవడువున బెడంగువడఁ గలయం దలకొనుపులకమొలకపయిరునకుం బొఱుదుర్వారవారిపూరం బనం గ్రమక్రమంబున నంగంబులం గ్రమ్ముచెమ్మటల మిన్నేటిపెన్నేటివఱ్ఱున మునుంగకుండ నవరించిన మించుకుంభప్లవం బనం బరిభ్రష్టోత్తరీయం బై బయలువడి యబ్బురంపుగుబ్బచనుదోయి నిబ్బరంపుమెఱుంగు లీనం గుపితహరనయనశిఖిశిఖాభస్మీకృతస్మరవిరహశోకంబునం బడి చందురునిం బట్టుకొని యడలురతిరమణిచందంబునం గుసుమితలతాంతనిశాంతశశికాంతవేదికాంతరంబున మేను సేర్చి వివిధదశాంతరంబుల వేఁగుచుండె నంత. 9

అ. అని=ఇట్లని, వితర్కించుచున్ = తనలోఁ దా నూహించుకొనుచు, క్రించుఁదనంబునన్ = నీచత్వముచేత, పునఃపునః = మాటిమాటికిని, పరిభవకారియై = తిరస్కారము చేయువాఁడై, కాఱియం బెట్టుసిరిపట్టి = బాధపెట్టునట్టిమన్మథుఁడు, బెట్టు = తఱుచుగా, ఏయన్ = ప్రయోగింపఁగా, కాఁడి=నాటి, ననువలరంపకట్టియలన్ =దూసిపోవుచున్న పుష్పబాణముల చేత,(ఇందుఁ గట్టియశబ్దము నిరర్థకము, ఇది ధ్వంసకోలవంటిది.)గుట్టుచెడి=మర్మము చెడి, నెచ్చనెచ్చనై =కొంచెముకొంచెము వేఁడిమిపుట్టి, హెచ్చి = క్రమముగా నతిశయించి, విచ్చలవిడిన్ =యథేచ్ఛముగా-మిక్కిలి యధికముగా, కాయు . దాహంబునన్ కాయు=కాయుచున్నట్టి, ఉద్దామ=అణఁపరాని, విరహ=వియోగ మనెడి, దవదహన=అడవిపిలనఁ బుట్టినచిచ్చుయొక్క, దాహంబునన్ = తాపముచేత, దేహంబు=శరీరము, తల్లడిల్లన్ =బెదరఁగా, మల్లడిగొని=ముప్పిరిగొని-క్రిక్కిఱిసియనుట, పెల్లు=మిక్కిలి, అడరు విసరులన్ - అడరు=అతిశయించుచున్న, నిట్టూర్పు=దీర్ఘశ్వాసములవలని, గాడ్పు=గాలియొక్క, విసరులన్ = వడిగావీచుటలచేత, కసరు=వానగాలి-తుపాను, ఎత్తి=రేఁగి, అంతకంతకున్ =అప్పటప్పటికి, అంతరంగంబునన్ =హృదయమునందు, ఇంతంతనరాక=ఇంత అంత అని చెప్పశక్యముగాక-మేరలేక యనుట, పొంగి=ఉప్పొంగి, చింతాసాగరంబు=దుఃఖమనెడిసముద్రము, వేగిరంబ=శీఘ్రముగానే, వెల్లివొడిచెనన్ =ప్రవహించెనో యనునట్లు, తుడిచినన్ =వస్త్రపుఁగొంగుతోఁ దుడిచినను,అడంగక=అణఁగక-నిలువక, సారెకున్ = మాటిమాటికి, తారకలన్ = కంటినల్లనిగ్రుడ్లవలననుండి, ఈరిక లెత్తు=మొలక లెత్తునట్టి-పుట్టునట్టి, పొగరు=(నల్లని)వర్ణమో, అనన్ =అనునట్లు, నిగనిగలు = నిగనిగనికాంతులు, ఇనుమడిగన్ = ఇబ్బడిగా, నిగుడన్ = వ్యాపింపఁగా, మిగులువగలన్ = మితిమీఱినవిచారములచేత,బుగులుబుగులునన్ = బుగులు బుగు లనుకరణముతో, ఎగసి=పైకి వ్యాపించి, ఒప్పులకుప్పలు=చక్కఁ

దనపురాసులు, అగు చిప్పలన్ = అగునట్టి చిప్పలవలననుండి, చిప్పిలుకాటుకలు = మీఁదికి వెడలుచున్న కాటుకలను, అప్పళించు = ఆక్రమించి, కరంచు = కరఁగించి, దరదళ...శోణంబులు- దరదళత్ = కొంచెమువికసించుచున్న, అరుణకమల = ఎఱ్ఱదామరలయొక్క, దళ = రేకులవలె, శోణంబులు = ఎఱ్ఱగానుండునవి, అగుదృక్కోణంబులన్ = అగునట్టికనుఁగొలకులనుండి, దిగువాఱుకన్నిరు = క్రిందికి జారుచున్నకన్నీరు, చెన్నారు...గోళంబులు- చెన్నారు = అందగించుచున్న, కర్ణద్వయీ = రెండుచెవులయొక్క, గోళంబులు = రంధ్రములు, నిండి = నిండుకొని, తనుతాపతప్తంబు= మేనికాఁకచేతఁ గాఁచఁబడినది, అగుహాటకతాటంకయుగళంబునన్ = అయినట్టిబంగారుకమ్మలజతమీఁద, పడి=చింది, క్రొంబొగలు = క్రొత్తపొగలను, ఎగయింపన్ = లేపఁగా, బిసకిసలయసగంధంబు = తామరమోసులనుబోలినది, అగుమణిబంధంబునన్ = అయినమణికట్టునందు, చికురబంధంబు= తలవెండ్రుకలముడిని - కొప్పును, చేర్చుకొని = పొందించుకొని - పెట్టుకొని, పొరలన్ = పొర్లునట్లు, తుఱిమినవిరులు = చెరివినపువ్వులు, ఉరులన్ = రాలునట్లు, అరవిరిసి = సగమువీడి, కవిసి = పర్వి, ఇరులుకొను...నెఱికురులు - ఇరులుకొను = చీఁకటిక్రమ్ముచున్న, గరగరని = మనోహరమైన-అందమైన, నెఱికురులు = వంకర (నొక్కులుగల) తలవెండ్రుకలు, గుఱి = మేర, కడవన్ = మీఱునట్లు, పెరిఁగినవి = ఎదిగినవి, అగుటంజేసి = అవుటచేత, రాశివడి = ప్రోగై, మెయి = దేహమును, మూసికొని= క్రమ్ముకొని, గ్రహగణంబులన్ = అంగారకాదిగ్రహనక్షత్రసమూహములచేత, చెన్నగుమిన్నుం = ఒప్పుచున్నయాకాశము, విఱిఁగి = తునిఁగి, పయిన్ = తనమీఁద, పడినపడువునన్ = కూలినవిధమున, బెడంగువడన్ = అందగించుచుండఁగా, కలయన్ =అంతటను, తలకొను . పైరునకున్ - తలకొను=కలుగుచున్న, పులక = రోమాంచమనెడి, మొలకపయిరునకున్ = మోసులెత్తుచున్నపైరునకు, పాఱుదుర్వారవారిపూరంబు - పాఱు = ప్రవహించునట్టి, దుర్వార = అడ్డపాటులేని, వారిపూరంబు = జలప్రవాహమో, అనన్ = అనునట్టుగా, క్రమక్రమంబునన్ = వరుసవెంబడిని, అంగమ్ములన్ = అవయవములందు, క్రమ్ము...వట్టునన్ - క్రమ్ము=ఆవరించునట్టి, చెమ్మటల = చెమటనీటిచేనైన, మిన్నేటి = ఆకాశగంగయొక్క, పెన్నీటి=అధికజలముయొక్క, వట్టునన్=వఱదయందు, మునుంగవడన్ = మునిఁగిపోకుండునట్లు, సవరించిన . ప్లవంబనన్ - సవరించినన్=జతపఱుపఁగా, మించు=అతిశయించునట్టి, కుంభప్లవంబు = కుండలుబోరగించికట్టినతెప్పయో, అనన్=అనునట్లు, పరిభ్రష్టోత్తరీయంబయి=జాఱినపయఁటగలదై, బయలువడి = బయటఁబడి, అబ్బురపు చనుంగవ-అబ్బురపు=ఆశ్చర్యమైన, సిబ్బెంపు=సొబగలిగిన, గబ్బి = బిగువుగల, గుబ్బ=పట్రువైన, చనుంగవ = స్తనద్వయము, నిబ్బరపు మెఱుంగులు=అధికమయినకాంతులను, ఈనన్ = పుట్టించుచుండఁగా, కుపిత . శోకంబునన్ -కుపిత=కోపించిన, హర = రుద్రునియొక్క, నయన = (నొసటి) కంటిదైన, శిఖి=అగ్నియొక్క, శిఖా = జ్వాలచేత, భస్మీకృత = నీఱుసేయఁబడిన, స్మర=మన్మథునియొక్క, విరహ=ఎడఁబాటువలని, శోకంబునన్ =దుఃఖమునందు, పడి=పడినదై, చందురునిన్=చంద్రుని, పట్టుకొని = పట్టుకొన్నదై, అడలు చందంబునన్ - అడలు=ఏడ్చుచున్న, రతిరమణిచందంబునన్ = రతీదేవివలె, కుసుమిత వేదికాంతరంబునన్ - కుసుమిత = పూచిన, లతానిశాంత = తీఁగయింటియందలి, శశికాంత=చంద్రకాంతపు రాళ్లచేఁ గావింపఁబడిన, వేదికాంతరంబునన్ = అరుఁగుమీఁద, మేనుసేర్చి=దేహమువైచి-పండుకొని, వివిధదశాంతరంబులన్ - వివిధ = నానావిధములయిన, దశాంతరంబులన్ = అవస్థాభేదములచేత, వేఁగుచున్ = తపించుచు, ఉండెను, అంతన్=అప్పుడు

తా. అని యిట్లు వరూథిని తనలోఁదాను వితర్కించి యప్పటప్పటికి విరహవేదన హెచ్చఁగా, దేహమునందుఁ గాఁక హెచ్చివణఁకుపుట్టఁగా, నందులకునోర్వక నిట్టూర్పువిడుచుచు నెడతెగక కన్నీళ్లువిడుచుటచేత నా కన్నీళ్లు కన్నులకాటుకతోఁగలసి నలుపై నిగనిగలాడుచు నల్లనికనుగ్రుడ్లనుఁగాంతియో యననొప్పి ప్రవాహరూపమునఁ జెక్కిళ్లగుండఁ జెవులకు జారి చెవికమ్మలను దడుపుచుండఁగాఁ, జేతిమణికట్టుపైఁ దలపెట్టుకొని వార్లిపోవునట్టుగాఁ బెట్టుకొన్న పువ్వులురాలఁగాఁ, గొప్ప నగను వీడుటచే వెంద్రుకలు విరిసి దేహమునావరించి గ్రహనక్షత్రాదులతోడ మిన్నువిఱిగి మీఁదఁబడ్డట్టుకాఁగా, దిగులుపడి దేహమునందుఁ జెమటయు రోమాంచమును మించఁగా, బైఁటకొంగు తొలఁగిపోవుటయు నెఱుఁగక శివుని కంటిమంటలచేతఁ గాలినమన్మథునియెడఁబాటుచేత వానికి మిత్రుఁడైనచంద్రునిఁబట్టుకొని యేడ్చుచున్నరతీదేవియో యనునట్లు చంద్రకాంతపురాళ్లయరుఁగుమీఁదఁ బడి యేడ్చుచు బహువిధములయిన మనస్సంగజాగరకృశత్వాదిమన్మథావస్థలం బొందుచుఁ దపించుచుండెను. (మన్మథావస్థలు - చక్షుఃప్రీతి, మనస్సంగము, సంకల్పము, జాగరము, కార్శ్యము, విషయవిద్వేషము, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మరణము, అని పది) - అలం. (వెచ్చవెచ్చనైవిచ్చలవిడింగాయు - ఇక్కడ పరిణామము. చింతాసాగరంబు వెల్లివిరిసెననఁ - ఇట రూపకోత్ప్రేక్షలు అరుణకమలదళశోణంబులు - ఇచ్చట ఉపమ. హాటకతాటంకయుగళంబునంబడి క్రొంబొగ లెగయుంపఁ - ఇట అతిశయోక్తి. బిసకిసలయసగంధంబు - ఇట ఉపమ. కుచలు.. బెడంగువడఁ, పాయుదుర్వారవారిపూరంబనఁ, ఈచోటుల నుత్ప్రేక్ష. చెమటలమిన్నేటి, పులకమొలకపయిరు - ఈచోటులరూపకము. కుంభప్లవంబనఁ - ఇక్కడ ఉత్ప్రేక్ష. రతిరమణిచందంబునఁ - ఇక్కడ ఉపమ)

చ. తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గము సేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో ననిరోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్. 10

అ. తరుణిన్ = లేఁతప్రాయముగలదానిని, అనన్యకాంతన్ = అన్యభర్తలేనిదానిని - ఒకపురుషుని కధీనురాలుకానిదానిని, అతి వివశాంగిన్ - అతి = మిక్కిలి, దారుణ = భయంకరమయిన - ఇది వ్యథకు విశేషణము, పుష్పశిలీముఖ = పువ్వులు బాణములుగాఁగలమన్మథునియొక్క, వ్యథాభర = బాధయొక్క యతిశయముచేత - అధికమైనబాధచేతననుట, వివశ = పరవశమైన - స్మృతితప్పిన, అంగిన్ = దేహముగలదానిని, అంగభవుబారికిన్ = మన్మథబాధకు, అగ్గము సేసి = లోఁబఱచి, క్రూరుఁడై = కఠినుఁడై, మహీసురాధముఁడు = నీచబ్రాహ్మణుఁడు - ప్రవరాఖ్యుడు, అహంకృతితోన్ = గర్వముతో, అరిగెన్ = పోయెను, అని, రోషభీషణస్ఫురణన్ - రోష = కోపముచేత, భీషణ = భయంకరమైన, స్ఫురణన్ = తేజస్సును, వహించెనో = తాల్చెనేమో, అనన్ = అనునట్లు, నభోమణి = సూర్యుఁడు, కషాయదీధితిన్ = ఎఱ్ఱనికాంతిని, దాల్చెన్ = ధరించెను

తా. ప్రవరుఁడు లేఁతప్రాయముగలిగి యొకనికిభార్యగాక తనకు భోగింపఁదగినదై తన్నువలచి వరూథినిని గూడక యన్యస్త్రీ యనునిమిత్తమును గల్పించుకొని దానిని మన్మథబాధకు లోఁబఱచి పోయె నను కోపముచేత నెఱ్ఱఁదనమును బొందెనో యనునట్లు ఎఱ్ఱగా సూర్యుఁడు ప్రకాశించెను ప్రవరుఁడు వరూథినిని విడనాడుట దోషమనియు సత్పురుషులు దానికి సహింపరు గాన సూర్యుఁడు

కోపించినవాఁడయ్యెననియు సంబంధము సూర్యుఁ డెఱ్ఱగా వెలిఁగెననుటచేత సూర్యాస్తమయసమయ మయ్యె నని భావము. అలం పరికరము, ఉత్ప్రేక్ష, కావ్యలింగము

సీ. ఉరుదరీకుహరసుప్తోత్థశార్దూలముల్, ఝరవారి శోణితశంకఁ ద్రావ
వనకుంజమధ్యశాద్వలచరన్మృగపంక్తి, దావపావకభీతిఁ దల్లడిల్ల
నాశ్రమాంతరభూరుహాగ్రముల్ మునికోటి, బద్ధకాషాయవిభ్రాంతిఁ జూడ
ఘనసానుశృంగశృంగాటకంబులఁ గాంచి, యమరులు హేమాద్రి యనుచు వాలఁ
గాసెఁ బేశలరుచిఁ గింశుకప్రవాళ, ఘుసృణకిసలయకంకేళికుసుమగుచ్ఛ
బంధుజీవజపారాగబాంధవంబు, లన్నగంబున జరఠారుణాతపములు. 11

అ. ఉరు శార్దూలముల్ - ఉరు = పెద్దవైన, దరీకుహర = బొక్కలవలెనుండెడి గుహలయందు, సుప్త = నిద్రించినవై, ఉత్థ = లేచిన, శార్దూలములు = పెద్దపులులు, ఝరవారిన్ = సెలయేళ్లయందలి నీటిని, శోణితశంకన్ = నెత్తురనెడి భ్రాంతిచేత, త్రావన్ = త్రాగఁగా - పులులు గుహలయందు నిద్రించి నిద్ర మత్తు తీఱక మునుపే బయిటికి వచ్చి యెఱ్ఱగాఁ గనఁబడుచున్న సెలయేటినీళ్లను జూచి నెత్తురని భ్రమించి త్రాగఁగా ననుట; వన. పంక్తి - వన = అడవియందలి, కుంజ = పొదరిండ్లయొక్క, మధ్య = నడిమి ప్రదేశమునందలి, శాద్వల = పచ్చికనేలలందు, చరత్ = మేయుచున్న, మృగపంక్తి = జింకలగుంపు, దావపావకభీతిన్ = కారుచిచ్చనెడి భయముచేత, తల్లడిల్లన్ = చలింపఁగాను - అడవియందుఁ బొదరిండ్లనడిమి పచ్చికనేలలందు మేయుచున్న జింకలు చుట్టునున్నపొద లెఱ్ఱగాఁ గాన్పించుటచేతఁ గార్చిచ్చు మండుచు వచ్చుచున్నదని భ్రమపడి వెఱచి పాఱఁగా ననుట, ఆశ్రమాంతరభూరుహాగ్రములు - ఆశ్రమ = మునిపల్లెలయొక్క, అంతర = మధ్యభాగములందున్న, భూరుహ = వృక్షములయొక్క, అగ్రములు = కొనలను, మునికోటి = మునులసమూహము, బద్ధకాషాయవిభ్రాంతిన్ = ఎండఁగట్టిన కావివస్త్రములనెడి భ్రమచేత, చూడన్ = చూడఁగాను - (యతులు తమయాశ్రమములందలి వృక్షములకొన లెఱ్ఱగాఁ గనఁబడుటచేఁ దమకావికోకలెండఁగట్టి విప్పమఱచితిమా యని భ్రమించి చూడఁగా ననుట) ఘన శృంగాటకంబులన్ - ఘన = గొప్పవైన, సాను = చఱియలను, శృంగ = శిఖరములను, శృంగాటకంబులన్ = చదుకములను - నాలుగుదారులు కలియుచోట్లను, కాంచి = చూచి, అమరులు = దేవతలు, హేమాద్రి యనుచున్ = బంగారుకొండ యని (తమ నివాసస్థానమయిన మేరు పర్వతమని), వాలన్ = (విమానములనుండి) దిగిరాఁగాను - విహారార్థము విమానము లెక్కి యాకాశమునందు విహరించుచున్న దేవతలు చఱియలు శిఖరములు చదుకములు బంగారు చాయతోఁ గనఁబడఁగా హిమవంతమునే మేరువుగాఁ దలఁచి దానిమీఁదికి దిగఁగా ననుట, అన్నగంబునన్ = అమంచుకొండయందు, కింశుక . బాంధవంబులు - కింశుక = మోదుగపువ్వులయొక్కయు, ప్రవాళ = పగడములయొక్కయు, ఘుసృణ = కుంకుమపువ్వుయొక్కయు, కిసలయ = చిగుళ్లయొక్కయు, కంకేళి కుసుమగుచ్ఛ = రక్తాశోకపుష్పముల గుత్తులయొక్కయు, బంధుజీవ = మంకెనపువ్వులయొక్కయు, జపా = దాసానిపువ్వులయొక్కయు, రాగ = ఎఱుపునకు, బాంధవంబులు = చుట్టములు - ఆయెఱుపునుబోలినవియైన, జరఠారుణాతపములు = వృద్ధుఁడైన సూర్యుని వెలుఁగులు - సంధ్యాకాలపు ముదిరిన యెండలు, పేశలరుచిన్ = వేఁడిమిలేని కాంతితో, కాసెన్ = ప్రకాశించెను - అనఁగా సూర్యాస్తమయసమయమునందుఁ గాయుచున్న యెండ యెల్లవస్తువులను ఎఱ్ఱగాఁ గనఁబడున ట్లెల్లయెడలను వ్యాపించి వేఁడిమిలేక ప్రకాశించెనని తాత్పర్యము. అలం భ్రాంతిమంతము, ఉపమయును.

శా. శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బాఱెం బక్షు లుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణ మయ్యె మృగతృష్ణావార్ధు లింకెన్ జపా
శోణం బయ్యెఁ బతంగబింబము దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణం బయ్యె సరోజషండములు నిద్రాణంబు లయ్యెం గడున్. 12

అ. పక్షులు = పులుఁగులు, నభోంతరాళమునన్ = ఆకాశమధ్యమునందు, శ్రేణుల్ గట్టి = బారులుదీరి, పాఱెన్ = పఱచెను, ఉష్ణాంశుపాషాణవ్రాతము = సూర్యకాంతపురాళ్ల సమూహము, కోష్ణము = ఇంచుక వేఁడిమిగలది, అయ్యెన్ = ఆయెను, మృగతృష్ణావార్ధులు = ఎండమావు లనెడి సముద్రములు- సముద్రములవలెఁ దోఁచుచున్నయెండమావులు, ఇంకెన్ = పట్టిపోయెను- కనఁబడక పోయెననుట, పతంగబింబము = సూర్యమండలము, జపాశోణంబు = దాసానిపువ్వువలె నెఱ్ఱనైనది, అయ్యెన్ = ఆయెను, దిశాస్తోమంబు = దిక్కులయొక్క సమూహము, శోభాదరిద్రాణంబు = కాంతిచేతఁ బేదఱికమునొందినది- కాంతిలేనిది, అయ్యెన్ = ఆయెను, సరోజషండములు = కమలముల సమూహములు, కడున్ = మిక్కిలి, నిద్రాణంబులు = నిద్రనుబొందినవి- ముకుళించినవి, అయ్యెన్ = ఆయెను

తా. పక్షులు మేఁతకుఁ బోయినతావులనుండి తమతమయునికితావులకు బారులుదీరి పఱవఁగా, నెండసోఁకి మండుచున్న సూర్యకాంతపురాళ్లు చల్లఁదనము నొందుచుండఁగా నెండమావులణఁగిపోఁగా దిక్కులఁ గాంతి తఱుఁగఁగాఁ, గమలములు ముడుఁగఁగా, సూర్యమండల మెఱ్ఱవాఱెను. అనఁగాఁ బ్రొద్దుగ్రుంకుసమయ మయ్యెను. అలం. స్వభావోక్తి, పరిణామము, ఉపమయును.

క. తరణి యిదె గ్రుంకుచున్నాఁ, డరు దెమ్మని చంద్రుఁ బిల్వ నరిగెడు రజనీ
తరుణీమణిదూతిక లన, నరిగెం దూర్పునకు నీడ లతిదీర్ఘము లై. 13

అ. తరణి = సూర్యుఁడు, ఇదె = ఇదిగో, గ్రుంకుచున్నాఁడు = అస్తమించుచున్నాఁడు, అరుదెమ్ము = (నీవు) రమ్ము, అని = అనిచెప్పి, చంద్రున్ = చందమామను, పిల్వన్ = పిలుచుటకై, అరిగెడు . దూతికలు- అరిగెడు=పోవుచున్న, రజనీ=రాత్రియనెడి, తరుణీమణి=ఉత్తమస్త్రీయొక్క, దూతికలు=కుంటెనకత్తెలో, అనన్ = అనునట్లు, నీడలు = మనుష్యాదులనీడలు, అతిదీర్ఘములై = మిక్కిలి నిడుపులై, తూర్పునకున్ = తూర్పుదిక్కునుగూర్చి, అరిగెన్ = పోయెను.

తా. సాయంకాలమునందుఁ దూర్పుతట్టునకు మిక్కిలి నిడుదలై ప్రసరించునట్టి మనుష్యాదుల నీడలు రాత్రి యనెడు స్త్రీ తనప్రియుఁడయిన చంద్రుఁడు ప్రతాపవంతుఁడైన సూర్యుఁడనెడి శత్రురాజునకు వెఱచి మఱఁగియుండఁగా నీపగవాఁడు నశించుచున్నాఁడు నీవింక వెఱపు లేక యిప్పుడే రావచ్చునని ప్రియవిరహమును సహింపక యొకరివెంట నొకరినిగాఁ బంపినదూతికలో యనునట్లుండెను. అలం ఉత్ప్రేక్ష

క. క్రుంకె నపరాంబురాశిం, బంకజబంధుఁడు దదీయబడబాముఖవీ
క్షాంకురితకుతుకరథ్యాని, రంకుశవేగాపహృతశతాంగుఁడుఁ బోలెన్. 14

అ. పంకజబంధుఁడు = తామరలచుట్ట మయినసూర్యుఁడు, అపరాంబురాశిన్ = పడమటి సముద్రమునందు, తదీయ . . శతాంగుఁడుంబోలెన్ - తదీయ = ఆపడమటిసముద్రసంబంధియయిన- ఆపడమటిసముద్రమునందుండెడియనుట, బడబా = ఆఁడుగుఱ్ఱముయొక్క, ముఖ = మొగమును, వీక్షా=

చూచుటవలన, అంకురిత = మొలచిన - పుట్టిన, కుతుక = కుతూహలముగల-తమకముగల, రథ్యా= రథపుగుఱ్ఱములయొక్క, నిరంకుశ = అడ్డపాటులేని, వేగ = వడిచేత, అపహృత = కొనిపోఁబడిన, శతాంగుఁడుఁబోలెన్ = రథముగలవాఁడో యనునట్లు, గ్రుంకెన్ = అస్తమించెను.

తా. సూర్యుఁడు పడమటి సముద్రముఁ జేరఁబోవునపు డందు బడబాగ్నిని వహించినయాఁడుగుఱ్ఱపు మొగము గానవచ్చుటచేత దానిం గలయవలెనను తమకమున మగదయిన తన తేరిగుఱ్ఱము మిక్కిలి వేగముగా రథమునీడ్చుకొనిపోఁగా నాసముద్రమునందుఁ బడెనేమోయనున ట్లస్తమించెను. (సముద్రమునం దాఁడుగుఱ్ఱ మొకటియుండుటయు దానికడుపున బడబాగ్ని యనుపేర నగ్నియుండిసముద్రములో వచ్చి చేరునట్టి వాననీరంతయుఁ ద్రాగుననుటయుఁ బురాణప్రసిద్ధము సూర్యునిరథమునువహించునది సప్తయనుపేరుగల గుఱ్ఱ మొకటియే యని కొందఱును, ఏడుగుఱ్ఱములని కొందఱును జెప్పుదురు.) అలం. ఉత్ప్రేక్ష.

వ. ఆసమయంబున 15

సీ. ఏవిహంగముఁ గన్న * నెలుఁగించుచును సారె, కును సైకతంబులఁ * గూడఁదారుఁ
దారి కన్గొని యదిగ * తనజోడు గాకున్న, మెడ యెత్తి కలయంగ * మింట నరయు
నరసి కన్నీటితో * మరలి తామర యెక్కి, వదన మెండఁగ సరో * వారి నద్దు
నద్ది త్రావఁగ సైఁప * కట్టిట్టు గన్గొని, ప్రతిబింబ మీక్షించి * భ్రమసి యుఱుకు
నుఱికి యెఱకలుదడియ * వేఱొక్క తమ్మి, కరుగు నరిగి రవంబుతోఁ * దిరుగు తేంట్లఁ
బొడుచు ముక్కున మఱియును * బోవు వెదక, సంజఁ బ్రియుఁ బాసి వగ నొక్క * చక్రవాకి.

అ. ఒక్కచక్రవాకి = ఒకానొకచక్రవాక స్త్రీ - ఆఁడుజక్కవపక్షి, సంజన్ = సంధ్యాకాలమునందు, ప్రియున్ = ప్రియుఁడైనభర్తను - మగజక్కవను, పాసి= ఎడఁబాసి, వగన్ = విచారముతో, సైకతంబులన్ = ఇసుకదిన్నెలయందు, ఏవిహంగమున్ = ఏపక్షిని, కన్నన్ = వాలఁగాఁ జూచినను, ఎలుఁగించుచున్ = కూయుచు - తనకంఠస్వరముఁ దెలుపుకొనుచుననుట, సారెకున్ = మాటిమాటికి, కూడన్ = ఆచూచినపక్షినిగదియ, తారున్ = పోవును, తారి=అట్లుపోయి, కన్గొని = దానినిజూచి, అది=ఆపక్షి, తనజోడు=తనజతది, కాకున్నన్ = కాకపోఁగా, మెడయెత్తి=(అందుండి తనప్రియపక్షి యెగిరెనో యేమో యని) మెడపైకెత్తి, మింటన్ = ఆకాశమునందు, కలయన్ = అంతటను, అరయున్ = వెదకిచూచును, అరసి = వెదకిచూచి, కన్నీటితోన్ =(కనఁబడకపోయెనే యను దుఃఖముచేతఁ గలిగిన) కంటినీటితో, మరలి=తిరిగి, వచ్చి=(తాను మందున్న చోటికి) వచ్చి, తామరయెక్కి = తామరపువ్వుపైనెక్కి, వదనము=నోరు, ఎండఁగన్ =(అలఁచియలఁచి) తడియారిపోఁగా, సరోవారిన్ =కొలనినీటియందు, అద్దున్ =తడుపుకొనును, అద్ది=తడుపుకొని, త్రావఁగన్ = ఆనీళ్లుత్రాగుటకు, సైఁపక - (విరహవేదనచే) రుచింపక, అట్టిట్టు=అతట్టునితట్టును, కన్గొని = చూచి, ప్రతిబింబము = నీళ్లలోఁ గనఁబడెడితననీడను, ఈక్షించి= చూచి, భ్రమసి=(అది తనజతదైనమగపక్షి యని) భ్రమించి, ఉఱుకున్ =(దానిపైని) దుముకును, ఉఱికి = అట్లుదుమికి, ఎఱకలు= ఱెక్కలు, తడియన్ =(నీళ్లుతగిలి) తడియఁగా, వేఱొక్కతమ్మికిన్ =మఱియొక తామరపువ్వుమీఁదికి, అరుగున్ = పోవును, అరిగి=(మఱియొక తామరమీఁదికిఁ) బోయి, రవంబుతోన్ = ఝుంకారధ్వనితో, తిరుగు తేంట్లన్ =సంచరించునట్టి తుమ్మెదలను, ముక్కునన్ =తనముక్కుతో, పొడుచున్ =(వానియుల్లాసమునకు

సహింపక) పొడుచును, మఱియును=మరల, వెదకఁగ=(ప్రియుని) వెదకుటకు, పోవుఁగ = (ఇంకొకతట్టు) పోవును

తా. సాయంకాలమునందుఁ దనప్రియుఁడు భర్త నెడఁబాసిన యొకయాఁడుజక్కవ తనప్రియుఁ డుపోయిన జాడఁగానక యేపక్షినిజూచినను దనజతపక్షియే యని కదియఁబోవును అట్లు కదియఁబోయి చూచునెడ నది తనజత కాకున్న నంతలో నెగిరిపోయెనేమోయని మెడయెత్తి మింటిపెంకఁజూచును. మింటిపెంకఁ బాఱఁజూచియుఁ గనఁబడకున్న దుఃఖమునొంది కన్నీరుపెట్టుకొని కొలనియొద్దకువచ్చి యొక్క తామరపువ్వుపై వాలి యఱచియఱచి గొంతెండఁగాఁ దడిగలుగ నీళ్లలో గొంతుతడుపుకొని విరహవేదనచే నానీళ్లుసైతము త్రావుటకు రుచింపక దిక్కులు సూచుచుండ నీళ్లలోఁ దననీడఁ గానవచ్చెను ఆనీడ తనజతపక్షియేయని భ్రమసి దానిపై దుమికి ఱెక్కలు నీటఁదడియఁగా నందు నిలువక మఱియొక తామరపువ్వుమీఁదికిఁబోయి యందు ఝుంకారములు సేయుచుఁ దిరుగుచున్న తుమ్మెదలను జూచి వానిసంచారము తనకు సహింపకపోఁగా వానిని ముక్కుతోఁ బొడిచి తఱిమి యందును నిలువనొల్లక మరలఁ బ్రియుని వెదకుటకై మఱియొకప్రక్కకుఁ బోయెను. (పక్షిమాత్రమునకే యిట్టి విరహవేదన కలుగుచుండఁగా సౌందర్యవతియు యౌవనవతియు నైనవరూథినికి విరహోద్రేక మెటువంటిదిగానుండునో యనునది దీనిచే నూహ్యము చక్రవాకపక్షులకు రాత్రులు కన్నులుగానరావు గనుక నవి ప్రొద్దుగ్రుంకఁగా నప్పటికిపచ్చి తావుచేరనిమగపక్షి నెడఁబాసి వేదనపడుచుండుననుట సుప్రసిద్ధము.) అలం. స్వభావోక్తి, భ్రాంతిమంతమును.

సీ. రవిబింబపతనదీర్ణపయోధిగర్భని, ర్గతశేషఫణిఫణారత్నరుచియొ
దివసావసానసందీప్తాస్తగిరిశిఖా, జ్యోతిర్లతాప్రతానాతపంబొ
తపనధూర్దండనిర్దళితదిక్తటదృశ్య, కమలజాండకటాహకనకఘృణియొ
చండీశతాండవోత్సవసంభృతకపా,లహస్తాగ్రదీపగభస్తిచయమొ
ద్రాగ్ద్విదాహచ్ఛిదావినిద్రాణమదవ, దంజనాలానమూలశయ్యావిధాన
వారణాధోరణాకల్పితోరుశోణ,మృత్తికారాశియో యనమెఱసె సంధ్య. 17

అ. సంధ్య = సంధ్యారాగము, రవి ..రుచియొ-రవిబింబ=సూర్యబింబముయొక్క, పతన = పాటుచేత, దీర్ణ = పాయయిచ్చిన, పయోధి = సముద్రముయొక్క, గర్భ=లోపలిభాగమునందుండి, నిర్గత=బయలువెడలిన, శేషఫణి = (నాగలోకమునందుండెడి) శేషుఁడనెడిపాముయొక్క, ఫణా = పడగలయందలి, రత్న=మణులయొక్క, రుచియొ=కాంతియో, దివసా ఆతపంబొ-దివసావసాన = పగటియొక్కచివరయందు-సాయంకాలమునందు, సందీప్త=చక్కఁగాఁదేజరిల్లుచున్న, అస్తగిరి = పడమటికొండయొక్క, శిఖా=శిఖరములయందలి, జ్యోతిర్లతా=మెఱుఁగుడుఁదీఁగెలయొక్క (తీఁగలవలె వెలుఁగుచుండెడి జ్యోతులయొక్క యని కొందఱు. కొండమీఁదియడవులలో రాత్రులందు మెఱుఁగుడుఁదీఁగలు వెలుఁగుచుండును), ప్రతాన=సమూహముయొక్క, ఆతపంబొ=ప్రకాశమో, తపన...ఘృణియొ-తపన=సూర్యునియొక్క, ధూర్దండ = రథమునొగచేత, నిర్దళిత = భేదింపఁబడిన-మిక్కిలి పొడువఁబడిన, దిక్తట=దిక్కుయొక్కపార్శ్వభాగమునందు, దృశ్య = తోఁచునట్టి, కమలజాండ= బ్రహ్మాండమనెడి. కటాహ=పెద్దకాఁగుయొక్క, కనకఘృణియొ = బంగారుకాంతియో, చండీశ చయమొ-చండీశ=శివునియొక్క, తాండవోత్సవ=ఉద్ధతనాట్యోత్సవమునందు, సంభృత = పట్టుకొఁ

బడిన, క్షపా=రాత్రియనెడి స్త్రీయొక్క, హస్తాగ్ర=చేతికొనయందున్న, దీప=దివ్వెయొక్క-దివటీయొక్క, గభస్తి=కాంతులయొక్క, చయమో=సమూహమో, ద్రాక్...రాశియో - ద్రాక్=శీఘ్రముగా, విదాహ=విశేషమయినదప్పిని, భిదా=పోఁగొట్టుటయందు, వినిద్రాణ=హెచ్చరికతో నుండెడి, మదవత్=మదముగల, అంజన=అంజనమనెడిపశ్చిమదిగ్గజముయొక్క, ఆలాన=కట్టుఁగంబముయొక్క, మూల=మొదట, శయ్యావిధాన=పడుకపఱుచునట్టిపనియందు-పడుకవలె నేర్పఱిచినట్లున్న యనుట, వారుణ=వరుణునిసంబంధమైన, ఆధోరణ=మావటివానిచేత, ఆకల్పిత=చక్కఁగాఁ జేయఁబడిన, ఉరు=పెద్దదయిన-విశాలమైన, శోణమృత్తికారాశియో=ఎఱ్ఱమట్టిప్రోగో, అనన్=అనునట్టుగా, మెఱసెన్=ప్రకాశించెను. (మదమెక్కినకొలఁది యేనుఁగునకు దప్పి హెచ్చు ననియు నాదప్పి యెఱ్ఱమట్టిపైఁ బరున్న మానుననియు గజశాస్త్రమునందుఁ జెప్పఁబడియున్నది.)

తా. సాయంసంధ్యాకాలమునందుఁ బడమటిసముద్రమునందు సూర్యుఁడుపడుటచేఁ జాయ విచ్చినసందులనుండి మీఁదికివ్యాపించిన యాదిశేషునిపడగలయందలి రత్నములకాంతియో, పడమటికొండశిఖరములందు సూర్యకాంతులుతగ్గగానే వెలుఁగుచున్న మెఱుఁగుడుఁదీఁగెలవెలుఁగో, సూర్యుని రథము నొగతాఁకున బ్రద్దలుగాఁ జీలినదిక్కుమూలమున లోనికిఁ బ్రసరించిన బ్రహ్మాండమనెడి బంగారుకుండయొక్క స్వర్ణకాంతియో, శివుఁడు తాండవముచేయునప్పుడు పట్టఁబడిన దివటీప్రకాశమో, పడమటిదిగ్గజమునకు మదమెక్కి దప్పికలుగఁగా నాదప్పిదీర్చుటకొఱకుఁ బఱచిన యెఱ్ఱమట్టిపఱపో యనునట్లు సంధ్యారాగకాంతి వెలుఁగొందెను. అలం. ఉత్ప్రేక్ష.

క. బహుళజలప్లవమాన, ద్రుహిణాండము చెమ్మయుఱికి తీక్ష్ణార్కవిభా
రహితతఁ గాటుక పట్టెను, రహి చెడి యన నంధతమసరాసులు బెరసెన్. 18

అ. బహుళ...డము-బహుళ=అధికమయిన, జల=నీటియందు, ప్లవమాన=తేలుచున్న, ద్రుహిణాండము=బ్రహ్మాండము, చెమ్మయుఱికి=తడి దిగి, తీక్ష్ణ=తీక్ష్ణమైన, అర్కవిభా=సూర్యప్రకాశముయొక్క-ఎండయొక్క, రహితతన్=లేమిచేత, రహి=అందము, చెడి=నశించి, కాటుకపట్టెన్=నలుపుపాఱిపోయెను, అనన్=అనునట్లు, అంధతమసరాసులు=కటికిచీఁకటిప్రోవులు-దట్టమయిన చీఁకట్లు, బెరసెన్=ఆవరించెను.

తా. ఆవరణజలమునందుఁ దేలుచుండెడి బ్రహ్మాండము వేఁడిమి హెచ్చునకఱకు టెండ తగులకపోవుటచేతఁ జెమ్మగిల్లి నలుపుపాఱినదో యనునట్లు దట్టమయినచీఁకటి బ్రహ్మాండము నావరించెను. (తడిసినవస్తువు లెండసోఁకకున్నయెడ నలుపుపాఱిపోవుట యనుభవసిద్ధము) అలం. ఉత్ప్రేక్ష.

సీ. మృగనాభిపంకంబు మెయి నిండ నలఁదిన, మాయాకిరాతిమైచాయఁ దెగడి
నవపింఛమయభూష లవధరించి నటించు, పంకజాక్షునిచెల్వు సుంక మడిగి
కాదంబనికురుంబకలిత యై ప్రవహించు, కాళిందిగర్వంబుఁ గాకు సేసి
తాపింఛవిటపికాంతారసంవృత మైన, యంజనాచలరేఖ నవఘళించి
కవిసె మఱియును గాకోల కాలకంఠ, కంఠకలకంఠకరిఘటాఖంజరీట
ఘనఘనాఘనసంఘాతగాఢకాంతిఁ, గటికిచీఁకటి రోదసీగహ్వరమున. 19

అ. కటికిచీఁకట=గాఢాంధకారము (ఇది కర్తృపదము), మృగనాభిపంకంబు=అనుకుపదనుగా నున్నకస్తూరిని, మెయినిండన్=దేహమునందంతటను, అలఁదిన...చాయన్-అలఁదిన=పూసి

కొన్న, మాయాకిరాతి = కపటపుబోయదానియొక్క-కపటముగా బోయవేషము వేసికొన్న పార్వతియొక్క, (పా, మాయాకిరాతు=కపటపుబోయవాఁడయిన శివునియొక్క) మైచాయక్ = దేహకాంతిని, తెగడి=తిరస్కరించి-మించియనుట, నవపింఛమయభూషలు-నవ=క్రొత్తదైన, పింఛమయ=నెమలియీఁకల కుచ్చుతోఁ జేసిన, భూషలు=సొమ్ములను, అవధరించి=అంగీకరించి-పెట్టుకొని, నటించు .. చెల్వు-నటించు=నాట్యముచేయునట్టి, పంకజాక్షుని=కృష్ణునియొక్క, చెల్వు=అందమును, సుంకమడిగి=సుంకమిమ్మనియడిగి-తన్నుఁ బోలినందులకై సుంకమడుగునంతటియాధిక్యమును వహించి, (సుంకము=అమ్ముడుసరకుల నమ్ముకొనుటకై యిచ్చెడిపన్ను) కాదంబ కలితయై-కాదంబ=నల్లని ముక్కు కాళ్లు ఱెక్కలు గల హంసలయొక్క, నికురుంబ=సమూహముతోడ, కలితయై=కూడినదై, ప్రవహించు కాళిందిగర్వంబుక్ - ప్రవహించు=పాఱుచున్న, కాళింది=యమునానదియొక్క, గర్వంబుక్=అహంకారమును, కాకుసేసి=తిరస్కరించి, తాపించ సంవృతము- తాపింఛవిటపి=చీఁకటిమ్రాఁకులయొక్క, కాంతార=దట్టమయినయడవులచేత, సంవృతము=లెస్సగా నావరింపఁబడినది, ఐనయంజనాచలరేఖక్ = అయినయట్టికాటుకకొండయొక్కయాధిక్యమును, అవఘళించి = మించి, మఱియును=ఇంతేకాకయింకను, కాకోల... కాంతిక్ - కాకోల = మాలకాకులతోడను, కాలకంఠ కంఠ=నెమిళ్ల మెడలతోడను, కలకంఠ=కోవెలలతోడను,కరిఘటా=ఏనుఁగులగుంపుతోడను,ఖంజరీట=కాటుకపిట్టలతోడను,ఘన=దట్టమైన, ఘనాఘన=వర్షించుచున్న మేఘముతోను, సంకాశ = సరిపోలిన, గాఢ = అధికమయిన, కాంతిక్ =ప్రకాశముతో, రోదసీగహ్వరమునక్ = భూమ్యాకాశములయంతరాళమనెడి గుహయందు, కవిసెక్ =క్రమ్ముకొనెను.

తా. కపటముగా బోయదియయి కస్తూరిపూసికొన్న పార్వతీదేవి, నెమిలియీఁక లలంకారముగాఁ జేసికొన్న కృష్ణుఁడు, నల్లనిముక్కు కాళ్లు ఱెక్కలు గలహంసలతోఁ గూడినయమునానది, చీఁకటిమ్రాఁకులతోఁ బునదుమనున్న కాటుకకొండ, మాలకాకి, నెమిలిమెడ, కోయిల,కాటుకపిట్ట,వానకాలపుమబ్బు మొదలగువాని యాకృతులందుఁ గలమిక్కుటమైన నల్లఁదనమును మించిననల్లఁదనముతోఁ గాఱుచీఁకటియెల్లయెడలను గ్రమ్ముకొనియెను. అలం నిదర్శన. (ఇందు నలుపునకతిశయత్వము కలిగించుటకై మృగనాభిపంకమలఁదుట మొదలైనవి చెప్పఁబడియెను. అర్జునునికిఁ బాశుపతాస్త్రమిచ్చుటకు శివుఁడు పార్వతియుం దానును గిరాతవేషముతోఁ బ్రత్యక్ష మగుటయు, కృష్ణుఁడు నెమిలియీఁకలకుచ్చులను దాల్చి బృందావనంబున విహరించుటయుఁ బురాణప్రసిద్ధములు.)

క. అంతటఁ బ్రాచి నిశాపతి, యంతికగతుఁ డౌట విని ముఖాలంబితమః
కుంతలములు దీర్పఁగఁ గొను, దంతపుదువ్వెన యనంగ ధవళిమ దోఁచెన్ 20

అ. అంతటక్ = అట్లు చీఁకటియావరించినతోడనే, ప్రాచి = తూర్పుదిక్కనెడిస్త్రీ), నిశాపతి = రాత్రికిఁబతియైనచంద్రుఁడు, అంతికగతుఁడు = దగ్గఱకువచ్చినవాఁడు, ఔట=అగుట, విని=విన్నదై, ముఖాలంబితమఃకుంతలములు- ముఖ = ముందఱిభాగమనెడిముఖమునందు, ఆలంబి = వ్రేలుచున్న, తమః = చీఁకటియనెడి, కుంతలములు=ముంగురులను, తీర్పఁగక్ = దువ్వినవరించుకొనుటకు కొనుదంతపుదువ్వెన=తీసికొనునట్టి దంతముతోఁ జేసినదువ్వెన, అనంగక్ = అనునట్లు, ధవళిమ=తెల్లఁదనము, తోఁచెక్=కనఁబడెను-అనఁగాఁ జంద్రోదయమును సూచించుచుఁ దూర్పు తెల్లవాఱెననుట.

తా. అటుపిమ్మటఁ దూర్పుదిక్కనెడి స్త్రీ) తనసఖియయిన రాత్రియనెడి యువతికి భర్తయయిన చంద్రుఁడు తన్నుఁ జేరవచ్చుచున్నాఁ డనుమాటవిని తా నలంకారహీన యయి యుండనేరక

ముఖభాగమునం దావరించిన చీఁకటియనెడి ముంగురుల నెగదువ్వి సవరించుకొనుటకై చేతికిఁ దీసికొన్న దంతపుదువ్వెనయో యనునట్లు తూర్పుదిక్కునందుఁ దెలుపు వ్యాపించెను చంద్రోదయసమయమయ్యె నని భావము అలం. ఉత్ప్రేక్ష, రూపకమును

చ. మరున కొసంగఁ గాలము తమశ్ఛట గాటుక గా నవోదయ
స్ఫురదరుణప్రభాపథికశోణితసిక్తసితోడుభక్తముల్
హరిహయదిఙ్నభస్స్థలమునం బలి చల్లి వటాంకముల్ వసూ
త్కరభరితంబునై వెలుఁగఁ గాంచి సుధానిధి నెత్తె నత్తఱిన్. 21

అ. అత్తఱిన్ = ఆసమయమునందు, కాలము=సమయమనెడిపురుషుఁడు, మరునకున్ = మన్మథునకు, ఒసంగన్ = ఇచ్చుటకై, తమశ్ఛట = చీఁకటిరాశి, కాటుక=ధనసాధనాంజనము, కాన్ = కాఁగా, నవో. భక్తముల్ - నవ=క్రొత్తయయిన, ఉదయ=ఉదయముచేత, స్ఫురత్ = తేజరిల్లుచున్న-చంద్రోదయకాలమునందు వెలుఁగుచున్నయనుట, అరుణప్రభా = ఎఱ్ఱనికాంతియనెడు, పథిక=విరహిజనులయొక్క, శోణిత=రక్తముచేత, సిక్త=తడుపఁబడిన, సిత=తెల్లనైన, ఉడు=నక్షత్రములనెడి, భక్తముల్ =అన్నమును-రక్తాన్నమును, హరిహయ.. స్థలమునన్ - హరిహయదిక్ =తూర్పుదిక్కునందుఁగల నభస్స్థలమునన్ =ఆకాశప్రదేశమునందు, బలిచల్లి=భూతబలిచల్లి, వటాంకముల్ =మఱ్ఱిచెట్టుగుఱుతగలదియు, వసూత్కరభరితంబునై = కిరణసమూహమనెడి ధనరాశిచేత నిండినదియునై, వెలుఁగన్ = (కనఁబడి) ప్రకాశింపఁగా, కాంచి=చూచి, సుధానిధిన్ =(అమృతనిధియైన) చంద్రుఁడనెడినిధిని ఎత్తెన్ =బయటికిఁదీసెను-చంద్రోదయమయ్యె ననుట.

తా. లోకములో నిధులు త్రవ్వియెత్తువారు కొన్నిమూలికలరసముఁ గూర్చి చేసిన నిధిసాధనపు గాటుకను గన్నులకుఁ బెట్టుకొని నిధియుండుచోటుగని పెట్టి నిధులను భూతములు కాచి యుండు నదురు కాఁబట్టి యాభూతములు తమ్ముబాధింపకుండుటకై నెత్తురుకూడు తూర్పుతట్టు బలిగాఁ బెట్టి గాకేదేనొకచెట్టు గుఱుతుంచుకొని నిధిని త్రవ్వియెత్తుదురు. కాఁబట్టి యట్లే ప్రకృతమునందుఁ గాలమనెడి నిధిసాధకుఁడు చీఁకటియనెడి కాటుక పెట్టుకొని చంద్రోదయమగునప్పుడు తూర్పునఁ దోఁచినట్టి యెఱ్ఱనికాంతియనెడి విరహుల నెత్తురుకలిపిన తెల్లనినక్షత్రములనెడియన్నమును దూర్పుదిశయందు భూతములకు బలిగా వెదచల్లి చంద్రునిలోనికళంక మనెడి మఱ్ఱిచెట్టు గుఱుతుచేసికొని విరహుల బాధింప మన్మథుని కొసఁగుటకై చంద్రుడనెడినిధిని త్రవ్వి పైకెత్తెను (చంద్రునిలోని కళంకము జింకగాను కుందేలుగాను మఱ్ఱిమ్రానుగాను కవులు వర్ణింతురు.) అలం రూపకము

మ. జలజాగారపరంపరల్ మఘవదాశాభిత్తిఁ దీండ్రించుచున్
దళమై వెన్నెలచిచ్చు లంటిన మిళద్బాష్పచ్ఛదశ్యామికా
చ్ఛలనం గంది ముడుంగుచో సిమసిమచ్ఛబ్దంబుతోఁ బుట్టిన
గ్గలపుం గ్రొంబొగల్లో యనంగ వెడలెన్ గర్భస్వనద్భృంగముల్.

అ. జలజాగారపరంపరలు-జలజ =కమలములనెడి, అగార = ఇండ్లయొక్క, పరంపరలు డతెగనివరుసలు, మఘవదాశాభిత్తిన్ -మఘవత్ = ఇంద్రునిదైన, ఆశా = దిక్కైనతూర్పుదిక్కనె భిత్తిన్ = గోడమీఁద-గోడవంటి తూర్పుదిక్కునందనుట, తీండ్రించుచున్ = వెలుఁగుచు, వెన్నెచిచ్చులు=వెన్నెలయనెడినిప్పులు, దళమై = తఱుచై, అంటినన్ = తగులుకొనఁగా, మిళత్.

నన్ - మిళత్ = ఒకటితోనొకటి కలిసికొనుచున్న, బాహ్యచ్ఛద = పైఱేకులయొక్క, శ్యామికా = నలుపనెడు, ఛలనన్ = మిషచేత, కందే = కమలి, ముడుంగుచోన్ = ముడుఁగుకొనునప్పుడు, సిమసిమచ్ఛబ్దంబులోన్ = సిమసిమయనెడిధ్వనితోడ, పుట్టు పొగలో - పుట్టు = కలుగుచున్న, అగ్గలపు = అధికమయిన, క్రొంబొగలో = క్రొత్తపొగలో, అనంగన్ = అనునట్లు, గర్భస్వనద్భృంగముల్ - గర్భ = కమలములలోపలిభాగమునుండి, స్వనత్ = ఝుమ్మనిధ్వనించుచున్న, భృంగముల్ = తుమ్మెదలు, వెడలెన్ = బయలుదేఱెను.

తా. చంద్రోదయమయినతోడనే కమలము లనెడియిండ్లవరుసలు తూర్పుదిక్కనెడిగోడయందుండి వెన్నెల యనెడినిప్పుమంటలులేచి తగులుకొనునప్పుడు మీఁద ముడుఁగుకొనుచున్న పైఱేకుల నలుపు నెపముచేఁ గమలి సిమసిమయనెడి ధ్వనులతో లేచునట్టి పొగలో యనునట్లు ఝంఝుమ్మనెడి ధ్వనులతోఁ దుమ్మెద లాకమలములలోనుండి వెడలిపోవుచుండెను చంద్రోదయమై వెన్నెలవ్యాపింపఁగాఁ గమలములు ముకుళించెను. అవి ముకుళించునప్పుడు వానినుండి తుమ్మెదలు ఝంకారముచేయుచు లేచిపోయెనని భావము. అలం. రూపకము, అపహ్నవము, ఉత్ప్రేక్షయు.

సీ. శిథిలకైరవదళశ్రేణి నొక్కులు దీఱె, శశికాంతపంక్తులజలము లూఱెఁ
గోరి కాంతులతోఁ జకోరికల్ రతిఁ గేరె, వారాశిగర్వంబు మేర మీఱెఁ
ద్రోపడి యిరులు పటాపంచలై పాఱె, దిఙ్ముఖంబుల వింతతెలివి సేరెఁ
జక్రవాకంబు లబ్జకుడుంగములు దూఱెఁ, గామినీకాంతులకలఁక దేఱె
మదనుఁడమ్ముల నూఱె హిమంబు పేరె, జడిసి విరహిణి వగఁ గూరె జారచోర
దర్పములు జాఱె రవికరతాపమాఱెఁ, జూడఁ జూడఁగఁ దారకస్ఫురణ దాఱె.

అ. శిథిల...నొక్కులు - శిథిల = వికాసముచెడిన, (పా. ప్రిదిలి = విరిసి;) కైరవ = తెల్లగలువలయొక్క, దళ = ఱేకులయొక్క, శ్రేణీ = వరుసలయొక్క, నొక్కులు = ముడుఁతలు, తీఱెన్ = చక్కఁబడెను - లేకపోయెను, శశికాంతపంక్తులన్ = చంద్రకాంతపురాళ్లవరుసలయందు, జలములు = నీళ్లు, ఊఱెన్ = ఊటలయెత్తెను, కోరి = కావలయుననికోరి, కాంతులతోన్ = ప్రియభర్తలతో, చకోరికలు = ఆఁడువెన్నెలపులుఁగులు, (పా. కాంతలతోఁ జకోరముల్ = ప్రియస్త్రీలతో వెన్నెలపులుఁగులు), రతిన్ = సంభోగములయందు, కేరెన్ = విజృంభించెను. వారాశిగర్వంబు - వారాశి = సముద్రముయొక్క, గర్వంబు = పొగరు - పొంగెత్తి యలలులేచుట, మేరమీఱెన్ = మితిమించెను - మిక్కిలి హెచ్చెను, త్రోపడి = (వెన్నెలచే) తొలఁగఁద్రోయఁబడి, ఇరులు = చీఁకటి, పటాపంచలై = కంటికిఁగానరానిదై, పాఱెన్ = పరుగెత్తిపోయెను, దిఙ్ముఖంబులన్ = దిక్కుల ముందటిభాగములందు, వింత = క్రొత్తయయిన, తెలివి = తేటఁదనము, చేరెన్ = చేరుకొనెను, చక్రవాకంబులు = జక్కవపక్షులు, అబ్జకుడుంగములన్ = తామరపొదలయందు, దూఱెన్ = చొచ్చెను, కామినీకాంతులకలఁక - కామినీ = కాముకురాండ్రయొక్కయు, కాంతుల = వారిచేఁ గోరఁబడినపురుషులయొక్కయు, కలఁక = కలఁతపాటు - ప్రణయకలహమనుట, తేఱెన్ = తేటఁదనమునొందెను - పోయెననుట, మదనుఁడు = మన్మథుఁడు, అమ్ములు = బాణములను, నూఱెన్ = పదనుపెట్టెను, హిమంబు = మంచు, పేరెన్ = పేరుకొనెను - హెచ్చెననుట, విరహిణి - ప్రియులనెడఁబాసిన స్త్రీజనము - (ఇచ్చట నిది జాత్యేకవచనము), జడిసి = భయపడి, వగన్ = విచారమును,

పూరెన్ = పొందెను, జారచోరదర్పములు - జార = ఱంకుమగలయొక్కయు, చోర = దొంగలయొక్కయు, దర్పములు = గర్వములు, జాఱెన్ = తొలఁగెను-జారచోరులు యథేచ్ఛముగాఁ దిరుగుటకుఁ బ్రతిబంధకముగలిగెననుట, రవికరతాపము=సూర్యకిరణములకాఁక - ఎండవేఁడ్రము, ఆఱెన్ = ఉపశమిల్లెను, చూడఁజూడంగన్ = చూడఁగాఁజూడఁగా-క్రమక్రమముగాననుట, తారకస్ఫురణ = నక్షత్రప్రకాశము, తాఱెన్ = కానరాకపోయెను

తా॥ చంద్రోదయముకాఁగానే కలువలు వికసించెను. చంద్రకాంతశిలలు కరఁగెను. చకోరపక్షులు సంభోగసుఖము ననుభవించెను. సముద్రముప్పొంగెను చీఁకట్లు తొలఁగెను. దిక్కులన్నియుఁ దెల్లగాఁ గనఁబడెను. చక్రవాకపక్షులు తామరతీఁగజొంపములలో ముడుఁగుకొనెను. స్త్రీపురుషులు ప్రణయకలహములు మాని క్రీడించిరి. మన్మథుఁడు విరహులను వేధింపసాగెను మంచుహెచ్చెను. విరహిణీస్త్రీలు చంద్రునిచే విరహవేదన పెరుఁగఁగా విచారపడసాగిరి. జారచోరులసంచారము నిలిచిపోయెను పగటివేళఁ గాసినయెండవలనివేఁడ్రమంతయు వెన్నెలచే నుపశమిల్లెను నక్షత్రములు క్రమక్రమముగా మఱఁగిపోయెను. (ఇందు విరహిణి యనుపదము ఏకవచనాంతముగాఁ బ్రయోగింపఁబడుటచే వరూథిని చంద్రప్రకాశమునకు వెఱచి దుఃఖము నొందెననునర్థ మూహింపఁదగియున్నది.) అలం. స్వభావోక్తి.

మ. స్ఫుటసౌగంధికరాగరక్తరుచి మైఁ బూనెం జపాసన్నిధి
స్ఫటికంబట్లుదయాద్రిగైరికశిరస్స్థానస్థితిం జంద్రుఁడ
చ్చోటు వాయన్ శుచి యయ్యె నౌఁ బ్రకృతి నచ్ఛుండైన సన్మార్గి యె
న్నటికిం గూటమినంక వచ్చువికృతిన్ మగ్నుండు గానేర్చునే. 24

అ. చంద్రుఁడు = చందమామ, ఉద...రుచిన్ -ఉదయాద్రి = పొడుపుఁగొండయొక్క, గైరిక = మనశ్శిలాదిగైరికధాతువులతోఁగూడిన, శిరస్స్థానస్థితిన్ = శిఖరప్రదేశమునందలియునికిచేత, జపాసన్నిధిస్ఫటికంబట్లు - జపా = దాసానిపువ్వుయొక్క, సన్నిధి = సమీపమునందున్న, స్ఫటికంబట్లు = పటికపురాతివలె, స్ఫుట ..రుచిన్ - స్ఫుట = వికసించిన, సౌగంధిక = ఎఱ్ఱగలువలయొక్క, (మెఱుఁగులు వెదచల్లుచున్న సుగంధులనెడి కెంపులయొక్క యని కొందఱు), రాగ = ఎఱుపువంటి, రక్త=ఎఱ్ఱని, రుచిన్ =కాంతిని, మైన్ =శరీరమునందు, పూనెన్ = ధరించెను, అచ్చోటు= ఆయుదయపర్వతముయొక్కశిఖరస్థానమును, పాయన్ = విడిచినతోడనే, శుచి=పరిశుద్ధుఁడు- తెల్లని శరీరముగలవాఁడు, అయ్యెన్ = ఆయెను, ఔన్ = అదియుక్తమే, ప్రకృతిన్ = స్వభావముచేత, అచ్ఛుండు = నిర్దోషియైనవాఁడు - తెల్లనివాఁడు అని చంద్రపరమైనయర్థము, ఐనసన్మార్గి=అయినట్టి మంచినడవడిగలవాఁడు - చంద్రపరముగా నక్షత్రమార్గముగలవాఁడని యర్థాంతరము, ఎన్నటికిన్ =ఎప్పటికైనను, కూటమినంకన్ =సహవాసమువలన, వచ్చువికృతిన్ =వచ్చునట్టివికారమునందు-దుర్మార్గమునందు, మగ్నుండు = మునిఁగినవాఁడు-ఆశతోఁ బ్రవర్తించువాఁడు, కానేర్చునే = అగుటకుఁ బాలుపడునా - పాలుపడఁడనుట.

తా॥ చంద్రుఁడు తూర్పున నుదయించునప్పు డుదయపర్వతశిఖరమునందలి జాజుడాలు తగులుటచేత నేమో దాసానిపువ్వు దగ్గఱనున్న పటికపురాతివలె నెఱ్ఱగాఁ గనఁబడి యందుండి కొంచెముపైకెగఁబ్రాఁకినపిమ్మట నాయెఱుపుపోయి స్వభావసిద్ధమయిన తెలుపును వహించి స్వచ్ఛముగాఁ బ్రకాశిం

చెను. కనుక మంచినడవడి గలపురుషుఁడు దైవికముగా దుష్టులచెంతఁజేరి వారిచేరికవలన నేదే నొకవికారపునడవడి గలవాఁడయినను వారిని విడిచినతోడనే యావికారపునడవడినసైతము విడుచునుగాని యట్లే ప్రవర్తింపఁడు. చంద్రుఁడు స్వభావముచేతఁ దెల్లనివాఁడు గనుక నుదయకాలమునం దెఱ్ఱగాఁ గనఁబడినను బిమ్మటఁ గ్రమక్రమముగాఁ దెల్లగానే వెలిఁగెనని భావము అలం అర్థాంతరన్యాసము. ఉపమయు

శా. ఆరూఢస్థితిఁ జంద్రికాధవళితాజాండంబులోఁ జంద్రుఁ డొ
ప్పారెం గాలభిషగ్వరుం డవిరతంబై కాముకశ్రేణికిన్
మారోత్సాహము నిల్వఁ బాదరసమున్ బంధించి గ్రాసార్థమై
క్షీరస్థాలికఁ బెట్టినట్టిఘుటికాసిద్ధౌషధంబో యనన్. 25

అ. చంద్రుఁడు = చందమామ, ఆరూఢస్థితిన్ = ఆకాశమున కెగఁబ్రాఁకియున్నయునికియందు, చంద్రి...జాండంబులోన్ - చంద్రికా = వెన్నెలచేత, ధవళిత = తెల్లగాఁ జేయఁబడిన, అజాండంబులోన్ = బ్రహ్మాండమునందు, కాలభిషగ్వరుండు = సమయమనెడి వైద్యశ్రేష్ఠుఁడు, కాముకశ్రేణికిన్ = విషయేచ్ఛగలిగినవారిసమూహమునకు, మారోత్సాహము = మన్మథోద్యోగము, అవిరతంబై= ఎడతెగనిదై, నిల్వన్ = నిలుచుటకై-ఉండుటకై, పాదరసమున్ = పాదరసమనెడిద్రవద్రవ్యమును, బంధించి=మూలికలనుగూర్చి గడ్డకట్టునట్లుచేసి, (పా. మర్దించి=మూలికలతోఁజేర్చి గడ్డకట్టునట్లు నూఱి), గ్రాసార్థమై = మ్రింగుటకై, క్షీరస్థాలికన్ = పాలకుండలో, పెట్టి యనన్ - పెట్టినట్టి=ఉంచినటువంటి, ఘుటికా = గుళికయగునట్లు, సిద్ధ = సిద్ధులచే సాధింపఁబడిన, ఔషధంబో = మందో, అనన్ = అనునట్లు, ఒప్పారెన్ = ఒప్పెను

తా. కాలమనెడి మంచివైద్యుఁడు విషయేచ్ఛగలస్త్రీపురుషుల కామేచ్ఛ యెప్పుడును స్థిరముగా నిలుచుటకై పాదరసమును విఱిచి గుళికచేసి మ్రింగుటకై పాలకుండలో నుంచినట్టిదియు ఘుటికాసిద్ధి గలసిద్ధులచే సాధింపఁబడిన యౌషధమువంటి మహిమగలదియునైన యాగుళికయో యనునట్లు వెన్నెలచేఁ దెల్లగా వెలుఁగుచున్న బ్రహ్మాండమునందుఁ జంద్రుడు వెలుఁగుచుండెను. ఇటఁ చంద్రికాధవళితాజాండము క్షీరస్థాలికగాను జంద్రుడు పాదరసఘుటికగాను రూపింపఁబడుట నెఱుంగునది. వెన్నెల యెల్లయెడలను వ్యాపించి కాయుచుండఁగాఁ జంద్రుఁ డాకాశమధ్యమునందు వెలుఁగుచుండెననియు నట్టిసమయమునందుఁ గాముకులు యథేచ్ఛముగాఁ గ్రీడించిరనియు భావము. అలం ఉత్ప్రేక్ష, రూపకమును

తే. రాజు తేజస్వియై గ్రహరాజుమీఁద, నలిగి దాడిగ వెంటాడ నిలువ కతఁడు
బెగడువడి పాఱుచోఁ జెఱఁదగిలినట్టి, ఛాయ యిది యన నీలలాంఛనము మెఱసె.

అ. రాజు = చంద్రుఁడనెడిరాజు, తేజస్వియై = ప్రతాపవంతుఁడై, గ్రహరాజుమీఁదన్ = సూర్యుఁడనెడి పగరాజుమీఁద, అలిగి = కోపించి, దాడిగన్ = అతనిగెలువ దండువెడలుటగా, వెంటాడన్ = వెంబడించితఱుమఁగా, అతఁడు = ఆసూర్యుఁడనెడురాజు, బెగడుపడి = భయపడి, నిలువక = తనపగవానినెదిరించి నిలువఁజాలక, పాఱుచోన్ =పరుగెత్తిపోవునప్పుడు, చెఱన్ =చెఱలో, తగిలినట్టిఛాయ = చిక్కుకొన్నఛాయాదేవి, ఇది = ఈకనఁబడునది, అనన్ = అనునట్లు, నీలలాంఛనము = నల్లనిదైన చంద్రునిలోనికళంకము, మెఱసెన్ = ప్రకాశించెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. కలయ జగమునఁ గలయట్టినలుపు లెల్లఁ
దెలుపులుగఁ జేసి నీడలు దెలుపు సేయఁ
గా వశము గామిఁ బొడముదుఃఖమునఁ బోలె
సాంద్రచంద్రిక తుహినబాష్పములు గురిసె. 27

అ. సాంద్రచంద్రిక=దట్టమయినవెన్నెల, జగమునన్=లోకమునందు, కలయన్=ఎల్లయెడలను, కలయట్టినలుపులెల్లన్ = ఉండునట్టినల్లనివస్తువులనెల్లను, తెలుపులుగన్ = తెల్లనివస్తువులగునట్లుగా, చేసి = చేసియు, నీడలు = వృక్షములు మొదలగువానినీడలను, తెలుపు = తెల్లనివి గా, చేయఁగాన్ = చేయుటకు, వశముగామిన్ = శక్యముకాకపోవుటచేత, పొడముదుఃఖమునఁబోలెన్ =పుట్టినదుఃఖముచేతనేమో యనునట్లు, తుహినబాష్పములు=మంచనెడుకన్నీళ్లను, కురిసెన్ =కురియించెను.

తా. వెన్నెల దట్టముగాఁగాయఁగా మంచు గురియనారంభించెను ఆమంచుకురియుట యెట్లుండెననఁగా వెన్నెల తాను దనతెలుపుచే లోకములోఁ గలవానినెల్లఁ దెల్లగాఁ జేసియు వృక్షాదులనీడలనుమాత్ర మట్లుచేయనేరక యందులకై దుఃఖించి కన్నీళ్లు విడిచెనేమో యన్నట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

వ. మఱియు వికసితకైరవంబు లగుసరోవరంబుల నిజధవళధాళధళ్యంబున నాక్రమించి యందు నానందించునరవిందమందిరకుం బుట్టినింటిసొబగుఁ జూపి, చూపఱకు నిందుబింబం బిది గ్రహంబు లివి యనునంతరంబు లేకుండ నేకవర్ణంబు గావించి, సేవించుచకోరకదంబంబులపుక్కిళ్లకు వెక్కసంబై ముక్కులకు నెక్కి చిక్కంబడి, యొండొండ బొండుమల్లియలదండడిం దొరఁగుపుప్పొళ్ల నుప్పతిల్లునత్తావులకు వెకలులై యాఁడుమొకరితుమ్మెదలు రొదలు గలమెఱుఁగుడుంబురువులట్లు మిసమిసని మెఱవ నసిమెఱుంగుముత్తంబుల నుమిసి యుమిసి, యందంద ప్రవహించునిందూపలస్యందంబులకు విందు లగునిందీవరమరందంబుల బెండడిం బడి బందన గొనువలిమించుక్రొమ్మంచుతొడు లీఁది యీఁది వడి నడలి సుడివడుచు నొడలోముసోమరిగాలిమూలవ్రాకసోఁకులం గదలెం గదల వనం గదలునుపవన కదళీకేతకీతాలహింతాలనారికేళపూగావళీకోమలపలాశద్రోణికల నునుపుగల పొరలదూరల శరధితరఁగలమీఁదనుంబోలె గిఱికొని, మొల్లవల్లికలుం బూవక పూచినట్లుల్లసిల్ల తెల్లులల్లసిల్లినచందంబునం దెల్లతెల్లనై, మొల్లమిగ నంతకంతకు దిగంతంబులు దంతంబులు దీరిచినయిడుపులుంబోలెఁ దీండ్రింప కేయొండ్ల దాగుటంజేసి యొండమావులం బుట్టించె ననం బట్టు గలపటికంపురాచట్టునేలల నెట్టుకొని, వెండియుం జిట్టకంబులకుం బెడమొగంబు వెట్టుకొని పట్టఁబట్టం బోవుప్రాణభర్తలవెంటం బడి నూపురంబులు మొరయ వేనలులు విరియఁ గ్రమంబునం బుట్టునిట్టూర్పుపవనంబు జవంబునం బైకొం గెడలింప నందనికౌఁగిటం బొదివి ప్రియంబు చిబుకం బలికి ముద్దాడుజవరాండ్రదంతచంద్రికలసాంద్రతం బంతంబు మెఱసి, నంతనంపువేళల మాటతబ్బిబ్బునం బుట్టుపొలయలుకలం దలలు

వంచి రోద లేనినాలియేడ్పు లేడ్చుప్రియుల ననునయింప నింపునం జనవుమెఱసి
చెక్కుటద్దంబులు నొక్కి మొగం బెగయ నెత్తి ముత్తియంపుముంగఱ రంగునం
గడలుకొనుబుడిబుడికన్నీటం బ్రతిఫలించి తుఱంగలించుతనదునిగనిగలు గనుం
గొని నగెనగె నను చుం జుంబనం బిడం బోయి కెంగేల నదరంట వాటువడు
కాముకుల వెలవెలపాటుకూటువం గోటికిం బడగలెత్తి, పిండిచల్లినగతిం గాయ
డాయ లజ్జించి బుజ్జవంబునం బొదరిండ్లకుం దార్చి కాంతులం గపయసంగనాచు
లగునంగనలయంగంబులపస ముంగిటం బడం జలితకిసలయాంతరాళంబులం దూ
ఱితూఱి యిరులు విరియించి సతులప్రార్థనంబులం బుంభావసురతాడంబరం
బునకుం దోడుసూపి దూపటిలి యంగరాగంబులుగరంగిం జెమర్చిన చంచలాక్షు
లనిద్దంపుందనూలతలం బుట్టి దట్టంబు లగుచిఱుచెమటబొట్టులం బొడకట్టి తెలు
పారుమలయజంపుం జిటులుగందంబుల యందంబు లొసంగి, సంజకడం దారు
నొడివినసంకేతంబుల నుండక తెరువు గట్టి పౌరువుందరువులసీడల నడంగి నవ్వు
టాలకు వెనుకపాటునం గదిసి మసుంగు లెడలింప బెగడి కళవళంపుంజూపుల
వల్లభుల్గం జూచి యల్లన నగునభిసారికలవెడందకన్నులచెన్ను నన్నుకొని, పౌ
దలుమదనోన్మాదంబునకుం బ్రోదిగా మోదంబునం గాదంబరి గండూపించి విట
కదంబంబునకు నొసంగునంబుయహాముఖుల యొప్పులకుప్ప లగునిప్పపూమొగ్గలం
బోనిబుగ్గలం దగ్గలిక సూపుకమ్మపంజులవజ్రపుంజకచకల నకనకలు వీడుకొని,
కలికితనంబునం గలసిమెలసి రతాంతంబునం బరిశ్రాంతి యడంగ నంగణంబుల
నిలిచి యొండొరులకురులు దువ్వుచు విహరించుసమయంబునం బల్లవులు కేళి
కల్లప్పుడన్నతమమాటలు దలంపించిన నుదరిపడి మందస్మితంబు లంకురించు
హుంకృతుల జంకించి కంకణంబురత్నంపుందళుకులు సెదర నుంకించి వైచు
చేమంతిపూబంతులం బుటపుటనై, మిటమిటం గాయుదట్టంపుంబండువెన్నెలమెం
డున బెండువడి డెందంబు గంది తాలిమి చింపవండై కెందలిరుపాన్పునం దను
వొందక లేచి కూర్చుండి కన్నీరు గోటమీటుచు బోటితో వరూథిని యిట్లనియె.

అ. మఱియుక్ = ఇంతేగాక, (వెన్నెల కర్తృపదము) వికసితకైరవంబులు = విరియంబూచిన
కలువలుగలవి, అగుసరోవరంబులక్ = అయినట్టి మేలైనకొలంకులను, నిజ బునక్ - నిజ = తనదైన,
ధవళ = తెలుపుయొక్క, ధాళధళ్యంబునక్ = ధళధళయనుప్రకాశముచేత, ఆక్రమించి = ఆవరించి,
అందుక్ = ఆసరోవరములందు, ఆనందించునరవిందమందిరకుక్ = సంతోషించుచుండు నట్టిలక్ష్మీదేవికి,
పుట్టినింటిసొబగు = పుట్టినయిల్లయిన పాలసముద్రముయొక్కయందమును, చూప = కనఁబఱచి - పాల
సముద్రమువలెం దెల్లంబసమిమించునట్లు చేసి యనుట (పా. పోలికచూపి) ఈవాక్యమునందు,
అలం. ఉపమ చూపఱకుక్ = చూచువారికి, ఇందుబింబ మిది = ఇది చంద్రమండలము, గ్రహాంబు
లివి = ఇది శుక్రాదిగ్రహములు - ఇందు గ్రహశబ్దముచేత నక్షత్రములన్నియు గ్రాహ్యములు అనునంత
రంబు = అనునట్టిభేదము, లేకుండక్ = లేకయుండునట్లు, ఏకవర్ణంబు = ఒక్కటేవర్ణము - తెల్లవన్నె.

యొక్కచే యగునట్లు, కావించి=చేసి, (ఇందు. అలం, మీలనము.) సేవించు. పుక్కిళ్లకుఁ-సేవించు=వెన్నెలననుభవించునట్టి, చకోర=వెన్నెలపులుఁగులయొక్క, కదంబంబుల=గుంపులయొక్క, పుక్కిళ్లకుఁ = బుగ్గలలోపలిభాగములకు-నోళ్లలోనికి, వెక్కసంబై=మిక్కుటమై, ముక్కులకుఁ = ముక్కులలోపలికి, ఎక్కి=ఎగఁదట్టి, చిక్కంబడి = చిక్కనై, (అలం అతిశయోక్తి) ఒండొండ= ఒక్కటొక్కచే-క్రమక్రమముగాననుట, బొండుమల్లియలఁ = గుండ్రని పెనుమల్లెలవలననుండి, దండడిఁ=తఱుచుఁదనముతో-విశేషముగాననుట,తొరఁగుపువ్వొళ్లఁ = రాలునట్టిపూదుమ్ములచేత, ఉప్పతిల్లు నెత్తావులకుఁ=పుట్టుచున్న నిండుపరిమళములకు, వెకలులై=ఆసక్తినొందినవై, ఆడుమొకరితుమ్మెదలు=(అంతరాళమునందు) చరించునట్టి ఝుంకారధ్వనితోడితుమ్మెదలు, రొదలుగల మెఱుఁగుడుంబురవులట్లు=ధ్వనులుగల మిడుఁగుఱుఁబురుగులవలె, మిసమిసని మెఱవఁ=మిసమిసలాడుచు వెలుఁగఁగా, నసి మెఱుంగుమొత్తంబులఁ = నిగ్గయినవెలుఁగుప్రోవులను, ఉమిసియుమిసి=వెళ్లఁ గ్రక్కి-క్రక్కి-బొండుమల్లెపూదుమ్ములపరిమళము ననుభవింపఁబొటాఁడు తుమ్మెదలు వెన్నెలపై సోఁకుటచే మిడుఁగుఱుఁబురుగులవలె మిసమిసలాడునట్టి కాంతులతోఁ బ్రకాశించెననుట. (అలం. ఉత్ప్రేక్ష) అందంద = నడుమనడుమ-మిక్కిలియొక్కువగా, ప్రవహించు. .స్యందంబులకుఁ-ప్రవహించు = పాఱుచున్న, ఇందూపల=చంద్రకాంతపురాళ్లయొక్క, స్యందంబులకుఁ=నీటియూటలకు, విందులు=చుట్టములు-సరిపోలినవి, అగు బెందడిఁ-అగు = అయిన, ఇందీవర=నల్లగలువలవలని, మరందంబుల= తేనెలయొక్క, బెందడిఁ=పల్లపుఁదావులబురదనీటియందు, పడి=పడినదై, బందనగొను జౌదులు-బందనగొను=జిగటపాటిన,వలిమించు=చలిహెచ్చుచున్న, క్రొమ్మంచు బౌదులు=క్రొత్తమంచునీళ్లకాలువలు, ఈఁదియీఁది=బహుదూరము ఈఁది, వడి=వేగము, సడలి=తగ్గి, సుడివడుచుఁ = సుడిపడుచు, ఒడలు=దేహమును, ఓము...సోఁకులకుఁ-ఓము=కాపాడుకొనునట్టి, సోమరిగాలి = మందమారుతము యొక్క, అలవోకసోఁకులఁ=లీలగాఁ దాఁకుటలచేత, గదలెంగదలవు=కదలెనోకదలలేదో, అనఁ= అనునట్లు, కదలు ద్రోణికలఁ-కదలు = కొంచెముకదలునట్టి, ఉపవన = ఉద్యానవనములయందలి, కదళీ=అరఁటిచెట్లయొక్కయు, కేతకీ=మొగలిచెట్లయొక్కయు, హింతాల = ఈఁదాళ్లయొక్కయు, నారికేళ = టెంకాయచెట్లయొక్కయు, పూగ=పోఁకచెట్లయొక్కయు, ఆవళీ= వరుసలయొక్క, కోమల=మృదువులైన, పలాశద్రోణికలఁ=దోనెలవంటి యాకులయందు, నునుపు=నున్నఁదనము, కల పొరలయోరలఁ=కలిగినయావరణములయంచులందు, శరధితరఁగలమీఁదనుంబోలెఁ = సముద్రపుఁ గరళ్లపైనివలె, గిఱికొని=ఆవరించుకొని, (అలం. ఉపమ.) ఎల్లవల్లికలుఁ=అన్నితీఁగెలును, పూవక= పుష్పింపకయే, పూచినట్లు=పుష్పించినట్లు, ఉల్లసిల్లఁ=ఒప్పఁగా, ఔల్లు=ఔల్లుగడ్డి, ఉల్లసిల్లిన చందంబునఁ=పూచివిరియఁబడినట్లును, తెల్లనై=తెల్లఁదనముగలదై, మొల్లమిగఁ=దట్టముగా, అంతకంతకుఁ=అప్పటప్పటికి, దిగంతంబులు=దిక్కులకొనలు, దంతంబులఁ=ఏనుఁగుదంతముల చేత, తీరిచినయిడుపులుంబోలెఁ-తీరిచిన=దిద్దిన, ఇడుపులుంబోలెఁ=పార్శ్వభాగములవలె, తీండ్రింపఁ= ప్రకాశింపఁగా, రేయెండ=రాత్రివేళకాయునట్టి యెండ, తాఁ=తాను, అగుటంజేసి=అవుటచేత, ఎండమావులఁ=బయళ్లయందు నీటివెల్లువవలెఁ దోచునట్టి కిరణప్రసారములను, పుట్టించెను = కలిగించెను, అనఁ=అనునట్లు, పట్టు=అవకాశము, కల=కలిగిన, పటికంపురా=స్ఫటికపురాళ్లచేత, చట్టునేలలఁ = రాతివలె గట్టిపడిన నేలలయందు, నెట్టుకొని=పాదుకొని-దట్టముగా వ్యాపించి, (అలం. ఉత్ప్రేక్ష.) వెండియుఁ=మఱియును, చిట్టకంబులకుఁ=చెర్లాటములకు, పెడమొగంబువెట్టుకొని=

మాఱుమొగముఁబెట్టుకొని-ముఖములు వెనుకకుఁ ద్రిప్పుకొని యనుట, పట్టఁ బట్టన్ = పట్టఁగాఁ బట్టఁగా, పోవు వెంబడి-పోవు = పట్టిన కందక పాఱిపోవునట్టి, ప్రాణభర్తల=మిక్కిలి ప్రియము గలమగలయొక్క, వెంటం బడి=వెంబడిఁదగిలి, నూపురంబులు=కాలియందెలు, మొరయన్=మ్రోఁగఁగా, వేనలులు= సిగముళ్లు-కొప్పులు, విరియన్=వీడఁగా, (పా ఉరియన్=చలింపఁగా) క్రమంబునన్=వరుస వెంబడిని, పుట్టు... పవనంబు-పుట్టు=కలుగుచున్న, నిట్టూర్పు=దీర్ఘశ్వాసమువలని, పవనంబు=గాలి, జవంబునన్=వేగముచేత, పైఁటకొంగు=పయఁటచెఱఁగును, ఎడలింపన్= తొలఁగింపఁగా-తమప్రయత్నములేకయే పయఁటచెఱఁగు జాఱఁగాననుట, అందనికౌఁగిటన్=అఱుపనిభుజాంతరమునందు, పొదివి=అదిమిపట్టుకొని, ప్రియముచిలుకన్=ప్రేమయతిశయించునట్టుగా, పలికి=మాటలాడి, ముద్దాడు . సాంద్రతన్-ముద్దాడు=ముద్దుపెట్టుకొనునట్టి, జవరాండ్ర=యౌవన స్త్రీలయొక్క, దంతచంద్రికల=పలువరుస మెఱుఁగులనెడి వెన్నెలలయొక్క, సాంద్రతన్=దట్టపుఁదనముచేత, పంతంబు మెఱసి=పద్దు దెలుపుకొని-తమయాధిక్యమును బయలుపఱిచియనుట, మంతనంపువేళలన్ = ఏకాంత సమయములందు, మాటతబ్బిబ్బునన్=మాటలతడఁబాటుచేత, పుట్టుపొలయలుకలన్=కలిగినప్రణయ కోపములచేత, తలలువంచి=తలలనువంచుకొని, రొద=ధ్వని, లేనినాలియేడ్పులు = కలుగనికపటమైన యేడ్పులు, ఏడ్చు ప్రియలన్=ఏడ్చునట్టి ప్రియురాండ్రను-ధ్వనిలేక యేడ్చుట పరులకుఁ దెలియకుండుటకై యని యెఱుంగునది, అనునయింపన్=ఊఱడించుటకొఱకు, ఇంపునన్=ఇష్టముతో, చనవు=తనకు గలస్వాతంత్ర్యమును, మెఱసి= మెఱయించి-కనఁబఱిచి, చెక్కుటద్దంబులు=అద్దములవంటి చెక్కిళ్లను, నొక్కి= గోళ్లచేనదిమిపట్టి, మొగంబు=ముఖమును, ఎగయనెత్తి = పైకెత్తి, ముత్తియంపుముంగఱ రంగునన్=ముత్తెముగూర్చిన ముక్కుఱవిధమున, కడలుకొనుబుడిబుడికన్నీటన్=ఊరికిముక్కుమీఁదుగా వచ్చునట్టికొంచెపుఁగంటి నీటియందు, ప్రతిఫలించి=ప్రతిబింబించి, తుఱంగలించుతనదునిగనిగలు= ప్రకాశించునట్టి తనయొక్క నిగనిగనివెలుంగులను, కనుంగొని=చూచి, నగెనగె.= నవ్వెనునవ్వెను, అనుచున్=అనిపలుకుచు, చుంబనంబిడంబోయి=ముద్దుపెట్టుకొఁబోయి, కెంగేలన్ = ఎఱ్ఱనిచేతులతో, అదరంటన్=చుఱుకుపుట్టి, వాటు . కూటువన్-వాటువడు = దెబ్బపడునట్టి, (పా. వ్రేటువడు.) కాముకుల=కామాసక్తులయినపురుషులయొక్క, వెలవెలపాటు=వెలవెలఁబోవుటయొక్క, కూటువన్ = (తెల్లఁదనపు) చేరికచేత, కోటికెక్కింబడగలెత్తి=నూఱులక్షలకు నొకటెక్కమునెత్తి - మేరలేని కలిమి నొంది యనుట-మిక్కిలి ధావళ్యసంపత్తినొంది యనిభావము, (అలం. ఉత్ప్రేక్ష ) పిండిచల్లినగతిన్= తెల్లనిపిండి పఱపినరీతిని, కాయన్=వెన్నెల ప్రకాశింపఁగా, డాయన్=దగ్గఱఁ జేరుటకు, లజ్జించి= సిగ్గుపడి, బుజ్జవంబునన్=లాలన చేయుటచేత, పొదరిండ్లకున్=తీఁగెయిండ్లలోనికి, తార్చి=చేర్చి-తీసికొనిపోయి యనుట, కాంతులన్ = ప్రియపురుషులను, కవియునంగనాచులు = పొందు నట్టి ధూర్తలు, (నంగనాచి = ఎంతసాహసపుఁబని యయినఁజేసి యేమియుఁ దెలియనిదానివలె నటించు నట్టి యాఁడుది.) అగునంగనలయంగంబులపస=అయినట్టి స్త్రీలయొక్క యవయవములసత్త-వారియవయవములందుఁ దోఁచునట్టి సంభోగచిహ్నములు, ముంగిటంబడన్=బయలుపడునట్లు, చలిత్రకిసలయాంతరాళంబులన్ = కదలెడిచిగురుటాకులసందులలో, తూఱిదూఱి=చొచ్చిచొచ్చి, ఇరులు = (పొదరిండ్లలోని) చీఁకటిని, విరియించి=తొలఁగించి, (అలం. ఉత్ప్రేక్ష.) పతులప్రార్థనంబులన్=ప్రియుల యొక్క వేఁడుకొనుటలచేత, పుంభావసురతాడంబరంబునన్ = ఉపరతియందలి విజృంభణమునందు, తోడుసూపన్=సాహాయ్యమునుగనఁబఱుపఁగా-పురుషాయితరతిసుఖ మాపతులకుఁ గలిగింపఁగా, దూప

టిలి = డస్సి, (దీనికిఁ గర్త చంచలాక్షులు) అంగరాగంబులు = శరీరమునందుఁ బూసికొన్న గంధపుఁ బూఁతలు, కరఁగన్ = కరఁగిపోవునట్లు, చెమర్చిన లతలన్ - చెమర్చిన = చెమటపట్టిన, చంచలాక్షుల = స్త్రీలయొక్క, నిద్దంపు = నునుపైన - నిగనిగ మెఱయుచున్న, తనూలతలన్ = తీఁగెలవంటి యొడళ్లయందు, పుట్టి=కలిగి, దట్టంబులు=తఱుచైనవి, అగుచిఱుచెమటబొట్టులన్ =అగుపట్టిచిన్న చిన్న చెమటబిందువులందు, పొడకట్టి = ప్రతిఫలించుటచేతఁ గనఁబడి, తెలుపారు...అందంబులు - తెలుపారు = తెలుపెక్కిన, మలయజంపు = శ్రీచందనముయొక్క, చిటులు=చిట్లిన-పగుళ్లువాసిన, గందంబుల = పరిమళముగలగంధంపుఁబూఁతలయొక్క, అందంబులు = చక్కఁదనములను, ఒసంగి=ఇచ్చి-కలుగఁజేసి-ఆ స్త్రీల దేహములందలి చిఱుచెమటబొట్లలో చిట్లినగంధపుఁబూఁతవలె వెన్నెలచూపట్టె నని యర్థము. (అలం. నిదర్శన.) సంజకడన్ = సంధ్యాసమయమునందు, తారు=తమరు, నొడివినసంకేతంబులన్ = చెప్పినిర్ణయించుకొన్న తావులయందు, ఉండక = చెప్పినచొప్పుననుండక, తెరువుగట్టి= దారిగాచి, పొరువుఁదరువులనీడలన్ =త్రోవవెంబడియిరుప్రక్కల నుండువృక్షములనీడలయందు, అడంగి=దాఁగియుండి, నవ్వటాలకున్ = ఎగతాళికి, వెనుకపాటునన్ = వెనుకపడుటచేత - వెనుకతట్టుగా ననుట, కదిసి=చేరవచ్చి-తారసించి, ముసుంగులు=(తా మిట్టివారని చూచువారికిఁ దెలియకుండునట్లు వేసికొన్న) ముసుఁగులను, ఎడలింపన్ = తొలఁగఁదీయఁగా, బెగడి = భయపడి, కళవళంపుఁజూపులను = త్రొట్రుపాటుతోడిచూపులతో, వల్లభులన్ = ప్రియులను, చూచి= కనుఁగొని, అల్లనన్ = మెల్లగా - ధ్వనికలుగకుండునట్లు, (గట్టిగా నవ్విన నితరులెఱుఁగుదురనిభావము )నగు.. చెన్నునన్ - నగు=నవ్వునట్టి, అభిసారికల= అంకుటాండ్రయొక్క, వెడంద =విశాలములయిన, కన్నులచెన్నునన్ = నేత్రములయొక్కయందముచేత- వానిధవళకాంతులచేతననుట, అన్నరొని=మత్తిల్లి-మిక్కిలి యతిశయించియనుట, (అలం. ఉత్ప్రేక్ష ) పొదలుమదనోన్మాదంబునకున్ - పొదలు = అంతకంతకుఁ బెరుఁగుచున్న, మదన = మన్మథసంబంధమైన, ఉన్మాదంబునకున్ = పిచ్చికి, పోఁదిగాన్ = పోషణముగా, మోదంబునన్ = సంతోషముతో, కాదంబరి = మద్యమును, గండూషించి = పుక్కిలించి - పుక్కిటఁబెట్టుకొనియనుట, విటకదంబంబునకున్ = అంకుమగలసమూహమునకును, ఒసంగు .. బుగ్గలందున్ - ఒసంగు = ఇచ్చునట్టి, అంబురుహముఖుల= కమలములవంటి మొగమునుగల స్త్రీలయొక్క, ఒప్పులకుప్పలు = చక్కఁదనాలప్రోవులు, అగునిప్పపూమొగ్గలంబోని = అయినయిప్పపువ్వుల మొగ్గలవంటి, బుగ్గలందున్ = చెక్కిళ్లక్రింపనుబ్బుగానుండు నవయవములందు - (కల్లుద్రాగినవారిబుగ్గలు కొంచెె మెఱుపుగలసిన తెలుపుగలిగి యుండును గనుక నిప్ప మొగ్గలతోఁ బోల్పబడియెను.) అగ్గలిక = ఆధిక్యమును, చూపు. .చకచకలు - చూపు = కనఁబఱచుచున్న, కమ్మపంజుల = పంజులవలెవెలుఁగుచున్న కమ్మలయందలి, వజ్రపుంజకచకల = ముగరాలకాంతులచేత, నకనకలు = కృశత్వములను, పీడుకొని=వదలి-పరిపూర్ణతనొందియనుట, (అలం ఉపమ.) కలికితనంబులన్ = నేర్పరితనములచేత, కలసిమెలసి=కూడి మెలఁగి-సంభోగించి, రతాంతంబునన్ =సంభోగించి యైనపిమ్మట, పరిశ్రాంతి= (సంభోగమువలనఁగలిగిన) బడలిక, అడఁగన్ = ఉపశమిల్లుటకై, (పా. ఎడలంగన్ =పోవునట్లుగా,) అంగణంబులన్ = ముంగిళ్లయందు-ఇండ్లముందటియావరణములోనిబయళ్లయందు, నిలిచి= నిలువఁబడి, ఒండొరులకురులు=(స్త్రీపురుషులు) ఒకరితలవెండ్రుకలుమఱియొకరు, దువ్వుచున్ =చిక్కుదీసిచక్కఁబఱుచుచు, విహరించుసమయంబునన్ = వినోదముగాఁ దిరుగుచున్నసమయమునందు, పల్లవులు = విటకాండ్రు; కేళికిన్ =ఉపరతిక్రీడకు, అల్లప్పుడు=ఆక్రీడాసమయమునందు, అన్నతమమాటలు=పలికినతమ

యొక్క పలుకులను - విటకత్తెలు తామాయుపరతికై సమ్మతించి పలికిన పలుకులను, తలఁపించినన్ = జ్ఞా
కము చేయఁగా, ఉదరిపడి = (సిగ్గుచేత) ఉలికిపడి, మందస్మితంబులు = చిఱునవ్వులు, అంకురించుచుం
తులన్ = పొటమరించుచున్న యదలింపులచేత, జంకించి = కసరుకొని, కంకణంబుల.. తళుకుల
కంకణంబుల = ముంజేతికడియములయొక్క, రత్నంపుఁదళుకులు = రత్నములయొక్క తళతళమ
కాంతులు, చెదరన్ = నలుదిక్కులను వ్యాపింపఁగా, ఉంకించి = పూని, వైచు చేమంతిపూఁబంతులన్
విసరివేయునట్టి చేమంతిపూలచెండ్లచేత, పుటపుటనై = బలిసి - అతిశయించి యనుట మిటమిటన్
మిటమిటయను ననుకరణకాంతితో, కాయుదట్టంపుఁబండువెన్నెలమెండునన్ - కాయు = ప్రకాశిం
చున్న, దట్టంపు = తఱుచైన, (పా. తండంపు) పండువెన్నెల = ముదిరిన వెన్నెలయొక్క, మెండునన్
అతిశయముచేత, బెండుపడి = సారముచెడి, డెందంబు = హృదయము, కంది = కమలి - తాపము
బొంది, తాల్మి = ధైర్యము, చిందుపందై = మిక్కిలిచలించి, కందలిరుసొంపునన్ = ఎఱ్ఱనిచిగుళ్లశయ
మీఁద, తనువు = దేహము, ఒందక = పొందక - పండుకొనియుండ ననువుపడక, లేచి = పానుపునుండి లే
కూర్చుండి = కూర్చుండినదై, కన్నీరు = కంటినీటిని, గోటన్ = తనవ్రేలిగోటితో, మీటుచున్ = ఎ
జిమ్ముచు, బోటితోన్ = చెలికత్తెతో, వరూథిని, ఇట్లనియెన్ = ఈవిధముగాఁ బలికెను.

ఉ. నోములు నోఁచినమ్మలు మనోరథముల్ దయివాఱ నిత్తఱిం
దామరతంపరై ప్రియులఁ దారు విహారము సల్ప వీరిలో
నీమెయి దుఃఖశీల నగునేను వసియింపఁ దరంబె పోద మా
రామముఁ జూడ నందు సుకరంబగు సర్వము నంబుజాననా.

అ. అంబుజాననా = కమలమువంటిముఖముగలదానా - చెలియా, ఇత్తఱిన్ = ఈసమ
మునందు, నోములునోఁచినమ్మలు = (పూర్వజన్మమునందు) మంచివ్రతము లాచరించినపుణ్యవతుల
మనోరథములు = తమకుఁగలకోరికలు, దయివాఱన్ = కొఱఁతలేక నెఱవేఱఁగా, (పా. తని
రన్ = తనివితీఱనట్లుగా), తామరతంపరై = కొఱఁతలేక యభివృద్ధినొంది - యథేచ్ఛముగా ననఁ
ప్రియులన్ = ప్రాణనాయకులను, తారున్ = తామును, విహారము = వేడుకగా మెలఁగుటను,
ల్పన్ = చేయుచుండఁగా, వీరిలోన్ = ప్రియులతోఁగూడి విహారసుఖము ననుభవించుచున్న
స్త్రీలనడుమ, ఈమెయిన్ = ఈప్రకారముగ, దుఃఖశీలను = దుఃఖప్రవర్తనముగలదానను, అగు నేను =
యినట్టి నేను, వసియింపన్ = ఉండుట, తరంబె = శక్యమా, ఆరామమున్ = శృంగారపుఁదోఁటను, చ
డన్ = చూచుటకు, పోదము = మనము పోవుదము, అందున్ = ఆతోఁటయందు, సర్వమున్
అంతయును, సుకరంబు = సులభము, అగున్ = అవును.

తా. ఓచెలియా! మంచి యదృష్టము గలపుణ్యవతులు తమకోరికలు కొనసాఁగఁగాఁ దమక
దగిన ప్రాణభర్తలతోఁ గూడి విహరించుచుండెడి యీసమయమునందుఁ బ్రియవిరహవేదనచే దు
పడుచున్న నేను బరువు చెడునట్లు వారిలో నెట్లు మెలఁగుదును. ఇతరులెవ్వరు లేనిమనశ్శృంగార
దోఁటకుఁబోయి యక్కడ నిర్విచారముగా నుండుదము రమ్మని వరూథిని యనెను. సుఖపడుచుం
వారిని జూచునపుడు దుఃఖపడువారి కోర్వలేకపోవుట లోకమునందు సహజముగుటచే వరూథినియ
సుఖము ననుభవించుచున్న లీనతోడి యప్సరసలయునికిఁ జూచి యోర్వఁజాలక కనుమఱుఁగు
బోఁదలఁచె నని భావము. అలం. కావ్యలింగము

క. అని పలికి పాన్పు డిగ్గి కామిని చంద్రాతపము వేఁడిమికిఁ బైఁటచెఱఁ
గున ముసుఁగిడి నిజకేళీ వనిఁ జొచ్చి వియోగవహ్నిని వడఁబడి తెగువన్. 30

అ. అనిపలికి=అని చెలికత్తెతోఁ జెప్పి, పాన్పు=పఱుపునుండి, డిగ్గి=దిగి, కామిని=ప్రియసంగమేచ్ఛగలదైనవరూథిని, చంద్రాతపమువేఁడిమికిన్ = వెన్నెలవలనితాపమునకు, పైఁటచెఱఁగునన్ = పయ్యెదకొంగుతో, ముసుఁగిడి=ముసుఁగువేసికొని, ఎల్లయవయవములును మఱుఁగుపడఁ గప్పుకొని యనుట, నిజకేళీవనిన్=తనదైన యాటతోఁటను, చొచ్చి=ప్రవేశించి, వియోగవహ్నిన్ = విరహాగ్నిచేత, వడఁబడి=సంతాపమునొంది, తెగువన్=సాహసముతో-పైపద్యముతో నన్వయము.

సీ. చనుఁగప్పు దొలఁగ వాసనగాలి కెదురేఁగుఁ, బఱు వొప్ప నలుఁగులఁ బొఱుకరణి
నిడుదవేనలినూనెముడి వీడఁ జిగురాకుఁ, బొదఁ దూఱుఁ గార్చిచ్చుఁ గదియుకరణిఁ
బసిఁడిగాజులు పైకి వెసఁ ద్రోచి నునుఁదీఁగఁ, దెమలించు నురిత్రాడు వెదకుకరణి
మొలనూలు బిగియించి వెలఁది వెన్నెలఁ జొచ్చుఁ, బిఱుదీయ కేటిలోనుఱుకుకరణి
జడియ దళులకుఁ గురియు పుప్పొడుల మునుఁగు, మావికడ నిల్చు విరుల నెత్తావిఁ గ్రోలు
విషమనాయకు నేఁపుల విసివి విసివి, తనువుఁ దొఱఁగంగఁ దలఁచి యబ్జనరుహాక్షి.

అ. అబ్జనరుహాక్షి=తామరలవంటికన్నులు గలదైనయా స్త్రీ)-వరూథిని, విషమసాయకు నేఁపులన్=మన్మథునివైన బాధలచేత, (పా. విషమసాయకుతూపులన్=మన్మథునిబాణములచేత), విసివి విసివి=మిక్కిలివిసుఁగునొంది, తనువున్=దేహమును, తొఱఁగంగన్=విడుచుటకు, తలఁచి=ఎంచి, పఱువు=పఱుగు, ఒప్పన్=ఒప్పునట్లు, అలుఁగులన్=బాణములలో-బాణములు తనమీఁదికి వచ్చుచుండఁగా వాని కెదురుగా ననుట, (అలుఁగులన్=కత్తులమీఁద, అని కొందఱు.) పొఱుకరణిన్=పరుగెత్తువిధమున, చనుఁగప్పు=స్తనములకు మఱుఁగుగా నున్నపయ్యెఁట, తొలఁగన్=జాఱిపోఁగా, వాసనగాలికిన్=పరిమళముతోఁడిచల్లగాలికి, ఎదురేఁగున్=ఎదురుగాఁ బోవును, కార్చిచ్చున్=దావాగ్నిని, కదియుకరణిన్=చొచ్చెడిరీతిని, నిడుద . ముడి-నిడుద=నిడుపైన, వేనలి=జాఱుసిగయొక్క, నూనెముడి=దూముడి, వీడన్ = వదలిపోఁగా, చిగురాకుఁబొదన్ = చిగురుటాకులపొదలో, తూఱున్=చొచ్చును, ఉరిత్రాడు=మెడకు నురివేసికోఁదగినత్రాటిని, వెదకుకరణిన్=వెదకునట్లు, పసిఁడిగాజులు=బంగారుకడియములు, పైకిన్=మీఁదికి, వెసన్=వడిగా, త్రోచి=ఎగఁద్రోసి, నునుఁదీఁగెన్=నునుపుగలతీఁగెను, తెమలించున్=కదలించును-ఇటునటులాగుననుట, ఏటిలోన్=సముద్రమునందు, (ఏఱు శబ్దమునకు సముద్రమర్థమగుటకు "పాలేఱువేఁ ద్రచ్చుచో"నని ప్రయోగము.) ఉఱుకుకరణిన్=దుమికెడిలాగున, పిఱుదీయక=వెనుకదీయక, మొలనూలు=అల్లికపట్టెమొలత్రాటిని (ఒడ్డాణముకాదు.), బిగియించి=బిగియఁదీసి, వెలఁదివెన్నెలన్=తేటమీఱినవెన్నెలలో, చొచ్చున్=చొరఁబడును, అళులకున్=తుమ్మెదలకు, జడియదు=భయపడదు, కురియుపుప్పొడులన్=వానకురిసినట్టురాలుచున్న పుష్పపరాగములయందు, మునుఁగున్=మునుఁగును, మావికడన్ = మామిడిచెట్టునీడను, నిలుచున్ = నిలుచుండును, విరులనెత్తావిన్=పువ్వులయొక్క నిండినపరిమళమును, క్రోలున్ = త్రాగును-మూర్కొను ననుట (ఇందుఁ జెప్పఁబడిన చల్లగాలి మొదలగునవి విరహోద్రేకము కలుగఁజేయునవి గనుక విరహవేదనచేఁ బ్రాణములు తల్లడిల్లఁగా దేహత్యాగముచేయఁగోరి వానింజేరి శరీరమును శ్రమపెట్టుచుండె నని యెఱుంగునది విరహాతిశయమువలనిపరవశత్వము తాను దేవజాతి యగుటచేతఁ దనకుఁ జావు రాదనుటను మఱపించె ననుట దీనిచే నూహ్యము.) అలం. ఉత్ప్రేక్ష.

క. అట్టియెడ నమ్మృగేక్షణఁ, బట్టి సఖీజనము వెడఁగుఁబట్టీ తగవే
యిట్టితెగు వనుచుఁ జెక్కులఁ, దొట్టినకన్నీరు వోవఁ దుడుచుచుఁ బలికెన్. 32

అ. అట్టియెడన్ = ఆసమయమునందు, అమ్మృగేక్షణన్ = జింక చూపులవలె బెదరుచూపులుగల యావరూథినిని, సఖీజనము = చెలికత్తెలసమూహము, పట్టి = పట్టుకొని, వెడఁగుఁబట్టీ = వెఱ్ఱిబిడ్డా, ఇట్టితెగువ = ఇటువంటిసాహసము - ఇంత తెగించుట, తగవే = న్యాయమా, అనుచున్ = అని బుజ్జగించిపలుకుచు, చెక్కులన్ = చెక్కిళ్లయందు, తొట్టినకన్నీరు = కాఱినకన్నీటిని, పోవన్ = తేకపోవునట్లు, తుడుచుచున్ = వస్త్రముతో నొత్తుచు, పలికెన్ = ఇట్లుపలికెను.

ఉ. పూఁతపసిండివంటివలపుం బచరించుకులంబునీతికిన్
లేఁత గదమ్మ యిత్తెఱఁగు లేమ సురాంగన లెల్ల నిట్టినీ
చేఁతకు మెత్తురమ్మ దయసేయక తిన్ననిమేను వెన్నెలన్
వేఁతురఁటమ్మ యింత కనువేఁదుఱు సెల్లునఁటమ్మ యింతికిన్. 33

అ. లేమ = ఓచిన్నదానా - వరూథినీ, పూఁతపసిండివంటివలపున్ = మొలాముచేసినబంగారము వలెఁ బైకిమాత్రము తోఁచునట్టిమోహమును, పచరించు నీతికిన్ - పచరించు = తోఁపింపఁజేయునట్టి, కులంబు = జాతియొక్క, నీతికిన్ = న్యాయమునకు - అనఁగా మనసునందులేని మోహమును విశేషముగాఁ గలదని మీఁదికిఁ దోఁచునట్లు చేయునది భోగముజాతి, అట్టిజాతి మర్యాదకనుట, ఇత్తెఱఁగు = ఈవిధము - ఇట్లు నిజముగా మోహముఁబొంది తపించుట, లేఁత = చులుకన, కదమ్మ = కాదటమ్మా చులుకనయే యనుట, ఇట్టినీచేఁతకున్ = ఇటువంటినీనడతకు, సురాంగనలెల్లన్ = దేవతాస్త్రీలందఱును, మెత్తురమ్మ = మెచ్చుకొందురా - సరియని యొప్పుకొనుదురా యనుట, దయసేయక = (ఈశరీరమునెడల) కనికరింపక, తిన్ననిమేను = అందమైన యిటువంటిశరీరమును, వెన్నెలన్ = వెన్నెలయందు, వేఁతురఁటమ్మ = తపింపఁజేయుదురా - ఇటువంటికోమలశరీరమును వెన్నెలయందుఁ దపింపఁజేయరాదనుట ఇంతికిన్ = ఆఁడుదానికి, ఇంతకనువేఁదుఱు = ఇంతటికంటిపిచ్చి - ఒకనినిజూచినమాత్రముచేతనే వలపుగొని తపించుట, చెల్లునఁటమ్మ = తగునా - తగదనుట

తా. భోగముజాతి లేనిమోహమునుజూపి పురుషులను వంచించునదైయుండఁగా నట్టికులమునం దుఁబుట్టిననీవు నొకనిని నిజముగావలఁచి వాఁడు లభింపకపోయెనని యిట్లు విరహతాపమును బెంచునట్టి వెన్నెలలో దేహమును దపింపఁజేయుచుఁ గులముదైవగౌరవమును జెఱుచుటతగదు ఇందులకు నీకులము వారెవ్వరును సరియని యొప్పుకొనరు కనుక నీపనిని మానుకొనుము. మగవానికెంత కంటిపిచ్చియున్నను దగునుగాని యాఁడుదాని కది తగదు అప్సరసవైన నీవు మనుష్యమాత్రునివలచి తపించుట మిక్కిలి యవమానకరము

చ. ఉడుపతిబారికిన్ వెఱచి యూఱట యా నని పేరుటామనిన్
ముడివడుకంతుసేనలకు ముయ్యెలగుట్టయినట్టియిందు తా
నడఁగునె తాపవహ్ని మనమైమై హరిణేక్షణ ముల్లు వుచ్చి క్రొ
ఱ్ఱడిచినచంద మయ్యెఁ బదవేమా యెలదోఁటఁ జరింప కింటికిన్ 34

అ. హరిణేక్షణ = జింకకన్నులవంటి కన్నులుగలయోవరూథినీ, ఉడుపతిబారికిన్ - ఉడు = నక్షత్రములకు, పతి = నాయకుఁడైన చంద్రునియొక్క, బారికిన్ = హింసకు, వెఱచి = భయపడి, ఊఱటయాన్ =

ఆహింస కొంత యుపశమించును, అని=అనుకొని, పేరటామనిన్=ఘనమైన యీవసంతకాలమునందు, ముడివడుకంతుసేనలకున్=ఒక్కచోట మొత్తముగాఁ గూడుకొనునట్టి మన్మథునిదండులకు-(మన్మథుని దండు=చిలుకలు కోవెలలు మొదలగువానిసమూహము), ముయ్యేలగట్టు=కూడలిపట్టు-సంధించుచోటను, అయినట్టియిందున్=అయినయీతోఁటకు, రాన్=వచ్చినమాత్రముననే, తాపవహ్ని=విరహతాపమనెడి నిప్పు, అడఁగునె=ఉపశమిల్లునా-ఉపశమిల్లదనుట (ఇప్పు డీతోఁటకునికివచ్చుట), మనమైన్=మనంతటమనమే, ముల్లుపుచ్చి=గ్రుచ్చుకొన్న ముల్లూడఁదీసికి, కొఱ్ఱు=ఇనుపమేకును, అడిచినచందము=(ఆముల్లుతీసిన గాయములో) దిగఁగొట్టినవిధము, అయ్యెన్=ఆయెను. ఎలదోఁటన్ = ఈయుద్యానవనమునందు (లేక) లేఁతచెట్లుగలయీతోఁటయందు, చరింపక = తిరుగక, (పా. వసింపక = ఉండక), ఇంటికిన్ = మనయింటికి, పదమా = పోమా

తా. ఓవరూథినీ! నీవు కాలిలో గ్రుచ్చుకొన్నముల్లుతీసి యాముల్లున్నచోట నినుపమేకుదిగఁగొట్టుకొన్నట్టు చంద్రునివలనితాపమున కోర్వక మన్మథసేనలయిన చిలుకలులోనగునవి యన్నియు నొక్కచో మొత్తముగాఁ జేరుకొనుతావైన యీశృంగారపుఁదోఁటకు వచ్చితివి. ఇక్కడ నాతాపము హెచ్చునుగాని తగ్గదు. ఇఁక నిలువకుము శీఘ్రముగా నింటికిఁబొమ్ము. అలం లోకోక్తి, కావ్యలింగము, చంద్రోపద్రవమును పోఁగొట్టుకొనవలయునని యత్నింపఁగా నందులకు విరుద్ధమైన యుపద్రవము కలిగెననుటచేత విషమాలంకారధ్వనియును

క. అని యొడఁబడఁ బల్కుచుఁ దోడ్కొని వచ్చినఁ బాన్పుఁ జేరి గురుకుచ దనపైఁ
గనకనఁ గనలెడు వెలుఁగులఁ, గనికర మఱి మండు చంద్రుఁ గని కర మలుకన్.

అ. అని = ఇట్లని, ఒడఁబడన్ = సమ్మతించునట్లు, పల్కుచున్ = చెప్పుచును, తోడ్కొని వచ్చినన్ = (చెలికత్తెలు) వెంటఁబెట్టుకొని యింటికి రాఁగా, గురుకుచ = పెలుఁదచన్నులుగలదైన వరూథిని, తనపైన్=తనమీద, కనకనన్=మిక్కిలివేండ్రముగా, కనలెడువెలుఁగులన్=వెలుఁగుచున్న కిరణములతో, కనికరము = దయ, అఱి=చెడి-లేనివాఁడై, మండుచంద్రున్ = మండుచున్నచంద్రుని, కని=చూచి, కరము=మిక్కిలి, అలుకన్ = కోపముతో - మీఁదిపద్యముతో నన్వయము.

తా. మీఁదఁజెప్పినచొప్పున వరూథినికి సమ్మతిపడఁజెప్పి చెలికత్తె లింటికిఁ బిలుచుకొనిరాఁగా నావరూథిని మిక్కిలి వేండ్రముగా వెలుఁగుచున్నచంద్రునిఁజూచి యధికకోపము గలదై.

క. ఓచెల్ల విరహిణీవధ, మేమి చతురత నీకు దురితమే చేయుపనుల్
రాచఱికపుఫలమే యయు, య్యోచంద్ర వివేకమెఱుఁగవొ గురుసేవన్. 36

అ. ఓచెల్ల=అయ్యో-ఇది దుఃఖమును దెలుపును, చంద్ర = ఓరిచంద్రుఁడా, నీకు, విరహిణీవధము = ప్రియుల నెడఁబాసినస్త్రీలను జంపుట, ఏచతురత=ఏమినేర్పరితనము, దురితమే = పాపముచే, చేయుపనుల్ = కలిగించునట్టిపనులు, రాచఱికపుఫలమే = నీరాజత్వమునకుఁ బ్రయోజనమా, గురుసేవన్ = పెద్దలను సేవించుటచేత, వివేకము = యుక్తాయుక్తములు తెలిసికొనునట్టితెలివిని, ఎఱుఁగవో = తెలిసికొన్నవాఁడవుకావో యేమో-అనఁగా నాచార్యుఁడయిన బృహస్పతిని సేవించి యాయనభార్యయయిన తార నపహరించి పాపముగట్టుకొంటివిగాని మంచితెలివి గడించి పుణ్యకార్యము లేవియుఁ జేసినవాఁడవుకావు. కనుకనే నాబోఁటివిరహిణీస్త్రీలను బాధించునట్టి పాపకార్యమునకు నొడిగట్టితివి.

సీ. తొలుదొల్తఁ గమలమిత్రునివంక రూపొంది, దక్షాధ్వరధ్వంసితన్ను గనుటఁ
బరివేషమిషమునఁ బాశంబు దాల్చుటఁ, గప్పు దేహమునందుఁ గానఁబడుటఁ
గాలవశంబునఁ గాని తోఁపక యుంట, సతతనిష్ఠురగదాన్వితత గనుటఁ
బూని పాండుక్షేత్రమునఁ బ్రవర్తించుటఁ, బ్రకటానురాగతారకుఁ డగుటను
నంతరం బెద్ది యాత్మలో నరసిచూడ, రాజ నీకును నలధర్మరాజునకును
బ్రాణిలోకంబు బాధలఁబఱుచునపుడు, ధర్మపద మొక్కఁ డెక్కు డాధన్యునందు.

అ (ఈపద్యమునందు యమధర్మరాజునకును జంద్రునికిని సారూప్యము చెప్పఁబడియున్నది. కనుక నర్థద్వయము గ్రాహ్యము) తొలుదొల్తన్ = మొట్టమొదట, కమలమిత్రునివంకన్ = కమలములకు మిత్రుఁడైన సూర్యునివలన, రూపొందన్ = స్వరూపధారణము చేయుటచేతను- సూర్యకిరణములుసోఁకఁగాఁ గళలు వృద్ధిఁబొంది స్వరూపమేర్పడుటచేత నని చంద్రపరమైన యర్థము, సూర్యునికిఁ గొడుకై పుట్టుటచేతనని యమునిపరమైనయర్థము, దక్షాధ్వరిధ్వంసితన్ను-దక్షాధ్వరధ్వంసి=(చం.) దక్షప్రజాపతియజ్ఞమును జెఱిచిన వీరభద్రునియొక్క, (య.) దక్షునియజ్ఞమును జెఱుచునట్లు చేసిన శివునియొక్క, తన్ను = కాలితాఁపును, కనుటన్=పొందుటచేతను-మార్కండేయునినిమిత్తము శివుఁడు యమునిఁ దన్నెనను ప్రతీతి యిట గ్రాహ్యము, (చం) పరివేషమిషమునన్ = గాలిగుడియను నెపముచేత, పాశంబున్=వల్లెత్రాటిని, తాల్చుటన్ = ధరించుటచేతను-పరివేషము చుట్టు చుట్టుకొని యుండుట త్రాడుచుట్టుకొన్నట్లు తోఁచుచుండె ననుట (య) సర్వత్రప్రాణుల నాక్రమించు నెపమున స్వతస్సిద్ధ మయినవల్లెత్రాటిని ధరించుటచేతను, దేహమునందున్ = శరీరమునందు, (చం) కప్పు = కళంకరూపమయిననలుపు, (య) నల్లఁదనము, కానఁబడుటన్ = అగపడుటచేతను - చంద్రుని నల్లనికళంకమును యముని నల్లనిదేహకాంతియు నిట గ్రాహ్యములు- (చం) కాలవశంబునఁగాని = కాలాధీనతచేతఁగాని - అనఁగాఁ గళ లభివృద్ధిఁ బొందినప్పుడే కాని - (లేక) రాత్రికాలముననే కాని, (య) మరణకాలముననే కాని, తోఁపక=కనఁబడక, ఉంటన్ = ఉండుటచేతను, (చం) సతతనిష్ఠురగదాన్వితత = ఎల్లప్పుడును గడుసైన క్షయరోగముతోఁ గూడుకొని యుండుటను, (య.) సదా గదాయుధముతోడికూడిక కలిగియుండుటను, కనుటన్=పొందుటచేతను, పూని = ప్రయత్నపడి, (చం) పాండుక్షేత్రమునన్ = తెల్లనిశరీరముతో, ప్రవర్తించుటన్ = మెలఁగుటచేతను, (య) పాండుక్షేత్రమునన్ = పాండురాజుభార్యయందు, ప్రవర్తించుటన్=కామప్రవర్తనము చేయుటచేతను, (చం.) ప్రకట=ప్రసిద్ధమయిన, అనురాగ=ప్రేమకుఁదగిన, తారకుఁడు = అశ్విన్యాదినక్షత్రములు గలవాఁడు, అగుటన్=అగుటచేతను, (య) ప్రసిద్ధమయిన యెఱ్ఱఁదనముతోడి కనుగ్రుడ్లుగలవాఁడగుటచేతను, ఆత్మలోన్=మనసునందు, అరసిచూడన్ = విచారించిచూడఁగా, రాజ=ఓరిరాజనామముగల చంద్రుఁడా, నీకును, అలధర్మరాజునకును = ఆయమధర్మరాజునకును, ప్రాణిలోకంబున్ = ప్రాణులసమూహమును, బాధలఁబఱుచునప్పుడు = పీడించునప్పుడు, అంతరంబు = తారతమ్యము, ఎద్ది=ఎక్కడనున్నది - ఏవిషయమునందును లేదనుట, (అయినను) ఆధన్యునందున్=ఆపుణ్యాత్మునియందు, ధర్మపదము=ధర్మశబ్దము, ఒక్కఁడు=ఒకటి, ఎక్కుడు=అధికము-నీవు రాజు అతఁడు ధర్మరాజుగనుక నీకంటె నతనియందు ధర్మమువిచారించి యథార్థికులనే హింసించుగుణము కలిగియున్నది కనుకనే ధర్మశబ్ద మొకటి యాపుణ్యాత్ముని పేరి ననుసరించియున్నది.

నీ వధర్మాత్ముఁడవు గనుక ధార్మికుఁ డగుయమునికంటెను క్రూరుఁడ వని భావము. అలం. రూపకము. వ్యతిరేకము గమ్యము

చ. ఒక పెనుఁబాఁపఱేఁడు చలమొప్ప రసాతలసీమకుం జకో
రకములు భూతధాత్రికి సురల్ దివికిం బగదీఱునట్లుగా
మెకమెకపాటుతోడ నిను మ్రింగక పో రెపుడుం ద్రిలోకకం
టకుఁడవు గాన నీయొడలు నజ్జుగఁ జేసి కురంగలాంఛనా. 38

అ. కురంగలాంఛనా = జింకవలెఁ దోఁచునట్టికళంకము గలవాఁడా-చంద్రుఁడా, త్రిలోకకంటకుఁడవు = నీవు మూఁడులోకములకును క్షుద్రశత్రుఁడవు (బాధకుఁడవు), కావునన్ = కాఁబట్టి, చలము=మచ్చరము, ఒప్పన్ = అమరునట్లుగా, రసాతలసీమకున్ = పాతాళప్రదేశమునకు - పాతాళలోకమునకుననుట, ఒక పెనుఁబాఁపఱేఁడు = ఒక పెద్దసర్పరాజు-రాహువును, భూతధాత్రికిన్ = భూలోకమునకు, చకోరకములు = వెన్నెలపులుఁగులును, దివికిన్ = స్వర్గలోకమునకు, సురలు = దేవతలును, పగదీఱునట్లుగాన్ = మూఁడులోకములకుఁ గలశత్రుత్వము నశించునట్టుగా, మెకమెకపాటుతోడన్=మిట్టిపాటుతోడ-గర్వముతో, ఎపుడున్ = ఎల్లప్పుడును, నీయొడలు=నీశరీరమును, నజ్జుగఁ జేసి=అణువులణువులుగాఁ జేసి, (లేక) మిక్కిలి నలఁగఁగొట్టి, నినుమ్రింగకపోరు=నిన్నుఁగబళింపకపోరు=మ్రింగనేమ్రింగుదురనుట.

తా. నీవు మూఁడులోకములకును బాధకుఁడవు గనుక నిన్ను మూఁడులోకముల పగయు నడఁగునట్లుగాఁ బాతాళలోకమునకు రాహువును, భూలోకమునకుఁ జకోరపక్షులును, దేవలోకమునకు దేవతలును నిన్ను మ్రింగుదురు. రాహువు పర్వములందు గ్రసించుటయు, చంద్రుఁడు కిరణములను భక్షించుటయు, దేవతలు కళలను హరించుటయు నిట దెలియునది. అలం. ఉత్ప్రేక్ష

క. వాతాపివలన నెఱిఁగితొ, శీతకిరణ కడుపుఁ జొచ్చి జీర్ణింపనియా
రీతి నినుఁ దినియు నాయువు, చేత సురల్ చెడరుగాక చెఱుపవె వారిన్. 39

అ. శీతకిరణ = చల్లనికిరణములుగల చంద్రుఁడా, కడుపుఁజొచ్చి = కడుపునందుఁ బ్రవేశించి - ఆహారరూపమునఁ గడుపునందుఁ జేరి యనుట, జీర్ణింపనియారీతిన్=అఱుగకుండునట్టి యీప్రకారమును-ఈనేర్పననుట, (పా. ఈనీతిని=ఈన్యాయమును), వాతాపివలనన్=వాతాపియనెడిరాక్షసునివలన, ఎఱిఁగితో=తెలిసికొంటివో-నేర్చుకొంటివాయేమియనుట. సురలు=దేవతలు, నినుఁదినియును=నిన్నుభక్షించియు, ఆయువుచేతన్ = ఆయుస్సుగట్టిగానుండుటచేత, చెడరుగాక=నశింపరుగాని, వారిన్=(నశించువారైనపక్షమున) ఆదేవతలనుగూడ, చెఱుపవె=నశింపఁజేయవా-తప్పక చంపుదువనుట.

తా. వాతాపి యనురాక్షసుఁడు మేఁకగాఁగా మునివేషధారి యైనవానితమ్ముఁ డిల్వలుఁడు వానినిఛేదించి యామాంసమునువండి మునులకు విందుఁబెట్టఁగా వాఁడామునులకడుపులోఁజేరి జీర్ణముగాక స్వస్వరూపమునుధరించి భుజించినవారు పడియ వారికడుపుఁ జించుకొని బయిటికివచ్చుట విని నీవు వానినాశ్రయించి యావిద్య నేర్చుకొనితివేమో యెవ్వ రెన్నివిధముల భక్షించినను జీర్ణింపక బయటవచ్చుచున్నావు. అయినను నిన్నుఁ దినెడువా రగుదేవతలు చచ్చువారు కాకుండుటచే వారిని జంపలేకపోయితివి. చచ్చువారే యైనపక్షమునఁ జంపనే చంపుదువు.

తే. త్రిపురసంహార మొనరించునపుడు హరుఁడు, బండికల్లుగ నీమేనుగండి చేసె,
నదియు సెలవాఱె తెగటాఱవైతిచంద్ర, యకట రోహిణియెడ నపథ్యమునఁ జేసి.

అ. చంద్ర=ఓచంద్రుఁడా, హరుఁడు=రుద్రుఁడు, త్రిపురసంహారమున = అసురులవైన మూఁడు పట్టణములయొక్క నాశమును, ఒనరించునపుడు = చేయునప్పుడు, బండికల్లుగన్ = రథచక్రమగునట్టుగా, నీమేను=నీశరీరమును, గండిచేసెన్ =రంధ్రముచేసెను - నీశరీరమునందు రంధ్రముగలుగఁ జేసెననుట, అదియున్ = ఆరంధ్రముచేసిన గాయమును, సెలవాఱి = సెలవేసి - చీముపోసి రంధ్రములుపడి యనుట, రోహిణియెడన్ = ప్రియభార్యయయిన రోహిణివలని, అపథ్యమునఁజేసి=సంభోగసంబంధమయినయపథ్యముచేత, (పా. అపథ్యంబుగలిగి), తెగటాఱవైతి=చావవైతివి, అకట=అయ్యో

తా. అయ్యో చంద్రా! మాయభాగ్య మేమనవచ్చును. రుద్రుఁడు త్రిపురాసురసంహారము చేయునప్పుడు నిన్నుఁ దనరథమునకుఁ జక్రముగాఁ జేసికొనుటకై నీదేహమునందు బెజ్జము చేసెనుగదా. ఆబెజ్జపుగాయము సెలవేసి రోహిణితోడి సంభోగమువలని యపథ్యముచేత దోషించి నీవు చావఁగూడదా మమ్ము హింసపెట్టవలసియేమో యాగండముగడచి బ్రతికితివి

తే. పాలఁ బుట్టినమాత్రాన మేలిగుణము, నేఁడు నీకేల గల్గు నో నీరజారి
నీటఁ బుట్టినవాఁడు కాఁడొటు వహ్ని, గాల్చుచున్నాఁడు జగమెల్లఁ గరుణలేక.

అ. ఓనీరజారి=ఓరిచంద్రుఁడా, పాలన్ = క్షీరమునందు - పాలసముద్రమునందనుట, పుట్టినమాత్రనన్ =జనించినమాత్రముచేతనే, నీకు, నేఁడు=ఈదినము, మేలిగుణము = మంచిగుణము, ఏలకల్గున్ =ఎందులకై కలుగును- మంచిగుణము కలుగుటకుఁ బుట్టిన మంచిచోటు కారణముగా దనుట. వహ్ని=అగ్ని, నీటన్ =జలమునందు, పుట్టినవాఁడు, కాఁడొటు = కాఁడాయేమి - నీటిలోఁ బుట్టినవాఁడేయనుట, (అయినను) కరుణలేక = దయలేక, జగమెల్లన్ = లోకమునెల్లను, కాల్చుచున్నాఁడు = దహించుచున్నాఁడు.

తా. అగ్ని నీళ్లలోఁబుట్టి యెల్లలోకములను గాల్చుచున్నాఁడుగదా అట్లే నీవును పాలలోఁ బుట్టి లోకమును దపింపఁజేయుచున్నావు కనుక మంచి కలుగుటకు జన్మస్థానము కారణముగా గ్రహింపరాదు. ఉత్తమకులమునందుఁ బుట్టినను అధమకులమునందుఁ బుట్టినను నీచునకు నీచస్వభావమే కాని గొప్పస్వభావము రానేరదనిభావము అలం ప్రతివస్తూపమ.

క. గోవధము సేయుతురకల, దైవంబవు నీవు మొదలఁ దక్కక పాంథ
స్త్రీవధము సేయ రోయుదె, నీవర్తన మేమి చెప్ప నీరజవైరీ. 42

అ. నీరజవైరీ = కమలములకుఁ బగవాఁడవైనచంద్రుఁడా, నీవు, మొదలన్ = మొదటనే, గోవధము = గోవులఁజంపుటను, చేయుతురకలదైవంబవు = చేయునట్టివారైన తురకలకు దేవుఁడవు- అనఁగా తురుష్కులు చంద్రోదయమును జూడక దేవతాప్రార్థనాదులను జేయరు కనుక వారికిముఖ్యదైవమనుట, తక్కక = మానక, పాంథస్త్రీవధము = విరహిణీస్త్రీలయొక్క చంపుటను, చేయన్ = చేయుటకు, రోయుదె=ఏవపడుదువా - రోయనేరోయ వనుట, నీవర్తనము=నీనడవడి, ఏమిచెప్పన్, ఇఁకనేమని చెప్పవచ్చును

తా. ఓచంద్రా! నీవు మొదటనే గోహత్యచేయునట్టి తురకవారికి దేవుఁడవు. ఇట్టి నీకు విరహిణీస్త్రీలను బాధించునెడల నేవకలుగునా? అనఁగా గోహత్యచేయు భక్తులనే ప్రేరేపించువాఁడవైన నీ వేపాపమునకైన నోడిగట్టువాఁడవే యగుదువుగాని బ్రహ్మహత్యాదిమహాపాతకములు చేయ వెనుకదీయుదువా, యని భావము. అలం. కావ్యార్థాపత్తి.

క విడువక తలఁపయిఁ గొన్నాళ్లిడి చూచి కళంకి వగుట యెఱిఁ
గుడుకుచు దక్షాధ్వరమున, నడుగునఁ బడవైచె దాన నడఁగ.

అ. చంద్రా = చందమామా (నిన్ను), మహేశుండు = శివుఁడు, ఉఁ
పయిన్ = తనతలమీఁద (నలంకారముగా), కొన్నాళ్లు=కొన్ని దినములు, ఇడి=
నీయోగ్యతనుజూచి, (నీవు) కళంకివి = కళంకముగలవాఁడవు – అపవాదముగల
కావుట, ఎఱిఁగి = తెలిసికొని, ఉడుకుచున్ = తపించుచు – కోపము నొందినవా
రమునన్ = దక్షునియజ్ఞమునందు, అడుగునన్ = (వీరభద్రరూపముతో) తన
చెన్ = పడవేసిత్రొక్కెను, దానన్ = అట్లు కాలియడుగునఁ బడవేసి త్రొక్కుటచే
గవు = అణఁగిపోవు– చచ్చినవాఁడవు కావనుట.

తా ఓరిచంద్రా! శివుఁడు తొలుత నీయోగ్యత తెలియక తలమీఁద నలంకా
పిమ్మట నీయోగ్యత యిట్టిది యని తెలిసికొని దక్షయజ్ఞమునందు వీరభద్రరూపము
దవేసి త్రొక్కెనుగదా అట్లుత్రొక్కియు మొండిప్రాణములతోఁ జావకయే ఉ
విశేషోక్తి

క. గాండీవము నీచేతిది, పాండవునిం జేరఁబట్టి బ్రతికితి మావి
ల్లుండిన నేఁడు నిశాచర, చెండవె యల్లునికిఁ దోడు శితభల్లప

అ. నిశాచర=ఓరిరాత్రిసంచరించునట్టి రాక్షసుఁడా – చంద్రుఁడా, నీచేతి
దైన, గాండీవము=గాండీవమను పేరుగలవిల్లు, పాండవునిన్=పాండురాజుకొడుకై
బట్టి=చేరుటవలననేమో, బ్రతికితిమి=మేముజీవించియున్నాము, ఆవిల్లు=ఆగాండీవది
(నీచేతనే) ఉన్నపక్షమున, నేఁడు=ఈదినము–ఇప్పుడు, అల్లునికిన్=నీయల్లుఁడైన ఉ
సహాయముగా, శితభల్లములన్=వాఁడియైన బాణములచేత, చెండవె = (నీవుమమ్ము
డింపనే ఖండింపుదువనుట.

తా రాత్రితిరుగుటచేత రాక్షసుఁడనఁ దగినయోరిచంద్రా! తొలుత నీచేత
పేరుగలదొడ్డవిల్లు దైవికముగా నర్జునునిచేతఁ జేరుటవలననేమో మాకు నీచేఁజావక (
మకలిగెను. అట్లుగాక యావిల్లు నీచేతనే యున్నయెడ మన్మథునికిఁదోడై వాఁ
గించి యెప్పుడో మమ్ముఁజంపియుందువు అలం. ఉత్ప్రేక్ష

వ అని పలికి యక్కలికి తేనియ లొలుకుపూములుకుల జళుకుఁ
విలుతు నుద్దేశించి.

అ అనిపలికి=అనిచెప్పి – నిందించియనుట, అక్కలికి=ఆ స్త్రీ–వరూథిని,
ములు, ఒలుకుపూములుకులన్=చిందుచున్న పుష్పబాణములచేత, జళుకున్=భయ
చువిల్తున్=కలుగఁజేయుచున్న చెఱకువింటివానిని – మన్మథుని, ఉద్దేశించి=గుఱిం-

చ. తొడిఁబడఁ బాఱె పైకుఱికి ధూర్జటికంటికెడిండిమంటలో
నడపొడ గానరాక తెగటాఱెయొఁ గాలినయట్టిమ్రోడుకై
వడి రతిలోచనాంబువులవాన నిగిర్చితె పాంథబాధకై
మడియక నంగ యవ్వేలఁది మంగళసూత్రమహత్త్వ మెట్టిదో.

అ. అనంగ = అంగములేనివాఁడా-మన్మథుఁడా, (నీవు) తొడిఁబడన్ = తత్తఱపడునట్లుగా, పాఱి=పరుగెత్తి, పైకిన్ =(శివుని) మీఁదికి, ఉఱికి = దుమికి, ధూర్జటి . మంటలోన్ - ధూర్జటి= ఆశివునియొక్క, కంటి = నిప్పుకంటియొక్క, కడింది = అధికమైన - చల్లార్పశక్యముగాని, మంటలోన్ = మంటయందు, అడపొడగానరాక = ఉన్నజాడయే కనఁబడకుండునట్లు, తెగటాఱియున్ = నశించియు, కాలినయట్టిమోడుకైవడిన్ = (కాఱుచిచ్చుచేఁ) గాలినటువంటి మొరడువలె, పడియక = చావక - మొదలంటనశింపక, రతి . వానన్ -రతి= రతీదేవియొక్క, లోచన = కన్నులనుండి వెడలిన, అంబువులవానన్ = నీళ్లయొక్కవానచేత - దుఃఖాతిశయముచే వానవలె స్రవించిన కన్నీళ్లచేత ననుట, పాంథబాధకై = విరహిజనులహింసకొఱకై, ఇగిర్చితె = చిగిరించితివా - మరలబ్రతికితివాయనుట, అవ్వో... త్త్వము-అవ్వాలఁది=ఆరతీదేవియొక్క, మంగళసూత్రమహత్త్వము = తాలిబొట్టుమహిమ,ఎట్టిదో=ఎటువంటిదో- మిక్కిలి యద్భుతమైన దనుట.- మన్మథుఁడు తపస్సుచేయుచున్న శివుని తపోనిష్ఠ చెఱుపఁబోయె ననియు నప్పుడాశివుఁడు నిప్పుకన్ను దెఱచి యానిప్పుమంటవలన మన్మథునిఁ గాల్చి భస్మముచేయఁగా వానిభార్యయైన రతీదేవి వైధవ్యదుఃఖము ననుభవింపలేక యేడ్చె ననియు, అంతట దేవత లామెయెడలఁ గనికరించి మన్మథునికిఁ జావులేకుండ వరమిచ్చి యాదుఃఖమునుమాన్చిరనియుఁ బురాణకథ అలం విషమము, ఉపమ, ఉత్ప్రేక్ష, హేతువును.

శా. సాహంకారత శంకరుం డలిగి నేత్రాగ్నిం బయిం బంపినన్
స్వాహాకాముకుఁ డౌట నిన్నతఁడు గాకవం బోలు మోమోడి సం
దేహం బేని రతీశ నీవు మగుడన్ దేహంబుతో నుండు టె
ట్లాహా దైవము దోసకారులకె తోడై వచ్చు నెప్పట్టునన్. 47

అ. రతీశ = ఓరి రతిమగఁడవైన మన్మథుఁడా, సాహంకారతన్ = గర్వముతోఁ గూడినతనముచేత-నీవు గర్వించినవాఁడవగుటచేత, శంకరుండు=లోకములకు సుఖముకలుగఁజేయువాఁడైనశివుఁడు, అలిగి = కోపించి, నేత్రాగ్నిన్ = తననొసటికంటినిప్పును, పయిన్ = నీమీఁద, పంపినన్ =ప్రయోగింపఁగా, అతఁడు = ఆప్రయోగింపఁబడినయగ్ని, స్వాహాకాముకుఁడు = స్వాహాదేవినికామించినవాఁడు, ఔటన్ =అగుటచేత, మోమోడి=(కామమును బెంచువాఁడవైన నీయెడల) దాక్షిణ్యపడి, నిన్ను, కావంబోలున్ = కాపాడియుండవచ్చును, సందేహంబేని = (నిన్ను దాక్షిణ్యపడి యగ్ని కాల్పక మన్నించె ననుట) సందేహమయినపక్షమున, మగుడన్ = మరల, నీవు, దేహంబుతోన్ = శరీరముతో, ఉండుటెట్లు = ఉండుట యేవిధముగా సిద్ధించును దైవమున్ =దేవుఁడుఁగూడ, ఎప్పట్టునన్ = ఎప్పుడును, దోసకారులకే = పాపకార్యములు చేయువారికే, తోడైవచ్చున్ =సహాయమైవర్తించును, ఆహా = ఇది యాశ్చర్యము

తా. ఓరిమన్మథుఁడా ! నీవు గర్వించియున్నావని తెలిసి లోకములమేలు గోరునట్టిమహాదేవుఁడు తననేత్రాగ్నిని బ్రయోగించియు నాయగ్ని స్వాహాదేవిని గామించినవాఁడు గనుక నీయెడ దాక్షిణ్యపడి నిన్నుఁగాల్చి చంపకపోయెను అట్లుకానిపక్షమున నీ వెప్పుడో భస్మమై నశించియుందువు. దేవుఁడుఁ గూడ నీవంటిపాపకర్ములకే సహాయపడుచున్నాఁడుగదా అలం అర్థాంతరన్యాసము.

వ. జడ నొకయింత లేని నెఱిచక్కఁదనంబులెల్లఁ గూర్పఁగాఁ
బొడవయినట్టిధన్యుఁడవు కై భోగివి పూవిలుకాఁడ విట్టిసీ

వెడపక నిష్ఠురత్వమున కేకెట్లలవాటుగఁ జేసి తక్కటా
పడఁతులమీఁద నేయ రతిపయ్యెదకుఁ దనుపైనచేతులన్. 48

అ. జడను = మాంద్యము, ఒకయింత = కొంచెమయినను, లేని... ఎల్లన్ - లేని=లేకుండునట్టి, సౌందర్యము = నిండిన సౌందర్యగుణములను, ఎల్లన్ = అన్నిటిని, కూర్పఁగాన్ = రాశిగాఁ జేర్పఁగా, పొడవు = ఒక యాకృతిగా, అయి నట్టిధన్యుఁడవు=ఏర్పడిన పుణ్యాత్ముఁడవు-అనఁగా మిక్కిలి చక్కఁదనముగలిగి జాగరూకుఁడవై వర్తించునట్టి పుణ్యాత్ముఁడ వనుట, భోగివి=ఎల్లభోగముల ననుభవించువాఁడవు, పూవిలుకాఁడవు = (మృదువులైన) పుష్పములు విల్లుగాఁగలవాఁడవు, ఇట్టినీవు = ఇటువంటి మృదుత్వలక్షణములుగలనీవు, రతిపయ్యెదకున్ =రతీదేవి పైఁటకు, ననుపు = ఇంపు, (అనుపు=తగినవి, అనికొందఱు ) ఐనచేతులన్ = ఁయునట్టిచేతులతో, వెడపక = ఎడతెగక, పడఁతులమీఁదన్ = ఆఁడువారిమీఁద, ఏయన్ = బాణప్రయోగము చేయునట్లుగా-బాణప్రయోగము చేయఁదగినంతటి యనుట, నిష్ఠురత్వమునకున్ = కఠినత్వమునను, ఎట్లు = ఏవిధముగా, అలవాటుగన్ = అభ్యాస మగునట్లు, చేసితి=చేసినాఁడవు, తక్కటా=అయ్యో

తా. ఓరిమన్మథా! నీవు లోకములోని చక్కఁదనమంతయు నొక్కటిగాఁగూర్చి చేయఁబడినట్లు మిక్కిలి చక్కఁదనముగల భోగి నగుఁడవు మృదువులయినపుష్పములు విల్లుగాఁగలవాఁడవు. ఇటువంటి మృదుత్వచిహ్నములుగల నీవు రతిదేవి పైఁటకొంగు స్పృశింపఁదగిన మృదువులైన నీ చేతులను విరహిణీ స్త్రీలపై బాణములు ప్రయోగించునంతటి కఠినత్వమునకు నెట్లభ్యాసపఱిచితివి. అట్లభ్యాసపఱుచుట మిక్కిలి దుఃఖకరము. అలం. విషమము.

తే. అనుచు నిందించి వలవంత కొంకుమదింప, నవ్వరారోహవిదళితకహ్లారములకమ్మపుప్పొడిపై దుమారమ్ము రేఁచు, మలయమంథరపవనుపై కినలుక నృపాలమి.

అ. అనుచున్ = ఇట్లని, నిందించి = (మన్మథుని) దూషించి, అవ్వరారోహ = ఆమంచిపిఱుఁదులుగలది-ఆవరూథిని, వలవంత = మన్మథతాపము, ఇనుమడింపన్ = రెట్టింపఁగా-అంతకుమునుపటి రెండంతలుగా, వివళిత . దుమారమ్మున్ -విదళిత=వికసింపఁబడిన, హల్లకముల=ఎఱ్ఱకలువలయొక్క, కమ్మపుప్పొడిపైన్ = మంచివాసనగల పుష్పరజముమీఁదను, దుమారమ్మున్=సుమ్మును, రేఁచు పైన్ - రేఁచు=తనమీఁదికి వ్యాపింపఁజేయునట్టి, మలయ = గంధపుఁగొండనుండివచ్చెడి, మంథరపవనుపైన్ = మెల్లగా వీచునట్టి గాలిమీఁద, అలుక = కోపము, పొడమి = పుట్టి-దీనికి గతి పదమునందలి అనిపరిశ అనుదానితో నన్వయము

తా. అని యీపైని జెప్పినచొప్పున వరూథిని మన్మథుని నిందించి మన్మథతాపము రెండింతలుగా నెఱ్ఱకలువల పుప్పొడితోఁ జల్లగా వీచుచున్న పరిమళముతోడి దక్షిణపుగాలి సోఁకుటచేఁ దాపమధిక మగా గాలిపైఁ గోపించినదై. అలం. కావ్యలింగము

ఉ. అక్కట గంధవాహ తగవా హరిణాంకుని గూడి పాంథులం
బొక్కఁగఁ జేయఁ బాపకుని పొం దొనరించి జగమ్ము లేర్పఁసి
యక్కజమగామి మాన వదిరేయట్టిద చుల్కనివృత్తి దుర్గతుం
డొక్కనిఁ జొచ్చి క్రిందుపడునొండ్లకుఁ గీ డొనరింపఁ గల్గినన్. 50

అ. అక్కట = అయ్యో, గంధవాహా = మంచివాసననువహించినవాయువా, హరిణాంకునిన్ = చంద్రునిని, కూడి = కూడుకొని, పాంథులన్ = విరహులను, పొక్కఁగఁజేయన్ = తపింపఁజేయుట, తగవా = న్యాయమా, పావకునిపొందు = అగ్నితోడిసహవాసమును, ఒనరించి = చేసి, జగమ్ములు = లోకములను, ఏర్చునీయకొన్కి-అగామి = కాల్చునట్టి నీదైనయాయకార్యమును, మానవు=వదలవు, అదియట్టిద = ఆదుష్టస్వభావమటువంటిదే, దుర్జనుండు = దుష్టుఁడయినమనుష్యుఁడు, ఒండ్లకున్ = ఇతరులకు, కీడు = అపకారము, ఒనరింపన్ = చేయుటకు, కల్గినన్ = సందుకలిగినపక్షమున, చుల్కనివృత్తిన్ = అల్పవ్యాపారమునందు, ఒక్కనిన్ = ఎవఁడేనొకదుష్టుని, చొచ్చి = ప్రవేశించి-చేరి, క్రిందుపడున్ = (ఆ దుష్టునికి తాను) లోఁబడియుండును.

తా. ఓమందమారుతమా! నీవు చంద్రునితోఁ జేరుకొని మావంటివిరహిణులను దహింపఁ జేయుచున్నావు ఇది న్యాయము కాకపోయినను నిప్పునకుఁ దోడుపడి లోకములను గాల్చునట్టి దుష్టస్వభావముగల నీకు న్యాయమేయగును. దుష్టుఁడొకరికిఁ గీడుచేయ ననుకూలించినప్పుడు తనవంటిదుష్టునినొకనిని దోడుచేసికొని యా యల్పవ్యాపారమునందు వానికి లోఁబడి మెలఁగుట లోకస్వభావమే. అలం అర్థాంతరన్యాసము, పరికరాంకురము

క. నాలుకలు రెండు నిన్నుం, గ్రోలనె కల్పించె నలువ ఘోరాహికి న
న్నాలిగ్రహ మిపుడుఁ దెగఁ దినఁ, జాలద మృదుపవన విరహిజనదురితమునన్.

అ. మృదుపవన = ఓమలయమారుతమా, నలువ=చతుర్ముఖుఁడైన బ్రహ్మ, ఘోరాహికిన్=భయంకరమైన పామునకు-ఇది జాత్యేకవచనము, నాలుకలురెండు = రెండునాలుకలను, నిన్నుంగ్రోలనె= నిన్నుఁ దినుటకే, కల్పించెన్=కలుగఁజేసెను, అన్నాలిగ్రహము = ఆకుత్సితపుఁబిశాచము - (వేయేండ్లు జీవించినపాము పిశాచమగు నందురు గనుక నిట గ్రహమని చెప్పఁబడెను), ఇపుడును=ఇప్పటికిఁగూడ, విరహిజనదురితమునన్ = ప్రియులనెడఁబాసి తపించువారు చేసికొన్న పాపముచేతనోయేమో, తెగఁదినన్ = నిశ్శేషముగాఁ దినుటకు, చాలద=చాల నేచాలదు.

తా. ఓచల్లగాలీ! నిన్నుఁ బాములకు నాహారముగాఁ జేసినబ్రహ్మ నీయుపరానితనము నూహించియే వానికి రెండేసి నాలుకలు కలిగించెను. అట్లు రెండునాలుకలుగలవయ్యు నాపాములు నాబోఁటి విరహము నొందినవారు చేసికొన్న పాపముచేతనేమో యిప్పటికిని నిన్ను మిగులులేక తినఁజాలకయున్నవి. అలం. విశేషోక్తి

వ అని పలికి యక్కలకంఠకంఠి దీపించుతాపంబు పెల్లున మూర్ఛిల్లినం దోడిపల్ల
వోష్ఠు లల్లనల్లన హల్లకంబుల హిమాంబుపూరంబులం గర్పూరపటీరకర్దమా
సారంబులం జెంగావుల మృణాళభంగంబుల నంగంబులకుం జలువ పుట్టింప నెట్ట
కేలకుం దెలిసె నంతఁ బ్రభాతసమయం బగుటయు నొక్కపువ్వుబోఁడి వరూ
థినితో నిట్లనియె. 52

అ. అని=ఇట్లని, పలికి=(చల్లగాలిని) నిందించి, అక్కలకంఠకంఠి= కోకిలస్వరమువంటికంఠస్వరముగలదైనయావరూథిని, దీపించు... పెల్లునన్ - దీపించు = ప్రకాశించుచున్న, తాపంబు = విరహతాపముయొక్క, పెల్లునన్ = అతిశయముచేత, మూర్ఛిల్లినన్ = మూర్ఛపోఁగా, చూచి = చూచినవారై, తోడిపల్లవోష్ఠులు = దానితోఁగూడ నున్న చిగుళ్లవంటి పెదవులుగల స్త్రీలు-దాని చెలికత్తెలు,

అల్లనల్లనన్ = మెల్లమెల్లగా, హల్లకంబులన్ = చెంగలువలచేతను, హిమాంబుపూరంబులన్ = పన్నీటివెల్లువలచేతను-అధికముగాఁ బన్నీరుచల్లుటచేతననుట, కర్పూర..సారంబులన్-కర్పూర=పచ్చకర్పూరముచేర్చిన, పటీరకర్దమ=పలుచగాఁ జేసినమంచిగందముయొక్క, ఆసారంబులన్ = వానకురిసినట్లెడతెగక చల్లుటలచేతను, చెంగావులన్ = ఎఱ్ఱచాయవేసిన వస్త్రములచేతను, మృణాళభంగంబులన్ = తామరతూండ్లతునుకలచేతను, అంగంబులకున్=అవయవములకు, చలువ= చల్లఁదనము, పుట్టింపన్ = కలిగింపఁగా, ఎట్టకేలకున్ = అతిప్రయాసముచేత, తెలిసెన్ = (మూర్ఛవలన) తేఱెను, అంతన్=అప్పుడు, ప్రభాతసమయంబు=తెల్లవాఱుసమయము, అగుటయున్ = కాఁగా, ఒక్కపువ్వుబోఁడి=పువ్వువలె మనోహరురాలైన యొకచెలికత్తె, వరూథినితోన్=వరూథినినిగూర్చి, ఇట్లనియెన్= ఇట్లు పలికెను.

తా ఈవిధముగా వరూథిని మందమారుతమును నిందించి విరహతాపము మఱిమఱి హెచ్చఁగా మూర్ఛపోయెను. అప్పుడు చెలికత్తెలు బహువిధముల శైత్యోపచారములుచేసి దానిమూర్ఛదేర్చిరి. అంతలోపలఁ దెల్లవాఱుసమయము నయ్యెను. తెల్లవాఱినతోడనే యొకచెలికత్తె వరూథినితో నొకమాటచెప్పెను

ఉ. పాటన సేయమిం గురులు పైఁబడి శీర్ణపటీరపంకలా
లాటికమై దరస్మితవిలాసపుఁజంద్రిక డొంకి వాడుటం
దేటఁ దొఱంగి విన్ననగు నీమొగమో యన మాసి చంద్రుఁడో
పాటలగంధి వ్రాలె నదె భానురుచిం దనకందు మీఱఁగన్. 58

అ. ఓపాటలగంధి=ఓపాదిరిపువ్వులపరిమళమువంటి పరిమళముగలదానా-వరూథినీ, పాటనసేయమిన్ = దువ్వి దిద్దకపోవుటచేత, కురులు = తలవెండ్రుకలు, పైఁబడి= మీఁదికిగ్రమ్మి, శీర్ణ.. లాలాటికమై-శీర్ణ=చెదరిన, పటీరపంక = అనుకైనమంచిగంధముచేనైన, లాలాటికమై= పాపటబొట్టుగలదై, దర..చంద్రిక-దరస్మిత = చిఱునవ్వుయొక్క, విలాసపుఁజంద్రిక = ప్రకాశమనెడి వెన్నెల, డొంకి= అణఁగి, వాడుటన్ =వాడిపోవుటచేత, తేట=ప్రసన్నత, తొఱంగి= విడిచి-లేనిదైయనుట, విన్ననగు నీమొగమో = చిన్నవోయిన నీముఖమో యేమో, అనన్ =అనునట్లు, చంద్రుఁడు, మాసి=కాంతిచెడి, భానురుచిన్ =సూర్యప్రకాశముచేత, తనకందు= తనయొక్క కళంకము, మీఱన్ = అతిశయింపఁగా, వ్రాలెన్ = పడియెను-అస్తమించెననుట

తా. ఓవరూథినీ! దువ్వి చక్కఁబెట్టకపోవుటచేత నీతలవెండ్రుకలు విరియఁబడి క్రమ్ముకొని చెదరియనుకుగానుండెడి గందమంటి పాపటబొట్టువలెఁ గానరాఁగాఁ జిఱునవ్వుయొక్క ప్రకాశమనెడి వెన్నెల తగ్గి వాడుటచేతఁ గళాహీనమై యున్న నీమొగమువలెనే చంద్రుఁడు సూర్యప్రకాశముచేతఁ గాంతిహీనతనొంది తనకళంకము స్పష్టముగాఁ గనఁబడుచుండఁగా నస్తమించెను. అలం. ఉత్ప్రేక్ష.

సీ. సకుటుంబముగఁ బీఁగి చరమశైలముఁ జేరు, తుహినాంశుదుము దారు దొరయనంగ
నాసీరమై వచ్చు నలినబాంధవు లెక్క, యంబుపై దీపించు నద్ది మనఁగ
నరుణాగ్రనిబిడవాద్యములలోఁ గనుపట్టు, సమయశాంఖికు చేతిశంఖ మనఁగ
నినుఁ డప్పుడజుఁడౌటమును ముమ్మ పడివాగె, గొనివచ్చు ధాయంచ కొదమ యనఁగ

నుదయగిరిమీఁదఁ గోపురంబుండి నిగుడు, నహితరవిరశ్మిఁ జేబద్ధుఁడగుచుఁదోడి
బలఁగ మైనట్టిచుక్కలవలసత్రోవఁ, జూప నేతెంచె నన వేగుఁజుక్క పొడిచె.

అ సకుటుంబముగన్ = పెండ్లాముబిడ్డలు మొదలగువారితోఁ గూడ-అశ్విన్యాదులైనభార్యలతోను దక్కినచుక్కలతోనుననుట, వీఁగి=(సూర్యుఁడనెడి) శత్రువునకు వెఱచి పాఱి, చరమశైలమున్ = పడమటికొండను, చేర. దొర - చేర = చేరఁబోవునట్టి, తుహినాంశు = చంద్రునియొక్క, దుముదారుదొర = సేనానాయకుఁడో, అనంగన్ = అనునట్లుగాను, నానీరమై = సేనాముఖమై-దండునకు ముందునడచునదై, వచ్చు .. పైన్ -వచ్చు =వచ్చుచున్న, నలినబాంధవు = సూర్యునియొక్క, టెక్కియంబుపైన్ =ధ్వజముమీఁద, దీపించునద్దము =ప్రకాశించునట్టియద్దమో, అనఁగన్ = అనునట్లుగాను, అరుణాగ్రనిబిడవాద్యములలోన్ -అరుణ= సూర్యునియొక్క, అగ్ర = ఎదుటిభాగమునందు, నిబిడ= నిండుకొన్న, వాద్యములలోన్ = భేరిమొదలగువాద్యములలోపల, కనుపట్టు...శంఖము - కనుపట్టు = కనఁబడుచున్న, సమయ = కాలమనెడి, శాంఖికు = శంఖమూఁదువానియొక్క, చేతిశంఖము = చేతిలోనుండెడిశంఖమో, అనఁగన్ = అనునట్లుగాను, ఇనుఁడు = సూర్యుఁడు, అప్పుడు = ఆకాలమునందు - ఉదయకాలమునందనుట, అజుఁడు=బ్రహ్మ, ఔటన్ =అగుటచేత, (సూర్యుఁ డుదయకాలమునందు బ్రహ్మస్వరూపుఁడును, మధ్యాహ్నకాలమునందు మహేశ్వరస్వరూపుఁడును, సాయంకాలమునందు విష్ణుస్వరూపుఁడునై వెలుఁగునందురు) మునుమున్న = ముందుముందుగానే, పడివాగన్ = ఎక్కుటకుఁ దగినట్లాయితము చేయఁబడిన సవరణతో, కొని . కొదమ-కొని = ఎదుటికిఁదీసికొని, వచ్చురాయంచకొదమ = వచ్చునట్టిలేఁతప్రాయముగల రాజహంసయో, అనన్ =అనునట్లుగాను, ఉదయగిరిమీఁదన్ = తూర్పుకొండమీఁద, గోపురంబుండి = పగవారిజాడఁదెలిసికొనుటకై పొంచుండి, నిగుడు...రశ్మిచేన్ -నిగుడు = ముందటికిసాగివచ్చుచున్న, అహిత=శత్రువైన, రవి = సూర్యునియొక్క, రశ్మిచేన్ = కిరణములనెడిత్రాటిచేత, బద్ధుఁడు = కట్టఁబడినవాఁడు, అగుచున్ =అవుచును, తోడిబలఁగము = తన తోడిపరిజనము, ఐన . త్రోవన్ -ఐనట్టి = అయినటువంటి, చుక్కల = నక్షత్రములయొక్క, వలసత్రోవన్ = ఉపద్రవమునకు వెఱచి యితరదేశములకుఁ బోవుమార్గమును, చూపన్ = కనఁబఱచుటకై, ఏతెంచెను = వచ్చెనో, అనన్ = అనునట్లుగాను, వేగుఁజుక్క = తెల్లవాఱునపుడుదయించునట్టి శుక్రనక్షత్రము, పొడిచెన్ = ఉదయించెను, (పొడతోఁచెన్ = కనఁబడెను) అలం. ఉత్ప్రేక్ష, రూపకమును.

మ. సకలాశాగతి నర్మకోపవిరతి శ్రౌతక్రియారంభణా
త్మకవర్గత్రయికిన్ మదుచ్చరితశబ్దజ్ఞానమే మూల మిం
తకుఁ బోలన్ వినుఁ డంచుఁ దెల్పుగతిఁ జెంతం గొండపై పల్లలం
గృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁ ద్రిధంగిన్ భుగ్నకంఠధ్వనిన్. 55

అ. సకలాశా. . త్రయికిన్ - సకలాశాగతి = (జనులు) అన్ని దిక్కులనుగూర్చి పోవుట-జనులు వారివారిపనులు నెఱవేర్చుకొనుటకై యెవరుపోవలసినదిక్కునకు వారుపోవుట, నర్మకోపవిరతి = ప్రణయకోపముయొక్క విరామము - స్త్రీపురుషులు ప్రణయకోపమువిడిచి కూటమికిం జొచ్చుట, శ్రౌతక్రియారంభణ = శ్రుతియందు విధింపఁబడినక్రియలను జరుపనారంభించుట - వేదమునందు విధింపఁబడిన స్నానసంధ్యావందనాదులగు వారివారిధర్మములను జేయనారంభించుట, ఆత్మక = అనునీ

రూపములయిన, వర్గత్రయికిన్ = త్రివర్గమునకు-అర్థకామధర్మముల ప్రవృత్తికి ననుట, మదుచ్చరితశబ్దజ్ఞానమే-మత్ = నాచేత, ఉచ్చరిత=పలుకఁబడిన-సేనుగూయునట్టి, శబ్దజ్ఞానమే=ధ్వనియనెడిపదముల యర్థముయొక్క తెలివియే-ధ్వనివినుటవలనఁ గలిగెడి తెలివియే, ఇంతకున్ =ఈలోకమునకంతటికిని, మూలము=ముఖ్యకారణము, పోలన్=తగునట్లు-పరాకు లేక, వినుఁడు=(లోకులారా!మీరు) వినుఁడు, అంచున్ = అని, తెల్పుగతిన్ = తెలియఁజేయువిధమున, చెంతన్=సమీపమునందు, కొండపైపల్లెలన్=పర్వతముమీఁదనుండెడి చిన్నచిన్నగ్రామములందు, గృహోపరిన్=ఇండ్లమీఁదనుండి, కృకవాకులు=కోళ్లు, భుగ్నకంఠధ్వనిన్ = వంపఁబడినగొంతుయొక్క-ధ్వనిచేత, త్రిభంగిన్ = మూఁడువిధముల వినికిగల స్వరముతో, మొరసెన్ = ధ్వనించెను-కూసెను.

తా. లోకులు కోడికూఁతవినఁగానే, ధనార్జనమునకై పోవలసినవారు తమతమధనాగమన కార్యములకుఁ బోవుదురు. సంభోగపరులైన స్త్రీపురుషులు ప్రణయకోపములతో రాత్రియంతయు వ్యర్థముగాఁ గడిచిపోయెనేయని యాకోపములుమాని సంభోగింపఁజొత్తురు. వైదికధర్మనిష్ఠగలవారు తమ యనుష్ఠానములకు సమయమయ్యెనని స్నానసంధ్యావందనాదిక్రియలు సేయఁ బోవుదురు. కనుక నాపురుషార్థములు మూఁడు నారంభించుటకు సూచనచేయుచున్నవో యనునట్లు కొక్కొ-రోకో యని హ్రస్వదీర్ఘప్లుతరూపములయిన మూఁడుస్వరములతోఁ గోళ్లు కూసెను (కొండపైపల్లెల ననుటచేతఁ దఱుచుగాఁ గోళ్లు పెంపఁబడుట యట్టిచోట్లయందే యనియు, చెంతన్ అనుటచేత స్పష్టముగా వినవచ్చుచున్నవనియుఁ దెలియవలయును.) అలం ఉత్ప్రేక్ష, స్వభావోక్తియు.

మ. ఇనుఁ డస్తాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁ డేతేరఁ దద్దీప్తి నం
జనసంబంధజబాంధవంబున రతిశ్రాంతాంగనానేత్రకో
ణనికాయంబుల డాఁచి తద్ధవళిమం దాఁ బూనెనో చొప్పుమా
ర్ప నన న్వెల్వెలఁబాఱె దీపకళికావ్రాతంబు శాతోదరీ. 56

అ. శాతోదరీ = కృశించినకడుపుగల యోవరూథినీ, ఇనుఁడు=సూర్యుఁడు, అస్తాద్రికిన్=అస్తమయపర్వతమునకు, పోవన్ = పోఁగానే, దీపకళికావ్రాతంబు = దీపపుమొగ్గలయొక్క సమూహము, తద్దీప్తిన్=ఆ సూర్యునిప్రకాశమును, కొల్లగొని=అపహరించుకొని, నేఁడు= ఈదినము, ఏతేరన్ = ఆ సూర్యుఁడు మరలరాఁగా, చొప్పుమార్పన్ = (తానుదొంగయనుట తెలియకుండునట్లు) స్వరూపమును మార్చుటకై, అంజన... బాంధవంబునన్-అంజన= కాటుకయొక్క, సంబంధజ = సంబంధమువలనఁ గలిగిన, బాంధవంబునన్ =చుట్టఱికముచేత, రతి...నికాయంబులన్ -రతి = సంభోగ జాగరమువలన, శ్రాంత=బడలిన, అంగనా= స్త్రీలయొక్క, నేత్రకోణ=కనుఁగొనలయొక్క, నికాయంబులన్=సమూహములయందు, డాఁచి=(తానపహరించినసూర్యునికాంతిని) దాఁచిపెట్టి, తద్ధవళిమన్ = ఆ కనుఁగొనల తెల్లఁదనమును, తాన్ =తాను, పూనెనో=వహించెనోయేమో, అనన్ =అనునట్లు, వెల్వెలఁబాఱెన్ = మిక్కిలి తెల్లఁబాఱిపోయెను-కాంతిహీనమయ్యెననుట.

తా. ఓవరూథినీ! దీపములు సూర్యుఁ డస్తమింపఁగా వానిప్రకాశమును దానుపహరించి వెలుఁగుచుండి మరల సూర్యుఁడు రాఁగలఁ డని తెలిసి యతఁడు తమదొంగతనమును దెలిసికొనకుండుటకై మాఱువేషము వేసికొన్నవో యనునట్లు తమవలనఁగలుగు కాటుకయొక్క సంబంధమువలని చుట్టఱికము గలిగిన రతిశ్రమనొందిన స్త్రీలయొక్క కడగన్నులయందుఁ దమప్రకాశమును జేర్చి వారి కడకన్నుల

తెలుపును దామ తీసికొని తెల్లగాఁ గనఁబడుచున్నవి చూడుము. (తూర్పు తెల్లవాఱఁగానే దీపములు కాంతిహీనము లయ్యెననియు రాత్రియంతయు రతిపారవశ్యముచేత నిద్రలేకయున్న స్త్రీల కన్ను లెఱ్ఱవాఱెననియు భావము ) అలం ఉత్ప్రేక్ష.

శా. వాలారుంగొనగోళ్ల నీ వలసతన్ వాయించుచో నాటకున్
మేళం బైనవిపంచి నిన్న మొదలున్ నీ వంటమింజేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాతవాతాహతా
లోలత్తంత్రుల మేళవింపఁ గదవే లోలాక్షి దేశాక్షికిన్ 57

అ. లోలాక్షీ = చలించుచున్న కన్నులుగలదానా-వరూథినీ, నీవు, అలసతన్ = ప్రాలుమాలికచేత, వాలు = వాఁడి, ఆరుంగొనగోళ్లన్ = కలిగినగోటికొనలతో, వాయించుచోన్=మీటు నప్పుడు, నాటకున్ = నాటరాగమునకు, మేళంబు = స్వరస్థానములుకుదిర్చి జతపఱుపఁబడినది, ఐనవిపంచి = అయినట్టివీణ, నిన్న మొదలున్ = నిన్నటినుండి, నీవంటమింజేసి=నీవు తాఁకకపోవుటచేత, అవేళన్ = ఆరాగము పాడఁగూడనియాకాలమందును, ప్రభాత.. తంత్రులన్ - ప్రభాత = తెల్లవాఱు సమయమునందు, ఆయాత = వచ్చుచున్న-వీచుచున్న, వాత= గాలిచేత, ఆహత=కొట్టఁబడినవై, ఆలోలత్ = మిక్కిలికదలుచున్న, తంత్రులన్ = ఉక్కుతీఁగెలచేత, ఆయాలాపంబె = ఆ నాటరాగముయొక్కయభివ్యక్తినే ఆనాటరాగమునకుఁ గుదిర్చిన మెట్టువరుసనుఁ దగినపలుకుబడినే, పల్కెడున్ = వాఁగుచున్నది, కనుక, దేశాక్షికిన్ = దేశాక్షి యనురాగమునకు-ఉదయకాలమునందుఁ బాడఁదగిన దేశాక్షిరాగమునకు తగినట్టు, మేళవింపఁగదవే = మేళము కుదుర్పవే-స్వరస్థానములుకుదిర్చి జతపఱుపవే యనుట.

తా. ఓవరూథినీ! నీవు నిన్న మధ్యాహ్నకాలమునం దప్పటికిఁదగినట్టు నాటరాగమునకు స్వరస్థానములు కుదిర్చి మీటుచున్నవీణ యదిమొదలు నీవు దానిని ముట్టకుండుటచేత నిప్పుడును దంతులు గాలిచేఁగదలఁగా నామేళముతోనే వాఁగుచున్నది అది యీయుదయకాలమునకుఁ బొసఁగదు గనుక నిప్పటికిఁదగిన దేశాక్షిరాగమున కనుకూలముగా స్వరస్థానములుకుదిర్చి జతపఱుపుము. (ఇట్లనుటచేత మధ్యాహ్నకాలమునందుఁ బాడఁదగినది నాటరాగము ప్రాతఃకాలమునందుఁ బాడఁదగినది దేశాక్షిరాగము అనుట తేటపడుచున్నది ) అలం స్వభావోక్తి

చ. పలుకులు నేర్పువేళఁ గలభాషిణి నీ విటు లుండఁ బంజరం
బుల నరగన్ను వెట్టి ముఖముల్ చరణాగ్రనఖాళిఁ గోఁకుచున్
నిలుగుచు నావులించుచు వనీవిహగోత్కర మెట్లు వల్కు న
ప్పలుకులె యట్టు లెత్తి విని పల్కెడు వింటివె కీరశారికల్ 58

అ. కలభాషిణి = అవ్యక్తమధురధ్వనితో మాటలాడుదానా-వరూథినీ, పలుకులు=మాటలను, నేర్పువేళన్ = అభ్యసింపఁజేయు సమయమునందు, నీవు, ఇటులుండన్=ఇట్లు పరాధీనవై యుండుటచేత, పంజరంబులన్ - పెంపుడుపక్షులనుంచుగూండ్లయందు, కీరశారికలు=చిలుకలును గోరువంకలును, అరగన్ను వెట్టి = సగముమూఁతపడునట్లు కన్నులుమూసికొని-తూఁగిపడుచుననుట, ముఖముల్ = మొగములను, చరణాగ్రనఖాళిన్ = కాలిగోటి కొనలపంక్తితో, గోఁకుచున్ = గీఱుకొనుచును, నిలుగుచున్ = నిక్కిమేనువిఱుచుకొనుచును, ఆవులించుచున్ = ఆవులింతవిడుచుచును, వనీవిహగోత్కరము = అడవిపక్షులగుంపు, ఎట్లుపల్కున్ = ఏవిధముగాఁ గూయునో, అప్పలుకులె = ఆకూఁతలే, అట్టులెత్తి = మెడలెత్తుకొని, విని, పల్కెడున్ = కూయుచున్నవి, వింటివె = నీవు విన్నావా.

తా. ఓవరూథినీ! ప్రొద్దున లేచి నీచే మాటలు నేర్పఁబడుచున్న చిలుకలును గోరువంకలును నీవు పరాధీనురాలవై వాడుకచొప్పున మాటలు నేర్పక పోవుటచేతఁ బంజరములలోఁ దూఁగిపడుచు నితరధ్వనులని నీమాటలని భేదము తెలిసికోలేక యడవిపక్షులకూఁతలు విని యాకూఁతలే కూయుచున్నవి. అదివిని యవి యట్లుకూయకయుండుటకై యించుక యోపిక చేసికొని లేచి వానికి మాటలు నేర్పుము. అలం. స్వభావోక్తి, భ్రాంతిమంతమును.

మ. ఉరుసంధ్యాతపశోణమృత్కలితమై యొప్పారుబ్రహ్మాండ మ
న్గరిడిం గాలపుహొంతకాఁడు చరమాగస్కంధముం జేర్చుని
బ్బరపుం సంగడమో యనన్ శశి డిగెన్ బ్రాగ్భూమిభృత్కేతవే
తరబాహాగ్రపుసంగడం బనఁగ మార్తాండుండు దోఁచెన్ దివిన్. 59

అ. ఉరు..కలితమై-ఉరు = అధికమైన, సంధ్యాతప = ప్రాతస్సంధ్యారాగ ప్రకాశమనెడి, శోణమృత్ = ఎఱ్ఱమట్టితో, కలితమై=కూడుకొన్నదై, ఒప్పారుబ్రహ్మాండము=ఒప్పుచున్న బ్రహ్మాండము, అన్గరిడిన్ =అనియెడిసాముకూటమునందు, కాలపుహొంతకాఁడు=కాలమనెడిజెట్టి, చరమాగస్కంధమున్ =పడమటికొండయనెడిమూఁపునందు, చేర్చు సంగడమో- చేర్చు=పెట్టుకొనిన, నిబ్బరపున్ = నిశ్చలమైన, సంగడమో=గరిడీసాదనకొఱకు వెడి తిరుగటివంటి వట్టువైన సాధనయో-దీనిని సంకోలా అందురు, అనన్ =అనునట్లుగా, శశి=చంద్రుఁడు, డిగెన్ =దిగువవ్రాలెను, ప్రాగ్భూ...సంగడంబు- ప్రాగ్భూమిభృత్కేతవ = తూర్పుకొండయనెడి మిషచేనైన, ఇతర=మఱియొక, బాహాగ్రపు = భుజశిరస్సుయొక్క-రెండవమూఁపునందుంచుకొన్న యనుట, సంగడంబు = గరిడీసాదనకొఱకువెడి తిరుగటివంటి సాధనమో, అనన్ = అనునట్లుగా, మార్తాండుండు = సూర్యుఁడు, దివిన్ = ఆకాశమునందు, తోఁచెన్ = కనఁబడెను-ఉదయించెననుట.

తా. అధికమయిన ప్రాతస్సంధ్యారాగకాంతి యనెడియెఱ్ఱమట్టి పఱపిన బ్రహ్మాండమనెడి గరిడీ సాలయందుఁ గాలమనెడిజెట్టి సూర్యచంద్రులనెడిసంకోలాలజతను రెండుచేతులంబట్టి సాదనచేయుచుఁ దూర్పుపడమరకొండలనెడి రెండుమూఁపులయందును నిలిపినాఁడో యనునట్లు సూర్యచంద్రబింబములు గానఁబడెను. చంద్రుఁ డస్తమించుసమయమునందే సూర్యుఁడు నుదయించెనని భావము. (సాముకూటమునం దెఱ్ఱమట్టి పఱచుట ప్రసిద్ధము) అలం. రూపకము, ఉత్ప్రేక్ష, అపహ్నవమును.

చ. కరకరిఁ గూఁటఁ గట్టియిడఁగా మొఱవెట్టెడులీల బాలభా
స్కరకరకాండకందళవిఘట్టన నించుక వ్రాయివడ్డతా
మర మొఱవెట్టిపెట్టి పలుమాఱును వాకిలి దాఁటి యాఁగుచున్
మొరయు విపంచి మీటుగతి మ్రోసి యళుల్ వెడలెం గొలంకులన్. 60

అ. కరకరిన్ = క్రూరత్వముతో, గూఁటన్ = పక్షిగూఁటియందు, కట్టియిడఁగాన్ = కట్టిపెట్టినపక్షమున, మొఱవెట్టెడులీలన్ = పక్షులు మొఱ్ఱోయనికూయునట్లు, బాల. విఘట్టనన్-బాలభాస్కర=లేఁతసూర్యునియొక్క, కరకాండ=కిరణములసమూహములనెడికఱ్ఱలయొక్క, విఘట్టనన్ = విశేషమయిన తాఁకుడుచేత, ఇంచుక=కొంచెము, వ్రాయివడ్డ=విచ్చిద్వారమేర్పడిన, తామరన్=కమలమునందు, (ఇది యిచ్చట జాత్యేకవచనము), మొఱవెట్టిపెట్టి=దుఃఖముతో నఱచియఱచి, పలుమాఱును=మాటిమాటికిని, వాకిలి=(విచ్చిన)ద్వారమును, దాఁటి=వెడలి, ఆఁగుచున్=అట్లే పోకనిలుచుచును,

మొరయఁగ =మ్రోఁగునట్లు, విపంచి=వీణియ, మీటుగతిన్ = వాయించినరీతిగా, మ్రోసి=ఝుంకారధ్వనులుచేసి, అళులు = తుమ్మెదలు, కొలంకులన్ = సరస్సులయందు, వెడలెన్ =(తామరలలోనుండి) బయలుదేఱెను.

తా. ఎవ్వఁడేని పాపమని యెంచక క్రూరస్వభావముతోఁ గఱ్ఱచేత గూఁటిని గ్రువ్వఁగా నా గూఁటిలోని పక్షులఱచునట్లు వేఁడిమి చూపునట్టి స్వభావముగలవాఁడైనసూర్యుఁడు తనకిరణముల చేతఁ గమలములను విరియింపఁగా నందున్నతుమ్మెదలు వెలుపలవచ్చియు నావలఁ బోక యక్కడనే వీణమీటినట్లు ఝుంకారము చేయుచుండెను (సూర్యకిరణములు సోఁకఁగానే తామరలు విరిసెననియు వానిలోనితుమ్మెదలు వెలువడుచు ఝుంకారముచేసెననియు భావము.) అలం. స్వభావోక్తి, ఉపమయు.

చ. అడరునవీనభానుకిరణానల మంటినఁ గూడుకొన్నపు
ష్పాడికొలు చెల్ల మోచికొని పోయెడి సంభ్రమ మొప్పఁ గంటివే
పడఁతి భవద్విహారవనపద్మసరఃకుముదాలయంబులన్
వెడలుమిళిందబృందములు వీఁపుపిశంగిమకైతవంబునన్. 61

అ. పడఁతి=ఓవరూథినీ, భవ..లయంబులన్-భవత్ = నీదైన, విహారవన = శృంగారపుఁదోఁటయందలి, పద్మసరః = తామరకొలఁకులయందలి, కుముద = కలువలనెడి, ఆలయంబులన్ = ఇండ్లయందుండి, వెడలు...బృందములు-వెడలు = బయలుదేఱునట్టి, మిళింద=తుమ్మెదలయొక్క, బృందములు = గుంపులు, వీఁపుపిశంగిమకైతవంబునన్ = వీఁపుయొక్క పసుపువన్నె యనెడి మిషచేత, అడరు.. అనలము-అడరు=అతిశయించిన, నవీన=క్రొత్తదైన, భానుకిరణ = సూర్యకిరణము లనెడి, అనలము = నిప్పు, అంటినన్=తగులుకొనఁగా, కూడుకొన్నపుష్పాడికొలుచు=తమయొద్దఁజేరియున్న పుష్పాడి యనెడిధాన్యము, ఎల్లన్ = అంతయు, సంభ్రమము = తొట్రుపాటు, ఒప్పన్ = ఒప్పఁగా, మోచుకొని = వహించుకొని-ఎత్తుకొని, పోయెడిన్ = పోవుచున్నవి, కంటివే = చూచితివా.

తా. ఓవరూథినీ! నీశృంగారపుఁదోఁటలోని తామరకొలఁకులపై నీరెండ సోఁకఁగానే కలువలయం దున్నతుమ్మెద లాకలువలలోని పుష్పాడి యంటిన వీఁపులు పసుపువన్నెతో నొప్ప వానినుండి వెడలిపోవుటను జూడఁగా నిప్పంటుకొని కాలుచున్నయిండ్లలోనుండి తాము చేర్చిపెట్టుకొన్న ధాన్యమును వీఁపులపై మోసికొని పోవునట్టి కాఁపులవలెనే కనఁబడుచున్నవి చూడుము. (సూర్యోదయమై యెండప్రసరింపఁగానే కలువలు ముడిఁగెను. వానిలోఁ జిక్కకతప్పించుకొని తుమ్మెదలులేచిపోయె నని భావము.) అలం ఉత్ప్రేక్ష, రూపకము, అపహ్నవమును (21 పద్యముంజూచునది)

చ. కొలకొలఁ గూయుఁ బై నొఱగుఁ గుత్తుకఁ గుత్తుకఁ జుట్టుఁ బొఱుచి
ల్వాలక్రియఁ గానరానిగతులన్ మయిమైఁ బెనుచున్ జనించున
శ్రులఱుత నొత్తు సోలు నిలుచున్ విధిచాతురిఁ గూడియున్ రతిం
దలఁపవు కంటె పాసినవేతల్ దలఁపించుచుఁ గోకదంపతుల్. 62

అ. కోకదంపతుల్ = ఆలుమగలైనచక్రవాకపక్షులజతలు, విధిచాతురిన్ = దైవముయొక్క నేర్పుచేత-దైవానుకూల్యముచేతననుట, కూడియున్ = మరలఁగలసికొనియు, పాసినవేతల్ = (రాత్రి యంతయుఁ దాము) ఎడఁబాసియున్నప్పటికష్టములను, తలఁపించుచున్ = ఒకటినొకటి తలఁచుకొనునట్లుచేయుచు, కొలకొలఁగూయన్ = కలకలధ్వనికలుగునట్లుగా నఱచును, పైన్ = ఒకదానిపై

నొకటి, ఒఱగుక్ = మ్రొగ్గియానుకొనుచు, కుత్తుక కుత్తుకఁజొత్తుక్ = మెడతో మెడను గ్రమ్మును, పాఱు చిల్వలక్రియక్ = ఇటునటుఁ బ్రాఁకుచుఁబోవునట్టి పాములవలె, (పా. పోరువెల్వలక్రియక్ = పోరాడునట్టిపాములవలె), కానరానిగతులక్ = ఇది యిట్లనిచూచి తెలిసికొఁగూడనిరీతులతో, ఘయిమైక్ = దేహముతో దేహమును, పెనఁచుక్ = పెనవేసికొనును, జనించునశ్రులు = పుట్టుచున్న కన్నీళ్లను, అఱుతక్ = ఒండొంటి మెడ చేత, ఒత్తుక్ = తుడుచును, సోలుక్ = మైమఱచి వ్రాలును, నిలుచుక్ = ఏమియుఁదోఁచక నిలఁబడును, రతిందలఁపవు = సంభోగము నెంతమాత్రమును దలఁపవు, కంటె = చూచితివా.

తా. ఓవరూథినీ! చక్రవాకపక్షిదంపతులు ప్రొద్దుగ్రుంకఁగానే కన్నుఁగానక పరస్పరము నెడఁబాసి రాత్రియంతయు విరహదుఃఖము ననుభవించుచుఁ గడప పొద్దుపొడువఁగానే మరలఁ గలిసికొనియు రాత్రి యనుభవించినదుఃఖము నొకదాని కొకటి తెలియఁ దెలుపుకొని నానావిధములఁ గ్రిందుమీఁదుపడుచున్నవి గాని సంభోగము నిచ్ఛించినవే కావు చూడుము. అలం. స్వభావోక్తి, కారకదీపకము, ఉపమ, విశేషోక్తియు

ఉ. ఇందునిభాస్య వాఁ డనఁగ నింద్రుఁడొ చంద్రుఁడొ యాయుపేంద్రుఁడో
యిందులకై వగం బొగుల నేటికి నేఁటికి నందుఁ బోద మా
నందనభూమి భూమిసుర నందనుఁ డుండక పోఁడు రమ్ము నీ
చందము నందముం గనిన జవ్వని యెవ్వని వెఱ్ఱిఁ జేయదే. 63

అ. ఇందునిభాస్య = చంద్రునివంటి ముఖముగలదానా-వరూథినీ, వాఁడు = ఆప్రవరాఖ్యుఁడు, అనఁగక్ = అనఁగా, ఇంద్రుఁడో=దేవరాజో, చంద్రుఁడో = చందమామయో, ఆయుపేంద్రుఁడో= ఆప్రసిద్ధుఁ డైనవిష్ణువో-ఇంద్రచంద్రవిష్ణువులవంటి గొప్పవాఁడు కాఁడనుట-అనఁగా నింద్రచంద్రాదులొకవేళ విరక్తిహెచ్చి కానరాక పోవునంతటిమహిమ గలవారైన నగుదురుగాని మనుష్యమాత్రుఁ డైన యీ బ్రాహ్మణుఁ డట్టివాఁడు కానేరఁ డిక్కడనే యెక్కడనో యుండునని యర్థము, ఇందులకై = వాఁడు కనఁబడక పోయినంత మాత్రమునకై, వగక్ = విచారముతో, పొగులక్ = పరితపించుట, ఏటికిక్=ఎందుకు, నేఁటికిక్ = నేఁడుగూడ, అందుక్ = ఆయాటతోఁటకు, పోదము=పోవుదము, ఆనందనభూమిక్ = సంతోషస్థానమైన యాతోఁటయందు, భూమిసుర నందనుఁడు = బ్రాహ్మణకుమారుఁడయిన ప్రవరాఖ్యుఁడు, ఉండకపోఁడు = ఉండనేయుండును, రమ్ము = లేచిపోదము రమ్ము, జవ్వని = ఓచిన్నదానా, నీచందముక్ = నీవిధమును-నీవుచలించినవిధముననుట, అందముక్=నీచక్కఁదనమును, కనినక్ = చూచినయెడ, ఎవ్వనిక్ = ఎంతవిరక్తునినైనను, వెఱ్ఱిక్ = కామవికారపుఁబిచ్చిగలవానిఁగా, చేయదే = చేయకపోవునా-చేయనేచేయుననుట నీకెట్లో అట్లు వానికిని కామవికారమువలని తాపము కలిగియే యుండునని భావము. అలం ఉపమ, ప్రతిషేధము, కావ్యార్థాపత్తియు

ఉ. ఏల దురంతవేదన మెయిం బొరలాడెదు తాల్మి దక్కి మే
లే లలితాంగి యెంతపని కెలె మ్మిది విప్రవరుండు గోలయుం
బాలుఁడు గాన నప్పటికిఁ బైఁబడఁ గొంకెను గాని వాని కిం
కా లొకచోట నిల్చునె వగక్ మగుడక్ నినుఁ జూచునంతకున్. 64

అ. లలితాంగి = ఒప్పిదమయిన యవయవములుగలదానా-వరూథినీ, ఏల=ఎందులకై, తాల్మి = ధైర్యము, తక్కి = విడిచి, దురంతవేదన మెయిన్ = అంతములేనిబాధచేత, పొరలాడెదు = క్రిందు మీఁదుపడెదవు, మేలే = ఇదిమంచిదా-ఇది యుక్తముకాదనుట, ఇది = ఇప్పుడు నీప్రియునిఁ గనిపట్టి తెచ్చుట, ఎంతపనిలెమ్ము = ఎంతమాత్రపుఁబనిలే-అసాధ్యమైనపని కాదనుట, (ఇందు లెమ్ము అనునది యలక్ష్యతనుదెలుపును ) విప్రవరుండు = ఆబ్రాహ్మణశ్రేష్ఠుఁడు, గోలయున్ = ముగ్ధుఁడును - యుక్తాయుక్తవివేకములేనివాఁడును, బాలుఁడున్ = పసివాఁడును, కానన్=కాఁబట్టి, పైఁబడన్ = నీవు వానిమీఁదఁబడి కౌఁగిలింపఁగా, అప్పటికిన్ = అసమయమునకు, కొంకెనో = ఏమిబెదరవచ్చునో యని జంకెనోయేమో, కాక = అంతేకాని, వానికిన్ = ఆబ్రాహ్మణునికి, మగుడన్ = మరల, నినుఁ జూచునంతకున్ = నిన్నుఁజూచునంతవఱకును, వగన్ = నిన్నువదలినవిచారముచేత, కాలు = పాదము, ఒకచోటన్ = ఒకతావునందు, నిల్చునె = నిలుకడగలిగియుండునా-ఉండదనుట

తా. ఓ వరూథినీ ! నీవేమోవిచ్చిపట్టి యిట్టిమితిలేని విచారము పెట్టుకొని సంకటపడు చున్నావు ఆబ్రాహ్మణుని లోఁబఱుచుకొనుట యెంతమాత్రపుఁబని వాఁడు యుక్తాయుక్తములు తెలిసికోలేనిమూఢుఁడును బసివాఁడును గనుక నీవు పైఁబడి కౌఁగిలించుకొన్నను పంకోచపడి తొలఁగి పోయెనుగాని యితరముకాదు అయినను నిన్నుమరలఁజూచి మాటలాడునంతవఱకు వానికి నొకచోట నెమ్మదిగా నిలిచియుండ మనసొప్పునా. తానే నిన్ను వెదకుకొనివచ్చును.

క. రారమ్మనుటయు దివిజ, న్నారీరత్నంబు నికటనాకధునీక
ల్హారాంభోరుహమధురస, ధారాచంద్రకితసలిలధౌతానన యై. 65

అ. రారమ్ము=రావేరాయని, అనుటయున్ = చెలికత్తెయనఁగా, దివిజన్నారీరత్నంబు = దేవతాస్త్రీలలో శ్రేష్ఠురాలయిన వరూథిని, నికట ఆననయై-నికట = సమీపమునందున్న, నాకధునీ = ఆకాశగంగయందలి, కల్హార = చెంగలువలయు, అంభోజ = కమలములయు, మధురస = పూఁదేనెయొక్క, ధారా=దారలచేత, చంద్రకిత=నెమిలియీఁకకన్నులవన్నెజిడ్డు దేఱునదిగాఁజేయఁబడిన, సలిల=నీటిచేత, ధౌత = కడుగఁబడిన, ఆననయై=ముఖముగలదై - పైపద్యముతో నన్వయము.

తా. ఈమీఁద జెప్పఁబడినరీతిని జెలికత్తె బోధింపఁగా వరూథిని కలఁకదేఱి లేచి సమీపమునందుఁ జెంగలువలవలననుండియుఁ దామరలనుండియు జాఱినపూఁదేనెచే నెమిలియీఁకలలోని కన్నులవన్నెగలజిడ్డుతేలుచుఁ బాఱుచున్న గంగనీటిలో మొగము కడుగుకొన్నదై.

సీ. ఘనసారపంక మొక్కలతాంగి దెచ్చిన, మట్టి వ్రేలనె చుక్కబొట్టు పెట్టి
యింతియొక్కతె పూవు లెత్తులె త్తినఁజూచి, విసువుతో నొకకొన్ని విరులుదుఱిమి
పడఁతి యొక్కతె రత్నపాదుకలిడ నిల్చి, తొడుగ కవ్వలికిఁ బోనడుగువెట్టి
బాగాలు వెస నొక్కపద్మాక్షి యొసఁగిన, వెగ్గలం బని కొన్ని వెడల నుమిసి
సగము గొఱికినయాకును సఖులుపిలువ
సగ మొసఁగును త్తరముఁ దెల్వి సగము మఱపు
సగము నయి చింతచే సగ మగుచు నరిగె
నవ్వరూథిని యంతికోద్యానమునకు. 66

అ. ఒక్కలతాంగి = తీఁగవంటి దేహము గలయొకపరిచారిక, ఘనసారపంకము = పచ్చకర్పూరము చేర్చి యనుకుసగాఁ గలిపినగంధమును, తెచ్చినన్ = తేఁగా, వ్రేలసె = కొనవ్రేలితోఁ జే, ముట్టి= తాఁకి, చుక్కబొట్టు పెట్టి=కొంచెము త్తి నొసటఁ జుక్కవలెబొట్టుపెట్టుకొని, ఇంతియొక్కతె=ఇంకొక్కపనికత్తె, పువ్వుటెత్తులు = కుచ్చుగాఁగట్టినపూదండలు, ఎత్తినన్ = ఎత్తి చేతఁబట్టుకోఁగా, చూచి = దానితట్టుచూచి, విసువుతోన్ = విరక్తితో, ఒకకొన్నివిరులు = అందుఁగొన్నిపువ్వులుమాత్రము, తుఱిమి = కొప్పునఁజెరివుకొని, పడఁతియొక్కతె = మఱియొకపరిచారిక, రత్నపాదుకలు= రత్నములు పొదిఁగినపావకోళ్లు, ఇడన్ = ముందఱితట్టుతెచ్చి పెట్టఁగా, నిల్చి=సరిగానిలిచి, తొడుగక=కాలియందుధరింపక, అవ్వలికిఁబోన్ = ఒకప్రక్కకుఁ దొలఁగిపోవునట్లుగా, అడుగువెట్టి=పాదమును బావలపై నానించి, ఒక్కపద్మాక్షి=ఇంక నొక్క పరిచర్యచేసెడి స్త్రీ), వెసన్ = శీఘ్రముగా, బాగాలు = సన్నగానొత్తినపోఁకచెక్కలు, ఒసఁగినన్ = ఇయ్యఁగా, వెగ్గలంబు = అధికము, అని= అనిచెప్పి, కొన్ని = ఆపోఁకచెక్కలలోఁ గొన్నిటిని, వెడలనుమిసి=బయటికివెడలునట్లుగా నుమిసి, సగముకొఱికినయాకును = సగముమాత్రముకొఱికిన తములపాకును, సఖులు = చెలికత్తెలు, పిల్వన్ = పిలువఁగా, సగము = పూర్తిలేనిదిగా, ఒసఁగునుత్తరమును = ఇచ్చునట్టిమఱుమాటయు, తెల్వి=జ్ఞానము, సగమును, మఱపు=అజ్ఞానము, సగమును, ఐ = కలదై-ఉండియు లేనిదైన తెలివితో ననుట, చింతచేన్=విచారముచేత, సగము=చిక్కిసగమైనది, అగుచున్ = అవుచును, అవ్వరూథిని, అంతికోద్యానమునకున్ = ఇంటివెంబడి యుద్యానవనమునకు, చనియెన్ = పోయెను.

తా. వరూథిని ప్రియవిరహవేదనచేత విరక్తినొందినదై గంధముపూసికొనక పువ్వులు కొప్పునఁ జక్కఁగాఁ బెట్టుకొనక పావకోళ్లు కాళ్లఁదొడుగక వక్కలాకు లొల్లక చెలికత్తెలాడుమాటలకు బదులుమాటలు సరిగాఁ జెప్పక స్మృతిగల్గియు లేనిదానివలెనే విచారముచేఁ గృశించిన దేహముగలదై మెల్లగా నింటివెంబడి శృంగారపుఁదోఁటకుఁ బోయెను.

వ. ఆసమయంబున దేవజాతిత్వజనితవిమలజ్ఞానపాటవంబునం దద్వృత్తాంతంబు సమస్తంబు నెఱుంగుటం జేసి. 67

అ. ఆసమయంబునన్ = ఆయుద్యానవనమునకుఁ బోవునప్పుడు, దేవ పాటవంబునన్ - దేవజాతిత్వ = దేవజాతియగుటవలన, జనిత = పుట్టిన, నిజ = తనదైన, విమల = స్వచ్ఛమైన, జ్ఞాన = తెలివియొక్క, పాటవంబునన్ = సామర్థ్యముచేత, తద్వృత్తాంతంబు = ఆవరూథినిసమాచారము, సమస్తంబున్ = అంతయును, ఎఱుంగుటంజేసి = తెలిసినవాఁడగుటచేత, (కర్త గంధర్వుఁడు.)

శా. ఏగంధర్వుఁడు తద్విలాసములు మున్ వీక్షించి తా నెంతయున్
రాగాంధుం డయి కోరి హత్తక కడున్ రారాపులం గంతుఁ డు
ద్వేగం బందఁగఁ జేయ నెవ్వగల నువ్విళ్లూరుచున్ వేఁగువాఁ
డాగంధర్వకుమారుఁ డంగభవవిద్యాపారగుం డాత్మలోన్. 68

అ. మున్ను = మునుపు, ఏగంధర్వుఁడు, తద్విలాసములన్ = ఆవరూథినియొక్క శృంగారచేష్టలను, ఈక్షించి = చూచి, తాన్ = తాను, ఎంతయున్ = మిక్కిలి, రాగాంధుండు=అనురాగముచేతఁ గన్నుగాననివాఁడు-మోహపరవశుఁడు, అయి=ఐ, కోరి= వరూథినితోడికూటమిన పేక్షించి, హత్తక = ఫలపడక, కంతుఁడు = మన్మథుఁడు, కడున్ = మిక్కిలి, రారాపులన్ = మాటిమాటికి

రాపిడిచేయుటలచేత, ఉద్వేగంబు = చిత్తభ్రమమును, అందఁగఁ = పొందునట్లు, చేయన్ = చేయఁగా, నెవ్వఁగలన్ = అధికమైనవిచారములచేత, ఉవ్విళ్లూరుచున్ = (వరూథినికూటమికై) త్వరపడుచు, వేఁగువాఁడు = తపించుచుండువాఁడో, అంగభవవిద్యాపారగుండు = మన్మథవిద్యయందు నిపుణుఁడయిన, ఆగంధర్వకుమారుఁడు = యౌవనవంతుఁడైనయాగంధర్వుఁడు, ఆత్మలోన్ = తనమనస్సునందు–పైపద్యముతో నన్వయము

తా. మును పాకగంధర్వుఁడు వరూథినిసౌందర్యమును దానిశృంగారచేష్టలను జూచి మోహించి యది యందులకు సమ్మతింపకపోఁగా దానిని వలపించునుపాయము గానక నాఁటనుండి మన్మథవేదన పొందుచున్నవాఁడై వరూథిని ప్రవరాఖ్యునివలచి వాఁడుతనొల్లమిచేత మన్మథవ్యథపడుచున్నవృత్తాంతము విని తనమనసులో నిట్లాలోచించెను

ఉ. ఒక్కొకవేళఁ బద్మముఖు లొల్లమి సేయుదు రొక్కవేళఁ బె
న్మక్కువ నాదరింతురు క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్
పక్కన వేసరం జన దుపాయములం దగునిచ్చకంబులం
జిక్కఁగఁ జేసి డాసి సతిచిత్తముఁ బట్టి సుఖింపఁగాఁ దగున్. 69

అ. పద్మముఖులు=తామరలవంటిముఖముగలవారు–స్త్రీలు, ఒక్కొకవేళన్ = ఒక్కొక్కసమయమునందు, ఒల్లమిసేయుదురు = అపేక్షింపకపోవుదురు, ఒక్కవేళన్ = ఒకానొకసమయమందు, పెన్మక్కువన్ = అధికాపేక్షతో, ఆదరింతురు=ఆదరణచేయుదురు, జవరాండ్రచిత్తముల్ = యౌవనవతులైన స్త్రీలయొక్క మనసులు, క్షణక్షణముల్ =ప్రతిక్షణమును మాఱుచుండునవి, (కాఁబట్టి) పక్కనన్ =తటాలున – కొంచమైనను నిదానింపక యనుట, వేసరన్ = విసుగుట, చనదు = తగదు, ఉపాయములన్ =(బహువిధములయిన) ఉపాయములచేతను, తగునిచ్చకంబులన్ =తగిన మెప్పుమాటలచేతను, డాసి=దగ్గఱఁజేరి, చిక్కఁగఁజేసి=చిక్కించుకొని, సతిచిత్తముఁబట్టి=ఆఁడుదానిమనసు ననుసరించి, సుఖింపఁగాన్ =సంభోగసుఖము ననుభవించుట, తగున్ =యుక్తమగును

తా. స్త్రీలు చపలచిత్తలు గనుక నొకసమయం దొల్లనివారివలెఁ గనఁబడినను మఱియొక్కసమయమునందుఁ దామే వలచినవారై ప్రేమఁజూపుదురు. ఇప్పు డిది యనాదరముచేసెను దీనితో మాటలాడరాదని విసుగుకొని తొలఁగిపోరాదు. సమయముచూచి తగినయుపాయము పన్ని దగ్గఱఁజేరి మనసుకరఁగునట్టి మెప్పుమాట లాడి లోఁబఱుచుకొని మనసుకరఁగించి రతిసుఖము ననుభవించుట యుచితమని యాలోచించెను. అప్రస్తుతప్రశంస, కావ్యలింగము

క. అని తలఁచి యవ్విలాసిని, యనిశము క్రీడించుపుష్పితారామంబున్
మును కలుగఁ జొచ్చి యొకచం, దనభూజమునీడ నిల్చి దంభం బమరన్. 70

అ. అనితలఁచి=అని యీవిధముగానాలోచనచేసి, అవ్విలాసిని = విలాసవతియైనయావరూథిని, అనిశము = ఎల్లప్పుడును, క్రీడించుపుష్పితారామంబున్ = విహరించునట్టిపూఁదోఁటను, మునుకలుగన్ =ముందుమించి–వరూథిని యాతోఁటకు రాఁగలదని తెలిసి యది రాకముందే యనుట, చొచ్చి = ప్రవేశించి, ఒకచందనభూజమునీడన్ = ఒకగంధపువృక్షము నీడయందు, నిల్చి = నిలువఁబడి, దంభంబు=మాయ, అమరన్=ఒప్పఁగా–పైపద్యముతో నన్వయము.

సీ. అర్ధచంద్రుని తేటఁ నవఘళించు లలాట, పట్టిఁ దీర్చిన గంగమట్టితోడఁ
జెక్కుటద్దములందుఁ జిగివెల్లువలు చిందు, రమణీయమణికుండలములతోడఁ
బసిఁడివ్రాఁత చెఱంగుఁ మిసిమి దోఁపఁ జెలంగు, నరుణాంశుకోత్తరీయంబుతోడ
సరిలేని రాకట్టుఁ జాళువా మొలకట్టు, బెడఁగారు నీర్కావిఁ బింజెతోడ
ధవళధవళము లగు జన్నిదములతోడఁ, గాశికాముద్ర యిడిన యుంగరముతోడ
శాంతరస మొల్కు బ్రహ్మతేజంబుతోడఁ, బ్రవరుఁ డయ్యె వియచ్చర ప్రవరుఁ డపుడు.

అ. అపుడు = ఆసమయమునందు, వియచ్చర ప్రవరుఁడు = గంధర్వశ్రేష్ఠుఁడు, అర్ధచంద్రుని తేటన్ = అరచందమామయొక్క ప్రసన్నతను, అవ..పట్టిన్ - అవఘళించు = తిరస్కరించునట్టి, లలాటపట్టి = పలకవంటినొసటియందు, తీర్చినగంగమట్టితోడన్ - తీర్చిన = తిలకముగాదిద్దిన, గంగ మట్టితోడన్ = గంగానదిలోనిమృత్తికతోను - స్నానముచేసి సంధ్యవార్చునపుడు నీటిలోనిమట్టియు త్తి నొసటఁ బెట్టుకొనుట సంప్రదాయము, చెక్కుటద్దములందున్ = అద్దములవంటిచెక్కిళ్లయందు, జిగివెల్లువలు = ప్రవాహమువలె వ్యాపించు కాంతివిశేషములు, చిందు.. తోడన్ - చిందు = ప్రసరించునట్టి, రమణీయ = అందమైన, మణి = రత్నములుచెక్కిన, కుండలములతోడన్ = చెవిపోఁగులతోను, పసిఁడి ..మిసిమి - పసిఁడివ్రాఁత = బంగారుసరిగతీఁగతో నక్షరపంక్తివలె నేసిన, చెఱంగు = కొంగులయొక్క, మిసిమి = కాంతివిశేషము, తోఁపన్ = కనబడుచుండఁగా, చెలంగు.. తోడన్ - చెలంగు = ప్రకాశించునట్టి, అరుణ = ఇంచుకయెఱుపుగల, అంశుక = రంగు గల, ఉత్తరీయంబుతోడన్ = జందెమువాటుగా మీఁదవేసికొన్న పంచెతోను, సరి = ఈడు, లేని...కట్టు - లేని = లేనిదైన, రాకట్టు = రత్నములుచెక్కిన, జాళువా = మేలిమిబంగారుతోఁ జేయఁబడిన, మొలకట్టు = మొలత్రాడు, బెడఁగారు = అందగించునట్టి, నీర్కావి = నీళ్లలో నానఁ బెట్టి యుదుకుటచేతఁ గొంచెమెఱ్ఱదాళుగల దోవతియొక్క, పింజెతోడన్ = వ్రేలఁజెరివినకుచ్చె తోను, (సరిలేని = ఈడులేని, రాకట్టు=గౌరవముతోఁచునట్లు రాచకట్టుకట్టిన, జాళువా=బంగారు వికారమైన-బంగారు సరిగ నేఁతగల, మొలకట్టు = మొలనుగట్టుకొన్న, బెడఁగారు = అంద మతిశ యించుచున్న, నీర్కావి = నీరుకావిదోవతియొక్క, పింజెతోడన్ = ముందటికి వ్రేలఁజెరివినకుచ్చె తోను, అని కొందఱు ) ధవళధవళములు = మిక్కిలి తెలుపులు, అగుజన్నిదములతోడన్=అయినట్టి యజ్ఞోపవీతములతోను, కాశికాముద్ర=కాశిముద్ర, ఇడిన = పెట్టిన-చెక్కిన, ఉంగరముతోడన్= ముద్దుటుంగరముతోను, శాంతరసము, ఒల్కు. తోడన్ - ఒల్కు=చిందుచున్న, బ్రహ్మతేజంబుతో డన్ =బ్రాహ్మణతేజస్సుతోను, ప్రవరుఁడు=ప్రవరునిరూపము ధరించినవాఁడు, అయ్యెన్ =ఆయెను.

తా అప్పుడు నొసట గంగమట్టిబొట్టును, చెక్కిళ్లపై వ్యాపించుకాంతులు గలరత్నాలక ర్ణాభరణములును, చెఱంగులం దక్షరపంక్తివలె సరిగతో నేయఁబడిన కమ్ములుగల యుత్తరీయమును, రత్నములుచెక్కిన మొలత్రాడును, ముందరితట్టుకుచ్చెలు వ్రేలఁ గట్టిన నీరుకావిదోవతియు, మిక్కిలి తెల్లగానుండెడి యజ్ఞోపవీతములును, కాశీముద్రతోడి ముద్దుటుంగరమునుధరించి మొగమునందు శాంత రసమును గనఁబఱచునట్టి బ్రాహ్మణతేజస్సు వెలయఁగా నాగంధర్వుఁడు ప్రవరునిరూపమును బొందెను.

క. ఇటు నవ్వరూథినియు నొ, క్కొటఁ గతిపయసఖులు దన్నుఁ గొలిచి నడువఁగాఁ
జటులఝళంఝళరవపద, కటకసమాకృష్టకేళికలహంసిక యై. 72

అ. ఇటన్ = ఇక్కడ-అక్కడ గంధర్వుఁ డట్లుండఁగా నిక్రీడననుట, అప్పరూథినియున్ = ప్రవరునిపొందునకై తపించుచున్న వరూథినియును, ఒక్కొటన్ = ఒక్కమొత్తముగా, కతిపయసఖులు = కొందఱు చెలికత్తెలు, తన్నుఁ, కొలిచి = సేవించి-తనసేవచేయుచు, నడువఁగాన్ = తనవెంట నడచిరాఁగా, చటుల..హంసికలై-చటుల = చలించుచున్న, ఝుళంఝుళ = ఝుళంఝుళయను ధ్వన్యనుకరణముతోడి, రవ = ధ్వనిగల, పదకటక = కాలియందెలచేత, సమాకృష్ట = చక్కఁగా నాకర్షింపఁబడిన, కేళికలహంసికలై = క్రీడార్థముగాఁ బెంపఁబడిన యుత్తమజాతిహంసలు గలదై-హంసలు కూయునట్లు ధ్వనించుచున్న కాళ్లయందెలధ్వనులు విని పెంపుడుహంసలు తన్ను వెంబడింపఁగాననుట.

సీ. ఉరగఫూత్కారధూమోగ్రగంధముఁ బాసి, పొలయుఁబో యీతావిమలయపవనుఁ
డనలాక్షుపెడబొబ్బనలమినతలదిమ్ముఁ, బాయుఁబో యీతేంట్లపాట మరుఁడు
ఘర్మసామీప్యసంకలితదాహస్ఫూర్తి, నాఁగుఁ బో యీనీడ నల్లమధుఁడు
గరళసోదర్యాత్తకరసుధాకటుకత్వ, ముడుపుఁ బో యీతేనె నోషధీశుఁ
డనఁగఁ జంపకకురవకపనసతినిశ, నిచులవంజులదాడిమీవిచికిలామ్ర
పాటలీపూగకేసరప్రముఖతరుల, సొబగుమీఱునుద్యానంబుఁ జొచ్చియచట.

అ. మలయపవనుఁడు = మలయపర్వతమునుండివచ్చుగాలి - దక్షిణపుఁజల్లగాలి, ఈతావిన్ = ఈపరిమళముచేత, ఉరగ.. గంధమున్ - ఉరగ = (మలయపర్వతములందలి గంధపుమ్రాఁకులను జుట్టుకొన్న) పాములయొక్క, ఫూత్కార = ఫూత్తనెడిధ్వనులతోఁగూడిన బుసలవలని, ధూమ = పొగచేనైన, ఉగ్ర = తీవ్రమైన, గంధమున్ = వాసనను, పాసి = విడిచి, పొలయుఁబో = ప్రసరించునుజుమీ, మరుఁడు = మన్మథుఁడు, ఈతేంట్లపాటన్ = ఈతుమ్మెదలగానముచేత, అనల. .బొబ్బన్ - అనలాక్షు = నిప్పుకన్నుగలరుద్రునిదైన, పెడబొబ్బన్ = అధికధ్వని గలసింహనాదముచేత, అలమినతలదిమ్మున్ = క్రమ్ముకొన్న శిరోవేదనవలన, పాయుఁబో = తొలఁగునుజుమీ, అల్లమధుఁడు = ఆ వసంతుఁడు, ఈనీడన్ = ఈవృక్షములనీడచేత, ఘర్మ స్ఫూర్తిన్ - ఘర్మ = గ్రీష్మకాలముయొక్క, సామీప్య = దగ్గఱించుటచేత, సంకలిత = బాగుగాఁబొందఁబడిన, దాహస్ఫూర్తిన్ = తాపాతిశయమును, ఆఁగుఁబో = అడ్డగించునుజుమా, (పా. నీఁగుఁబో యీచల్లనీడన్ = ఈచల్లనినీడయందు మాన్చుకొనునుజుమా,) ఓషధీశుఁడు = చంద్రుఁడు, ఈతేనెన్ = ఈపుష్పఫలములరసముచేత, గరళ...కటుకత్వము - గరళ = కాలకూటవిషముయొక్క, సోదర్య = తోడఁబుట్టిన దానితనముచేత, ఆత్త = పొందఁబడిన, కిరణ = కిరణములయొక్క, సుధా = అమృతముయొక్క, కటుకత్వము = కారమును, ఉడుపుఁబో = పోఁగొట్టుకొనునుజుమీ, అనఁగన్ = అనునట్టుగా, చంపక. .తరులన్ - చంపక = సంపెఁగ, కురవక = గోరంట, పనస = పనసచెట్టు, తినిశ = తినాసము, నిచుల = ఎఱ్ఱగన్నేరు, వంజుల = అశోకము, దాడిమీ = దానిమ్మ, విచికిల = నన్నమల్లె, ఆమ్ర = మామిడి, పాటలీ = కలిగొట్టు, పూగ = పోఁక, కేసర = సురపొన్న, ప్రముఖ = మొదలుగాఁగల, తరులన్ = వృక్షములచేత, సొబగు మీఱునుద్యానంబున్ = అందము (మనోజ్ఞత) అతిశయించుచున్న యాతోఁటను, చొచ్చి = ప్రవేశించి, అచటన్ = అక్కడ - పైపద్యముతో నన్వయము.

తా. ఈతోఁటలోనిగోరంట సంపెఁగ పనస మామిడి సురపొన్న మొదలుగాఁ గల వృక్షముల వలని ఫలపుష్పపరిమళములచేతను దుమ్మెదలఝుంకారములచేతను మ్రాఁకునీడలచేతను దేనెలమాధుర్యము

చేతను క్రమముగా మలయమారుతమును మన్మథుఁడును వసంతుఁడును జంద్రుఁడును దమతమలోప ములను బోఁగొట్టుకొనుచున్నారు. అట్లుండఁగా నితరులకొఱఁతలు దీఱకపోవునా. తప్పక దీఱునను నిశ్చయముతో నాతోఁటనుజొచ్చి అలం అప్రస్తుతప్రశంస, ఉత్ప్రేక్షయును

మ. పవమానప్లవమానపంకజరజఃపాళీపిశంగచ్ఛవీ
భవదభ్యర్ణవికీర్ణకృత్రిమసరిత్పాథస్తరంగాహతైం
దవపాషాణవితర్దికాతలమునన్ నాళీకపత్రాక్షు లు
త్సవ మొప్పన్ విహరించుచున్ సరసవాచాప్రౌఢిమల్ మీఱఁగన్ 74

అ. పవమాన ..తలమునన్ - పవమాన=గాలిచలన, ప్లవమాన=తెప్పలఁదేలుచున్న - నీళ్లలోనల్ల లాడుచున్న, పంకజ=కమలములయొక్క, రజః=పరాగముయొక్క, పాళీ=సమూహముచేత-రాశిచేత, పిశంగ=పసిమియైన, ఛవీభవత్=కాంతిగలవగుచున్న, అభ్యర్ణ=సమీపమునందు, వికీర్ణ=చెదరిన,(అలలకు విశేషణము), కృత్రిమసరిత్ = కాలువలయొక్క, పాథః=నీళ్లవలని, తరంగ = కరళ్లచేత - అలలచేత, ఆహత=అంతటను గొట్టఁబడుచున్న, ఐందవపాషాణ=చంద్రకాంతపురాళ్లచేసైన, వితర్దికాతలమునన్=అరుఁగుమీఁద, నాళీకపత్రాక్షులు=తామరరేకులవంటికన్నులుగల వారైనస్త్రీలు, ఉత్సవము=వేడుక, ఒప్పన్=ఒప్పునట్లు, విహరించుచున్=సంచరించుచును, సరస ..ప్రౌఢిమలు-సరస=రసవంతములైన, వాచా=మాటలయొక్క, ప్రౌఢిమలు=నేర్పులు, మీఱఁగన్ = అతిశయింపఁగా - వైపద్యముతో నన్వయము

తా. చల్లగా వీచుచున్న గాలిచే రేఁగినతామరపుప్పొడి క్రమ్ముకొనఁగాఁ బసుపువన్నెతోఁబొలుచున్న చేరువకాలువలనీళ్లయందు లేచినయలలతాఁకుడు గలిగినచంద్రకాంతమణులచే నేర్పఱుపఁబడినయరుఁగుమీఁదఁజేరి యా స్త్రీలుసరసములాడుకొనుచు విహరించుచును

చ. బటువయి విజ్జివీఁగి పరిపాటిగఁ బూచి పరాగపుంజ మొ
క్కొటఁ గలయంగఁ బర్వఁ గొనకొమ్మను గోయిల మించ నొప్పెఁ జెం
గటియెలమావి హారరుచిఁ గందవొడిం గనుపట్టి నీలతా
స్ఫుటతరచూచుకం బగుచుఁ బొల్చువనేందిరగుబ్బచ న్ననన్. 75

అ. బటువయి=ఎటువయ్యై, విజ్జివీఁగి=మిక్కిలినిక్క-జొంపముగాఁ బెరిఁగి యనుట, పరిపాటిగన్=క్రమముగా - తగుమాత్రముగా, పూచి=పుష్పించి, పరాగపుంజము=పుప్పొడిరాశి, ఒక్కొటన్=ఒక్కసారిగా, కలయంగన్=అంతటను - ఎల్లయెడలను, పర్వన్=వ్యాపింపఁగా, కొనగొమ్మను=చివరనుండెడి కొమ్మమీఁద, కోయిల=కోవెల, మించన్=అతిశయింపఁగా, చెంగటియెలమావి= దగ్గఱనుండెడి యీమామిడిగున్న, హారరుచిన్=ముత్యాలపేరులకాంతిచేతను, గందపొడిన్=బుక్కాయిపొడిచేతను,కనుపట్టి=(కంటికిమనోహరముగాఁ) గనఁబడి, నీలతా .చూచుకంబు- నీలతా=నల్లఁదనముచేత, స్ఫుటతర=మిక్కిలిస్పష్టముగాఁదెలిసెడి, చూచుకంబు=చనుమొనగలది, అగుచున్=అవుచును, పొల్చు ...చన్ను - పొల్చు=ఒప్పుచున్న, వనేందిర=వనలక్ష్మియొక్క, గుబ్బచన్ను= బటువైన స్తనమో, అనన్=అనునట్లుగా, ఒప్పెను.

తా. ఈయెదుటఁ గానవచ్చెడి గుజ్జుమామిడిగున్న చక్కఁగాఁబూచి, పూదుమ్ముపైభాగమునందంతటను గ్రమ్ముకొని, యందుమీఁదఁ గొనకొమ్మపైఁ గోవెల వాలియుండుటచేత, ముత్యాలహారముల

తోను, గండపాడిక్రమ్ముటతోను, నలుపుమీఱినమొనతోను, నొప్పుచున్న వనలక్ష్మియొక్క వట్రువైన స్తనమో యనునట్లు కానవచ్చుచున్నది. అలం. ఉత్ప్రేక్ష

తే. వెలఁది! యిచ్చటిసంపెంగవిరులు గహన
దేవతలయిండ్ల నెత్తినదీపశిఖలు
గాక యుండినఁ బంచబంగాళ మగుచుఁ
బాఱునే మత్తమధుకరపటలతమము. 76

అ. వెలఁది=ఓచెలియా, ఇచ్చటిసంపెంగవిరులు=ఈతోఁటలోని సంపెంగపువ్వులు, గహనదేవతలయిండ్లన్=వనదేవతలవైన యిండ్లయందు, ఎత్తినదీపశిఖలు=పెట్టినట్టిదీపములజ్వాలలు, కాక యుండినన్=అవిదీపజ్వాలలేకాకయున్న పక్షమున, మత్త . తమము- మత్త=మదించిన, మధుకర=తుమ్మెదలయొక్క, పటల=సమూహమనెడి, తమము=చీఁకటి, పంచబంగాళమగుచున్=అగోచరమగుచు - కన్నులకుఁ గానరానిదై, పాఱునే=పరుగెత్తిపోవునా

తా. ఓచెలియా! ఈతోఁటలోనుండెడిసంపెఁగపువ్వులు వనదేవతలు తమయిండ్లలో వెలిఁగించినదీపములేమోయన్నట్లు వెలుఁగుచున్నవి. కనుకనే వానిదగ్గఱఁజేరక చీఁకటివలె నేనల్లగాఁగ్రమ్ముచున్నతుమ్మెదలు తమపోఁబడ్డి తెలియకుండునట్లు దూరముగాఁబాఱిపోయెనుజూడుము దీపములకును జీఁకటికినెట్లు విరోధమో యట్లుసంపెఁగలకును దుమ్మెదలకును విరోధమనిభావము అలం. అనుమానము,రూపకమును.

చ. అపరిమితానురాగసుమనోలసయై చిగురాకుఁజేతులం
దపసిని గౌఁగిలించె వనితా యిదె రంభ దలంప రంభ దా
నపరిమితానురాగసుమనోలసయై చిగురాకుఁజేతులం
దపసిని గౌఁగిలించు టుచితంబె కదా యన నవ్వె రంభయున్. 77

అ. వనితా=ఓచెలియా, రంభ=అరఁటిచెట్టు, అపరిమిత . లసయై - అపరిమిత=మితిలేని, అనురాగ=అనుసరించినయెఱ్ఱఁదనముగలిగిన - ఎఱ్ఱగానుండెడి, సుమనః=పువ్వుచేత, అలసయై = వాలియల్లుకొనుస్వభావముగలదై, చిగురాకుఁజేతులన్ = లేఁతయాకులనెడిచేతులతో, తపసిన్ = అగిసెచెట్టును, కౌఁగిలించెన్ =ఆలింగనముచేసికొనెను - ఆవరించుకొనెను, ఇదె=ఇదిగోఁజూడుము. (అని యొకతెచెప్పఁగా మఱియొకతె), తలంపన్=విచారింపఁగా, రంభ=రంభయనెడియప్సరస, తాన్=తాను, అపరిమిత...లసయై - అపరిమిత=మితిలేని, అనురాగ=అనురక్తితోఁగూడిన, సుమనః=మంచిమనస్సుగలదగుటచేత, అలసయై=ఓపికలేనిదై-కాలవిళంబము నోర్వలేనిదై, చిగురాకుఁజేతులన్=చిగురాకులవంటిచేతులతో, తపసిని=తపస్సుచేసి స్వర్గసుఖమనుభవింపవచ్చిన పురుషుని, కౌఁగిలించుట=ఆలింగనముచేసికొనుట, ఉచితంబెకదా=యుక్తమేకదా - విశేషతపస్సుచేసి సిద్ధిపొందినపుణ్యాత్ములు స్వర్గమునకు వచ్చిరంభాసంభోగముచేయుదురు గనుక రంభ తపస్విని గౌఁగిలించుకొనుట వింతగాదనుట, అనన్=అనఁగా, రంభయున్=(వారిలోనొకతెయైవిహరించుచున్న) రంభయనెడియప్సరసయు,నవ్వెన్=అందులకైనవ్వెను.

తా. అప్పుడొకయప్సరస మఱియొకదానితోఁ జెలియా! రంభ (అరటిచెట్టు) మిక్కిలియెఱ్ఱనైన పువ్వుయొక్క బరువుచేత వాలినదై తపసిని (అగిసెచెట్టును) గౌఁగిలించెను(చేరుకొనెను) చూడుమనఁగా నద్ది మరలదానితోఁ రంభ మిక్కిలియనురాగముతో మంచిమనసుగలదై తపస్సుచేసి కృతార్థుఁడయి స్వర్గమునకు వచ్చినపుణ్యపురుషునిఁ గౌఁగిలించుటయుక్తమే కదా యనఁగా రంభనవ్వెను.

అరఁటిచెట్టుపూచి యగిఱుచెట్టుమీఁద వాలెనని చెప్పినమాటకు నర్థాంతరవివక్షచే రంభతపస్విని గౌఁగి లించుకొనుటగాఁ గల్పించుకొని యదిసహజమే యనియె ననిభావము. అలం వక్రోక్తి.

ఆ. కొమ్మ కన్నుఁగవకుఁ గోరగింపఁగఁ బూచి,తఱుచుజొత్తు గ్రక్కుదాసనంబు
గవియుసీతమాలగహనాంధకారవి, తానమునకు నుదయభానుఁ డయ్యె. 78

అ. కొమ్మ=ఓచిన్నదానా, కన్నుఁగవకున్=నేత్రద్వయమునకు, కోరగింపఁగన్ = వెక్కసము గునట్లు - చక్కఁగాఁ జూడశక్యముగాకుండునట్లు, పూచి=పుష్పించి, తఱుచుజొత్తు గ్రక్కుదాసనం బు - తఱుచు=అధికమైన, జొత్తు=ఎఱుపును, గ్రక్కు=ప్రసరింపఁజేయునట్టి, దాసనంబు=దాసానిచె ట్టు, కవియు వితానమునకున్ - కవియు=క్రమ్ముకొనుచున్న, ఈతమాలగహన= ఈయెదుటనుండెడి చీఁకటిమ్రాఁకులతోపనెడు, అంధకార=చీఁకట్లయొక్క, వితానమునకున్ = సమూహమునకు, ఉదయ భానుఁడు=ఉదయించుచున్న సూర్యుఁడు, అయ్యెన్=ఆయెను.

తా. సూర్యుఁడుదయింపఁగానే చీఁకటివిరిసిపోవునట్లు ఈదాసానిచెట్టుపూచి పువ్వులకాంతితో వెలుఁగఁగా నాకాంతి ప్రసరించుటచేత నెదుటనున్న చీఁకటిమ్రాఁకులతోపుయొక్క నల్లనికాంతివిరిసి పోవుచున్నది. (దాసానిపువ్వులు ప్రొద్దుపొడిచినప్పటి సూర్యబింబమువలె యెఱ్ఱగానుండుటయు, చీఁ కటిమ్రాఁకులు చీఁకటివలెనే నల్లగానుండుటయు సుప్రసిద్ధము) అలం. రూపకము.

తే. శ్యామలోపరినిబిడపత్త్రాభ్రములకుఁ, గాండషండంబు దిగువానకాళ్లు గాఁగఁ
బంకరుహనేత్ర వర్షర్తుశంక నొసఁగు, పోఁకబోదియనవకంపుమోకఁ గంటె.

అ. పంకరుహనేత్ర=కమలములవంటి కన్నులుగలయో చెలియా, శ్యామల ..భ్రములకున్ - శ్యా మల =పసరుమించినవన్నెగల, ఉపరి=మీఁదిదైన, నిబిడ=తఱుచైన, పత్త్రి=ఆకులనెడి, అభ్రములు కున్ = మేఘములకు, కాండషండంబు=వానియడుగుబోదెల సమూహము, దిగువానకాళ్లు- దిగు=నేలక దిగునట్టి, వానకాళ్లు=ప్రారంభకాలమునందుఁ దోఁచునట్టివర్షధారాచ్ఛాయలు, కాఁగన్ = అగుచుఁ డఁగా, వర్షర్తుశంకన్=వానకాలమనెడి సందేహమును, ఒసఁగు.. మోకన్ - ఒసఁగు=ఇచ్చుచున్న- కలుగఁజేయుచున్న, పోఁకబోదియ=పోఁకచెట్ల మొదటిభాగములయొక్క, నవకంపు=మృదువైన-న నుపైన, మోకన్=మొలకచాల్పును, కంటె=చూచితివా.

తా. ఓచెలియా! ఈతోఁటలోనిపోఁకమ్రాఁకులచాలు మీఁదియాకులు నల్లఁదనముచేత మబ్బు లవలెఁ గానఁబడఁగా వానిబోదెలు వానకాళ్లవలెఁ దోఁచుచు నిది వానకాలమేమో యనుసందేహమ ను గలుగఁజేయుచున్నవి చూడుము. అలం. రూపకము, ఉత్ప్రేక్షయు.

ఉ. చూతమె డాసి పక్వతరశుక్తిపుటాంతరదృశ్యమౌక్తిక
వ్రాతము లై వెలుంగుగరువంపుఁగొటారుల నొప్పుతామ్రపఁ
ర్ణీతటమట్లు జీర్ణదళబృందసమావృతపాండురప్రసూ
నాతిమనోజ్ఞమూర్తులు నరిగ నెసంగుమధూకసాలముల్. 8

అ పక్వ ..వ్రాతములై - పక్వతర=మిక్కిలిపండఁబాఱిన, శుక్తిపుట = ముత్తెపుఁజిప్పలదొ క్క, అంతర=లోపలిభాగములందు, దృశ్య=చూడఁదగిన,మౌక్తిక=ముత్యములయొక్క, వ్రాతములై సమూహములుగలవై, వెలుంగు . రులన్ - వెలుంగు=ప్రకాశించుచున్న, గరువంపు=గొప్పవైన, కొట రులన్=రాసులుపోసియుంచుతావులచేత, ఒప్పుతామ్రపర్ణీతటమట్లు=ఒప్పుచున్న తామ్రపర్ణియనెడి ఁ

టిరెయొద్దనువలె, జీర్ణ. . మూలములన్ - జీర్ణదళ=రాలినపండుటాకులయొక్క, బృంద=సమూహముచేత, సమావృత=లెస్సగా నావరింపఁబడిన,పాండుర=తెల్లనైన, ప్రసూన=పువ్వులచేత,అతిమనోజ్ఞ=మిక్కిలి సుందరములైన, మూలములన్=మొదళ్లచేత, ఎసంగుమధూకసాలముల్=అతిశయించిన యిప్పమ్రాఁకులను, అర్థిన్=ప్రీతితో, డాసి=దగ్గఱఁబోయి, చూత మె=మనము కనుఁగొందమా.

తా. మొదళ్లయందు రాలినపండుటాకులలో ముత్తెపుఁజిప్పలలోని ముత్తెములవలె రాలినపువ్వు లొప్పఁగాఁ దామ్రపర్ణీనదీతీరమునందలి ముత్యాలకొటారులవలెఁ గానవచ్చుచున్నయిప్పమ్రాఁకులవిగోఁ గానవచ్చుచున్నవి. దగ్గఱఁబోయి చూతము వచ్చెదవా (ఇందు రాలినపండుటాకులను ముత్తెపుఁజిప్పలతోను, ఇప్పపువ్వులరాసులను ముత్యపురాసులతోను, ఇప్పమ్రాఁకులమొదళ్లకుఁ దామ్రపర్ణీతీరముతోను, పోలిక యని యెఱుంగునది. తామ్రపర్ణీనదియందు ముత్యములు పుట్టుననుట ప్రసిద్ధము.) అలం. ఉపమ.

క. పంకజముఖి విరహులపయిఁ, గింకన్ నిజసైన్యకోటికిని సెల విడుమీ
నాంకునికరతల మన నల, కంకేళిం జిగురు గాలిఁ గదలెడుఁ గంటే. 81

అ. పంకజముఖి = కమలమువంటిముఖముగల యోచెలియా, విరహులపైన్ = ప్రియులనెడఁబాసిన స్త్రీపురుషులమీఁద, కింకన్ = కోపముతో, నిజసైన్యకోటికిని = తనసేనాసమూహమునకు, సెల...తలను-సెలవిడు = దండువెడల నుత్తరువుచేయుచట్టి, మీనాంకుని=చేఁప టెక్కెముగలమన్మథుని యొక్క, కరతలము=అరచేయి, అనన్=అనునట్లుగా, అలకంకేళిన్=ఆయశోకవృక్షమునందు, చిగురు=చిగురాకు, గాలిన్=గాలిచేత, కదలెడున్=చలించుచున్నది, కంటె=నీవుచూచితివా

తా. ఓచెలియా! మన్మథుఁడు తనదండయినతుమ్మెదలుమొదలయినవానిని ప్రియుల నెడఁబాసి విచారపడుచున్న స్త్రీలమీఁదికిని ప్రియురాండ్ర నెడఁబాసినపురుషులమీఁదికిని వెడలుఁడని కోపముతో నాజ్ఞాపింప వీచినచేయో యనున ట్లాయశోకవృక్షములోనిచిగురాకు గాలిచే నాడుచున్నది చూడుము. అలం. ఉత్ప్రేక్ష.

చ. నునుఁజిగుర్టాకు మేయుతఱి నోరికెలంకులఁ దేఁటి గుట్టినన్
వనతరుశాఖలం గువకువధ్వనిఁ బాఱుపికాంగనం బికం
బనునయ మొప్ప మాన్పుగతి నాత్మముఖంబు ముఖంబుఁ జేర్చి చుం
బన మొనరించె సందుసుడిమాయలు గా మగవారికృత్యముల్. 82

అ నునుఁజిగురాకున్ = కోమలమయినచిగురుటాకును, మేయుతఱిన్=తినునప్పుడు, నోరికెలంకులన్ = నోటిపార్శ్వములందు, తేఁటి = (ఆచిగురాకునందున్న) తుమ్మెద, కుట్టినన్ = ముక్కుతోఁ బొడువఁగా, కువకువధ్వనిన్=కువకువయనెడిరొదతో-కువకువయని కూయుచుననుట, వనతరుశాఖలన్=ఉద్యానములోని వృక్షములకొమ్మలమీఁదుగా, పాఱుపికాంగనన్ = పరుగెత్తుచున్న యాఁడుఁగోయిలను, పికంబు = మగకోయిల, అనునయము = ఓడఁబఱచుట, ఒప్పన్ = ఒప్పునట్లుగా, మాన్పుగతిన్ = (ఆతుమ్మెదకుట్టినబాధను) పోఁగొట్టుదానివలె, ఆత్మముఖంబు = తనమొగమును, ముఖంబుఁ జేర్చి = ఆఁడుఁగోయిలమొగముతోఁ జేర్చి, చుంబన మొనరించెన్=ముద్దుపెట్టుకొనెను, మగవారికృత్యముల్ = పురుషులయొక్కపనులు, సందుసుడిమాయలు = సమయముచూచి బొంకించునట్టియుపాయము కలవి, కాఁబోలు.

తా. ఓచెలియా! ఆమామిడిచెట్టునం దొకయాఁడుఁగోవెల చిగురు దినఁబోయి యాచిగురునం దున్నతుమ్మెద నోటియొరఁ గుట్టఁగా నానొప్పికిఁ దాళలేక కుహుకుహుయని కూయుచు బ్రాఁకులకొమ్మల మీఁదుగాఁ బాఱుచుండఁగా దానిజతయైనమగకోవెల చూచి యానొప్పిని మాన్పెడుదానివలె దగ్గఱఁ బోయి దానిమొగముతోఁ దనమొగముచేర్చి ముద్దుపెట్టుకొనెను. దానివంచనచూచితివా. మగవారిపను లన్నియు నిట్లే సమయమునకుఁ దగినట్టు బొంకించుస్వభావముగలవిగానుండును. అలం. అర్థాంతరన్యాసము.

క. అని పొగడుచు నొయ్యారపు, టనువున జడ లల్లి జిలుఁగు ꠰ లగుపయ్యెదలం
జనుకట్లు గట్టి గట్టిగ, ననిమిషకాంతలు లతాంత ꠰ హరణోత్సుక లై. 83

అ. అనిమిషకాంతలు=దేవతాస్త్రీలు, అని=ఇట్లని, పొగడుచున్=(ఆతోఁటయొక్క మనోజ్ఞతను) పొగడుచు, లతాంతహరణోత్సుకలై = పువ్వులుగోయ వేడుకగలవారై, ఒయ్యారపుటనువునన్ = విలాసవైఖరితో, జడలల్లి=జడలువేసికొని, జిలుఁగులు=సన్ననివి, అగుపయ్యెదలన్ = అగునట్టిపైఁటలచేత, గట్టిగన్ = దృఢముగా, చనుకట్లుగట్టి = అవికలమీఁదఁ జేర్చి బిగఁ గట్టి-వెడలిరని క్రియ యధ్యాహార్యము

తా. ఆదేవతాస్త్రీలు మీఁదఁజెప్పినవిధముగా నుద్యానవనమును బొగడి యంతటఁ బువ్వులు గోయఁగోరినవారై పువ్వులచెట్లకొమ్మలు మొదలైనవానికిఁ దలవెండ్రుకలు తగులుకోకుండునట్లుగా జడలువేసికొని పయఁట జాఱిపోకుండునట్లుగా ఱొమ్ములపైఁ జుట్టి బిగియఁగట్టుకొని వెడలిరి.

రగడ. నేర్పుమై నల్లయది ꠰ నెఱులఁ దోలుపూఁ దుఱిమె
దర్పకున కర్పింపఁ ꠰ దలఁప దెంతటివెరిమె
యింతి పావురపురొద ꠰ యేల విను దారజము
వింతయే విరహిణుల ꠰ వెతఁ బెట్టుబేరజము
సురపొన్నక్రొన్ననల్ ꠰ సొచ్చి నలుగడ వెదకు
తఱుఁగ దందులతావి ꠰ తండంబు క్రొవ్వెదకు
నఱిమి నను జివురునకు ꠰ నగునె కంటక మాఁడ
జుఱుకు మనె వేఱొక్క ꠰ చోటఁ గంటక మాఁడఁ
గుండమ్ములు నీకొసఁగఁ ꠰ గూర్చితిని గైశికము
నిందులకు వెల యడుగ ꠰ నేల విడు వైశికము
చిఱుఁదేంట్లు కొసఁగె గు ꠰ జ్జెనఁగూళ్లు గొజ్జంగ
నెఱుఁగ కది పూవంద ꠰ నేల యిటు రజ్జంగ
నెదిరింపఁ బోలు నీ ꠰ వింతి రతిపతిఁ దెగడఁ
బొదల్లఁ జిగురులతుదలఁ ꠰ బూచి యున్నది పొగడ
పుడుకు మల్లన గంద ꠰ వృషికి నీప్రేంకణము
డడయ కిటు నీకిత్తుఁ ꠰ దగ రత్నకంకణము
నెరసి పోఁ జూచెదవు ꠰ నిలునిలువుమా కనము
గురియు తేనెల జీబు ꠰ కొన్న దంతట వనము

కా దల్లయది ఫుల్లకోకంకేళి పన్నిదము
మోదు గోడిన నీదు । ముత్యాలజన్నిదము
ఏటవాలైనయది । యీయరఁటి బాలెంత
చేటునకె యగుచూలు । చేఁ గలుగుమే లెంత
నెలఁత యీగేదంగి । నీ కబ్బె బుక్కాము
చిలుకునీపుప్పొళ్లు । చెంచెతలబుక్కాము
మితి లేనితేనె నా । మెంత చేసె విరవాది
యితరలతికల మరగి । యేఁగు నది పరవాది
కలిగొట్లు ప్రాఁకువేకొడ్కాలె నీకుఁ దఱ చెదను
నలినాక్షి కడిమిగం । డమున కే వెఱచెదను
గురువెంద సదె గిలుబుకొనియెఁ బయ్యెరదొంగ
విరులఁ గరికుంభకుచ । వెరఁజు మై యరగుంగ
మెరమెరనిగొలనిదరి । మీ లంచు లకుముకులు
మరగెనీకనుదోయి । మాయింపు చకచకలు
ఏకాంత మని తొలఁగె । దిందు నీ వఱె వేఱు
చేకొనవె మున్నాడి । చెలువ యీవటివేరు
అరిది యీ యేడాకు । లరఁటి నగుకప్పురము
సరిరాదు దాని కలశశిరియొడలు క ప్పురము
పాళ కల్లది పోఁక । బ్రాఁక బందము దెగియె
నాళి యది దిగజాఱుకొనట్టిచందము నగియె
మలయపవనునిఁ బిలిచె । మావి బళి యీవేళ
మలయుకోవెలపంచ । మస్వరం బనునీల
సులభమై దొరకె మంజులవాణి చంపకము
చిలుక వన్నెపుఁబొదలు । చేరి యిఁక వంపకుము
చనకుఁ డీఁక దవ్వులకు । సఖులార పువ్వులకు
ననుచు నలరులు గోసి । రతివ ల్లలన డాసి. 84

అ. (ఈరగడయందు దేవతాస్త్రీలు పువ్వులుగోయునప్పు డొకరితో నొకరు మాటలాడుకొను రీతి చెప్పఁబడెను గనుక నెక్కడిమాట కక్కడనే యన్వయము) అల్లయది = ఆపడుచు, నేర్పు మైన్ = నేర్పుతో-ప్రౌఢత్వముతో, తొలుపూ = మొట్టమొదటఁ గోసినపువ్వును, నెఱులన్ = తల వెండ్రుకలలో, తుఱిమెన్ = పెట్టుకొనెను, దర్పకునకున్ = మన్మథునికి, అర్పింపన్ = సమర్పణచేయను, తలఁపదు=ఎంచదు, ఎంతటిపెరిమె=దానికిఁ బువ్వులం దెంతియధికమైనప్రేమయే, (ఎంతటి పెరిమె=దానికి నెంతటిగౌరవమే-అది పెద్దతిక ముచే మన్మథునిలక్ష్యము చేయబడ్డెను. అని యిట్లు కొందఱర్థము చెప్పెదరు.) ఇంతి=ఓచెలీ, పావురపురొద = పావురాయియొక్క కూఁతను, ఏలవి

నెదు=ఏలవినుచున్నావే, (ఇది యొకదాని ప్రశ్నము.) ఆరజము=అది యింపుగానున్నది, (ఇది యందులదు నుత్తరము) వింతయే=అదియింతవింతయైనదా-ఎన్నఁడునువినియెఱుఁగనిదా, విరహిణులన్=విరహముగల స్త్రీలను, వెతఁబెట్టుబేరజము=బాధపెట్టునట్టి కుత్సితపునడకగలది, (ఇది తొలుతటిదాని మాట.) సురపొన్నక్రొన్ననలు=క్రొత్తగాఁ బూచిన సురపొన్న పువ్వులను, చొచ్చి = ఆచెట్లలోఁ బ్రవేశించి, నలుగడన్=నాలుగువైపులను, వెదకు=నీవు వెదకుము, అందులతావితండంబు=ఆపువ్వులవలని పరిమళముయొక్క-సమృద్ధి, క్రొవ్వెదకున్=క్రొత్తదైన కొప్పునకు, తఱుఁగదు=ఎప్పుడునుదగ్గదు అతిమి=అక్రమించి, ననున్=నన్ను, చివురునకున్=చిగురాకునకై, కంటకము=కఠినపుమాట, ఆడన్=చెప్పుట-నిందించుటయనుట, అగునె=తగునా, వేఱొక్కచోటన్=మఱియొక తావునందు, కంటకము=ముల్లు, ఆడన్=నాటుకొనఁగా, చుఱుకుమనెన్=చుఱుక్కుమని నొచ్చెను కుందములు=మొల్లపువ్వులను, నీకున్=నీకొఱకు, ఒసఁగన్=నేనియ్యఁజాలను, కైశికమున్=కొప్పునందు, కూర్చితిన్=చేర్చితిని-పెట్టుకొన్నాను. ఇందులకున్=ఈపువ్వులకుఁగాను, వెల=క్రయము, అడుగన్=అడుగుట, ఏల=ఏమిటికి, వైశికము=వేశ్యాత్వమును-వంచనను, విడు=నీవువిడువుము. గొజ్జంగ=గొజ్జఁగపొదను, చిఱుఁదేంట్లకున్=పిల్లతుమ్మెదలకు, గుజ్జెనఁగూళ్లు=ఆఁడుకొనునప్పుడు పిల్లలు గురుగులతో వండుకొనెడు వంటకముగా, ఒసఁగెన్ = (ఇది) ఇచ్చెను. (పా. చిఱుఁదేంట్లకొదవెగుజ్జెనఁగూళ్లు = పిల్లతుమ్మెదలకు గుజ్జెనగూళ్లు కలిగెను) అది=ఆచిన్నది, ఎఱుఁగక = గుజ్జెనఁగూళ్లగానిచ్చుట యెఱుఁగక, పూవు = పువ్వును, అందన్=తీసికొనఁగానే, ఇటు=ఈవిధముగా, రజ్జంగన్=నిష్ఠురములాడుట, ఏల=ఏమిటికి, ఇంతి = ఓ చెలియా, నీవు, రతిపతిన్ = మన్మథుని, తెగడన్=నిందింపఁగా, ఎదిరింపఁబోలున్ = ఆమన్మథుఁడు నిన్నెదిరించి యుండవలెను. (కనుకనే) పొగడ=పొగడచెట్టు, తుదలన్ = కొనగొమ్మలయందు, చివురులు=చిగుళ్లు, పొదలన్=వృద్ధినొందఁగా, పూచియున్నది=పుష్పించియున్నది (ఇది నీకు విరహకారియగుననిభావము) ఈప్రేంకణమున్=ఈప్రియాళువృక్షమును, గంధవొడికిన్ = పరిమళముతోడి పూపొడికై, అల్లనన్=మెల్లగా, పుడుకుము=మునివ్రేళ్లతో నొక్కి-నొక్కి-పట్టుము, ఇటు=ఈవిధముగా, తడయకు=ఆలస్యముచేయకుము, తగన్=(ఆలస్యముచేయక పుప్పొడిపుడికి రాల్చినందులకు) తగునట్టుగా, నీకు, రత్నకంకణము = మణులుచెక్కిన యీముంజేతికడియమును, ఇత్తున్ = ఇచ్చెదను. నెరసిపోన్ = వ్యాపించిపోను - పూఁబొదలసందులలోఁ దూఱిపోవుటకు, చూచెదవు = యత్నించుచున్నావు, నిలునిలువుమా = అట్లుపోవలదు నిలువుము నిలువుము, (ఇక్కడ ఆదరమువలన ద్విరుక్తి) కనము=మేము పిమ్మట నిన్నుఁజూడఁజాలము. (ఏలయనిన) కురియుతేనెలన్=వానకురిసినట్టు కాఱుచున్న తేనెలచేత, వనము = ఈయుద్యానవనము, అంతటన్ = అన్నిప్రదేశములందును, జీబుకొన్నది=సందులేక క్రిక్కిఱిసికొనియున్నది. అల్లయది = ఆదూరమునం దెదుటఁ గనఁబడుచుండునది. ఫుల్లకంకేళి=పూచినరక్తాశోకవృక్షము, (అని యొకతె పలికెను) కాదు=అదికంకేళికాదు, మోదుగుమ్రాను, (అని యింకొకతెయనఁగా మొదటిది) ఓడినన్=నీవు ఓడిపోయినపక్షమున (అనఁగా రెండవది) పన్నిదము=ఏమిపందెము, (అనఁగా మొదటిది) నీదు ముత్యాలజన్నిదము = యజ్ఞోపవీతమువలె ధరించునట్టి నీ ముప్పేటముత్యాలసరము (అనెను) ఈయరఁటిబాలెంత = గెలవేసిన యీయరఁటిచెట్టు, ఏటవాలైనయది=ఒకతట్టునకు నొఱిగినది, చేటునకే=చెఱుపునకే-గెల పుదురఁగానే నఱకఁబడుటకేయనుట, అగుచూలుమేలు = అయిన యీగర్భముయొక్క మేలు, ఎంత = ఏమాత్రము-ఈగర్భము దానిని చెఱుపవచ్చినదేగాని సుఖపఱుపవచ్చినది కాదనుట. నెలఁతి = ఓచెలీ, ఈగేదంగిన్=ఈపచ్చమొగలియందు,

కర్పూరము = గందవొడి, నీకబ్బెన్ = నీకు లభించెను, చిలుకునీపుష్పాళ్లు = ఈరాలుచున్న పుష్పప
గములు, చెంచెతలబుక్కాము = చెంచుజాతి స్త్రీలు వస్త్రములకువాసనకట్టెడి గందవొడి, విర
ది = విరజాజితీఁగ, మితిలేనితేనెన్ = మేరలేని పూఁదేనెను, ఆ మెత చేసెన్ = (తుమ్మెదకు) విందు
సెను. అది=ఆతుమ్మెద, పరవాది=ఆత్రగొట్టు, (కనుక) మరిగి=ఆసపడి-అంతటితోఁ దృప్తిపొందక
ంకను గావలెనని యనుట, ఇతరలతలకున్ = ఇతరములైన పూఁదీఁగెలనుగూర్చియు, ఏఁగున్ =
వుచున్నది నలినాక్షీ = ఓ చెలీ, నీకున్ =నీకు, ఎదన్ =మనసునందు, కలిగొట్లు = పొదరిచెట్లను,
ంచువేడ్కలె = ఱొమ్ముతో జరగుచు నెక్కటయందలి కుతూహలములే, తఱచు=అధికము, ఏన్ =
ను, కడిమిగండమునకున్ = దానివలనఁ గలిగెడి దొడ్డయపాయమునకు, వెఱచెదను=భయపడెదను.
కుంభకుచ = ఏనుఁగుకుంభస్థలములవంటి స్తనములు కలదానా-ఓచెలియా, అదె=అదిగో, పయ్యెర
ంగ=మలయమారుతమనెడిదొంగ, గురివెందన్ = బండిగురిగింజతీఁగెను, గిలుబుకొనియెన్ = కొల్ల
నియెను - దానిలోనిపువ్వులన్నియు నపహరించెననుట, మై=దేహము, అరగ్రుంగన్ =సగముతగ్గునట్టు
-శరీరమును వంచియనుట, విరులన్ =ఆబండిగురిగింజ పువ్వులను, వెరఁజు=జవురుకొనును. లకు
కులు=మీాలవల్లంకు లనెడిపక్షులు, మెర మెరని= మెర మెరయని మెఱయుచుండెడి, కొలనిదరిమీాలు=
స్సుగట్టుననుండెడిచేఁపలు, అంచున్ = అని భ్రమయుచు, నీకనుదోయిన్ = నీకన్నుల జంటను,
రగెన్ =ఆశించెను, చకచకలు = చకచకలాడెడి కన్నుల కాంతులను, మాయింపు=అణఁచివేయుము
కాంతము = రహస్యము- మేము మాటలాడుకొనునది యేమొ రహస్యము, అని, తొలఁగెదు = ఎడ
గాఁ దొలఁగిపోయెదవు, ఇందున్ =ఈమాయందు, వేఱు = అన్యురాలవు, నీవటె= నీవా-నీవును
న్నుఁజేరినదానవేకదా యనుట. చెలువ=ఓచెలీ, ఈవటివేరు = ఇదెయీవట్టివేరు, మున్నాడి = ముం
గా, చేకొనవె=దీనినిదీసికొనుము, ఈయేడాకులరఁటిన్ = ఈకానవచ్చెడి యేడాకులయరఁటిచెట్టు
దు, అగుకప్పురము = కలుగునట్టికర్పూరము, అరిది=దుర్లభము-సాధారణముగా దొరకునదికాదు.
నికిన్ =ఆకర్పూరమునకు, అలశశియొడలును = ప్రసిద్ధమయిన చంద్రునిశరీరముకూడ-చంద్రబింబము
డ, సరిరాదు=సమానముకాదు, (ఏలయనిన) ఉరము=ఆచంద్రునియొక్క ఱొమ్ము, కప్పు = నలుపు
లది-ఆకర్పూరము స్వచ్ఛమయిన తెలుపువన్నెగలది కనుక కళంకముతోఁగూడిన చంద్రబింబము
నితో సరిపోలదనుట. అల్లది=ఆచిన్నది, పాళకున్ =పూవుగెలకుఁగాను, పోఁకన్ =పోఁకమ్రానిని,
ాఁకన్ =ఱొమ్మునానించి యెక్కుచుండఁగా, బందము = చెట్టెక్కునప్పుడు తొలఁగిపోకుండునట్లు
ళ్లకుఁ దగిలించుకొనెడుత్రాడు, తెగియెన్ = తెగిపోయెను, ఆళి = దాని చెలికత్తె, అది = ఆపోఁక
నిని ప్రాఁకుచున్నపడుచు, దిగజాఱునట్టిచందము = ఆమ్రానివెంటఁ గ్రిందికిజాఱునట్టివిధమును,
వ్వెన్ = (చూచి) నవ్వెను, మావి=మామిడిచెట్టు, ఈవేళన్ = ఈసమయమునందు, మలయు స్వ
ంబు-మలయు=తనయందుఁ దిరుగుచున్న, కోవెల=కోయిలయొక్క, పంచమస్వరంబు = వీణతంత్రుల
లనఁబుట్టిన పంచమమనెడి స్వరమువంటి కంఠస్వరము, అనునీలన్ = అనునట్టియీలచేత, మలయపవ
కిన్ =చల్లగావీచునట్టిదక్షిణపుగాలికి, పిలిచెను, బళి=బళా- మెచ్చవచ్చుననుట (గాలిలేనప్పుడు ఈల
సినపక్షమున గాలివీచునని లోకులువాడుదురు ఈల=చిమటకూఁతవంటికూఁత) మంజులవాణి=మనో
హరమైన మాటలుగలయోచెలీ, చంపకము=సంపెంగ, సులభమై=శ్రమములేకయే, దొరకెన్ = లభిం
చెను, అన్నెపుఁబోదలు = ఇతరములైన పూఁబోదలు, చిలుకవు = పువ్వులనియ్యవు. ఇఁకన్ = ఇఁక
ఁద, చేరి=ఆపొదలనుసమీాపించి, వంపకుము = వానికొమ్మలనువంపఁబోకుము. (పా. చిలువానెఁబూ

పొదలు చేరి యిఁకవంపకుము = ఆపూఁబొదలను బాముచేరెను వానిఁజేరి యిఁకవంపకుము.) సఖులార= ఓ చెలులారా, పువ్వులకున్ = పుష్పములకై, ఇఁకన్ =ఇఁకమీఁద, దవ్వులకున్ =దూరప్రదేశములకు, చనకుఁడు=మీరుపోకుఁడు-దూరప్రదేశములకుఁ బోయినయెడలఁ ప్రొద్దెక్కి యెండచే శ్రమపడవలసి వచ్చుననుట. అనుచున్ = అనిచెప్పుచు, అతివలు=ఆస్త్రీలు, డాసి = ఒకరితోనొకరుచేరుకొని, అల్లనన్ = మెల్లగా-క్రమముగా, అలరులు = పువ్వులను, కోసిరి=చిదిమిరి. – అలం. మెర మెరని...కనుదోయి–ఈవాక్యమునందు భ్రాంతిమంతము, కావ్యలింగమును. అరిది శశియొడలుకప్పురము–ఇందు ప్రతీపము. చిలుకవన్నె పు ..వంపకుము – ఇచ్చోట కావ్యలింగము.

క. నాళీకమధూన్మత్తమ, రాళీముఖరాళిసుఖకరం బగుకొలనం
కేళీలాలసగతి డిగి, యాళీనివహంబు లోలలాడెడువేళన్. 85

అ. నాళీక కరంబు–నాళీక = తామరలవలని, మధు = తూండ్లరసముచేతను–మకరందముచేతను, ఉన్మత్త=ఉన్మాదమునొందిన–మత్తుగొన్న, మరాళీ = ఆఁడుహంసలవలనను, ముఖర = జుమ్మనిరొదచేయుచున్న, అళి=తుమ్మెదలవలనను, సుఖకరంబు = సుఖమునుగలుగఁజేయునది, అగుకొలనన్ = అయినట్టిసరస్సునందు, కేళీలాలసగతిన్ = క్రీడవలనియత్యంతాసక్తి గలరీతితో, డిగి = దిగి, ఆళీనివహంబులు = వరూథినిచెలికత్తెలగుంపులు, ఓలలాడెడివేళన్ = ఓలయోలయని యీఁదులాడునపుడు–జలక్రీడచేయునప్పుడనుట.– మీఁదికన్వయము

తా. తామరతూండ్లు దినియుఁ దామరపూఁదేనెలు ద్రాగియు మత్తుగొన్నహంసలును దుమ్మెదలును గలిగి సౌఖ్యము గలిగించునదియై యొప్పుచున్నయొక తామరకొలనిలో దిగి వరూథినిచెలికత్తెలందఱును జలక్రీడ చేయుచుండఁగా

ఉ. వాడినమోముఁదమ్మి తెలిసోవాలికకన్నులు విన్నఁబోవఁ దో
నాడక నెన్నొసల్ కరముసేనం దిడి తీరనిషణ్ణయై జలం
బాడఁగఁ బిల్చువారి నొకసహస్తపుమ్రొక్కున నాడుఁ డంచుఁ దాఁ
జూడక చూచుచూడ్కి నలసోజ్జోటి దిశల్ పరికింప నొక్కచోన్. 86

అ. అలజోటి=ఆయతివ – వరూథిని, వాడినమోముఁదమ్మి–వాడిన = విరహవేదనచేత బడలిన, మోముఁదమ్మి = కమలమువంటి ముఖమును, తెలి.. కన్నులు – తెలి=తెలుపైన, వాలిక = నిడుపైన, కన్నులు = నేత్రములును, విన్నఁబోవన్ =వివర్ణములుకాఁగా, తోన్ = ఆచెలికత్తెలతో, ఆడక=జలక్రీడలాడక, నెన్నొసలు = విశాలమైననొసటిని, కరమునందున్ = అరచేతిలో, ఇడి = పెట్టుకొని–అఱచేతితో నొసలుగప్పుకొనియనుట, తీరనిషణ్ణయై = గట్టునందుఁగూర్చున్నదై, జలంబాడఁగన్ = జలక్రీడచేయుటకై, పిల్చువారిన్ = పిలుచునట్టివారిని, ఒకహస్తపుమ్రొక్కునన్ = ఒంటిచేతినమస్కారముతో, ఆడుఁడు=మీరుక్రీడింపుఁడు, అంచున్=అనిచెప్పుచు, తాన్ = తాను, చూడక=చూడనిష్టములేక, చూచుచూడ్కిన్ = చూచునట్టిచూపుతో, (పా. చూచుమాడ్కిన్ = చూచురీతిగా,) దిశల్ = నాలుగుదిక్కులను, పరికింపన్ = చూచుచుండఁగా, ఒక్కచోన్=ఒకప్రదేశమునందు.–పైపద్యముతో నన్వయము.

తా. ఆవరూథిని విరహవేదనచే మొగము చిన్నపుచ్చుకొని చెలులతోఁగూడి నీళ్లలోఁ గ్రీడింప మనసొప్పక యాకొలనిగట్టునందుఁ గూర్చుండి యొకచేయి నొసటి కడ్డముగాఁ జేర్చుకొని మఱియొక

చేతితోఁ దన్ను జలక్రీడకుఁ బిలుచుచున్న చెలులకు మ్రొక్కి మీరు క్రీడింపుఁడు చాలునని సైగచేయుచు వారిని జూడ నిచ్ఛలేక నలుదిక్కులు చూచుచుండఁగా నొక్కచోట.

మాలిని. రవిరుచిం ద్రసరేణువ్రాతముల్ మించువాత్యా
నివహనిహతిలో నిందిందిరశ్రేణు లాడం
గువలయఘనకుల్యాకూలవల్లీవనీసం
భవము లగుచు మింటం బర్వుపుప్పొళ్లలోనన్. 87

అ. రవిరుచిన్ = సూర్యప్రకాశమునందు - ఎండయందు, త్రసరేణువ్రాతముల్ = సన్నని నలుసుల యొక్క సమూహములు, మించు...నిహతిలోన్ - మించు = అతిశయించుచున్న, వాత్యా = సుడిగాలి యొక్క, నివహ = సమూహముయొక్క, నిహతిలోన్ = కొట్టుటయందు - వీచుటయందు, ఇందిందిర శ్రేణులు = తుమ్మెదలబారులు, ఆడన్ = సంచరింపఁగా, కువలయ ... సంభవములు - కువలయ = కలువల చేత, ఘన = దొడ్డవైన - మిక్కిలిగాఁ గలువలుగలయనుట, కుల్యా = కాలువల యొక్క, కూల = దరులయందలి, వల్లీ = తీఁగలయొక్క, వనీ = సమూహమునందు, సంభవములు = పుట్టినవి, అగుచున్ = అవుచును, మింటన్ = ఆకాశమునందు, పర్వు = వ్యాపించునట్టి, పుప్పొళ్లలోనన్ = పూదుమ్ములయందు.

తా. ఎండలోఁ దోఁచునట్టి చిన్న చిన్న రేణువులతోడి సుడిగాలికొట్టఁగాఁ దుమ్మెద లా సుడిగాలిలోఁ దగులుకొని యాడుచుండఁ గలువలతో నిండుకొన్న కాలువదరులందుఁ దీఁగెలు తఱుచుగా నల్లుకొనియున్న వనప్రదేశమునందుఁ బూచిన పువ్వులలోనుండి పుప్పొళ్లు రేఁగి యాకాశమున వ్యాపింపఁగా నట్టి పుప్పొళ్లలోపల.

సీ. పసిఁడితోరముతోడిబాహు వల్లన యెత్తి, సారెకుఁ బొదలపైఁ జాఁచి చాఁచి
బింబాధరంబు గంపింప నొయ్యన విపం, చీస్వరంబున జట సెప్పి చెప్పి
దిశల మార్గాన్వేషిదీర్ఘలోచనదీప్తి, గణముచేఁ దోరణ గట్టి కట్టి
కమనీయతనుకాంతికనకద్రవంబున, నారామరంగంబు నలికి యలికి
యానితంబవిలంబికాలాహికల్ప, ఘనకచగ్రంథి నచటిభృంగముల కసిత
దీధితులు వడ్డికొసఁగుచు దేవపూజ, విరులు చిదిమెడి కపటభూసురునిఁ గనియె.

అ. పసిఁడి.. బాహువు - పసిఁడి = బంగారముతోఁ జేసిన, తోరముతోడి = పవిత్రకంకణముతోఁగూడిన, బాహువు = భుజమును, అల్లన = మెల్లగా, ఎత్తి = పైకెత్తి, సారెకున్ = మాటిమాటికి, పొదలపైన్ = పూఁబొదలమీఁద, చాఁచిచాఁచి = చాఁగించిచాఁగించి, బింబాధరంబు = దొండపండువలె మృదువై యెఱ్ఱగానుండెడి క్రిందిపెదవి, కంపింపన్ = అదురఁగా, ఒయ్యనన్ = తిన్నగా, విపంచీస్వరంబునన్ = వీణాధ్వనివంటిధ్వనిగలకంఠస్వరముతో, జట = ముందు వెనుక పదములను రెట్టించి రెట్టించిచెప్పెడి క్రమముతో, చెప్పిచెప్పి = వేదము పఠించి పఠించి, దిశలన్ = దిక్కులందు, మార్గాన్వేషి ..గణముచేన్ - మార్గాన్వేషి = త్రోవను వెదకుచుండెడి, దీర్ఘలోచన = పొడుగైనకన్నులయొక్క, దీప్తిగణముచేన్ = కాంతిసమూహముచేత, తోరణగట్టికట్టి = తోరణముగట్టికట్టి - పలుమాఱుదిక్కులందుఁ జూపులుపఱపి యనుట, కమనీయ.. ద్రవంబునన్ - కమనీయ = మనోహరమైన, తను = దేహము యొక్క, కాంతి = ప్రకాశమనెడు, కనకద్రవంబునన్ = బంగారునీటిచేత, ఆరామరంగంబున్ = ఉద్యానవనప్రదేశమనెడి నాట్యస్థానమును, అలికియలికి - బంగారునీటివలె వెలుఁగుచున్న తనదేహ

కాంతి నాతోఁటయం దంతటను వ్యాపింపఁజేసియనుట, అనితంబ... గ్రంథిక్ - అనితంబ = పిఱుఁదులవఱకును, విలంబి=వ్రేలుచున్న, కాలాహికల్ప = నల్లత్రాఁచునుబోలిన, ఘన=పెద్దదైన, కచగ్రంథిక్ = సిగముడిచేత, అంటిభృంగములకక్ = అక్కడనుండెడితుమ్మెదలను, అసితదీధితులు = నల్లని కాంతులను, వర్ధికొసఁగుచుక్ = వృద్ధికైయిచ్చుచు-తుమ్మెదలనలుపును సిగముడి నలుపుచే నతిశయింపఁజేయుచు, దేవపూజావిరులు=దేవతార్చనకుఁదగినపువ్వులను, చిదిమెడుకపటభూసురునిక్ = కోయుచున్న మోసపుబ్రాహ్మణుని - బ్రవరునివేషమువేసికొన్నగంధర్వుని, కనియెక్ = చూచెను.

తా. పూవులకై బంగారుతోరములోడిచేయి పొదలమీఁదికిఁ జాఁచుచు మనోహరమైనస్వరముతో వేదముచదువుచుఁ దనయూరిదారియేది యని వెదకువానివలెఁ జూపులచే నభినయించుచు బంగారునీరుపూసినట్టు తనశరీరకాంతు లాపూఁదోఁటయం దెల్లయెడల నిండుకొనుచుండఁగా నిడుపైనజుట్టుముడి పిఱుఁదులు సోఁకునట్టుగాఁ గీలుగంటువేసికొని దేవతార్చనకై పువ్వులుగోయువానివలె నున్న ప్రవరాఖ్యునిరూపము దాల్చినగంధర్వునిఁ జూచెను. అలం ఉపమ,పరిణామము,నిదర్శనయును.

ఉ. కాంచి కలక్వణత్కనకకాంచిక యై యెదు రేఁగి యప్పుడ
కాంచనకేతకీకుసుమగాత్రి వయస్యల డించి తన్నికుం
జాంచలవీథిఁ దాఁటుచు ఘనాంతచలచ్చపలాకృతిం గలం
గాంచినవస్తువుం దెలిసి కాంచినయట్లనురక్తిఁ గాంచుచున్. 89

అ కాంచి = అట్లు కపటబ్రాహ్మణునిఁ జూచి, అకాంచనకేతకీకుసుమగాత్రి = బంగారువన్నెగల గేదఁగిపూవువలె మనోహరమైనశరీరముగల యావరూథిని, అప్పుడు = ఆసమయమునందు, వయస్యలక్ = చెలికత్తెలను, డించి = విడిచిపెట్టి - వెంటరమ్మనిపిలువక, కల...కాంచికయై = కల = అవ్యక్తమధురముగా - చెవులకింపుగాననుట, క్వణత్ = మొరయుచున్న, కనకకాంచికయై=బంగారుగంటలమొలనూలుగలదై, ఎదురేఁగి = ఆబ్రాహ్మణునికెదురుగాఁబోయి, ఘనాంత...కృతిక్ - ఘన = మేఘములయొక్క, అంత = సమీపమునందు, చలత్ = చలించుచున్న, చపలాకృతిక్ = మెఱుపువలె, తన్ని...వీథిక్ - తన్నికుంజ = వాఁడుపూవులుగోయుచున్న పొదరిండ్లయొక్క, అంచలవీథిక్ = చివరచాలుపునందు, దాఁటుచుక్ = నక్కుచు-ఒదిఁగియొదిఁగిపోవుచు, కలక్ = స్వప్నమునందు, కాంచినవస్తువుక్ = చూచినపదార్థమును, తెలిసి = (నిద్రనుండి) మేలుకొని, కాంచినయట్లు = చూచినవిధమున, అనురక్తిక్ = అనురాగముతో-ప్రీతితో, కాంచుచుక్ =ఆకపటబ్రాహ్మణునిఁజూచుచును, (లేక) అనురక్తిఁగాంచుచుక్ = అనురాగమునుబొందుచును-మీఁదికన్వయము.

తా. వరూథిని ప్రవరాఖ్యునిరూపముదాల్చి యట్లు కానఁబడిన గంధర్వునిఁజూచి యతఁడేయని నిశ్చయించి కలలోఁ జూచినవస్తువు మేలుకొన్నతరువాతను గానవచ్చినయెడల నావస్తువునం దెంతప్రీతి కలుగునో యంతప్రీతిగలదై జలక్రీడ లాడుచున్న చెలికత్తెలకుఁ జెప్పక యొంటరిగానే కొలనిదరినుండి లేచి తన్నుఁజూచినయెడల మరల నెక్కడ కేని పోవునో యనుశంకచే నతఁ డుండెడి పూఁబొదలవరుసవెంబడినే యొదిఁగియొదిఁగినడచి మేఘమువెంబడి మెఱుపువలెనే పోవుచు అలం. ఉపమ, ఉత్ప్రేక్ష, నిదర్శనయును

ఉ ఆకమలాక్షి యింపున దృగంచలము లించుక మూసి హర్ష బా
ష్పాకులకోణశోణరుచి కల్గ్రమునం జనఁ జూచుచూపు తీ

రై కనుపట్టెఁ దమ్మరసమంటుకొనన్ వెడవింటివాఁడు క్రో
ధైకధురీణతం గఱచి యేసినసింగిణికోలయో యనన్. 90

అ. ఆకమలాక్షి = కమలములవంటికన్నులుకలదైన యావరూథిని, ఇంపునన్ = సంతోషముతో, దృగంచలము=కడకన్ను, ఇంచుక = కొంచెము, మూసి=మూసికొన్నదై - అరచూపుతో, హర్ష ..రుచులు-హర్ష=సంతోషమువలనఁగలిగిన, బాష్ప=కన్నీళ్లచేత, ఆకుల=తొట్రుపడునట్టి, శోణ=కన్నుఁగొనలయొక్క, శోణరుచులు = ఎఱ్ఱనికాంతులు, (పా శోణకోణరుచులు = ఎఱ్ఱనికనుఁగొనలకాంతులు), అగ్రమునన్ = తనకుముందు, చనన్ = పోవునట్టుగా - ప్రసరించునట్టుగా, చూచుమూపు=కనుఁగొనునట్టిదృష్టి, తీరై = అందమై, వెడవింటివాఁడు=మన్మథుఁడు, క్రోధైకధురీణతన్ =కోపభారమునే ముఖ్యముగావహించుతనముచేత - అధికకోపమును వహించి యనుట, తమ్మరసము = నమలినవక్కలాకులయొక్క ద్రవము, అంటుకొనన్ =అంటునట్టుగా, కఱచి=ఔడుగఱచి, ఏసినసింగిణికోలయో - ఏసిన=ప్రయోగించిన, సింగిణి=శృంగధనుస్సునుండి వెడలిన, కోలయో=బాణమో, అనన్ =అనునట్లు, కనుపట్టెన్ =కనఁబడెను.

తా. అప్పుడు వరూథిని తనప్రియుఁడు చిక్కెననుసంతోషముచేతఁ గన్నులందు నానందబాష్పములొలుకఁగా నెఱ్ఱనైనకడకన్నులకు ఱెప్పలు కొంచెము వంచి యడ్డముచేసె కొలుకుల రక్తిమ నిగుడఁగాఁ జూచుచుండెను. ఆరక్తిమతోఁ గూడినయాచూపు మన్మథుఁడు కోపాతిశయముచేతఁ దమ్మరసమంటునట్టుగాఁ గసిదీఱఁ గఱచి శృంగధనుస్సునఁగూర్చి ప్రయోగించినబాణమో యనునట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

సీ. తొలుదొల్త వానిఁ గన్నులఁ గాంచినప్పుడ, పల్లవాధరగుండె జల్లుమనియె
నట రెండుమూఁడంజ లరుగునప్పుడ కాళ్లఁ, బంకజాక్షికిఁ దొట్రుపాటు గదిరె
డాయంగఁ జనునప్పుడ ముఖాంబుజంబునఁ, గంబుకంధరకు దైన్యంబు దోఁచెఁ
గదిసి నిల్చినయప్డు కనుదోయి ఱెప్పల, లలనకు మిగులఁ జంచలత బెరసెఁ
గటకటా యనునపుడ గద్గదిక వొడమెఁ, జెఱఁగువట్టినయపుడ లేఁజెమట గ్రమ్మెఁ
బొలసి మాటాడ నుంకింపఁ దలఁచి మోముఁ, దేరకొనఁ జూచునపుడ కన్నీరు వొడమె.

అ. తొలుదొల్తన్ = మొట్టమొదట, వానిన్ =ప్రవరరూపముధరించిన యాగంధర్వుని, కన్నులన్ =కన్నులతో, కాంచినప్పుడ = చూచినప్పుడే, పల్లవాధరగుండె – పల్లవ = చిగురువంటి, అధర=క్రిందిపెదవిగల వరూథినిదైన, గుండె = హృదయము, జల్లుమనియెన్ = జల్లుమనునను కరణముతోఁ జలించెను, అటన్ = అటుపిమ్మట, రెండుమూఁడంజలు = ఆమాయాప్రవరునితట్టు రెండుమూఁడడుగులదూరము, అరుగునప్పుడ = నడచిపోవునప్పుడే, పంకజాక్షికిన్ = వరూథినికి, కాళ్లన్ = అడుగులయందు, తొట్రుపాటు = తడఁబాటు, కదిరెన్ =కలిగెను, డాయంగన్ =దగ్గఱ, చనునప్పుడ=పోవునప్పుడే, ముఖాంబుజంబునన్ = కమలమువంటిముఖమునందు, కంబుకంధరకున్ = శంఖమువంటిమెడగలయావరూథినికి, దైన్యంబు = దీనత్వము – మనసులోనివిచారముచేనైన వెలవెలపాటు, తోఁచెన్ =కనఁబడెను, కదిసి=దగ్గఱఁజేరి, నిల్చినయప్డు=నిలిచినసమయమునందే, లలనకున్ = వరూథినికి, కనుదోయిఱెప్పలన్ = రెండుకన్నుల ఱెప్పలయందున్న మిగులన్ = మిక్కిలి, చంచలత = చంచలభావము, బెరసెన్ =కలిగెను, కటకటా=అయ్యయ్యో-అయ్యో నన్ను మోసముచేసితివిగదా యనుట,

అనునపుడ = అనుటకుఁయత్నించుచున్నప్పుడే, గద్గదిక=డగ్గుత్తిక, పొడమెన్ = పుట్టెను, చెలంగు=వాని మీఁదియుత్తరీయపుఁగొంగును, పట్టినయపుడ=పట్టుకొన్నప్పుడే, లేఁజెమట = కొంచెపుఁజెమట, క్రొమ్మెన్ = దేహమునందుఁ గ్రమ్ముకొనెను, సొలసి = చొక్కి - పరవశత్వమునొంది, మాటాడన్ = వానితో మాటలాడను, ఉంకింపన్ = పూనుటకు, తలఁచి=ఎంచి, మోము=వానిముఖమును, తేరకొనఁజూచునపుడ = తేటపడునట్లు చక్కఁగాఁజూచునప్పుడే, (పా తేరిచూచినయపుడ =చక్కఁగాఁదేటపడఁదలయెత్తిచూచినప్పుడే,) కన్నీరు=కంటినీరు,పొడమెన్ = పుట్టెను-విచారముచేఁగన్నీళ్లు క్రమ్మెననుట.

తా. తనవలపుకాఁడయిన ప్రవరాఖ్యునిరూపముతో నున్నగంధర్వునిఁ జూడఁగానే వరూథినికి మనసున జంకుపుట్టె, వారియొద్దకుఁ బోవలెనని రెండుమూఁడడుగులు పెట్టఁగానే కాళ్లు తడఁబడె; వానిని గొంతసమీపింపఁబోఁగానే దీనత్వము కలిగె, మిక్కిలి సమీపించి నిలువఁగానే పెప్పలల్లాడసాగె, అయ్యో! నన్నిట్లుమోసము చేయవచ్చునా యనుటకుఁ బ్రయత్నింపఁగానే డగ్గుత్తికచే నోటమాట వెడలకపోయె, వాఁడు తన్నుఁజూచి మునుపటివలెఁ బాఱిపోవునేమోయని యుత్తరీయపుఁగొంగుఁ బట్టుకోఁగానే యొడలు చెమటపట్టె, పరవశయై వానితో నేమో మాటలాడవలెనని తలఁపఁగానే కన్నీళ్లు గ్రమ్మెను అలం స్వభావోక్తి.

క. పాటితకరిదంతద్యుతి, పాటచ్చరగండఫలకభాగంబులపైఁ
గాటుకకన్నీ రొలుకఁగ, మాట వెడలఁ గ్రేటుకొనుచు మానిని పలికెన్. 92

అ. మానిని=స్త్రీ- వరూథిని, పాటిత ..పైన్-పాటిత = చీల్పఁబడిన, కరిదంత = ఏనుఁగుకొమ్ములయొక్క, ద్యుతి=కాంతికి, పాటచ్చర=దొంగలైన-ఆకాంతి నపహరించునవియైన, గండఫలక=పలకలవంటి చెక్కిళ్లయొక్క, భాగంబులపైన్ =ప్రదేశములందు-విరహవేదనచేతఁగళ దఱిఁగి తెల్లఁబోయియున్న చెక్కిళ్లమీఁదుగా ననుట కాటుకకన్నీరు-కాటుకగలసిన కంటినీరు, ఒలుకఁగన్ = కాఱుచుండఁగా, మాటవెడలన్ = నోటనుండి మాటబయటవచ్చుటకై, క్రేటుకొనుచున్ = గొంతు సవరించుకొనుచు, పలికెన్ =ఒకమాటచెప్పెను అలం ఉపమ స్వభావోక్తియు

ఉ ఏలర యీచలం బుడిగి యేలర బాలరసాలమాలతీ
జాలములోఁ శశాంకకరజాలములోఁ వలవంత నశ్రువుల్
జాలుగ నాల్గుజాలు నిఁకఁ జాలు భవం బనునంతకాఁకకుం
బాలయి రాత్రి పంచశరుబారికిఁ జిక్కితి నీకు దక్కితిన్ 93

అ ఈచలంబు = ఈమచ్చరము-ఈపట్టుదల, ఏలర=ఏమిటికిరా, ఉడిగి = చలముమాని, బాల...జాలములోన్-బాల = లేఁతయైన, రసాల = తియ్యమామిడి చెట్లయొక్కయు, మాలతీ = జాజిపొదలయొక్కయు, జాలములోన్ =సమూహమునందు-వానినడుమ ననుట, ఏలర=నన్నేలుకోరా-సంభోగసుఖమిచ్చి పాలింపు మనుట. రాత్రి = కడచినరాత్రి, నాల్గుజాలున్ = నాలుగుజాముల కాలమును, వలవంతన్ = మన్మథతాపముచేత, అశ్రువులు = కన్నీళ్లు, జాలుగన్ = వెల్లువయైపాఱఁగా-కన్నీళ్లువిడిచి యేడ్చుచుననుట, శశాంకకరజాలములోన్ = చంద్రకిరణసమూహమునందు-మిక్కిలిప్రకాశించుచున్న వెన్నెలయందనుట, భవంబు = ఈజన్మము, ఇఁకఁజాలున్ = ఇంతమాత్రముచాలును-బ్రదుకింకమీఁద నక్కఱలేదనుట, అనునంతకాఁకకున్ = అనితలఁచునంతటి తాపమునకు, పాలయి = అధీనమై-లఁబడి, పంచశరుబారికిన్ =మన్మథునిదైన హింసకు, చిక్కితిన్ = తగులుకొంటిని, నీకు దక్కితిన్ =నీకు వశమైతిని

తా. ఓబ్రాహ్మణుఁడా! ఏలయీపట్టుదల? ఈతియ్యమామిడిగున్నలనడుమను జాజిపొదల నడుమను నన్నుఁగూడి సుఖింపఁజేయుము. నీవు తొలఁగిపోయితి వన్నవిచారము చేత జరిగిన రాత్రియంతయుఁ గన్నీరు కన్నెల్లు వెంబడిగా నేడ్చుచు వెన్నెలవేఁడిమిని మన్మథబాధను సహింపలేక యీదేహమును విడువఁ బ్రయత్నము చేయునంతటి తాపమునొందితిని ఇప్పుడు నీకు స్వాధీనురాలను గాఁదగిన యునికితో నిన్నుఁ జేరితి.

శా. రావై రాగ్యముఁ బూని నీవు కడు నిర్దాక్షిణ్యచిత్తంబునన్
రావైతేఁ జవి గానియిందులకు హాహారాహారిగాఁ బోరి యే
లా వాలాయము సేయఁగా బ్రదుకు నీ కీ వాచారవంతుండవై
చావో యెక్కుడొ నీయెడం బొడము వాంఛన్ భూసురగ్రామణీ. 94

అ. భూసురగ్రామణీ=బ్రాహ్మణశ్రేష్ఠుఁడా-ప్రవరుఁడా, రా = నన్నేలుకొనుటకు రమ్ము, నీవు, కడున్=మిక్కిలి, నిర్దాక్షిణ్యచిత్తంబునన్=మొగమోటములేని తలఁపుతో, వైరాగ్యమున్ = విరక్తిని, పూని=వహించి, రావైతేని = నన్నుఁజేరరానివాఁడవైనపక్షమున, చవిగానియిందులకున్= నీకురుచింపని యీపనికై, హాహారాహారిగాన్=వదలనిపట్టుతో, పోరి=పోరాడి, వాలాయము సేయఁగాన్=నిర్బంధము చేయుట, ఏలా = ఏమిటికి, నీవు, ఆచారవంతుండవై = సదాచారనిష్ఠగలవాఁడవై-అనఁగా వైశ్వదేవాది వైదిక క్రియలు చేసికొనుచు నేకపత్నీవ్రతమును నడపువాఁడవైయనుట. బ్రదుకు = (చిరకాలము) జీవింపుము, నీయెడన్ = నీయందు, పొడము=కలిగిన, వాంఛన్ = కోరిక చేత, (కలుగునది) చావో=చావుమాత్రమో, ఎక్కుడో = అంతకుమించినదో-అంతకుమించినబాధ యేమియు లేదుగదాయనుట.

తా. ఓయి బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! లేనినిష్ఠ యొకటి కల్పించుకొని కఠినచిత్తుఁడవై చలపట్టి నన్ను విడనాడితివేని నీవలని మోహతాపము చేత నేను జచ్చుట నిజము. కనుక నీవు నీసదాచారము చెఱుచుకొనక చిరకాలము సుఖముగా జీవింపుము. నేను జావఁగా లోకమునకు వెలితి కాఁబోదని నిష్ఠురములాడెను (ఇట్లనుటచేతఁ బ్రవరాఖ్యుని ప్రవర్తనము నింద్యమని యభిప్రాయము గాదు. ఎట్టి నియమము నున్నను మానుకొని తన్నుఁ గలయవలయుననుటయే వరూథినియొక్క ముఖ్యాభిప్రాయము.)
అలం. ఆక్షేపము.

క. కట్టిఁడితనమున కిట్లొడి, గట్టి మనసు ఱాయి సేసి కరఁగవు మఱి నీ
పట్టినది విడువ వికని, న్నిట్టట్టన నేల మాయదృష్టం బుండన్. 95

అ. కట్టిఁడితనమునకున్ = క్రూరత్వమునకు, ఒడిగట్టి=పాలుపడి, ఇట్లు=ఈవిధముగా, మనసు=మనస్సును, ఱాయిసేసి = ఱాతివలెఁ గఠినముగాఁ జేసికొని, కరఁగవు = మెత్తఁబడినవాఁడవు కావు-దయారసము గలవాఁడవు కాకపోయితివనుట. మఱి=ఇంకను, నీపట్టినది=నీవుపట్టినపట్టు, విడువవు=వదలినవాఁడవు కావు, మాయదృష్టంబు = మాభాగ్యము, ఉండన్ = ఇటువంటిదిగా నుండఁగా, ఇకన్=ఇఁకమీఁద, నిన్ను, ఇట్టట్టనన్=ఇదియిట్లు అదియట్లు అని నిష్ఠురములాడుట, ఏల=ఎందులకు-నిన్ను నిష్ఠురములాడి ప్రయోజనము లేదనుట

తా. ఓబ్రాహ్మణుఁడా! నీవు క్రూరత్వమునకుఁ బాలుపడి యెంతవేఁడుకొన్నను గనికరింపక పట్టినపట్టుమానక యున్నావు. ఇది మాదురదృష్టమువలన నీకుఁబుట్టినబుద్ధి గాని యితరము కాదు ఇటు

వంటి నిన్ను నీ కెంతనిష్ఠురము లాడినను ఫలము కలుగఁబోదు. అనఁగా మాయదృష్టమును నిందించు కొనుట ధర్మముగాని నిన్ను నిందించుట ధర్మముగాదని భావము. అలం. వ్యాజనింద.

వ. అనిన నక్కుహనాభూసురకుమారుండు. 96

అ. అనినన్ = అని నిష్ఠురములాడఁగా, అక్కుహనాభూసురకుమారుండు = కపటబ్రాహ్మణకుమారుఁడయిన యాగంధర్వుఁడు.

సీ. కొనసాఁగి కామినీగోష్ఠిఁ బ్రౌఢము లైన, యుదుటుఁ జూపుల తెప్పతుదల నాఁచి
సంతసంబున ముఖాబ్జమునందుఁ జిఱునవ్వు, కందళింపక యుండ డిందుపఱిచి
పొంగారుమైఁ దోఁచు శృంగారచేష్టల, తమిఁ దెచ్చికోలు మౌగ్ధ్యమున డాఁచి
పొడమురసావేశమున వచ్చునర్మోక్తు, లొదివి నాలుకకు రాకుండఁ గ్రుక్కి
మస్తకము వాంచి యుసురని మౌనముద్ర, నేలబొటవ్రేల వ్రాయుచు నిలిచి కొంత
సేపు వెడవెడ చింతించి శిర సొకింత, యెత్తి సన్నంపు వెలుఁగుతో నిట్టు లనియె.

అ. కొనసాఁగి=కొఱంతలేక వర్ధిల్లి, కామినీగోష్ఠిన్ = కాముకురాండ్రతో ముచ్చట లాడుటయందు, ప్రౌఢములు=గడితేఱినవి, ఐనయుదుటుఁజూపులన్ = అయినట్టిగద్దఱి (అనఁగా రసోద్ధతములైన) చూపులను, తెప్పతుదలన్ = ఱెప్పకొనలచేత, ఆఁచి=అణఁచి-పైకిఁ దోఁపకుండునట్లుచేసి యనుట. (ఇందులకుఁ గర్త కుహనాభూసురకుమారుఁడు. ఇట్లే యంతటను గ్రహించునది.) సంతసంబునన్ = సంతోషముచేత, ముఖాబ్జమునందున్ = కమలమువంటి ముఖమునందు, చిఱునవ్వు = మందహాసము, కందళింపక = మొలవక-తోఁపక, ఉండన్ = ఉండునట్లు, డిందుపఱిచి=అణఁచివేసి, పొంగారుమైన్ = సంతోషముచే నుప్పొంగుచున్న శరీరమునందు, తోఁచు ..తమిన్ - తోఁచు=కనఁబడునట్టి, శృంగార చేష్టలతమిన్ = హావభావాదులైన శృంగారచేష్టలయొక్క తమకమును, తెచ్చికోలుమౌగ్ధ్యమునన్ = తెచ్చుకొన్న (అనఁగా) కలుగఁజేసికొన్న (శృంగారచేష్టల) ఎఱుఁగమిచేత, డాఁచి = మఱుఁగుపఱిచి-అణఁచి, పొడమురసావేశమునన్ = పుట్టుచున్న మోహరసమువలని పైమఱపుచేత, వచ్చునర్మోక్తులు = నోటికివచ్చుచున్న సాభిప్రాయసరసములగు పరిహాసపుమాటలను, ఒదివి = పొదివి-క్రమ్మి, నాలుకకున్ = నాలుకమీఁదికి, రాకుండన్ = రాకయుండునట్లు, గ్రుక్కి=నోటిలోపల నేయణఁచి, మస్తకమున్ = ముఖమును, వాంచి = వంచుకొని, ఉసురని = ఉస్సురనుధ్వనితో నిట్టూర్పువిడిచి, మౌనముద్రన్ = మాటలాడకుండు నియమముతో, నేలన్ = నేలమీఁద, బొటవ్రేలన్ = కాలిబొట్టనవ్రేలితో, వ్రాయుచున్ = అక్షరములు వ్రాయునట్లొరయుచును, నిలిచి=నిలుపఁబడి, కొంతసేపు = ఇంచుకతడవు, వెడవెడ = కొంచెముకొంచెము, చింతించి = ఆలోచనచేసి-ఏమో కొంచె మాలోచించునట్లు నటించి, శిరసు=తల, ఒకింతయెత్తి=కొంచెముపైకెత్తి, సన్నంపువెలుఁగుతోన్ = హీనస్వరముతో, ఇట్టులనియెన్ = ఈరీతిగాఁ బలికెను

తా. ఆప్రవరునిరూపము ధరించినగంధర్వుఁ డందులకుఁ దగినట్టు, కాముకురాండ్రతోడిసాంగత్యములందుఁ దన కలవాటుపడినదిట్టతనంపుఁజూపులను, ఇష్టసిద్ధియయ్యెనను సంతోషముచేత ముఖమునందుఁ దోఁచుచిఱునవ్వును, ఆయువతి దగ్గఱవచ్చుటంబట్టి తనంతటఁ బొంగి వచ్చుచున్న శృంగారచేష్టలవలని తమకమును, మోహరసమువలని పైమఱపుచేత నోటవచ్చు సరసపుమాటలను దనలోనే యణఁచుకొని వేషమునకుఁ దగినట్టు లేనిముగ్ధభావమును దెచ్చుకొని తన్ను బాధించుట కిపుడు చెక్కడ

నుండివచ్చి ననుచింతచే నేమియుఁ దోఁచనివానివలెఁ గాలిబొటనవ్రేలితో నేలనువ్రాయుచు నేమో కొంచెము తనలో నాలోచించువానివలెనొకగొంతసేపు నిలిచియుండి యంతట నించుక తలయెత్తి చూచి హీనస్వరముతో నిట్లుపలికెను.

శా. తల్లిం దండ్రియు నన్నుఁ గాననిమనస్తాపంబునం బొక్కఁగా
నిల్లా లార్తిఁ గృశింపఁగా సవనవహ్నిశ్రేణి చల్లారఁగా
నిల్లున్ శూన్యత నొంది సొంపు చెడఁగా నిచ్చోట నేఁ జిక్కి యో
ఫుల్లాంభోరుహనేత్ర యేసుఖమతిన్ భోగించెదం జెప్పవే. 98

అ. ఓఫుల్లాంభోరుహనేత్ర=వికసించిన తామరవంటి కన్నులుగల యోవరూథినీ, తల్లిందండ్రియున్ = నాతల్లిదండ్రులిద్దఱును, నన్ను, కాననిమనస్తాపంబునన్ = చూడలేదని కలిగినమనసులోని సంతాపముచేత, పొక్కఁగాన్ = తపింపఁగా, ఇల్లాలు = నాభార్య, ఆర్తిన్ = విరహబాధచేత, కృశింపఁగాన్=చిక్కిపోఁగా, సవనవహ్నిశ్రేణి=యాగాగ్నులవరుస-త్రేతాగ్నులనుట, చల్లారఁగాన్ = అటిచల్లఁబడిపోఁగా, ఇల్లున్ = నాయిల్లును, శూన్యతనొంది = పాడుపడి, సొంపు = సమృద్ధి, చెడఁగాన్ = చెడిపోఁగా, ఇచ్చోటన్ = ఇక్కడ, నేన్ = నేను, చిక్కి=చిక్కుకొని, ఏసుఖమతిన్ = ఏవిధమైన సుఖాపేక్షతోడి బుద్ధితో, భోగించెదన్ = నీతోభోగింతును, చెప్పవే=నీవుచెప్పుము.

తా. నేను దమకన్నులయెదుట లేదను విచారముచేత నాతల్లిదండ్రులు తపించుచుండఁగా, నాభార్య నన్నెడఁబాయుటవలని విచారముచేతఁ జిక్కిపోఁగా, హోమాగ్నులు చల్లారఁగా, ఇల్లు పాడుపడి సమృద్ధిచెడిపోఁగా, నే నిక్కడఁ జిక్కుకొని యల్లాడుచున్నాను ఇటువంటినాకు సుఖాపేక్ష యెట్లు కలుగును? నేనేమని నీతో భోగింతును? నీవేయోచించి చెప్పుము.

ఉ. ఓసరసీరుహాక్షి వినవో రతిఁ గౌఁగిట నీవు చేర్చునిం
పాసురభర్తకైనఁ గలదా వల దంచుఁ బెనంగ నేను స
న్యాసినెయొక్కటే తహతహన్ మన సొగ్గదు కేళిపై ననా
శ్వాసితదుఃఖితే మనసి సర్వ మసహ్య మనా నెఱుంగవే. 99

అ. ఓసరసీరుహాక్షి = తామరలవంటికన్నులుగలయోవరూథినీ, వినవో = నామాటనీవువిన్నావు గావా, రతిన్ =సంభోగమునందు, కౌఁగిటనీవుచేర్చునింపు = నీవుకౌఁగిలించుకొనునట్టియానందము, ఆ సురభర్తకైనన్ =(ఎల్లభోగముల ననుభవించుటయందు) ప్రసిద్ధుఁడైన యింద్రునకైనను,కలదా=కలుగునా?, వలదు = నాకక్కఱలేదు, అంచున్ = అని, పెనంగన్ = పెనఁగులాడుటకు, నేను, సన్న్యాసినె=యతినా, (పా పెనంగ నేమిసన్యాసినె = పెనఁగులాడుటకు నేనుసన్యాసినాయేమి), ఒక్కటే తహతహన్ = ఒక్కటియైన (తల్లిదండ్రులు పెండ్లాము ఇల్లువాకిలి ఏమయ్యెనో యను) విచారము చేత, కేళిపైన్ =సంభోగముపైని, మనసు=మనస్సు, ఒగ్గదు=మొనయదు-సంభోగేచ్ఛ మనమునఁ బుట్ట దనుట అనా ..మసహ్యమ్-మనసి=మనస్సు, అనాశ్వాసిత = ఊఱడింపఁబడనిదై- ఊఱటలేనిదై, దుఃఖితే=దుఃఖమునొందిన దగుచుండఁగా, సర్వమ్=సమస్తమును-ఇష్టానిష్టములన్నియుననుట, అసహ్యమ్=రోయఁదగినదియే, అనాన్ =అనుట,ఎఱుంగవే=నీవు విని యెఱుఁగవా.

తా. ఓచిన్నదానా! నాస్థితిని వినుము. నేను నీతోడఁ గ్రీడింపకపోవుటకు సన్యాసినిగాను. ఇంద్రునంతటివాని కైనను నేనంటిదానికూటమి సిద్ధింపదనుట్లయు నేనెఱిఁగినవిషయమే అయినను మనస్సువిచారగ్రస్తమైయుండఁగా నెట్టియుత్సాహకరమైన విషయమునందుఁగాని యిచ్ఛపుట్టదను దానికిఁ దార్కాణముగాఁ దల్లిదండ్రులేమయిరో పెండ్లామే మైపోయెనో యిల్లువాకిలి యెట్లుపాడై పోయెనో యనువిచార మొకటిమనసునకుఁగలఁతపుట్టించి బాధించుచుండుటచేత నే కాని లేనిపక్షమున నీతో నింత పెనఁగులాడుదునా అప్పుడే పైఁబడి మరులుకొందును. అలం. అర్థాంతరన్యాసము, కావ్యార్థాపత్తి, ప్రతిషేధమును.

క. ఐనం గా నిమ్ము భవ, ద్దీనతకై వ్రతము విడిచితిం బరులకు మే
లైనం జాలు శరీరం, బైన నుపేక్షింపవలయు నది యట్లుండెన్. 100

అ. ఐనన్ = అట్లయినను, కానిమ్ము = కానీ-అట్లునామనస్సుచెడి దేనియందును నుత్సాహము లేనిదైయున్న నుండ నిమ్మనుట, భవద్దీనతకై = నీదైనదీనత్వమునకై - నీవు దీనురాలవై ప్రార్థించుటచేత ననుట, వ్రతము = ఇఁకమీఁద నేదియు నక్కఱలేదని యేర్పఱచుకొన్న నియమమును, విడిచితిన్ = ఇప్పుడు విడిచిపెట్టితిని, పరులకున్ = ఇతరులకు, మేలయినన్ = మంచికలిగినను, చాలున్ = అంతే చాలును, శరీరంబైనన్ = ఈదేహమునైనను, ఉపేక్షింపవలయున్ = (ఇదేగదా నాయునికి కాధారమైనది యనెడి యభిమానమువదలి) విడిచిపెట్టవలయును, అది = ఆవిషయము, అట్లుండెన్ = అట్లుండఁగా, - పైపద్యముతో నన్వయము.

తా. నాస్థితి యెట్లున్న నుండనిమ్ము. ఇప్పుడు నీవింత దీనత్వముతో వేఁడుకొనుటచేత నానియమమును వదలుకొన్నాను. తనదేహమైనను విడిచి యొకరికి మేలుచేయుట యుత్తమధర్మమందురు గనుక నీసుఖమునకై నానియమము చెఱచుకొనుట యుక్తమే. అది యట్లుండఁగా అలం. అప్రస్తుత ప్రశంస, కావ్యార్థాపత్తియు.

క. తివురక యింకొక్కటివిను, కవియునెడన్ వలయుఁ గన్నుఁగవయును మూయన్
భువి నిది యస్మద్దేశ, వ్యవహారము కన్నుఁ దెఱవ నఘ మగుఁ దెఱవా. 101

అ తెఱవా = ఓచిన్నదానా, తివురక = త్వరపడక, ఇంకొక్కటి = ఇంకొకవిషయమును, విను = (చెప్పెదను) వినుము, కవియునెడన్ = సంగమము చేయునప్పుడు, కన్నుఁగవయున్ = రెండుకన్నులును, మూయన్ = మూసికొనుట, వలయున్ = ఆవశ్యకమగును, భువిన్ = ఈభూమియందు, కన్నుఁదెఱవన్ = కన్నును తెఱచుటచేత, అఘము = పాపము, అగున్ = కలుగును, ఇది = ఈ సంగమకాలమందుఁ గన్నుమూసికొనుట, అస్మద్దేశవ్యవహారము = మాదేశాచారము.

తా. ఓవరూథినీ! నీవు త్వరపడక వినవలసినవిషయ మింకను నొకటిగలదు వినుము. మాదేశమునందు స్త్రీపురుషులు సంగమము చేయునపుడు కన్నుదెఱచి యొకరినొకరు చూచుకొనుటపాపమని కన్నులుమూసికొందురు. అందులకు నీవు సమ్మతింపవలయు సమ్మతింపకున్న మనకుఁ గూటమి పొసఁగదు (కామరూపము ధరించినవారికి సంగమకాలమందును నిద్రాసమయమందును మరణకాలమునందును స్వస్వరూపమువచ్చును గనుక సంగమకాలమునందుఁ గన్నుఁ జూచినపక్షమునఁ దాను గంధర్వుఁడగుట తెలిసి తిరస్కరించునని యెంచి గంధర్వుఁడు సంగమకాలమందు గన్నుదెఱవఁగూడదని చెప్పెనని యెఱుంగునది.) అలం. కావ్యలింగము.

శా. ఈమర్యాదకు నీ వొడంబడిన మేలీభంగి గాదేని మా
భూమిం జేరఁగ నెట్లు నీయొడలితోఁ బోవంగ లేనే కదా
యీమందాకినిపొంత నీమునులతో నీవృక్షవాటంబులో
భామా యేఁ దపమాచరింతు విధి కబ్రహ్మణ్యముం బెట్టుచున్. 102

అ. భామా = ఓవరూథినీ, నీవు, ఈమర్యాదకున్ = ఈమేరకు, ఒడంబడినన్ = ఒప్పుకొన్నయెడల, మేలు = మంచిది, ఈభంగి = ఈప్రకారము, కాదేని = నీకుసరిపడనిపక్షమున, ఈయొడలితోన్ = ఈశరీరముతో - బ్రతికియున్నంతవఱకుననుట, ఎట్లును = ఏవిధముచేతను, మాభూమికిన్ = మాదేశమును, చేరంగన్ = చేరునట్లు, పోవంగన్ = పోవుటకు, లేనేకదా = చాలనేచాలనుగదా, (ఇఁకను) ఏన్ = నేను, ఈమందాకినిపొంతన్ = ఈయాకాశగంగానదియొద్దనందు, ఈమునులతోన్ = ఈతపస్సుచేయుచున్న ఋషులతోఁ గూడ, ఈవృక్షవాటంబులోన్ = ఈమ్రాఁకులచాలునందు, విధికిన్ = దైవమునుగూర్చి, అబ్రహ్మణ్యముంబెట్టుచున్ = నేను జంపఁదగనివాఁడనని మొఱపెట్టుచును, తపము = తపస్సు, ఆచరింతున్ = చేసెదను

తా. ఓచెలీ! ఈ మేరకు నీవు సమ్మతించితివా సరి సమ్మతింపనిపక్షమున నిఁక నేవిధముచేతను మాయూరికి నేను బోవుదు నన్నయాశ లేనేలేదు. కాఁబట్టి బ్రతికియున్నంతకాలము నీగంగానదీతీరమునందలి యీవనములోఁ దపస్సుచేయునట్టిమునులతోఁ జేరుకొని దైవమా నేను జంపఁదగనివాఁడను నన్నుఁ జంపకుమని మొఱపెట్టుచు నిక్కడనే తపస్సుచేయుచుండెద.

తే. ఇంక నొక్కటివినుముపూర్ణేందువదన, వ్రతముచెడసౌఖ్యమైననువలయుఁగలుగ
వాంఛితము దీర నను నీవు వదలఁ జెల్ల, దేను నిను సమ్మతిలఁ జేసి యేఁగుదనుక.

అ. పూర్ణేందువదన = నిండుచంద్రునివంటి ముఖముగలదానా - వరూథినీ, ఇంకనొక్కటి = ఇంకనొకమాట, వినుము, వ్రతముచెడన్ = నోముచెడినను - ఏర్పఱచుకొన్ననియమము తప్పినను, సౌఖ్యమైనన్ = సుఖమైనను, వలయుఁగలుగన్ = కలుగవలయును, వాంఛితము = నీకోరిక, తీరన్ = నెఱవేఱఁగానే, ఏను = నేను, నినున్ = నిన్ను, సమ్మతిలఁజేసి = సమ్మతిపఱచి, ఏఁగుదనుకన్ = పోవునంతవఱకు, నన్ను, నీవు వదలఁజెల్లదు = నీవు విడిచిపెట్టఁగూడదు.

తా. ఓవరూథినీ! వ్రతముచెడినను సుఖముదక్కవలె నన్నట్లు నాకు నీవలనఁ జిరసుఖము కలుగవలయును గనుక నేఁడు నీయక్కఱతీరఁగానే నన్ను వదలిపొమ్మనఁ బోదువేమో. అట్లుగాక నేనై నీ సమ్మతిమీఁద నిన్ను విడిచిపోవునంతదాఁక నన్ను నీవు విడిచిపెట్టఁగూడదుసుమీ. అలం. లోకోక్తి.

వ. ఇంత యేమిటికంటేనిం జెప్పెద నేను వైదేశికుండ బంధుమిత్రకళత్రంబులం బాసి
దైవయోగంబున నింతదూరం బేఁగుదెంచినవాఁడ మీఁద భవదర్థంబు ప్రార్థితుం
డనై వ్రతహోమాద్యనుష్ఠానంబులు విడువం గలవాఁడ నగుటం జేసి యంత
రంగంబునం గల తెఱంగు తేటపడం బలుకవలసె నాకర్ణింపుము. 104

అ. ఇంతయేమిటికిన్ = ఇన్నినిబంధనలు చేసికొనుటయేల, అంటేనిన్ = అనియడిగెడిపక్షమున, చెప్పెదను = నీకుఁ దెలియఁజెప్పెదను (వినుము.) నేను, వైదేశికుండన్ = అన్యదేశస్థుఁడను, బంధుమిత్రకళత్రంబులన్ = చుట్టములను జెలికాండ్రను నిల్లాలిని, పాసి = ఎడఁబాసి, దైవయోగంబునన్ = దైవఘటనచేత, ఇంతదూరంబు = ఇంతయధికదూరదేశమునకు, ఏఁగుదెంచినవాఁ

డక్ = వచ్చినవాఁడను, మీఁదక్ = ఇఁకమీఁదను, భవదర్థంబు = నీకొఱకు, ప్రార్థితుండనై = నీచేవేఁడుకోఁబడినవాఁడనై, వ్రతహోమాద్యనుష్ఠానంబులు-వ్రత = సాంతపనాదు లయినవ్రతములు, హోమ = వైశ్వదేవాదిహోమములు, ఆది = మొదలుగాఁగల, అనుష్ఠానంబులు = సత్కర్మములను, విడువంగలవాఁడను = విడిచిపెట్టఁబోవువాఁడను, అగుటంజేసి = అవుటచేత, అంతరంగంబునక్ = మనస్సునందు, కలతెఱంగు = ఉన్నవిధము-ఉన్న యభిప్రాయమును, తేటపడక్ = స్పష్టమగునట్లు, పలుకవలసెక్ = చెప్పవలసివచ్చెను, ఆకర్ణింపుము = (ఇంకనుజెప్పెద) వినుము.

ఉ. నీచనుదోయిసంకుమదనిర్భరవాసన మేన నూన న
య్యో చిరసౌఖ్యముల్ గనుట యొండెఁ దపం బొనరించి పాపముల్
రాచుట యొండెఁ గా కిహపరంబుల కూరక దూరమై వయ
శ్శ్రీ చన రెంటికిం జెడినరేవఁడ నౌదునె నీరజేక్షణా 105

అ. నీరజేక్షణా = కమలములవంటి కన్నులుగలదానా-వరూథినీ, నీ.. వాసన-నీ = నీదైన, చనుదోయి = స్తనద్వయముయొక్క, సంకుమద = జవ్వాజిదైన, నిర్భర = మిక్కిలి యతిశయించిన, వాసన = పరిమళము, మేనక్ = దేహమునందు, ఊనక్ = నాటుకొనఁగా - క్రమ్ముకొనఁగాననుట, చిరసౌఖ్యములు = బహుకాలముమాననిసుఖములను, కనుట = అనుభవించుట, ఒండెక్ = అయినను, తపంబొనరించి = తపస్సుచేసి, పాపముల్ = చేసినపాపములను, రాచుటయొండెక్ = నశింపఁజేయుట యైనను, కాక = (లభింపవలెనే) కాని, అయ్యో = అక్కటా, ఇహపరంబులకుక్ = ఇహపరలోకములకు రెంటికిని, దూరమై = దవ్వై - ఇహసుఖమునుగాని పరసుఖమునుగాని యనుభవింప నేర్వఁడనుగాక యనుట, ఊరక=వ్యర్థముగా, వయశ్శ్రీ=యౌవనసంపద, చనక్=కడచిపోఁగా, రెంటికిక్ = రెండుపక్షములకును, చెడినరేవఁడను=చెడిపోయినరేవువాఁడను - చాకలవాఁడను, ఔదునె=అగుదునా. ("రెంటికిం జెడినరేవఁడు" అనుటకు-ఒకచాకలవాఁ డొకయేటిలోగుడ్డ లుదుకఁబోయి యొక ఱాతిమీఁద గుడ్డ లుదికి యాయుదికినవానిని గొంతదూరమున నున్నమఱియొకఱాతిమీఁదఁ బెట్టుచు నుదుకవలసినవానిని మొదటిఱాతిదగ్గఱనేయుంచుకొని యుదుకుచుండఁగాఁ బ్రవాహము వచ్చెను. అప్పుడు వాఁడు తొందరచేత నుదుకవలసినబట్టల నున్నతావుననే విడిచి యుదికినబట్టలకై యాఱాతిదగ్గఱకుఁ బరుగెత్తఁగా నింతలో వఱద పెరిఁగివచ్చి రెండుచోట్ల నున్నవస్త్రములను గొట్టుకొని పోయెను. తెలివిలేమిచేత నొకఱాతిమీఁదివస్త్రములనైన నిలుపుకోలేకపోయిన చాకలవానిని జనులు రెంటికిఁ జెడ్డరేవఁ డనిరి. నాఁటనుండి యది లోకోక్తిగా వాడఁబడియె నని యొకకథ చెప్పెదరు.)

తా. ఓవరూథినీ! జవ్వాజి మొదలయిన పరిమళవస్తువులుచేర్చిన పచ్చగందము పూసికొన్న నిన్నుఁ గౌఁగిలించుకొని సుఖించెడిపక్షమున నట్టియిహసుఖమును జిరకాలము తనివిదీర ననుభవింపవలెను. లేదా యెల్లపాపములు నశించునట్లు తపస్సుచేసి పరలోకసుఖము ననుభవింపవలెను. ఈ రెండును గాక నీయపేక్ష తీరునంతవఱకుమాత్రము నిన్నుఁ గూడియుండి కడపటను నీవలనిసుఖమునులేక తపస్సును జెఱుచుకొని రెంటికిని జెడ్డరేవువాఁడనుగా నేరను కనుక నేనై నిన్ను వదలిపోవునంతపర్యంతము నన్ను విడనాడకుండునట్లు మాటయిచ్చితివేని నీయిష్టముచొప్పున నీతోఁగూడియుండెద. అట్లుమాటయియ్యవేని యిప్పుడే నాదారిఁబట్టి నేనుబోయెద. అలం లోకోక్తి.

క. అని యాస గలుగఁ బలికిన, విని వేలుపువెలఁది మోము వికసిల్లంగాఁ
దనచేతిచెఱఁగు బిగియం, బెనఁచుచుఁ దలవాంచి నగవు బెరయఁగఁ బలికెన్.

అ. అని = ఇట్లని, ఆసగలుగన్ = ఆశపుట్టునట్లు, పలికినన్ = (మాయాప్రవరుఁడు) మాటలాడఁగా, వేలుపువెలఁది = దేవతాస్త్రీ-వరూథిని, విని=విన్నదై, మోము=ముఖము, వికసిల్లంగాన్ = తెలివినొందఁగా, తనచేతిచెఱఁగు = తనచేతఁబట్టుకొన్న కపటప్రవరునియుత్తరీయపుఁగొంగును, బిగియన్ = బిగియునట్లు, పెనఁచుచున్ = చేతికిఁజెట్టుకొనుచు, నగవు = నవ్వు, బెరయఁగన్ = కలుగఁగా-రాఁగా, తలవాంచి = తలవంచుకొని, పలికెన్ = ఒకమాటచెప్పెను.

శా. హా నీనిష్ఠురవృత్తి మాని కరుణైకాయత్తచిత్తంబునన్
మానం జాల నటంచు నేఁడు శ్రవణానందంబుగాఁ బల్కుటన్
సూనాస్త్రున్ వెలవెట్ట కేలితి సుఖార్ణోరాశిలోఁ గ్రుంకితిన్
నానోముల్ ఫలియించె నావయసు ధన్యం బయ్యె విప్రోత్తమా. 107

అ. విప్రోత్తమా = ఓబ్రాహ్మణశ్రేష్ఠుఁడా, హా=ఔరా, (పా. ఆ=సరే,) నీనిష్ఠురవృత్తిన్ = నీదైనకఠినప్రవర్తనమును, మాని = విడిచి, కరుణైకాయత్తచిత్తంబునన్ = దయకు ఒకదానికేయధీనమైనమనసుతో-కేవలము దయతోఁ గూడిన మనసుతో, మానం జాలను = నిన్నువిడువలేను, అటంచున్ = అని, శ్రవణానందంబుగాన్ = చెవులపండువుగా, నేఁడు=ఈదినము, పల్కుటన్ = నీవుపలుకుటచేత, సూనాస్త్రున్ =పుష్పబాణుని- మన్మథుని, వెలవెట్టక = జీతబత్తెములేమియు నియ్యకయే, ఏలితిన్ = బంటుగా నేలుకొంటిని, సుఖార్ణోరాశిలోన్ = సుఖమనెడిసముద్రమునందు, క్రుంకితిన్ = మునిఁగితిని, (పా. చొక్కితిన్ = పారవశ్యమునొందితిని,) నానోములు = నాయొక్క వ్రతములు-నేనుజేసినవ్రతములు, ఫలియించెన్ =పండెను, నావయసు = నాప్రాయము-యౌవనము; (పా. నాకులము=నావంశము.) ధన్యంబయ్యెన్ =కృతార్థమయ్యెను-సార్థకమయ్యెను.

తా. ఓబ్రాహ్మణోత్తమా! నీవు మునుపటివలెఁ గఠినత్వమునే వహించి యుండక నిన్ను నేను విడువనని దయతోఁ జెవులపండువుగా నాకుఁజెప్పినమాటకు మిక్కిలిసంతోషించితిని; ఇఁక మన్మథబాధలేక తనివిదీర సుఖించెదను. నేను జేసినపుణ్యవ్రతములు పండెను. నాప్రాయమును సార్థకమయ్యెను. అలం. రూపకము.

వ. నీ వెట్లు చెప్పి తట్లు సేయంగలదాన నని యతని నొడంబఱుచుసమయంబునం
దోడిచెచ్చెలు లచ్చకోరాక్షిం గూడుకొని 108

అ. నీవు, ఎట్లు చెప్పితి=ఏప్రకారమునడచుకొమ్మనెనని చెప్పితివో, అట్లు=ఆప్రకారముగానే, చేయంగలదానను = చేసెదను- అట్లేనడచుకొనెదను, అని, అతనిన్ =ఆమాయాప్రవరుని, ఒడంబఱుచుసమయంబునన్ = (తనతోడికూటమికి) సమ్మతింపఁజేయుచున్న సమయమునందు, తోడిచెలులు = వరూథినితోడివారైనచెలికత్తెలు, అచ్చకోరాక్షిన్ = వెన్నెలపులుఁగులవంటి కన్నులుగలదైన యావరూథినిని, కూడుకొని = (వెదకుచువచ్చి) చేయకొని-పైపద్యముతో నన్వయము.

సీ. అకట నిర్దయబుద్ధి వని దూఱెఁ గడు రంభ, యాహా వివేకి వాఁ డనియె హారిణి
చేఁదు మ్రింగెద వంచుఁ జెలికి నవ్వె ఘృతాచి, మాయలాఁ డని తిట్టె మంజుఘోష
న్యాయనిష్ఠురములఁ బ్రార్థించె నూర్వశి, జంకించె రమ్మంచుఁ జంద్రరేఖ
చెలి నేఁచి తని దిసంతులుగొట్టె మేనక, విడుచు మాయ లటంచు నొడివె హేమ
గొంట వనియెఁ దిలోత్తమ గూర్మిఁ గొసరె, ధాన్యమాలిని పుంజికస్థల యదల్చె
దివిజకామిను లిరీతిఁ దిరుగువాఱి, గువ్వకోల్గాంచుఁ దమలోన నవ్వుకొంచు.

అ. (ఇందు వరూథిని చెలులు మాయాప్రవరునిఁ బరిహసించుట చెప్పఁబడును) అకట=అయ్యో, నిర్దయబుద్ధివి=దయమాలినబుద్ధిగలవాఁడవు, అని, కడుఁ=మిక్కిలి, రంభదూఱెన్=రంభనిందించెను, ఆహా=ఔరా, వివేకివి=తెలివిగలవాఁడవు, ఔదు=అగుదువు-ఇటువంటియప్సరస తానై వలచి పైఁబడి వచ్చినను వదలిపోయితివి గనుక నీవు తెలివిలేనివాఁడవనుట, అని హరిణి యనియెను. ఘేదుఱ్ఱమింగె దవు=విషముమ్రింగఁబోయెదవు-ఎంతో ప్రయత్నము చేసినను దొరకని యీవరూథినికూటమి నీకు చేఁదుమ్రింగుట వంటిదికాఁబోలు, ఎంతకష్టము నీకు అనుట అంచున్=అని, చిలికి=మీఱి, ఘృతాచి నవ్వెను, మాయలాఁడు=పేఁడు మోసగాఁడు, (పా. మాయకాఁడు.) అని, మంజుఘోష తిట్టెను, న్యాయనిష్ఠురములన్=నీతితోడినిష్ఠురపుమాటలచేత, ఊర్వశి ప్రార్థించెను, రమ్మంచున్ = (బిగువేమి) ఇటురమ్మని, చంద్రరేఖ, జంకించెన్=గద్దించెను, చెలిన్ = మాచెలిమికత్తెను, ఏఁచితి=బాధించితివి, (పా. నొంచితి=నొప్పించితివి) అని, మేనక, దిసంతులుకొట్టెన్=నిందించెను, మాయలు = నీకపట చేష్టలను, విడువు=విడిచిపెట్టుము, అటంచున్=అని, (పా. విడువు మీల యటంచున్=సిగ్గువిడువు మని,) హేమ, నొడివెను=చెప్పెను, గొంటువు=దుష్టుఁడవు, అని తిలోత్తమ యనియెను, హర్మిన్= ప్రేమతో, ధాన్యమాలిని, కొసరెన్=ప్రార్థించెను, పుంజికస్థల, అదల్చెన్=బెదరించెను, ఈరీతిన్= ఈవిధముగా, దివిజభామినులు=దేవతాస్త్రీలు, తిరుగువాతి = చుట్టుఁజుట్టుకొని, గువ్వకొల్గొంచున్= గుంపులుగూడుకొనుచు, (పా. గువ్వకరిగొండ్రు = గుంపుగూడుకొందురు,) తమలోనన్ = తమలోఁ దాము, నవ్వుకొంచును, (ఉండిరి అని క్రియ తెచ్చికోవలెను) అలం. (చేఁదుమ్రింగెదవనుచో) లలితము.

క. ఆకుహనాభూసురుఁ డపు, డాకాంతలసరససమ్మోదాలాపములం
గైకొనుచు ముదితహృదయుం, డై కేళీవనము వెడలి యరిగి కుటఁగటన్. 110

అ. అపుడు=ఆసమయమునందు, ఆకుహనాభూసురుఁడు=ఆ కపటబ్రాహ్మణుఁడైన గంధర్వుఁడు, ఆ లాపములన్-ఆకాంతల=ఆదేవతాస్త్రీలయొక్క, సరస = రసవంతములయిన, సమ్మదాలాపములన్=సంతోషపుమాటలను, కైకొనుచున్=అంగీకరించుచు, ముదితహృదయుండై = సంతోషించిన మనసుగలవాఁడై-మనసునందుసంతోషించి, కేళీవనము=ఆయాటతోఁటను, వెడలి=(విడిచి)బయలుదేరి, అరిగి=పోయి, కుటఁగటన్=ఆతోఁటను సమీపమునందు-పైపద్యముతోనన్వయము.

సీ. మృగనాభినికరంపుఁ గుబగుబల్ గలచోటఁ, జదలేటితుంపురుల్ చెదరుచోట
వకుళవాటీగంధవహుఁడు పైకొనుచోటఁ, గర్పూరతరుధూళి గప్పుచోటఁ
బసమీఱుసెలయేఱు లిసుక వెట్టినచోటఁ, జిగురుమావులసంజ నిగుడుచోట
నవమాలికలతీవె నల్లుట్టిపడుచోట, మాణిక్యదీపముల్ మలయుచోటఁ
భ్రమదమునఁ దేఁటులెలుఁగెత్తి పాడుచోట, శారికలనంగశాస్త్రముల్ చదువుచోటఁ
గీరకలకంఠములు క్రొవ్వి కేరుచోట, బావురము లారజంబులు పలుకుచోట.

అ. మృగ . బుగల్-మృగనాభి=కస్తూరియొక్క, నికరంబు = రాశియొక్క, బుగబుగల్ = గుప్పుగుప్పునఁగొట్టెడువాసనలు, కలచోటన్=కలిగినతావునను, చదలేటితుంపురుల్ = ఆకాశగంగలోని నీటిచినుకులు, చెదరుచోటన్=ప్రసరించునట్టితావునను, వకుళ. వహుఁడు-వకుళవాటీ= పొగడ మ్రాఁకులచాళ్లవలని, గంధవహుఁడు=చల్లనివాసనతోడిగాలి, పైకొనుచోటన్=ప్రసరించునట్టి తావునను,

కర్పూరతరుధూళి=కర్పూరపుఁటంటిచెట్లయొక్క పచ్చకర్పూరపుదుమ్ము, కప్పుచోటన్=క్రమ్ముకొనెడి తావునను, పస . ఏటులు - పస=సారము, మీఱు=అతిశయించునట్టి, సెలయేఱులు=కొండయందుండి క్రిందికిఁ బాఱునట్టియేళ్లు, ఇసుకపెట్టినచోటన్ = ఇసుకదిన్నె లేర్పడునట్లు ప్రవహించినతావునను, చిగురు . సంజ - చిగురు=ఎఱ్ఱనిచిగుళ్లుగల, మావుల=మామిడిచెట్లయొక్క, సంజ = సంధ్యారాగకాంతి, నిగుడుచోటన్=వ్యాపించునట్టితావునను, నవమాలికలతీవెనట్లు=జాజితీఁగెలయంట్లు, ఉట్టిపడుచోటన్ = అతిశయించినతావునను, (పా. నవమాలికలతేనెనట్టొట్లుపడుచోటన్=జాజిపొదలనుండి యెడ తెగక పడెడి తేనెబొట్లురాలెడితావునను), మాణిక్యదీపములు = దీపములవలె వెలిఁగెడికెంపులు, మలయుచోటన్=వ్యాపించినతావునను, తేఁటులు=తుమ్మెదలు, ప్రమదమునన్=సంతోషముచేత (లేక) అధికమదముచేత, ఎలుఁగెత్తి=గొంతెత్తి-బిగ్గరఁగా, పాడుచోటన్=గానముచేసెడితావునను, శారికలు= గోరువంకపక్షులు, అనంగశాస్త్రిముల్=మన్మథశాస్త్రిములను, చదువుచోటన్ = చదివెడితావునను, (అక్కడి గోరువంకలు అప్సరసలవలన మన్మథశాస్త్రిములను నేర్చియున్నవని తెలియునది.) కీరకలకంఠములు = చిలుకలును గోయిలలును, క్రొవ్వి = మదించి, కేరుచోటన్ = ఉత్సాహముతో సంచరించుతావునను, పావురములు = పావురాపక్షులు, ఆరజంబులు = అవ్యక్తమధురమైనధ్వనులతో, పలుకుచోటన్ = కూయుతావునను, అనఁగా మీఁదఁజెప్పిన లక్షణములచేత మనోహరమయిన స్థలములుగల ప్రదేశమునం దని భావము. పైపద్యముతో నన్వయము అలం॥ ఉదాత్తము, రూపకము, పరిణామమును

తే. ఆవరూథినిమణిమండితాలయంబుఁ, గాంచి యనురాగమునఁ బ్రవేశించి యంత
వారి నిరువురఁ గూర్చి యవ్వనజగంధు, లాత్మగృహముల కేఁగి రనంతరంబ.

అ. ఆవరూథిని... ఆలయంబున్ - ఆవరూథిని=ఆవరూథినిదైన, మణిమండిత=రత్నములచే నలంకరింపఁబడిన, ఆలయంబున్=ఇంటిని, కాంచి = చూచి, అనురాగమునన్=ప్రీతితో, ప్రవేశించి= (వారందఱును) చొచ్చి, అంతన్ = అట్లుచొచ్చినతోడనే, వారినిరువురన్ = ఆవరూథినీమాయాప్రవరులనిద్దఱును, కూర్చి = జతగాఁజేర్చి, అవ్వనజగంధులు = తామరపూవాసనవంటి దేహవాసనగల రంభ మొదలైన యాయప్సరసలు, ఆత్మగృహములకున్=తమయిండ్లకు, అరిగిరి=పోయిరి, అనంతరంబ=వెంటనే - మీఁదిపద్యముతో నన్వయము

క. ఫుల్లలవలీనవైలా, వల్లిమతల్లికలతోడ వాసంతిక లు
ద్వల్లీల నల్లిబిల్లిగ, నల్లికొనినయొకలతాగృహాంతరసీమన్ 113

అ. ఫుల్ల . తోడన్ - ఫుల్ల=వికసించిన, లవలీ = వెన్నెలతీఁగెలతోడను, నవ=క్రొత్తయైన-శీతలమైన, ఏలావల్లిమతల్లికలతోడన్ = శ్రేష్ఠములయిన యేలకితీఁగలతోను, వాసంతికలు = బండిగురుగింజతీఁగలు, ఉద్వల్లీలన్ = పుట్టుచున్నవిలాసముచేత, అల్లిబిల్లిగన్=అధికముగా, అల్లికొనిన... సీమన్ - అల్లికొనిన=అల్లికవేసినట్టు పెనఁగొన్న, ఒకలతాగృహ = ఒక్కపొదరింటియొక్క, అంతరసీమన్ = లోపలిప్రదేశమునందు - దీనికి మీఁదిపద్యములోని "భోగింపఁగొడంగిరి." అనుదానితో నన్వయము.

క. ఆగంధర్వకుమారుఁడు, నాగజగమనయుఁ బ్రఫుల్లహల్లకతల్పా
భోగంబున రహి మిగులఁగ, భోగింపఁ దొడంగి రాత్మఁబొంగెడుకాంక్షన్. 114

అ. ఆగంధర్వకుమారుఁడును = ప్రవరరూపముదాల్చినయాగంధర్వపుత్రుఁడును, ఆగజగమనయున్ = ఏనుఁగునడకవంటి యొయ్యారపునడక గలయావరూథినియును, ప్రఫుల్ల...భోగంబునన్ - ప్రఫుల్ల = చక్కఁగాబూచిన, హల్లక = చెంగలువపువులపఱచిన, తల్పాభోగంబునన్ = పాన్పుయొక్క వైశాల్యమునందు-విరివిగలపాన్పునందనుట, రహిన్ = ఇంపు, మిగులఁగన్ = అతిశయింపఁగా, ఆత్మన్ = మనస్సునందు, పొంగెడుకాంక్షన్ = మిక్కిలి హెచ్చుచున్నయిచ్ఛతో, భోగింపన్ = సంభోగముచేయ, తొడంగిరి = మొదలుపెట్టిరి

వ. ఆసమయంబున. 115

సీ. సహసానఖంపచస్తనదత్తపరిరంభ, మామూలపరిచుంబితాధరోష్ఠ
మతిశయప్రేమకల్పితదంతసంబాధ, మగణితగ్లానిశయ్యానిపాత
మతివేలమణితయాచ్ఞార్థగల్లచపేట, మతిదీనవాక్సూచితాత్మవిరహ
మంకురత్పులకజాలావిద్ధసర్వాంగ, మానందకృతహారవాననాబ్జ
మాక్రమక్షీణనుతివర్ణమానిమీలి, తాక్ష మాస్విన్నగండ మాయత్తచేష్ట
మాస్తిమితభూషణారవమావధూటి, ప్రథమసురతంబు గంధర్వపతిఁ గరంచె.

అ. సహసా..పరిరంభము-సహసా = త్వరగలుగునట్లుగా, నఖంపచ = గోరువెచ్చగానుండెడి, స్తన=కుచములచేత, దత్త=ఇయ్యఁబడిన, పరిరంభము=ఆలింగనముగలదియు, ఆమూల...ష్ఠము-ఆమూల=మొదలంటా-ఏమియుఁగొఱఁతలేకుండునట్లు, పరిచుంబిత=లెస్సగాముద్దిడఁబడిన-ద్రవముపీల్పఁబడిన, అధరోష్ఠము=మోవిగలదియు, అతిశయ...సంబాధము-అతిశయ = హెచ్చిన, ప్రేమ=కూరిమిచేత, కల్పిత=చేయఁబడిన, దంతసంబాధము = పలునొక్కులుగలదియు, అగణిత.. నిపాతము - అగణిత= ఎంచశక్యముగాని, గ్లాని=శ్రమమువలనిదుర్బలత్వముచేత, శయ్యా=పానుపునందు, నిపాతము= సోలిపడుటగలదియు, అతివేల. చపేటము-అతివేల= అత్యంతమైన, మణిత = రతికాలమునందు గొంతునఁగలిగెడిగుబగుబధ్వనియొక్క, యాచ్ఞార్థ = యాచనకొఱకైన, గల్లచపేటము = చెంపపెట్లుకలదియు, అతిదీన విరహము-అతి = మిక్కిలి, దీన= విచారమునుదెలుపునట్టి, వాక్ =మాటలచేత, సూచిత= తెలియఁజేయఁబడిన, ఆత్మవిరహము = తమవియోగముగలదియు, అంకుర .సర్వాంగము- అంకురత్ = పొటమరించుచున్న, పులకజాల=గగ్గురుమొలకలసమూహముచేత, ఆవిద్ధ=చక్కఁగా గ్రుచ్చుకోఁబడిన, సర్వాంగము=ఎల్లయవయవములుగలదియు, ఆనంద ..బ్జము-ఆనంద=సంతోషముచేత, కృత = చేయఁబడిన, హారవ=హాహాయనెడిధ్వనితోఁగూడిన, ఆననాబ్జము= ముఖకమలములుగలదియును, ఆక్రమ వర్ణము-ఆక్రమ=క్రమక్రమముగా, క్షీణ=తగ్గిపోవుచున్న, నుతి=పొగడుమాటలయొక్క, వర్ణము=అక్షరములుగలదియు, ఆనిమీలితాక్షము=సర్వత్రమూయఁబడినకన్నులుగలదియు, ఆస్విన్నగండము=అంతటను చెమర్చినచెక్కిళ్లుగలదియు, ఆయత్తచేష్టము = అధీనమయినశృంగారచేష్టలుగలదియు, ఆస్తిమితభూషణారవము = మిక్కిలి యణఁగిపోయినయాభరణములధ్వనిగలదియునైన, ఆవధూటిప్రథమసురతంబు = ఆస్త్రీ (వరూథిని) యొక్క తొలికూటమి, గంధర్వపతికిన్ = ఆగంధర్వరాజునకు, కరంచెన్ =కరఁగునట్లుచేసెను-మిక్కిలి సంతోషపెట్టెననుట. అలం. ఉదాత్తము.

క. అన్నునఁ గను మూయుట రొద, సన్నగిలుట కౌఁగిలింత సడలుట నేర్పుల్
సు న్నగుట వరూథినిరతి, కన్నెఱికపురతియుఁ బోలెఁ గడు నిం పొసఁగెన్. 117

అ. అన్నన్ = సంభోగపారవశ్యముచేత-కూటమివలనిచ్చొక్కుచేతను, కనుమూయుటన్ = కన్నులుమూసికొనుటచేతను, రొద = గళధ్వని, సన్నగిలుటన్ = తగ్గుటచేతను, కౌఁగిలింత = ఆలింగనము, సడలుటన్ = సళ్లిపోవుటచేతను, నేర్పులు = రతియందలి మెలఁకువలు, సున్న = లేనివి, అగుటన్ = అవుటచేతను, వరూథినిరతి = వరూథినియొక్క సురతము, కన్నెతొలికపురతియుఁబోలెన్ = భోగముపడుచుయొక్క తొలునాటికూటమివలె, కడున్ = మిక్కిలి, ఇంపు = ఆనందమును, ఒసఁగెన్ = ఇచ్చెను, అనఁగా వరూథిని ప్రౌఢయయినను గన్నులుమూసికొనుట యనెడియేర్పాటుచేతఁ దననేర్పులేవియుం జూపక క్రీడించినను దానితోడిక్రీడ ముగ్ధతోడి ప్రథమసమాగమమో యనునట్లు మిక్కిలి మనోహరముగానే యుండెననియర్థము అలం ఉత్ప్రేక్ష.

క. ఈవిధమున నయ్యిరువురు, భావజతంత్రైకపరత బహుకాలము సౌ
ఖ్యావహలీలల నుండం, గా వేలుపుముద్దరాలు గర్భముఁ దాల్చెన్. 118

అ. ఈవిధమునన్ = ఈప్రకారముగా, అయ్యిరువురున్ = ఆవరూథినీగంధర్వులిద్దఱును, భావజ...పరతన్-భావజతంత్ర = మన్మథవ్యాపారము-సురతవ్యాపారము, ఏక = ఒక్కదానియందే, పరతన్ = ఆసక్తిచేత, బహుకాలము = విశేషకాలము, సౌఖ్యావహలీలలన్-సౌఖ్య = సుఖమును, ఆవహ = కలిగించునట్టి, లీలలన్ = విలాసములతో, ఉండంగాన్ = వర్తించుచుండఁగా, వేలుపుముద్దరాలు = సౌందర్యవతియయినయాదేవతాస్త్రీ-వరూథిని, గర్భము = వేఁకటిని, తాల్చెన్ = ధరించెను (ఇట్లు గర్భము ధరింపఁగానే.)

క. నడ జడనుపడియె నారే,ర్పడియెం జనుమొనలు నల్లవడియెన్ వడియం
బడియెఁ గడు నొడలు పడఁతికి, బడలికయును నిదుర యరుచి బహుళం బయ్యెన్.

అ. పడఁతికిన్ = స్త్రీకి-వరూథినికి, నడ = నడక, జడనుపడియెన్ = మందమయ్యెను, ఆరు = నూఁగారు, ఏర్పడియెన్ = స్ఫుటముగాఁగనఁబడెను, చనుమొనలు = స్తనాగ్రములు, నల్లవడియెన్ = నలుపెక్కెను, ఒడలు = దేహము, కడున్ = మిక్కిలి, వడియంబడియెన్ = చిక్కిపోయెను, (లేక) బలము తగ్గినదాయెను, బడలికయున్ = ఆయాసమును, నిదుర = నిద్రయును, అరుచి = వస్తువులందు రుచితప్పుటయును, బహుళంబు = అధికము, అయ్యెన్ = ఆయెను. అలం స్వభావోక్తి.

మ. పలుచంబాఱుటఁ గోమలస్మితరుచుల్ పైఁదోఁచె నా గౌరకాం
తుల గండద్వితయంబు పొల్చెఁ బ్రమదార్ణోరాశిఖేలన్నవో
త్కలికాభంగపరంపరోపరిసముద్యత్పాండుడిండీరపం
క్తులు నాఁ జిట్టుము లుల్లసిల్లెఁ దఱుచై తోడ్తోఁ గురంగాక్షికిన్. 120

అ. కురంగాక్షికిన్ = జింకకన్నులవంటికన్నులుగలవరూథినికి, తోడ్తోన్ = (ఇట్లు గర్భచిహ్నము లన్నియు నేర్పడిన) తోడనే, గండద్వితయంబు = చెక్కిళ్లదోయి-రెండుచెక్కిళ్లును, పలుచంబాఱుటన్ = పలుచనగుటచేత, కోమలస్మితరుచులు = మృదువైన చిఱునవ్వువెలుఁగులు, పైన్ = మీఁద, తోఁచెన్ = కనఁబడెనో, నాన్ = అనఁగా, గౌరకాంతులన్ = తెల్లనికాంతులతో, పొల్చెన్ = ఒప్పెను. ప్రమద...పంక్తులు-ప్రమద = సంతోషమనెడి, అర్ణోరాశి = సముద్రమునందు, ఖేలత్ = విహరించుచున్న, నవ = నూతనములైన, ఉత్కలికా = ఇష్టవస్తువు ప్రాప్తింపు మనెడలనగు కాలవిళంబము నోర్వలేమియనెడి, భంగ = అల్లలయొక్క, పరంపరా = ఎడతెగనివరుసలయొక్క, ఉపరి = మీఁదివైపున, సముద్యత్ = లెస్సగాఁ బుట్టుచున్న, పాండు = తెల్లనైన, డిండీర = నురుఁగులయొక్క, పంక్తులు = వరుసలు, నాన్ = అనునట్లు,

చిట్టుములు=నురుఁగువలెనోటనుండివచ్చెడినీళ్లయుమ్ములు- వేవిళ్లసంబంథమైన యోఁకిలింతలని కొందఱు, తలుచై = అధికమై, ఉల్లసిల్లెన్=ప్రకాశించెను- అతిశయిల్లెననుట -అనఁగా గర్భముధరించువారికిఁ జెక్కిళ్లు వివర్ణములగుటయు నురుఁగుతోడినీళ్లు నోటనూరుచుండుటచే మాటిమాటికి నుమియుచుండుటయు స్వాభావికము గనుక గర్భిణి యయినవరూథినికి నాచిన్నెలు కలిగెననుట అలం. ఉత్ప్రేక్ష, రూపకమును.

తే. నాకజలజాక్షినిఱుపేద నడుము బలిసి, యల్ల నల్లన వళిసీమ నాక్రమించెఁ
బేర్చి దివసక్రమంబునఁ బీద బలిసి, బందికాఁడైనఁ బొరువులు బ్రదుకుఁగనునె.

అ నాక...నడుము-నాకజలజాక్షి= స్వర్గలోకస్త్రీయయిన వరూథినియొక్క, నిఱుపేదనడుము=మిక్కిలి లేమిడినొందిననడుము-సన్ననినడుమనుట, బలిసి = లావెక్కి, అల్లనల్లనన్ = మెల్ల మెల్లగా, వళిసీమన్ = కడుపుమీఁది ముడుఁతలప్రదేశమనెడిదేశమును, ఆక్రమించెన్ = ఆవరించుకొనెను-నడుముబలియుటచే ముడుఁతలు దానిబలుపునం దణఁగిపోయె ననుట. పీద = పేదవాఁడు (లేక) బలహీనుఁడు, దివసక్రమంబునన్=నానాఁట - దినములవరుసవెంబడిని, బలిసి = బలవంతుఁడై, పేర్చి= విజృంభించి, బందికాఁడు = బందిపోటుదొంగ - దొమ్మిగా నింటివారిమీఁదికి వచ్చి నిర్బంధించి దోఁచెడిదొంగ, ఐనన్ = అయినపక్షమున, పొరువులు=పొరుగుననుండువారిగుంపు, బ్రదుకుఁగనునె = మనునా-మనలేవనుట. అలం. అర్థాంతరన్యాసము.

క. పాటలసుగంధి పాటలు, నాటలు లేకప్పు డొప్పె నలసతఁ బథికో
త్పాటనజయపరిశాంత, జ్యాటంకృతిచలనమదనచాపముఁ బోలెన్. 122

అ. పాటలసుగంధి = పాదిరిపువ్వులపరిమళమువంటి దేహపరిమళముగలది - వరూథిని, అప్పుడు=ఆగర్భముధరించినసమయమునందు, అలసతన్ = ప్రాలుమాలికచేత, పాటలున్ = సంగీతముపాడుటలును, ఆటలున్ = నాట్యములాడుటలును, లేక=లేకయుండునట్లుగా, పథిక చాపమున్ - పథిక= విరహమునొందినవారిని, ఉత్పాటన=ఊడఁబెఱుకుటవలననైన-బాధించుటవలననైన, జయ = గెలుపుచేత, పరిశాంత = మిక్కిలి శాంతిపొందిన-ఎంతమాత్రమును లేక నిలిచిపోయిన, జ్యా=అల్లెత్రాటియొక్క, టంకృతి=టంఅనెడిధ్వనియు,చలన=కదలికయునుగల,మదనచాపమున్ = మన్మథునివింటిని, పోలెన్=వలెనే, ఒప్పెన్=ఒప్పినదాయెను.

తా. గర్భభారమువలనఁ బాటలు నాటలు మాని ప్రాలుమాలికతోఁ గూడియున్న యావరూథిని, మన్మథుఁడు విరహులను బీడించుపని నెఱవేఱినపిదపఁ దనవింటి నెక్కుడించి పడవైవఁగా, నల్లెత్రాటియొక్క మ్రోఁతయును జలనమును లేక మిక్కిలి యూరకున్న యావిల్లో యనునట్లుండెను. (ఇందు వరూథినికిని మన్మథునివింటికిని, పాటలకును దాని యల్లెత్రాటిటంకారములకును, ఆటలకును దాని చలనములకును, అలసతకును పథికోత్పాటనజయపరిశాంతతకును బోలికయని యెఱుంగునది.) అలం. ఉత్ప్రేక్ష.

•సీ. మనసుకక్కుఱితి మెల్లనలేచి చేతులఁ, గాంతుని జబ్బుగాఁ గౌఁగిలించు
నలసత మృద్గంధి-యైనకమ్మని నోర, నధరంబు నెడనెడ నాని కూర్కు

మణితాదిపవనధారణశ, క్తిచాలమి, నొయ్యన నర్మోక్తి నుబ్బొనర్చఁ
గాంక్షితక్రీడ కంగము పంపు సేయమి, నొడ్డుగా నిట్టూర్పు లొలయఁ బొగులు
నిచ్చ యెఱిఁగినరతికేళి మెచ్చి పొగడు, నప్పు డక్కాంత రతిపరిహాసవేళఁ
జీవితేశునమేళంపుఁజేఁత లుడుపుఁ, బ్రార్థనాపూర్వదీనసంభాషణముల. 123

అ. అప్పుడు=గర్భధారణమువలన నాయాసముకలిగిన యాకాలమునందు, అక్కాంత=ఆ స్త్రీ-వరూథిని, మనసుకక్కుఱితిఁ = మనసునందుగల ప్రియాపేక్షవలని లోభముచేత, మెల్లనఁ = తిన్నగా, తేచి, చేతులఁ = చేతులతో, కాంతునిఁ = ప్రియుని, జబ్బుగాఁ = చొరవలేకుం డునట్టుగా, కౌఁగిలించుఁ = ఆలింగనముచేసికొనును, అలసటఁ = ప్రాలుమాలికచేత, మృద్గంధి= మట్టికంపుగలది, ఐనకమ్మనినోరఁ = అయినట్టిరుచికరమైననోటితో, ఎడనెడఁ = అప్పుడప్పుడు, అధరంబుఁ = మోవిని, ఆని = చవిగొని, కూర్కుఁ = నిద్రించును, మణితాది . శక్తి-మణితాది = గళరవము మొదలగువానికై, పవన = వాయువును, ధారణ = బిగఁబట్టునట్టి, శక్తి=బలము, చాలమిఁ = వలసినంతలేకపోవుటచేత, ఒయ్యనఁ = మెల్లగా, నర్మోక్తిఁ = పరిహాసపుమాటలాడుట చేత, ఉబ్బ = (ప్రియునికి) సంతోషమును, ఒనర్చఁ = కలుగఁజేయును, కాంక్షితక్రీడకుఁ = ప్రియుఁడుకోరినయాటకు, అంగము = దేహము, పంపుసేయమిఁ = తానువలఁచినట్టుస్వాధీనముకాక పోవుటచేత, ఒడ్డుగాఁ = అధికముగా, నిట్టూర్పులు = దీర్ఘశ్వాసములు, ఒలయఁ = కలుగఁ గా, పొగులుఁ = విచారపడును, ఇచ్చ = తనయొక్కయిచ్ఛ, ఎఱిఁగినరతికేళిఁ = తెలిసినప్రియుని దైన సురతక్రీడను, మెచ్చి = తాను మెచ్చుకొని, పొగడుఁ = స్తుతించును, రతిపరిహాసవేళఁ = సంభోగవిషయమయినయెగతాళిమాటలాడునప్పుడు, ప్రార్థనా...సంభాషణములఁ-ప్రార్థనా = వేఁ డుకొనుట, పూర్వ = ముందుగాఁగల, దీన = దైన్యముతోడి, సంభాషణములఁ = మాటలచేత, జీ వితేశు... చేఁతలు-జీవితేశు = ప్రాణనాయకునియొక్క, సమేళంపుఁజేఁతలు = కూటమికై చేయు చేష్టలను, ఉడుపుఁ = మాన్పును. అలం. స్వభావోక్తి.

క. అంత వియచ్చరుఁ డభిమత, మంతయు సమకూఱుటయును నచ్చర గర్భ
క్రాంత యగుటయును గనుఁగొని, యింతట నిచ్చోటు వాయ కే నిఁక నున్నన్.

అ. అంతఁ = అప్పుడు-మీఁదఁజెప్పినదశలో వరూథినియుండునప్పుడు, వియచ్చరుఁడు = ప్రవరరూపుఁడైనయాగంధర్వుఁడు, అభిమతమంతయుఁ=తనకోరికయంతయు, సమకూఱుటయుఁ= సిద్ధించుటయును, అచ్చర = అప్సరసయైనవరూథిని, గర్భక్రాంత = వేఁకటివలని యాయాసముగలది, అగుటయును, కనుఁగొని = చూచి, ఇంతటఁ = ఇంతటిస్థితితో, ఏను = నేను, ఇచ్చోటు = ఈతావు, వాయక = వదలక, ఇఁకఁ = ఇఁకమీఁద, ఉన్నఁ = ఇక్కడనేయుండినపక్షమున - మీఁదిపద్యముతో నన్వయము.

క. వంచన యెఱిఁగిన మఱి శపి, యించునొ సురకాంత చెప్ప కేఁగినఁ బ్రేమం
బంచశరశరపరంపరఁ, బంచత ప్రాపించి మీఁదఁ బాపం బిడునో. 125

అ. సురకాంత = దేవతాస్త్రీ-వరూథిని, వంచన = నేనుజేసినమోసమును, ఎఱిఁగినఁ = తె లిసికొన్నపక్షమున, మఱి = పిమ్మట, శపియించునొ = శాపముపెట్టునో, చెప్పక = నేనుబోయెదనని

చెప్పక, ఏఁగినన్ = నాయంతట్టఁబోయినపక్షమున, ప్రేమన్ = స్నేహముచేత, పంచ...పరంపరన్-పంచశర = మన్మథునియొక్క, శరపరంపరన్ = బాణసమూహముచేత, పంచతన్ = చావును, ప్రాపించి=పొంది-చచ్చి యనుట, మీఁదన్=నామీఁద, పాపంబు=స్త్రీహత్యాదిదోషమును, ఇడునో=పెట్టునో-అనఁగా నేనిక్కడ నేయున్నపక్షమునఁ గ్రమముగాఁ గొన్నాళ్లకు నేను బ్రాహ్మణరూపమునుబొంది తన్ను మోసముఁజేసినసంగతి తెలిసికొట్టునో, ఇక్కడ నిలువక యెక్కడికైనఁ జెప్పకపోయినపక్షమున నాయందుఁ గల ప్రేమాతిశయముచేత నెడఁబాటునోర్వక చచ్చి యాచావునకు నేను గారణమగుటంజేసి యాపాపమునకు నన్నుఁ బాలుపఱుచునో మఱి యేమిచేయునో యని తనలోఁ దా నాలోచించెను అలం. సందేహము.

వ. అని వితర్కించి యక్కపటవిప్రుం డెఱింగించి యనిపించుకొనియ పోవువాఁడై యప్పు డప్పువ్వుఁబోఁడి డాయంబోయి బుజ్జవం బొప్ప నిట్లనియె. 126

అ. అని వితర్కించి=ఈవిధముగాఁ దనలోఁదానువిచారించి, అక్కపటవిప్రుండు = ఆమోసపుబ్రాహ్మణుఁడు-గంధర్వుఁడు, ఎఱింగించి = వరూథినితోఁ జెప్పి, అనిపించుకొనియ=ఆవరూథిని తన్ను సెలవిచ్చి పంపునట్లు చేసికొనియే-వరూథినిచే ననుమతిపొందియే, పోవువాఁడై = పోవునట్లు నిర్ణయించుకొన్నవాఁడై, అప్పువ్వుఁబోఁడిన్ = పువ్వువంటిదేహముగల యావరూథినిని, డాయంబోయి=దగ్గఱఁబోయి, బుజ్జవంబు=ఉపలాలనము, ఒప్పన్=ఒప్పునట్లుగా, ఇట్లనియెన్ = ఇట్లుపలికెను.

తే. ఎవ్వఁడేఁ బాదలేప మొకింత నాదు, పాదములఁ బూయ నింతేసిపనులు పుట్టె
నమ్మహాయోగి బహుయోజనాధ్వగామి, యీగిరికి నేఁగుదెంచె నేనేఁగి కంటి.

అ. ఎవ్వఁడేని = ఏసిద్ధుఁడు, పాదలేపము = అడుగులకుఁబూసికొనెడిపసరు, ఒకించుక = అవంత, నాదుపాదములన్ = నాయడుగులందు, పూయన్ = చరుమఁగా, ఇంతేసిపనులు=ఇంతింత విశేషకార్యములు-ఈహిమవంతమునకువచ్చుట పాదలేపము కరఁగిపోవుట దారిగానకయుండుటఁ దిరిగి కడకు నిన్నుఁజూచుట మొదలుగా నైనకార్యములు, పుట్టెన్ = కలిగెనో, అమ్మహాయోగి = ఆదొడ్డవాఁ డయినసిద్ధుఁడు, బహుయోజనాధ్వగామి=పెక్కామడలత్రోవనడచువాఁడు, నేఁడు = ఈదినము, ఈగిరికిన్ = ఈకొండకు, ఏఁగుదెంచెన్ = వచ్చెను, ఏఁగి = నేనుపోయి, కంటిన్ = చూచితిని.

తా- ఈహిమవత్పర్వతమునకువచ్చి నానావిధములయినయవస్థలు పడుటకుఁ గారణముగా ముందు నాయడుగులకుఁ బసరు రాచిపోయిన సిద్ధుఁడు నేఁడెక్కడెక్కడనో తిరిగి యీకొండకువచ్చినాఁడు. నేనాయనను విహారార్థముగాఁ బోయినప్పుడు చూచి మాటలాడివచ్చితిని.

క. అతఁడు మఱి తీర్థయాత్రా, వ్రతవశమున వచ్చి మాపురంబు తెరువుగాఁ
గతలుగ మాసంసార, స్థితు లెల్లను జెప్పె నేమి సెప్పుదు నబలా. 128

అ. అబలా = ఓవరూథినీ, అతఁడు = ఆసిద్ధుఁడు, మఱి = మఱియును - ఇప్పుడుఁగూడ, తీర్థ...వశమునన్-తీర్థయాత్రా = తీర్థములను గూర్చిపోవునట్టి, వ్రతవశమునన్ = నియమవశముచేత, మాపురంబు తెరువుగాన్ = మాపట్టణపుమార్గముగా, వచ్చి, మాసంసారస్థితులు = మాకాఁపురపుస్థితులను, ఎల్లన్ = అన్నిటిని, కతలుగన్ = పురాణకథలుగా, చెప్పెను, ఏమిచెప్పుదున్ = ఇఁక నేనేమనిచెప్పుదును-అదంతయు వివరించి చెప్పుటకు నాకు శక్యముకా దనుట.

సీ. పైపరామరిక చొప్పడమిఁ బక్వము దప్పి, పండఁబాఱినపొల మెండఁబాఱెఁ
గట్టఁ గాపింప దక్షత లేమి నూరూర, బందెలఁ బడిపోయెఁ బశుగణంబు
వంచనామతిఁ బ్రాడ్వివాకులై వటువు లొ, జ్జల కొప్పగించిరి చదువు లెల్లఁ
గికురించి రిచ్చి పుచ్చుకొనుచోటులవార, లాఁకకు లోనుగా కప్పు లీక
గ్రహణసంక్రమణాదుల రాచనగరఁ, గాసువీసంబు వెడలమి గ్రాసమునకు
నాధివెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని, లెస్స యుండునె గృహకర్త లేనిబ్రదుకు.

అ. పైపరామరిక = పైవిచారణ, (పా. పరామరిక) చొప్పడమిన్ = లేకపోవుటచేత, పక్వము = పరిపాకను, తప్పి=చెడి, పండఁబాఱినపొలము = పండుటకారంభించినభూమి, ఎండఁబాఱెన్ = ఎండిపో నారంభించెను, కట్టన్ = కట్టుకట్టునఁ గట్టివేయుటకును, కాపింపన్ =కంచెలో మేయఁ దోలి కాచునట్లుచేయుటకును, దక్షత = దిక్కు, లేమిన్ = లేకపోవుటచేత, పశుగణంబు= పసులగుంపు, ఊరూరన్ = ప్రతిగ్రామమునందును, బందెలన్ = బందెలదొడ్లయందు- పైరు మొదలగు నవి మేసినందులకై నిర్బంధముగాఁ దోలియుంచెడిదొడ్లయందు, పడిపోయెన్ = చిక్కిపోయెను, వంచనామతిన్ = మోసముచేయు బుద్ధిచేత, ప్రాడ్వివాకులై=తగవులమారులై, వటువులు=చదువుచున్న బ్రహ్మచారులు, చదువులెల్లన్ = తాముచదివిన విద్యలన్నియు, ఒజ్జలకున్ = ఉపాధ్యాయులకు, ఒప్పగించిరి = అప్పగించిరి-మఱచిపోయిరనుట, ఇచ్చి = అప్పిచ్చి, పుచ్చుకొనుచోటులవారలు = తీసికొనునట్టి తావులలోనిజనులు, అప్పులు=అప్పుగాఁదీసికొన్నధనములను, ఈక = ఇయ్యకయు, ఆఁకకున్= అందులకై చేసిననిర్బంధమునకు, లోనుగాక = లోఁబడకయు, కికురించిరి = మోసపుచ్చిరి, గ్రహణ సంక్రమణాదులన్-గ్రహణ = సూర్యచంద్రగ్రహణములు, సంక్రమణ = మకరసంక్రాంతి మొదలయిన సంక్రాంతులు, ఆదులన్ = మొదలయినపుణ్యకాలములయందు, రాచనగరన్ =రాజగృహము నందు, కాసువీసంబు=కాసుగాని వీసముగాని-కొద్దిగొప్పధనాదాయము, వెడలమిన్ =బయటరాకపోవుటచేత-కలుగకపోవుటచేత, గ్రాసమునకున్ =భోజనమునకుఁగాను, క్షేత్రంబులందున్ = మాన్యపుభూములందు, కొన్ని = కొన్నిటిని, ఆధివెట్టిరి = కుదువయుంచిరి, (కాఁబట్టి) గృహకర్త = ఇంటికి దక్షతగానుండువాఁడు, లేనిబ్రదుకు = లేనిదైనజీవనము-లేనికాఁపురము, లెస్సయుండునె = బాగుగానుండునా-అనఁగా నే నింటలేకపోవుటంబట్టి యిన్నివిధములచేతఁ గాఁపురము చెడిపోయె నని యర్థము. అలం. అర్థాంతరన్యాసము.

క. అదిగా నే నిట వచ్చిన, యది మొదలుగఁ జింతచే నహర్నిశమును నా
కెదు రెదురె చూచు చిద్దఱు, ముదుసళ్లును బుత్త్రమోహమున నగునార్తిన్.

అ. అదిగాక=అట్లు కయ్య కాలువ యిల్లు వాకిలి మొదలుగా సర్వస్వమును జెడిపోవుటేగాక, నేన్ = నేను, ఇటవచ్చినయది మొదలుగన్ = ఇచ్చటికి వచ్చినది మొదలుకొని, ఇద్దఱుముదుసళ్లును= వృద్ధులయిన మాతల్లిదండ్రులిద్దఱును, చింతచేన్ = విచారముచేత, అహర్నిశమును = పగలును రాత్రియును-ఎల్లప్పుడు ననుట, పుత్త్రమోహమునన్ = కొడుకనైన నావల్లని ప్రేమచేత, అగునార్తిన్ = కలుగునట్టివ్యథచేత, నాకున్ =నారాకకై, ఎదురెదురెచూచుచున్ =ఎదురుచూచుటయే పనిగావర్తించుచు-పైపద్యముతో నన్వయము.

క. తడి గంట నెపుడుఁ దఱుఁగక, కడి దఱుఁగఁగ వడియుఁ దఱిఁగి గాసిం బుడమిం
బడినఁ గనరాకమంచపుఁ, దొడుగులై రట్టె రుజలతో నేమందున్. 131

అ. కంటక్ = కంటియందు, తడి = తేమ-నీరు, ఎపుడున్ = సర్వదా, తఱుఁగక = తగ్గక-దుఃఖముచేత నెల్లప్పుడును కన్నీటి తడి లేక కాఱుచుండఁగా ననుట, కడి=ఆహారము, తఱుఁగఁగన్=తగ్గఁగా, వడియున్ = బిగువు-దేహపటుత్వమును, తఱేఁగి=తగ్గి, గాసిన్ = ఆయాసముచేత, పుడమిన్=నేలమీఁద, పడినన్=పడియున్నను, కనరాక = కానఁబడక-మిక్కిలిచిక్కిపోయి, రుజలతోన్=వ్యాధులతో, మంచపుఁదోడుగలలు = మంచముపైవేయఁబడినకంపమండ్రపోగులు-మంచమునంటుకొని లేవలేనివారు, ఐరటైరి=అయినారఁట, ఏమందున్=ఇఁక నాతల్లిదండ్రులదుఃఖము నేమని చెప్పుదును-వారిదుఃఖముకొలఁది యింతమాత్ర మని నిర్ణయించి చెప్ప శక్యము కా దనుట అలం. అతిశయోక్తి.

క. కావున వారలఁ జూడం, గా వేగమ చనఁగవలయుఁ గమలదళాక్షీ
నీ వెఱుఁగనిధర్మాధ, ర్మావస్థితి గలదె దీనికై యడలకుమీ 132

అ. కావునన్ = కాఁబట్టి, వారలన్ = అటువంటిదశలోనుండెడి తల్లిదండ్రులను, చూడంగాన్=చూచుటకై, వేగమ=శీఘ్రముగానే, చనఁగవలయున్=నేనుబోవలయును, కమలదళాక్షీ = తామరఱేకులవంటి కన్నులుగల యోప్రియురాలా, నీవు, ఎఱుఁగని.. వస్థితి-ఎఱుఁగని=ఎఱుఁగక యుండెడి, ధర్మాధర్మ=న్యాయాన్యాయములయొక్క, అవస్థితి=ఉనికి-మర్యాద, కలదె=ఉన్నదా-నీవు న్యాయాన్యాయప్రకారములన్నియుఁ జక్కఁగాఁ దెలిసినదానవు నీవు దెలియనిధర్మసూక్ష్మము లేదనుట. దీనికై = ఈ నాప్రయత్నమునకై-నేను నిన్ను విడిచిపోవునందులకై యనుట అడలకుమీ=దుఃఖపడకుమా-అనఁగా నాయందలిప్రేమచేత నన్ను విడుచుట నీకెంతదుఃఖకరమో నాతల్లిదండ్రుల నెడఁబాయుట నాకు నంతదుఃఖకరమే యని తెలిసికొని దుఃఖపడక సంతోషముతో నన్నుఁ బంపుమనిభావము.

క. వడిఁ గాఁచికాఁచి యుండం, గడవలనీ రినుము ద్రావుకై వడిఁ బైపైఁ
బొడమెడుకోర్కులచేఁ బె, ల్లుడికినమది భోగము క్తి కూఱట గనునే. 133

అ కాఁచికాఁచి=కొలిమిలోఁ గాఁచికాఁచి-మిక్కిలి కాఁకయెక్కునట్లు చేసి, ఉండన్ = ఉండఁగా, ఇనుము, కడవలనీరు = కడవలకొలఁదిజలమును, వడిన్ = వేగముతో, త్రావుకైవడిన్=పీల్చునట్టివిధమున, పైపైన్ = మీఁదమీఁద, పొడమెడుకోర్కులచేన్ = పుట్టుచున్న కాంక్షలచేత, పెల్లు=అధికముగా, ఉడికినమతి=తాపమునొందినమనస్సు-మిక్కిలియు నుద్రేకించిన మనస్సనుట, భోగముక్తిన్=సుఖానుభవముయొక్క విడుపునకు, ఊఱటన్=విశ్రాంతిని, కను నే=పొందునా.

తా. చక్కఁగాఁ గాఁకయెక్కునట్లు కొలిమిలోవేసి కాఁచినయినుము మెంతనీళ్లుపోసినను బీల్చునట్లు మీఁదమీఁదఁ బుట్టుచున్న కోరికలచేత మతిమతి యుద్రేకించియున్న మనస్సు మిక్కిలియును భోగముల ననుభవించుచునే యుండఁజూచుచుగాని యాభోగములవలన విరమించుటకు సమ్మతించునా. అలం. ఉపమ.

ఉ. కావున నెన్నఁడుం దెగనికాంక్ష నెపం బొకఁ డెన్ని రోసి నేఁ
బోవఁ దలంతు నేని వలపున్ ననుపుం దగవుం బ్రియంబునున్
నీవలనన్ నమగ్రముగ నిల్చిన సంపఁగెపువ్వుఁదేనెక్రొ
త్తావికిఁ దేఁటి చిక్కినవిధంబునఁ జిక్కెనె లోలలోచనా. 134

అ. లోలలోచనా=చలించుచున్న కన్నులుగలదానా-వరూథినీ, ఐగావునన్ = అటుగావున, ఎన్నఁడున్=ఎప్పుడును, తెగనికాంక్షన్ = తీఱనికోరికను, రోసి = రోఁతగొని, నెపంబొకటి= ఏదేనొకసాకు, ఎన్ని=ఎంచి-కలుగఁజేసికొని, నేన్=నేను, బోవన్=నిన్ను విడిచిపెట్టిపోవుటకు, తలంతునేనిన్=తలఁచినపక్షమున, వలపున్=మోహమును, ననుపున్=అనురాగమును, తగవు=న్యాయమును, ప్రియంబునన్=ఇష్టమును, నీవలనన్=నీయెడ, సమగ్రములు=సంపూర్ణములు - కొఱఁతలేకయున్నవి, నిల్చినన్=(ఇట్లనియిప్పుడేపోక) యిక్కడనేయున్నపక్షమున, సంపెఁగ... తావికిన్-సంపెఁగపువ్వు=చంపకపుష్పముయొక్క, తేనె=మకరందముయొక్క, క్రొత్తావికిన్=క్రొత్తదైన పరిమళమునకు-ఎన్నఁడు నెఱుఁగని వెగటైనపరిమళమునకు, తేఁటి=తుమ్మెద, చిక్కినవిధంబునన్ =తగులుకొన్నరీతిని, చిక్కనె=తగులుకోనా-తప్పక తగులుకొని తపింతుననుట.

తా ఓప్రియురాలా! భోగములుమానరానివి. కాఁబట్టి యెన్నాళ్లనుభవింతుననుతలఁపున నేదేనొకసాకు గల్పించుకొని తొలఁగిపోదునన్న మోహము ననురాగమును న్యాయమును గొఱఁతలేక వహించియున్న నీవంటిదాని నెట్లువిడిచిపోవచ్చును. విడిచిపోరాదనియిక్కడ నేయుందునన్నఁ దుమ్మెద తనకు వెగటైన సంపెఁగపువ్వునందలిక్రొత్తతేనె తావిగఁగోరి యందుఁ జిక్కుకొని చెడిపోవునట్లు నీతోడిసాంగత్యము నపేక్షించి చుట్టములకుఁ గానివాఁడనై చెడిపోదునుగదా తుమ్మెదలకు సంపెఁగ పువ్వులవాసనచేఁ దలదిమ్ము కలుగుననుట సుప్రసిద్ధము. అలం. ఉపమ.

ఉ॥ ఎవ్వఁడు మీఁదెఱుంగక యథేచ్ఛసుఖైకరతిం జరింపఁగా
నవ్వల వంశహాని వ్రతహాని యశోధనహాని పుట్టుఁ దా
నవ్వెడఁగమ్మనుష్యపశు వయ్యవివేకి చెడున్ జగంబునన్
నవ్వఁగఁ బాలు రౌరవమునం బడఁబాలును నిందపాలునై 135

అ. ఎవ్వఁడు=ఏమనుష్యుఁడు, మీఁదు = భవిష్యత్కాలమునందు కాఁగలయట్టివానిని, ఎఱుంగక = తెలియక, యథే. రతిన్-యథేచ్ఛ=ఇచ్చవచ్చినట్టి, సుఖైకరతిన్ = సుఖమొకదానియందే యాసక్తితో, చరింపఁగాన్=ప్రవర్తిల్లఁగా, అవ్వలన్=అవతల, వంశహాని = కులముచెడుటయు, వ్రతహాని=నియమముచెడుటయు, యశోధనహాని=కీర్తియనెడిధనముచెడుటయు, పుట్టున్ = కలుగునో, అవ్వెడఁగు=ఆమూఢుఁడు, అమ్మనుష్యపశువు = అట్టిమనుష్యరూపపశువు, అయ్యవివేకి = ఆవివేకము లేనివాఁడు, తాన్=తాను, జగంబునన్ = లోకమునందు, నవ్వఁగఁబాలు=పరిహాసమునకు లోఁబడినవాఁడును, రౌరవమునన్=రౌరవమనెడి నరకమునందు, పడఁబాలున్ = పడుటకులోనైనవాఁడును, నిందపాలును = నిందకులోఁబడినవాఁడును, ఐ = అయి, చెడున్ = చెడిపోవును

తా. ఏమనుష్యుఁ డుత్తరకాలమునందుఁ దనకు రాఁబోవునాపదలను దలఁపక కేవలముసుఖమునందే యపేక్షగలవాఁడయి యిచ్చవచ్చినట్టు ప్రవర్తించునో యట్టిపశుప్రాయుఁడును మేలని కీడని తెలిసికొను తెలివిలేనివాఁడు నైనమూఢుఁడు తనవంశమును సదాచారమును గీర్తిని జెఱుచుకొని లోకులందఱుఁ దన్నుఁజూచి నవ్వఁగా నిందఁబొంది తుదకు రౌరవమనెడి నరకమునందుఁ గూలి నశించువాఁడగును అలం. అప్రస్తుతప్రశంస

మ॥ అనినం జిత్తము జల్లనన్ సొరుగు నయ్యంభోజపత్రాక్షి లో
చనగోళంబులఁ జిమ్మలై చిలుపలై జాలై తరంగంబులై

చనుదోయిం గాన కౌశురంగమదచర్చల్ జాతిపో నొక్కమెం
డున బాష్పాంబుఝరంబు లుప్పతిలెఁ బోటుం బాటుగా నెంతయున్. 136

అ. అనినన్ = అనియిట్లు మాయాప్రవరుఁ డన్నఁగానే, చిత్తము = మనస్సు, జల్లనన్ = జల్లుమనఁగా-దిగులుతోఁచినదికాఁగా, సొరుగు ..గోళంబులన్ - సొరుగు = సోలిపడునట్టి, అయ్యంభోజపత్త్రాక్షి = తామరరేకులవంటి కన్నులుగలదైన యావరూథినియొక్క, లోచనగోళంబులన్ =కనుగ్రుడ్లయందు, చిమ్మలై=చిన్నచిన్నబొట్లుగా వెడలినవై, చిలుపలై=కొంచెపుఁబడియలై-కొంచెము కొంచెముగాఁ బల్లపుఁదావులందు నిలిచినవై, జాలై=పిమ్మటఁ బ్రవాహమై, తరంగంబులై = కరళ్లయి, చనుదోయిన్ = స్తనద్వయమునందలి, గానబు = అందము, కౌశురంగమదచర్చలు = అయినకస్తూరిపూఁతలు, జాతిపోన్ = కరఁగిజాతిపోవునట్లు, ఒక్కమెండునన్ = ఒకటేయతిశయముతో - మిక్కిలి హెచ్చి, (పా, ఒక్కయొడ్డునన్ =ఒక్కపూనికతో) బాష్పాంబుఝరంబులు=కన్నీళ్లవెల్లువలు, పోటుంబాటు = పొంగుచు నడఁగుచునుండునట్టిది, కాన్ = కాఁగా, ఎంతయున్ =మిక్కిలి, ఉప్పతిలెన్ = పుట్టెను-కలిగెను.

తా. ప్రవరరూపము ధరించిన యాగంధర్వుఁడు తాను దనయూరికిఁ బోవలెనని చెప్పినమాట చెవిసోఁకఁగానే వరూథినికి దుఃఖాతిశయముచేత దేహము పరవశమై పోవుటయేగాక కన్నులనీళ్లు క్రమక్రమముగా హెచ్చి వెల్లువగాఁ బాఱసాగెను. మిక్కిలిశోకించెనని భావము అలంకారము.

క. అత్తఱి గంధర్వవిభుం, డత్తామరసాక్షివదన మక్కునఁ గృపతో
నొత్తి మొగమెత్తి యశ్రులు, మెత్తనఁ గొనగోరఁ బాఱమీటుచుఁ బలికెన్.

అ. అత్తఱిన్ = ఆసమయమునందు, గంధర్వవిభుండు = ఆగంధర్వశ్రేష్ఠుఁడు, అత్తామరసాక్షివదనము = ఆవరూథినియొక్కముఖమును, కృపతోన్ = దయతో, అక్కునన్ = తనఱొమ్మునందు, ఒత్తి=చేర్చియదిమిపట్టుకొని, మొగమెత్తి=వెంటనేదానిమొగమును దనచేతితోఁ బైకెత్తి, అశ్రులు = కన్నీళ్లు, కొనగోరన్ = తనవ్రేలిగోటికొనతో, మెత్తనన్ = మెత్తఁదనముతో-గోరుతగిలి నొవ్వకుండునట్లు, పాఱమీటుచున్ = దూరముగాఁ దొలఁగున ట్లెగఁజిమ్ముచు, పలికెన్ = ఒకమాటచెప్పెను.

తా. అప్పు డాగంధర్వుఁడు వరూథినిదుఃఖముచూచి జాలిగొని దయతో దానిముఖము తనఱొమ్మున నదిమిపట్టియూఱడించి యంతట మెల్లగా మొగ మెత్తిపట్టుకొని కన్నీళ్లుదుడుచుచు దాని దుఃఖముపశమించున ట్లొకమాట చెప్పెను.

శా. ధీరస్వాంతవు వంత నీకుఁ దగునే దివ్యాంగనల్ కోవిదల్
గారే యోగవియోగముల్ సతములే కర్తవ్యముల్ సేయరే
పోరే రారె ప్రియంబు గల్గినజనుల్ పోరామి పోఁ బోవునే
శోకాక్రాంతఁగ నేమి కాళ్లు దెగెనే ఫుల్లాంబుజాతేక్షణా 138

అ. ఫుల్లాంబుజాతేక్షణా = వికసించినతామరలవంటి కన్నులుగలదానా - వరూథినీ, ధీరస్వాంతవు = నీవుతాలిమితోడి మనస్సుగలదానవు, నీకున్ = నీవంటిదానికి, వంత = విచారము, తగునే=యుక్తమగునా, దివ్యాంగనల్ = దేవతాస్త్రీలు, కోవిదల్ =మిక్కిలి వివేకముకలవారు, కారే= కారా-అగుదురు, యోగవియోగముల్ = కూడుటలు నెడఁబాయుటలును, సతములే = శాశ్వతము

లా, కర్తవ్యముల్ = తప్పక చేయఁదగినపనులను, చేయరే = (లోకులెవ్వరును) చేయరా - చేయు నే చేయుదురు, ప్రియంబు = ప్రేమ, కల్గినజనుల్ = కలిగినమనుష్యులు, పోరే = పోవలసినతావులకుఁ బోరా, రారె = రావలసినతావులకు రారా, పోరామి = కలిగినస్నేహము, పోక = ఎక్కడికైనఁ బోయినమాత్రముచేతనే, పోవునే = వదలిపోవునా - ఎక్కడఁ బోయినను మనసునఁగల ప్రీతి మానదనుట, పోరాకుండఁగన్ = పోవలసినచోటికిఁ బోక రావలసినచోటికి రాక యుండుటకు, ఏమి = కారణమేమి, కాళ్లు తెగనే = కాళ్లేమైన తెగిపోయినవా, (పా. గళ్లు తెగనే = మేరలు - సంబంధములు - విడిచిపోయెనా?)

తా. ఓప్రియురాలా! నీవు తాలిమిగలదానవు దేవతాస్త్రీవి దేవతాస్త్రీలు మిక్కిలి తెలిసినవారందురు అట్లుండ నీ వింతదుఃఖపడుట తగదు. ఒకరితో నొకరు కూడుకొనుటయు నెడఁబాయుటయు శాశ్వతములుకావు. నేఁడుకూడనువచ్చును రేపెడఁబాయనువచ్చును. చేయవలసినయవశ్యకార్యముల నెవరుచేయకుందురు ప్రేమగలతావులకుఁ బోవలసినప్పుడు పోవుటయు రావలసినప్పుడు వచ్చుటయు నాకేకాదు ఎల్లవారికిని సహజములు పనిగలిగి యెక్కడనైనఁ బోయినమాత్రముచేతనే మనసునఁగల ప్రేమయుఁ బోఁబోదు ఇల్లువిడిచి కదలక యున్నచోటనే యుండుటకు మనము కాళ్లుదెగినకుంటివారమా? కాముగనుక నేనిప్పుడు మాయూరికిఁ బోవుట నీతోడి సంబంధమును వదలుకొనిపోవుటగా నెంచవలదు. నీయందు నాకుఁగల ప్రేమ నన్నక్కడ నిలువనిచ్చునా? రేపేవచ్చి నిన్నుఁ గూడెదఁ జూడుము. అలం. అప్రస్తుతప్రశంస

తే. మూలముట్టుగఁ దెల్పె నమ్మునివరుండు, ప్రార్థితుండయి నాకు నప్పరమవిద్య
వచ్చుచును బోవుచుండెద వదలనిన్ను, శుకకలాలాప ననుఁ ద్రిశుద్ధికిని నమ్ము.

అ. శుకకలాలాప = చిలుకలవలె నవ్యక్తమధురస్వరముతో మాటలాడునట్టిదానా - వరూథినీ, అమ్మునివరుండు = (నాకుముందుపాదలేపమిచ్చిన) యాసిద్ధుఁడు, ప్రార్థితుండయ్యి = నాచేత వేఁడుకోఁబడినవాఁడై, అప్పరమవిద్యన్ = ఉత్తమమైనయావిద్యను - పాదలేపముచే నిచ్చవచ్చినచోటికిఁ బోవువిద్యను, మూలముట్టుగన్ = సమగ్రముగా, తెల్పెన్ = తెలియఁజేసెను, వచ్చుచునుబోవుచుండెదన్ = నేనువలసినప్పుడెల్ల నిచ్చటికి వచ్చుచుండెదను మరలఁ బోవుచుండెదను, నిన్నున్, వదలను, ననున్ = నన్ను, త్రిశుద్ధికిన్ = ముమ్మాటికిని, నమ్ము = నీవు నమ్ముము, (త్రిశుద్ధిగను అనుపాఠమునందు యతిభంగము.)

తా. ఓవరూథినీ! నేను మునుపటియాసిద్ధునిఁ బ్రార్థించి యాయనవలనఁ బాదములకుఁ బసరు రాచుకొని వలసినచోటికిఁ బోవునట్టివిద్యను సమగ్రముగాఁ దెలిసికొన్నాను ఇఁక మీఁదఁ దలఁచుకొన్నప్పుడెల్లనీయొద్దకు వచ్చుచు మరల మాయూరికిఁ బోవుచు నుండెదను నిన్ను వదలఁజాలను. నామాట ముమ్మాటికి నమ్ముము.

తే. అని వరూథిని నూరార్చి యచటువాసి, పోయెఁ దనయిచ్చ గంధర్వపుంగవుండు
తప్ప రాదు ఋణానుబంధంబు దెగినఁ, బ్రాణపద మైనవలపును బాసి చనదె.

అ. అని = ఇట్లు నమ్మఁదగినమాటలుచెప్పి, వరూథినిని, ఊరార్చి = ఊఱడించి, గంధర్వపుంగవుండు = గంధర్వశ్రేష్ఠుఁడు, అచటువాసి = ఆచోటువిడిచి, తనయిచ్చన్ = తనయిచ్చచొప్పున, పోయెను, ఋణానుబంధంబు = పూర్వజన్మమునందలియప్పు ననుసరించినసంబంధము, తెగినన్ = తెగిపోయినను - తీఱినను, ప్రాణపదను = ప్రాణస్థానము - ప్రాణముతో సమానమైనది, ఐనవలపును = అయినట్టి

మోహముగూడ, పాసిచన్నదె = తొలఁగిపోదా-పోనేపోవును. తప్పరాదు = ఈవిషయమునుతప్పించు కొన శక్యముకాదు

తా. ఆగంధర్వుఁడు తాను మరలవచ్చువాఁడనని నమ్ముటకుఁ దగినమాటలుచెప్పి వరూథిని నూ అడించి తన యిచ్చచొప్పునఁ బోయెను ఎంతమోహము గలిగియున్నను ఋణానుబంధము తీఱిన ప్పుడు తనకుఁదానే యామోహము తొలఁగిపోవును. అలం అర్థాంతరన్యాసము

వ. అనుటయుం దరువాతివృత్తాంతంబు గృపాయత్తం బగుచిత్తంబున నానతీ వల యు నని యడుగుటయును. 141

అ. అనుటయున్ = అనిపక్షులుచెప్పఁగానే, తరువాతివృత్తాంతంబు = అటుపిమ్మటి సమా చారమును, కృపాయత్తంబు = దయకునధీనమయినది-దయగలది, అగుచిత్తంబునన్ = అయిన మన సుతో, ఆనతీవలయున్ = సెలవియ్యవలెను-చెప్పవలెను, అనియడుగుటయున్ = అనియడిగినతో డనే-దీనికి నాలవయాశ్వాసము మొదట "ఇట్లనియె" అనుక్రియతో నన్వయము.

శా. హిందూరాజ్యరమాధురంధరభుజాహిగ్రామణీకంచుక
త్కుందస్వచ్ఛయశోగుళుచ్ఛ యవనక్షోణీధవస్థాపనా
మందీభూతకృపాకటాక్ష యసకృన్మాద్యత్కళింగాంగనా
బందీగ్రాహవిగాహితోత్తరకకుబ్ధాటీసమాటీకనా 142

అ. హిందూ . గుళుచ్ఛ-హిందూరాజ్య = హిందూదేశప్రభుత్వముయొక్క, రమా=సంపదయొ క్క, ధురంధర = భారమునువహించిన, భుజ = బాహువనెడి, అహిగ్రామణీ = సర్పశ్రేష్ఠమునకు- ఆదిశేషునకు, కంచుకత్ = కుబుసమువలె నాచరించుచున్న-కుబుసమగుచున్న, కుంద= మొల్లపువ్వు లవలె, స్వచ్ఛ=తెల్లనైన, యశః = కీర్తియనెడు, గుళుచ్ఛ = పూగుత్తిగలవాఁడా, యవన . కటా క్ష-యవనక్షోణీధవ = అరబ్బీరాజుయొక్క, స్థాపన = ప్రతిష్ఠయందు-సింహాసనమునందెప్పటివలె ని లుపుటయందు, అమందీభూత = చొరవగలదైన, కృపా = దయతోఁగూడిన, కటాక్ష = కడగంటి చూపుగలవాఁడా, అసకృత్ ... సమాటీకనా-అసకృత్ = మాటిమాటికి, మాద్యత్ = మదించుచు న్న, కళింగ = కళింగదేశపురాజుయొక్క, అంగనా = స్త్రీలయొక్క, బందీ = చెఱగా, గ్రాహ= గ్రహించుటయందు-చెఱపట్టుటయందనుట, విగాహిత = ప్రవేశింపఁజేయఁబడిన, ఉత్తరకకుప్ = ఉత్తరపుదిక్కునందలి, ధాటీ = యుద్ధయాత్రయొక్క, సమాటీకనా = ప్రయత్నముగలవాఁడా-ఇది కృతికర్తయైన కృష్ణరాయనికి సంబోధనము.

తా. ఆదిశేషుఁడు భూభారమును వహించినట్లు బాహుబలముచేత హిందూదేశ ప్రభుత్వ భారమునువహించి కీర్తిపొందినవాఁడవును, లోఁబడివచ్చిన యవనదేశపునబాబును వాని రాజ్యము నందు స్థిరముగా నిలిపినవాఁడవును, పలుమాఱు ఉత్తరపుదిక్కునకు దండెత్తిపోయి మదించి యెదిరిం చినకళింగరాజును గెలిచి వాని స్త్రీలను జెఱపట్టినవాఁడవు నైనవాఁడా. అలం. ఉపమ.

క. తిరుమలదేవీచరణో, త్తరలాక్షాకల్పకల్పితస్థలకమల
స్ఫురదిందీవరబంధుర, హరిహయమణివలయకూటకహర్మ్యవిహారీ 143

అ. తిరుమల.. విహారీ-తిరుమలదేవీ = తిరుమలదేవియనెడి ప్రియభార్యయొక్క, చరణోత్త ర = కాలియడుగులందు, లాక్షాకల్ప=లత్తుకచేఁ జేయఁబడినయలంకారముచేత, కల్పిత = కలుగఁ

జేయఁబడిన, స్థలకమల = మెట్టదామరలయందు, స్ఫురత్ = ప్రకాశించుచున్న, ఇందీవర = నల్లగలువలవలెనే, బంధుర=ఒప్పిదమైన, హరిన్మాయమణి = ఇంద్రనీలమణులచేసైన నెలకట్లుగల, వలయ= గుండ్రనైన, కూటహర్మ్య = కపటయంత్రములతోఁగూడిన మేడయందు, విహారీ=విహరించువాఁడా.

తా. పట్టపురాణియైన తిరుమలదేవిపాదములం దలంకారముగా బూసికొన్న లత్తుక యంటుట చేత గుండ్రము గుండ్రముగాఁ గట్టఁబడిన యింద్రనీలముల నెలకట్టుతావులు మెట్టదామరలనడుమ నల్లగలువలుగూడి వెలుఁగునట్లు వెలుఁగుచుండెడి లక్ష్మీవిలాస మనెడి మేడయందు విహరించువాఁడా. (ఇంద్రనీలములు దాపిన నెలకట్టులలో తిరుమలదేవి కాలిలత్తుక లేఖలంటినచోట్లు మెట్టదామరలవలెను అవియంటని తావులు నల్లగలువలవలెను నుండెనని యెఱుంగునది) అలం. ఉదాత్తము.

ఉత్సాహ. వర్ణనీయకీర్తివైభవా ప్రభూతభూతిదృ
క్కర్ణకుండలా వితీర్ణకర్ణ దీర్ణహృద్భ్రమ
ద్దుర్ణయారిమానహారి దుర్భరానకార్భటీ
ఘూర్ణమానకొండపల్లికొండవీటిమండలా 144

అ. వర్ణనీయ...వైభవా-వర్ణనీయ=పొగడఁదగిన, కీర్తి=యశస్సుయొక్క, వైభవా=కలిమిగలవాఁడా, ప్రభూత కుండలా-ప్రభూత=అధికమైన, భూతి=ఐశ్వర్యముచేత, దృక్కర్ణ=చక్షుశ్శ్రవస్సులే-పాములే, కుండలా = కర్ణాభరణములుగాఁగల శివుఁడా-శివునివలెఁ అష్టైశ్వర్యసంపన్నుఁడా యనుట. వితీర్ణకర్ణ=దాతృత్వమునందుఁ గర్ణుఁడైనవాఁడా, దీర్ణ.. మానహారి-దీర్ణ=పగిలిన, హృత్=గుండెలుగలిగి-గుండెలుపగిలినవారై, భ్రమత్=తిరుగుచున్న, దుర్ణయ=దుర్నీతిపరులయిన, అరి = శత్రువులయొక్క, మాన = గర్వమును, హారి=హరించినవాఁడా, దుర్భరా .మండలా-దుర్భర=భరింపశక్యముగాని, ఆనక = భేరియొక్క, ఆర్భటీ=ధ్వనిచేత, ఘూర్ణమాన=తిరుగుడుపడుచున్న, కొండ... మండలా=కొండపల్లి కొండవీడు (వీనితోఁజేరిన) భూభాగముగలవాఁడా.

తా. పొగడఁదగినకీర్తిసంపదయు మిక్కుటమయిన యైశ్వర్యసమృద్ధియుఁ గలిగి భేరీధ్వని మాత్రముచేతనే కొండపల్లి కొండవీడనెడిదుర్గముల నేలెడిరాజులను గుండెలుపగిలి వణఁకునట్లు చేయువాఁడా

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిర నందవరవంశోత్తంస శరకోపతాపసప్రసాదసమాసాదితచతుర్విధకవితామతల్లి కాల్లసానిచొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్యప్రణీతంబైన స్వారోచిష మనుసంభవం బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము 145



శ్రీ

# స్వారోచిషమనుచరిత్రము.

## సటీకము.

### చతుర్థాశ్వాసము.



కృష్ణరాయ గుణర
త్నాకల్పా కల్పకద్రుమాధికదాన
శ్రీకుతుకాగతలోకా
లోకాంతరసకలసుకవిలోక స్తుత్యా.

అ. శ్రీకృష్ణరాయ = శోభాయుక్తుఁడైనకృష్ణదేవరాయఁడా, గుణరత్నాకల్పా - గుణ = మంచిగుణములనెడి, రత్న = మణులే, ఆకల్పా = అలంకారముగాఁగలవాఁడా, కల్పక... స్తుత్యా - కల్పక = కల్పకమనెడి, ద్రుమ = (దేవ) వృక్షమునకంటె, అధిక = హెచ్చైన, దానశ్రీ = ఈవికలిమియందలి, కుతుక = వేడుకచేత, ఆగత = వచ్చిన, లోకాలోక = చక్రవాళపర్వతముయొక్క, అంతర = లోపలిభాగమునందుఁగల, సకల = సమస్తమయిన, సుకవి = సత్కవులయొక్క, లోక = సమూహముచేత, స్తుత్యా = స్తోత్రముచేయఁదగినవాఁడా. - అని కృతిపతికి సంబోధనము. మీఁద వచ్చెడి 'అవధరింపుము' అనుక్రియతో నన్వయము.

తా. సమస్తసద్గుణములును గలిగి కల్పవృక్షమునకంటె హెచ్చుగా దానము చేయువాఁడవై చక్రవాళపర్వతముచే నావరింపఁబడినభూమండలమునందుఁ గలయెల్లసత్కవులును బరివేష్టించి పొగడుచుండఁగా నొప్పునట్టి శ్రీకృష్ణదేవరాయఁడా యని తాత్పర్యము. (చక్రవాళ మనెడిపర్వతము సర్వభూమండలమును గోటవలెఁ జుట్టుకొనియుండునందురు)

వ. అవధరింపుము జైమినిమునీంద్రునకుఁ బతంగపుంగవంబు లిట్లనియె 2

అ. అవధరింపుము = చిత్తగింపుము-వినుము, జైమినిమునీంద్రునకున్ = జైమినిమునిశ్రేష్ఠునితో, పతంగపుంగవంబులు = పక్షిశ్రేష్ఠులు, ఇట్లనియెన్ = ఈమీఁదవచ్చురీతిగాఁ జెప్పెను.

సీ. మున్ను విప్రాకారమునఁ గూడుచోఁ శంకఁ, గనుమూయఁ బనిచె నాఖచరభర్త
యవ్వరారోహయు నాసక్త గావున,నిచ్చలో నటు సేయ నియ్యకొనియె
నాప్రతిజ్ఞాపూర్తి యయ్యెఁ దనంతన, వ్వనితకు రతిపారవశ్యపటిమ
నపుడు తత్ప్రవరదేహసమిద్ధశిఖిదీప్తి, శాంబరీమహిమచే సంగ్రహించి
నట్టిగంధర్వమూర్తి సౌఖ్యానుభూతిఁ, జలన మేదినమానసాబ్జమున నిలువ
వెలసెఁ దేజోమయంబైన వృద్ధి నట్టి, మేటిగర్భంబు నెలలుతొమ్మిదియునిండ.

అ. మున్ను = మునుపు, విప్రాకారమునన్ = బ్రాహ్మణరూపముతో, కూడుచోన్ = సంగమము చేయునప్పుడు, శంకన్ = (తనవాస్తవస్వరూపము వెల్లడియగునని యెడి) సందేహముచేత, అఖచర భర్త = ప్రవరరూపము ధరించినయాగంధర్వశ్రేష్ఠుఁడు, కనుమూయన్ = కన్నులుమూసికొనునట్లు, పనిచెన్ = నియమించెను, అప్వరారోహయున్ = ఆవనితయును-వరూథినియును, ఆసక్త = తత్పరురాలు, కావునన్ = కనుక, అటుసేయన్ = అతఁడు చెప్పినట్లు కన్నులు మూసికొనుటకు, ఇచ్చలోన్ = తనమనసునందు, ఇయ్యకొనియెన్ = ఒప్పుకొనెను, అవ్వనితకున్ = మిక్కిలియనురాగము గలదైనయావరూథినికి, రతిపారవశ్యపటిమన్ = సంభోగమునందలి పరవశత్వముయొక్క సామర్థ్యముచేత, తనంతన్ = తనకుఁదానే, ఆప్రతిజ్ఞాపూర్తి = కన్నులు మూయుట యనెడి యాప్రతిజ్ఞ నెఱవేఱుట, అయ్యెన్ = ఆయెను-సంభోగసుఖమువలనిచొక్కుచేఁ దనకుఁదానే కన్నుఁగవ మూఁతపడిపోయెననుట, అపుడు = ఆసమయమునందు-రతిసమయమునందు, తత్ప్రవర... దీప్తిన్-తత్ప్రవర = ఆప్రవరాఖ్యునియొక్క, దేహ = శరీరమునందు, సమిద్ధ = మిక్కిలివెలుఁగుచున్న, శిఖిదీప్తిన్ = అగ్నితేజస్సువంటి తేజస్సును, శాంబరీమహిమచేన్ = మాయాప్రభావముచేత, సంగ్రహించినట్టిగంధర్వమూర్తి = తనయందుఁ బొందించుకొన్న గంధర్వునియాకృతి, సౌఖ్యానుభూతన్ = సుఖానుభవముచేత, చలనము = చంచలత్వము, ఏదినమానసాబ్జమునన్ = లేనిమనఃకమలమునందు, నిలువన్ = నిలువఁగా, అట్టిమేటిగర్భంబు = ఆప్రవరాఖ్యునిరూపమువంటిరూపముతో నిలిచినశ్రేష్ఠమయినగర్భము, తేజోమయంబు = తేజోరూపము, ఐనవృద్ధిన్ = అయినట్టిపెంపుచేత, వెలసెన్ = వెలుఁగొందెను. (అంతట) నెలలుతొమ్మిదియున్ = తొమ్మిదినెలలును, నిండెన్ = పూర్తియయ్యెను.

తా. మునుపు చెప్పినచొప్పునఁ బ్రవరునిరూపము ధరించినగంధర్వుఁడు తనకామరూపధారణము బయలుపడు ననుసందేహముచేత వరూథినిని సంభోగకాలమునందుఁ గన్నులుమూయునట్లు నియమించిననియమ మక్కఱలేకయే క్రీడాసమయమునందలిపరవశత్వముచేత వరూథినికన్నులుతమంతనే మూఁతపడిపోయెననియు నట్టిసంగమముచేత ధరించిన గర్భము మిక్కిలి తేజస్సుతో వెలుఁగఁగాఁ దొమ్మిదినెలలు నిండెననియుఁ దాత్పర్యము. అలం సమాధి.

వ. అనంతరంబ యొకానొకపుణ్యదివసంబున. 4

అ. అనంతరంబ = తొమ్మిదినెలలు నిండినతోడనే, ఒకానొకపుణ్యదివసంబునన్ = ఏదోయొకశుభదినమునందు.

శా. తేజం బజ్జభవాండగేహమునకున్ దీపాంకురచ్ఛాయమై
రాజిల్లన్ గ్రహపంచకంబు రవిఁ జేరం బోనిలగ్నంబునన్
రాజీవాక్షి కుమారుఁ గాంచె సుమనోరాజన్యమాన్యుల్ జనుల్
జేజేవెట్టఁ బ్రసూనవర్ష మమరశ్రేణుల్ ప్రవర్షింపఁగన్.

అ. గ్రహపంచకంబు = ఐదుగ్రహములు-అంగారకుఁడు, చంద్రుఁడు, బృహస్పతి, శుక్రుఁడు, శనైశ్చరుఁడు అను నీయైదుగ్రహములును, రవిన్ = సూర్యుని, చేరంబోనిలగ్నంబునన్ = చేరకయుండెడి లగ్నమునందు, (సూర్యునిఁజేరుట యనఁగా సూర్యుఁ డున్నరాశిలోఁ జేరుట. అట్లు చేరుటకే యస్తమయమనిపేరు అంగారకాదిగ్రహములకు అస్తమయదోషము లేనిలగ్నమందని యర్థము, అస్తమయదోషము గలగ్రహములు శుభఫలము నియ్యవనుట జ్యోతిశ్శాస్త్రి సంప్రదా

యము.) రాజీవాక్షి = తామరలవంటి కన్నులుగలది-వరూథిని, తేజంబు = తేజస్సు-దేహముయొక్క-ప్రకాశము, అబ్జభవాండగేహమునకున్ = బ్రహ్మాండమనెడుయింటికి, దీపాంకురచ్ఛాయమై = దీపపుమొలకయొక్క వెలుఁగై (ఛాయాశబ్దము షష్ఠీసమాసమున వైకల్పికముగా నపుంసకలింగమగును.) రాజిల్లంగన్ = ప్రకాశింపఁగా, జనులు = ప్రజలు, జేజేవెట్టన్ = జయజయమని వినుతింపఁగా, అమరశ్రేణులు = దేవతాసమూహములు, ప్రసూనవర్షము = పువ్వులవాన, ప్రవర్షింపఁగన్ = కురియింపఁగా, సుమనోరాజన్యమాన్యున్ = దేవరాజయినయింద్రునిచే గౌరవింపఁదగినవానిని, కుమారున్ = కొడుకును, కాంచెన్ = కనియెను.

తా. వరూథిని యొకానొకశుభదినమునం దంగారకాదిగ్రహములైదింటికి నస్తమయదోషము కలుగనిమంచిలగ్నమునందు మిక్కిలి తేజస్సుగలిగి వెలుఁగువాఁడును దేవేంద్రుఁడుగూడ గౌరవించుటకుఁ దగినవాఁడును నైనకుమారునిఁ గనియెను. అప్పుడు జనులందఱును జయజయ యని పొగడసాగిరి. దేవతలు పువ్వులవాన కురియించిరి. అలం. రూపకము, ఉపమయు.

క. స్వరుచిస్ఫురణను శశిభా, స్కరపావకతారకాప్రకాశము లెల్లన్
విరళములు సేయ నతనికి, స్వారోచి యనునామ మిడి రచటిమును లెల్లన్. 6

అ. స్వరుచిస్ఫురణన్ = తనతేజస్సుయొక్క ప్రకాశముచేత, శశి...ములు-శశి = చంద్రునియొక్కయు, భాస్కర = సూర్యునియొక్కయు, పావక = అగ్నియొక్కయు, తారకా = నక్షత్రములయొక్కయు, ప్రకాశములు = వెలుఁగులను, ఎల్లన్ = అన్నిటిని, విరళములు = ఎడమైనవిగా-అణఁగినవి యగునట్లుగా, చేయన్ = చేయుటచేత, అతనికిన్ = అట్లుకనినకుమారునికి, అచటిమునులెల్లన్ = అక్కడనున్న ఋషులందఱును, స్వారోచి = తనకాంతియేగలవాఁడు, అనునామము = అనెడిపేరు, ఇడిరి = పెట్టిరి -అనఁగా లోకమునందుఁ దేజోరూపములైన చంద్రసూర్యాదుల ప్రకాశములనెల్ల నణఁచివేయఁజాలి వెలుఁగునట్టి తేజస్సుయొక్క ప్రకాశముగలవాఁ డగుటచేత నచ్చట నున్నమును లాకుమారునికి స్వారోచి యని పేరుపెట్టిరనుట అలం అతిశయోక్తి

చ. మఱియు నతండు సంయమిసమాజవినిర్మితజాతకర్ముఁ డై
నెఱిఁ బరివర్ధితుండు నుపనీతుఁడు నై వివిధాయుధంబులం
గఱకరి యై రణస్థలుల గద్దఱి యై నిగమార్థవేది యై
నెఱతనకాఁడు నై మెఱసె నిర్మలకాంతివిలాసరేఖలన్. 7

అ. మఱియున్ = వెండియు, అతండు = ఆవరూథినికొడుకు, సంయమి.. కర్ముఁడై-సంయమి = మునులయొక్క, సమాజ = సమూహముచేత, వినిర్మిత = చేయఁబడిన, జాతకర్ముఁడై = జాతకర్మముగలవాఁడై, (జాతకర్మము = బిడ్డపుట్టినప్పుడు చేసెడివేదవిహితక్రియ,) నెఱిన్ = క్రమముతో, పరివర్ధితుండును = చక్కఁగా వృద్ధిఁబొందింపఁబడినవాఁడును, ఉపనీతుఁడునై = వడుగుచేయఁబడినవాఁడునై, వివిధాయుధంబులన్ = నానావిధములైన యాయుధములందును-ఎల్లయాయుధములసాధనచేయుటయందును, కఱకరియై = సమర్థుఁడై, రణస్థలులన్ = యుద్ధరంగములయందు, గద్దఱియై = దిట్టతనముగలవాఁడై-చలింపనివాఁడై, నిగమార్థవేదియై = వేదార్థములనెఱిఁగినవాఁడై, నెఱతనకాఁడునై = వ్యాపకుఁడునై-అన్నిటికినిదీర్పరియై, నిర్మల...రేఖలన్ - నిర్మల = స్వచ్ఛమైన, కాంతి = లావణ్యముచేతను, విలాస = శృంగారచేష్టలయొక్క, రేఖలన్ = రీతులచేతను, మెఱసెన్ = ప్రకాశించెను.

తా. స్వరోచి యనఁబరఁగినయావరూథినికొడుకు తన కచ్చట్టి మున్నుమునులు జాతకర్మము చేసి పెంచి యుపనయనము చేసి శస్త్రాస్త్రవిద్యలు నేర్పి యన్నిటియందు సమర్థునిగాఁ జేయఁగా యౌవన వంతుఁడయి యుద్ధములందు గడిదేఱి వేదాంతార్థము లెఱిఁగి యెల్లన్యాయములు విచారించి తీర్పులు చేయ నేర్చి సర్వవిధము లయినశృంగారచేష్టలతోను వెలసెను.

స్రగ్ధర. గ్రుద్దుణ్ గోత్రాచలంబుల్ గులగుల లయి పోఁ గోతముల్ గ్రుద్దులీలన్
ఖద్దిం జెండాడు వ్రాఁకుల్ కవుఁగిటికోలఁదుల్ కత్తి నొక్కొక్కఘాతిం
బ్రోద్దామప్రౌఢి వాతోద్ధతగతిఁ బఱచున్ భూమి జవ్వాడఁగా ని
ట్లద్దేవీనందనుం డత్యనుపమబలుఁడై యౌవనారంభవేళన్. 8

అ. గోత్రాచలంబుల్ = కులపర్వతములు, గులగులలయిపోన్ = పొడిపొడియైపోవునట్లుగా, గోతముల్ = ప్రాల్గుంచికట్టినజనపనారపట్టసంచులను, గ్రుద్దులీలన్ = పిడికిటితోఁబొడుచునట్లు, గ్రుద్దున్ = పిడికిటితోఁబొడుచును-(జెట్టీలు సాదనచేయునప్పుడు జనపనారసంచులలో ప్రాల్గుపోసి కట్టి పిడికిళ్లతోఁ బొడుతురు.) కవుఁగిటి కోలఁదుల్ = కౌఁగిలించి పట్టవలసినంతలావుగలవైన, వ్రాఁకుల్=వృక్షములను, ఖద్దిన్ = బలముతోడి పూనికతో, కత్తిన్ = కత్తిచేత, ఒక్కొక్కఘాతన్ = ఒక్కొక్కదెబ్బచేతనే, చెండాడున్ = తునుకలుతునుకలుగా నఱికివేయును, భూమి= నేల, జవ్వాఁడఁగాన్ = అదిరిపడఁగఁగా, ప్రోద్దామప్రౌఢిన్ = కొలఁతలేనిసామర్థ్యముచేత, (పా. ప్రోద్దామ క్రీడన్ = హెచ్చయినయాట్లాటయందు), వాతోద్ధతిగతిన్ = గాలియొక్కవింతయద్ధినపడివంటిపడితో, పఱచున్ = పరుగెత్తును. ఇట్లు = ఈవిధముగా, అద్దేవీనందనుండు = ఆదేవతాస్త్రీకొడుకు-స్వరోచి, యౌవనారంభవేళన్ = యౌవనదశ రా నారంభించినప్పుడు, అత్యనుపమబలుఁడై = సరిపోల్పరానిమిక్కుటమయిన దేహబలముగలవాఁడై, పైపద్యముతో నన్వయము.

తా. ఈవిధముగాఁ బెరిఁగినయావరూథినికొడుకు యౌవనదశవచ్చుచుండఁగానె సరిపోల్పరాని బలముగలవాఁడై జెట్టీలు సాదనకై ప్రాల్గగోతములను గ్రుద్దునట్లు కులపర్వతములను గ్రుద్ది పొడిపొడి చేయుచుండుననియు, కౌఁగిట నణఁగనంతలావుగా బలిసినవ్రాఁకుల నొక్కొక్కదెబ్బకే తునుకలై పడునట్లు కత్తితో నఱకుననియు, భూమి యదురునట్లు మితిలేనివేగముతోఁ బరుగెత్తుననియుఁ దాత్పర్యము. అలం. ఉపమ, అతిశయోక్తియును

క. వేదండముతొండముసరి, కోదండముఁ దివియు నెడమఁ గుడి నిబిడజ్యా
నాదము రోదసి నిండఁగ, భేదించున్ గండశిలలఁ బృథుబాణములన్. 9

అ. (మఱియు నతఁడు) వేదండము కోదండమున్-వేదండము = ఏనుఁగుయొక్క, తొండముసరి = తొండముతోసమానమైన, కోదండమున్ =వింటిని, ఎడమన్ =ఎడమవైపునను, కుడిన్ = కుడివైపునను, నిబిడజ్యానాదము = అధికమైనయల్లెత్రాటిధ్వని, రోదసిన్ = ఆకాశము భూమి నీనియంతరాళమునందు, నిండఁగన్ = నిండుకొనునట్టుగా, తివియున్ =ఆకర్షించును, గండశిలలన్ = కొండమీఁదినుండి నేలపదొర్లినపెద్దగుండ్లను, పృథుబాణములన్ = గొప్పబాణములచేత, భేదించున్ = పగులనేయును- అనఁగా నేనుఁగుతొండమువలె లావైనవింటిని సవ్యాపసవ్యగతులఁ దివిచి యెల్ల యెడల నిండుకొనునట్లు ధనుష్టంకారము చేయుననియు, గొప్పబాణములను బ్రయోగించి పెద్దపెద్ద ఱాతిగుండ్లను బగులఁగొట్టుననియుఁ దాత్పర్యము. అలం. ఉపమ, అతిశయోక్తియును.

క. అతఁడు మఱి తనకు మంథ, క్షితిభృత్తటి విశ్వకర్మ చేసిననగరిన్
వితతాటవికచమూసే, వితుఁడై సామ్రాజ్య మనుభవింప నొకతఱిన్. 10

అ. అతఁడు=అట్టియాస్వరోచి, మఱి = మఱియును, తనకున్=తనకై, మంథక్షితిభృత్తటిన్ = కవ్వపుఁగొండచఱియయందు, విశ్వకర్మ=దేవశిల్పి, చేసిననగరిన్=నిర్మించినపట్టణమునందు, వితత... సేవితుఁడై-వితత=విస్తారమయిన, ఆటవిక = అడవియందుండెడిబోయలయొక్క, చమూ=దండుచేత, సేవితుఁడై = కొలువఁబడినవాఁడయి, సామ్రాజ్యము = ప్రభుత్వైశ్వర్యమును, అనుభవింపన్ = అనుభవించుచుండఁగా, ఒకతఱిన్ = ఒకానొకసమయమునందు-పైపద్యముతో నన్వయము.

తా. ఆస్వరోచి విశ్వకర్మచేత మందరపర్వతముచఱియయం దొకపట్టణము గట్టించుకొని యందు బోయలదండును జేర్చుకొని ప్రభుత్వము చేయుచుండెను. ఆసమయమునందు.

క. కరకాచిటపటరవభీ, కరమై పెళపెళనినాదఘనమై ఝుంఝా
మరుదుజ్ఝితబిలమంద్ర, స్వరమై యక్కొండ నొక్కవర్షము గురిసెన్. 11

అ. అక్కొండన్=ఆపర్వతమునందు, కరకా. కరమై-కరకా=వడగండ్లయొక్క, చిటపటరవ=చిటపటయనెడిధ్వనిచేత, భీకరమై=భయంకరమై, పెళ. ఘనమై-పెళపెళ=పెళపెళయనెడి, నినాద=ధ్వనులతో నుఱుముచున్న, ఘనమై=మేఘములుగలదై, ఝుంఝా. .స్వరమై-ఝుంఝామరుత్=వానతోడిగాలిచేత, ఉజ్ఝిత=వెడలింపఁబడిన, (పా అంచిత=ఒప్పిదమైన), బిల=గుహలయొక్క, మంద్రస్వరమై=గంభీరధ్వనిగలదై, ఒక్కవర్షము=ఒకవాన, కురిసెను

తా. ఆమందరపర్వతమునందుఁ జిటపటధ్వనులతో వడగండ్లు రాలఁగాఁ బెళపెళధ్వనులతో మేఘము లుఱుమఁగా వానతోడిగాలిచే గుహలు గంభీరమైనప్రతిధ్వను లియ్యఁగా నొక్కవాన కురిసెను. అలం. స్వభావోక్తి.

క. తెలతెలవేగిన నగ్గిరి, జలజలఁ బ్రవహించుసెలలచప్పళ్లు శిఖా
వలకులకలకేకాకల, కలములు గలతలపొలంబు గనుఁగొనువేడ్కన్. 12

అ. తెలతెలవేగినన్=(మీఁదఁ జెప్పినచొప్పున రాత్రియంతయు వానకురిసి) తెల్లగాఁ దెల్లవాఱినతోడనే, అగ్గిరిన్=ఆకవ్వపుఁగొండయందు, జలజలన్ = జలజలయని, ప్రవహించు సెలలచప్పళ్లు = పాఱుచున్న సెలయేళ్లధ్వనులును, శిఖావల ..కలములు-శిఖావల = నెమిళ్లయొక్క, కుల = సమూహముయొక్క, కల=అవ్యక్తమధురములయిన, కేకా=కేకలయొక్క, కలకలములు=కోలాహలధ్వనులును, కలతలపొలంబున్ = కలిగినకొండనెత్తపుభూమిని, కనుఁగొనువేడ్కన్=చూడవలయునను కుతూహలముతో-మీఁదిపద్యముతో నన్వయము.

ఆ. అన్నగాగ్ర మెక్కి యం దొక్కశశికాంత, వేదిఁ గతిపయాప్తవేష్టితుండుఁ
గుటజవిపినపవనసటదలకభరుండు, నగుచుఁ బ్రొద్దు జరపునవసరమున. 13

అ. అన్నగాగ్రము = ఆకొండచివర-ఆకొండకొమ్మమీఁదననుట, ఎక్కి=స్వరోచియెక్కి, అందున్=ఆకొండపేటునందు, ఒక్కశశికాంతవేదిన్=చంద్రకాంతపుఱాళ్ల పఱచినయొకయరుఁగుమీఁద, కతి ..వేష్టితుండున్-కతిపయ=కొంతమంది, ఆప్త = కావలసినమిత్రులచేత, వేష్టితుండున్ = చుట్టుకోఁబడినవాఁడును, కుటజ...భరుండున్-కుటజ=కొండమల్లెలయొక్క, విపిన=అడవిమీఁదుగా వచ్చు

చున్న, పవన=గాలిచేత, నటత్=కదలుచున్న, అలకభరుండును = ముంగురుల యతిశయముగలవాఁడును-మనోహరమైన ముంగురులుగలవాఁడనుట, అగుచున్ = అవుచును, ప్రొద్దుజరపునవసరమునన్ = కాలము గడపుచుండునప్పుడు-మీఁదిపద్యముతో నన్వయము.

తా. అప్పుడాస్వరోచి యాకొండపై కెక్కి యచ్చట నున్న చంద్రకాంతపుఱాళ్లయరుఁగుమీఁదఁ గొండమల్లెలపరిమళముతోడిగాలి వీవఁగాఁ గావలసినమిత్రులు కొందఱితోడఁ గూర్చుండి ప్రొద్దుపుచ్చుచుండునప్పుడు.

ఆ. ఒక్కయెఱుకుఱేఁడు నక్కకొమ్మును నిత్త్రి, గోరజంబు జున్నుఁ జాఱపప్పుఁ
బీలిగఱులయంపకోలలు సెలవిండ్లుఁ, గాను కిచ్చి కరయుగంబు మొగిచి. 14

అ. ఒక్కయెఱుకుఱేఁడు=ఒకగొప్పబోయవాఁడు, నక్కకొమ్మును=నక్కయొక్క కొమ్మును-ఒకజాతినక్క మనుఁబోతునకుంబోలె నడినెత్తిని గొమ్ముండునందురు అట్టినక్కకొమ్ము ననియర్థము. ఇత్త్రి గోరజంబును=కస్తూరియు, జున్నును=తేనెపెరయు, చాఱపప్పును=జీడిమామిడిపప్పును, పీలిగఱులయంపకోలలును=పికిలిపిట్టలయీఁకలు గట్టినబాణములును, సెలవిండ్లును= సెలసుబద్దలవిండ్లును, కానుక=ఉపాయానము-నజరుగా, ఇచ్చి, కరయుగంబు మొగిచి=రెండుచేతులుజోడించిమ్రొక్కి, పైపద్యముతో నన్వయము.

వ. యుగవిగమసమయసముద్భూతజీమూతపటలంబునుంబోలెఁ గైలాసగిరినితంబప్రాంతకాంతారపర్యంతంబు నిరంతరంబై కాఱుకొన్నయొక్కగహనరేఖం గరాంగుళిం జూపి భూపతి కిట్లనియె. 15

అ. యుగ...బోలెన్-యుగవిగమసమయ = కృతత్రేతాదియుగములు ముగియుకాలమునందు-యుగప్రళయసమయమునందనుట, సముద్భూత=పుట్టిన, జీమూత=మేఘములయొక్క, పటలంబునుంబోలెన్=సమూహమువలె, కైలాస...పర్యంతంబు-కైలాసగిరి = వెండికొండయొక్క, నితంబ=మధ్యప్రదేశమునకు, ప్రాంత = సమీపమునందలి, కాంతారపర్యంతంబు=అడవివఱకును, నిరంతరంబై=ఎడతెగనిదై, కాఱుకొన్న.. రేఖన్ - కాఱుకొన్న=దట్టముగాఁబెరిఁగిన, (కారుకొను=చీఁకటిక్రమ్ము. అనికొందఱు) ఒక్కగహనరేఖన్ = ఒకయడవిచాల్పును, కరాంగుళిన్ =చేతివ్రేలితో, చూపి= కనఁబఱిచి, భూపతికిన్ = రాజుతో-స్వరోచితో, ఇట్లనియెన్ =ఇట్లనిచెప్పెను.

తా. ప్రళయకాలమునందుఁ గలిగెడి నల్లమబ్బుచాల్పువలెనే కైలాసపర్వతముదాఁక దట్టపుఁదనముచేత నల్లగాఁ గానవచ్చుచున్న యొకయడవిచాల్పును రాజునకు వ్రేలితోఁ జూపి యీమీఁదఁ జెప్పెడిరీతిగాఁ బలికెను. అలం. ఉత్ప్రేక్ష.

క. అల్లదె కంటె పొనపొన, దెల్లనిగట్టుఱుత మబ్బుదేఱెడుపొలమం
దెల్లెడఁ జూచిన ధరణీ, వల్లభ సీరాముసేన వాలుమెకంబుల్. 16

అ. ధరణీవల్లభ = రాజా, అల్లదె = అదిగో కనఁబడుచున్నది, కంటె = చూచితివా, పొనపొన=చూపుఁజాయఁగా, తెల్లనిగట్టుఱుతన్ =వెండికొండకుదాపున, మబ్బుదేఱెడుపొలమందున్ =చీఁకటిక్రమ్ముచున్న యడవియందు, చూచినన్ =చూడఁగా, ఎల్లెడన్ =అన్నిచోట్లను, వాలుమెకంబులు=క్రూరమృగములు, (అడవిపందులని కొందఱు), సీరాముసేన = శ్రీరామునిదండు-అపరిమితము-అనఁగా

అదిగో వెండికొండ వెంబడి నల్లగాఁ గనఁబడుచుండెడు నడవియందుఁ గ్రూరమృగములు లెక్కలేక యున్నవని తాత్పర్యము. అలం. లోకోక్తి.

సీ. కండూతికై రాయుఁ గర్కశం బగుతుంటి, బీఁటవెట్టినమ్రాను పెల్లగిల్లఁ
జెవి దార్చి వినిచీమ చిటుకన్న నొకపారి, సెలవి వెంపరలాడు జిట్టలెల్లఁ
జప్పరించు వెదుళ్లు సటలుబ్బ దంష్ట్రాగ్ని, చొంగపైఁబడి చుంయి చుంయి మనఁగఁ
జంద్రనిప్పులు వోలెఁ దీండ్రించుకనుమించు, లెసఁగ నొండొంటిపై నెక్కఁ బాఱు
వెట్టదినముల మడుఁగుల మట్టి గలఁప, బుడబుడధ్వని వెడలు బుద్బుదములందుఁ
జిలుపచిలుపని నేతులు జిడ్డుదేఱు, నేమి చెప్పుదుఁ గ్రొవ్విన యేకలములు. 17

అ. క్రొవ్వినయేకలములు=మదించినయడవిపందులు, కండూతికై=తీఁటకై-దురదకై, కర్కశంబు=బిరుసెక్కినది, అగుతుంటిన్ = అయినట్టిపిఱుఁదుల క్రిందిభాగముచేత, పీఁటవెట్టినమ్రాను=తాను జక్కఁగా నూనికూర్చుండినవృక్షము-పాదుకొన్నవృక్షము అనికొందఱు, పెల్లగిల్లన్ = పాదుకదలి వేళ్లతో లేచునట్లు, రాయున్ = రాచును, చీమచిటుకనన్ = చిటుక్కుమని చీమచప్పుడుచేసినను-ఏమాత్రము ధ్వని గలిగినను ననుట, చెవిదార్చి=చెవియొగ్గి, విని, ఒకపారి=ఒక్కసారిగానే, సెలవి=కోఱలతోఁ జిమ్మి, జిట్టలెల్లన్ = వెదురువెన్నులన్నిటిని, వెంపరలాడున్=చెదరఁగొట్టును, (పా. అటఁ బాఱి సెలవి వెంపరలాడుఁ జెట్టులెల్ల= ధ్వనిగలిగినదిక్కునకుఁ బరుగెత్తుచుఁ బోయి కోఱలతోఁ జెట్లనెల్ల నఱికి పీడించును.) సటలు= మెడమీఁది వెంట్రుకలు, ఉబ్బన్ = నిక్కికొనఁగా, దంష్ట్రాగ్ని= కోఱల రాపిడివలనఁ బుట్టిననిప్పు, చొంగ = నోటనుండి కాఱెడిజొల్లు, పైఁబడి = మీఁదఁబడి, చుంయిచుంయి మనఁగన్ = చుంయిచుంయిమనెడి ధ్వనులుపుట్టింపఁగా, వెదుళ్లు= లేఁతవెదురుమొల్లలను, చప్పరించున్ = చదియనమలును, (పా. చప్పరించును వెన్నుసటలుబ్బన్-వెన్ను = వీఁపును, సటలు = మెడమీఁదివెంట్రుకలును, ఉబ్బన్ = ఉబుకఁగా, చప్పరించును), చంద్రనిప్పులువోలెన్ = చంద్రకట్టెలనిప్పులో యనునట్లు, తీండ్రించుకనుమించులు = ప్రకాశించునట్టినేత్రకాంతులు, ఎసఁగన్ = అతిశయింపఁగా, ఒండొంటిపైన్ = ఒకదానిమీఁదనొకటి, ఎక్కన్ = ఎక్కుటకయి, పాఱున్ = పరుగెత్తును, వెట్టదినములన్ = వేసంగికాలమునందు, మడుఁగులన్ = నీటిమడుఁగులను, మట్టి = కలయఁద్రొక్కి, కలఁపన్ = నీళ్లుకలఁగింపఁగా, బుడబుడధ్వనిన్ = బుడబుడ యనుశబ్దముతో, వెడలుబుద్బుదములందున్ = పైకిలేచునట్టిబుడగలయందు, చిలు . జిడ్డు-చిలుపచిలుపని= కొంచెముకొంచెముగా వెడలునట్టి, నేతులజిడ్డు=చమురులమెఱుఁగు, తేఱున్ = మీఁదికిఁదేలును, ఏమిచెప్పుదున్ = ఇఁక వానిక్రొవ్వు నేనేమిచెప్పుదును-చెప్పశక్యముకాదనుట-అవి కలియఁబెట్టిన బురదయందే జిడ్డుండఁగా వానిక్రొవ్వెంతయధికముగా నుండునని భావము. అలం. అతిశయోక్తి, ఉపమ, స్వభావోక్తియు

చ. బల మిఁక నేమి సెప్ప విను పండువెదుళ్లవలీల మోరత్రో
పులఁ బడఁ జొప్ప వంచుకొను పోలిక వంచి తదగ్రధాన్యముల్
సెలవుల ఫేన ముట్టిపడ జిట్టలు మోడనె చప్పరించు న
ప్పొలమువరాహపోతములు భూవర తొండము లేనియేనుఁగుల్. 18

అ. భూవర = రాజా, విను = నీవువినుము, అప్పొలమువరాహపోతములు = ఆయడవిలోని పందిగున్నలు, తొండములేనియేనుఁగులు, ఇఁకన్ = ఇఁకను, బలము = వానికిఁగలబలము, ఏమిచెప్పన్ = ఏమనిచెప్పుదును; పండువెదుళ్లు = వెన్నుదీసిపండినవెదురుకఱ్ఱలను, అవలీలన్ = అనాయాసముగా, మోరత్రోపులన్ = ముట్టెలతోఁ ద్రోయుటలచేత, పడన్ = వాలిపడునట్లు, చొప్ప = జొన్నలోనగు వానిదంటును, వంచికొనుపోలికన్ = వంగఁదీసికొనునట్లు, వంచి = వంగఁదీసికొని, తదగ్రధాన్యముల్ = ఆవెదుళ్లకొనలయందుండుధాన్యములను, సెలవులన్ = పెదవులమూలలందు, ఫేనము = నురుఁగు, ఉట్టిపడన్ = అతిశయింపఁగా, జిట్టలతోనె = వెన్నులతోనే, చప్పరించున్ = నమలిరసముపీల్చును.

తా. ఆయడవిలోనిపందిపిల్లలు మదపుటేనుఁగులవలె బలిసి క్రొవ్వినవై చొప్పదంటును వంచినట్లు పండినవెదురుకఱ్ఱల ననాయాసముగా మోరలతోఁ ద్రోసి వంచుకొని వానికొనలందుండువెదురుధాన్యమును వెన్నులతోడనే నమలి మ్రింగుచుండును. అలం, రూపకము. స్వభావోక్తియు.

క. పొడిచినకైదువునకుఁ జము, రిడఁగా వల దగ్గికాఁక యించుక యిడినం
జెడుగఱ్ఱల గ్రుచ్చిననం, జుడు మంటలఁ దగిలి నెయ్యి జొటజొట వడియున్. 19

అ. పొడిచినకైదువునకున్ = ఆపందులనుబొడిచిన యాయుధమునకు, చమురు = నూనె, ఇడఁగాన్ = త్రుప్పుపట్టకుండుటకై పూయుట, వలదు = అక్కఱలేదు, చెడుగఱ్ఱలన్ = కఱ్ఱలవంటియినుపసలాకలతో, గ్రుచ్చిననంజుడు = గ్రుచ్చి వ్రేలఁబట్టినయాపందులమాంసము, అగ్గికాఁకన్ = నిప్పుసెగయందు, ఇంచుక = కొంచెము, ఇడినన్ = పెట్టినను, మంటలన్ = ఆనిప్పుమంటలను, తగిలి = అంటి- మంటలుసోఁకుటచేతననుట, నెయ్యి = చమురు, జొటజొటవడియున్ = జొటజొటయనుధ్వనితో స్రవించును- అనఁగా నాపందులను బొడిచినయీఁటె లోనగునాయుధములకుఁ ద్రుప్పు పట్టకుండుటకై చమురుపూయవలసిన యక్కఱలేదు. వానిదేహములలోని చమురే చాలును. వానిమాంసమును నినుపసలాకలతో గ్రుచ్చి నిప్పుసెగఁజూపినయెడ వానినుండి చమురు ధారధారగా వడియును. పరీక్షింపుఁడని తాత్పర్యము. అవి మిక్కిలి క్రొవ్విన వనిభావము.

తే. వలదు కుక్కల విడువంగ వలవదేయ, నడచి మొలపిడియమ్మునఁ బొడువవచ్చుఁ
బంకము గొరిజ దిగఁబడఁ బఱవలేవు, మన్నులివ్వేళ రేగటిమన్నులందు. 20

అ. మన్నులు = ఋశ్యమృగములు, ఇవ్వేళన్ = ఈసమయమునందు- ఈవానకురిసి తడిసియున్నసమయమునందనుట, రేగటిమన్నులందున్ = బంకమట్టినేలలయందు, పంకము = బురదయందు, గొరిజ = కాలిగిట్ట, దిగఁబడన్ = క్రుంగఁబడుటచేత, పఱవలేవు = పరుగెత్తిపోఁజాలవు, (కనుక) కుక్కలన్ = వేఁటకుక్కలను, విడువంగన్ = ఉసికొలుపుట, వలదు = అక్కఱలేదు, ఏయన్ = బాణములుప్రయోగించుట, వలవదు = అక్కఱలేదు, నడచి = మెల్లగానడచిపోయి, మొలపిడియమ్మునన్ = నడికట్టునందుఁ జెక్కుకొన్నబాఁకుతో, పొడువవచ్చున్ = క్రుమ్మవచ్చును, (పిడియమ్ము = కటిప్రదేశమునసుండెడి గుజ్జుకోల అని కొందఱుచెప్పెదరు.)

తా. ఆ యడవిలోని రేగటిభూములం దిప్పుడు వానకురిసి బురదగానుండుటచేత మనుఁబోతులు కాళ్లుదిగఁబడఁగాఁ బరుగెత్తలేక యుండును గనుక వానిని వేఁటాడుటకై కుక్కల నుసికొలుపకయు బాణములు ప్రయోగింపకయు నడచిపోయి మొలలోఁజెక్కిన బాఁకుతోఁ బొడిచియే వేఁటాడవచ్చును.

క. పొడచెదరి బోదచఱచిన, యొడళ్లతో నాల్గు రెండు నొకటియుఁ బ్రంగల్
వెడలిన కొమ్ములబరువున, నడు గిడఁగా లేవు బలిసి యందలిదుప్పుల్. 21

అ. అందలిదుప్పులు=ఆయడవియందలి పృషత్మృగములు, (పా. అందులదుప్పుల్) బలిసి=బలుపునొందినవై, పొడచెదరి = శరీరమంతటను మచ్చలుపరవి, బోదచఱచినయొడళ్లతోన్ - బోదచఱచిన = మిక్కిలి మత్తుగొన్న, (పా బూదిచఱచిన=బూడిదవన్నెగలిగిన,) ఒడళ్లతోన్ = దేహములతో, నాల్గురెండునొకటియున్ = నాలుగేసి రెండేసి యొక్కటొక్కటియునైన, ప్రంగల్ = పంగలు, వెడ ..వునన్ - వెడలిన=పుట్టిన, కొమ్ములబరువునన్ = కొమ్ములయొక్క బరువుచేత, అడుగిడఁగాలేవు=అడుగెత్తిపెట్టఁజాలవు. అనఁగా సులభముగాఁ జిక్కుననుట. అలం. అతిశయోక్తి.

ఆ. చలము లొదవ ముండ్లుగల ప్రాఁకుదీములఁ, గెరలితాఁకి కొమ్ములురులఁదగిలి
వాని లేవ నీడ్చి కానకే కొనిపోవుఁ, బోతరించి యిఱ్ఱిపోతు లచట. 22

అ. అచటన్ = ఆయడవియందు, ఇఱ్ఱిపోతులు= మగజింకలు, పోతరించి = మదించి, చలములు = మాత్సర్యములు, ఒదవన్ = కలుగఁగా, ముండ్లుగలప్రాఁకుదీములన్ - ముండ్లుగల = ఇనుపముండ్లు దాఁపిన, ప్రాఁకుదీములన్ = ప్రాణితోఁజేసిన ప్రతిరూపములను, కెరలి = ఆగ్రహించి (లేక) రేఁగి, తాఁకి=(తమతోఁ గలహమునకు వచ్చినమృగములనియెంచి) ఎదిరించి, కొమ్ములు = తమకొమ్ములు, ఉరులన్=(వానియందుఁ బన్నియున్న) యుచ్చులలో, తగిలి = తగులుకొని-తగులుకొనుటచేత, వానిన్ = ఆదీములను, లేవన్ = పైకిలేచునట్లుగా, ఈడ్చి=లాగి, కానకే= అడవికే, కొనిపోవున్ = తీసికొనిపోవును. (పా. క్రోధమొదవ బండగులఁ బ్రాఁకు దీములఁ గెరలితాఁకి కొమ్ముటురులఁదగిలి-క్రోధము = కోపము, ఒదవన్=కలుగఁగా, బండగులన్ =బోనులను, ప్రాఁకున్ =ఎక్కను, దీములను గెరలి తాఁకి, కొమ్ముటురులన్ =కొమ్ములలలో, తగిలి-ఈపాఠము సమంజసమని తోఁపలేదు.)

తా. ఆ యడవియందలి మగజింకలు మదించి వేఁటాడువారు పెట్టినప్రతిరూపములను జూచి యవి తమతో నెదిరింపవచ్చిన యిఱ్ఱులనుకొని వానితో నెదిరించి పొడుచుఁబోయి యందుఁ బన్ని యున్నయురులలోఁ గొమ్ములు తగులుకొనఁగా వానిని లేవఁదీసి యెత్తుకొని యడవులకుఁ బాఱిపోవును. జింకలు మిక్కిలి బలముగలవనిభావము. అలం. అతిశయోక్తి.

ఆ. కప్పువెట్టి వెన్ను కందమ్ము సమముగాఁ, బొదలి జోళ్లుగట్టి పోరుచుండి
మలయుఁ గాని పోవు మానిసిఁ బొడగన్న, నేమి చెప్ప వానియీసు లధిప. 23

అ. అధిప = రాజా, (ఆ యిఱ్ఱిపోతులు), కప్పువెట్టి = దేహమునలుపెక్కి, వెన్ను=వీఁపును, కందమ్ము = మూఁపురమును, సమముగాన్ = చదునుగా- ఎచ్చుతక్కువలులేక సరిగాననుట, పొదలి = పెరిఁగి, జోళ్లుగట్టి= రెండు రెండొక్కొక్కజతగాఁజేరి, పోరుచున్ =పోరాడుచు, ఉండి, మానిసిన్ = మనుష్యుని, పొడగన్నన్ = చూచినను, మలయుఁగాని=కలియఁబడిపోరుచుండునే కాని, పోవు = వెఱచితొలఁగిపోవు, వానియీసులు = ఆ యిఱ్ఱిపోతులయొక్క క్రోధములు, ఏమి చెప్పన్ = ఏమనిచెప్పవచ్చును- చెప్పుటకు శక్యముకాదనుట.

క. కట్టియఁ జేకొని డేగం, బట్టి యుబుసుపోకఁ బొలము పుట్టినఁ జాలుం
దొట్టినక్రొవ్వులు గలయవి, చెట్టడిచినఁ జేటుఁ డేమి చెప్పం బులుఁగుల్. 24

అ. కట్టియున్ = కట్టును, శేకొని = చేతఁబట్టుకొని, డేగన్ = వేఁటకు నేర్పిన డేగను, పట్టి = పట్టికొని, ఉబుసుపోకన్ = విహారముగాఁ బ్రొద్దుపుచ్చుటకుఁబోలె, కాలము = ఆయడవిని; మట్టిరన్ = త్రొక్కినను-ప్రవేశించినను అట, చాలున్ = అదియేచాలును-వేఁటకై ప్రయత్న మేమియుఁ జేయ నక్కఱలేదనుట, పులుఁగులు = పక్షులు, తొట్టినక్రొవ్వులుగలయవి = నిండుకొన్న మదములు గలిగినవి, చెట్టడిచినన్ = చెట్టుచెట్టును గఱ్ఱతోఁ దాడించినను, చేటెఁడు = చేటకొలఁది, (రాలును) ఏమిచెప్పన్ = ఏమిచెప్పవచ్చును అలం అతిశయోక్తి

తే. ఉడుముగరిమిడికొక్కుదండడియు వెల్ల, యెలుకకల్లెల్కతఱుచును నేమి చెప్ప
నడవి నెల్లడఁ జూచిన నవనినాథ, జల్లెడయుఁ బోలె లాఁగల నుల్లసిల్లు. 25

అ. అవనినాథ = రాజా, ఉడుము...దండడియున్ - ఉడుము = గోధికలను జంతువుల యొక్కయు, గరిమిడికొక్కులు = పందికొక్కుల యొక్కయు, దండడియున్ = తఱుచును, వెల్లఁ తఱుచును-వెల్లయెలుక = తెల్లనియెలుకల యొక్కయు, కల్లెల్క = కలుఁగులలోనుండెడి యెలుకల యొక్కయు, తఱుచును, ఏమిచెప్పన్ = ఏమని చెప్పుదును - చెప్పశక్యముకాదు-అనఁగా నుడుములు పందికొక్కులు తెల్లయెలుకలు కలుఁగులలోనుండెడి చిట్టెలుకలు నిండుకొనియుండుననుట. అడవిన్ = ఆయడవియందు, ఎల్లెడన్ = అన్నిచోటులను - అంతటను, చూచినన్ = చూచినపక్షమున, లాఁగలన్ = కలుఁగుల చేత, జల్లెడయుఁబోలెన్ = జల్లెడకంతలవలెనె, ఉల్లసిల్లున్ = ఒప్పుచుండును. అలం ఉపమ.

క. అనుటయు మృగయాకౌతుక, మునఁ జిత్తము చెంగలింప భూధరశృంగం
బున నుండి డిగ్గి నగరికి, ననిమిషకాంతాకుమారుఁ డరిగి రయమునన్. 26

అ. అనుటయున్ = అనియెఱుకువాఁడు చెప్పఁగా, మృగయాకౌతుకమునన్ = వేఁటయందలి వేడుకచేత, చిత్తము = మనస్సు, చెంగలింపన్ = పెరపెరలాడఁగా-ఉత్సాహముకలదికాఁగా, అనిమిషకాంతాకుమారుఁడు = దేవతాస్త్రీకొడుకు-స్వరోచి, భూధరశృంగంబుననుండి = కొండకొమ్మునందుండి, డిగ్గి = దిగి, నగరికిన్ = పట్టణములోనికి, రయమునన్ = వడితో - శీఘ్రముగా, అరిగి = పోయి - మీఁదికి అన్వయము.

వ. నగరు సొచ్చి యచ్చటం గక్ష్యాంతరశాలాంతరాళంబుల నందంద తండతండం బులై వ్రేలునత్రంబులం జము రంటుపలఁఖండంబుల మండితంబు లగునిడుదవెదురుదండెంబుల బర్హిబర్హనిబద్ధాగ్రంబులై కొమరారుదోరెపుఁద్రాళ్లతోడం దిరుగుడుల వెడంగువడి వడిదప్పినట్లు త్రాళ్లం గట్టువడి పొట్ట లదురంగ నిక్కి పర్వి సెనంబులు వేయునవియును, నపహసితశార్దూలకుటిలనఖకోటిపాటవంబు లగుత్రోటిపుటంబులం జటకసరటాదిజంతుకళేబరంబులం జరణనఖరాంకురంబుల నిఱికి చీరుచుం గేరునవియును, నాఁడునాఁటికిం బాటించి వేఁటకాండ్రదనెఱింగి మేపుమేపుల చమత్కారంబుల నిరాకరించి వీకునం దిరిగితిరిగి యీఁక దీర్చుకొనునవియును, బడ నగ్గలించి కూయుచుం గడుపు నకనకంబడం గనుకట్టుతోడ మోములు మలంచుచుం బంజరస్థితకీరశారికాపారావతాదులపలుకు లాకర్ణించి యెగసి యెగసి నిజావస్థితతాదృగ్విధాధారవేణుయష్టులకుఁ జట్టుపలు చెదరం

ప్రదక్షిణభ్రమణంబుల పరిభ్రమించి మగుడ నెట్టకేలకు మట్టుకొనునవియు
ను, మేర మీఱం దిన్న యెరల నన్నుకొని యెరగన్ను వెట్టి బోరకడం బొటమరిం
పం గూరుకుచుం గుతికిలంబడునవియును నై పఱ్ఱంగుపలు దెఱంగులఁ డేగమొత్తం
బులను, గుత్తంబు లగుమిగులమెత్తనిజలపోతతోలుపట్టెడలు మెడల నమరం
బసుపార్చి కట్టుఁగంబంబులకుం దార్చి బంధించినకుందనంపుగొలుసులు గల్లు
గల్లుమనంగ నొడళ్లు జాడించికొనుచుం గొనసాగి సోగలై మ్రుంగినమోరలుం
బోనిమోరలు సారెసారెకు నెత్తి బయలు పసివట్టుచుఁ గట్టెదుటివాజిశాలలం
గట్టినపొట్టేళ్లకై యాదిగొని నీల్గి కాలుద్రవ్వి ఘనఘనాఘనఘర్ఘరధ్వానసమ
ధ్వనులు చెలంగ మ్రోఁగుచు నింగిఁ బ్రాఁకుచు నింగలంబు లుమియు
నయనగోళంబుల నాభీలంబు లై వివృతవదనగహ్వరవిలంబిజిహ్వాపల్లవంబు
లకుం గ్రూరతరదంతకోణకాంతికలాపంబులం గోరకస్తబకయోగంబు గల్పిం
చుచు నల్పేతరగ్రస్తకీలాలపలలజాలగ్రాసంబులు నెన్నడుమునన్నఁదసంబున
నట మిగుల డిగ్గి చన కునికిం గటితంబులకంటెం దారె ఫుటఫుట నయ్యె నసం
దోరంబు లగుబోరలఁ గందంబుల నందంబులు గని బిరుదు లంకించి తమ్ము
నుపలాలించుపరిపాలకులసంస్తవంబులకుం జెవిదార్చె నసం గర్ణకిసలయర్థంబులు
వ్రాలంబడి వెండిగుండులుంబోలెఁ గిన్నులపండువు లై గండభైరవపుపూజవారు
వంబు లన మెండుకొనియుండుజాగిలంబులును గాంచి యందు నందును
వేఁటకు నుఱువైనవాని నేర్పఱించి తెచ్చుటకు ననుచరుల నీవు నీవని నియమించి
తాను నాఖేటకోచితపరిపాటి సన్నద్ధుం డయ్యె నయ్యవసరంబున. 27

అ. నగరు=దివాణము, చొచ్చి = ప్రవేశించి, అచ్చటన్ = ఆనగరియందు, కక్ష్యాం... బులన్ -కక్ష్యాంతర = తొట్టికట్లలోపలి, శాలా=చావళ్లయొక్క, అంతరాళంబులన్ = లోపలిభాగములయందు, అందంద=అచ్చటచ్చట, తండతండంబులై = గుంపులుగుంపులై, ప్రేలునత్తెంబులన్ = ప్రేలాడెడియత్తెములయందు, (అత్తెము = హస్తకవచము - డేగలను బెంచువారు వానిగోళ్లు గ్రుచ్చుకొనకుండుటకై తోలుతోఁగుట్టి చేతికిఁ దొడుగుకొనెడిది.) చమురు = జిడ్డుతగులునట్టివి, అంటుపలలఖండంబులన్=తగులునట్టిమాంసపుఁగండలచేత - అంటినచోఁ జేతికిఁ జమురుతగులునట్టి మాంసమనుట మండితంబులు=అలంకరింపఁబడినవి-మాంసపుముక్కలు ప్రేలఁగట్టఁబడినవియనుట, అగు.. దండెంబులన్ -అగు=అయినట్టి, నిడుద=నిడుపులైన, వెదురుదండెంబులన్=వెదురుగడలదండెములయందు, బర్హి... గ్రంబులై -బర్హి=నెమిళ్లయొక్క, బర్హ=కుంచెలచేత-ఈఁకలకుచ్చులచేత, నిబద్ధ=కట్టఁబడిన, అగ్రంబులై=కొనలుగలవై -కొనలయందు నెమిలియీఁకలకుచ్చులుకట్టినవై యనుట, కొమరారు.. తోడన్ కొమరారు=అందగించుచున్న, దోరెంపుఁద్రాళ్లతోడన్=కట్టుత్రాళ్లతో, తిరుగుడులన్=తిరుగుటలచేత వెడంగువడి = వికారమునొంది, వడి = వేగము, తప్పనట్లు = లేకపోవునట్లు, త్రాళ్లన్ = దోరెపుత్రాళ్లచేత, కట్టువడి = బంధింపఁబడి, పొట్టలు = కడుపులు, అదురంగన్ = వడఁకఁగా, నిక్కి నిగిడి, పరిసెనంబులువేయునవియును = పల్లటీలువేయునవియును, (పరిసెనము = డేగలకు మస్తుదీ

వేఁటయందుఁ జొరవకలుగుటకై పుందిచ్చి వాంతియెత్తించుట యని కొందఱు. ఆపక్షమున పరిసేనంబులు సేయునవి యని పాఠము మార్చుకోవలెను.) (అలం. స్వభావోక్తి.) అపహసిత .. పాటవంబులు-అపహసిత = తిరస్కరింపఁబడిన, శార్దూల = పెద్దపులులయొక్క, కుటిల = వంకరలైన, నఖ = గోళ్లయొక్క, కోటి = కొనలయొక్క, పాటవంబులు = పటుత్వముకలవి - పులులవంకరగోళ్ల పటుత్వమునుమించిన పటుత్వముగలవియనుట, అగ్రత్రోటిపుటంబులన్ = అయినదొప్పలవంటిముక్కులచేత, చటక...కళేబరంబులన్-చటక=పిచ్చిక, సరట=తొండ, ఆది = మొదలుగాఁగల, జంతు = ప్రాణులయొక్క, కళేబరంబులన్ = దేహములను, చరణ .. బులన్-చరణ = కాళ్లయొక్క, నఖర = గోళ్లయొక్క, అంకురంబులన్ = మొలకలచేత - సన్నని మొనలచేతననుట, ఇతికి = కదియఁబట్టి (లేక) అదిమిపట్టి, చీరుచున్ = చీల్చుచు, కేరునవియును = ఉత్సహించునవియును, (అలం. ఉపమ.) నాఁడునాఁటికిన్ = ఏదినమునకాదినము, పాటించి=అక్కఱతో విచారించి, వేఁటకాండ్రు = వేఁటాడువారు, అదను = సమయము-ఆఁకలిగొన్న సమయమనుట, ఎఱింగి = తెలిసి, మేపుమేపులచమత్కారంబులన్ - మేపు = మేయించునట్టి, మేపుల = మేఁతలయొక్క, చమత్కారంబులన్ = నేర్పులను, నిరాకరించి = అలక్ష్యముచేసి, పీకునన్ = నిక్కుచేత, తిరిగితిరిగి = మాటిమాటికిఁదిరిగి, ఈఁకదీర్చుకొనునవియును=ఱెక్కల చిక్కుసవరించుకొనునవియును-వేఁటకాఁడు పెట్టునట్టి మేఁతను ముట్టిపనుచేఁ దినక యిట్టటుదిరిగి ఱెక్కలుచక్కఁబెట్టుకొనునవి యనుట, (అలం. స్వభావోక్తి.) పదను = మేఁతసమయము, అగ్గలించి = మీఱి, కూయుచున్ = అఱచుచు, కడుపు = పొట్ట, నకనకంబడన్ = వాడఁగా, కనుకట్టుతోడన్ = కనుమూఁతతోలుకట్టుతో, మోములు = ముఖములను, మలంచుచున్ = అటునిటుఁద్రిప్పుచు, పంజర...పలుకులు-పంజర = గూండ్లయందు, స్థిత=ఉండెడి, కీర=చిలుకలు, శారికా=గోరువంకలు, పారావత = పావురపుగువ్వలు, ఆదుల = మొదలగువానియొక్క, పలుకులు = మాటలు-ధ్వనులననుట, ఆకర్ణించి=విని, ఎగసియెగసి = వానితట్టునకు నెగిరియెగిరి, నిజాలకున్ - నిజ = తమయొక్క, అవస్థిత = నిలిచియుండునట్టి, తాదృగ్విధ = ఆవిధమయిన-ముందు చెప్పఁబడినట్టుండెడి దండెములయిన, ఆధార = తమకునాధారములైన, వేణుయష్టులకున్ = వెదురుకఱ్ఱలకు, చట్టుపలు = ఱెక్కలు, చెదరన్ = ప్రసరించునట్టుగా, ప్రదక్షిణభ్రమణంబులన్ = వలగొనితిరుగుటలచేత, పరిభ్రమించి = తిరిగి, మగుడన్ = మరల, ఎట్టకేలకున్ = అతిప్రయాసముచేత, మట్టుకొనునవియును = ఎప్పటివలెఁ గుదురుకొనునవియును,-ఎరలుతినువేళ మీఱిపోఁగా నాఁకలిగొనికూయుచును, మాఁతులను ద్రిప్పుచును, గూండ్లలోని పక్షులకూఁతలువిని ఱెక్కలుతాఁచునట్లు తా మున్న వెదురుగడలనుఁ బట్టి తిరుగుచుఁ గొంతసేపటికి నెప్పటియట్లకుదురుకొనునవియనుట. (అలం. స్వభావోక్తి.) మేరమీఱన్ = మితికిమించునట్లు, తిన్నయెరలన్ = తినినయాహారములచేత, అన్నుకొని=మత్తుగొని, అరగన్నువెట్టి=ప్రమాఁగన్ను వేసికొని, బొరకడన్ = బొమ్ముతట్టు, పొటమరింపన్ = కడుపునిక్కునట్టుగా, కూఁకుచున్ = తూఁగాడుచు, సతికిలంబడునవియును= వ్రాలఁబడునవియును, మితిమీఱఁ దినుటచే మత్తెక్కి ప్రమాఁగన్నుతో నిద్రవోవున వనుట, ఐ=అయి, పఱ...బులను-పఱఁగు = ఒప్పునట్టి, పలువెఱుంగుల=బహువిధము లయిన-బైరిసాళువము మొదలుగా బహుభేదములు గలిగినయనుట, డేగమొత్తంబులను=డేగలసమూహములను, (ఇంతవఱకుడేగలవర్ణనము. ఇఁకజాగిలవర్ణనము.) గుత్తపుతులు = ఎచ్చుతక్కువలులేక సరిగా నుండునవి, అగు . పట్టెడలు- అగు= అయిన, మిగులన్ = మిక్కిలి, మెత్తని = మృదువైన, జలపోత = బంగారుమొలాముచేసిన, తోలు

పట్టెడలు = పట్టెగాఁగోసి కూర్చినత్రోళ్లు, మెడలన్ = కంఠములయందు, అమరన్ = ఒప్పఁగా, పసుపార్చి = పసుపునీళ్లతో స్నానము చేయించి, కట్టుఁగొంబంబులకున్ = కట్టివేయు నట్టిగుంజలకు, తార్చి=చేరఁదీసి, బంధిం . గొలుసులు-బంధించిన = కట్టివేసిన, కుందనంపుగొలుసులు = మేలిమి బంగారుతోఁ జేసినసరిపెణలు, గల్లుగల్లుమనంగన్ = గల్లుగల్లుమని మ్రోఁగఁగా, ఒడళ్లు=శరీరములు, జాడించుకొనుచున్=వణఁకించుకొనుచు, విదిలించుకొనుచు, కొనసాగి=మొననిక్కి, సోగలై=నిడుపులై, ముంగిసమోరలుంబోని = ముంగిసలమూతులవంటి, మోరలు = మూతులను, సారెసారెకున్ = మాటిమాటికి, ఎత్తి = పైకెత్తుకొని, బయలు=బయటిని, పసిపట్టుచున్ = వాసనచూచుచు, కట్టెదుటి వాజిశాలలన్=సరిరెయెదుటనున్న గుఱ్ఱపులాయములందు, కట్టిన=కట్టివేసియున్న, పోట్లేళ్లకై=గొఱ్ఱెపోతులకై, ఆదిగొని=పొంచువేసి, నీల్గి=ముందఱికి నిక్కి, కాలుద్రవ్వి=కాళ్లతో నేలకొరాడి, ఘన... ధ్వనులు-ఘన=అధికమైన, ఘనాఘన=వర్షించుచున్న మేఘముయొక్క, ఘర్ఘరధ్వాన= ఘర్ఘరధ్వనితోడ-అధికధ్వనితోఁగూడినయుఱుములతో, సమ=సమానమైన, ధ్వనులు = మ్రోఁతలు, చెలఁగన్ = మ్రోఁగఁగా, మ్రోఁగుచున్ = మొఱుఁగుచు, నింగిన్ =ఆకాశమును, ప్రాఁకుచున్=అగ్గొమ్ముతో జరగునట్లు మీఁదికిలేచుచు, ఇంగలంబులు=నిప్పులు, ఉమియు గోళంబులన్-ఉమియు=క్రిక్కుచున్న, నయనగోళంబులన్=గుండ్రమైనకనుగ్రుడ్లచేత, ఆభీలంబులై = భయంకరములై, (అలం. ఉపమ) విస్ఫుత...లకున్-విస్ఫుత=తెఱవఁబడిన, వదనగహ్వర=గుహలవంటినోళ్లవలననుండి, కీలలీల=వ్రేలుచున్న, జిహ్వా=నాలుకలనెడు, పల్లవంబులకున్=చిగుళ్లకు-చిగుళ్లవంటినాలుకలకు, క్రూర . పంబులన్-క్రూరతర=మిక్కిలికఠినములైన, దంత=పండ్లయొక్క, కోణ=కొనలయొక్క, కాంతి = కాంతులయొక్క, కలాపంబులన్=సమూహములచేత, కోరక స్తబకయోగంబు=పూమొగ్గగుత్తులతోడి చేరికను, కల్పించుచున్=కలుగఁజేయుచును, (అలం. రూపకము) అత్యేతర గ్రాసంబులు-అత్యేతర=అధికముగా, గ్రస్త=మ్రింగఁబడిన, కీలాల=రక్తముతోడి, పలల=మాంసముయొక్క, జాల = సమూహముయొక్క, గ్రాసంబులు=ఆహారములు, సన్నడుముసన్నఁదనంబునన్=అందమయిన నడుముయొక్క సన్ననితనముచేత, అట = అవతల, మిగులన్=మించునట్లు-నడుమును దాఁటియునుట, డిగ్గిసకపునికిన్=దిగిపోకుండుటచేత, (పా. కడచిచనకునికిన్=అతిక్రమించిపోకుండుటచేత,) కటితటంబులకంటెన్=పిఱుఁదుల పార్శ్వములకంటెను, తారె=తామే-తొమ్ములే, పుటపుటనయ్యెన్ = బలిసెను, అనన్ = అనునట్లు, తోరంబులు=స్థూలములు-బలిసినవి, అగుబోరలన్=అగునట్టిఱొమ్ములచేతను, కందంబులన్=మూఁపురములచేతను, అందంబులు=చక్కఁదనములు, కని=పొంది, బిరుదులు = సామర్థ్యమును దెలిపెడిగుఱుతులను, అంకించి=పొగడి,తమ్మున్-కుక్కలననుట ఉపలాలించు...బులకున్-ఉపలాలించు=బుజ్జగించునట్టి, పరిపాలకుల= పెంచువారియొక్క, సంస్తవంబులకున్=పొగడ్తలకు, చెవిదార్చనన్= చెవియొగ్గినవోయనునట్లు, కర్ణకిసలయంబులు=చిగురుటాకులవంటిచెవులు, వ్రాలంబడి=వ్రేలాడఁగా, వెండిగుండులంబోలెన్=వెండితోఁజేసినగుండ్లవలె,కన్నులపండువులై = నేత్రానందకరములై, గండ వారుసంబులు-గండభైరవు=గండభైరవదేవునియొక్క, పూజవారుసంబులు=పూజకొఱకైనగుఱ్ఱములో,అనన్ =అనునట్లు, మెండుకొని=నిండుకొని, ఉండుజాగిలంబులన్=ఉండునట్టివేఁటకుక్కలను, కాంచి= చూచి,అందునందున్=ఆడేగలందును వేఁటకుక్కలయందును, వేఁటకున్= వేఁటాడుటకు, ఉపైనవానిన్=యుక్తమయినవానిని, ఏర్పరించి=నిర్ణయించి, తెచ్చుటకున్=తీసికొనివచ్చుటకు, అనుచరులన్=తగినసేవకులను, నీవునీవని=నీవుపొమ్ము నీవుపొమ్ముఅని, నియమించి=ఉత్తరవుచేసి,తానును=(స్వరోచి) తానును,ఆఖే

. .పాటిక్ - ఆఖేటక=వేఁటకు,ఉచిత=తగిన, పరిపాటిక్ =క్రమముగ, సన్నద్ధుండు=ఆయత్తమయినవాఁడు,అయ్యెక్ =ఆయెను, అయ్యవసరంబునక్ =ఆసమయమునందు. అలం. ఉత్ప్రేక్ష.

సీ. పచ్చనిహురుముంజిఁ బనివాగెపక్కెర, పారసిపల్లంబుఁ బట్టమయము
రాణ నొప్పారుపైఁ రాణంబుసింగిణి, తళుకులకోరులఁ దరకసంబు
మిహిపసిండిపిరుంజుఁ మొహదా కెలంకుల, రావుగుజ్జరిసేతఁ గేవడంబు
డాకెలంకున సిరాజీకరాచురకత్తి, కుఱంగటఁ గ్రొవ్వాఁడిఁ గొరకలపొది
పీలికుంచెతలాటంబుఁ బేరజంబు, మణులమొగముట్టు వన్ని సాహిణి యొకండు
కర్త యెదుటికిఁ గొనివచ్చెఁ గంధవాహ, బాంధవం బగు నొకమహాసైంధవంబు.

అ. పచ్చని ..వాగె-పచ్చని=పసుపువన్నెగల, హురుముంజి=హురుముంజియనుదేశమునంబుట్టి, పని=ముత్యాలచెక్కడపుఁబనిచేసిన, వాగె=కళ్లెపుఁబగ్గమును, పక్కెర=కప్పడుబొంతయును, పట్టమయము=పట్టువికారమయిన, పారసిపల్లంబు=పారసీకదేశపుగంతియును, (పట్టమయము = టంగువాఱు అని బ్రౌన్ దొరగారిపుస్తకమునందు వ్రాయఁబడియున్నది.) రాణక్ =మనోహరముగా, ఒప్పారు=అందగించుచున్న, పైరాణంబుసింగిణి = పైరాణమనుదేశముదైన శృంగధనుస్సును, తళుకులకోరులతరకసంబు-తళుకు=తళతళ మెఱయుచున్న, లకోరుల = క్రూరములయినబాణములుగల, (పా. లకోరీల.) తరకసంబు=అమ్ములపొదియును, మిహి మొహదా-మిహి=వన్నెహెచ్చిన, పసిండి = బంగారుతోఁ జేసిన, పిరుంజు=పిడిగలిగిన, మొహదా=అడ్డకత్తియును, కెలంకులరావు=ఆయడ్డకత్తియొక్క పార్శ్వప్రదేశమునందు, గుజ్జరి సేతకేవడంబు-గుజ్జరిసేత = గుజరాతిదేశపుఁ బనిచేసిన, (పా. గుజ్జరివన్నె= గుజరాతిదేశపువర్ణముపూసిన,) కేవడంబు=కేడెమును, డాకెలంకునక్ =ఎడమపార్శ్వమునందు,సిరాజీ= సిరాజీయనెడిదేశముదైన,కరా=వాఁడియైన, చురకత్తి = చిన్నకత్తియును, కుఱంగటక్ = దానిసమీపమునందు,క్రొవ్వాఁడిగొరకలపొది=క్రొత్తగాఁబదును పెట్టినగుజ్జీఁ ఓలపొదియును,(గొరక = ఇనుపబాణము, అనికొందఱు.) పీలికుంచెతలాటంబు=పికిలిపిట్టయీఁకలకుచ్చుతురాయియును, బెరజంబుమణుల మొగముట్టు = పంటరాళ్లుచెక్కినముఖపట్టమును, (పా. పేరోజంబుమణుల = ఖుద్రమరికితమణుల.) వన్ని=అమర్చి, సాహిణియొకండు=ఒకగుఱ్ఱపువాఁడు, గంధవాహబాంధవంబు = గాలిచుట్టము-గాలియొక్క వేగమువంటి వేగముగలదియనుట, అగుమహాసైంధవంబుక్ =అయినట్టి పెద్దగుఱ్ఱమును, కర్తయెదుటికిక్ =ప్రభువైనస్వారోచియెదుటికి,కొనివచ్చెక్ =తీసికొనివచ్చెను.-అనఁగా ఒకగుఱ్ఱపువాఁడు వేఁటకుఁ దగినయాయుధములతోడ గుఱ్ఱము నలంకరించి సిద్ధపఱచి స్వారోచియెదుటికిఁ దీసికొనివచ్చి నిలిపెను.

క. తెచ్చుటయు నిచ్చ మెచ్చి మ, రుచ్చటులకురంగరయనిరోధిస్యదగ
ర్వోచ్చం బగున త్తేజి ను, హృచ్చక్రం బలర వేగఁ యెక్కి వెడలినన్ 29

అ. తెచ్చుటయుక్ = గుఱ్ఱపువాఁడు గుఱ్ఱము నాయితముచేసి తీసికొనిరాఁగానే, ఇచ్చక్ = మనసునందు, మెచ్చి=మెచ్చుకొని, మరు. .గర్వోచ్చంబు-మరుత్ = వాయువుదేవునివాహనమైన, చటుల=సమర్థమయిన, కురంగ=జింకయొక్క, రయ=గమనవేగమును, నిరోధి = ఆఁపఁజాలిన, స్యద=వేగముచేనైన, గర్వ = అహంకారముచేత, ఉచ్చంబు=అతిశయించినది, అగునత్తేజిక్ =అయినట్టియా గుఱ్ఱమును, సుహృచ్చక్రంబు = మిత్రులసమూహము, అలరక్ =సంతోషింపఁగా, వేగ=వడిగా,ఎక్కి= ఎక్కినవాఁడై, వెడలినక్ =బయలుదేఱఁగా-మీఁదికన్వయము. అలం. ఉపమ.

చ. జడలు మలంచి చొల్లెముగ సన్నపుఁబాగ లడంగఁ జుట్టి చ
ల్లడములు పూని మీఁదఁ బదిలంబుగఁ గట్టినమట్టికాసెలం
బిడియము లంటఁ దోఁపి పృథుభీషణబాహుల సాళువంబులం
దడవి కెరల్చుచుం జనిరి నాథునిమ్రోల నృపాలనందనుల్. 30

అ. నృపాలనందనులు = రాచకొమాళ్లు, జడలు = అల్లినతలవెండ్రుకలజడలను, మలంచి = పైకెఁద్రిప్పి, చొల్లెముగన్ = మెలిచుట్టఁగా, సన్నపుఁబాగలు = నయతరమైనతలపాగలను, అడంగన్ = ఆజడలులోపలనణఁగునట్లు, చుట్టి=చుట్టుకొని, చల్లడములు = లాఁగులు, పూని = ధరించి, మీఁదన్ = ఆచల్లడములమీఁద, పదిలంబుగన్ = దిట్టముగా, కట్టినమట్టికాసెలన్ = బిగఁగట్టుకొన్న యెఱ్ఱమట్టి నీటిలోఁదడిపిన కాసెకోకలయందు-దట్టీలయందనుట, పిడియములు=బాఁకులను, అంటఁదోఁపి = పిడి పఱకు నంటునట్లుగాఁ దోఁపి, పృథు...బులన్ - పృథు = బలిసిన, భీషణ = భయంకరము లయిన, బాహుల = భుజములయందలి, సాళువంబులన్ = డేగలను, తడవి=నిమిరి, కెరల్చుచున్ = రేఁపుచు, నాథునిమ్రోలన్ = ప్రభువైనస్వరోచిముందఱ, చనిరి=పోయిరి.

తా. స్వరోచి గుఱ్ఱము నెక్కి బయలుదేఱఁగానే రాచకొమాళ్లు కొందఱు జడలులోపల నణఁగునట్లు తలగుడ్డలతోఁ బెనచి పాగలుచుట్టుకొని చల్లడములుదొడిగి దట్టీలుగట్టుకొని యాదట్టీలలో బాఁకులు దోఁపుకొని డేగలను జేతులందుంచుకొని వానినిదువ్వి వేఁటకుఁ బ్రేరేపించుచు నతనిముందఱ నడువ నారంభించిరి. అలం. స్వభావోక్తి.

సీ. ఇవి కంఠపాశంబు లింత డుస్సిన మీఁదఁ, బడి దిశాకరి నైనఁ గెడపఁ జాలు
నివి మింటఁ బఱచుపక్షీంద్రుఁ జూపిన నీడ, బడి వాలునందాకఁ బఱవఁ జాలు
నివి గాలి కనిన మూకవరాహదనుజేంద్రు, నైన జొట్టెంటిలో నాఁగఁజాలు
నివి కాటు కొల్పిన వృద్ధకూర్మము వీఁపు, చిప్పైన నెఱచికై చింపఁజాలు
ననఁగ ఘుర్ఘురగళగర్త జనితభూరి, భూభృదురుబిలభరితభౌభౌభయంక
రార్భటీదీర్ణదిగ్భిత్తు లగుచుఁ జెలఁగె, సరిపెణలఁ బట్టి తెచ్చిన జాగిలములు. 31

అ. ఇవి=ఈవేఁటకుక్కలు, కంఠపాశంబులు= మెడత్రాళ్లు, ఇంతడుస్సినన్ =కొంచెము దూసినను, దిశాకరినైనన్ = దిగ్గజమునయినను, మీఁదఁబడి = పైనిబడి, కెడపఁజాలున్ = చంపఁజాలును, ఇవి, మింటన్=ఆకాశమునందు, పఱచుపక్షీంద్రున్ =పాఱుచున్న పక్షిరాజును-గరుత్మంతుని, చూపినన్ = కనఁబఱిచినను, వాలునందాఁకన్ = ఆగరుత్మంతుఁడు దిగువ వాలునంతవఱకు, నీడబడిన్ = ఆనీడ వెంటనే, పఱవఁజాలున్ = పరుగెత్తఁజాలును, ఇవి, గాలిగనినన్ = పసిఁగన్నను-(పందుల) దేహావాసన తెలిసినను, మూకవరాహదనుజేంద్రునైనన్ = పందిరూపొందినమూకుఁడనెడి రాక్షసశ్రేష్ఠునినయినను, జొట్టెంటిలోన్ =లొడితెఁడుకొలఁది దూరములోపలనే, ఆఁగఁజాలున్ =పోనీక యడ్డగింపఁ జాలును, ఇవి, కాటుకొల్పినన్ = కఱచుటకై యుసికొలిపినపక్షమున, వృద్ధకూర్మము వీఁపుఁజిప్ప= విష్ణ్వవతారమైన యాదికూర్మముయొక్క చిప్పవంటి వీఁపునెముక, ఐనను, ఎఱచికై = మాంసమునకై, చింపఁజాలున్ = చీనుఁగఁదీయఁజాలును, అనఁగన్=అనునట్లు, ఘుర్ఘుర..భిత్తులు-ఘుర్ఘుర=ఘుర్ఘుర యనెడి, గళగర్త=గొంతురంధ్రములనుండి, జనిత=పుట్టిన, భూరి=అధికమయిన, భూభృత్ =పర్వతములయొక్క, ఉరు=పెద్దవయిన, బిల=గుహాలయందు, భరిత=నిండింపఁబడిన, భౌభౌభయంకరార్భటీ=

భౌభౌ అనెడి భయంకరములైన ధ్వనులచేత, దీర్ణ=బ్రద్దలయిన, దిగ్భిత్తులు = దిక్కులనెడి గోడలు గలవి, అగుచున్ =అవుచును, సరిపెణలన్ = గొలుసులచేత, పట్టి=పట్టుకొని, తెచ్చినజాగిలములు=తీసికొని వచ్చిన వేఁటకుక్కలు, చెలఁగెన్ =ఒప్పెను.

తా. ఇవి దిగ్గజములనైనఁగఱచి చంపను, ఆకాశమునందుఁ బాఱుచున్న గరుత్మంతుని నీడజాడ నాగరుత్మంతుఁడు నేలవాలు నందాఁకఁబరుగెత్తను, పసిపట్టి పందిరూపమునొందిన మూకాసురునైన నడ్డగించినిలుపను, మాంసాపేక్షగలిగినయెడ నాదికూర్మంబు వీఁపుఁజిప్పనైనఁ జింపను, సామర్థ్యము గలవి యనునట్లు భౌభౌయనుకూఁతలచేతఁ బర్వతగుహాలందుఁ బ్రతిధ్వనిపుట్టించుచున్న వేఁటకుక్కలు భటులచేత గొలుసులువేసికట్టి యతనివెంటఁ దేఁబడియెను. అలం. అశక్యకరణము,కావ్యార్థాపత్తి ధ్వని, ఉత్ప్రేక్షయును.

చ. పులియఁడు బూచిగాఁ డసురపోతులరా జనుమంతిగాఁడు చెం
గలువ సివంగి భైరవుఁడు గత్తెర సంపఁగి వెండిగుండు మ
ల్లెలగుడి వాయువేగి చిటిలింగఁడు సాళ్వుఁడు వత్సనాభి యే
కలములమిత్తి గబ్బి యనఁగాఁ గలవాని గ్రహించి యుద్ధతిన్. 32

అ. ఇందుపులియఁడు మొదలగునవి కుక్కలకుఁ బెట్టఁబడిన పేళ్లు-ఈపేళ్లుగల కుక్కలను, గ్రహించి=పట్టుకొని, (దీనికిఁ గర్త పైపద్యములోని 'వాగురికుల్'), ఉద్ధతిన్ = గర్వముతో, 'అరిగిరి' అనెడి పైరెండవపద్యములోని క్రియతో దీనికన్వయము.

ఉ. కట్టిననీలిదిండ్లు సెలకట్టయవిండ్లును విండ్లగొసెనల్
చుట్టి నొసళ్లపై నిడినజుంజుఱుఁబల్లసిగల్ గటీతటిం
బెట్టినమోటకత్తులును మేనులఁ గార్కొనుకప్పు లేర్చి చేఁ
బట్టినవేఁటయమ్ములును బాగగువాగురికుల్ మహాధ్వనిన్. 33

అ. కట్టిననీలిదిండ్లు=నడుమునబిగఁగట్టిన నీలిచాయదట్టీలును, సెలకట్టయవిండ్లును=సెలసు కట్టల ధనుస్సులను, విండ్లగొసెనల్ = ధనుస్సులుంచెడియొఱలును, చుట్టి=మెలిచుట్టి, నొసళ్లపైన్ = నొసటిప్రదేశములమీఁదికి వచ్చునట్లు, ఇడినజుంజుఱుపల్లసిగల్ - ఇడిన = పెట్టుకొన్న, జుంజుఱు = చింపిరి, పల్ల=ఎఱ్ఱనైన, సిగల్ =జుట్లును, కటీతటిన్ = మొలవెనుక, పెట్టినమోటకత్తులును=చెక్కుకొన్న మద్దికత్తులును, మేనులన్ = దేహములందు, కార్కొనుకప్పులు=చీఁకట్లుక్రమ్ముచున్న నలుపులును, ఏర్చి= ఏర్పరించి, చేపట్టినవేఁటయమ్ములును = గ్రహించినవేఁటకుఁ దగినబాణములును, బాగగువాగురికుల్ - బాగగు=ఒప్పుచున్న, వాగురికుల్ = ఉచ్చులుపన్ని వేఁటాడెడి వేఁటకాండ్రు, మహాధ్వనిన్ = అధికధ్వనితో- అధికముగా ధ్వనికలుగునట్లు మాటలాడుచుననుట. - పైపద్యముతో నన్వయము. అలం. స్వభావోక్తి

సీ. సట లెత్తుకొని యొత్తుకిటినైనమోటాస, పడి యేయఁ బొడుతు నీపాదమాన
కలగుండు వడఁ జెండుకరినైనఁ జెవిపట్టి, బలిమిమైఁ దెత్తు నీపాద మాన
సెల నెప్పుకొని రొప్పుపులినైనఁ బీడించి, పడవైతుఁ జొచ్చి నీపాదమాన
తెరఁదూఱిబెఱఁ బాఱుగురుపోతు పైనైనఁ, బడియెక్కి పొడుతు నీపాదమాన

యితరగర్వలమృగపంక్తులకేమి లెక్క, కండగరువంపుమాటలు కావుసుమ్ము
చూడు మమ్మని పంతంబు లాడుకొనుచు, నవ్వరూథినిసుతుఁ గొల్చి యరిగి రపుడు.

అ. సటలు = మెడమీఁది వెండ్రుకలు, ఎత్తుకొని = నిక్కించుకొని, ఒత్తుకిటి నైనన్ = త్రోసికొని వచ్చుపంది నైనను, మోటు = మఱుఁగుగా నుంచుకొనుమనుష్యాద్యాకృతిని, ఆసపడి = అపేక్షించి-మనుష్యాద్యాకృతినిమాటు చేసికొనియనుట, ఏయన్ = బాణము ప్రయోగింపను, పొదుపుతున్ = దగ్గఱసుఁ బోయి బల్లెముతోఁ బొడిచెదను, నీపావమాన = నీయనుగులతోడు (ఇది పంతపుమాట), కలగుండువడన్ = కలఁత పడునట్లుగా, చెండుకరి నైనన్ = ఎగురఁ జిమ్ముచుట్టి యేనుఁగునైనను, చెవిపట్టి = చెవినిబట్టుకొని, బలిమి మైన్ = బలాత్కారముగా, తెత్తున్ = ఈడ్చుకొనివత్తును, నీపాదమాన, సెలన్ = కొండయేటిని, నెప్పుకొని = పాదుచేసికొని, రొప్పుపులి నైనన్ = కోపముతో గాండ్రించునట్టి పెద్దపులి నైనను, చొచ్చి = చేరఁబోయి [illegible], పీడించి = నొప్పించి, పడవైతున్ = నేలఁ బడఁద్రోయుదును, నీపాదమాన, తెరఁ జూపి = వలవంటి తెరచీరనుండి వెలికిఁ జని, [illegible] = భయముతో, పాఱు = పరుగెత్తునట్టి, గుఱుపోతు పైన్ = గవయి మృగముమీఁద, ఐనన్ = అయినను, పడి = [illegible], ఎక్కి = ఆరోహించి, పొడుతున్ = [illegible]తోఁ బొడుతును, నీపాదమాన, ఇతర పంక్తులు - ఇతర = వీనికంటె వేఱయిన, గర్వల = [illegible], మృగపంక్తులు = మృగములబారులు, ఏమిలెక్క = లెక్క [illegible] - వానిని [illegible] లక్ష్య [illegible] లేదనుట, [illegible] మాటలు = కండబలిసిన క్రొవ్వుచేతఁ జెప్పెడి (వ్యర్థపు) మాటలు, కావుసుమ్ము = కావుసుమీ, మమ్మున్ = మమ్ము, చూడు = నీవు (వేఁటయందు) చూడుము, అని, పంతంబులు = ప్రతిజ్ఞలను, [illegible]కొనుచున్ = చెప్పుకొనుచు, అవ్వరూథినిసుతున్ = వరూథినికొడుకైన యాస్వారోచిని, కొల్చి = సేవించి, అరిగిరి = (వాగురికులు) పోయిరి, అపుడు = ఆసమయమునందు - సైకస్వయము. అలం. కావ్యార్థాపత్తి.

ఆ ముయ్యంగదల నత్తికములనుండి యెగురుచుఁ, బదను మీఱ నెరలకు నెగడు డేగ
పదువు పట్టి దండపాణులై నడచిరి, విభుని గెడల డేగ వేఁటకాండ్రు 35

అ. డేగ వేఁటకాండ్రు = డేగలచే వేఁటాడించువారు, ముయ్య = కాళ్ళకుఁ గట్టియుండు [illegible], కదలన్ = చలించునట్టు, అత్తికములనుండి = హస్తకవచములందుండి, ఎగురుచున్ = [illegible], పదను = సమయము - ఎరయిచ్చు సమయ మనుట, మీఱన్ = అతిక్రమింపఁగా, ఎరలన్ = ఆహారములను, వెదకు డేగపదువు = వెదకునట్టి డేగలయొక్క గుంపును, పట్టి = చేతులందుఁ బట్టుకొని, దండపాణులై = [illegible] చేతులఁ బూనినవారై, విభుని గెడలన్ = రాజైన స్వారోచియొక్క ప్రక్కలలో, (పా. ప్రోలన్ = ముందటిప్రక్క,) నడచిరి = నడచినవారలైరి. అలం. స్వభావోక్తి.

ఆ. గూనివీఁపు లదురఁ గొణఁగి తిట్టుచు నేకుఁ, గఱచినట్టి కుక్కగండ్లనంగ
మూతి నరపమీసములబోయముదుసళ్లు, పందివలలు మోచి పఱచి రపుడు. 36

అ. గూనివీఁపులు = వడుమువంపుగల వీఁపులు, అదురన్ = వణఁకఁగా, గొణఁగి = గొణగొణ యనుచు-విశదపడనట్లనుట, తిట్టుచున్ = (అధికారులను) తిట్టుచును, ఏకు . . నంగన్ - ఏకు = గూదచుట్టను, కఱచినట్టి = నోటఁ గఱచుకొన్న, కుక్కగండ్లు = కుక్క పోతులు, అనంగన్ = అనునట్లు, మూతి . . ముదుసళ్లు - మూతి = నోటిముందటిభాగమునందలి, నరప = నరసిన, మీసముల = మీసములుగల, బోయముదుసళ్లు = ముసలిబోయవాండ్రు, అపుడు = అప్పుడు, పందివలలు = పందులకుఁ బన్ను నట్టివలలను, మోచి = మోసికొని, పఱచిరి = పరుగెత్తిరి. అలం. ఉత్ప్రేక్ష, స్వభావోక్తి.

వ. ఇట్లరిగి యమ్మహారణ్యంబు సొచ్చి విచ్చలవిడి నచ్చటం బచ్చికబయళ్ల మచ్చి
క లచ్చుపడం దటిచ్చటులం బగులోచనప్రభాపటలంబు దిక్తటంబులం బర్వఁ
దాఁటుమాఁటుపడ నిడికొనిన మొగంబులతో నేఁజిహ్వాపల్లవోల్లిహ్యమానాం
గంబు లగుసారంగంబులఖురళికారంగంబు లనం గనుపట్టుచెలికిపట్టులును, బిట్టె
సంగునాఁకటం దట్టుపడి పొట్టకై పుట్టకూటికిం జీమలకుం జెనలునకు నెలుంగులు
గులగులం బుట్టలు నిశితనిజనఖరకులిశకోటులం గోరాడ నాదండఁ గోచుకొని
యుండి వెడలి చనువిషవిస్ఫురద్భుజంగంబుల నల్గడం గబళించి గెంటకుండ దంటు
చప్పరించుగతిం జప్పరించుచు నొండొంటికిం బేరెంబులు వాఱి కుప్పించి తప్పిం
చు కొనుదుస్స్వాలఖుగజరజశ్ఛటల నెసఁ మొసంగుమసమసకల మఱుంగువడి
యుండుగండోపలంబులును, బరిహాసితసితేతరపాషాణపాటవంబు లగువిషాణ
పరిఘంబు లొండొంటిం దాఁకి కతిల్లుపెరిల్లు మనం బోరుకారుపోతులకోలాహలం
బులం బ్రతిశబ్దంబు లీనుకొనలును, మదమొదవ నెదపదనునం బొదలుపెట్ట
లకుం జట్టంబులై చిల్లరసలుగులం బిల్లలం జుల్లరంబుల సాగిలిచ్చి గమికి వెనుక
నై మలయుచుం బిఱుందం దిరుగుచిఱుగున్నలకు వెన్నాడుత్రోఁడేళ్ల సివంగులం
దిరిగి తిరిగి మొత్తిపో నొత్తి చరియించునేకిచరంబులఘుర్ఘురధ్వానంబుల ఘూర్ణ
మానంబు లగుపరిగె పక్కె పలుమేరు రేఁగు వేము పులుగుడు గురివెంద యీఁదు
గేదంగి మోదు గారు కోరింద కనుము కానుగు మొద లగుపొదలం బొడు వగు
నానావిపినపాదపకలాపంబులును, మాటిమాటికి మానిసికాటు మరగి తెరు
వులు గాచికాచి డగ్గుత్తిక పడం దినుపెద్దపులులవలనం బుటపుటనై త్రుప్పళ్లు
డుల్లి త్రుళ్లి గంతు లిడుగబ్బిబెబ్బులుల నలఁగుడుల దొడ్లజనంబులు మంత్రించి
పొరంకి దిగిచిన నీరు మేపుడిగి గిరులు గ్రక్కదల వాపోవుచుం దిరిగి తిరిగి వా
కట్టు విడిచినప్పుడు దప్పికై పాఱి సెలయేటిచెంకులం బొఱమ్ములు ఱొమ్ము కెలం
కులం గాఁడ గాండ్రుగాండ్రు మని రొప్పి నొప్పి కుప్పరంబుగా వియత్తలంబు
నకు విల్లెత్తుపాడు వెగసి నెత్తురులు గ్రక్కుచుఁ గూలుక్రోల్పులులఘుర్ఘురధ్వ
నుల గుండియ లవిసి కలగుండు వడుకారండవంబులపక్షపుటపటాత్కారం
బుల బోరుకలంగు సెలయేటిచెంకులును, మేఁత వెంబడిం బొలముపల్లంబులం
దిరిగితిరిగి వెంట్రికలు వెట్టువెంటపట్టునకు నచ్చి యచ్చటం గ్రుచ్చి కానరాకుండ
మునుమున్న మృగయుండు బిసయొడ్డి సంఘటించినకాలిబోనులం బడి బెగడక
యద్దారుపీడ్చుకొని యీరవములఁ దఱియుంబడి యవ్వలికై వెడలి చనలేక గెడసి
తన్నుకొనుచున్న మెకంబులయాక్రందనంబులం గ్రందుకొనువిషమప్రదేశంబు
లును, ఝిఱుతగండ్లగమిచేత దైవికంబున డాప్రక్క మీఁదువడ దాఁటువడి
యవి గొంతుక్రొన్నెత్తురులె క్రోలి విడిచి చన మార్మోడలు వడి మళకవనదం
శమ్ములు ఘూఁగ మాఁగంబొఱినకొండగొఱియ చుఱుగుడుబొందులకు సంద

డించుకంకగ్గ్రావళ్లుల ముళ్లంబుల ముసుంగుఁ బడుపల్లంబులును, మేయు
తఱి పేఁ పెక్కు ఱేఁ చొకటి మూఁపురంబుఁ గఱచి కఱచి యెఱచి పడ వైవం దోఁడి
యొక రెండుమూఁడు వెనుకముందఱ నందందఁ గాళ్లం బెనంగుచు నత్తునుక లేఱి
యేఱి తినఁ గా లెడలినయెడ మందుతీ ద్వేదనకుం గాక మట్ట లెత్తుకొని యొత్తుగల
పొదరుటడవులు చొరం బాఱుపిడికెడితికదుపునురవడికి విఱిగి పడినవిటపివిటపంబు
లం దడుకు వ్రేడిచిసగతి నొందునెడలును, పదులుపదులు నూఱులునూఱులు వేలు
వేలు గుములుగట్టి దట్టం బగునెయ్యంబున వెదురుబియ్యంబు లొండొంటి కొ
నంగఁ గరివరకరేణువులు వంప ముంపు చెడి యిట్టట్టు పడి తిట్ట లగుజిట్టల సంక
టంబు లగుడొంకలు నీక్షించి హర్షించి యెక్కుడుఁగమి నొక్కయెడ నడుగు
వెడలనిలెంకిఁ గని వాఱుగవులునకు మెకము దిగ దని యెన్ని మన్ను దూ
ర్పెత్తించి గాలి పరికించి దిగువదెస దొడ్డివల పన్ని యెగువ పొలిమేర బారాది
యగుదూరం బేఁగఁ బోఁగువాఱించి యత్త్రాట వల మోవం దెర లెత్తి యెత్తి
న త్తెరఁ దుత్తునురుగాఁ జించుకొని పాఱినం బోనీక బారిసమరుటకు వలచు
ట్టునుం జెట్టుగ్గదండగొని నిలువ నలువు గలపుళిందులఁ గొండఱ నిలిపి యమ్మంది
పిఱుందజాగిలంబులతోడ వాగురికుల నిలువ నియమించి తెరకు లోనగువాని
నందుఁ బడంగొట్టించియు గట్టువెంట దట్టంబుగాఁ బ్రజ నెక్కించి మఱి కలయ
గహనతలంబునన్నెల్లం బెల్లుగా విల్లువేఁటకు నేటు దప్పనినేటివిలుకాండ్ర
మృగములు వెలువడుటకు హరిచ్ఛదచ్ఛటావృతశిరస్కటిధనుష్కోటులై కొట్టి
కానిం జూపెట్టుకొని యెదురుమాటులు గాకుండ నుండి చెదరి పారదెరువు
లం బఱవకుండ నీరముల సందుసందులం దమతమకట్టిన మోటకత్తుల నొం
డొండ ఖండితంబు లగుమండగిలకంపమండలు ద్రోచి మునుములం గనుమ
లొనరించుకొనం బంచి తాను నొక్కొక్కయెడం బాదచారియు నొక్కొక్క
యెడఁ దురగాధిరూఢుండును నై యెల్లెడల మెలంగుచుం గూఁత లెగయఁ బణవ
మృదంగ దుందుభి ప్రముఖతూర్యంబులు గొట్టించియు గాహళులు వట్టించియు
నగ్నియంత్రంబులు ముట్టించియు రొద మిన్నుముట్టం జోపు వెట్టించిన. 37

అ. ఇట్లు = ఈవిధముగా, అరిగి = పోయి, అమ్మహారణ్యంబు = ముందుచెప్పిన వ్రెండికొండ వెంబడిగొప్పయడవిని, సొచ్చి=ప్రవేశించి, విచ్చలవిడిగా = యథేచ్ఛముగా, అచ్చటఁ = ఆయడవి యందు, పచ్చికబయళ్లఁ = పచ్చగా గడ్డి పెరిఁగినబయళ్లయందు, మచ్చికలు = అనురాగములు, అచ్చుపడఁ = స్పష్టమగునట్లు, తటిచ్ఛటులంబు = మెఱుపవలెఁజలించునది, అగు . పటలంబు-అగు = అయిన, లోచన = కన్నులయొక్క, ప్రభా = కాంతులయొక్క, పటలంబు = సమూహము, దిక్తటంబులఁ = దిక్కులకొనలయందు, పర్వఁ = వ్యాపింపఁగా, తాఱుమాఱుపడఁ = వ్యత్యాసపడునట్లు-ఒకక్రమము లేకుండునట్లనుట, ఇడుకొనినమొగంబులతోఁ = పెట్టుకొన్నముఖములతో, ఏణీ.. బులఁ- ఏణీ=ఆఁడుజింకలయొక్క, జిహ్వాపల్లవ = చిగుళ్లవంటినాలుకలచేత, ఉల్లిహ్యమాన = ఎగనాకఁబడు

చున్న, అంగంబులు=దేహములుగలవి; అగు . రంగంబులు- అనుస్వారంగంబుల = అయినట్టిమగ జింకలయొక్క, ఖురళీకారంగంబులు = గరిడీసాలలో, అనక్ = అనునట్లు, కనుపట్టుచేలికపట్టులు ను=అగపడుచున్న విరివిగలబీటి నేలలును - అనగా నచ్చటఁ బచ్చిక కడుపార మేసి హాయిగాఁ బం డుకొని తమకుఁ బ్రియులైనలేళ్లు వాకుచుండఁగా నరిదులకుఁ దగినట్లు మెడలు త్రిప్పుకొనుచుండెడి యిట్టిగుంపులకు గరిడీసాలలో యనఁ దగినకంచెపొలములని తాత్పర్యము, (అలం. స్వభావోక్తి,ఉత్ప్రేక్షయు.) బిట్టు = మిక్కిలి, ఎసంగు నాఁకటన్ = అతిశయించుచున్నక్షుత్తుచేత, తట్టువడి=డీలు పడి-డస్సి, పొట్టకై = కడుపునకై-తిండికై యనుట, పుట్టకూటికిన్ = చీమగ్రుడ్లచే ముద్దముద్దగా నేర్పడినపుట్టమట్టికొఱకును, చీమలకున్ = చీమలకొఱకును, చెదలునకున్ = చెదపురుగులకొఱకును, ఎలుంగులు = ఎలుఁగుగొడ్లు, గులగులన్ = గులగులయనుధ్వనితో, పుట్టలు = చీమపుట్టలను, నిశిత...కోటులన్ -నిశిత=వాఁడియైన, నిజ = తమయొక్క, నఖరకులిశ = వజ్రాయుధమువంటిగోళ్ల యొక్క, కోటులన్ =కొనలతో, కోరాడన్ =మట్టిచెదరఁద్రవ్వఁగా, అదండన్ = ఆపుట్టలవెంబడి, కాచుకొనియుండి = కనిపెట్టియుండి, వెడలి = (ఎలుఁగుగొడ్లుత్రవ్వెడిపుట్టలలోనుండి) బయలు వెడలి, చను . బులన్ -చను=బోవుచున్న, విష=విషముచేత, విస్ఫురిత = తేజరిల్లుచున్న, భుజం గంబులన్ = పాములను, నల్గడన్ = నాలుగుదిక్కులనుజేరి, కబళించి=నోళ్లతోఁగవ్విపట్టి, గెంటకుం డన్ =ఇటునటుఁ దేమలకుండునట్లు, దంటు=చొప్పకట్టను, చప్పరించుగతిన్ = పండ్లతోనదిమి రస మపీల్చునట్లు, చప్పరించుచున్ = పండ్లతోనొక్కి సత్తువపీల్చుచు, ఒండొంటికిన్ = ఒకటిమీఁది కొకటి, పేరెంబులువాతి=పరుగులెత్తి, కుప్పించి = నేలఁగాళ్లూనియెగిరి, తప్పించు . .ఛటలన్ - తప్పించుకొను=తమపైఁబడివచ్చువానికిఁజిక్కకుండఁ దొలఁగిపోవుచున్న, దుప్పుల = పృషతమృగము లయొక్క, ఖురజ=గిట్టలవలనఁగలిగిన, రజశ్ఛటలన్ =ధూళిపరంపరలచేత, ఎనకమెసంగుమసమసక లన్ - ఎనకమెసంగు=అతిశయించుచున్న, మసమసకలన్ =కొంచెపుఁజీఁకట్లయందు; మఱుంగు పడి=చాటువడి- కానరానివై, ఉండుగండోపలంబులును=ఉండునట్టిపెద్దగుండుఱాళ్లును - అనఁగా నాహారార్థముగా నెలుఁగుగొడ్లు పుట్టలుత్రవ్వి పుట్టకూళ్లుకెల్లగించునప్పు డాపుట్టలలోనుండి విషము గ్రక్కుచు వెడలివచ్చుచున్న పాములను గనిపెట్టియుండి పట్టితినుచున్నదుప్పులు క్రొవ్వి యొకటి నొకటిమీఱ దాఁటి గంతులు వేయుచుండె ననియు వానికాళ్లత్రొక్కుళ్లచేత రేఁగినదుమ్ముచేత నందు న్న పెద్దపెద్దఱాళ్లు గ్రమ్మఁబడుచుండెననియుఁ దాత్పర్యము. (అలం. స్వభావోక్తి, ఉపమయు) పరి...బులు - పరిహాసిల = ఎగతాళిచేయఁబడిన - తక్కువపఱుపఁబడిన, సితేతర=నలుపైన, పాషా ణ=ఱాళ్లయొక్క, పాటవంబులు =పటుత్వముగలవి, అగువిషాణసరిఘుంబులు= అగునట్టిగుదియకఱ్ఱలవం టికొమ్ములు, ఒండొంటిన్ = ఒకటితోనొకటి, తాఁకి=తగిలి, కిరిల్లుపెరిల్లుమనన్ = కిరిల్లుపెరిల్లుమని శబ్దింపఁగా, పోరు...బులన్ - పోరు=పోట్లాడుచున్న, కారుపోతుల=అడవిదున్నపోతులయొక్క, కోలాహలంబులన్ = కలకలధ్వనులచేత, ప్రతిశబ్దంబులు = మాఱుమ్రోఁతలు, ఈనుకోనలును= పుట్టించుచున్నకొండసందుగొందులును - అనఁగాఁ గారుదున్నపోతులు నల్లఱాళ్లవలెఁ గఠినములైన తమకొమ్ము లొకటితోనొకటితగిలి మ్రోఁగునట్లు పోట్లాడఁగా నాధ్వనులను నచ్చటికొండలనడిమి గొందులు ప్రతిధ్వనులిచ్చుచుండె నని తాత్పర్యము. (అలం స్వభావోక్తి, ఉపమయు.) మదము=యౌ వనగర్వము, ఒదవన్ =కలుగఁగా, ఎదపదనునన్ =చూలుకాలమునందు, పొదలు పెట్టలకున్ =కామము వర్ధిల్లుచున్నయాఁడుఁబందులకు, చుట్టంబులై =మిత్రములై-తగులాటముగలవై యనుట, (దీనికి ఏకాగం

బులు కర్త) చిల్లరసల్లుగులన్ = సామాన్యములైనపందులను, పిల్లలన్ = లేతపిల్లలను, చుల్లగంబులన్ = ఎడపయసుగలపందులను, సాగనిచ్చి = జరిగిపోనిచ్చి, గమికిన్ = గుంపునకు, వెనుకయై = వెనుకతట్టుచేరి, మలయుచున్ = పెనఁగుచు, పిఱుందన్ = వెనుక, తిరుగుచిఱుగున్నలకున్ = మొలఁగొనట్టిచిన్నపిల్లలను, వెన్నాడుతోఁడేళ్లన్ = వెంబడించి వచ్చునట్టి యడవికుక్కలను, సివంగులన్ = తెరతువు లనెడిమృగములను, తిరిగితిరిగి = పలుమారుతిరిగి, మొత్తి = కొట్టి, పోనొత్తి = పోఁదజిమి, చరియించు . బులన్ = చరియించు = సంచరించుచున్న, ఏకచరంబుల = అడవిపందులయొక్క, ఘుర్ఘురధ్వానంబులన్ = గురగుర యనెడిధ్వనుల చేత, ఘూర్ణమానంబులు = తిరుగు పడుచున్నవి, అగు. మొదలు - అగు = అయిన, పరిగె = పరిగెయను చెట్టు, పక్క = పిచులము, పలుమేర = పలుమేరువు, రేఁగు = బదరి, వేము = నింబము, పులుగుడు = వాతఘ్ని, గురివెంద = గుంజ, ఈఁదు = ఈఁతచెట్టు, గేదంగి = కేతకి - పచ్చమొగలి, మోదుగు = కింశుకము, ఔరు = వీరణము - అవురుగడ్డి, కోరింద = జతూక, కసుము = కసుపగడ్డి, కానుగు = కరంజము, మొదలు = మొదలుగాఁగలవి, అగుపొదలన్ = అగునట్టిపొదరుల చేత, పొడువు = ఉన్నతము, అగు .. బులు స - అగు = అయిన, నానా = అనేకములైన, విపినపాటప = అడవిమ్రాఁకులయొక్క, కలాపంబులును = సమూహములును - అనఁగా ఎయసువచ్చి వెనుయయినసమయమునందు మగవానికూటమి వలనిఁ కోరికలు పెరుఁగుచున్న పెంటిపందులందుఁ దగులాటముగలిగి సామాన్యపుఁబందులను బిల్లలను నెడగున్నలను గుంపుగూడి ముందు సాగిపోవునట్లుచేసి యాగుంపునకు వెనుకఁజేరి పెనఁగుచుఁ దమ వెనుక వచ్చెడి పసిపిల్లలను బట్టికొనిపోవుటకై వెంబడింపవచ్చెడి తోఁడేళ్లను సివంగులను వెనుకకు మరలిమరలి కొట్టి తఱుముచుఁ జరియించునట్టియడవిపందుల గురగుర యనెడిధ్వనులచే నిండుకొన్నపొదలతఱుచునఁ బలుదెఱఁగుల యడవిమ్రాఁకుల సమూహము లొప్పుచుండెనని తాత్పర్యము (అలం. స్వభావోక్తి) మాటిమాటికిన్ = పలుమాఱును, మానిసికాటు = మనుష్యులనుగఱచుట, మరిగి = అలవాటుపడి, తెమివులు = మనుష్యులనుదఁచుత్రోవలను, కాచికాచి = కనిపెట్టి, డగ్గుత్తికపడన్ = గొంతుగొంగెదట్టునట్లు, తిను పెద్దపోలవలనన్ = భక్షించునట్టి మనుష్యమాంసమువలన, పుటపుటనై = ముక్కలిబలిసి, ఱుప్పలు = పేఁడదెరిఁగిన నెంగ్రుకలు, డుల్లి = రాలి, త్రుళ్లి = పొంగరించి, గంతులు = దుముకులు, ఇడుగిట్టబెబ్బులులు సలుగుడులన్ - ఇడు = వేయునట్టి, గట్టి = అధికమండెడి, బెబ్బులుల = పెద్దపులులయొక్క, సలుగుడులన్ = బాధల చేత, దొడ్డజనంబులు = పసులదొడ్లలోనిమనుష్యులు, మంత్రించి = వాకట్టుమంత్రము మంత్రించి, పొరకదిగిచినన్ = గడ్డిపోఁచతీసి దిగఁదుడువఁగా, సీరు = నీళ్లుత్రాగుటయు, మేపు = మేఁతమేయుటయు, ఉడిగి = మాని, గిరులు = కొండలు, గ్రక్కదలన్ = ముక్కలికసలఁగా - అదరఁగా, వాపోవుచున్ = అఱచుచు, తిరగితిరిగి = ఇటునటుఁ బలుమాఱుతిరిగి, వాకట్టు = (దొడ్డజనములు మంత్రించిచేసిన) నోటికట్టు, విడిచినప్పుడు = వదలినప్పుడు, దప్పికై = దాహముతీర్చుకొనుటకై, పాఱి = పర్వు గనఁబోయి, సెలయేటిటెంకులన్ = కొండయేర్లమడుగుల తీరములందు, పాఱమ్ములు = పాఱువాతిబాణములు, బొమ్మకెలంకులన్ = ఎక్కువున కిరుప్రక్కలను, కాఁడన్ = నాటఁగా, గాండ్రు గాండ్రుమని = గాండ్రుగాండ్రు మనెడిధ్వనితో, రొప్పి = గాండ్రించి - రూసి, నొప్పికిన్ = బాధను, ఉప్పరంబుగాన్ = మీఁదుగా, వియత్తలంబునకున్ = ఆకాశప్రదేశమునకు, పిల్లతుపొడువు = వింటిబాణము పోవునంతయెత్తు, ఎగసి = ఎగిరి, నెత్తురులుగ్రక్కుచును, కూలు ..ధ్వనులన్ - కూలు = నేలఁగూలునట్టి, క్రోల్పులుల = పెద్దపులులయొక్క, ఘుర్ఘురధ్వనులన్ = ఘుర్ఘురయనెడిధ్వనుల చేత, గుండియలువిసి =

గుండెలుపగిలి, కలగుండు ..బులన్ - కలగుండువడు=కలవరిపడునట్టి, కారండవంబుల=కన్నెలేళ్లనెడి పక్షులయొక్క, పక్షపుట = పుటములవంటి రెక్కలయొక్క, పటాత్కారంబులన్ =పటపటధ్వనులచేత, బోయికలంగు సెలయేటి పెంకులును-బోయికలంగు = ప్రోఁగుచున్న, సెలయేటిపెంకులును = గిరినదులమడుఁగుపట్లును- అనఁగా, పెద్దపులులు మనుష్యులను గఱచికఱచి వాడుకపడి మనుష్యులు నడచునట్టి త్రోవలందుఁజేరి దొరకినజనులనుగొట్టి చంపి తిని బలిసి మేనిబొచ్చురాలి నునుపుమీఱిన దేహములతో సంచరించుచుండుననియు, వానిబాధకు సహింపక పసులగాపరిజనులు, మంత్రించి వాకట్టు కట్టఁగాఁ గూయుచు నందందుఁ దిరుగుచుండి వాకిట్టు వదలినప్పుడు దప్పిదీఱ నీళ్లుత్రాగ నందలి సెలయేళ్లసందులకు నవి పోవుచుండుననియు నప్పుడు వేఁటకాండ్రు పాఱలనంటి మొనలుగల బాణములను బ్రయోగింపఁగా నవి ఱొమ్ములందు నాటిన నందులనొప్పికిఁ దాళలేక గాండ్రు గాండ్రు మని కూయుచు మింటికెగసి నేలఁ గూలినపులులకూఁతలకు గుండెలుపగిలి వెఱచి తటతటధ్వనితో రెక్కలాడించుచు నెగిరిపోవుచున్న కన్నెలేడిలోనగు జలపక్షులు చేయురొదలతో సెలయేటిమడుఁగులొప్పుచుండెననియుఁ దాత్పర్యము. (అలం స్వభావోక్తి.) మేఁత వెంబడిన్ = మేఁపుగొనఁబోవువరుస వెంట, పొలముపల్లంబులన్ = అడవిలోనిపల్లపుఁ బ్రదేశములందు, తిరిగితిరిగి=బహుదూరముసంచరించి, పెంట్రికలుపెట్టు పెంటపట్టునకున్ = పేఁడవేయునట్టి దొడ్డిపట్టునకు, వచ్చి, అచటన్ = ఆపెంటపట్టునందు, గ్రుచ్చి=నాటి, కానరావుండన్ =వానికిఁ గనఁబడకుండునట్లు, మునుమున్న = అవివచ్చి పెంటపట్టుచేరక మున్నే, మృగయుండు = వేఁటకాఁడు, బిస= త్రొక్కఁగా బిగిసికొనఁదగినకీలు, ఒడ్డి = పన్ని, సంఘటించిన కాలిబోనులన్ = జతపఱిచిన కాలికిఁ దగులుకొనుబోనులలో, పడి=తగులుకొని, బెగడక = బోనులోఁ దగులుకొన్నందులకు భయపడక, అద్దారువు = ఆబోనుమ్రాను, ఈడ్చుకొని = లాగుకొని, ఈరములన్ =పొదరిండ్లను, తఱియంబడి = తఱిసి - చేరి, అవ్వలిపై= ఆపొదరిండ్లనుండి యవతలికి, కడచి=దాఁటి, పోలేక=పోఁజాలక, కెడసి= క్రిందఁబడి, తన్ను ...బులన్ -తన్నుకొను=కాళ్లు జాడించుకొనునట్టి, మన్నుమెకంబుల=ఋశ్యమృగములయొక్క, ఆక్రందనంబులన్ =బాధచేనఱచు నఱపులచేత, క్రందుకొను లును-క్రందుకొను= సందడించునట్టి, విహారము=మిట్టపల్లములైన, ప్రదేశంబులును=చోట్లును-అనఁగా మనుఁబోతులు మేయఁ బోయి యందందుఁ దిరిగి మందపట్టునకువచ్చి యచ్చటఁ దాము వచ్చునంతలో వేఁటకాఁడు పన్నియున్న కాలిబోనులలోఁ దగులుకొని యందులకు దిగులొందక యాబోనుమ్రాని నీడ్చుకొని పొదరిండ్లు చొరఁబోయి యాపొదలలోఁ జిక్కుకొని యావలఁ బోఁజాలక నేలఁబడి తన్నుకొనుచు నఱచుచుండఁగా సందడిగలిగియున్న ప్రదేశములని తాత్పర్యము. (అలం పై.) చిఱుతగండ్లగమిచేతన్ = చిఱుతపులుల సమూహముచేత, ద్వైపికంబునన్ = ద్వైపివశమున, డాప్రక్కమీఁదువడన్ = ఎడమప్రక్కమీఁదగునట్టుగా, దాఁటుపడి =చిఱుతపులులయొక్క దాఁటుటనుబొంది - చిఱుతపులు లెగిరి దుమికి పడఁద్రోయఁగాఁ బడి యనుట, అవి=ఆచిఱుతపులులు, గొంతుక్రొన్నెత్తుపలె=కుత్తుకవలని క్రొత్తరక్తములే, గ్రోలి = త్రాగి, విడిచి=వదలి, చనన్ = పోఁగా, మార్మెడలుపడి= వెనుకకు వ్రేలఁబడిన మెడలుగలిగి, మశకవనదంశమ్ములు= దోమలు నడవియీఁగలును, మూఁగన్ = ముసరఁగా, మాఁగం .. బొందులకున్ - మాఁగంబాఱిన=క్రుళ్లనారంభించిన, కొండగొఱియ=కొండగొఱ్ఱెలయొక్క, ముఱుగుడు బొందులకున్ = క్రుళ్లికంపెత్తినదేహములకై, సందడించు . బులన్ - సందడించు=ఒరసికొని తిరుగునట్టి, కంక=రాపులుఁగులయొక్కయు, గృధ్ర = గద్దలయొక్కయు, ఆవళుల=పంక్తుల

యొక్క, మొల్లంబులన్ = సమూహములచేత, ముసుంగువడు పల్లంబులును= ఆవరింపఁబడినపల్లపుఁ ప్రదేశములును-అనఁగా, చిఱుతపులులు పడ దాఁటి మెడలుకొఱికి నెత్తురు పీల్చి విడిచిపోఁగాఁ బడియున్న కొండగొఱ్ఱెలశరీరములు ముఱిగి కంపెత్తఁగా వానిఁ దెలిసికొని తినుటకై బారులుగట్టి వచ్చి యావరించుకొన్న బోరువలయుఁ గ్రద్దలయు గుంపులతోఁగూడిన పల్లపునేలలని తాత్పర్యము. (అలం. పై.) మేయుతఱిన్ = (సిడికడుతులు) మేయునప్పుడు, ఱేఁచొక్కటి=ఒక ఱేఁచుకుక్క, వీఁపెక్కి=వీఁపుపైనెక్కి, మూఁపురంబున్ =భుజశిరమును, కఱచికఱచి = పలుమాఱుకఱచి, ఎఱచి=మూఁపురపుమాంసమును, పడవైవన్ = క్రిందఁబడవేయఁగా, తోడియొక రెండుమూఁడు = వీఁపెక్కియున్న ఱేఁచుజతవైన రెండుమూఁడు ఱేఁచులు, వెనుకన్ = (కడితికి) వెనుకతట్టును, ముందరన్ =ముందుతట్టును, అందంద=మఱిమఱి-మాటిమాటికి, కాళ్లన్ = (కడితియొక్క) కాళ్లలో, పెనఁగుచున్ = పెనఁగొనుచు-చుట్టుకొనుచు, (ఆవీఁపుమీఁది ఱేఁచుకుక్క) క్రిందవేయుచున్న మాంసఖండములను, ఏఱియేఱి=ఒక్కొకటిగా నేఱుకొని, తినన్ =తినుచుండఁగా, కాలు=పాదము, ఎడలినచోడన్ =తొలఁగినచోట - కాలెత్తిపెట్టననువైనప్పుడు, మండుతస్వేదనకున్ =మంటయెత్తుచున్న యాబాధకు, కాక= సహింపనేరక, మట్టలు=తోఁకలు, ఎత్తుకొని=పైకెత్తుకొని, ఒత్తు=తఱుచు, కలపాదరుటడవులు=కలిగిన పొదలుబలిసిన యడవులందు, చొరం ..వడికిన్ - చొరంబాఱు=ప్రవేశింపఁబోవుచున్న, ఓడికడితి=ఆఁడుమ్గ్గోకర్ణమృగములయొక్క, కదుపు=మందలయొక్క, ఊరవడికన్ = మిక్కుటమైనవేగమునకు, విఱిగి=తునిసి, పడినవిటపివిటపంబులన్ = నేలఁగూలినమ్రాఁకుకొమ్మలచేతను, తడుకువోడిచినగతిన్ =వెలుగువేసినవిధమును, ఒందు నెడలును = పొందునట్టి ప్రదేశములును-అనఁగా, ఆఁడుకడుతులు మేయుచుండఁగా ఱేఁచుకుక్కలు కొన్ని జతగూడివచ్చి వానిలో నొకటొకట్రి యాఁకడుతులవీఁపెక్కి కఱచి మాంసపుఁగండలు పెఱికి క్రిందఁబడవేయఁగాఁ గ్రిందనుండు ఱేఁచు లాకండలు తినుచు నాకడుతులను బాఱిపోనీక కాళ్లలోఁ బెనఁగొనుచుండఁగాఁ గాలు వానివలనఁ దొలఁగఁ దీసికొని పొదలుబలిసిన యడవులుచొచ్చుటకై పాఱునప్పుడావేగమునకు నడవిమ్రాఁకులకొమ్మలు విఱిగిపడి వెలుగువేసినట్టున్న ప్రదేశములని తాత్పర్యము (అలం. పై.) పదులుపదులు=పదిపదేసియు, నూఱులునూఱులు=నూఱునూఱేసియు, వేలువేలు=వేయివేయేసియు, గుములుగట్టి=గుంపులు గుంపులుగాఁగూడి, దట్టంబు=అధికము, అగునెయ్యంబునన్ =అయినచెలిమితో, వెదురుబియ్యంబులు = వెదురుధాన్యమును, ఒండొంటికిన్ =ఒకటికొకటి, ఒసంగన్ =ఇచ్చుటకు, కరివరకరేణువులు = మగవియు నాఁడువియు నైనయేనుఁగులు, వంపన్ =(వెదుళ్లను)వంపఁగా, ముంపుచెడి=తఱుచుఁదనము చెడి - ఒకటితో నొకట చేరికలేక చెదరి, ఇట్టట్టువడి=ఇటునటువాలి, తిట్టలు=ప్రోగులు, అగుజిట్టలన్ =అగునట్టి వెదురువెన్నులచేత, సంకటంబులు=ఇఱుకైనవి, అగు డొంకలును=అగునట్టి తఱుచుగానడచుటచేతఁ బల్లము పడిన బాటలును- అనఁగా, మగవియు నాఁడువియునైన యేనుఁగులు పరస్పరస్నేహముచేతఁ బదేసి నూఱేసి వేయేసి యొక్కొక్కగుంపుగాఁ గూడుకొని వెదురుబియ్యమురాల్చి యొకటికి నొకటి యియ్యఁగోరి వెదురుపొదలను దొండములతో వంపఁగా నావెదుళ్లు గుదురుబాసి విరియఁబడి వాలఁగా రాలిన వెదురువెన్నులు కుప్పలుకుప్పలుగాఁ బడుటచేత నిఱుకటములైన డొంకదారు లని తాత్పర్యము. (అలం. పై.) ఈక్షించి=చూచి- ఈ చెప్పఁబడిన ప్రదేశములనెల్లనుజూచి యనుట, హర్షించి=సంతోషించి, ఎక్కుడుఁదమిన్ =అధికమయిన తమకముతో, ఒక్కయెడన్ =ఒకచోట, అడుగు=పాదము, వెడలనికొంకిన్ = సాగనిమఱుఁగుతావును, కని=చూచి, వాఱుగవులునకున్ =తోలుపట్టకంపునకు, మెకము=మృగము, దిగ

దని=చొర నేరదని, విచారించి=ఆలోచించి, మన్ను=మట్టి, తూర్పెత్తించి=తూర్పాఱఁబట్టించి, గాలి పరికించి=గాలివాటను పరీక్షించి-ఏతట్టు గాలిగొట్టునదియుఁ దెలిసికొని, దిగువదెసకై=గాలికి వాటముగా నుండువైపున, దొడ్డివల=దొడ్డివలెఁ జుట్టు పాఱవచ్చునట్టివలను, పన్ని=ఒడ్డి, ఎగువపాలిమేరన్=మీఁదియెల్లయందు, బారాది=అధికము, అగుదూరంబు=అయినదవ్వు, ఏఁగన్=పోవునట్లు, పోఁగు వాటించి=పోఁగుఁద్రాడుచుట్టిరాఁ గట్టించి, అత్తాిటన్ = ఆపోఁగుఁద్రాటియందు, వలమోవన్=వలతాఁకునట్లుగా, తెరలెత్తి=అడ్డువలలెత్తి, ఎత్తినతెరన్=ఎత్తినయడ్డువలను, తుత్తుమురుగాన్=తునకలగునట్లుగా, పాతిసన్=(చించుకొని మృగములు) పరుగెత్తినను, పోనీక=తప్పించుకొనిపోనియ్యక, బారిసమరుటకున్=చంపుటకు, వలచుట్టును = జాలముచుట్టును, చెట్టుదండగొని=వృక్షము నాసరాచేసికొని, నిలువన్ = నిలుచునట్లు, నలువు=సామర్థ్యము, కలపులిందులన్=కలిగినబోయవాండ్రను, కొండఅన్=కొంతమందిని, నిలిపి=ఉంచి, అమ్మందిపిఱుందన్=ఆబోయల గుంపునకు వెనుక, జాగిలమ్ములతోడన్=వేఁటకుక్కలతోఁగూడ, వాగురికులన్=ఉరులొడ్డివేఁటాడెడు వేఁటకాండ్రను, నిలువన్ = ఉండునట్లు, నియమించి=ఆజ్ఞాపించి, తెరకున్=అడ్డువలకు, లోనగువానిన్=లోఁబడిన మృగములను, అందున్=ఆచోటనే, పడంగొట్టించియు=చచ్చిపడునట్లు కొట్టించియును, గట్టువెంటన్=కొండమీఁదుగా, దట్టంబుగాన్=తఱుచుగా, ప్రజన్=వేఁటాడుజనమును, ఎక్కించి=ఎక్కిపోవునట్లుచేసి, మఱి = మఱియును-ఇంతేగాక, కలయన్=ఎల్లయెడలను నిండుకొనునట్లు, గహనతలమున నెల్లన్=అడవిప్రదేశమంతటను, పెల్లుగాన్=అధికముగా, విల్లువేఁటకున్=విల్లుగొని వేఁటాడుటకు, ఏటు = ప్రయోగించిన బాణములయొక్క దెబ్బ, తప్పని మేటివిలుకాండ్రన్ = తప్పిపోకుండఁ బ్రయోగింపనేర్పుగల గొప్ప విలువిద్య నేర్చినవారలను, మృగఘ్నులు= మెకగులు, వెలువడుటకున్ = బయటవచ్చుటకు-వేఁటకాండ్రజాడగని పొదలలోఁ దాఁగినమృగము లేమఱి బయటవచ్చుటకనుట, హరి...ట్టులై-హరిచ్ఛద=పచ్చనియాకులయొక్క, ఛటా=సమూహముచేత, వృత=కప్పఁబడిన, శిరః=తలలును, కటీ=మొలలును, ధనుః=విండ్లయొక్క, కోటులై=కొప్పులునుగలవారై, వట్టికానిన్ = వేగరిని-మృగముల పోబడి తెలిసికొనివచ్చి చెప్పునట్టివానిననుట, చూపెట్టుకొని=చూచుచునుండి, ఎదురుమాటులు = ముందరితట్టుమఱుఁగులు, కాకుండన్=కాకుండునట్లు, ఉంచి=నిలిచి, చెదరి=కలఁతపడి, పారదెరువులన్=తప్పఁద్రోవలందు, పఱవక=పాఱిపోవక, ఉండన్=ఉండునట్లు, ఈరములసందుసందులన్ - ఈరముల=పొదలయొక్క, సందుసందులన్=నడుమనడుమ నుండుసందులందు, తమతమకట్టిన మోటకత్తులన్ = తమతమనడుముల నంటఁగట్టుకొన్న మడ్డుకత్తులచేత, ఒండొండ=ఒకటివెనుక నొకటిగా- క్రమముగా, ఖండితమ్ములు=నఱకఁబడినవి, అగుమండగలకంపమండలు=అయినతఱుచయిన రెమ్మలపఱపుగల ముండ్లకొమ్మలను, త్రోచి=అడ్డముగావేసి, మునుములన్ = మొగదలలయందు, కనుమలు=ఇఱుకుఁద్రోవలు, ఒనరించుకొనన్=చేసికొనునట్లు, పంచి=ఆజ్ఞాపించి, తానును=స్వకోచితానును, ఒక్కొక్కయెడన్=ఒక్కొకచోట, పాదచారియున్=కాలినడతో సంచరించువాఁడును, ఒక్కొక్కయెడన్=మఱియునొక్కొకచోట, తురగారూఢుండునై=గుఱ్ఱమునెక్కి తిరుగువాఁడునునై, ఎల్లెడలన్ = ఎల్ల దిక్కులందును, మెలంగుచున్=తిరుగుచును, కూఁతలు=కేకలు, ఎగయన్=వ్యాపింపఁగా, పణవ .. తూర్యంబులు- పణవ=ఉడుక, మృదంగ=మద్దెల, దుందుభి=పెద్దనగారా, ప్రముఖ=మొదలుగాఁగల, తూర్యంబులు=వాద్యములు, కొట్టించియున్=వాయింపించియు, కాహళులు = తుతారాలు, పట్టించియున్ = ఊఁదిం

అ. అత్తఱిన్ = ఆసమయమునందు, వేఁపికాండ్రు = కుక్కలవాండ్రు, యమునా ..కృతిన్ - యమునా = కాళిందీనదియొక్క, అంబు = నీళ్లయొక్క, తరంగపరంపరా = అలలవరుసలయొక్క, ఆకృతిన్ = ఆకారముతో - విధముతో, ముత్తరను = మూడువరుసలు, ఐనసూకరసముత్కరమున్ = అయినట్టి పందులసమూహమును, కని = చూచి, మోటుకాండ్రు = కపటపుమనుష్యాదిరూపముల మాటుచేసికొని వేఁటాడువారు, విల్లు = తమచేతివింటిని, ఎత్తకమున్న = పైకెత్తకముందే, రాజుమదికిన్ = రాజైనస్వరోచిమనసునకు, ఎక్కుడునట్లుగన్ = ఇష్టమగునట్లుగా, దీనిన్ = ఈపందులగుంపును, మిత్తికిన్ = మృత్యుదేవతకు, పుత్తము = పంపుదము - చంపుదమనుట, అటంచున్ = అని, బోరనన్ = శీఘ్రముగా, పట్టెడలు = మెడలకుఁగట్టియున్నతోలుపట్టెలను, డుయ్యన్ = దూయఁగా - వదలింపఁగా, భయంకరార్భటిన్ = భయముపుట్టించునట్టియఱుపులతో - పైపద్యముతో నన్వయము. అలం ఉపమ.

క. జాగిలములు మొఱసడములు, సాగెఁ గలసి చాపముక్తశరగతి నందా
జాగిలము లెదిరెఁ బందుల, కై గోధాదికము గాలికిఁ గడరె నితరముల్. 41

అ. జాగిలములు = పంది మొదలగువాని వేఁటాడెడు పెద్దకుక్కలును, మొఱసడములు = ఉడుము మొదలగువాని వేఁటాడెడిచిన్నకుక్కలును, కలసి = కూడి, చాప .గతిన్ - చాప = వింటివలననుండి, ముక్త = విడువఁబడిన, శర = బాణములయొక్క, గతిన్ = పోకవంటి పోకతో - మిక్కిలి వడితో, చాగెన్ = బారులుదీరినడచెను, అందున్ = ఆకుక్కలయందు, జాగిలములు = పందివేఁట కుక్కలు, పందులకై = పందులమీఁదికి, ఎదిరెన్ = ఎదుర్కొనెను, ఇతరములు = అన్యములు - ఉడుపకుక్కలు, గోధాదికముగాలికిన్ = ఉడుము మొదలైన వానిపసికి - పసిపట్టి యుడుము మొదలగువానిఁ బట్టుటకు ననుట, అడరెన్ = పూనెను. అలం నిదర్శన.

సీ. ఎగుచుకూఁతలు ముట్టెయెత్తి బిట్టాలించి, గమికిఁ గన్నాకయి గాలి యరయు
వడిఁగుక్క లంటంగ వచ్చిన మెడ ద్రిప్పి, ఘుర్ఘురించుచు బయల్ గొమ్ముఁ జిమ్ముఁ
దారసించినచోటఁ దారునఁ జొరఁ బాఱి, యొకటి రెంటిని దొబ్బ లురల నడుచుఁ
బాలచేరులు వట్టి తూలింప బలిమి నీ, డ్చుకొని డొంకలఁ దూఱి చుట్లఁ బెట్టు
నీఁటెపోటులఁ బడి ప్రేవు లీఁదులాడఁ, బోయి పోలేక దగ దొట్టి పాదలు సాచ్చి
బెండువడియును జొరనీదు వీఁట వెట్టి, చూపుల నెయేర్చుఁ బ్రజ నొక్క సూకరంబు.

అ. ఒక్కసూకరంబు = ఒకపంది, ఎగుచుకూఁతలు = వేఁటకాండ్రుతఱుముటకై వేయుకేకలను, ముట్టెయెత్తి = మోరపైకెత్తి, బిట్టు = శీఘ్రముగా - బాగుగాననుట, ఆలించి = విని, గమికిన్ = తమగుంపునకు, కన్నాకు = అగ్రేసరము - ముందునడచునది, అయి, గాలియరయున్ = మనుష్యులపసిపట్టును, వడిన్ = వేగముతో, కుక్కలు = వేఁటకుక్కలు, అంటంగవచ్చినన్ = కదియరాఁగా, మెడ = కంఠమును, త్రిప్పి = వెనుకకుఁద్రిప్పి, ఘుర్ఘురించుచున్ = గురగురలాడుచు, బయల్ = ఏమియులేనిబయలియందే, కొమ్మున్ = కోఱకొమ్మును, చిమ్మున్ = విసరును, తారసించినచోటన్ = కుక్కలు మిక్కిలిసమీపించినప్పుడు, దారునన్ = తటాలున, చొరఁబాఱి = వానిపైకిఁ జొచ్చుకొనిపోయి, ఒకటిరెంటిన్ = ఒకటినో రెంటినో కుక్కలను, దొబ్బలు = మాంసపుఁగండలు, ఉరలన్ = వానిదేహమునుండి తెగిపడునట్లు, అడుచున్ = కొమ్ముతోఁగొట్టును, పాలచేరులు = గజ్జలనరములను, పట్టి = కఱచిపట్టి, తూలింపన్ = కుక్కలు చలింపఁ

సేయఁగా-బాధింపఁగా ననుట, బలిమిన్=బలముతో, ఈడ్చుకొని= అనుక్కొనుచు లాగుకొని, తోంకలన్=పొదకట్టుపల్లపుమార్గములందు, తఱటి=చొచ్చి, చుట్లఁబెట్టుక్=త్రిప్పులఁబెట్టును, ఈఁటెపోటుల్=ఈఁటెలతో వేఁటకాండ్రుపొడుచుపోట్లచేత, పడి=వెడలఁబడి, క్రేవులు = కడుపులోని క్రేఁగులు, ఈఁదులాడన్=వ్రేలాడఁగా, పోయి=కొంతదూరముపోయి, పోలేక = అవితలఁబోఁజాలక, దగ=దప్పి, తొట్టి=వ్యాపించి-కలిగియనుట, పొదలు-పొదరులను, చొచ్చి=చొరఁబడి, బెండు వడియున్=బలహీనతనొందియు, పీఁటవెట్టి=పాదుకొని కదలక కూర్చుండి, ప్రజన్=జనమును-వేఁటకాండ్రను, చొరనీదు=దగ్గఱరానియ్యదు, చూపులనె = చూచుటలచేతనే, ఏర్చున్=కాల్చును-ఎఱ్ఱనికోపపుఁజూపులతో జనులను గాల్చునట్లుచూచుచుండె ననుట. అలం. స్వభావోక్తి.

క. అట్టియెడ నొకవరాహము, బిట్టడిచిన మెఱసెఁ గుక్కక్రేవులు దంష్ట్రిం
జుట్టుకొని రొంపిఁ గలఁపఁగ, నిట్టలముగఁ దగిలినట్టి యెఱ్ఱిలున్వోలెన్. 43

అ. అట్టియెడన్=ఆసమయమునందు, ఒకవరాహము=ఒకపంది, బిట్టు=గట్టిగా, అడిచినన్=కొట్టఁగా, కుక్కక్రేవులు=ఒక కుక్కయొక్క క్రేఁగులు, దంష్ట్రిన్=ఆపందికోఱను, చుట్టుకొని=పెనఁచుకొని, రొంపిన్=బురదను, కలఁపఁగన్=కలియఁబెట్టఁగా, ఇట్టలముగన్= అధికముగా, తగిలినట్టి యెఱ్ఱిలువోలెన్=కోఁకుఁజుట్టుకొన్న యెఱ్ఱిలో యనునట్లు, మెఱసెన్=ప్రకాశించెను -అనఁగా, ఒక పంది తనమీఁదికివచ్చినకుక్కను గడుపు చీలునట్లు కోఱకొమ్ముతోఁగొట్టఁగా నాకొమ్మునందు బురద కలియఁబెట్టునప్పుడు చుట్టుకొన్న యెఱ్ఱిలో యను నట్లాకుక్కకడుపులోని క్రేఁగులు చుట్టుకొనియుండె. అలం ఉత్ప్రేక్ష.

మ. హరిణం బొక్కటి కుక్కతండముఁ బుళిందానీకముం ద్రోచి యు
ర్వరఁ గాలూఁదక దాఁటు నేటులవికిన్ వాహంబు నడ్డంబు నూ
కి రసావల్లభుఁ డేసె భల్లమున నింగిం గాళ్లు జోడించుచో
గొరిజల్ నాలుగుఁ ద్రెవ్వ సేన పొగడెం గోదండపాండిత్యమున్. 44

అ. హరిణంబొక్కటి = ఒకజింక, కుక్కతండమున్=కుక్కలసమూహమును, పుళిందానీకమున్=బోయలగుంపును, త్రోచి=అతిక్రమించి, ఉర్వరన్=నేలమీఁద, కాలూఁదక= అడుగుమోపక, దాఁటన్=ఎగురఁగా, ఏటులవికిన్=బాణముప్రయోగింపవాటమగుటకు, వాహంబున్=గుఱ్ఱమును, అడ్డంబు=అడ్డముగా, నూకి=తోలి, రసావల్లభుఁడు=భూపతి-స్వరోచి, నింగిన్ = ఆకాశమునందు, కాళ్లు=కాళ్లను, జోడించుచోన్=ఆజింక కూడఁదీసికొనెడి సమయమునందు, గొరిజల్=గిట్టలు, నాలుగున్=నాలుగును, త్రెవ్వన్=త్రెగునట్లు, భల్లమును=బాణమును, ఏసెన్=ప్రయోగించెను. (అప్పుడు) కోదండపాండిత్యమున్=అతనికిఁగలవిలువిద్యయందలి నేర్పును, సేన=అతనిదండు, పొగడెన్=స్తోత్రముచేసెను -అనఁగా, ఒకజింక కుక్కలకు వేఁటకాండ్రకుఁ జిక్కక కాళ్లు నేలసోఁకనీక యాకాశమున నెగిరిపోవుచుండఁగా, నది యెగిరినసమయమునం దొక్కటిగాఁ జేర్పఁబడినదానినాలుగుకాళ్లగిట్టల నొక్క బాణముచేతనే తెగనఱికెను. అందులకు మెచ్చుకొని సైనికులందఱు నతనివింటినేర్పును గొనియాడిరని తాత్పర్యము.

క. పఱచునొకకడిఁ బలితముకుఁ, జెఱమలకై యేయఁ జిప్పిచినుఁగఁగ నది యు
క్కఱఁ గాఁడి దుస్సి పాఱిన, నఱిమిఱిఁ జాపరువువాఱి యల్లటు వడియెన్. 45

అ. పతి=రాజు-స్వరోచి, పఱచునొకకడితిన్ = పరుగెత్తిపోవుచున్నయొకకణితిని, ముక్కఁజెఱమలకై = ముక్కుపుటములకుసూటిగాఁ దాఁకునట్లు, ఏయన్ = బాణముప్రయోగింపఁగా, చిప్ప = చిప్పవంటిముక్కు సెముక, చినుఁగఁగన్ = చీలిపోవునట్లు, అది=ఆబాణము, కాఁడి=నాటి, ఉక్కఱన్ = చేవచెడునట్లు, దుస్సిపాటినన్ = దూసిపోఁగా, అజిముజిన్ = తత్తఱపాటుతో, చాపరువువాఱి = చావుపేరెమెత్తి, అల్లటువడియెన్ = ఎదుటఁ గొంతిదూరమునందుఁబడెను. - అనఁగా స్వరోచి పరుగెత్తుచున్న యొక్కకణితి యనుమృగమును ముక్కుఁజెఱమలు తెగ నేయఁగా నా మృగము కొంతదూరము మిక్కిలి వడిగాఁ బరుగెత్తి యంతట నెగిరిపడి చచ్చెను

మ. గవిలోఁ బెబ్బులి డాఁగి గ్రుడ్లు మెఱమంగాఁ గాంచి రా జేసె నే
య వడిన్ బాణము వెంటనే నిగిడి పైకేఁ గ్లేచి రానేసె రెం
డవకాండంబుఁ దదస్త్రముం గొనక డాయన్ వచ్చి కౌక్షేయక
ప్రవిభిన్నం బయి నేలఁ గూలెఁ బవిధారాభిన్నశైలాకృతిన్ 46

అ. బెబ్బులి = పెద్దపులి, గవిలోన్ = గుహయందు, డాఁగి = దాఁగి, గ్రుడ్లు=కనుగ్రుడ్లు, మెఱమంగాన్ =చలింపఁజేయఁగా-త్రిప్పిత్రిప్పి చూచుచుండఁగా ననుట, కాంచి=చూచి, రాజు=స్వరోచి, ఏసెన్ =దానిపై బాణము ప్రయోగించెను, ఏయన్ =బాణప్రయోగముచేయఁగానే, బాణము వెంటనే=ఆబాణమువెంబడినే, వడిన్ = వేగముతో, నిగిడి = సాగి, అట్లే=ఆవిధముగా, పైకిన్ = రాజుమీఁదికి, ఏచి=విజృంభించి, రాన్ = రాఁగా, రెండవకాండంబున్ = మఱియొక బాణమును ఏసెన్ =ప్రయోగించెను, తదస్త్రమున్ = ఆబాణమునుగూడ, కొనక=లక్ష్యముచేయక, డాయన్ = రాజుదగ్గఱ, వచ్చి, కౌక్షేయక ప్రభిన్నంబు=కత్తిచేతనఱకఁబడినది, అయి= ఐ, పవి.. కృతిన్ - పవిధారా=వజ్రాయుధముయొక్కయంచుచేత, భిన్న=భేదింపఁబడిన, శైలాకృతిన్ = కొండవిధమున, నేలన్ =భూమిమీఁద, కూలెన్ =పడెను.

తా. రాజైన స్వరోచి కొండగుహాలోఁ దాఁగి కనుగ్రుడ్లుత్రిప్పిత్రిప్పి చూచుచున్న పెద్దపులిని జూచి దానిపై నొక్కబాణమును బ్రయోగింపఁగా నాపులి యాబాణముతోనే యెగిరి మిక్కిలి వడిగొని రాజుమీఁదికివచ్చెను.అప్పుడతఁడు మఱియొక బాణమును బ్రయోగించియు నది దానిని సైతము లక్ష్యముసేయక దగ్గఱకురాఁగా తుద కతఁడు గత్తితో దానిని నఱికి చంపెను అలం ఉపమ, స్వభావోక్తియు

తే. క్రొవ్వి నడగొండకయివడి గునుకుచొక్క
యొంటిగాని మహీనాథుఁ డొదిఁగి యేయ
గొరక మేనుచ్చి ధరఁ గాఁడ శిరము విసరె
లే దసృక్పాన మనుచుఁ దెల్పెడు ననంగ. 47

అ. క్రొవ్వి = మదించి, నడగొండకయివడిన్ = నడచునట్టిపర్వతమోయనునట్లు, గునుకుచొక్క - గునుకు=చిఱుపరుగెత్తుచున్న, ఒక్కయొంటిగానిన్ = ఒకపందిని, మహీనాథుఁడు= రాజు - స్వరోచి, ఒదిఁగి=ఎదురుచొలఁగి, ఏయన్ = బాణమును బ్రయోగింపఁగా, గొరక = ఆప్రయోగింపఁబడిన బాణము, మేనుచ్చి = దేహమునందుండిదూసి, ధరన్ =భూమియందు, కాఁడన్ = నాటుకొనఁగా, అసృక్పానము = నెత్తురుత్రాగుట, లేదు=కలుగలేదు-నీబాణము నా నెత్తురు త్రాగలేదు, అనుచున్ = అని, తెల్పెడున్ = తెలియఁజేయుచున్నదో, అనఁగన్ =అనునట్లు, శిరము =తలను, విసరెన్ =ఆడించెను.

తా. ఒక బలిసినపంది గున్నగునపరుగెత్తుచుండఁగా రాజు దానిఁజూచి యొక నారసమును బ్రయోగింపఁగా నది యాపందిదేహమునందుండి యావలికి దూసిపోయి నేల నాటుకొనఁగా నాపంది తల విసరి నేలఁబడియెను. ఆతలవిసరుట యోరాజా నీవు ప్రయోగించినబాణము నా నెత్తురు పీల్వలేదని తెలుపుచున్నదో యన్నట్లుండెను బాణ మధికవేగముగా దూసికొనిపోయె నని భావము. అలం. ఉత్ప్రేక్ష.

తే. ఒక్కఁ డడుగెత్తి గొఱకవేయుచును డాఁచి,నట్టరిగి టెంకిఁగనిపీఁకఁబట్టుటయును
మృగయులందఱు నని వెల్వరించి నిశిత,కాండములఁ జెండి రొక్క పెద్దకారుపోతు.

అ. ఒక్కఁడు = ఒక బోయవాఁడు, అడుగెత్తి= కాలెత్తి- మెల్లగా నడచియనుట, గొఱక వేయుచుఁ = ఎనుములఱచినట్టు మెల్ల మెల్లగా నఱచుచు, (పా. పరకవేయుచుఁ = గడ్డిపోఁచలు పడవేయుచు,) అరిగి=పోయి, టెంకిఁ = (కారుపోతులయొక్క) వెంటపట్టునందు, ఒక పెద్దకారు పోతుఁ = పెద్దదయిన యొక కారుదున్నపోతును, కని= చూచి, డాఁచినట్టు=అక్కడ తాను దానిని దాఁచియుంచినట్టు-దాఁచిపెట్టినచోటికి దారితప్పక సూటిగానెట్లుపోవచ్చునో యట్లనుట, పీఁకఁ = పూనికతో, పట్టుటయుఁ = పట్టుకొనఁగా, మృగయులు=వేఁటకు వచ్చియున్న బోయువాండ్రు, అందఱుఁ = అంతమందియును, చని=(ఆకారుపోతుల వెంటపట్టునకు) పోయి, వెల్వరించి=దానిని వెలుపలికీడ్చి తెచ్చి, నిశితకాండములఁ = వాఁడిబాణములతో, చెండిరి=ఖండించిరి.

ఉ. ఆసమయంబునం జకితమై మెక మెవ్వనిమీఁదఁ బాఱె వాఁ
డేసినయమ్ము వమ్మయి మహిం బడ కొక్కటి కొండ చాలి పీ
తాసులఁ జేయ మెచ్చి వసుధాధిపముఖ్యుఁడు మోట్ల నున్న బా
ణాసనభృత్పుళిందులకు నర్థి నొసంగె నభీప్సితార్థముల్. 49

అ. ఆసమయంబునఁ = అప్పుడు, మెకము=మృగము, చకితమై=భయపడినదై, ఎవ్వనిమీఁదఁ = ఏవేఁటకానిమీఁద, పాఱెఁ = పరుగెత్తివచ్చెనో, వాఁడు=ఆవేఁటకాఁడు, ఏసినయమ్ము=ప్రయోగించిన బాణము, వమ్మయి=వ్యర్థమై, మహిఁ = భూమిమీఁద, పడక=గుఱిలప్పిపడిపోక, ఒక్కటికిఁ = ఒక మృగమునకు, ఒండ=ఒక్క బాణమే, చాలి=చాలినదై, పీతాసులఁ = (ఆమృగములను) పోయినప్రాణముకలవానినిగా, చేయఁ = చేయఁగా - చంపఁగాననుట, మెచ్చి= మెచ్చుకొని, వసుధాధిపముఖ్యుఁడు= రాజశ్రేష్ఠుఁడు - స్వరోచి, మోట్లఁ = కపటమనుష్యాకృతులమాటున, ఉన్న...లకుఁ - ఉన్న=ఉండిన, బాణాసనభృత్ = విండ్లుపూనిన, పుళిందులకుఁ = బోయలకు, ఈప్సితార్థములు=కోరినపదార్థములను, అర్థిఁ = ప్రీతితో, ఒసంగెఁ = ఇచ్చెను

తా. వేఁటకాండ్రు ఏమయి మటఁ బడ్డమృగముల నొక్కొక్కదాని నొక్కొక్క బాణముతోఁ దప్పక చంపఁగాఁజూచి వారి నేర్పునకు మెచ్చుకొని యందఱకుఁ దగిన బహుమానములిచ్చి మన్నించెను.

క. వలఁ బాఱినవానిని భటు, లలుఁగులపాలాడి రధిపుకై పట్టిరి బె
బ్బులి మహిష మెలుఁగు కిటి దో,ఱలు మొదలగువానిఁ గొన్ని కటిని వేఁటకరుల్.

అ. భటులు=బంట్లు- విల్లువేఁటకాండ్రు, వలకఁ = వలలోనుండిలప్పించుకొని, పాఱినవానిఁ = పరుగెత్తిపోయినమృగములను, అలుఁగులపాలాడిరి= బాణములపాలు చేసిరి- బాణములుప్రయోగించి చంపిరి. వేఁటకరుల్ = వేఁటకువచ్చినబోయలు, అధిపుకై = రాజునకుఁ గానుక పెట్టుటకై, (వలలోఁజిక్కుకొన్న

వానిని) బెబ్బులి=పెద్దపులి, మహిషము=కారుదున్నపోతు, ఎలుఁగు=ఎలుఁగుగొడ్డు, కిటి=అడవిపంది, తోఁడేలు=తోఁడేలు, మొదలగువానిన్=మొదలైనవానిని, కొన్నిటిన్=కొన్నిమృగములను, పట్టిరి=పట్టుకొనిరి.

తా. రాజసేవకు లైనవిలువేఁటకాండ్రు వలలోఁ దగులుకొని యావలను జించుకొని పాఱిపోవునట్టిమృగములను బాణములు ప్రయోగించి చంపిరి. వేఁటకాండ్రయినబోయలు రాజునకుఁ గానికపెట్టుటకై పెద్దపులి కారుదున్నపోతు పంది తోఁడేలు మొదలయిన క్రూరమృగములను ప్రాణముతోనే పట్టి తెచ్చిరి.

తే. మున్ను జాగిలములఁ గూడి చన్నయట్టి, యుడుపకుక్కలు కుందేళ్ల నుందురువుల
నుడుముల గ్రహింపఁ బుట్టలకడలఁ బొదల, గిరులసఱియలఁ బసివట్టి తిరుగుచోట.

అ. మున్ను=మునుపు, జాగిలములన్=పందుల వేఁటాడెడికుక్కలను, కూడి=చేరి, చన్నయట్టియుడుపకుక్కలు=పోయినయుడుములోనగువాని వేఁటాడెడికుక్కలు, కుందేళ్లన్=చెవులపోతులను, ఉందురువులన్=ఎలుకలను, ఉడుములన్=గోధికలను, గ్రహింపన్=పట్టుకొనుటకై, పుట్టలకడలన్=పుట్టలదగ్గఱను, పొదలన్=చెట్లపొదలయందును, గిరులసఱియలన్=కొండలయోరలయందును, పసివట్టి=ఎలుకమొదలగువానివాసన గనిపట్టి, తిరుగుచోటన్=సంచరించుసమయమునందు.

చ. బరవస మొప్పఁ గాలితడఁబాటుమెయిం గవిఁ దూఱి యొక్కకు
క్కురము దమంబులో వెరఁజి కోఱలచేఁ గబళించి పొట్టపెం
జెర నుడుమంచుఁ దెచ్చి కని చేవ దొఱంగక త్రుంచి వైచెఁ ద
ద్గురుబిరుదప్రమాదములకుం బతి మోదవిషాదశాలి గాన్. 52

అ. ఒక్కకుక్కురము=ఒకయుడుపకుక్క, బరవసము=పూనిక, ఒప్పన్=ఒప్పఁగా, గాలితడఁబాటు మెయిన్=పసిపట్టుటయందలి పొరపాటుచేత, గవిన్=గుహయందు, తూఱి=చొచ్చి, తమంబులోన్=చీఁకటిలో, వెరఁజి=జవిరి, కోఱలచేన్=కోఱపండ్లచేత, కబళించి=కఱచిపట్టి, పొట్టపెంజెరన్=పొట్టపెంజెరయనెడి పెద్దవిషసర్పమును, ఉడుమంచున్=ఉడుమనుకొని, తెచ్చి=పట్టి బయటికీడ్చి తెచ్చి, కని=చూచి, (పొట్టపెంజెరయని తెలిసికొని) తద్గురు ములకున్-తత్=ఆకుక్కయొక్క, గురు=అధికమయిన, బిరుద=శూరత్వమునకును, ప్రమాదములకున్=పొరపాటునకును, పతి=రాజు, మోదవిషాదశాలి=సంతోషముచేతను విచారముచేతను నొప్పినవాఁడు-సంతోషమును విచారమును బొందినవాఁడనుట, కాన్=అగుచుండఁగా, చేవ=ధైర్యసారమును, తొఱంగక=విడువక, త్రుంచి=కఱచి తునుకలుచేసి, వైచెన్=పాఱవేసెను.

తా. ఉడుపకుక్కలలో నొకటి యొకగుహలోఁ దూఱి పసిపట్టుటయందలి పొరపాటుచేత నొకపొట్టపెంజెరయను పెద్దపామును ఉడుమనెడి భ్రమచేఁబట్టి బయటికీడ్చుకొనివచ్చి పిమ్మట నది పామని తెలిసియు వెఱవక ధైర్యమువహించి దానిని దునుకలు తునుకలుగాఁ గఱచి పడవేసెను. అది రాజు చూచి కుక్కయేమఱుపాటునకుఁ బాము కఱచినయెడల బాధవచ్చియుండునే యనువిచారమును బాముకాటు తప్పించుకొని తునుకలు చేసివేసినందులకు సంతోషమును బొందెను.

క. ఒడలుబ్బ నిక్కి ముఱిదఱి, యడుఁగులు ధర సూఁది చిందులనలబలమునకున్
జడియ కొకగబ్బిగండె, క్కుడుఁ గడిమిం దివిచెఁ గ్రుంగి కొమ్ములయుడుమున్.

అ. ఒకగబ్బిగండు=గర్వముగల యొకబలిసినమగపుక్క, ఒడలు=దేహము, ఉబ్బన్=ఉత్సాహముచే నుప్పొంగఁగా, నిక్కి=నిగిడి, ముందటియడుగులు=ముందటివైనకాళ్లు, ధరన్=భూమియందు, ఊఁది=అదిమిపెట్టి, చిందునలబలమునన్=వ్యాపించునట్టిసందడికి, జడియక=వెఱవక, ఎక్కుడుఁగడిమిన్=అధికశౌర్యముతో, క్రుంగి=ముందటికి క్రుంగి, కొమ్ములయుడుమున్=కొమ్ములుగల యొకయుడుమును, తివిచెన్=కలుఁగులోనుండి పట్టి పైకిఁదీసెను అలం స్వభావోక్తి.

తే. కంపతోడు గీడ్చిన ట్లేదు కానఁ జన్న
తెరు వెఱుంగుచు నొకఁ డేఁగి పరువుతోన
పడి యడఁగి యుండఁగాఁ బటపటన ముండ్లు
గాలిఁ గదలుటఁ గని పంత్రకోలఁ బొడిచె. 54

అ. ఒకఁడు = ఒకవేఁటకాఁడు, కానన్ = అడవియందు, ఏఁదు = ముండ్లపంది, కంపతోడుగు = ముండ్లమండలమోపును, ఈడ్చినట్లు = ఈడ్చుకొనిపోయినట్లు, చన్నన్=తనమేనిముండ్లు నేలరాచుకొనఁగాఁ బోవుటచేత, తెరువు = ఆయేఁదుఁబందిపోయినమార్గమును, ఎఱుంగుచున్ = తెలిసికొనుచు, ఏఁగి = పోయి, పరువుతోన = పరుగెత్తిపోవుటతోనే, పడి = ఒకమఱుఁగుతావునందుఁబడి, అడఁగియుండఁగాన్=ఉన్నతావు తెలియకుండున ట్లణఁగియుండఁగా, పటపటనన్=పటపటయను ధ్వనికలుగునట్లు, ముండ్లు = దానిమేనిముండ్లు, గాలిన్ = గాలిచేత, కదలుటన్ = చలించుటను, కని = చూచి, పంత్రకోలన్ = చిల్లలతోడి మూఁడునాలుగలుఁగులుగల యినుపకఱ్ఱతో, పొడిచెన్ = ఆయేఁదుబందిని గ్రుచ్చెను. అలం. ఉపమ.

వ. అత్తఱిం దత్తఱంబున మొత్తం బయి చోపుడుఁగోలలు గొని కెలంకులపొలంబులం బులుఁగులం జోపుచు డేగవేఁటకాండ్రు వేఱుపడి వేఁటాడం దొడంగిరందు.

అ. అత్తఱిన్=ఆసమయమునందు, డేగవేఁటకాండ్రు = డేగలతో వేఁటాడెడివేఁటకాండ్రు, మొత్తంబై=గుంపుగూడి, వేఱుపడి = తామొక మొత్తముగా నేర్పడి, తత్తఱంబునన్ = తొందరతో, చోపుడుఁగోలలు = పక్షులను లేవఁదోలెడుకఱ్ఱలను, కొని = తీసికొని, కెలంకులపొలంబులన్ = ఇరుగుపొరుగుప్రదేశములందు, పులుఁగులన్ = పక్షులను, చోపుచున్ = లేవఁదోలుచు, వేఁటాడన్ = వేఁటాడుటకు, తొడంగిరి = ప్రారంభించిరి, అందున్ = ఆవేఁటయందు

ఉ. లీలఁ బుళిందుఁ డొక్కఁడు గళిందసుతోర్మిసరోజినీదళాం
దోళితకోకరేఖఁ దనతోరపునల్లనిదీర్ఘబాహుపై
హాలహలంబపోలె విడియత్తెమునం దలయెత్తి చూచుబల్
సాళువముం వడిం జనుశశంబుపయిన్ విడిచెన్ మహోద్ధతిన్. 56

అ. పుళిందుఁడొక్కఁడు = ఒకబోయవాఁడు, లీలన్ = విలాసముగా, కళింద.. రేఖన్ – కళిందసుతా = యమునానదియొక్క, ఊర్మి = అలలయందలి, సరోజినీ = తామరతీఁగయొక్క, దళ = ఆకునందు, ఆందోళిత = ఊఁగులాడింపఁబడిన, కోకరేఖన్ = చక్రవాకపక్షివలె, తన.. బాహుపైన్ – తన = తనదైన, తోరపు = లావైన, నల్లని = నల్లనిదైన, దీర్ఘబాహుపై = నిడుపాటిచేతిమీఁద, విడియత్తెమునన్ = మెఱయుచున్న హస్తకవచముమీఁద, హాలహలంబపోలెన్ = కాలకూటవిషమువలెనే, తలయెత్తి = శిరస్సుమీఁదికెత్తి, చూచుబల్సాళువమున్=చూచుచున్న

పెద్దసాళువపుడేగను, వడిన్ = వేగముతో, చనుశశంబుపంయన్ = పోవుచున్న కుందేటిమీఁద, మహోద్ధతిన్ = మిక్కిలి యొగపుతో, విడిచెన్ = వదలెను - అనఁగా నొకబోయవాఁడు నల్లని లావైన నిడుపాటి తనచేతియందత్తెముపైఁ దలయెత్తి యూఁగులాడుచున్న సాళువపుడేగను వేగముగాఁ బరుగెత్తిపోవుచున్నకుందేటిపై విడిచెనని తాత్పర్యము (ఇందు యమునయందలి యలలతోఁ గిరాతుని బాహువునకును, తామరాకుతో నత్తెమునకును, ఆయాకుపైనున్న చక్రవాకపక్షితో డేగకును నుపమానోపమేయభావమని యెఱుంగునది.) అలం ఉపమ.

క. మొలదట్టిచెఱఁగుఁ జెక్కుచు, బలుదిట్టకిరాతుఁ డొకఁడు పటువగు ముష్టిన్
సెలకట్టెఁ బట్టి వేఱొక, సెలకట్టెం గొట్టివైచెఁ జెమరుంగాకిన్. 57

అ. బలుదిట్ట = మిక్కిలిసమర్థుఁడైన, కిరాతుఁడొకఁడు = ఒకబోయవాఁడు, మొల. . చెఱఁగున్ - మొలదట్టి = నడుమునఁగట్టుకొన్న కాసెకోకయొక్క, చెఱఁగు = కొంగును, చెక్కుచున్ = ఎగదోఁపుకొనుచు, పటువు = దృఢము, అగుముష్టిన్ = అయినపిడికిట, సెలకట్టెన్ = సెలకట్టెయనెడి డేగను, పట్టి = పట్టుకొని, వేఱొకసెలకట్టెన్ = మఱియొకటిరెండైనయలుఁగు గలబాణముతో, చెమరుంగాకిన్ = చెమరుఁగాకి యనెడిపక్షిని, కొట్టివైచెన్ = కొట్టి నేలఁబడవేసెను. (ఇందు సెలకట్టె యనుదానికిఁ జిన్నకత్తి యని కొందఱర్థము వ్రాసియున్నారు నైఘంటికులు బాణమని యర్థము వ్రాసియున్నారు. జలకట్టె యనుపాఠము గ్రాహ్యము కాదు.)

సీ. పెనుదవ్వు దగదొట్టఁ జని రెట్ట పడఁగొట్టి, నుడువీధి బెళగువ్వ నొక్కయణుజు
ఱెక్కతాఁకున స్రుక్కి నిక్కి ప్రక్కలు నొక్కె, నుఱక కల్లేటి నొకకొక్కిరణంబు
పొదఁదూఱునొకమేటిపూరేటి వెలికిఁ బోఁ, దోలి కైకొనె నొక్కతోఁచిగాఁడు
తను నేలుదొరచిత్తమున మెచ్చఁ దీతువుఁ, జనిపట్టె బిట్టొక్కజాలెడేగ
విజ్జువిజ్జునఁ దన్నంగ విడువ కెలమిఁ, గఱకుటంఘ్రుల నిఱికించి కైజఁ గదలఁ
గఱికి నెఱినెఱికొలెమ్ముకయును విఱుగ, విఱిచె వడిఁ గైజునొక పెద్దవేసడంబు.

అ. ఒక్కయణుజు = అణుజనెడి జాతిడేగయొకటి, పెనుదవ్వు = బహుదూరము, దగదొట్టన్ = దప్పికలుగునట్టుగా, చని = (తఱుముకొని) పోయి, ఉడువీథిన్ = ఆకాశమార్గమునందు, బెళగువ్వన్ = పావురాపక్షిని, రెట్టపడన్ = మలముజాఱునట్లుగా - పాఱుకొనిచచ్చునట్లుగాననుట, కొట్టెన్ = ప్రహరించెను. ఒకొక్కిరణంబు = ఓరణమనెడియొకజాతిడేగయొకటి, ఱెక్కతాఁకునన్ = తనఱెక్కసోఁకుటచేతనే, స్రుక్కన్ = ముడుఁగుకొనునట్లు, ఉఱక = లక్ష్యముచేయక, కల్లేటిన్ = కల్లేడనెడుపక్షిని, నిక్కి = నిగిడి, ప్రక్కలునొక్కె = పార్శ్వములు కదియఁబట్టి యొత్తెను. ఒక్కతోఁచిగాఁడు = మఱియొకజాతిడేగయొకటి, పొదన్ = పొదరునందు, దూఱు . . రేటిన్ - దూఱు = మఱుఁగుసొచ్చుచున్న, ఒకమేటిపూరేటిన్ = శ్రేష్ఠమయిన యొకపూరేడనెడుపిట్టను, వెలికిన్ = బయటికి, పోఁదోలి = వెడలఁదఱిమి, కైకొనెన్ = పట్టుకొనెను. ఒక్కజాలెడేగ = జాలె యను జాతిడేగయొకటి, తను నేలుదొర = తన్నుఁ బోషించునట్టియధికారి, చిత్తమునన్ = మనసునందు, మెచ్చన్ = మెచ్చుకొనునట్లు, చని = పోయి, తీతువున్ = తిత్తిరిపక్షిని, బిట్టుపట్టెన్ = గట్టిగాఁబట్టెను. ఒక పెద్దవేసడంబు = వేసడమనెడియొకజాతి పెద్దడేగయొకటి, కైజున్ = కైజనెడిపక్షిని, విజ్జువిజ్జునన్ = విజ్జువిజ్జనననుకరణముతో, తన్నంగన్ = తన్నుచుండఁగాను, విడువక = వదలక, ఎలమిన్ = సంతోషముతో,

కఱకుటంఘ్రులన్ = కఠినములయిన కాళ్లయందు, ఇఱికించి=ఇఱుకఁబట్టి, గజ్జె = కాలికిఁగట్టిన మువ్వ, కదలన్ = చలింపఁగా, కఱికి= ఒరపిడిచేసి, నెఱినెఱికోలెమ్ముకయును=ప్రతిఱెక్కయొక్క పెద్దయెముకయు, విఱుగన్ = విఱిగిపోవునట్లు, వడిన్=వేగముతో, విఱిచెను.

తా. ఆడేగవేఁటయందు అణుజు ఓరణము తోఁచిగాఁడు జాలె నేసడము నవెడి పలుతెగలడేగలు బెలగువ్వ కల్లేడు పూరేడు తీతువు కైజు అనఁబడుపక్షివిశేషములను బట్టి కొట్టి చంపి తమ్ముఁ బెంచినవారి కిచ్చెను. స్వభావోక్తి

క. నింగికయి కుంచె యెత్తి వె, సం గోయని యార్వఁ బక్షసంహతిగాడ్పుల్
జెంగని మ్రోయఁ గుజాగ్రపుఁ, గొంగల నొకలగుడు డిగ్గి కొట్టె నిలఁబడన్. 59

అ. కుంచె = తోఁకయీఁకలకుచ్చును, నింగికయి = ఆకాశముతట్టునకు, ఎత్తి= పైకెత్తి–ఎత్తి వీచి విడిచియనుట, వెసన్=వడిన్, కోయనియార్వన్ = కో యనుధ్వనితో వేఁటకాఁడు కేకలు వేయఁగా, ఒకలగుడు=లగుడ నెడిరెక్కజాతిడేగ, పక్షసంహతిగాడ్పులు=ఱెక్కలసమూహముయొక్క వాయువులు, జెంగని=జెంగనుధ్వనితో, మ్రోయన్=ధ్వనింపఁగా, డిగ్గి= ఆకాశముతట్టునుండి దిగువకు వచ్చి, కుజాగ్రపుఁగొంగలన్ = మ్రానికొననున్న కొంగలను, ఇలఁబడన్ = నేలమీఁదఁబడునట్టుగాఁ గొట్టెను. అలం. స్వభావోక్తి.

వ. ఇట్లాఖేటఖేలనంబున వివిధమృగవిహగవధం బాచరించి చాలించి యంచెలంచెలం బంచతాపతితచమరసృమరకిరిహరిణరురు మహిషపృషదంశగోధికాశశపిశిత ఖండంబు లొండొండ యువ్వెత్తుగా నాఁకఁ బొత్తరలంగట్టియు గుదులుగుట్టియుఁ జిక్కంబులనించియుఁ గావడులనుంచియు నవరించి దిగదిగనవిసరి బగబగన మంసు చిదుఁగుసొదమంటల కడ్డంబునట్టి మీసంబులు చూఁడిసూఁడి వాఁడు లగుకత్తులం దిత్తులొలిచి కుత్తుకలు గోసి శితముఖంబు లగుసఖంబులం జెకలించి విపులవపురపహసితమహాశైలంబు లగుశార్దూలంబులబొందుల నందంద పడవైచి యంతంతఁ గాంతారంబున దంతురంబుగాఁ బడినదంతావళంబులదంతంబులు గైకొనియుఁ దత్కుంభనిర్గతమౌక్తికంబు లేఱికొనియు గోజంబుం జమరవాలంబుల బర్హిబర్హంబులం బరిగ్రహించియు మరలి యత్తఱి గడిందినెత్తురుం బ్రోగ్గగుట వెలిచఱవం జఱవ నేదుపెనుముండ్లఁబండ్లసరియలు నెఱియలు వాఱి బోరసం గాఱుధారాళరుధిరాసారపూరంబు నాకినాకి నాలుకలు దిగవైచి యేచినమహాతపోష్ణంబునం దృష్ణ వొడమి దగనిగుడ వగ రఁటిరి యొడలం దాఁడలను మొగలను బెడిదంపునిడుదకోఱల సలుగు లడిచినయెడలం బొడబొడను వెడ లెసనుమఁకు నెత్తుటం బడలి తూలుకొలేయుకమ్ములయుంగమ్ము లార్ద్రకర్పటంబులం గప్పి దప్పినిగుడ నప్పొలంబుపశ్చిమపుదండ నుండు వెండికొండబండలఁ జండకరకరహిండనంబునం బొండుప్రభలు నిండి పఱచుతఱచు సెలయేఱులసూరెలం గాఁచుకొనుభూరుహాని కాయంబుల డాయంజని తద్ఘనచ్ఛాయల నిలిచి యచ్చటం గ్రొచ్చి గరువు నేలల గుంట లొనరించి లోన నుమ్మగిలి గబ్బు వలపక కమ్మతావులు గలనావునా

కులు వఱచి యొఱచిలో మేలేటి కారిజముం గందనకాయ క్రొవ్వు మొదలగు మిగులమెత్తనిపలలభిత్తంబు లందుఁ గ్రందుకొనం గ్రుక్కి యెక్కువతక్కువలు గాకుండఁ గండగలతింత్రిణీశలాటుసంఘాతంబు లామీఁద నెఱయం బచరించి యొసరుగాఁ జేటలగు లేటినల్లలు గుమ్మరించి లవణకణసంచయంబు నించి లావుగాఁ గావుగప్పి యుపరిప్రదేశంబులఁ గారెనుపపెంటపట్ల నీరాజునేఱుఁబిడుకల దాళ్లిడి నెల్లికొయ్యలు ద్రచ్చి నుచ్చు లంటించినం బెచ్చువెరుఁగుచిచ్చు లాత్రంపులం దవిలించి చిముడ నుడికిన వెలువరించి యుప్పువెప్పనుం గలయప్పిశితఖండంబులు గనగననినిప్పులం జమురు చిప్పిలం గాల్చినకమ్మకఱకుట్లుం జత్రాతిపయిఁ గాత్రేసినికిం గుడుపువెట్టి పిదపఁ బాళ్లవెంబడిం బంచుకొని తారు నుపయోగించి తద్దేవతాప్రీతికై తలల దోఁకలు డొక్కలు నచటివిటపివిటపంబుల వ్రేలం గట్టి శిశిరమధురసలిలమ్ములు ద్రావి వాగురికులు విశ్రమింప నిలింపాంగనాసుతుండును సహాసమాగతచతురవలలకృతపలలఫలమూలాదిశుచిమధురమృగయోచితాహారంబులం దృప్తి వహించి పరిజనారచితపల్లవాసనాసీనుండై గంధూషితపుండరీకమధురసాసారంబు లగునిర్ఝరానిలకిశోరంబు లోలయ నలయికలు దీఱ యున్నసమయంబున. 60

అ. ఇట్లు=ఈవిధముగా, ఆఖేటఖేలనంబునన్=వేఁటయనుక్రీడయందు, వివిధమృగవిహగవధంబు-వివిధ=నానావిధములయిన, మృగ=మెగములయు, విహగ=పక్షులయు, వధంబు=చంపుటను, ఆచరించి=చేసి, చాలించి=(వేఁట) సిలిపి,(కర్తృపదము వాగురికులు) అంచెలంచెలన్=అక్కడక్కడ, పంచతా.. బులు-పంచతా=చచ్చుటచేత, పతిత=పడిన, చమర=సవరపుమృగములు, సృమర=పెద్దజాతి సవరపుమృగములు, కిరి=పందులు, హరిణ=జింకలు, రురు - నల్లచాఱలదుప్పులు, మహిష = కారెనుఁబోతులు, పృషదంశ=జంగుఁబిల్లులు, గోధికా=ఉడుములు, శశ=కుందేళ్లు, పిశితఖండంబులు = (వీనియొక్క) మాంసపుఁదునుకలను, ఒండొండ=వేఱువేఱుగా, ఉద్వృత్తుగాన్ = నిశ్శేషముగా, ఆకుఁబొత్తరలన్=మడఁతపెట్టఁబడిన యాకులందు, కట్టి=పొట్లముగాఁగట్టి, గుదులుగుట్టియున్=వ్రేలుసరములుగాఁ గూర్చియు, చీక్కంబులన్=ఉట్లయందు (లేక) సన్నత్రాళ్లతో నల్లినచిల్లులసంచులందు, నించియున్=నిండించియు, కావడులన్=కావళ్లలో, ఉంచియున్=పెట్టియును, సవరించి=జతపఱచుకొని, దిగదిగనన్=దిగదిగయనునట్లు, విసరి=గాలిగలుగఁబట్టబోనగుదానితో విసరి, బగబగనన్=బగబగ యను ననుకరణముతో, మండుచిదుఁగు సొదమంటలకున్=మండునట్టి సన్నపుల్లలచిచ్చుమంటలకు, అడ్డంబువట్టి=అడ్డముగా వ్రేలఁబట్టి, మీసంబులు, చూఁడిసూఁడి=కాల్చికాల్చి, వాఁడులు=పదునుకలవి, అగుకత్తులన్=అయినట్టికత్తులతో, తిత్తులొలిచి=చర్మములూడఁదీసి, కుత్తుకలు=గొంతులు, కోసి = నఱికి, నిశితముఖంబులు=వాఁడిమొనగలవి,అగునఖంబులన్=అగునట్టిగోళ్లను, పెకలించి=ఊడఁబెఱికి, విపుల.. శైలంబును-విపుల=పెద్దవైన, వపుః=దేహములచేత, అపహ్నసిత=నవ్వఁబడిన-తిరస్కరింపఁబడిన, మహాశైలంబులు=దొడ్డపర్వతములుగలవి-పెనుఁగొండలవంటి పెద్దపెద్దయాకృతులుగలవి యనుట, అగు.. బొందులన్-అగు=అయిన, శార్దూలంబుల=పెద్దపులులయొక్క, బొందులన్ = కళేబరములను, అం

దంద=అక్కడక్కడనే-ఎక్కడెక్కడ నవి చచ్చి పడియుండునో యక్కడక్కడ నేయనుట, పడవైచి=ప్రోగుపడవేసి, (పులినిజంపిన వేటకాఁడు దానిమీసాలు కాల్చివేయవలయును. కాల్చివేయని పక్షమున నెవరైన నామీసములను సంగ్రహించి పరమాన్నములోవేసి వండి తమకు గిట్టనివారికిఁ బెట్టుదురు ఆపరమాన్నము భుజించినవారు విష మెక్కి తోడనే చత్తురని చెప్పుదురు. కనుక నిచట మీసాలుకాల్చి ప్రోగుపడవేసిరని చెప్పఁబడెను.) అంతంతన్=అంతటంతట-కొంతకొంతదూరమునందనుట, కాంతారంబునన్ = అడవియందు, దంతురంబుగాన్ = దట్టముగా, పడినదంతావళంబులదంతంబులు=పడియున్న యేనుఁగులయొక్క కొమ్ములను, కైకొనియున్=తీసికొనియు, తత్కుంభనిర్గతమౌక్తికంబులు=ఆయేనుఁగుల కుంభస్థలములనుండి బయలువెడలిన (రాలిన) ముత్యములను, ఏరికొనియున్ = ఏర్పఱిచియెత్తుకొనియును, (ఏనుఁగుకుంభస్థలములందుఁ బుట్టెడిముత్తెములు ఉసిరికకాయలంతేసిగా నుండునని రత్నశాస్త్రమునందుఁ జెప్పఁబడియున్నది ముత్తెములుపుట్టెడిచోట్లు తొమ్మిది. అవి-ఏనుఁగుతల, మేఘము, పందికోఱ, శంఖము, ముత్తెపుఁజిప్ప, చేఁపతల, పాముపడగ, చెఱకు, వెదురు. ఇందు మనకు లభించునవి ముత్తెపుఁజిప్పలోఁ బుట్టునవియే) గోఱజంబున్=గోరోజనమును-(ఇది మృగముల కడుపులోనుండి యెత్తెడివస్తువిశేషము దీనిని జేఁతికట్ల యనియుఁ జెప్పెదరు) చమరవాలంబులన్=సవరములను, బర్హిబర్హంబులన్=నెమిలిపురులను, పరిగ్రహించియున్=సంగ్రహించుకొనియును, మరలి=మరలఁబడి, అత్తఱి=ఆసమయము, కడింది నెత్తురుంబ్రొద్దు=మిక్కిలి యెఱ్ఱగానెలుఁగునట్టి ప్రొద్దు-మధ్యాహ్నకాలము, అగుటన్=అవుటచేత, వెఱవెఱవం జఱవన్ = భయముకలుగఁగాఁ గలుగఁగా-మిక్కిలిభయంకరమయి యెండయాక్రమింపఁగా, ఏఁదుపెనుముండ్లన్ = ముండ్లపందుల పెద్దముండ్లచేత, పండ్లసరియలు = పండ్లచిగుళ్లు, నెఱియలువాఱి=బ్రద్దలుబ్రద్దలుగాఁజీలి, బోరనన్ = అధికముగా, కాఱు...పూరంబు-కాఱు=స్రవించుచున్న, ధారాళ=అడ్డములేని, రుధిర=నెత్తుటియొక్క, ఆసార=ఎడతెగనిధారలగలవి, పూరంబు=ప్రవాహమును, నాకినాకి=పలుమాఱునాకి, నాలుకలుదిగవైచి=నాలుకలువ్రేలవేసికొని, ఏచిన మహాతపోష్ణంబునన్=అతిశయించిన దొడ్డ యెండకాఁకచేత, తృష్ణ=దప్పి, పొడమి=పుట్టి, దగ=తాపము, నిగుడన్=వ్యాపింపఁగా అతిశయింపఁగా, ఎగరు=రొఁజు, అడరి=కినిసి, ఒడలన్=దేహములందును, తొడలన్=ఊరువులందును, మెడలన్=కంఠములయందును, నలుగులు=అడవిపందులు, బెడిదంపునిడుదకోఱలన్=తీక్ష్ణములైననిడువాటి కోఱకొమ్ములతో, అడచినయెడలన్=గొట్టినతావులందు, బొడబొడను=బొడబొడయను ననుకరణధ్వనితో, వెడలెడు నుడుకునెత్తుటన్=బయలుదేఱుచున్న వేఁడినెత్తుటిచేత, బడలి=డస్సి, తూలుకౌలేయకమ్ముల యంగమ్ములు-తూలు = అదురుచున్న, కౌలేయకమ్ముల=కుక్కలయొక్క, అంగమ్ములు=దేహములను, (ఉడుకునెత్తురనుట చేత మిక్కిలి యెండచే దేహము కాఁగియుండఁగా వెడలిననెత్తురని యెఱుంగునది) ఆర్ద్రకర్పటంబులన్=తడికప్పడువస్త్రములచేత, కప్పి=ఆచ్ఛాదనముచేసి, దప్పి=దాహము, నిగుడన్=అతిశయింపఁగా, అపరజలధి పశ్చిమపుదండన్=ఆయడవి పడమటిపార్శ్వమునందు, ఉండువెండికొండబండలన్=కలిగిన కైలాసపర్వతముయొక్క చాఁపఱాళ్లయందు, చండకరకరహిండనంబునన్ - చండకర = సూర్యునియొక్క, కర=కిరణములయొక్క, హిండనంబునన్=వ్యాపనముచేత, పాండుప్రభలు=తెల్లనికాంతులు, నిండి=నిండుకొని, పఱచు..సూరెలన్-పఱచు=ప్రవహించుచున్న, తఱచు = విశేషమయిన, సెలయేఱుల=కొండయేళ్లయొక్క, సూరెలన్=పార్శ్వములందు-తీరములందు, కాఱు..బులన్-కాఱుకొను=దట్టమగుచున్న, భూరుహ=వృక్షములయొక్క, నికాయంబులన్=సమూహములను, డాయఁజని=దగ్గఱఁ

బోయి, తద్ఘనచ్ఛాయలఁ=ఆవృక్షముల గొప్పనీడలయందు, నిలిచి=నివసించి, అచ్చటఁ=ఆప్రదేశమునందు, క్రొచ్చి=త్రవ్వి, గరువు నేలలఁ=మెరప నేలలయందు, గుంటలు=చిన్న చిన్న పల్లములు, ఒనరిచి=చేసి, లోనఁ=ఆగుంటల లోపలిభాగమునందు, ఉమ్మగిలి=ఆవిరిపట్టి, గబ్బువలవక=చెడ్డకంపుగొట్టక, కమ్మతావులు=మంచివాసనలు, కలనాపురాకులు=కలిగినగొల్లజిడ్డు తీఁగయాకులు, పఱచి = పఱపుగా నమర్చి, ఎఱచిలోఁ=మాంసమునందు, మేలు=మంచిదానిని, ఏటి=ఏర్పరించి, కారిజముఁ=కడుపులో నీరుతిత్తి క్రిందనుండెడి మాంసవిశేషమును, కందనగాయ=గుండెకాయ, క్రొవ్వు = మెదడు, మొదలగు మిగుల మెత్తని పలలఖిత్తంబులు=మొదలుగాఁగల మిక్కిలిమెత్తనైన మాంసఖండములను, అందుఁ=ఆనాపురాకులు పఱచినగుంటలయందు, క్రందుకొనఁ=నిండుకొనునట్లు, క్రుక్కి=అణఁచిపెట్టి, ఎక్కువతక్కువలు=న్యూనాధికములు, కాకుండఁ=కాకయుండునట్లు, కండ... బులు-కండగల=చక్కఁగా ముదిరిన, తింత్రిణీశలాటు = చింతకాయలయొక్క, సంఘాతంబులు=సమూహములను, ఆమీఁదఁ=ఆమాంసఖండములమీఁద, నెఱియఁ=అంతటను నిండుకొనునట్లు, పచరించి=పఱచి, ఎసరుగాఁ=ఎసటినీరుగా, తేటలు=తేటినవి, అగు లేటినల్లలు=అయినజింక నెత్తురులు, కుమ్మరించి=కడవలలో నుండిపోసి, లవణకణసంచయంబుఁ=ఉప్పుఁగండ్లసమూహమును-ఉప్పును, నించి=సరిపడఁబోసి, లావుగాఁ = దట్టముగా, కావుగప్పి=సందులేకుండు నట్లాకులు పఱచి మట్టితోఁగప్పి, ఉపరిప్రదేశంబులన్ = వానిమీఁదిభాగములందు, కారెనుపెంటపట్లఁ=కారెనుములు కుదురుకొనెడితావులందు, నీర్లాఱు నేఱుఁబిడుకలఁ = చక్కఁగా నెండియున్న యేఱుఁబిడుకల చేత, (ఏఱుఁబిడుక=కడివేసిన తావున నేయెండఁగా నేఱితెచ్చిన పిడుక.) దాల్లిడి=పేర్పులు పేర్చి, నెల్లికొయ్యలు=అగ్నిమంథపుఁగఱ్ఱలను, త్రచ్చి=మథించి, నుచ్చులు=మేఁకపెంట్రికలు, అంటించిరఁ=రగిలింపఁగా, పెచ్చువెరుఁగుచిచ్చులు=రగులుకొని వృద్ధిపొందిన నిప్పులు, ఆత్రంపులఁ = ఆదాళ్లయందు, తవిలించి=అంటించి, చిముడఁ = మెత్తపడునట్లు, ఉడికినఁ = పచనముకాఁగానే, వెలువరించి=ఆగుంటలలోనుండి బయటఁదీసి, ఉప్పువెప్పును=ఆవిరిపోక యుడికించుటచేనైన వేఁడిమిని, (పా అప్పువెప్పును=పచ్చియు వెచ్చియు), కలయప్పిశితఖండంబులు=కలిగిన యామాంసపుఁదునుకలను, గనగననినిప్పులఁ = గనగనమండుచున్న నిప్పులయందు, చమురు=మాంసపుఁదునుకలలోని నేయి, చిప్పిలఁ=వడియునట్లు, కాల్చిన కమ్మకఱకుట్లఁ- కాల్చిన = ఇనుపసలాకలకుగ్రుచ్చి వ్రేలఁబట్టి పక్వముగాఁగాల్చిన, కమ్మ=సంబారుచేర్చుటచేఁ బరిమళించుచున్న, కఱకుట్లఁ=శూల్యములతో-కట్టుతోఁగుట్టిన మాంసఖండములతో, (కఱుకుట్లు, కఱ్ఱుకుట్లు, కఱకుట్లు, కఱ్ఱకుట్లు అనియు వీనిని వాడుదురు) చట్రాతిపైఁ=ఒకచాఁపఱాతిమీఁద, (ఉంచి) కాత్రేనికిఁ=వనదేవతకు, (కాత్రేఁడు=శివుఁడు, అని యర్థమయినను నిచట వనదేవత యనుటయే యుక్తమని యిట్లర్థము వ్రాయనయ్యెను) కుడుపువెట్టి=ఆరగింపుచేసి-నివేదించి, పిదపఁ = తరువాత, పాళ్లవెంబడిఁ = తమతమభాగములచొప్పున, పంచుకొని=భాగించుకొని, తారును=తామును, ఉపయోగించి=భుజించి, తద్దేవతాప్రీతికై=ఆకాటేఱని ప్రీతికొఱకు, తలలు=(ఆమృగముల) తలలును, తోఁకలు=వాలములును, డొక్కలును=భుజములకుఁ దొడలకు నడిమి దేహభాగములును, అచటివిటపివిటపంబులఁ = అక్కడి మ్రాఁకుల కొమ్మలందు, వ్రేలంగట్టి=వ్రేలాడఁగట్టి, శిశిరమధురసలిలమ్ములు=చల్లనితియ్యనినీళ్లు, త్రావి=త్రాగి, వాగురికులు=వేఁటకాండ్రు, విశ్రమింపఁ = శ్రమదీఱఁ గూర్చుండఁగా, నిలింపాంగనాసుతుండును= దేవతాస్త్రీయయిన వరూథినికొడుకును- స్వరోచియు, సహా . బులఁ - సహ=తనతోఁగూడ, సమాగత=వచ్చిన, చితుర=నేర్పరులయిన, వలల=వంటవాండ్రచేత, కృత=వంటచేయఁబడిన, పలల = మాంసము,

ఫల=పండ్లు, మూల=వేళ్లుదుంపల్లు, ఆది=మొదలుగాఁగల, శుచి=పరిశుద్ధములైన, మధుర=రుచికరములయిన, మృగయా=వేఁటకువచ్చిన సమయమునను, ఉచిత=తగిన, ఆహారంబులన్ = భోజన పదార్థములచేత, తృప్తివహించి=భోజనతృప్తినిబొంది- తృప్తిగాభుజించి యనుట, పరి . సీనుండై-పరిజన=పరివారజనులచేత, ఆరచిత=చక్కఁగాఁ బఱపఁబడిన, పల్లవ=చిగురుటాకులచేసైన, ఆసన=పీఠమునందు-పఱుపునందు, ఆసీనుండై=కూర్చున్నవాఁడై, గండూషిత...సారంబులు-గండూషిత=పుక్కిలింపఁబడిన, పుండరీక=తెల్లదామరలయందలి, మధురస=తేనెయొక్క, ఆసారంబులు=జడికలవి-తెల్లదామరలలోని మకరందముమీఁదుగా వీచుచున్నవనుట, అగునిర్ఝరానిలకిశోరంబులు=అగునట్టి సెలయేళ్లమీఁదుగా వీచునట్టిపిల్లవాయువులు, ఒలయన్ = మీఁదసోఁకుచుండఁగా, అలయికలు=వేఁటవలనిశ్రమములు, తీఱి=నివారితమై, ఉన్నసమయంబునన్ = ఉండినసమయమునందు. -పైపద్యముతో నన్వయము.

మత్తకోకిల. నిండెఁ గావిరి దిక్తటంబుల నింగిఁ గుండలిచండరు
చ్మండలిం గనుఁగొంచు మ్రోసెను మాలకాకులమూఁక ల
య్యండ నిల్చి యదల్చె నప్డు శివాళి యూళలఁ బద్మగ
ర్భాండభాండమ్ము ధూళిధూసరమయ్యె నుద్ధతవాత్యలన్. 61

అ. కావిరి=పొగవంటినల్లఁదనము, దిక్తటంబులన్ = దిక్ప్రదేశములందు, నిండెన్ = నిండుకొనెను, నింగిన్ = ఆకాశమునందు, కుండలి . మండలిన్ - కుండలి=గాలిగుడితోడి, చండరుక్=సూర్యునియొక్క, మండలిన్ = బింబమును, కనుఁగొంచున్ = చూచుచును, మాలకాకులమూఁక లు= తలసయితమునల్లగానుండెడి బొంతకాకులగుంపులు, మ్రోసెన్ = కూసెను, అప్డు=ఆసమయమునందు,అయ్యండన్ = వారున్నచోటికిదాపున, నిల్చి=నిలఁబడి, శివాళి=నక్కలబారు, ఊళలన్ = కూఁతలచేత, అదల్చెన్ = అదల్చించెను- భయముపుట్టునట్లుకూసెననుట, ఉద్ధతవాత్యలన్ = హెచ్చి వీచుచున్నగాలిసమూహములచేత- మీఁదికెగురుచున్న సుడిగాలిచేతనని కొందఱు, పద్మగర్భాండభాండము=కుండవంటిబ్రహ్మాండము, ధూళిధూసరితము=దుమ్ముచే నించుకమాసినతెల్లవన్నెగలది, అయ్యెన్ = ఆయెను. (ఇందుఁ జెప్పఁబడిన కావిరినిండుట మొదలగునవి యరిష్టసూచకములని తెలియునది.)

క. ఆకొఱగాములఁ గనుఁగొని, శాకునికుం డొకఁడు లేచి సంభ్రమ మొదవన్
జ్యాకలితశరాసనుఁడై, వీఁకను సైనికులఁ దిట్టి విభుతో ననియెన్. 62

అ ఆకొఱగాములన్ = ఆదుర్నిమిత్తములను, కనుఁగొని=చూచి, శాకునికుండు=శకునలక్షణము నెఱిఁగినవాఁడు, ఒకఁడు, లేచి=కూర్చున్నతావునుండిలేచి, సంభ్రమము=తత్తఱపాటు, ఒదవన్ = కలుగఁగా, జ్యా కలిత శరాసనుఁడై= జ్యా=అల్లెత్రాటితో, కలిత=కూడిన, శరాసనుఁడై=విల్లుగలవాఁడై- ఎక్కుపెట్టినవిల్లు చేతఁ బట్టుకొన్నవాఁడై యనుట, వీఁకన్ = పూనికతో, సైనికులన్ = సేనాజనులను, తిట్టి, విభుతోన్ = రాజుతో, అనియెన్ = ఇట్లుపలికెను.- అనఁగా శకునలక్షణము నెఱిఁగినయొకపురుషుఁడాదుర్నిమిత్తములనుజూచి లేచి యెక్కుపెట్టినవిల్లు చేతఁబట్టుకొని సైనికులని ర్లక్ష్యముచేయుండఁదగునా యని కోపించి తిట్టి రాజుతో నొకమాటచెప్పెనని తాత్పర్యము.

క. తఱచుగ మెకములఁ బొరిగొను, మఱపున వచ్చితిమి దవ్వు మనపాల విటకి
త్తఱి నగునిమిత్తములు కృప, కొఱగా విడె మనకుఁ బెద్దకీడ వగు ననినన్.

అ. నృప=రాజా, తఱచుగన్ = అధికముగా, మెకములన్ = మృగములను, పొరిగొనుమఱపునన్ = చంపుటవలనిపరాకుచేత, ఇచ్చితిమి=ఇచ్చటికివచ్చితిమి, మనపాలము=మననివాసభూమి, ఇటకున్ = ఈప్రదేశమునకు, దవ్వు=దూరము, ఇత్తఱిన్ = ఈసమయమునందు, అగునిమిత్తములు=అగునట్టిశకునములు, కొఱగావు=యుక్తములుకావు, ఇదే=ఇదిగో- ఇప్పుడేయనుట, మనకు, పెద్దగొడవ=అధికమైనయాపద, అగున్ = కలుగును, అనినన్ = అని చెప్పఁగా- పైపద్యముతో నన్వయము.

మ. అతఁ డాస్ఫాలితసజ్యకార్ముకుఁడు వాహారూఢుఁడుం బార్శ్వ సం
భృతతూణాహృతచండకాండుఁడు దిశాప్రేంఖత్కటాక్షాంచల
ద్యుతిజాలుండును నై పుళిందభటసందోహంబుతోడన్ మహో
ద్ధతి నుండం జయలాభసూచకనిమిత్తంబుల్ మెయిం దోఁచినన్. 64

అ. అతఁడు = ఆస్వరోచి, ఆస్ఫాలితసజ్యకార్ముకుఁడును- ఆస్ఫాలిత = ప్రమోయింపఁబడిన, సజ్య=ఎక్కుపెట్టఁబడిన, కార్ముకుఁడును=విల్లుగలవాఁడును- విల్లెక్కుపెట్టి నారి ప్రమోయించినవాఁడనుట, వాహారూఢుఁడున్ = గుఱ్ఱము నెక్కినవాఁడును, పార్శ్వ కాంతుఁడును- పార్శ్వ=ప్రక్కను, సంభృత=చక్కఁగా వహింపఁబడిన, తూణ = అమ్ములపొదివలననుండి, ఆహృత = తీసికోఁబడిన, చండ=వాఁడియైన, కాండుఁడును = బాణములుగలవాఁడును, దిశా ..జాలుండును నై- దిశా= ఎల్లదిక్కులందును, ప్రేంఖత్ =ఎగురుచున్న - ప్రసరించుచున్న, కటాక్ష=కడగన్నులయొక్క, అంచల=కొనలయొక్క, ద్యుతిజాలుండును నై = కాంతిసమూహముగలవాఁడునై, పుళింద ..తోడన్ - పుళింద=కిరాతులైన, భట=బంట్లయొక్క, సందోహంబుతోడన్ = సమూహముతోఁగూడ, మహోద్ధతిన్ = మిక్కిలియాటోపముతో, ఉండన్ = ఉండఁగా, జయ...బుల్ - జయ= గెలుపుయొక్క, లాభ=ప్రాప్తిని, సూచక=సూచించునట్టి- కనఁబఱచునట్టి, నిమిత్తంబుల్ =శకునములు, మెయిన్ = దేహమునందు, తోఁచినన్ = కనఁబడఁగా- పురుషునికిఁ గుడికన్ను కుడిభుజము కుడితొడ యివి యదరుట శుభసూచకమందురు అట్టిశుభసూచకములు తోఁపఁగా ననుట.

తా. స్వరోచి యామాట వినుచునే యెక్కుపెట్టినవిల్లును బాణములతో నిండుకొని యున్న యమ్ములపొదలును దాల్చి గుఱ్ఱము నెక్కి వింటినారి ప్రమోయించి యమ్ములపొదిలోనిబాణమును జేతఁదీసికొని యెల్లదిక్కులు కలయఁజూచి బోయబంట్లుందఱుఁ దనవలెనే కట్టాయితమై నిలువఁగా నప్పుడు కుడికన్నదురుట కుడిభుజ మదురుట కుడితొడ యదురుట మొదలగుశుభశకునములు దేహమునందుఁ దోఁపఁగా

వ. ప్రాణరక్షాసంశయం బగుమహారణక్షోభం బొక్కటి గలుగు మీఁద నెట్టకేలకు
మితి వెట్టరానిజయమంగళంబు లగు నని యంతరంగంబున నిశ్చయించి యూఱ
డిలుసమయంబున. 65

అ. ప్రాణరక్షాసంశయంబు = ప్రాణములను గాపాడుకొనుటయే సందేహముగాఁగలది, అగు మహారణక్షోభంబు=అయినట్టిగొప్పయుద్ధపుఁగలఁతపాటు, ఒక్కటి=ఒకటి, కలుగును=ముందుగాఁ గలుగును, మీఁదన్ = తరువాత, ఎట్టకేలకు = అతిప్రయాసముచేత, మితిపెట్టన్ = ఇంతయని మేర యేర్పఱుప, రాని జయమంగళంబులు = శక్యముకాని గెలుపును మేలును, అగున్ =కలుగును, అని,

అంతరంగంబునన్ = మనసునందు, నిశ్చయించి = నిర్ణయించి, ఊఱడిలుసమయంబునన్ = మనసు నెమ్మదిపఱుచుకొనుసమయమునందు- మీఁదిపద్యముతో నన్వయము.

క. ఆవిపినాంతరమున హా, హా వనిత సనాథ నబలన్ నార్త విపన్నం
గావరె యీపుణ్యమునం, బోవరె యని పలుకునాఁడుమొఱ వినఁబడియెన్. 66

అ. ఆవిపినాంతరమునన్ = ఆయడవియందుండి, హాహా = అయ్యయ్యో, వనితన్ = ఆఁడుదానను, అనాథన్ = దిక్కులేనిదానను, అబలన్=బలములేనిదానను, ఆర్తన్ = పీడితురాలను, విపన్నన్ = ఇడుమనొందినదానను, కావరె=నన్నుఁగాపాడరయ్యా, ఈపుణ్యమునంబోవరె= ఈసుకృతమునకుఁ బాలుపడరయ్యా, అని, పలుకునాఁడుమొఱ = చెప్పుచున్న యాఁడుదాని దుఃఖముతోడి విన్నపము, వినఁబడియెన్ = విననయ్యెను.

క. ఆమొఱ వేమఱుఁ జెవి నిడి, భూమండలభర్త కరుణన్ బొడమఁగ నయ్యో
యే మానిని కెవ్వనిచే, నే మాయెనొ యనుచు నచటున్ నీక్షించుతఱిన్. 67

అ. భూమండలభర్త=భూవలయమునకునధిపతి-స్వరోచి, ఆమొఱ=ఆదుఃఖముతోడి విన్నపమును, వేమఱున్=పలుమాఱును, చెవినిడి=ఆలకించి-విని, కరుణ=దయ, పొడమఁగన్=పుట్టఁగా, అయ్యో, ఏమానినికిన్ = ఏస్త్రీకి, ఎవ్వనిచేన్ = ఏపురుషునిచేత, ఏమాయెనొ = ఏమిబాధకలిగెనో, అనుచున్ = అనుకొనుచు, అచటున్ = ఆమొఱవిన్నతట్టుప్రదేశమును, ఈక్షించుతఱిన్ = చూచునప్పుడు. -పైకన్వయము

శా. మట్టెల్ మ్రోయఁగ గబ్బిచన్నుఁగవ గంపం బంద వేణీభరం
బట్టిట్టై కటిఁ జిమ్మచీఁకటులు గాన్ నశ్రుప్రజం బోడిక
ల్గట్టం జూపులు చిమ్మిరేఁగి దివి రోలంబాళిఁ గల్పింపఁగా
మిట్టాడంగ నరుండు లేనియడవిన్ మీనాక్షి దీనాకృతిన్. 68

అ. మీనాక్షి=ఒకానొక స్త్రీ, మట్టెలు=కాలమెట్టెలు, మ్రోయఁగన్ = ధ్వనింపఁగా, గబ్బిచన్నుఁగవ=బిగువైనస్తనద్వయము, కంపంబు=వణఁకును, అందన్ = పొందఁగా, వేణీభరంబు = పెద్దదైనజడ, అట్టిట్టై=వీఁడియటునిటుఁజెదరి, కటిన్ = పిఱుఁదులప్రదేశముమీఁద, చిమ్మచీఁకటులు=దట్టపుఁజీఁకట్లు, కాన్ =క్రమ్ముకొన్నట్లుకాఁగా, అశ్రుప్రజంబు=కన్నీళ్లసమూహము, ఓడికల్ = ప్రవాహములుగా, కట్టన్ = ఏర్పడఁగా- ఎడతెగక వెల్లువయై పాఱఁగా ననుట, చూపులు=దృష్టులు, చిమ్మిరేఁగి=మిక్కిలిచెదరి, దివిన్ =ఆకాశమునందు, రోలంబాళిన్ =తుమ్మెదలబారును, కల్పింపఁగాన్ =కలుగఁజేయఁగా- బెదరుచూపులతో మీఁదుచూచుచు ననుట, మిట్టాడంగన్ = సంచరింపఁగా, నరుండు = మనుష్యుఁడు, లేనియడవిన్ = లేనట్టియడవియందు, దీనాకృతిన్ = దుఃఖమునొందినయాకారముతో -మీఁదిపద్యముతో నన్వయము.

తా. ఒకానొకయాఁడుది వేగముగా నడచుటచేతఁ గాలిమెట్టెలు గల్లుగల్లని ధ్వనింపఁగా జడ వీడి చీఁకటికమ్మినట్లు పిఱుఁదులపర్యంతము తలవెండ్రుక లావరింపఁగాఁ గన్నులఁ దఱుచుగా నీళ్లువిడుచుచు బెదరుచూపులతో మిన్ను చూచుచు జనసంచారము లేనియాయడవియందు దీనత్వముతో. అలం. స్వభావోక్తి.

క. ఒక్కఁతె భయశోకంబుల వెక్కుచు మెయిఁ గలవిలాసవిభ్రమ లక్ష్ముల్
దక్కఁటయును నొకయొఱపై, నెక్కొన ధరణీశు నెదుట నిలిచి వినీతిన్. 69

అ. ఒక్కఁతె=అట్టియాఁడుదియొకతె, భయశోకంబులన్ = వెఱపుచేతను దుఃఖముచేతను, వెక్కుచున్=వెక్కిలి విడిచినట్లు ధ్వనిగలుగ నేడ్చుచు, మెయిన్ = శరీరమునందు, కల...లక్ష్ములు-కల=కలిగిన, విలాస=ప్రియదర్శనముచేసైననడక చూపులోనగువానివలని శృంగారచేష్టావిశేషము యొక్కయు, విభ్రమ=మాటలయు నాభరణములయు విపర్యాసమువలని శృంగారచేష్టావిశేషము యొక్కయు, లక్ష్ములు=కలుములు, తక్కటయున్=లేకపోవుటయు, ఒకయొఱపై=ఒకవిధమైన సౌందర్యమై, నెక్కొనన్ = తనయందుఁ బొదుకొనఁగా, ధరణీశునెదుటన్ = రాజైనస్వరోచియెదుట, నిలిచి=నిలువఁబడి, వినీతిన్=వినయముతో,- పలికెన్ అని మీఁదిపద్యమునందుఁ గ్రియ.

తా. ఒక్కతె వెక్కివెక్కియేడ్చుచు విలాసవిభ్రమాదిశృంగారచేష్టలు లేకుండుటయు నొక్కయొప్పిదముగాఁ దోఁచుచుండఁగా స్వరోచియెదుటవచ్చి నిలిచి యిట్లు పలికెను. అలం. వినోక్తి

క. పలుచనివాతెఱమెఱుఁగునఁ, బలుమెఱుఁగులు సందడింపఁ బాపటపైనం
జలిఁ జేర్చి జళుకుఁజూపులఁ, బలుకులఁ బులకండ మొలుకఁ బలికెం గలఁకన్.

అ. పలుచనివాతెఱమెఱుఁగునన్ = సన్నని పెదవియొక్క కాంతివిశేషముతోడ, పలుమెఱుఁగులు=దంతములకాంతులు, సందడింపన్ = కూడి యతిశయింపఁగా, పాపటపైన్ = కేశవీథిమీఁద, అంజలిన్ = చేమోడ్పును, చేర్చి=కూర్చి, జళుకుఁజూపులన్ = బెదరుఁజూపులతోను, కలఁకన్=కలఁతపాటుతోను, పలుకులన్=మాటలయందు, పులకండము=కండచక్కెర-మాధుర్యమనుట, ఒలుకన్ = చిందఁగా, పలికెన్=ఒకమాట చెప్పెను. -అనఁగా నాస్త్రీ స్వరోచికి మ్రొక్కి మధురవాక్యములతోఁ దనవృత్తాంతము నిట్లు చెప్పఁదొడఁగెను.

శా. ఓరాజన్యమహేంద్ర యోమణిగణప్రోతాసివాతాశన
ప్రారజ్యత్కటిచక్ర యోముఖరశార్ఙ్గక్రూరబాహార్గళా
యోరుక్మాచలకల్ప యోకవచితవ్యూఢాంగ కావంగదే
యోరాహుత్తశిరోమణీ నిరవధిప్రోద్యత్ప్రతాపారణీ 71

అ. ఓరాజన్యమహేంద్ర = ఓరాజవంశశ్రేష్ఠుఁడా, ఓమణి...చక్ర-ఓ=ఓయి, మణిగణ = రత్నసమూహములచేత, ప్రోత=కూర్పఁబడిన, అసివాతాశన = పామువంటికత్తిచేత, ప్రారజ్యత్ = ప్రకాశించుచున్న, కటిచక్ర = చక్రాకారమయినపిఱుఁదులుగలవాఁడా, ఓ..బాహార్గళా- ఓ= ఓయి, ముఖర=మ్రోఁగుచున్న, శార్ఙ్గ=సింగిణివింటితోఁగూడిన, క్రూర=కఠినమయిన, బాహార్గళా= గడెమ్రాఁకులవంటి భుజములుగలవాఁడా, ఓరుక్మాచలకల్ప = ఓయిబంగారుకొండవంటివాఁడా - ధైర్యమునందును దేహకాంతియందును బంగారుకొండనుబోలినవాఁడా యనుట, ఓకవచితవ్యూఢాంగ=ఓయికవచముదొడిగినయున్నతదేహముగలవాఁడా, ఓరాహుత్తశిరోమణీ = ఓయిగుఱ్ఱపురౌతులలో శ్రేష్ఠుఁడా, నిరవధి . రణీ- నిరవధి=మేరలేని, ప్రోద్యత్=మిక్కిలి ప్రకాశించుచున్న, ప్రతాప = ప్రతాపాగ్నికి, అరణీ=నిప్పునుబుట్టించెడికఱ్ఱయైనవాఁడా, కావంగదే=రక్షింపవయ్యా.

తా. రాజవంశశ్రేష్ఠుఁడవును రత్నములు చెక్కినపిడితోడిపామువలెఁ గ్రూరమైనకత్తిని ధరించినవాఁడవును ఎక్కుపెట్టినసింగిణివింటిని మ్రోయించుచున్నవాఁడవును మేరుపర్వతమువలెఁ జలింపనిధైర్యమును బంగారుచాయగల యున్నతదేహమును గలవాఁడవును గుణ్యపురోతులలో శ్రేష్ఠుఁడవును మిక్కిలిప్రతాపముగలవాఁడవు నైనయోమహారాజా నన్ను రక్షింపుమనియెను. అలం. ఉపమ, రూపకమును.

క. అనినఁ దలంపున నింపిన, యనుకంప నిలింపచంపకామోదసుతుం
డనునయ మొప్పఁగ నోడకు, మని నిజవృత్తాంత మడుగ నది యిట్లనియెన్.

అ. అనినన్=అని యాస్త్రీ ప్రార్థింపఁగా, నిలింపచంపకామోదసుతుండు = సంపెఁగపువ్వు పరిమళమువంటి దేహపరిమళము గలదేవతాస్త్రీకొడుకు- స్వరోచి, తలంపునన్ = మనసునందు, నింపినయనుకంపన్ = నిండించినదయతో - మిక్కిలిదయతో ననుట, అనునయము = ఊఱడించుట, ఒప్పఁగన్ = ఒప్పుచుండఁగా, ఓడకుము=భయపడకుము, అని, నిజవృత్తాంతమున్ = దానిదైన వృత్తాంతమును, అడుగన్=అడుగఁగా, అది=ఆస్త్రీ, ఇట్లనియెన్=ఇట్లుపలికెను.

తా. ఆవచ్చినయాఁడుది యట్లు మొఱపెట్టి ప్రార్థింపఁగా స్వరోచి మిక్కిలి దయగలవాఁడై దానిని వెఱవకుమని యూఱడించి నీవృత్తాంతమేమి చెప్పుమనియడుగఁగా నది యీక్రిందఁజెప్పఁబోవురీతిని జెప్పెను.

సీ. విసుమానములు గాఁగ వసతోడఁ బెనవెట్టి, నెట్టెంబుగాఁ బ్రేవుఁ జుట్టినాఁడు
బండికందెనచాయ బైసిమాలినమేన, మెదడుగందపుఁబూఁత మెత్తినాఁడు
కునఖంపుడాచేతి పునుకకప్పెర నిండఁ, బ్రాణికోటులనల్లఁ బట్టినాఁడు
కొంకిబికివేసంపు గూనిమూఁపులమీఁద, మూఁడుపంగలయీఁటె మోపినాఁడు
నిట్టతాడనఁ బొడుపుచేత నిక్కినాఁడు, నిడుదకోఱల మిడిగ్రుడ్ల నెగడినాఁడు
నరవరోత్తమ నేఁడుమూఁనాళ్లనుండి,యుసుఱుగొన వెంటఁదిరిగెడు నసురయొకఁడు.

అ. నరవరోత్తమ = ఓరాజశ్రేష్ఠుఁడా, విసుమానములుగాఁగన్=వింతలుగా, (పా. విసమానములుగాన్ = హెచ్చుతక్కువలుగా.) వసతోడన్=క్రొవ్వుపొరతో, పెనవెట్టి= మెలిపెట్టి, నెట్టెంబుగాన్=గుండుతలపాగగా, ప్రేవున్=ప్రేఁగును, చుట్టినాఁడు=తలకుఁజుట్టుకొన్నాఁడు, బండికందెనచాయన్ = బండియిరుసునకుఁబూసెడి మసివన్నెవంటివన్నెచే, బైసిమాలినమేనన్=బాగుచెడినదేహమునందు, మెదడుగందపుఁబూఁత = మెదడనుచందనపుబురదను, మెత్తినాఁడు=దట్టముగాఁ బూసికొన్నాఁడు, కున...కప్పెర - కునఖంపు=పుప్పిగోళ్లుగల, డాచేతి=ఎడమచేతిలోని, పునుకకప్పెర=తలపుఱ్ఱచిప్ప, నిండన్ = నిండునట్లుగా, ప్రాణికోటులనల్లన్ = జంతుసమూహముల నెత్తుటిని, పట్టినాఁడు = పట్టుకొనియున్నాఁడు, కొంకిబికి = వికారమయిన, వేసంపు ..మీఁదన్ - వేసంపు=వేషముగల, గూని = మీఁదికుబుకునట్లువంగిన, మూఁపులమీఁదన్ = భుజశిరస్సులమీఁద, మూఁడుపంగలయీఁటెన్=త్రిశూలమును, మోపినాఁడు=పెట్టుకొన్నాఁడు, నిట్టతాడు=నిక్కి నిలిచినతాటిమ్రాను, అనన్=అనునట్లు, పొడుపుచేన్=ఉన్నతిచేత, నిక్కినాఁడు= నిగిడియున్నాఁడు, నిడుదకోఱలన్ = నిడుపాటివంకరప్రక్కపండ్లచేతను, మిడిగ్రుడ్లన్=మీఁదికుబికినకనుగ్రుడ్లచేతను, నెగడి

వాఁడు = అతిశయించినవాఁడు, అసురయొకఁడు=ఒకరాక్షసుఁడు, నేఁడుమూఁడునాళ్లనుండి=ఈదినము నకు మూఁడుదినములనుండి, ఉసుఱుగొనన్=నాప్రాణములు తీసికొనుటకై-నన్నుఁ జంపి తినుటకై యనుట, వెంటఁదిరిగెడున్=నావెంటఁ దిరుగుచున్నాఁడు-నన్ను వెంబడించి తిరుగుచున్నాఁడు.

తా. ఓరాజా! యొకరాక్షసుఁడు ప్రేఁగులు క్రొవ్వుపొరతో మెలివేసి చూచువారికి వింత గాఁ దోఁచునట్లు తలకుఁజుట్టుకొని నల్లగా రోఁతపుట్టించుచున్న దేహమునందు మెదడు గంధమువూసి నట్లు దట్టముగాఁబూసికొని యెడమచేతిలోఁ దలపుఱ్ఱెపెంకునందుఁ బ్రాణులనెత్తురు నిండించి పట్టు కొని వికారపువేషముతోడిగూనివీఁపునందు శూలాయుధము ప్రేలఁగా వంకరలేక పెరిఁగినతాటిచెట్టు వలెఁ బొడుగుపాటి శరీరమును మిట్టిగో అపండ్లును మీఁది కుబికినకనుగ్రుడ్లును గలిగి నేఁటికి మూఁడు దినములనుండి నన్నుఁ జంపుటకై వెంబడించి తఱుముచున్నాఁడు. అలం. స్వభావోక్తి, నిదర్శన, రూపకము, ఉత్ప్రేక్షయు.

క. ఏయెడ ననదలమొఱ వా, లాయము వినవలయు దుర్బలస్య బలం రా
 జా యన వినవే ధరణీ, నాయకులకు నార్తరక్షణంబులె క్రతువుల్ 74

అ. ఏయెడన్ = ఎప్పుడును, అనదలమొఱ = దిక్కుమాలినవారిదుఃఖముతోడివిన్నపమును, వాలాయము=అవశ్యముగా, వినవలయున్=మీబోఁటివారు వినవలసినది, దుర్బలస్యబలంరాజా-దుర్బ లస్య=బలహీనునికి, బలం = బలము, రాజా = రాజు, అనన్ = అనఁగా, వినవే = నీవువిన్నవాఁడవు కావా-వినియే యున్నావనుట (కనుక) ధరణీనాయకులకున్=రాజులైనవారికి, ఆర్తరక్షణంబులె= దీనులను గాపాడుటలె, క్రతువుల్=యజ్ఞములు-అనాథలను గాపాడుటలు అశ్వమేధము మొద లయిన యజ్ఞములు చేయుటవంటివనుట

తా. ఓరాజా! బలములేని దీనులకు బలము రాజే యని పెద్దలు చెప్పుదురు గనుక నీవు నామొఱ విని నన్నీయాపదనుండి తొలఁగించి రక్షింపుము. దీనిచే నీకు సమస్తయజ్ఞములు చేసిన ఫలముసిద్ధించు ను అలం. కావ్యలింగము, రూపకమును

క. మరుదశ్వపుత్త్రికిం దీ, వరాక్షగంధర్వరాజువలనఁ బొడమితిన్
 నరవర వెలసితిఁ గళలం, దు రమించుటఁ జేసి భువి మనోరమ యనఁగన్. 75

అ. నరవర=రాజా, (నేను) మరుదశ్వపుత్త్రికిన్ = మరుదశ్వుఁడను గంధర్వునికొమార్తకు, ఇందీవరాక్షగంధర్వరాజువలనన్=ఇందీవరాక్షుఁ డనెడుగంధర్వరాజువలన, పొడమితిన్=పుట్టితిని, కళలందున్=విద్యలయందు, రమించుటఁజేసి=వినోదించుటచేత, భువిన్=భూమియందు, మనోరమ యనఁగన్=మనోరమ యనుపేరితో, వెలసితిన్=ప్రసిద్ధినొందితిని-అనఁగా నే నిందీవరాక్షుఁడనెడి గంధర్వరాజుకూఁతురను నాతల్లి మరుదశ్వుఁ డనుగంధర్వునికూఁతురు నేను సమస్తవిద్యలు నేర్చి వానియందు రమించుటంజేసి నాకు మనోరమ యని పేరుపెట్టిరి

శా. రారాపిల్లి భుజాంగదంబులమణుల్ రాలంగ విద్యాధరుల్
 గారా మొప్పఁగ నెత్తికొండ్రు నను సంకస్థాయినిం జేయఁగా
 వారిన్ వీడ్కొని సిరిహాపీరికఁ జలత్వం బొందు మాతండ్రి మం
 జీరం బీంచుక ఘల్లు మన్న నవి దాఁ జెప్పంగ నిం కేటికిన్. 76

అ. విద్యాధరుల్ = విద్యాధరులనెడి దేవజాతివారు, రారాపిల్లల్ = ఒకరినొకరు త్రోసికొ వచ్చునట్టి మొరపిల్లచేత, భుజాంగదంబులమణుల్ = భుజములయొక్క భుజకీర్తులందలి రత్నములు భుజకీర్తులందుఁ బొదిగినరత్నములనుట, రాలంగన్ = ఊడిపడిపోవుచుండఁగా, గారాము=గారాబము ఒప్పఁగన్ =అమరునట్లు, ననన్ =నన్ను, ఎత్తికొంద్రు=ఎత్తుకొనుచుందురు, మాతండ్రి=మానాయన మంజీరంబు=నా కాలియందె, ఇంచుక గల్లుమన్నన్ =కొంచెముగల్లుమని శబ్దించినను- నేను దనయొద్ద వచ్చుజాడ కొంచెము తెలిసిననుట, అంకస్థాయినింజేయఁగాన్ = నన్నుఁ దనయొడిలోఁ గూర్చున్న దానిఁగాఁ జేయుటను-ఒడిలోఁ గూర్చుండఁ బెట్టుకొనుటకనుట, (పా అంకస్థాయిగాఁ గొల్వల వారిన్ =ఒడియందున్న దాన నగుటనుఁ గొలువుకూటమునందున్న వారిని, ఈపాఠము ప్రక్షిప్తమ తోఁచెడి), వారిన్ =ఆవిద్యాధరులను, పీడ్కొని = తొలఁగిపొమ్మని, సింహపీఠికన్ =సింహాసనము దుండి, చలత్వంబొందున్ =కదలికను బొందును-లేచి యెదురుగావచ్చుననుట. అవి=ఆసుఖానుభ ములను, తాన్ =నేను, ఇంకన్ =ఇఁకను - ఇట్టిదుర్దశను బొందినపిమ్మట, చెప్పంగన్ = చెప్పుటకు ఏటికిన్ =ఏమిటికి - చెప్పుకొనుటవలన గౌరవహానియే కాని ప్రయోజనములేదనుట

తా. విద్యాధరులు నేను నేనని యొకరినొకరు త్రోసికొనివచ్చి యెత్తికొనుచుండఁగాను కొలువునందున్న మాతండ్రి వారినెల్ల నవలఁ దొలఁగిపొమ్మని సింహాసనము విడిచి లేచి యెదురు వచ్చి యెత్తి యొడిలోఁ బెట్టుకొని గౌరవింపఁగాను బెరిఁగినదానను నేను ఇప్పుడవి యెల్లఁ జెప్పు కొనుట సిగ్గులచేటే కాని యితరము కాదు కనుకఁ జెప్పఁగూడదు అలం స్వభావోక్తి, ఆక్షేపము ఉదాత్తమును

తే. దేవ పారర్షి పట్టి కళావతియును, నల్లమందారవిద్యాధరాత్మజన్మ
యగువిభావసియును నాకుఁ బ్రాణసఖులు, వారు నేనును నొకనాఁడు గారవమున

అ. దేవ=రాజా, పారర్షిపట్టి = పారుఁడనెడుమునికూఁతురు, కళావతియును = కళావతియను నదియు, అల్ల..జన్మ-అల్ల=ప్రసిద్ధుఁడయిన, మందార=మందారుఁడనెడు, విద్యాధర=విద్యాధరుని యొక్క, ఆత్మజన్మ=కూఁతురు, అగువిభావసియును=అగునట్టివిభావసి యనునదియు, నాదుప్రాణ సఖులు=నాయొక్క ప్రియురాండ్రైన చెలికత్తెలు, (పా నాదు ప్రాణసఖులు) వారున్ = ఆచెలి కత్తెలును, నేనును, ఒకనాఁడు=ఒకదినమునందు, గారవమునన్ = పరస్పరప్రేమముతో - మీఁదిపద్యము తో నన్వయము.

సీ. నెత్తమ్ము లేకొండ నెత్తమ్ములం దాడు, విద్యాధరీకోటి విటులతోడ
నెచటిగాడ్పులఁ బుట్టు విచికిలామోదంబు, శబరకాంతలగుట్టు సల్లఁబెట్టు
నెన్న గేంద్రపుఁజఱుల్ మిన్నంది పెన్నంది, కోరాడుఁ దనగుబ్బ కొమ్ము వొడ్డి
యెందుండు గురివెంద పందిళ్ల పూఁదేనె, జడి యిందుశిలలందు జాలువాఱు
నట్టికులధాతశిఖరిఁ బుష్పాపచయము, సేయువేడుకఁ బొదరిండ్ల చాయలందు
దిరుగుచుండి యొకానొక దెసఁ దృణంబు, దళముగా నెత్తమొలచిన బిలమునందు

అ. ఏకొండనెత్తమ్ములందున్ = ఏకొండమీఁదిసమప్రదేశములయందు, విద్యాధరీకోటి విద్యాధరస్త్రీలసమూహము, విటులతోడన్ = విటకాండ్రతోడ, నెత్తమ్ము = జూదముల ఆడున్ =ఆడుచుండునో, ఎచటిగాడ్పులన్ = ఏకొండమీఁది వాయువులచేత, పుట్టు .దంబు

పుట్టు = జనించుచున్న, విచికిల = చిఱుమల్లెపువ్వులయొక్క, ఆమోదంబు = పరిమళము; శబరకాంతలగుట్టు = బోయతెలమర్మమును - మన్మథవికారమును మఱుఁగుపఱుచునట్టి, నేర్పు ననుట, నల్లఁబెట్టున్ = వదలించునో - ఆపరిమళముచే బోయతలు మన్మథబాధితలై ప్రియులకుఁ దమవేఁడామును దాఁపలేక బయలుపఱుతురనుట ఎన్నగేంద్రపుఁజఱుల్ = ఏపర్వతశ్రేష్ఠముయొక్క చఱియలను, పెన్నంది = పెద్దనంది - శివునివాహనమైన నందీశ్వరుఁ డనుట, మిన్నంది = మిక్కిలియుప్పొంగి, తనగుబ్బకొమ్ములు = తెలుపుగుబ్బలవంటితెలకొమ్ములను, ఒడ్డి = మొనయించి, కోరాడున్ = పొడిచి మట్టియెత్తిచల్లియాడునో, ఎందున్ = ఏకొండయందు, ఉండు జడి - ఉండు = ఉండెడి, గురివెందపందిళ్ల = బండిగురిగింజతీఁగలపందిళ్లవలని, పూఁదేనెజడి = పుష్పరసవర్షము, ఇందుశిలలందున్ = చంద్రకాంతపురాళ్లమీఁద, జాలువాఱున్ = వెల్లువయై ప్రవహించునో, అట్టికలధౌతశిఖరిన్ = అటువంటి వెండికొండయందు, పుష్పాపచయము = పువ్వులుకోయుటను, చేయువేడుకన్ = చేయునట్టికుతూహలముచేత, పొదరిండ్లచాయలందున్ = తీఁగెయిండ్లతట్టు, తిరుగుచున్ = సంచరించుచు, ఉండి, ఒకానొకదెసన్ = అందొకతట్టు, తృణంబు=గడ్డి, దళముగాన్ = దట్టముగా, వాతన్ = ద్వారముఖమునందు, మొలచినబిలమునందున్ = మొలచియున్నగుహాలోపల- పైపద్యముతో నన్వయము

తా. విద్యాధరస్త్రీలు విటకాంద్రతోడ జూద మాడుచుండెడి మీఁదిభాగపు సమప్రదేశములును, బోయతలకు మన్మథవేదన గలిగించునట్టి చిఱుమల్లెలపరిమళములు వెదచల్లెడిగాలియు, నందీశ్వరుఁడు కొమ్ములతో గ్రొచ్చి కోరాడుచు వినోదించునట్టిచెఱియపట్లును, బండిగురివెందపందిళ్లనుండి స్రవించునట్టి పూఁదేనె కాలవలై పాఱుచున్న చంద్రకాంతమణిప్రదేశములును గలిగి యొప్పెడి వెండికొండయం దొకానొకచోటఁ బూఁబొదలయందుఁ బూవులు కోయఁబోయి యందొకచోట గడ్డి దట్టముగా మొలచి యావరించుకొన్న ద్వారము గలయొకగుహాలోను అలం. ఉదాత్తము

ఉ. ఊసరవెల్లి చందమున నొక్కట బీఱనరాలు దేఱఁగా
మీసలు గడ్డముం జడలు మేను నుదరంబును వీనులున్ జరా
ధూసరమైనరోమతతితోఁ బెనఁగంబడి దూది రాశిగాఁ
జేసినరీతి నున్నయొకజీర్ణమునిం గని కౌతుకంబునన్ 79

అ. ఊసరవెల్లిచందమునన్ = ముదిసినయువ్వన్నెతొండవలె, ఒక్కటన్ = ఏకరీతిని, బీఱనరాలు = పెద్దపెద్దనరములు, తేఱఁగాన్ = తేటపడఁగా - పైకిఁ గానరాఁగా ననుట, మీసలు = మీసములును, గడ్డమున్ = గడ్డమును, జడలు = జటలును, మేను = శరీరమును, ఉదరంబును = కడుపును, వీనులున్ = చెవులును, జరాధూసరము = ముసలితనముచేఁ దెల్లవడినది - నెరసినది, ఐనరోమతతితోన్ = అయినట్టిమేనిపెండ్రుకలసమూహముతో, పెనఁగంబడి = పెనఁచుకొని, దూది = విత్తుతీసినప్రత్తి, రాశిగాన్ = ప్రోగుగా, చేసినరీతిన్ = చేసినవిధమున, ఉన్నయొకజీర్ణమునిన్ = ఉన్నట్టి యొకముసలిఋషిని, చూచి, కౌతుకంబునన్ = కుతూహలముతో పైపద్యముతో నన్వయము అలం. ఉపమ, ఉత్ప్రేక్ష, స్వభావోక్తియు

ఆ. ఇతనివదనకుహర మెద్ది నేత్రద్వయం, బెద్ది కర్ణయుగళ మెద్ది యనుచు
బూఁచివ్రాలె నున్న వాచంయమునిమోము, బాల్యచాపలమునఁ బట్టుటయును.

. ఇతనివదనకుహరము = ఈఋషిదైనముఖద్వారము, నోరు, ఏద్ది=ఏది, నేత్రద్వయంబు = కన్నుదోయి, ఎద్ది = ఏది, కర్ణయుగళము = చెవులజంట, ఎద్ది = ఏది, అనుచున్ = అనియనుకొనుచు, బూచివోలెన్ = భూతమువలె, ఉన్నవాచంయమునిమోము = ఉండినమునిదైన ముఖమును, బాల్యచాపలమునన్ = పసితనపుఁజపలత్వముచేత, పట్టుటయును = పట్టుకొనఁగా - అనఁగా నోరు కన్నులు ముక్కు చెవులు నేర్పడక భూతమువలె నున్నయామునీశ్వరునిఁ జూచి పసితనపుఁ జంచలత్వముచే నతని మొగముఁ బట్టుకొనఁగా.

క. ధ్యానస్తిమితుం డగున, వ్వానిమదీయాంగుళీవిమర్శనములచే
మే నెఱిఁగి తొంటియనుసం, ధానము చెడి కన్ను దెఱచి దారుణఫణితిన్. 81

అ. ధ్యానస్తిమితుండు = ధ్యానయోగమునందుఁ జలింపనివాఁడు, అగున వ్వాని = అయిన యాఋషి, మదీ...చేన్ - మదీయ = నాసంబంధమైన, అంగుళీ = వ్రేళ్లయొక్క, విమర్శనములచేన్ = విశేషముయినతాఁకుడులచేత, మేనెఱిఁగి = దేహస్మృతి గలవాఁడై, తొంటియనుసంధానము = మునుపటిధ్యాననిష్ఠ, చెడి = చెడఁగా, కన్నుదెఱచి = కన్నువిచ్చి, దారుణఫణితిన్ = క్రూరమయినమాటలయొక్క పలుకుబడితో - దీనికి 84 పద్యమునందలి 'పలికె' నను క్రియతో నన్వయము.

ఉ. ఓసి దురాత్మురాల గృహ మొల్లక సర్వసుఖంబులున్ నిరా
యాసమునం దొఱంగి మిహిరాంశుమరుచ్ఛదనీరనీరస
గ్రాసము దేహధారకముగా గుహలం దప మాచరించుమ
మ్మీసరణిన్ స్పృశించి నగ నేమిఫలం బొనఁగూడెఁ జెప్పుమా. 82

అ. ఓసి దురాత్మురాల = దుష్టస్వభావముగలయోనీచురాలా, గృహము = ఇల్లు, ఒల్లక = అపేక్షింపక - ఇల్లువాకిలి విడిచి యనుట, సర్వసుఖంబులున్ = ఎల్లసౌఖ్యములను, నిరాయాసమునన్ = శ్రమయులేమితో - ఎట్లు మానవచ్చు నని విచారము కొంచెమైనను లేక యనుట, తొఱంగి = విడిచి, మిహిరాంశు...గ్రాసము - మిహిర = సూర్యునియొక్క, అంశు = కిరణములును, మరుత్ = గాలియును, ఛద = ఆకులును, నీర = జలముసైన, నీరస = సారములేని, గ్రాసము = ఆహారము, దేహధారకము = శరీరమును ధరింపఁజేయునది, కాన్ = కాఁగా, గుహలన్ = కొండగవులయందు, తపము = తపస్సు, ఆచరించుమమ్మున్ = చేయుచున్నమమ్మును, ఈసరణిన్ = ఈవిధముగా, స్పృశించి = తాఁకి, నగన్ = నవ్వఁగా - అపహాస్యముచేయుటచేత ననుట, ఏమిఫలంబు = ఏమి లాభము, ఒనఁగూడెన్ = (నీకు) సిద్ధించెను, చెప్పుమా = చెప్పుము.

తా. ఓసి దుష్టురాలా! ఇల్లువాకిలివిడిచి సుఖము నపేక్షింపక సూర్యకిరణములను గాలిని నీళ్లను పండుటాకులను నాహారముగాఁ జేసికొని దేహము నిలుపుకొని గుహలలోఁ దపస్సుచేయు చున్న నన్నుఁ దాఁకి యిట్లు పరిహాసము చేయుటచేత నీకుఁ గలిగినలాభ మేమో చెప్పుము

క. తిమిరింపువయసుగుబ్బల, కొమరాలవు నీకుఁ దగినకోవాళ్ల మహిన్
నెమకి నగ రాదె ముదిసిన, మముఁ జెనకిన నేమికలదు మద మేమిటికిన్. 83

అ. తిమి..లవు - తిమిరింపు = పొగరెక్కిన-మదముచేతఁ గన్నుగానని యనుట, వయసు = యౌవనమునందలి, గుబ్బల = బిగిసన్నులుగల, కొమరాలవు = పడుచువు, మహిన్ = భూమియందు, నీకుఁ దగినకోవాళ్లన్ = నీకుఁదగినట్టి పడుచువాండ్రను, నెమకి = వెదకి, నగ రాదె = పరిహాసముచేయరాదా,

ముదిసినమమ్మున్ = ముసలితనముబొందినమమ్ము, చెనకినన్ = తాఁకఁగా, ఏమికలదు = కోపేమిలాభము గలదు, మదము = ఇంతక్రొవ్వు, ఏమిటికిన్ = ఎందులకు— ఇంతమదము కొఱగాదనుట

క. ముసురుకొనుజరభరంబున, నసురుసు రై యున్న మమ్ము నీ నడకించితి వి
ట్లుసురు మనఁ బట్టువడు మొకఁ,యసురకు నీ వనుచుఁ బలికె నాగ్రహ మెసఁగన్.

అ. ముసురు.. బునన్ - ముసురుకొను = ఆవరించుకొన్న, జర = ముసలితనముయొక్క, భరంబునన్ = అతిశయముచేత, అసురుసురై = మిక్కిలియలసి, ఉన్నమమ్మున్ = ఉండినమమ్ము, ఇట్లు = ఈరీతిని, అడకించితివి = అపహసించితివి, (కనుక) ఉసురుమనన్ = ఉస్సురని శ్రమపడు నట్లు, నీవు, ఒకయసురకున్ = ఒకరాక్షసునకు, పట్టుపడుము = చిక్కుకొనుము, అనుచున్ = ఇట్లని, ఆగ్రహము = కోపము, ఎసఁగన్ = అతిశయింపఁగా, పలికెను = చెప్పెను- శపించెననుట.

తా. ముసలితనముచే నలఁతఁబొందినవానిని నన్నీవిధముగాఁ బరిహసించి యాయాసపెట్టి తివి గనుక నీవు నొకరాక్షసునిచేతఁ బట్టుపడి శ్రమపడుమని శపించెను.

క. జననాథ యేమి చెప్పుదుఁ, గనలుచు నవ్వగ్గుతపసి కటము లదరఁగాఁ
దనచేతినాగబెత్తముఁ, గొని పసరముఁ గొట్టినట్లు గొట్టె నదయుఁ డై. 85

అ. జననాథ = ఓరాజా, ఏమిచెప్పుదున్ = (అటుపిమ్మటివృత్తాంతము) నేనేమని చెప్పుదును, అవ్వగ్గుతపసి = ఆబక్కవాఁడగుముని, కనలుచున్ = కోపముచే మండిపడుచును, కటములు = కణఁతలు, అదరఁగాన్ = చలింపఁగా, అదయుఁడై = దయమాలినవాఁడై, తనచేతినాగబెత్తమున్ = తనచేతనున్న యోగపుబెత్తమును, కొని = తీసికొని, పసరమున్ = పశువును, కొట్టినట్లు = కొట్టిన రీతిగా, కొట్టెన్ = నన్నుఁగొట్టెను అలం ఉపమ

క. కొట్టువడి యటకు మునుపే, తిట్టుం బడి యేడ్చునాదుదెసఁ గని మదిలోఁ
గట్టలుక వ్రేఁడమి నాసఖు, లిట్టనిరి మునీంద్రుతోడ నెత్తినపెలుచన్. 86

అ. కొట్టువడి = దెబ్బపడి, అటకుమునుపే = అంతకుముందే, తిట్టుంబడి = శాపమునుబొంది, ఏడ్చు నాదుదెసన్ = రోదనము చేయుచున్న నాదురవస్థను, కని = చూచి, నాసఖులు = నా చెలికత్తెలు, మదిలోన్ = మనసునందు, కట్టలుక = అధికకోపము, పొడమి = పుట్టి, ఎత్తినపెలుచన్ = కలిగినయాగ్రహముతో, మునీంద్రుతోడన్ = ఆమునిశ్రేష్ఠునితో, ఇట్టనిరి = ఇట్లుపలికిరి

ఉ. ఓయి దయావిహీనమతి యూరక యీపసిబిడ్డఁ గొట్టఁగా
జే యెటు లాడె నీకు నిది చేసిన దేమి వృథా శపింతు రే
బోయవె యాఁడుఁదోడునను బుట్టవె శాపనిమిత్తమే తపం
బీయెడ నున్న శాంతిపరు లే మనువా రిఁక నీచరిత్రకున్. 87

అ. ఓయిదయావిహీనమతి = ఓయి దయలేనిబుద్ధిగలవాఁడా, ఊరక = కారణములేక, ఈపసి బిడ్డన్ = ఈపిన్నపడుచును, కొట్టఁగాన్ = కొట్టుటకు, చేయెటులాడెనీకున్ = నీకెట్లుచేయాడెను- కొట్టుటకు నీకు సంకోచము లేకపోయెనుకదాయనుట, ఇది = ఈచిన్నది, చేసినది = చేసినతప్పు, ఏమి = ఏది, వృథా = వ్యర్థముగా, శపింతురే = తిట్టుదురా- తిట్టుట న్యాయముకాదనుట, బోయవె = నీవు కిరాతుఁడవా- కిరాతులకు దయలేకపోవచ్చు ననుట, ఆఁడుఁదోడునను = ఆఁడుదైనతోడఁబుట్టువుతో, పుట్టవె = నీవు పుట్టినవాఁడవుకావా- తోడఁబుట్టిన యాఁడువారుకలవానికి నాఁడుఁబడుచులయెడల

దయలేకపోదెనుట, తపంబు=నీవుచేయునట్టి యీతపస్సు, శాపనిమిత్తమే=ఎవరికైననిట్లు శాపమిచ్చుటకా, ఇఁకన్=ఇఁకమీఁద, నీచరిత్రకున్=ఇటువంటినీనడవడికి, ఈయెడన్=ఇక్కడ, ఉన్నశాంతిపరులు=ఉండునట్టిసహనముగల మునులు, ఏమనువారు=ఏన్నో మందురు-నిందింతురుగాని గౌరవింపరనుట.

క. పాము కడు ముదిసి కడపట, గా మగుచందమున వార్ధకంబునఁ గ్రోధం
బేమియు మానక మండెదు, నాముని మునియే తలంప నదియుం దపమే. 88

అ పాము=సర్పము, కడున్=మిక్కిలి, ముదిసి=ముదిమినొందినదై, కడపటన్=తుదను, గాము=గ్రహము, అగుచందమునన్=అగునట్టివిధమున-నాగుఁబాము వేయేండ్లు బ్రదుకుననియు వేయేండ్లునయినపిమ్మట ఒక్కలుపుట్టి గ్రహమై ప్రాణులను బాధించుననియు నదే మిడినాగనియుఁ జెప్పుదురు వార్ధకంబునన్=ముసలితనమునందు, క్రోధంబు=కోపమును, ఏమియున్=ఏమాత్రమును-కొంచెమైననునుట, మానక=విడువక, మండెదు నాముని = కోపవికారముఁజూపువాఁడైన యీబుషి, మునియే=మునియగునా-మునికానేరఁడనుట, తలంపన్ = విచారింపఁగా, అదియున్ = అటువంటికోపస్వభావముగలమునిచేయునదియును, తపమే=తపస్సా-కాదనుట.-అనఁగా శాంతి గలిగి చేసినదే తపస్సును, అట్టితపస్సు చేయువాఁడే తపస్వియుఁ గనుక శాంతిలేనితపస్సు నిరర్థకమనుట అలం. అప్రస్తుతప్రశంస, ఉపమయు.

క. పరులయపరాధగతులకుఁ, గెరలక తనుఁ బొగడుచోటఁ గీడాడెడుచోఁ
బరితోషము రోషము నెదఁ, జొర నీనితపస్వి సుమ్ము సుకృతి ధరిత్రిన్ 89

అ. ధరిత్రిన్=భూమియందు, పరుల...గతులకున్-పరుల=ఇతరులయొక్క, అపరాధ గతులకున్=తప్పుమార్గములకు-తనయెడల నెవరైననుజేయునట్టితప్పులకు ననుట, కెరలక=కోపింపక, తనున్=తన్ను, పొగడుచోటన్ = స్తోత్రముచేయునెడను, కీడాడెడుచోన్ = నిందచేయునెడను, పరితోషమున్=సంతోషమును, రోషమున్=కోపమును-అనఁగాఁ బొగడునప్పుడు సంతోషమును నిందించునప్పుడు రోషము ననుట, ఎదన్=మనసునందు, చొరనీని=ప్రవేశింపనియ్యని-కలుగనియ్యని, తపస్వి=తపస్సుచేయువాఁడు, సుమ్ము=సుమీ, సుకృతి=పుణ్యాత్ముఁడు.

తా. భూమియందు దెవరేమితప్పుచేసినను సహించి యొకరుతిట్టినను దీవించినను మనోవికారమునొందక తపస్సుచేయునట్టితపస్వియే పుణ్యాత్ముఁడు గాని రాగద్వేషములు గలముని పుణ్యాత్ముఁడుకానేరఁడు. అలం. అప్రస్తుతప్రశంస

తే. ఒండొకఁడవైన నిపుడునీకేపిండియిడవె, బ్రాహ్మణుఁడవౌటమాచేతఁబ్రదుకుగంటి
తడవఁ బని లేదు నిన్ను గౌతమునిగోవ, వనుచు వాదించి విడిచినఁ గాగ్రహించి.

అ. ఒండొకఁడవు=మఱియొకఁడవు-బ్రాహ్మణేతరుఁడవనుట, ఐనన్=అయినపక్షమున, ఇపుడు=ఈసమయమునందు, నీపిండియిడవె=నీపిండిని బెట్టమా-నీదేహమును బిండిగానలియఁగొట్టి ముద్దగాఁ జేసివేయమా, బ్రాహ్మణుఁడవు, ఔటన్=అగుటచేత, మాచేతన్, బ్రదుకుగంటి = చావక బ్రదుకునంటటి యదృష్టమునుబొందితివి, నిన్నున్, తడవన్=ఇట్టివాఁడవనివిచారించుట, పనిలేదు=అక్కఱలేదు, గౌతమునిగోవవు=గౌతముని యావువంటివాఁడవు-తాఁకినమాత్రముననే క్రిందఁబడిచచ్చి బ్రహ్మహత్యపొందించునట్టిస్థితిలో నుండువాఁడవు, అనుచున్=అని, వాదించి = వాదాడి, విడిచినన్ = అతనిని వదలిపెట్టగా, ఆగ్రహించి=(అతఁడు) కోపించి-పైపద్యముతో నన్వయము.

తా. నీవు బ్రాహ్మణుఁడవు గాక యతివఁడవై యున్నయెడల సంతపనచేసినందులకు నిన్నిప్పుడే దేహము నలియఁగొట్టి ముద్దచేసి పాఱవేసిపోదుము నీవు గౌతముని గోవువంటివాఁడవు గనుక నిన్నేమియుఁ జేయమైతిమి బ్రాహ్మనఁగా నాయనీశ్వరుఁడు మఱియును గోపించి. అలంకూపకము. (గౌతమునిగోవన్నందులకుఁ గథ గౌతముఁ డనుఋషి యొకానొకపుణ్యక్షేత్రమునందుఁ దపస్సు చేసికొనుచుండఁగా ద్వాదశవర్షక్షామము వచ్చెను అప్పు డనేకులు ఋషు లన్నార్థులై యతనియాశ్రమమునకు వచ్చిరి అంతట గౌతముఁడు ప్రతిదినము ప్రొద్దునలేచి యాశ్రమసమీపమునందుఁ బాదిచేసి పిడికెఁడువడ్లు చల్లి యనుష్ఠానమునకుఁ బోవుచుండెను ఆయన యనుష్ఠానము దీర్చుకొని వచ్చునంతలో నాయనతపోమహిమచేత నావడ్లు మొలచి పైరై యెన్ను దీసి గింజపట్టిపండియుండును. ఆధాన్యమును సంగ్రహించి వంచి వియ్యముచేసి యాఋషుల కందఱకుఁ దృప్తిగా భోజనము పెట్టును ఇట్లాక అవు తీఱువంతవఱకు జరుపఁగా నాఋషు లాయనను మెచ్చుకొని తమనివాసములకుఁ బోవుచు విఘ్నేశ్వరుని ప్రేరణముచేతఁ దమవెంటరమ్మని పిలువఁగా నతఁ డందులకు సమ్మతింపకపోయెను. అందుమీఁద వా రాతని లోఁబఱుచుకొనుటకై యొకమాయగోవును సృజించి యతనిపైరు మేయఁ దోలఁగా గౌతముఁడు దానిని దర్భకఱ్ఱతోఁ దాఁకి యదలింపఁగా నది పిడుగుదెబ్బకు నోఁపగి కూలినట్లు నేలఁగూలి చచ్చెను అంతట వా రాగౌతమునిమీఁద గోహత్యాపాపము నారోపించి జాలిపుట్టించి తమకు లోఁబఱిచి తీసికొనిపోయిరి నాఁటనుండి యెవరేని యపాయము పొందువళలోనుండువారు దగ్గఱఁ జేరనెడ గౌతమునిగోవని తొలఁగి చనుచుందురు )

క. ముసలి శపియించె నపుడు, యస్యసితాక్షేక్షణల రాజయక్ష్మక్షోభం
బెసఁగ నశియింప నగు న,ద్దెసఁ బాఱుఁడు సుగుణి గామి తెల్లమియ కదా. 91

అ. అపుడు = ఆసమయమునందు, ముసలి = ఆవృద్ధుఁడు, అయ్యసితాక్షేక్షణలక్ = నల్లకలువలవంటికన్నులుగలవారైనయాచెలికత్తెలను, రాజయక్ష్మక్షోభంబు = క్షయరోగమువలనిబాధ, ఎసఁగక్ = అతిశయింపఁగా, నశియింపక్ = నాశిల్లునట్లు, శపియించెక్ = తిట్టెను అగుక్ = (అట్టి వ్యాపార మతనియోగ్యతకు) తగును అద్దెసక్ = ఆయెడ-ఆవిషయమునందనుట, పాఱుఁడు = ఆబ్రాహ్మణుఁడు, సుగుడి=సరసుఁడు, (పా సుగుణి=మంచిగుణముగలవాఁడు) కామి=కాకుండుట, తెల్లమియకదా=స్పష్టమేకదా

తా అట్లు కోపించినయాముసలిబాఁపఁడు నాచెలికత్తెలను క్షయరోగము పొంది నాశిల్లుఁడని శపించెను. అట్లు శపించుటనుబట్టియే యతఁడు సరసుఁడు గాఁడని నీవుగూడఁ దెలిసికొనవచ్చును.

క. ఆరుజ యప్పుడె యయ్యం, భోరుహలోచనలఁ బొందె భూవర నన్నున్
వారత్రయమునుండియు, దారుణగతి నొక్కయసుర తఱిమెడు వెంటన్. 92

అ భూవర = రాజా, అప్పుడె = తత్క్షణమే, అయ్యంభోరుహలోచనలక్ = తామరలవంటి కన్నులు గలయాపడుచులను, ఆరుజ = ఆవ్యాధి-క్షయరోగము, పొందెక్ = చెందెను, నన్నుక్ = నన్ను, వారత్రయమునుండియుక్ = మూఁడువారములనుండి, (73 పద్యమునందు 'మూనాళ్లనుండి' అనియుండుటంబట్టి 'వారత్రయ' మనఁగా నిట మూఁడుదినములని చెప్పుట యుక్తమని తోఁచెడి.) ఒక్కయసుర = ఒకరాక్షసుఁడు, దారుణగతిక్ = క్రూరమార్గముతో, వెంటక్ = వెంబడిని - వెంబడించియనుట, తఱిమెడుక్ = తఱుముచున్నాఁడు.

సీ. ఇచ్చెద నీ కస్త్రహృదయంబు నివ్విద్య, నరనాథ మున్ను పినాకపాణి
యగురుద్రుఁ డిచ్చె స్వాయంభువమనువున, కతఁ డిచ్చె మఱి వసిష్ఠాఖ్యమునికి
నతఁ డిచ్చెఁ గరుణఁ జిత్రాయుధుం డన్నపేరఁ,దనరుమదీయమాతామహునకు
నతఁ డిచ్చెఁ బెండ్లియైనపు డరణంబుగా,మాతండ్రి కతఁ డిచ్చె మమత నాకు
సకలరిపునాశకము యశస్కరము నైన, దీని వేవేగ నాచేఁ బ్రతిగ్రహించి
యడఁపుమా దైత్యు నీవు వారనఁగవలవ, దనఘ సద్విద్య యెందున్నఁ గొనఁగవలయు.

అ. నరనాథ = ఓరాజా, నీకు, అస్త్రహృదయంబున్ = అస్త్రహృదయమనెడివిద్యను, ఇచ్చెదన్ = నేనిచ్చెదను, ఇవ్విద్య = ఈయస్త్రహృదయవిద్యను, మున్ను = మునుపు, పినాకపాణి = పినాకమనెడివింటిని జేతఁదాల్చినవాఁడు, అగురుద్రుఁడు = అయినశివుఁడు, స్వాయంభువమనువునకున్ = స్వాయంభువుఁ డనెడిప్రథమమనువునకు, ఇచ్చెను, అతఁడు = ఆస్వాయంభువమనువు, మఱి = పిమ్మట, వసిష్ఠాఖ్యమునికిన్ = వసిష్ఠుఁడనెడిఋషికి, ఇచ్చెను, అతఁడు = ఆవసిష్ఠముని, కరుణన్ = దయచేత, చిత్రాయుధుండు, అనుపేరన్ = అనునట్టిపేరితో, తనరు ..నకున్ – తనరు = ఒప్పుచున్న, మదీయమాతామహునకున్ = మాతల్లినిగన్నతాతకు, ఇచ్చెను, అతఁడు = మాతాతయైనచిత్రాయుధుఁడు, మాతండ్రికి, పెండ్లియైనపుడు = వివాహకాలమునందు, అరణంబుగాన్ = అల్లునికిచ్చు బహుమానముగా, ఇచ్చెను, అతఁడు = మాతండ్రి, మమతన్ = అభిమానముచేత, నాకు నిచ్చెను, సకలరిపునాశకమున్ = ఎల్లశత్రువులను నాశముచేయునదియు, యశస్కరమున్ = కీర్తిగలుగఁజేయునదియు, ఐన దీనిన్ = అయినయీవిద్యను, నాచేన్ = నావలన, వేవేగ = అతిశీఘ్రముగా, ప్రతిగ్రహించి = తీసికొని, ఆదైత్యున్ = ఆరాక్షసుని, అడఁపుము = అణఁగఁగొట్టుము – చంపుమనుట, అనఘ = పాపములేనివాఁడా – ఓపుణ్యాత్ముఁడా, సద్విద్య = మంచివిద్య, ఎందున్నన్ = ఎటువంటివారియొద్దనున్నను, కొనఁగవలయున్ = గ్రహింపవలయును, వీరువారు = ఇచ్చునట్టివారిటువంటివారు అటువంటివారు, అనఁగన్ = అనుట – అని విచారించుట, వలదు = అక్కఱలేదు – "నీచాదప్యుత్తమాం విద్యాం స్త్రీరత్నం దుష్కులాదపి" అని చెప్పఁబడియున్నది గనుక విద్యనిచ్చువారు ఉత్తములా నీచులా యనువిచారము పెట్టుకోరాదనుట.

క. అనుటయు శుచియై నిలిచిన, జననాథునకుం బ్రయోగసంహారంబుల్
వనిత రహస్యంబుగఁ జె, ప్పిన నాతఁడు నెఱిఁగె నంత భీషణభంగిన్. 94

అ. అనుటయున్ = ఆస్త్రీ యట్లుపలికినతోడనే, శుచియై = ఆచమనాదికముచేసిపరిశుద్ధుఁడై, నిలిచినన్ = స్వారోచి నిలువఁగా, వనిత = ఆస్త్రీ, జననాథునకున్ = రాజైనస్వారోచికి, ప్రయోగసంహారంబుల్ = అస్త్రమును బగవారిపైకిఁబంపునట్టిక్రమమును మరలించునట్టిక్రమమును, రహస్యంబుగన్ = ఏకాంతముగా ఇతరులకుఁ దెలియకుండునట్లనుట, చెప్పినన్ = తెలియఁజేయగాఁ, అతఁడును = ఆరాజును, ఎఱిఁగెన్ = తెలిసికొనెను, అంతన్ = అంతట, భీషణభంగిన్ = భయంకరమైనరీతితో. పైపద్యముతో నన్వయము.

మహాస్రగ్ధర గళగర్తక్రోడనిర్యత్కటుకహానినదోద్గాఢహాసంబు భూభృ
ద్బిలముల్ ప్రోయింపఁ గాదంబినిగతిని బొగల్ పెంప మిన్నెల్ల మైగాఁ
జలితాస్యక్రూరదంతక్షతరదవసనక్షారకీలాలవేల్ల
జ్జ్వలనజ్వాలాభజిహ్వాంచలుఁ డగుచు గదన్ జాళెముల్ ద్రిప్పికొంచున్. 95

అ. గళగర్త . హాసంబు-గళగర్త=కలుగునంటిగొంతుక్రోవియొక్క, క్రోడ= లోపలనుండి, నిర్యత్=బయలువెడలుచున్న, కహాకహా=కహాకహాయనెడి, నినద=ధ్వనితోడి, ఉద్గాఢ=అతిమాత్రమైన, హాసంబు=నవ్వు, భూభృద్బిలముల్=కొండగవులను, మ్రోయింపన్=ప్రతిధ్వనిగలవానిఁగాఁ జేయఁగా, కాదంబినిగతిన్=మబ్బుచాలువలె, పొగల్=పొగలను, పెంపన్=పెంచునట్లు, మిన్నెల్లన్=ఆకాశమంతయు, మైగాన్=దేహముకాఁగా, చలిత . చలుఁడు-చలిత=కదలింపఁబడిన, అస్య=ముఖమునందు, క్రూర=కఠినమైన, దంత=పండ్లయొక్క, క్షతి=(కఱచుటలచేనైన) గాయములుగల, రదవసన=పెదవివలనఁ (గాఱెడి,) క్షార=కారమైన-వెగటయిన, కీలాల=రక్తముతోడ, వేల్లత్=వ్రేలాడుచున్న-చాఁచఁబడిన యనుట, జ్వలన=అగ్నియొక్క, జ్వాలాభ=మంటనుబోలిన, జిహ్వాంచలుఁడు=కొననాలుకకలవాఁడు, అగుచున్=అవుచును, గదన్=గదాయుధమును, జాళెముల్=జాళెములుగా-ఐంకరలేక కనఁబడునట్టు వేగముగాననుట, త్రిప్పుకొంచున్=త్రిప్పుచును కర్తృపదము పైపద్యములోనిదానవుఁడు.

తా. పెద్దకలుగువలె నోరుతెఱచి కొండగుహలు ప్రతిధ్వనియిచ్చునట్లుగాఁ గహాకహాయనుధ్వనితోఁ బెడనవ్వునవ్వుచు నల్లమబ్బువ్యాపించిన ట్లాకాశమందు మిక్కిలి పొడుగయినదేహముయొక్క నల్లనికాంతులు వ్యాపింపఁగాఁ గోపాతిశయముచేతఁ బెదవులక్రిందఁ గఱచుకొన్న గాయములవలన వెడలెడి వెగటుగలిగించు నెత్తురు నాకుకొనుచు గదను గిరగిరఁ ద్రిప్పుచు. అలం స్వభావోక్తి, అతిశయోక్తి, ఉపమయు.

ఉ. దానవుఁ డద్ధరారమణుఁ డాఁకె నుదగ్రపదాగ్రఘట్టన
గ్లాని సపాటమై యచటి కాన ఘురట్టవిఘట్టితాకృతిం
బూని చెడన్ గిరీశగళ మూలహలాహలకాలకాంతితో
మేనతికంబు లాడుతన మేటిత్రిశూలముఁ బూని యుద్ధతిన్ 96

అ. దానవుఁడు=రాక్షసుఁడు, ఉదగ్ర ... గ్లానిన్ - ఉదగ్ర=భయంకరమైన, పదాగ్ర=కాలియడుగులయొక్క, ఘట్టన=అణఁగఁద్రొక్కుటలవలని, గ్లానిన్=నలఁగుడుచేత, సపాటమై=చదునై, అచటి కాన=అక్కడియడవి, ఘురట్ట . కృతిన్ - ఘురట్ట=తిరుగటియందు, విఘట్టిత=పిండిగావిసరఁబడినదాని రూపమువంటి, ఆకృతిన్=రూపమును, పూని=పొంది, చెడన్=నశింపఁగా, గిరీశ ... తోన్ - గిరీశ=శివుని యొక్క, గళమూల=మెడయడుగుభాగమునందలి, హాలాహల=కాలకూటవిషముయొక్క, కాల=నల్లనైన, కాంతితోన్=ఛాయతో, మేనతికంబులు=మేనత్తమేనమామ బిడ్డలమాటలు-తచ్చనలు, ఆడుతన మేటిత్రిశూలమున్ - ఆడు=ఎరపువట్టి-పరిహాసముచేయువట్టియనుట, తన=తనదైన, మేటి=శ్రేష్ఠమయిన, త్రిశూలమున్=మూఁడుమొనలుగల శూలాయుధమును, పూని=మూఁపునఁబెట్టుకొని, ఉద్ధతిన్=నిక్కుతో, అద్ధరారమణున్=ఆరాజును,-స్వరోచిని, తాఁకెన్=ఎదిరించెను.

తా. మీఁదఁజెప్పినచొప్పున నారాక్షసుఁడు భూమినలఁగి మిట్టపల్లములు సమముగునట్టుగాను దారికడ్డముగా నున్నమ్రాఁకులు విఱిగిపడి పొడిపొడియగునట్టుగాను నడిమి యడుగులు పెట్టుచు నల్లగా నెలుఁగుచున్న త్రిశూలమును మూఁపున బెట్టుకొనివచ్చి స్వరోచి నెదిరించెను. అలం అతిశయోక్తి, నిదర్శన, ఉపమయును.

తే. నింగి నోరయు రాకాసిమసన్నిని మేని, నీడఁ జీఁకటిగొనె నవశోనితలంబు
చంద్రికలు గాంచె నట్టహాసముల వెడలు, నిశితదంష్ట్రలచే నవశోనీతలంబు. 97

, నింగిన్ = ఆకాశమును, ఒరయు నీడన్ - ఒరయు=ఒరసికొనుచున్న - తాఁకుచున్న, రాకాసిమన్నీఁడు = రాక్షసశ్రేష్ఠునియొక్క, మేని = దేహముయొక్క, నీడన్ = ఛాయచేత, అవనీతలంబు=భూమి, చీఁకటిగొనెన్ = చీఁకటినిబొందెను, అట్టహాసములన్ = వాని పెడనవ్వులవలన, వెడలు .. చేన - వెడలు = బయలుపడునట్టి, నిశిత=వాఁడియయిన, దంష్ట్రలచేత = కోఱలచేతనే, వనీతలంబు=అడవిపట్టు, చంద్రికలు=వెన్నెలలను, కాంచెన్ = పొందెను.

తా. ఆకాశమును దాఁకు నంతటిపొడుగు గలరాక్షసునిశరీరము నీడచేత భూప్రదేశమంతయు చీఁకటిక్రమ్మినట్లుండెను. వాఁడు పెడనవ్వునవ్వఁగా బయటఁబడినకోఱపండ్ల తెల్లఁదనపుఁ గాంతుల చేత నడవియంతయు వెన్నెలయావరించినట్లుండెను. అలం. అతిశయోక్తి.

పంచచామరము. పలాశి డాసి రాజుఁ జూచి పల్కె నోరి నోరికి
పొలానఁ బెన్బొలాన లేక పోవ నీవు దోఁచితౌ
బలా బలాలితోడఁ బాలఁ బట్టి బిట్టు చుట్టి నిన్
హళాహళిన్ హలాహలాభ యాంబుభుక్తుఁ దీర్చెదన్ 98

అ. పలాశి=మాంసముభుజించువాఁడు - రాక్షసుఁడు, డాసి=దగ్గఱవచ్చి, రాజున్ = స్వరోచిని, చూచి=కనుఁగొని, పల్కెన్=ఇట్లుపలికెను, ఓరి=ఓరినుసుష్యుఁడా, ఈపొలానన్=ఈ యడవియందు, నోరికిన్ = నా నోటికి, పెన్బొల=పెద్దమాంసము - మనుష్యమాంసమనుట, ఆనన్ = భుజింపను, లేకపోవన్ = కలుగకపోఁగా, నీవు, తోఁచితివి=కనఁబడితివి - దొరకితివనుట, ఔ = ఇది యుక్తమగును, బలా=సెబాసు - నీవంటివాని నాకుఁ జిక్కునట్లు చేసిన దైవమును మెచ్చవచ్చుననుట, బలాలితోడన్ = సేనలబారుతోడ, బాలన్ = ఈచిన్న దానిని, పట్టి=కలియఁబట్టి, బిట్టు = శీఘ్రముగా, చుట్టి నిన్ = నిన్నుఁ జేర్చిచుట్టి, హలాహలాభ=కాలకూటవిషమునుబోలినది - కాలకూటవిషమువలెఁ దపింపఁజేయునది, ఔబుభుక్షన్ = అగునట్టి యాఁకటిని, హళాహళిన్ = త్వరతో, తీర్చెదన్ = తీర్చుకొనెదను-ఆఁకలిదీఱఁ దినెదననుట

తా. ఆరాక్షసుఁడు స్వరోచిని జూచి దగ్గఱ వచ్చి ఓరి మానవుఁడా! నాకు నీయడవియందు మానవమాంసము చిక్కకపోవుటచేత నోరుచవిచెడి యుండఁగా నాయదృష్టముచే నీవు చిక్కితివి ఇఁక నోటి యరుచితీఱ నిన్ను నీగలమును నీకన్యను గూడఁజేర్చి యొక్కచుట్టఁగాఁ జుట్టి శీఘ్రముగా నోటవేసికొని కడుపున రగులుకొలుపుచున్న నాయాఁకలిని దీర్చుకొనెద. అలం. ఉపమ

మహాస్రగ్ధర. అని బాహాస్ఫోటరావాహతపతగకులం బన్యనీశాఖిశాఖా
జనితవ్యాకీర్ణ జీర్ణచ్ఛదములకరణిం జల్లనన్ రాల భూషా
ర్చి నుదీర్ణాలాతచక్రాకృతిఁగ జటిజిటిం దిప్పి నైచెం గదన్ వై
చినఁ దేజిన్ రాజు గెంటించెఁ దొలఁగిసది యచ్చెంతకాంతారనేర్చెన్. 99

అ. అని = ఇట్లుపలికి, బాహా .. కులంబు - బాహా = భుజరులయొక్క, ఆస్ఫోట=మల్లచఱుపులయొక్క, రావ = ధ్వనిచేత, ఆహత = కొట్టఁబడిన, పతగకులంబు = పక్షిసమూహము, అన్యనీ .. కరణిన్ - అన్యనీ = ఆయటవియందలి, శాఖి = వృక్షములయొక్క, శాఖా = కొమ్మలవలన, జనిత = పుట్టిన, వ్యాకీర్ణ=అంతటను వ్యాపించిన, జీర్ణ = పండిన, ఛదములకరణిన్ = ఆకులవలె, జల్లనన్ = జల్లుఅనునట్లు, రాలన్ = రాలఁగా, భూషార్చిన్ = ఆభరణములవెలుఁగుచేత,

ఉదీ.. కృతిగన్ - ఉదీర్ణ = దొడ్డదైన, అలాత = కొఱవియొక్క, చక్రాకృతిగన్ = చక్రముయొక్క ఆకారమువంటి యాకారము కలది యగునట్లుగా - పెద్దకొఱవిని గుండ్రముగాఁద్రిప్పినట్లనుట, గదన్ = తనచేతిగుదియను, జిఱజిఱన్ = జిఱజిఱయను ననుకరణములో, త్రిప్పి, వైచెన్ = రాజుమీఁద వేసెను, వైచినన్ = వేయఁగా, రాజు = రాజైనస్వరోచి, తొలఁగన్ = గుఱితప్పి తొలఁగునట్లుగా, తేజిన్ = గుఱ్ఱమును, గెంటించెన్ = దాఁటించెను, అది = ఆగదాయుధము, అచ్చెంతకాంతారము = ఆవెంబడి నున్నయడవిని, ఏర్చెన్ = దహించెను - పొడుచేసెననుట.

తా. అని చెప్పి భుజములు చఱవఁగా నాశబ్దమునకు నదరి యచ్చటివృక్షములలోని పక్షులన్నియుఁ జచ్చి పండుటాకులురాలినట్లు నేలరాలెను అలంకరించిన యాభరణములకాంతులు వ్యాపింపఁగాఁ గొఱవివలెనే ప్రకాశించుచున్నగదను జక్రాకారముగాఁ ద్రిప్పఁబడినకొఱవివలె నగపడునట్లు గిరగిరఁద్రిప్పి స్వరోచిమీఁద వేసెను ఆదెబ్బ తన్నుఁదగులకుండునట్లు స్వరోచిగుఱ్ఱమును గుఱికిఁదొలఁగ దాఁటించెను. అప్పు డాగదపాటున నాప్రక్క నున్నయడవియంతయుఁ బొడయ్యెను. అలం. ఉత్ప్రేక్ష, నిదర్శన, అతిశయోక్తియును.

పృథ్వి. గదాహతికి నాత్మఁ గొంకక యెదిర్చి రాఁగా నిదాఁ
గదా యనుచుఁ ద్రిప్పి రాక్షసుఁడు వైచె గాఢభ్రమీ
నదత్కనకకింకిణీనటనజాగ్రదుగ్రార్భటీ
వదావదమహాగుహావలభిమైనశూలంబునున్ 100

అ గదాహతికిన్ = గుదియదెబ్బకు, ఆత్మన్ = మనస్సునందు, కొంకక = భయపడక, ఎదిర్చి = తన్నెదిరించి, రాఁగాన్ = స్వరోచిరాఁగా, ఇది = ఈసాహసము, ఔఁగదా = యుక్తమగునుగదా, అనుచున్ = అనిపలుకుచు, రాక్షసుఁడు, గాఢ . వలభి - గాఢ = అధికమైన, భ్రమీ = తిరుగుడులచేత, నదత్ = మ్రోఁగుచున్న, కనకకింకిణీ = బంగారుచిఱుగంటలయొక్క, నటన = చలించుటయందు, జాగ్రత్ = జాగరూకమైన - తప్పకకలుగుచున్నయనుట, ఉగ్ర = భయంకరమైన, ఆర్భటీ = ధ్వనిచేత, వదావద = వాచాటములైన - ప్రతిధ్వనినిచ్చుచున్న, మహాగుహా = గొప్పవియైన పర్వతగుహలయొక్క, వలభీ = ముందటిభాగములుగలది, ఐనశూలంబునున్ = అయినట్టి శూలాయుధమునుగూడ, త్రిప్పి = గిరగిరఁద్రిప్పి, వైచెన్ = స్వరోచిమీఁద వేసెను.

తా. స్వరోచి యాగదపెట్టు తప్పించుకొని తన్నెదుర్కొనిరాఁగాఁ జూచి రాక్షసుఁడు శూరుని ప్రవర్తన మిట్లుగదా యుండవలయునని ప్రశంసించి త్రిప్పునప్పుడు గణగణయని మ్రోఁగుచున్న చిఱుగంటలమ్రోఁతలకు కొండగుహలు మాఱుమ్రోయఁగాఁ దనశూలాయుధమును గిరగిరఁద్రిప్పి స్వరోచిమీఁద వేసెను. అలం అతిశయోక్తి.

శా. ఆశూలం బవనీశమౌళి వలిశాహంకారహుంకారకృ
న్నైష్ఠిత్యం బభినుత్యమై నెగడుబాణశ్రేణిఁ జెండాడి వే
కాశశ్వేతగరుత్పరంపరల నాకాశంబు దుగ్ధాబ్ధిసం
కాశం బై వెలుఁగన్ శరావళులచేఁ గప్పెం గకుప్పంక్తులన్. 101

* పృథ్వీవృత్తమునకు యతి పండ్రెండవయక్షరముగా నప్పకవీయమునందుఁ జెప్పఁబడియున్నది. ఇందుఁ దొమ్మిదవయక్షరముగా నున్నది.

టి. అవనీశమాళి=రాజశ్రేష్ఠుఁడు-స్వరోచి, కులిశా. .త్యయంబు-కులిశ=వజ్రాయుధముయొక్క, అహంకార=గర్వమునకు, హుంకారకృత్=హుం అనుధ్వనినిజేయుచున్న - నీకింతగర్వమా యని యదలించుచున్న యని యర్థము-అనఁగా వజ్రాయుధముయొక్క వాఁడిమిని మించినయనుట, నైశిత్యంబు=నిశితభావము - వాఁడిమి, అభినుత్యమై=మిక్కిలి పొగడఁదగినదై, సెగడుబాణశ్రేణిన్ = అతిశయించునట్టి బాణపంక్తిచేత, అశూలంబున్ = ఆరాక్షసుఁడు వేసినశూలాయుధమును, చెండాడి=తునుకలు తునుకలుగానఱకి, వే=శీఘ్రముగా, కాశ పరిలన్ - కాశ=రెల్లుపువ్వులవలె, శ్వేత=తెల్లని, గరుత్=రెక్కలయొక్క, పరంపరలన్ = ఎడతెగనివరుసలచేత, ఆకాశంబు=మిన్ను, దుగ్ధాబ్ధి సంకాశంబై=పాలసముద్రముతోసమానమై, వెలుఁగన్=ప్రకాశింపఁగా, శరావళులచేన్ = బాణపంక్తులచేత, కకుప్పంక్తులన్ = దిక్కులవరుసలను- ఎల్లదిక్కులను, కప్పెను.

తా. అప్పుడు రాజశ్రేష్ఠుఁడయినస్వరోచి మిక్కిలివాఁడిమి గలబాణములు ప్రయోగించి యారాక్షసుఁడు వేసినశూలాయుధమును దునుకలు తునుకలుగా నఱకివేసి వెంటనే యాకాశము పాలసముద్రమువలెఁ దెల్లఁగా వెలుఁగునట్లు తెల్లగఱులబాణముల నెల్లయెడలను నిండుకొనునట్లు ప్రయోగించెను. అలం. ఉపమ, అలంకారముచే నలంకారధ్వనియు.

క. అవి యాతనిపైతోలును, నవియింపఁగ లేక మిడిసి । యల్లటువడఁ జూ
చి వనేచరు లేచిననెఱి, దవిలినమతి నద్దిరయ్య । దయ్యం బనుచున్. 102

అ. అవి=ఆబాణములు, ఆతనిపైతోలును=ఆరాక్షసునిదేహముమీఁద తోలునుగూడ, అవియింపఁగన్ = ఛేదింప, లేక=చాలక, మిడిసి=మిట్టి - చెదరి, అల్లటుపడన్ = దూరముగాఁ బడఁగా, వనేచరులు=బోయలు, చూచి=ఆబాణములు చెదరిపడిపోవుటనుగని, ఏచిననెఱి=హెచ్చినభయము, తవిలినమతిన్=అంటినబుద్ధితో-బుద్ధియందు మిక్కిలిభయము పాదుకొనఁగా, అద్దిరయ్య=ఔరా, దయ్యంబు=ఇదిభూతము, అనుచున్=అని యనుకొనుచు-పైపద్యముతో నన్వయము.

తా. ఆరాజు ప్రయోగించిన బాణములు రాక్షసుని దేహముమీఁదఁబడి కొంచెమయినను వానిని బాధింపఁజాలక చెదరిపోఁగాఁ జూచి వేఁటకు వచ్చియున్న బోయలందఱును మిక్కిలిభయపడి యారా యిది పెద్దదయ్య మని యెంచి. అలం కావ్యార్థాపత్తి.

సీ. పక్కుపక్కున నంఘ్రిపాశముల్ వెసఁ ద్రెంచి, డేగతండములమింటికెగిని విడిచి
గళగళధ్వనులతోఁ । గంఠశృంఖల లూడ్చి, సుడివడఁ గుక్కల । నడవిఁగలిపి
గుప్పుగుప్పున మోచికొనియున్న వలలతోఁ, బలలంపుఁబొత్తరల్ । పాఱవైచి
కంగుకంగున నేలఁ । గైదప్పఁగాఁ బడు, వేఁటమ్ములేఱక । దాఁటి దాఁటి
తిరిగి చూచుచు దప్పెగఁ । దీసికొనుచు
దగలు దొట్టియథాయథ । లగుచు విఱిగి
యొకఁడు వ్రాయిన త్రోప వేఱొకఁడుపోక
చెట్టొకఁడు గాఁగ బఱచిరి । చెంచు లపుడు. 103

అ. అపుడు = ఆసమయమునందు, చెంచులు=బోయలు, పక్కుపక్కునన్ = పుటుకుపుటుక్కుమనట్లు, అంఘ్రిపాశములు=కాళ్లత్రాళ్లు, వెసన్=వడిగా, త్రెంచి=తెగఁదీసి, డేగతండములన్=డే

గలగుంపులను, మింటికిన్ = ఆకాశమునకు - ఆకాశమున కెగిరిపోవునట్లనుట, విడిచి = వదలి, గొగ్గొరధ్వనులతోన్ = గలగలయనుచప్పుళ్లతో, కంఠశృంఖలలు = మెడగొలుసులు, ఊడ్చి = ఊడఁదీసి, సుడిఁబడన్ = కలఁతనొందునట్లుగా, కుక్కలన్ = వేటకుక్కలను, అడవిఁ గలపి = అడవిపాలుచేసి - వానియిచ్చచొప్పునఁ బాఱిపోవునట్లు చేసియనుట, గుప్పుగుప్పనన్ = గుప్పుగుప్పనుచప్పుడులతో, మోచుకొని = మోసికొని, ఉన్నవలలతోన్ = ఉన్నట్టివేఁటవలలతోడ, పలలంపుఁబొత్తరలు = మాంసపుఁబొట్లములు, పాఱవైచి = దూరముదూరముగాఁబడవేసి, కంగుకంగునన్ = కంగుకంగునునట్లు, నేలన్ = భూమిమీఁద, కైదప్పు = చేతిజారపాటు, కాన్ = అగునట్లు, పసువేఁటమ్ములు = జాతిపసువట్టి వేఁటకొఱకు వెడిబాణములను, ఏఱక = ఏర్పఱచియెత్తుకొనక, దాఁటిదాఁటి = ఎగిరియెగిరిపడుగెత్తి, తిరిగి = వెనుకకుఁదిరిగి, చూచుచున్ = (రాక్షసుఁడు తమ్ము వెంబడించెనేమోయని) చూచుచును, దట్టు = మొలనుగట్టినకాసెకోకలు, ఎగఁదీసికొనుచున్ = (విడిజాఱగా) నెగఁద్రోసికొనుచు, దగలు = దప్పులు, తొట్టి = అతిశయించి, యథాయథలు = ఎక్కడివారక్కడనే తొలగినవారు - ఒకరితో నొకరు సంబంధములేనివారు, అగుచున్ = అవుచును, విరిగి = చెదరి, ఒకఁడు పోయినత్రోవ వేరొకఁడుపోక, చెట్టొకఁడుగాఁగన్ = ఒక్కొక్కచెట్టున కొక్కొక్కఁడుగా, పఱచిరి = పాఱిపోయిరి.

తా. ఆసమయమునందు బోయలందఱు నారాక్షసునిఁ జూచి వెఱచి డేగలకాళ్లకట్లు విప్పి డేగలను బాఱవిడిచినవారును, వేఁటకుక్కల మెడగొలుసులు విడఁదీసి యథేచ్ఛముగాఁ బోఁదఱిమినవారును, వలలు మాంసపుఁగావళ్లు మొదలయినభారములను బడవేసి పాఱిపోయినవారును, జేతనున్న విండ్లమ్ములు జాఱిపడిపోఁగాఁ బోయినం బోనిమ్మని వదలుకొని పరుగెత్తువారునై యతివేగముతో నొకరినొకరు విచారింపక యెవఁడు పట్టినత్రోవ వాఁడదిగా నొక్కొక్కచెట్టొక్కొక్కఁడు మఱుఁగుచేసికొని రాక్షసుఁడు వెంబడించి వచ్చుచున్నాఁడో యని తిరిగితిరిగి చూచుచుఁ బాఱిపోయిరి. అలం. స్వభావోక్తి.

క. ప్రోపు దలపోసి నిలువక, పాపాత్మకమై కిరాతబల మటు పాఱఁగ
భూపతి యయ్యింతి హయ, స్థాపితఁ గాఁ జేసి పలికెఁ దన్ముఖ్యులకున్. 104

అ. ప్రోపు = రాజుయొక్క పోషణమును, తలపోసి = యెంచి, నిలువక = రాజునకుసహాయమై నిలువక, పాపాత్మకమై = పాపపుమనస్సుకలదై - కృతజ్ఞతలేని మనస్సుగలదైయనుట, కిరాతబలము = బోయలదండు, అటు = ఆవిధముగా, పాఱన్ = పాఱిపోఁగా, రాజు = స్వరోచి, అయ్యింతిన్ = ఆరాక్షసుఁడు తఱుముకొనిరాఁగా వెఱచివచ్చి తనయండఁ జేరిన స్త్రీని, హయస్థాపితఁ గాన్ = గుఱ్ఱముమీఁద నుంపఁబడినదానిఁగా, చేసి = చేసికొని - అనఁగాఁ దనగుఱ్ఱముమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని, తన్ముఖ్యులకున్ = ఆబోయదండునందు మొనగాండ్రగువారితో, పలికెన్ = ఇట్లనిపలికెను.

తా. మీఁదఁ జెప్పినచొప్పున నెనరులేని దైవయాబోయదండు తమయేలినవాని నొంటరిగా విడిచిపెట్టిపోవుట న్యాయముకాదను విచారములేక పాఱిపోఁగా రాజైనస్వరోచి తనయండఁ జేరినయాపడుచునెత్తి గుఱ్ఱముమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని బోయలలో ముఖ్యులయినవారినిగూర్చి యిట్లుపలికెను

కైదువు లున్న పూజ్యములు కంకటకేటశిరస్త్రలత్రముల్
లే దరదంబు తత్తడి హయాళికి సహాయమ్ము సర్వమంగళం
బీదనుజుండు చిక్కె భయ మేటికి లుబ్ధకులార యాత్మకుం
బేదతనంబు మేలె మఱి మృత్యువు డాఁగెడిచోటు లేదొకో. 105

అ. పెద్దకులార=ఓబోయలారా, కైదువు=ఆయుధము,సున్న=లేదు,కంకట..ములు-కంకట=కవచమును, ఖేటక=డాలువాలును, శిరస్త్రత్రములు=శిరస్సును రక్షించు తొడుపును, పూజ్యములు=సున్నలు-లేవు, అరదంబు=లేరు, లేదు, తత్తడి=గుఱ్ఱము, హుళిక్కి=లేదు, సహాయము=తోడు,సర్వమంగళంబు=ఏమియులేదు, ఈవనుజుండు=ఇటువంటియీరాక్షసుఁడొకఁడు, చిక్కె=మనచేతిలోఁజిక్కెను, భయము=వెఱపు, ఏటికిన్=ఎందుకు,ఆత్మకున్=మనసునకు, పేదతనంబు=పిఱికితనము, మేలె=మంచిదా-మంచిదికాదనుట,మఱి=మఱియు, డాఁగెడుచోటన్=మీరుపరుగెత్తిపోయిదాఁగుకొనునట్టి తావునందు, మృత్యువు=చావు, లేదొకో=కలుగదోయేమో-ఎక్కడనున్నను జావువచ్చునప్పటికి రానేవచ్చుననుట.

తా. ఓరిబోయవాండ్రారా! ఈరాక్షసుఁడు కత్తి డేఱెము మొదలయినసాధనములుగాని కవచకిరీటములుగాని గుఱ్ఱము మొదలైన వాహనములు గాని తోడుగాని లేకయొంటరియై మన చేతికిఁజిక్కినప్పుడు వీనిఁబట్టి మర్దించుటకు యత్నింపక వెఱచి పరుగెత్తుచున్నారు. ఇంత పిఱికితనముతగునా? ఒకవేళఁదగుననుకొని వీనివలనిచావు తప్పించుకొనిపోయి దాఁగినను దాఁగినట్టియాచోటమాత్రము చావక చిరకాలము బ్రదుకఁబోయెదరా? ఎక్కడనున్నను జావువచ్చినప్పుడు తప్పకచచ్చువారేకాని చావకబ్రదుకువారెవరును లేరు.

ఆ. నీడఁ గడవఁ బాఱ | నేలకు వెలి గాఁగ, నడుగు వెట్టి తిరుగ | నాత్మ మొఱఁగి
యొకటిఁ దలఁప నరుల | కొదవిన నొదవదే, కరణి మృత్యుదేవిఁ | గన్నుఁ బ్రామ.

అ. నరులకు = మనుష్యులకు, నీడన్=తననీడను, కడవన్= మీఱునట్లు, పాఱన్=పాఱిపోవుటకును, నేలకున్=భూమికిని, వెలి=వెలుపలిది, కాఁగన్=అగునట్లు, అడుగు=పాదమును, పెట్టి=ఉంచి, తిరుగన్=సంచరించుటకును, ఆత్మన్ = మనస్సును, మొఱఁగి=వంచించి, ఒకటిన్= ఏదేనొకదానిని, తలఁపన్=తలఁచుటకును, ఒదవినన్ = సిద్ధించినను- సామర్థ్యముకలిగిన ననుట, ఏకరణిన్ = ఏవిధముచేతను, మృత్యుదేవిన్=మృత్యుదేవతను, కన్నుఁబ్రామన్ = కన్నుమాయను-వంచింపననుట, ఒదవదు=సిద్ధింపదు- సామర్థ్యము కలుగనేరదు

తా. నీడను మీఱిపాఱిపోవుట, నేల నంటకనడచుట, మనసునకుఁ దెలియకయాలోచనచేయుట యనునసాధ్యకార్యములు సాధ్యములయినను మృత్యువునకుఁజిక్కకతప్పించుకొనుట యేవిధము చేతను నేమనుష్యునకును సాధ్యముకాదు. అలం. అప్రస్తుతప్రశంస.

క. చావుఁ దలపోసి మానవుఁ, డేవగ దుష్కీర్తిఁ బొరయ | కే దినములు పొం
దై వెడలునట్లు నడవఁగ, దైవం బట మీఁద మేలు | తాన ఘటించున్. 107

అ. మానవుఁడు=మనుష్యుఁడు, చావున్=మరణమును, తలపోసి=(తప్పకవచ్చునదిగాఁ)దలఁచి, ఏవగన్=ఏవిధముచేతను, దుష్కీర్తి=అపకీర్తిని, పొరయకే=పొందకయే, దినములు=దివసములను, పొందై=అనుకూలమై, వెడలునట్లు=కడచునట్లు, నడవఁగన్=ప్రవర్తింపఁగా, అటమీఁదన్=అంతను మీఁద, దైవంబు=విధి, తాన=తానే, మేలు=శుభమును, ఘటించున్=కూర్చును-పొందించుననుట.

తా. మనుష్యుఁడు తాను జచ్చువాఁడ ననునిశ్చయముతో నపకీర్తికలుగనిమార్గమున వర్తింపఁగా నందులకుఁ దగినట్టు దైవమును శుభము నొనఁగూర్చును గనుక మీరు పాఱిపోయి యపకీర్తి తెచ్చుకొనక ధైర్యముతో నిలిచి యీరాక్షసునిఁజంపి జయమును గీర్తిని బొందుఁడు. అలం. అప్రస్తుతప్రశంస.

సీ. బుద్ధీంద్రియక్షోభములకుఁ బెట్టనికోట, విపదంబురాశిదుర్వికృతి కోడ
ఖలదురాలాపమార్గణవజ్రకవచంబు, రణమహీస్థలికి శ్రీరామరక్ష
శాత్రవదుర్గర్వసంస్తంభనౌషధి, మొనయుచింతాశ్రేణి మూఁకవిప్పు
యోగాదిసంసిద్ధులోనఁగూర్చు పెన్నిధి, తూలునేకాకులతోడునీడ
సకలసుగుణప్రధానంబు సకలకార్య, జాలసాఫల్యకరణైకసాధనంబు
ధైర్యగుణ మట్టిధైర్యంబుఁదక్కి పోరఁ, దత్తఱింతురె యకట మీతరమువారు

అ. ధైర్యగుణము=చలింపనితాలిమి యనెడిగుణము, బుద్ధీంద్రియక్షోభములకున్ - బుద్ధి = మతియొక్కయు, ఇంద్రియ = కన్ను ముక్కు మొదలయినయింద్రియములయొక్కయు, క్షోభములకున్ = కలఁతలకు, పెట్టనికోట=ఒకరుపెట్టకయేయేర్పడినకోటవంటిది - కోట యెట్లుపరులనులోపలఁజొరనియ్యదో యట్లు మనసులోపల గలఁతను జొరనియ్యనిదనుట. విప ...కృతికిన్ - విపత్ =ఆపదలనెడి, అంబురాశి=సముద్రముయొక్క, దుర్వికృతికిన్=దుష్టమయినవికారమునకు-ఉపద్రవమునకు, ఓడ=నావవంటిది-దాఁటించునదియనుట, ఖల. కవచంబు-ఖల=దుర్జనులయొక్క, దురాలాప = చెడ్డమాటలనెడి, మార్గణ=బాణములకు, వజ్రకవచంబు=వజ్రములతోఁ గూర్చినకవచమువంటిది-బాణములవంటియుల్లికట్టుమాటలవలనిసంకటమును దోఁచనీయనిదనుట, రణమహీస్థలికిన్ =యుద్ధభూమికి, శ్రీరామరక్ష =శ్రీరాముని దైనకాపుదలవంటిది, శాత్రవ ...షధి-శాత్రవ=పగవారియొక్క, దుర్గర్వ = చెడ్డయహంకారమునకు, సంస్తంభన=చక్కఁగా స్తంభింపఁజేయునట్టి, ఓషధి=మూలికవంటిది- శత్రువులగర్వమును సాగనియ్యనిదనుట, మొన...విప్పు- మొనయు=కలుగుచున్న, చింతాశ్రేణి=దుఃఖపంక్తికి, మూఁకవిప్పు=చేరికనుదొలఁగించునది- చేరనియ్యనిదనుట, యోగాదిసంసిద్ధులు-యోగ=ఇష్టవస్తుప్రాప్తి, ఆది=మొదలయినవానియొక్క, సంసిద్ధులు=చక్కఁగాసిద్ధించుటలను, ఒనఁగూర్చు పెన్నిధి=జతఁగూర్చునట్టిమూకలపాఁతరవంటిది, తూలు ...నీడ- తూలు=చలించిన, ఏకాకుల=ఒంటరిగాండ్రకు, తోడునీడ = ఎడఁబాయనితోడైనది-సహాయములేనివారికి సహాయమగునది సకలసుగుణప్రధానంబు = ఎల్లమంచిగుణములందును ముఖ్యమయినది, సకల...నంబు- సకల=సమస్తమయిన, కార్య=పనులయొక్క, జాల=సమూహముయొక్క, సాఫల్య=సఫలత్వమును - నెఱవేఱుటను, కరణ=చేయుటకు, ఏక = ముఖ్యమైన, సాధనంబు=ఉపకరణము, అట్టిధైర్యంబున్ =అటువంటిధైర్యగుణమును, తక్కి=విడిచి, పోరన్ =యుద్ధమునందు, మీతరమువారు=మీవంటివారు, తత్తఱింతురె=తమకుదురా-తమక నేరరనుట.

తా. ధైర్యగుణము బుద్ధి మనస్సు మొదలగు నింద్రియములను, గలఁతనొందనియ్యదు మేరలేని దుఃఖము నణఁచివేయును. దుర్జనులు దూషించినను చిత్తవికారము కలుగనియ్యదు. యుద్ధమునందుఁ దన్నుఁగాపాడును. పగవానిగర్వము నణఁగఁగొట్టును విచారమును దగ్గఱఁజేరనియ్యదు. ఇష్టవస్తుప్రాప్తిమొదలైనమేలుల నొనఁగూర్చును తోడులేనప్పుడు తొలఁగనితోడగును కావలసిన పనులను గావించుటకు ముఖ్యసాధనమగును కనుక నెల్లసద్గుణములలోపల ధైర్యము ముఖ్యమయిన సద్గుణము. అటువంటిధైర్యగుణమును విడిచి యుద్ధమునందుఁజలించి పాఱిపోవుట మీబోఁటిధీరులకుఁ దగదు. అలం. రూపకము. ఉల్లేఖమును.

క. అని తెలిపి తిరుగుఁ డనుటయు, మనమున లజ్జించి యెలుకుమన్నీ లిక నీ
జనపతితోఁడిద పోకం, బని తమతమ మొనలు ద్రిప్పి రవియును దిరిగెన్. 109

అ. అన్న = ఇట్లుచెప్పి, తెలవి = తెలిగవిలుగఁజేసి, తిరుగుఁడు = వెనుకకు మరలుఁడు, అనుట యున్ = అనినతోడనే, (కర్త-స్వరోచి) ఎఱుకుమన్నీలు = బోయరాజులు, మనమునన్ = మనసునందు, లజ్జించి=సిగ్గుపడి, ఇఁకన్ = ఇంకను, ఈజనపతితోడిద = ఈరాజుతోఁగూడినదే, లోకంబు = మనలోకమును-అనఁగాఁ జచ్చినను బ్రతికినను మన మీరాజుతోపాటుగా నుండవలసినవారము నుట, అని = ఇట్లునిశ్చయించుకొని, తమతమమొనలన్ = తమతమసేనలను, త్రిప్పిరి = మరలించిరి, అవియును = ఆసేనలును, తిరిగెన్ = మరలెను.

వ. ఇట్లు తిరిగి యుక్కెక్కి రక్కసుం డెక్కడెక్కడ నని యక్కొంటబలంబు లగుడంబులు గటారు లీఁటెలు పందీఁటెలు విండ్లు గంద్రగొడ్డండ్లుఁ జిల్లకోలలుఁ బంట్రకోలలు మెఱయ రయసముద్ధూతధూళిధూసరితధారాధరపథం బగుచు నొక్కపరియ చీమపరి యనం గవిసె నందు. 110

అ. ఇట్లు=ఈవిధముగా, తిరిగి=మరలినదై, అక్కొంటబలంబు=ఆబోయలదండు, ఉక్కెక్కి = శౌర్య మతిశయించి, రక్కసుండు=రాక్షసుఁడు, ఎక్కడెక్కడ=ఎక్కడనున్నాఁ డెక్కడనున్నాఁడు, అని, లగుడంబులు=దుడ్డుఁగఱ్ఱలును, కటారులు=కత్తులును, ఈఁటెలును, విండ్లు=ధనుస్సులును, గంద్రగొడ్డండ్లు=చంద్రరేఖవలెవంపుగానుండుగొడ్డండ్లును, చిల్లకోలలు=దోఁటినంటిచిన్నయవయవముతోడి మొనగలబల్లెములును, పంట్రకోలలు=మూఁదిగనూఁదివంటి మూఁడునాలుగుఅలుఁగులు గలకఱ్ఱలును, మెఱయన్ =ప్రకాశింపఁగా, రయ . పథంబు-రయ=(నడకయొక్క) వేగముచేత, సముద్ధూత=రేఁపఁబడిన, ధూళి=దుమ్ముచేత, ధూసరిత=ఇంచుక తెల్లగిలిన, ధారాధరపథంబు=ఆకాశముగలది, అగుచున్=అవుచును, ఒక్కపరియ = ఒక్కసారిగానే, చీమపరి = చీమలబారో, అనన్ = అనునట్లు, కవిసెన్ = ఆరాక్షసు నాక్రమించెను అందున్ = అట్లుకవిసినయూదండునందు-వైపద్యముతో నన్వయము.

మ. శరసంధానముతోనె కొన్నియడుగుల్ జౌజవ్వనం బాఱి య
ద్ధరణిం గాల్కొని ద్రోణముల్ దివియు దోర్దండంబులం జేర్చి యే
సిరి బోయల్ దిను మంచు నార్చి పరఁగం జిట్టాసలం డాయుచుం
గొరవంకల్ మొఱవెట్టినట్లు గుణముల్ ఘోషింప రోషింపుచున్. 111

అ బోయలు = కిరాతులు, రోషింపుచున్ = కోపించుచును, శరసంధానముతోనె = బాణమును వింటఁగూర్చుటతోడనే, కొన్నియడుగులు = కొన్నియంగలపట్టు, జౌజవ్వనన్ = నేలజవజవలాడునట్లు, పాఱి=పరుగునఁబోయి, అద్ధరణిన్ = ఆప్రదేశమునందు, కాల్కొని = కాలూనినిలిచి, ద్రోణముబు = దోణములను - చేపట్టుకోలఁడి సన్నముగాఁ జెక్కఁబడినదుంగలను, దివియుదోర్దండంబులన్ =క్రిందుమీఁదుగాఁ ద్రిప్పునట్టి (అనఁగా నిట్టిసాదనచేత బల మెక్కినట్టి) కఱ్ఱలవంటిభుజములతో, చేర్చి=ఆకర్షించి, గోరవంకలు= గోరువంకపక్షులు, మొఱపెట్టినట్లు=గట్టిగానఱచినట్లు, గుణము=అల్లెత్రాడు, ఘోషింపన్ = మొరయఁగా, చిట్టాసలన్ = కొంచెమైనయాసలతో -- చావక బ్రదుకుదుమనునాశ పూర్ణముగాలేకయే యనుట (పా. చెట్టాసలన్ = వృక్షములమాటున.) పరఁగన్ = ఒప్పునట్లు, డాయుచున్ = రాక్షసునిసమీపించుచు, తినుము = ఇదిగో నీనిభక్షింపుము, అంచున్ =అనిపలుకుచు, ఆర్చి = బొబ్బరించి, ఏసిరి=బాణములను బ్రయోగించిరి.

తే. ఆశరావళి నమ్మనుజాశనుండు, లీల మృగదంశకము మశకాలి నొడిసి
చప్పరించువిధంబున శాతదీర్ఘ, దంష్ట్రికలఁ జప్పరించి రౌద్రమునఁ గెరలి. 112

అ. అమ్మనుజాశనుండు = మనుష్యులనుదినువాఁడైన యారాక్షసుఁడు, ఆశరావళిన్ = బోయలుప్రయోగించిన యాబాణపంక్తిని, లీలన్ = అనాయాసముగా, మృగదంశకము=కుక్క, మశకాలిన్ = దోమలపంక్తిని, ఒడిసి = ఆకర్షించిపట్టి, చప్పరించువిధంబునన్=అంగిటనదిమికొనునట్లు, శాత ... లన్ -- శాత=వాఁడిగలవియు, దీర్ఘ=నిడుపైనవియునైన, దంష్ట్రికలన్=కోఱపండ్లచేత, చప్పరించి = అంగుటనదిమిపట్టినమలి, రౌద్రమునన్ = భయంకరత్వముతో, కెరలి= విజృంభించి. పైపద్యముతో నన్వయము. అలం. ఉపమ.

సీ. గళితశృంఖలమైన గంధనాగము వోలెఁ, బ్రజలపైఁ బేరెముల్ పాఱి పాఱి
కలశాబ్ధి మథియించు కైటభాంతకులీల, జవ మొప్పఁ జేతులు సాఁచి సాఁచి
కన లూను కీనాశ కాసరమ్మును బోలెఁ, గమిచి తట్టువగుంపుఁ జమరి చమరి
యమృతాపహరణార్థ మరుగుపక్షిస్వామి, గతిఁ బుళిందశ్రేణిఁ గమిచి గమిచి
సెలవులు బిగించి నేత్రదంష్ట్రికలు మెఱయ
నిడుద మొగ మెత్తి మీసల నెత్తు రొలుకఁ
బటపట కపాలపంక్తులఁ బగులఁ గొఱికి
బలము నెల్లను గడియలోపలన మ్రింగె. 113

అ. గళితశృంలము = జాఱిపోయినగొలుసులుగలది, ఐనగంధనాగమువోలెన్ = అయినట్టి మదపుటేనుఁగువలె, ప్రజలపైన్ = సేనాజనులమీఁద, పేరెముల్ పాఱిపాఱి = పలుమాఱుపరుగులెత్తియు, కలశాబ్ధి = పాలసముద్రమును, మథియించుకైటభాంతకులీలన్ = త్రచ్చుచున్నవిష్ణుదేవునివలె, జవము=వేగము, ఒప్పన్=ఒప్పునట్లు, చేతులు సాఁచిసాఁచి=మాటిమాటికిఁ జేతులుచాఁచియు, కనలు= కోపమును, ఊను ..బోలెన్ -ఊను = పొందునట్టి, కీనాశ=యమునియొక్క, కాసరమ్మునుబోలెన్= ఎనుఁబోతువలె, కమిచి=ఒడిసిపట్టి, తట్టువగుంపున్=మట్టపుగుఱ్ఱముల సమూహమును, చమరిచమరి = మిక్కిలిచదియఁగొట్టియు, (పా. కవిసి = తారసించి జవిరిజవిరి = మాటిమాటికిఁగొట్టి.) అమృతాపహరణార్థము = అమృతముఁగొనివచ్చుటకు, అరుగుపక్షిస్వామిగతిన్ = పోవునట్టిపక్షిరాజైన గరుత్మంతునివలె, పుళిందశ్రేణిన్ = బోయలబారును, కమిచికమిచి = ఒడిసిపట్టి మ్రింగిమ్రింగియు, సెలవులు= పెదవులమూలలను, బిగించి = బిగఁబట్టి, నేత్రదంష్ట్రికలు=కన్నులును కోఱపండ్లును, మెఱయన్= ప్రకాశించునట్లు, నిడుదమొగము=నిడుపైనమొగమును, ఎత్తి=పైకెత్తి, మీసలన్ = మీసములమీఁదుగా, నెత్తురు=రక్తము, ఒలుకన్=తొనికిసలుచుండఁగా, కపాలపంక్తులన్=తలపుఱ్ఱెలసమూహములను, పటపట=పటపటయనుధ్వనితో, పగులన్ = పగిలిపోవునట్లు, కొఱికి = నమలి, బలము నెల్లన్= సమస్తకిరాతసేనను, గడియలోపలన = గడియకాలములోపలనే, మ్రింగెన్=తినివేసెను.

తా. గొలుసులవలన విడివడిన మదపుటేనుఁగు జనులపైఁబడిఁ బాఱునట్లు వడిగొని పాఱియు, విష్ణువు పాలసముద్రమును ద్రచ్చునపుడు తరిత్రాడు లాగుటకై చాఁచినట్లు జనులను బట్టుకొనుటకై చేతులుచాఁచియు, యమునివాహనమైనయెనుఁబోతు మట్టపుగుఱ్ఱములను జూచునెడ నేల నడఁగఁ గొట్టునట్లు గుఱ్ఱముల నణఁగఁగొట్టియు, నమృతము తేఁబోవునప్పుడు గరుత్మంతుఁడు సముద్రమున

నున్న నీరాఖులను మ్రింగినట్లు బోయలగుంపునుబట్టి మ్రింగియు, న్నోటనుండి నెత్తుటు తొనికిపడునట్లు తలపుర్రెలు షాడిపాడిగా నమలి మ్రింగివేసియు గడియసేపటిలోపలఁ దన్ను నాక్రమించిన కిరాత సేన నెల్లను దినివేసెను. అలం ఉపమ

క. ఆసమయంబున గీర్వా, ణీసుతుఁ డయ్యింతి నొక్కకనికటనికుంజా
వాసమ్మున నిడి క్రమ్మఱి, వే సురరిపుఁ దాఁకెఁ దురగవేగము మెఱయన్. 114

అ. ఆసమయంబునన్ = అటువంటిసమయంబునందు, గీర్వాణీసుతుఁడు=దేవతా స్త్రీయైనవరూథినికొడుకు- స్వరోచి, అయ్యింతిన్ = తనతోడగుఱ్ఱముమీఁదనున్న యా స్త్రీని, ఒక్క... మ్మునన్ - ఒక్క = ఒకానొక, నికట = సమీపమునందలి, నికుంజావాసమ్మునన్ = పొదరింటియందు, ఇడి= ఉంచి- కూర్చుండఁబెట్టియనుట, క్రమ్మఱి = మరలి, తురగవేగము = గుఱ్ఱమునడకవడి, మెఱయన్ = ప్రకాశింపఁగా - అతిశయింపఁగాననుట, వే = శీఘ్రముగా, సురరిపున్ = దేవశత్రువైన రాక్షసుని, తాఁకెన్ = ఎదిరించెను.- అనఁగా నప్పుడు స్వరోచి తనతోడ గుఱ్ఱముమీఁదనున్న చిన్నదానిని దించి యొక పొదరింటనుంచి మరల రాక్షసు నెదిరించెనని తాత్పర్యము

వ. ఇట్లు తలపడి యమ్మనుజదనుజులు బీరంబులు దోరంబులుగాఁ బోరుతఱి భూగమణుండు గ్రుద్ధుండై సమిద్ధరణి బద్ధపరంపర యగునంపఱం బెంపఱఁ జంప రాదు నిలింపారాతి నని వితర్కించి కించిత్తును గొంచక కాంచనద్రవకంచుకితంబును దరణికిరణకాండచండంబును నయి యాఖండలదోర్దండసముజ్జృంభితవజ్రాయుధచకచకం బకపక నవ్వువజ్రభేదియలుంగు వెలుంగ మత్తారులకు నుత్తలంబిడున త్తలంబును బద్మరాగమణిచూడం బగు కేడెంబునుం గొని నేడెంబుసందురంగంబుఁ బఱపి తెఱపి గని తఱటు చేసి యొరసి చన నుఱికించి కఱకుటగిబరి పఱియ వడం బొడిచి కడచి నిలిచినం బెలుచనం బరిగోల పోటున నాటోపించు మత్తకరివృత్తి నెత్తు రొలుక నక్తంచరుం డుదంచితగతి సవ్యదిశ కొత్తి తెఱపు నపసవ్యగతిం జాళెంబున హయంబుఁ బొసిచ్చుచు నచ్చరకొడుకు దిరిగితిరిగి సింగిణి నేయుచుఁ జుట్టుకొని రా మనుజాశియు నట్టట్ల వెనుకవెనుక కడు గిఱుచు నడ్డంబుగా నడవికడ కొత్తికొని నడచి యొడుదొడుకగుడు బెడిదంపునడక నడరి కడకాళ్ల కొడియం జిక్కి రక్కసునకుం దుఃఖారం బనునాలోన నడిదంబునం బుడమిపతి వెడవిసరు విసరి యసురవరు కరాంగుళంబులు దెగనడిచె నడిచిన నుసి వడక మడమలం దాటించిన ఘోటకంబు వెగ్గలంబుగ మొగ్గియు నగ్గలిక పైడెక్క మోఁకరించుకొని కొన్ని యడుగులు చని సేకరించుకొని కంచుమించుగం బఱచుట గగనచరుల వెఱఁగు పఱచె నట్లు పఱచినం గందంబుఁ బఱచి మొగంబు దుడిచి ప్రస్తుతులఁ గుస్తరించి యతిరభసఫూత్కారఘోరారావంబుతో ఘోణారంధ్రనిశ్వాసగంధవాహప్రవాహంబు వెడలువాహంబుదగ మట్టుపడ నిట్టట్టు మట్టించుచు నాస్వరోచి నిశాచరునుద్యోగంబు చూచికొనవలసి నిలిచి యంతస యతం డొక్కతరువుఁ గరయుగళినిఱియంబట్టి పెల్లగింప మల్లాడునాలోనసె గల్లున్నం

గింకిణులు మొరయ మెఱుంగు మెఱసినగతి మరల హారిం బఱపి యొక్క రెండు మూఁడు గొరకల నెఱికులు గాఁడ గుబ్బకొలందికిం దిగవైచి క్రమ్మను విడిపించి యొలయించుకొని బయలు వెడలించి దోషాచరుండు పాషాణమ్ముల కెపుడెపుడు వంగె నపు డపుడెల్లం దురంగంబు నేంటం దోలి గంటి యిడి వెంటంబడుటయు గెంటించి లేదుబంతి యన్నయ ట్లల్లంత నుండి వాగె సడలించి పగతుపై నిగిడి వాగెఁ గుదియింప ముంగాళ్లు గగనంబున రా నగిడించి యందెచప్పుడుం గింకిణీరవంబును నురువు గీసినగతిం దేఁటి క్రమ్మోసిన క్రియ నాదాఱక యేదిక్కుఁ జూచిన నాదిక్కుననే వినంబడ నెక్కడఁ జూచినం దానయై నీడ యేర్పడక పార్శ్వంబులం గట్టుకెంబట్టులాలసరి సమకట్టుటెక్కలుగా యాతుధానుం డనుకొండచిలువ నోడియ నేలపఱపుగా నాడుగరుడుం డనం బాయుచు డాయుచు దవ్వులం బొలసి కుఱంగటం దోఁచి కుఱంగట నని చూడ దవ్వులం బొలసి దవ్వుచేరువలనిర్ధార్యంబులుగా మెలంగం దేజికాశ్వంబు మెలంపుచు వింటనుం బంట్రకోలల నడిదంబున నత్తలంబున నేసియు వ్రేసియు నడిచియుం బొడిచియుం గడపలం గానక విఱిడిసి మృతుండునుం గాని దానవునిం జూచి వేసరి రోసంబున. 115

అ. ఇట్లు = ఈవిధముగా, తలపడి = ఎదిరించి - ఎదిరింపఁగా ననుట, అమ్మనుజదనుజులు = అమనుష్యుఁడును రాక్షసుఁడును, భీరంబులు = పరాక్రమములు, తోరంబులుగాక = అతిశయించి నవికాఁగా, పోరుతఱి = యుద్ధముచేయునప్పుడు, భూరమణుండు = రాజు - స్వరోచి, క్రుద్ధుండై = కోపించినవాఁడై, సమిద్ధరణి = యుద్ధభూమియందు, బద్ధపరంపర = కట్టఁబడిన చాల్పులు గలది, అగునంపఱ = అయిన బాణసమూహముచేత, నిలింపారాతి = దేవశత్రువును - రాక్షసుని, పెంపఱ = ఆధిక్యముచెడునట్లు, చంపరాదు = వధింపనలవిగాదు, అని, వితర్కించి = తన లోవిచారించి, కించిత్తును = కొంచెమయినను, కొంచక = వెనుదీయక, కాంచన...బును - కాంచనద్రవ = బంగారునీటిచేత, కంచుకితంబును = మొలాము చేయఁబడినదియు, తరణి ..బును-తరణి = సూర్యునియొక్క, ఖర = తీక్ష్ణమైన, కిరణకాండ = వెలుఁగులసమూహమువలె, చండంబును = వాఁడిమిగలదియు, అయి = ఐ, ఆఖండల . చకచక - ఆఖండల = ఇంద్రునిదైన, దోర్దండ=కఱ్ఱవంటిభుజమునందు, సముజ్జృంభిత = మిక్కిలి వెలుఁగఁజేయఁబడిన, వజ్రాయుధ = వజ్రమనెడి యాయుధముయొక్క, చకచక = కాంతివిశేషమును, పకపకనవ్వు వజ్రభేదియలుంగు = పకపక యనెడిధ్వనితోఁ బరిహసించునట్టి వజ్రభేది యైన మొనగలబాణము, (వజ్రభేది = వజ్రకవచమును భేదించునది, లేక వజ్రాయుధమును భేదించునది), వెలుంగ = ప్రకాశింపఁగా, (అలం. ఉపమ) మాత్తారులకు = మదించినశత్రువులకు, ఉత్తలంబు = పరితాపమును, ఇచ్చునత్తలంబును = కలుఁగఁజేయునట్టి యీఁటెను, పద్మరాగమణిచూడంబు = కెంపులుచెక్కిన గుబ్బలుగలది, అగు కేడెంబును = అయినట్టిడాలువాఱును, కొని = చేతఁబట్టుకొని, వేడెంబునఁ = చుట్టుపరుగుచేత, తురంగంబుఁ = గుఱ్ఱమును, పఱపి = పరుగెత్తించి, తెఱపి = అవకాశము, కని = చూచుకొని, తఱటుచేసి = కొంగ డాలోఁగ్గొట్టి, ఒరసిచనక = రాక్షసునిరాచుకొనిపోవునట్లు, ఉఱికించి = దుమికించి, కరవటరిబరి= కఠినుఁడయినపగవానిదేహపార్శ్వము, పఱియపడఁ = బ్రద్దలుగాఁజీలునట్లు, పొడిచి = (తనచేతియీఁ

బెతోస్వఁగొచ్చి, కడచి = ఆవలికిదాఁటి, నిలిచినన్ = నిలఁబడఁగా, పెలుచనన్ = అగ్రహముతో,
బరిగోలపోటునన్ = ప్రక్కలఁబొడుచునట్టియాయుధముయొక్కపోటుచేత, ఆటో. వృత్తి - ఆటో
పించు = విజృంభించునట్టి, మత్తకరివృత్తిన్ = మదపుటేనుఁగువిధమున, నెత్తురు = రక్తము, ఒలు
కన్ = దేహమునందుండి చిందుచుండఁగా, నక్తంచరుండు = రాక్షసుఁడు, ఉదంచితగతిన్ = తగిన
రీతిని, సవ్యదిశకున్ = ఎడమప్రక్కకు, ఒత్తి = త్రోసికొని, తఱుమన్ = వెంబడించి పరుగెత్తిం
పఁగా, అపసవ్యగతిన్ = కుడిప్రక్కపోవునట్లుగా, జాళెంబునన్ = ప్రక్కవాటునడకతో, హయం
బున్ = గుఱ్ఱమును, పోనిచ్చుచున్ = పోవునట్లునడపుచు, అయ్యచ్చరకొడుకు = అప్సరసయయిన
యూవరూథినికొడుకు - స్వరోచి, తిరిగితిరిగి = చుట్టిచుట్టి, సింగిణిన్ = శృంగధనుస్సుచేత, ఏయు
చున్ = బాణములనుప్రయోగించుచు, చుట్టుకొనిరాన్ = తన్నుఁజుట్టుకొని వచ్చుచుండఁగా, మను
జాశియున్ = నరభోజనుఁడును - రాక్షసుఁడును, అట్లట్ల = స్వరోచి యెట్లెట్లుపోవునో యట్లట్లే,
వెనుకవెనుకకున్, అడుగిడుచున్ = అడుగుపెట్టుచు, అడ్డంబుగాన్ = రాజునకడ్డముగా, అడవి
కడకున్ = అడవికొనవఱకును, ఒత్తికొనినడచి = త్రోసికొనిపోయి, ఒడుదొడుకు = సంకటము, అగు
డున్ = కాఁగా, బెడిదంపునడకన్ = వడిగలనడకచేత, అడరి = ఉత్సహించి, కడకాళ్లకున్ =
కాళ్లకొనలకై, ఒడియన్ = కొంచెముపైకెగురఁగా - గుఱ్ఱముకడకాళ్లు ఒడిసి పట్టుకోఁబోఁగా, తుఖా
రంబు = గుఱ్ఱము, రక్కసునకున్ = రాక్షసునిచేతికి, చిక్కన్ = చిక్కుకొనెను, అనునాలోనన్ =
అని చూచువారు పలుకునంతలోపల, పుడమిపతి = భూనాయకుఁడు - స్వరోచి, పెడవిసరు = పెడ
మరలివిసరునట్టివిసరుగా, విసరి = ఊఁచెనువిసరి, అసురవరుకరాంగుళంబులు = రాక్షసశ్రేష్ఠుని చేతుల
వ్రేళ్లు, తెగన్ = తెగిపోవునట్లు, అడిచెన్ = కొట్టెను, అడిచినన్ = చేతివ్రేళ్లుతెగఁగొట్టినను, సుడివడ
క = చలింపక, మడమలన్ = గుదికాళ్లతో, తాటించినన్ = తన్నఁగా, ఘోటకంబు = గుఱ్ఱము, వెగ్గలంబు
గన్ = మిక్కిలిగా, క్రొమ్మొగ్గియున్ = ముందటికివాలఁబడియును, అగ్గలిక = ఉత్సాహము, చెడక = తప్పక,
మోఁకరించుకొని = మోఁకాళ్లూనినిలిచి, కొన్నియడుగులు = కొన్నియడుగులదూరము, చని = పోయి,
నేకరించుకొని = తెప్పిఱుకొని, కంచుమించుగన్ = అగోచరముగా - చూచువారి కన్నులకుఁ గాన
రాకయునుట, పఱచుట = పరుగెత్తుట, గగనచరులన్ = ఆకాశమునందుఁ జరించువారిని - దేవతల
ను, వెఱఁగుపఱిచెన్ = ఆశ్చర్యపడునట్లుచేసెను, అట్లు = ఆవిధముగా - దేవతలాశ్చర్యపడునట్లు
గా, పఱచినన్ = పరుగెత్తఁగా, కందంబుఁజఱచి = మూఁపుఁదట్టి, మొగంబు = ముఖమును, తుడి
చి = దువ్వి, ప్రస్తుతులన్ = పొగడ్తమాటలచేత, కుస్తరించి = లాలించి, అతి...తోన్ - అతి =
మిక్కిలి, రభస = వేగముగావచ్చునట్టి, ఘూత్కార = ఘూత్తనెడియనుకరణముతోడి, ఘోర =
భయంకరమైన, ఆరావంబుతోన్ = ధ్వనితో, ఘోణా హంబు - ఘోణారంధ్ర = ముక్కుఁగ్రో
ళ్లనుండి (వెడలెడి), నిశ్వాస = ఊపిరియొక్క, గంధవాహ = గాలియొక్క, ప్రవాహంబు = పరంపర,
వెడలువాహంబున్ = బయలువెడలుచున్న గుఱ్ఱమును - అనఁగా రోఁజుచున్న గుఱ్ఱమునునట్టి,
దగ = దప్పి - అలయిక, మట్టువడన్ = తగ్గునట్లు, ఇట్టట్టుమట్టించుచున్ = ఇటునటుఁ ద్రిప్పుచు,
అస్వరోచి, నిశాచరునుద్యోగంబున్ = రాక్షసుని ప్రయత్నమును, చూచికొనవలసి = చూచి తెలిసి
కొనవలసి, నిలిచి = నిలిచినవాఁడై, అంతన్ = అంతమాత్రముచేతనే, అతండు = ఆరాక్షసుఁడు,
ఒక్కతరువున్ = ఒక వృక్షమును, కరయుగళిన్ = రెండుచేతులతోను, ఇఱియంబట్టి = కదియఁబట్టి,
పెల్లగింపన్ = వేళ్లతో నూడఁబెఱుకుటకై, మల్లాడునాలోనన = పెనఁగులాడునంతలోపలనే, గ్గల్లు

నన్ =గల్లు అనునసుకరణముతో, కింకిణులు=చిఱుగంటలు, మెఱయన్ = ప్రోఁగఁగా, [illegible]ుంగా= మెఱుపు, మెఱసినగతిన్=ప్రకాశించినట్లు-అంతశీఘ్రముగా, మరలన్=తిరుగ, హరిన్ = గుఱ్ఱమును, పఱపి=రాక్షసునిమీఁదికిఁదోలి, ఒకటిరెండుమూఁడు, గొరకలన్=ఇనుపబాణములచేత, (గుజ్జీఁ బెలచేతి నని కొందఱు), నెఱఁకులు = మర్మస్థానములను, కాఁడన్ = నాటుకొనునట్టుగా, గుబ్బకోలందికిన్ = అలుఁగుక్రిందిగుబ్బవఱకు, దిగవైచి=దిగఁబడవేసి-లోపలికిదిగునట్లు బాణములుప్రయోగించి, ప్రాణు= పెల్లగింపఁబూనినప్రాణిని, విడిపించి = విడుచునట్లుచేసి, ఎలయించుకొని = చేరవచ్చునట్లు చేసికొని, బయలువెడలించి = బయలుగానుండుచోటికిరప్పించి, దోషాచరుండు=రాక్షసుఁడు, పాషాణమ్ములకున్ = జాళ్లెత్తుటకై, ఎపుడెపుడుపంగెన్=ఎప్పుడెప్పుడువంగునో, అపుడపుడెల్లన్=అప్పుడప్పుడంతయు,తురంగంబున్=గుఱ్ఱమును, అంటందోలి=కదియఁదోలి, గంటియిడి = వానిదేహమునందు గాయముతగిలించి, వెంటంబడుటయున్ =వాఁడువెంబడింపఁగా, గెంటించి=గుఱ్ఱమునుదొలఁగఁదోలి, లేదుబంతియన్నట్లు= నీకుఁజిక్కుట బొంకన్నట్లు, అల్లంతనుండి = కొంతయెడముగానుండి, వాగెనడలించి = కళ్లెపుఁబగ్గము నళ్లవిడిచి, పగతుపైన్=శత్రువైనరాక్షసునిమీఁద, నిగిడి=కవిసి, వాగెన్=పగ్గమును, కుదియింపన్= బిగఁబట్టగా, ముంగాళ్లు = ముందటికాళ్లు-కాళ్లయొక్కచివరలు, గగనంబునన్ = ఆకాశమునందు - మీఁదితట్టుగా, రాన్=వచ్చునట్లు, మగిడించి=వంచి, అందెచప్పుడును=(ఆముందటికాళ్లకుఁగట్టిన) అందెలయొక్కధ్వనియును, కింకిణీరవంబును=మువ్వలయొక్కధ్వనియును, ఉరుమగీసినగతిన్=ఉరుము యనువాద్యమును మునివ్రేళ్లతోరాచినరీతిని, (ఉరుమ=తిప్పెటవలె గుండ్రముగానుండెడిదియు చుట్టువంపఁబడినపట్టెకు సందులేర్పఱిచి యాసందులలోఁ గంచుతుకులబిళ్లలు రెండుమూఁడు గూర్చినదియు నైనవాద్యవిశేషము), తేఁటి=తుమ్మెద. మ్రోసినక్రియన్=ఝుంకారముచేసినరీతిని, నాదు=నాదము, ఆఱక=అణఁగక, ఏదిక్కుఁజూచినన్=చుట్టుప్రక్కల నేతట్టుచూచినను, ఆదిక్కున నే=అప్రక్క నే, వినంబడన్ = వినరాఁగా, ఎక్కడఁజూచినన్=ఏచోటఁజూచినను, తానయై = తానేయై-తానుదప్ప మఱియేదియుఁ గానరాకుండునట్లనుట, నీడ యేర్పడక = నీడ చక్కఁగాఁ దెలియఁబడక, పార్శ్వంబులన్ = ఇరుప్రక్కలను, కట్టుకెంబట్టులాలసరి = కట్టినయెఱ్ఱపట్టుజాలరు,సమకట్టుటెక్కలుగాన్ = జోడించిన టెక్కలువారఁగా, యాతుధానుండు = రాక్షసుఁడు, అనుకొండచిలువన్ = అనెడిపెనుఁబామును, ఒడియన్ = ఆకర్షించిపట్టుటకు, నేలపఱపుగాన్=భూమిచేరువగాఁ బాఱుటవలె, ఆడుగరుడుండు=టెక్కలువిచ్చియాడునట్టిగరుత్మంతుఁడో, అనన్ = అనునట్లు, పాయుచున్=ఎడముగాఁబోవుచు, డాయుచున్ = దగ్గఱవచ్చుచును, (అలం. ఉత్ప్రేక్ష.) దవ్వులన్=దూరమునందు, పొలసి= మెలఁగి,కుఱంగటన్=దగ్గఱ,తోఁచి=కనఁబడి-దూరమునందున్నట్టుండి యంతలో నే దగ్గఱఁ గానవచ్చి యనుట, కుఱంగటన్=దగ్గఱను, అని=ఉన్నదని, చూడన్ = చూచునపుడు, దవ్వులన్ = దూరమునరిదు, పొలసి = వర్తించి, దవ్వుచేరువలు=దూరమును సమీపమును, అనిర్ధార్యంబులు=నిశ్చయింపశక్యములుగానివి, కాన్=అగుచుండఁగా, మెలంగన్ = మెలఁగునట్లు, తేజికాశ్వంబున్ = మేలుజాతిదైన లేనగుఱ్ఱమును, మెలంపుచున్ = త్రిప్పుచు, వింటన్=ధనుస్సుచేతను, పంత్రకోలలన్=మూఁదిగసూది వంటిమూఁడునాలుగలుఁగులుగలకఱ్ఱలచేతను, అడిదంబునన్=కత్తిచేతను, అత్తలంబునన్=ఈఁటెచేతను, ఏసియున్=బాణములుప్రయోగించియు, వ్రేసియున్ = కొట్టియు, అడిచియున్ = నఱికియు, పొడిచియున్ = గ్రుచ్చియు-వింటితో బాణములుప్రయోగించియుఁ బంత్రకోలలతోఁ గొట్టియుఁ గత్తిచే నఱికియు నీఁటెతోఁబొడిచియు ననియర్థము, కడపలన్=తుదను, కానక=కనలేక, మిడిసి =

మిట్టిపడ న్మృతుండును = చచ్చినవాఁడును, కానిదానవునిన్ = కాకుండునట్టిరాక్షసుని, చూచి, వసర= విసిగి, (బడలి యని కొందఱు.) రోసంబునన్ =రోషముచేత - పైపద్యముతో నన్వయము.

క. భూపతి పావకబాణం, బేపున సంధించి తివిచి యేసిన మెయిఁ గీ
లాపటలి పొదువ నతఁ డా, రూపం బెడఁబాసి ఖేచరులు వెఱఁ గందన్. 116

అ. భూపతి=రాజు-స్వరోచి, ఏపునన్ =ఉత్సాహముతో, పావకబాణంబు=ఆగ్నేయాస్త్రమును, సంధించి=నారియందుఁగూర్చి, తివిచి=లాగి, ఏసినన్ =ప్రయోగింపఁగా, మెయిన్ =రాక్షసుని శరీరమున, కీలాపటలి = మంటలసమూహము, పొదువన్ = కప్పుకొనఁగా, అతఁడు=ఆరాక్షసుఁడు, ఆరూపంబు=ఆరాక్షసాకారమును, ఎడఁబాసి=విడిచి, ఖేచరులు = ఆకాశమునందుఁదిరుగువారు-దేవతలు, వెఱఁగు=ఆశ్చర్యమును, అందన్ =పొందఁగా-మీఁదిపద్యముతో నన్వయము

లయవిభాతి. ధగధగనిదేహరుచి నిగనిగనికుందనపుఁదగఁడు తెగడం జిగురు జిగి
నెగుచుమోవిన్
నగవు నిగుడం గురులపొగరు మగుడన్ నయనయుగళి వెలిదామరలమగల
మగలై డా
లెగయ మృగనాభిభుగభుగ లెసఁగఁ జామరలు మగువ లిడ మౌళిమణి మిగులఁ
గ వెలుంగం
దెగలు గలహారములజిగి చెలఁగఁగాఁ గొదమమొగులఁ దగుయానమున గగన
చరుఁ డయ్యెన్. 117

అ. ధగధగనిదేహరుచి=ధగధగయని వెలుఁగుచున్న శరీరకాంతి, నిగనిగనికుందనపుఁదగడున్ = నిగనిగయని వెలిఁగెడి యపరంజితేకును, తెగడన్ =తిరస్కరింపఁగా-అపరంజితేకును మించి వెలుఁగునట్టిదేహకాంతితోననుట, చిగురుజిగిన్ = చిగురుయొక్కయొఱ్ఱనికాంతిని, ఎగుచుమోవిన్ = ఎఱుపు (తిరస్కరించు) నట్టిపెదవియందు-ఎఱుపుమించినపెదవియనుట, నగవు=నవ్వు, నిగుడన్ =వ్యాపింపఁగా-తోఁపఁగా, కురులపొగరు=తలవెండ్రుకలయొక్క(నల్ల)కాంతి, మగుడన్ =తిరుగఁగా-మరలరాఁగాననుట, నయనయుగళి=కన్నుదోయి, వెలి.. మగలై - వెలిదామరల=తెల్లదామరలయొక్క, మగల=రాజులకు, మగలై = రాజులై-శ్రేష్ఠమయినతెల్లదామరలనుమీఱినవైయనుట, డాలు=కాంతివిశేషము, ఎగయన్ =పార్శ్వములందు వ్యాపింపఁగా, మృగనాభిభుగభుగలు = భుగభుగయనెడి కస్తూరివాసనలు, ఎసఁగన్ =అతిశయింపఁగా, చామరలు=వింజామరలు, మగువలు=పరిచారికలైనస్త్రీలు, ఇడన్ = వేయఁగా-వీవఁగాననుట, మౌళిమణి = శ్రేష్ఠమయినకిరీటము - రత్నమయమయినకిరీటము, మిగులఁగన్ = మిక్కిలి, వెలుంగన్ = ప్రకాశింపఁగా, తెగలు=నిడుపులు, కలహారములజిగి = కలిగినకంఠహారములయొక్కప్రకాశము, చెలఁగఁగాన్ =అతిశయింపఁగా, కొదమమొగులన్ = లేఁతమబ్బునందు-అప్పుడేపర్వుచున్నమబ్బునందనుట, తగుయానమునన్ =యుక్తమయినవిమానమునందు, గగనచరుఁడు= ఆకాశమునందుఁ దిరుగువాఁడు-గంధర్వుఁడు, అయ్యెన్ = ఆయెను.

తా. అప్పుడారాక్షసుఁడు స్వరోచి ప్రయోగించినయాగ్నేయాస్త్రముచే తనరాక్షసదేహము కాలిపోఁగా బంగారుచాయచే నిగనిగలాడుచున్న యందమైన శరీరమును నగుమొగమును నిడుదలై

మృదువులైన నల్లనితలవెంట్రుకలును విశాలములై తేటలైనకన్నులునుగల గంధర్వుఁడయి కస్తూరి చేర్చిన మంచివాసనగల గంధపుఁబూఁతయు రత్నమయమయినకిరీటమును నిడుపులైన కంఠహారములును ధరించి పరిచారికలైన దేవతాస్త్రీలు వింజామరలు వేయఁగా విమానము నెక్కి యాకాశమునందుఁ గానఁబడి యెను. అలం. ఉపమ, ఉదాత్తమును.

క. నవనవసౌరభముల నెక్కువకువలయవర్షమపుడు గురిసెన్ మొరసెన్
రవరవ మురజరవంబులు, దివి దివిషజ్జలజముఖులు తెలిసి నటింపన్. 118

అ అపుడు=ఆసమయమునందు, దివిన్ = ఆకాశమునందు, నవనవసౌరభములన్ = క్రొత్త క్రొత్తపరిమళములచేత, ఎక్కువకువలయవర్షము=అతిశయించినకలువపువ్వులవాన, కురిసెను, దివిషజ్జలజముఖులు=దేవతాస్త్రీలు, తెలిసి=(రాక్షసుఁడు గంధర్వుఁ డగుట)ఎఱిఁగి, నటింపన్ = నాట్యముచేయఁగా, రవరవమురజరవంబులు=రవరవయనుమద్దెలమ్రోఁతలు, మొరసెన్ = ధ్వనించెను,-అనఁగా స్వరోచి బాణాగ్నిచేతఁ గాల్పఁబడి రాక్షసుఁడు గంధర్వుఁ డగుట తెలిసి దేవత లాకాశమునుండి పువ్వులవాన కురియించిరి దేవతాస్త్రీలు నాట్యమాడఁగా మద్దెలమ్రోఁతలు వినఁబడె నని తాత్పర్యము.

వ. అనిన విని తరువాతివృత్తాంతంబు వినుటకుం దివుటమై మదీయమానసంబు కౌతుకాధీనం బయ్యెడు వినిపింపుఁ డని యడుగుటయును. 119

అ. అనినన్ =అనిపక్షులు చెప్పఁగా, విని = జైమినిమునివిని, తరువాతివృత్తాంతంబు=అటుపిమ్మటిసమాచారము, తివుటమైన్ = పూనికతో, వినుటకున్ = వినుటకొఱకు, మదీయమానసంబు = నాదైనమనస్సు, కౌతుకాధీనంబు=వేడుకకు నధీనమైనది-నామనస్సు మీఁదటికథ వినుటయందు వేడుకపడియున్నదనుట, వినిపింపుఁడు=మీరుచెప్పుఁడు, అనియడుగుటయున్ = అనిపక్షులనడుగఁగా-దీనికి మీఁదియాశ్వాసము మొదటవచ్చునట్టి "నీడోద్భవంబు లిట్లనియె" అనుదానితో నన్వయము.

శా. శ్లాఘాలంఘనజాంఘికోజ్జ్వలగుణాలంకార ఘీంకారహే
షాఘోషోద్భటధాటికాగజఘటాశ్వక్షుణ్ణవిశ్వంభరా
మోఘీభూతభుజంగభోగభర సంఫుల్లాబ్జపత్త్రేక్షణా
ద్రాఘీయఃప్రతిభావిచక్షణ త్రయీధర్మైకసంరక్షణా. 120

ఆ. శ్లాఘా ..కార-శ్లాఘా=ప్రశంసను-పొగడ్తను, లంఘన=దాఁటుటయందు-అతిక్రమించుటయందు, జాంఘిక=పిక్కబలిమిగల, ఉజ్జ్వల=ప్రకాశించునట్టి, గుణ=సద్గుణములే, అలంకార=భూషణములుగాఁగలవాఁడా-కొనియాడశక్యముగాని సద్గుణములుగలవాఁడా యనుట. ఘీంకార ..భోగభర-ఘీంకార = గీఁకలయొక్కయు, హేషా = సకిలింతలయొక్కయు, ఘోష=ధ్వనితోడి, ఉద్భట=అధికమైన, ధాటికా=యుద్ధయాత్రయందలి, గజఘటా = ఏనుఁగుగుంపులచేతను, అశ్వ=గుఱ్ఱములచేతను, క్షుణ్ణ=నలియఁద్రొక్కఁబడిన, విశ్వంభరా=భూమిచేత, మోఘీభూత=వ్యర్థము చేయఁబడినదయిన, భుజంగ = శేషాహియొక్క, భోగభర = పడగలయందలి బరువుగలవాఁడా-యుద్ధయాత్రచేయునపుడు ఏనుఁగులయొక్కయు గుఱ్ఱములయొక్కయుఁ గాళ్లత్రొక్కుళ్లచేత భూమియంతయు ధూళియై లేవఁగా భూభారమును వహించియుండు నాదిశేషుని పడగలమీఁదిబరువు వదలిపోయినదనుట, సంఫుల్లాబ్జపత్త్రేక్షణా-సంఫుల్ల=లెస్సగా వికసించిన, అబ్జపత్త్ర=తామరరేకులవంటి, ఈక్షణ=కన్నులుగలవాఁడా, ద్రాఘీయఃప్రతిభావిచక్షణ-ద్రాఘీయః=దీర్ఘమైన-అధికమైన, ప్రతిభా=అప్పటప్పటికి

వికాసమై శ్లాఘింపదగిన బుద్ధిచేత, విచక్షణ=నేర్పరియైనవాఁడా-మిక్కుటమై సమయోచితముగా స్ఫురించు బుద్ధిగలవాఁడా యనుట, త్రయీధర్మైకసంరక్షణా-త్రయీధర్మ=వేదవిహితధర్మములయొక్క, ఏక=ముఖ్యమయిన, సంరక్షణా=కాపాడుటకలవాఁడా-వేదోక్తధర్మములను దప్పక రక్షించువాఁడా యనుట. అలం. అత్యుక్తి

క. బహువీరహననమిళదఘ, వహనభ్రమకృత్కళంకవర్గోగ్రాసి
గ్రహిళభుజయుగళ గజప, త్యహిపహరణతార్క్ష్య సజ్జనావనదక్షా. 121

అ. బహు... యుగళ-బహు = అనేకులైన, వీర=శూరులయొక్క, హనన = చంపుటవలన, మిళత్=కూడిన-కలిగినయనుట, అఘ=పాపమును, వహన=వహించుటయొక్క, భ్రమకృత్=భ్రమను జేయుచున్న, కళంక=నల్లనిచాయయొక్క, వర్గ=సమూహముచేత, ఉగ్ర=భయంకరమయిన, అసి=కత్తిని, గ్రహిళ=గ్రహించిన-పట్టిన, భుజ=బాహువులయొక్క, యుగళ=జంటగలవాఁడా-అనేకులను శూరులను జంపుటచేతఁ గలిగినపాపములు దేహమునందుఁ బ్రవేశించెనో యనునట్లు నల్లనిచాయలచే భయంకరమైనకత్తినిఁ జేతఁబూనినవాఁడా యనుట గజ .. తార్క్ష్య-గజపతి=కళింగరాజైనగజపతిరాజనెడు, అహిప=సర్పశ్రేష్ఠమును, హరణ=పట్టుకొనుటయందు, తార్క్ష్య=గరుత్మంతుఁడైనవాఁడా - గరుత్మంతుఁడొకదొడ్డపామును బట్టునట్లు గజపతిరాజు ననాయాసముగాఁ బట్టుకొన్నవాఁడా యనుట, సజ్జనావనదక్షా-సజ్జన=సత్పురుషులయొక్క, అవన = రక్షణమునందు, దక్షా = సమర్థుఁడా-మంచివారిని గాపాడఁజాలినవాఁడా యనుట. అలం భ్రాంతిమంతము, ఉత్ప్రేక్ష, రూపకము.

పృథ్వి. సుధీమధురవాక్సుధాసుముఖ నాగమాంబాసుతా
మధుప్రసవసాయకస్మయవిరామరమ్యాకృతీ
దధీచవిధుకామధుగ్ధనదదుగ్ధసింధుప్రథా
వధీరణపరాయణోజ్జ్వలవదాన్యతాలంకృతా. 122

అ. సుధీ సుముఖ-సుధీ = విద్వాంసులయొక్క, మధుర = చెవులకింపైన, వాక్ = మాటలనెడు, సుధా = అమృతమునకు, సుముఖ = అభిముఖుఁడా-పండితగోష్ఠియందు దాసక్తుఁడాయనుట నాగమాంబాసుతా = నాగమ్మకొమారుఁడా, మధు .. కృతీ-మధు = వసంతునియొక్కయు, ప్రసవసాయక = మన్మథునియొక్కయు, స్మయ = గర్వమును, విరామ = నిలిపివేయునట్టి-అణఁచివేయునట్టి, రమ్య = మనోహరమయిన-అందమైన, ఆకృతీ = ఆకారముగలవాఁడా-వసంతునికన్నను మన్మథునికన్నను మించిన చక్కఁదనముగలవాఁడాయనుట, దధీచ...లంకృతా-దధీచ = దధీచిమహర్షియొక్కయు, విధు = చంద్రునియొక్కయు, కామధుక్ = కామధేనువుయొక్కయు, ధనప = కుబేరునియొక్కయు, దుగ్ధసింధు = పాలసముద్రముయొక్కయు, ప్రథా = (దాతృత్వముయొక్క) ప్రసిద్ధిని, అవధీరణ=తిరస్కరించుటయందు, పరాయణ = ఆసక్తమైన, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, వదాన్యతా=దాతృత్వముచేత, అలంకృతా = అలంకరింపఁబడినవాఁడా-దాతృత్వమునందు దధీచుఁడు మొదలగువారిని మించినవాఁడాయనుట.

తా. సర్వదా పండితులప్రసంగములు వినుచుండువాఁడవును, మన్మథవసంతుల చక్కఁదనమును మించిన చక్కఁదనముగలవాఁడవును, దధీచుఁడు చంద్రుఁడు కామధేనువు కుబేరుఁడు పాలసముద్రము వీనికిఁగల దాతృత్వమునకన్నను మించిన దాతృత్వముగలవాఁడవు నైనకృష్ణదేవరాయా.

(దధీచి యింద్రునికి వజ్రాయుధములభింపఁ జేయుటకై తనదేహమునిచ్చెను చంద్రుఁడు తనకిరణములను దేవతల కాహారముగానిచ్చును. కామధేను వెవరేమికోరినను గలదు లేదనక యిచ్చును. కుబేరుఁ డెల్లలోకములకు ధనమునొసఁగును. పాలసముద్రము దన్నుఁ ద్రచ్చినదేవతలకు నమృతములో నగువాని ననేకముల నొసఁగెను)

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిర నందవరపంశోత్తంస శరగోపతాపసప్రసాదాసాదితచతుర్విధకవితామతల్లి కాల్లసానిచొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్యప్రణీతం బైన స్వారోచిషమనుసంభవం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము. 123



శ్రీ

# స్వారోచిషమనుచరిత్రము

## సటీకము

## పంచమాశ్వాసము.

---



నందనసౌందర్య సు
ధీనందన వితరణావధీరితబలిరా
డ్భానుజ పరరాజస్వ
ర్భానుభుజాహీంద్ర కృష్ణరాయనరేంద్రా 1

అ. శ్రీనందనసౌందర్య-శ్రీనందన = లక్ష్మీదేవికుమారుఁడైన మన్మథునియొక్క, సౌందర్య= చక్కఁదనమువంటి చక్కఁదనముకలవాఁడా, సుధీనందన = విద్వాంసులను సంతోషపెట్టువాఁడా, వితర . డ్భానుజ-వితరణ=దాతృత్వముచేత, అవధీరిత=తక్కువపఱుపఁబడిన, బలి=బలిచక్రవర్తియు, రాట్=చంద్రుఁడును, భానుజ=కర్ణుఁడునుగలవాఁడా, పర ..హీంద్ర-పరరాజ = శత్రురాజు లనెడి చంద్రులకు, స్వర్భాను=రాహువైన, భుజ=బాహువనెడు, అహీంద్ర = సర్పశ్రేష్ఠముకలవాఁడా, కృష్ణ రాయనరేంద్రా=కృష్ణరాయమహారాజా (ఇది కృతిపతికి సంబోధనము )

తా. మిక్కిలి సౌందర్యమును దాతృత్వమును శత్రురాజులను లోఁబఱుచుకొను సామర్థ్యమునుగల కృష్ణదేవరాయమహారాజా రూపకము, నిదర్శనాతిశయోక్తులు.

వ. అవధరింపుము జైమినిమునీంద్రచూడారత్నంబునకు నీడోద్భవంబు లిట్లనియె.

అ. అవధరింపుము = చిత్తగింపుము-వినుము, జైమిని నకుక్-జైమిని = జైమినియనెడు, మునీంద్ర=మునిశ్రేష్ఠులలోపల, చూడారత్నంబునకుక్ = శిరోమణియైనవానికి-మునిశ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడైనవానికి, నీడోద్భవంబులు=గ్రుడ్డువలనఁబుట్టినవి-పక్షులు-కథచెప్పెడిపక్షులు, ఇట్లనియెక్ = ఈప్రకారము చెప్పెను.

తే. అపుడు గంధర్వపతి మహికవతరించి, రాజు విస్మయమున హయరాజు డిగ్గ
నక్కు-సేర్చి ముదంబుతోననియెదంత,కిరణములుహారకాంతులు సరసమాడ. 3

అ అపుడు=ఆసమయమునందు, గంధర్వపతి=(రాక్షసుఁడుగానుండి స్వస్వరూపమునొందిన) గంధర్వరాజు, మహికిక్=భూమిమీఁదికి, అవతరించి = (విమానమునుండి) దిగి, రాజు=రాజైనస్వరోచి, విస్మయమునక్=ఆశ్చర్యముతో-ఆశ్చర్యమునకుఁ గారణము రాక్షసుఁడు గంధర్వుఁడగుటయే యని యెఱుంగునది, హయరాజుక్=ఉత్తమాశ్వమును, డిగ్గక్=దిగఁగా, అక్కు-సేర్చి=ఱొమ్ముచేర్చి-కౌఁగిలించుకొని, ముదంబుతోక్ = సంతోషముతో, దంతకిరణములు = పలువరుసకాంతులును, హారకాంతులు= మెడనున్నముత్యాలపేరులకాంతులును, సరసమాడక్ = తచ్చనలాడఁగా-ఒకటితోనొకటి కలసికొనఁగా, అనియెక్ = పలికెను.

తా॥ ఆసమయమునందు రాక్షసుఁడుగానుండి గంధర్వుఁడయిన యాగంధర్వరాజు తానున్న విమానమువలననుండి నేలకు దిగి తన్నుఁజూచి యాశ్చర్యపడి గద్దెమీఁదినుండి దిగినప్పరోచిని సంతోషముతోఁ గౌఁగిలించుకొని యిట్లు పలికెను అలం ఉపమ,

సీ. భద్రమా నీకు నీ । బాహాభృతక్షితిఁ బ్రజలకు లెస్సలా । రాచవారు
ధన్యుండ నైతి నీ । దర్శనంబునఁ జేసి, నాదుష్కృతిము లెల్ల । నాశమొందె
నీజగత్త్రయి నన్ను । నిందీవరాక్షాఖ్యుఁ, గీర్తించు నప్సరో । గీతిసరణి
గారాపుమీతల్లి । కడవాఁడఁ గాని నే, గణుతింపఁ గడవాఁడ । గాఁ జుమయ్య
పెండ్లికొడుకవు మాకు నీ । బిసరుహాక్షి, కూర్మినందన యొకమౌని । ఘోరశాప
వికృతి మానిసిదిండి నై । యకటకీని, ప్రాణముల కల్గఁ దలఁచితిఁ । బాపబుద్ధి 4

అ. నీకున్ = నీకును, నీబాహాభృతక్షితిన్ = నీభుజములచేత భరింపఁబడిన భూమియందు—నీయేలుబడిభూమియందు, ప్రజలకున్ = ఉండెడి జనులకును, భద్రమా = కుశలమా, రాచవారు = నీచుట్టములయిన రాజులు, లెస్సలా = బాగుగా నున్నారా, నీదర్శనంబునఁ జేసి = నీయొక్క దర్శనముచేత – నిన్నుఁజూచుట చేతననుట, ధన్యుండనైతిన్ = నేను కృతార్థుఁడ నైతిని, నాదుష్కృతములు = నాపాపములు, ఎల్లన్ = అన్నియును, నాశమొందెన్ = నశించెను, ఈజగత్త్రయి=స్వర్గమర్త్యపాతాళములనెడి యీమూఁడులోకములసముదాయము, నన్ను, ఇందీవరాక్షాఖ్యన్ = ఇందీవరాక్షుఁ డను పేరితో, అప్సరోగీత సరణిన్ = అప్సరసలసంగీత మార్గమున – అప్సరస్త్రీలు పాడు నట్టిపాటల మూలముచ, కీర్తించున్ = కొనియాడును, గణుతింపన్ = ఎంచఁగా – విచారింపఁగా ననుట, నేను, గారాపుమీతల్లికడవాఁడన్ – గారాపు = ప్రేమాస్పదురాలైన, మీతల్లి = మీతల్లికి, కడవాఁడన్ = కనిష్ఠుఁడను – తమ్ముఁడను, కాని = కాక, కడవాఁడన్ = అన్యుఁడను, కాఁజుమయ్య = కానుజుమీ – నేను నీతల్లితోడఁబుట్టిన వాఁడను గాని యితరుఁడను గాననుట మాకు, పెండ్లికొడుకవు = అల్లుఁడవు, ఈబిసరుహాక్షి = తామరలవంటికన్నులు గలదైన యీకన్యక, కూర్మినందన = నాయొక్క ముద్దులకూఁతురు, ఒకమౌనిఘోరశాపవికృతిన్ = ఒకానొక ఋషియొక్క భయంకరమైన శాపవికారముచేత, మానిసిదిండినై = మనుష్యులను దినువాఁడనై – రాక్షసుఁడనై, పాపబుద్ధిన్ = దుష్కృతబుద్ధితో, దీనిప్రాణములకున్ = ఈచిన్నదాని ప్రాణములకు, అల్గన్ = కోపింప – ద్రోహముచేయ, తలఁచితిన్ = ఎంచితిని – చంపఁబూనితిననుట, అకట=అయ్యో – ఇది విచారమును దెలుపును

తా. అయ్యా! నీకును నీదేశము వారికిని నీచుట్టములకును క్షేమమేకదా నేను నిన్నుఁజూచి నాపాపము లన్నినశింపఁగాఁ గృతార్థుఁడ నైతిని నేనెవ్వఁడనో యని యెంచెదవు. అన్యుఁడను గాను నీతల్లి తోడఁ బుట్టిన వాఁడనైన యిందీవరాక్షుఁడను నీవు నాయల్లుఁడవు ఈచిన్నది నా కూఁతురు. ఒకానొకమునీశ్వరుని శాపముచేత రాక్షసుఁడనై కన్న బిడ్డ యనుమమత సైతము లేక యీచిన్నదానినే చంపి తినయత్నించితి అయ్యో యిఁక నాదురవస్థ మేమని చెప్పికొందును.

క. అను నెడ వచ్చి మనోరమ, జనకునిపాదముల కెరఁగ । సస్నేహమతిం
గనుఁగవ నీ రొలుకఁగ నం, దనమూర్ధఘ్రాణ మతఁడు । దయఁ గావించెన్. 5

అ. అను నెడన్ = ఇట్లని గంధర్వుఁడు చెప్పునప్పుడు, మనోరమ = వాని కూఁతురైన మనో

రమ, చన్నిచ్చి = దగ్గఱవచ్చి, జనకునిపాదములకున్ = తండ్రియైన యాయిందీవరాక్షునియడుగులకు, ఎరఁగన్ = నమస్కరింపఁగా, సస్నేహమతిన్ = ప్రేమతోడిబుద్ధితో, కనుఁగవన్ = రెండుకన్నులందును, నీరు = జలము, ఒలుకఁగన్ = చిందఁగా-కాఱఁగా, అతఁడు = ఆయిందీవరాక్షుఁడు, దయన్ = దయతో, నందన మూర్ధఘ్రాణము=తన కొమార్తయొక్క మాఁడుపట్టు మూర్కొనుటను, కావించెన్ = చేసెను

తా. అని యిందీవరాక్షుఁడు తనవృత్తాంతము చెప్పుకొనుచుండఁగా వానికూఁతురైన మనోరమ వానిదగ్గఱకుఁబోయి పాదములపైఁ బడి మ్రొక్కఁగా వాఁడాకొమార్తను జూచి దుఃఖించి కన్నీళ్లు విడుచుచుఁ బ్రేమతో మాఁడుపట్టుమూర్కొని యాదరించెను

ఆ. అపుడు విస్మితాత్ముఁ డై వరూధినిసుతుఁ, డేమికారణమున నేతపస్వి
యిట్టిశాపమిచ్చె నెఱిఁగింపు విన వేడు, కయ్యె ననఘ యనిన నాతఁ డనియె. 6

అ. అపుడు=అప్పుడు, వరూధినిసుతుఁడు = స్వరోచి, విస్మితాత్ముఁడై = ఆశ్చర్యమునొందిన మనసుగలవాఁడై, అనఘ = ఓపుణ్యాత్ముఁడా, ఏమికారణమునన్ = ఏహేతువుచేత, ఏతపస్వి = ఏముని, ఇట్టిశాపము = ఇటువంటిశాపమును, ఇచ్చెను, ఎఱిఁగింపు = తెలియఁజేయుము, వినన్ = వినుటకు, (నాకు) వేడుక= కుతూహలము, అయ్యెన్ = కలిగెను, అనినన్ = అనిస్వరోచియనఁగా, అతఁడు=ఆయిందీవరాక్షుఁడు, అనియెన్= (ఒకమాట) చెప్పెను -అనఁగా గంధర్వరాజైన యిందీవరాక్షునిఁజూచి యాశ్చర్యపడి స్వరోచి 'యోపుణ్యాత్ముఁడా! నీ కేకారణముచేత నేమునియిటువంటి శాపమిచ్చెను. ఆసంగతి నాకు విన నపేక్షకలదు చెప్పు'మని యడుగఁగా నిందీవరాక్షుఁ డిట్లుపలికెను

మ. కలఁ డుల్లోకయశఃపురంధ్రి జగతిన్ గంధర్వవంశంబునన్
నలనాభాహ్వయుఁ డేఁ దదీయతనయుండన్ బ్రహ్మమిత్రుండు శి
ష్యులకుం గంటను వత్తిఁ బెట్టుకొని యాయుర్వేద మోరంతప్రొ
ద్దులఁ జెప్పన్ వినుచుండి మానసమునందుం దజ్జిఘృక్షారతిన్ 7

అ. జగతిన్ = భూమియందు, ఉల్లోకయశఃపురంధ్రి - ఉల్లోక = లోకాతీతమయిన, యశః = కీర్తియనెడు, పురంధ్రి=ఇల్లాలుగలవాఁడు-లోకాతీతమైనకీర్తిగలవాఁడనుట, గంధర్వవంశంబునన్ = గంధర్వకులమునందు, నలనాభాహ్వయుఁడు = నలనాభుఁడను పేరుగలవాఁడు, కలఁడు = ఉండెను. ఏన్ = నేను, తదీయతనయుండన్ =అతనికొమారుఁడను, బ్రహ్మమిత్రుండు =బ్రహ్మమిత్రుఁడనెడి ముని, శిష్యులకున్ = విద్యార్థులయివచ్చినతనశిష్యులకు, కంటన్ = కంటియందు, వత్తిపెట్టుకొని = దీపపువత్తిపెట్టుకొని - రాత్రివేళ దీపము పెట్టుకొనికూడ, ఓరంతప్రొద్దులన్ = ఈకాల మాకాలమనక యెల్లప్పుడును, ఆయుర్వేదము = వైద్యశాస్త్రమును, చెప్పన్ = చెప్పి చదివించుచుండఁగా, వినుచుండి= లోపలవలన నేను వినుచు నుండి, మానసమునందు = నామనస్సునందు, తజ్జిఘృక్షారతిన్ = ఆవైద్యశాస్త్రముఁ గ్రహింపవలె ననెడి యాసక్తిచేత - మీఁది పద్యముతో నన్వయము.

తా. ఈలోకమునందు మిక్కిలి కీర్తివహించిననలనాభుఁ డనెడి గంధర్వునికొమారుఁడను నేను. బ్రహ్మమిత్రుఁడను వైద్యశాస్త్రపండితుఁడు తనశిష్యులకు రాత్రియనక పగలనక యెల్లప్పుడును శ్రద్ధతో వైద్యశాస్త్రము చెప్పుచుండఁగా నావృత్తాంతము విని యాశాస్త్రము నభ్యసింపవలెననుకోరిక గలవాఁడనై.

తే. మానివరుఁ జేరి భక్తి నమస్కరించి
చెప్పవే నాకు నీవిద్య * శిష్యకోటి
తోడఁ గూడంగ నేఁ గృతార్థుండ నగుదు
ననుచుఁ బ్రార్థింప నన్నుఁ జూచి * యపహసించి. 8

అ. మానివరున్ = ఆబ్రహ్మమిత్రమునీశ్వరుని, చేరి = దగ్గఱఁబోయి, భక్తిన్ = పూజ్యానురాగముతో, నమస్కరించి = మ్రొక్కి, ఈవిద్య = ఈవైద్యవిద్యను, శిష్యకోటితోడఁగూడంగన్ = మీశిష్యులసమూహముతోపాటు, నాకున్ = నాకుఁగూడ, చెప్పవే=బోధింపవయ్యా, నేన్ = నేను, కృతార్థుండను = నెఱవేఱినకోరికగలవాఁడను-ధన్యుఁడను, అగుదున్ = అయ్యెదను, అనుచున్ = ఇట్లని, ప్రార్థింపన్ = వేఁడుకొనఁగా, నన్నున్ = నన్ను, చూచి=(ఆమునీశ్వరుఁడు) చూచి, అపహసించి = ఎగతాళిచేసి- పైపద్యముతో నన్వయము

క. నటవిటగాయకగణికా, కుటిలవచశ్శీధురసముఁ * గ్రోలెడుచెవికిం
గటువీశాస్త్రము వలదిచ్చట నిన్నుఁ జదివింప కున్న * జరగదె మాకున్ 9

అ. నట ..రసమున్ - నట = నట్టువవాండ్రయొక్కయు, విట = పరస్త్రీపరులయినపురుషులయొక్కయు, గాయక = పాటపాడెడువాండ్రయొక్కయు, గణికా = భోగమువాండ్రయొక్కయు, కుటిల = వంకరయైన-నీచములైనయనుట, వచః = మాటలనెడు, శీధురసమున్ = చెఱకుపాలతోఁ జేసినమద్యరసమును, గ్రోలెడు చెవికిన్ = త్రాగునట్టిచెవికి-నటవిటగాయకాదులపరిహాసాదిరూపములయిన మాటలను వినుటయందు రుచిగలిగినచెవి కనుట, ఈశాస్త్రము = ఈవైద్యశాస్త్రము, కటువు = ఇంపుగానిది, వలదు = (నీకిది)అక్కఱలేదు, ఇచ్చటన్ =ఇక్కడ, నిన్నున్ చదివింపకున్నన్ = నిన్నుఁ జదివింపకయున్నయెడ-నీకీచదువుచెప్పనిపక్షమున ననుట, మాకు, జరగదె=(నిత్యకృత్యము)జరగదా-మాకేమియుఁ గొఱఁతపడదనుట.

తా. నీవు నట్టువవాండ్రు విటకాండ్రు పాటకాండ్రు భోగముపడుచులు మొదలయినవారితోఁ గూడి కాలము గడపువాఁడవు నీవంటివాని కీయుత్తమవిద్యపనికిరాదు. నీకీవిద్య నేర్పకున్న మాకుజరగకపోవునదియులేదు. కనుక నీవు పలుకకుండ వచ్చినదారినే పొమ్ము అలం రూపకము

తే. అనఁగనే నట్టివాఁడఁ గా * ననఘచరిత, యించుకించుక మీవంటి * యెఱుకగలుగు
పెద్దవారలశిక్షలఁ * బెరిఁగినాఁడ, నవధరింపుము శిష్యుఁగా * ననిన నతఁడు. 10

అ. అనఁగన్ = అని యిట్లు బ్రహ్మమిత్రుఁడనఁగా, అనఘచరిత=మంచినడవడిగలయోమునీశ్వరా, నేను, అట్టివాఁడన్ = అటువంటివాఁడను, కాన్ = కాను-ఇప్పుడు నీవు చెప్పిన చెడ్డనడవడిగలవాఁడను గాననుట, ఇంచుకించుక =కొంచెముకొంచెము-తగినకొలఁదిననుట, మీవంటి...శిక్షలన్ - మీవంటి = మీబోఁటి, ఎఱుకగలుగు = జ్ఞానముగలిగిన, పెద్దవారల=గొప్పవారియొక్క, శిక్షలన్ = మంచిసెబ్బరలు తెలియఁదిద్దుటలచేత, పెరిఁగినాఁడన్ = వర్ధిల్లినవాఁడను, (కనుక)శిష్యుఁగాన్ = (నన్నునీకు)శిష్యునిఁగా, అవధరింపుము = అంగీకరింపుము, అనినన్ = అని నేను బ్రార్థింపఁగా, అతఁడు = ఆబ్రహ్మమిత్రుఁడు-పైకన్వయము.

క. ధనరాజ్యరమామదమునఁ, గనుగానని నిన్ను శిష్యుఁ * గాఁ గైకొనుకం
టెను నేరమి గలదే నను, గనలించుచుఁ బ్రేలకీకఁ * బోకాలు మటన్నన్. 11

ధన మున్ - ధన = విత్తముయొక్కయు, రాజ్య = ప్రభుత్వముయొక్కయు, రమా = కలిమిచేసైన, మదమునన్ = క్రొవ్వుచేత, కనుగాననినిన్నున్ = కన్ను తెలియనినిన్ను - పరువు తెలియనిపెంకివానిననుట, శిష్యుఁగాన్ = విద్యార్థిఁగా, కైకొనుకింకేన్ = అంగీకరించుటకన్నను, నేరమి = తెలివిలేమి, కలదే = (మఱియొకటి)కలదా - అంత తెలివిలేమియనుట. ఇఁకన్ = ఇంకను, నన్ = నన్ను, కనలించుచున్ = కోపింపఁజేయుచు, ప్రేలకు = వదరకుము, పొమ్ము = వెడలిపొమ్ము, అటన్నన్ = అనఁగా. - మీఁదిపద్యముతో నన్వయము.

తా. ధనగర్వముచేతను రాజ్యగర్వముచేతను బరువు తెలియక ప్రవర్తించెడినిన్ను శిష్యునిఁగా గ్రహించుట మిక్కిలితప్పైయగును. కాఁబట్టి నిన్ను నేను నాశిష్యులలోఁ జేర్చుకోఁజాలను ఇంకను దోఁచినట్లు వదరుచు నాకుఁ గోపము రేఁపకుము వెడలిపొమ్మని యనఁగా.

క. అచటన్ ద్వేష్టి గతాయు, శ్చ చికిత్సక మనునయోక్తి చర్చను నుచ్చా
వచవచనంబులఁ గోపము, ప్రచురము గానీక మానిపతి కిట్లంటిన్ 12

అ. అచటన్ = ఆచోట - అతనియొద్దననుట, గతాయుః - గతాయుశ్చ = కడచినజీవితకాలము గలవాఁడు - ఆయుస్సుతీఱినవాఁడనుట, చికిత్సకమ్ = వైద్యుని, ద్వేష్టి = ద్వేషించుచున్నాఁడు, అను... చర్చన్ - అను = అనెడి, నయోక్తి = నీతివాక్యముయొక్క, చర్చన్ = విచారణచేత - అనీతివాక్యమునుదలఁచియనుట, ఉచ్చావచవచనంబులన్ = బహువిధములయిన యతనితిరస్కారపుమాటలచేత, కోపము = (నాకుఁగలిగిన)కోపమును, ప్రచురము = అధికము, కానీక = కానియ్యక - బయలుపొంగనియ్యకయనుట, మానిపతికిన్ = ఆమునిశ్రేష్ఠునితో, ఇట్లంటిన్ = ఈవిధముగాఁ బలికితిని.

తా. అప్పు డతనియొద్దఁ గార్యార్థినగుటచే నాయుస్సు దీఱినవాఁడు వైద్యునితో విరోధించు ననున్యాయమును దలఁచి యేమియును గోపము బయలుపొంగనియ్యక యతఁ డాడినమాటలకెల్ల నోర్చి యీవిధముగాఁ బలికితి అలం. లోకోక్తి

తే. నీవు చదివింతు వనుచు ని న్నియును విడిచి
బిచ్చ మెత్తంగ రాదు గా బేలతపసి
కడవ నాడకు చాలు నీ గొడవ యేల
వెజ్జుఁదన మేల యని మది లజ్జవొడమి. 13

అ. బేలతపసి = ఓయి తెలివిమాలినమునీ, నీవు, చదివింతువు = విద్యాభ్యాసము చేయించెదవు, అనుచున్ = అని, ఇన్నియును = ఈకలిగినధనరాజ్యాదిసంపలన్నియు, విడిచి = వదలి, బిచ్చమెత్తంగన్ = తిరిప మెత్తుట, రాదుగా = సరిపడదుగదా - కలిగినవానినెల్ల ననుభవించుచునే యుండవలెను గాని మానుకోరాదుగదా యనుట, కడవన్ = మేరమీర, ఆడకుము = దూఱనాడకుము, చాలున్ = ఇప్పటి కాడినమాటలు చాలును, నీగొడవయేల = నీతోడివిచారము నాకేల, వెజ్జుఁదనము = నీవైద్యునితనము, ఏల = నాకెందుకు, అని = అనిపలికి, మదిన్ = మనస్సునందు, లజ్జవొడమి = సిగ్గుపుట్టి - సిగ్గుపుట్టఁగాననుట. - పైపద్యముతో నన్వయము.

తా. ఓయి తెలివి మాలినమునీ! నీవు విద్య నేర్పెదువని తనకుఁగల కలుములనెల్ల నెవ్వఁడును వదలఁడు. నీవు తారతమ్యము తెలియక పరువునకు మించి మాటలాడఁ బోకుము. ఇంతటితో నిలిపి యూరకుండుము నాకు నీతోడిచదువు విచారము నక్కఱలేదు. నీవైద్యునితనము నక్కఱ లేదని చెప్పి మనసునఁ గొంచెము లజ్జ పుట్టఁగా.

శా. కంటే బ్రాహ్మణుఁ డెన్నికాఱు లఱచెన్ గర్వించి వీరెల్ల నా
కంటెం బాత్రులె విద్య కెట్లు నిది నేఁ గైకొందు నంచున్ మదిన్
గెంటెంపుంజల ముప్పతిల్లఁ గపటాంతేవాసియై శాంబరిన్
గొంటుంజందము మీఱ శిష్యులగెడం గూర్చుండి చర్చారతిన్. 14

అ. బ్రాహ్మణుఁడు, గర్వించి = అహంకరించి, ఎన్నికాఱులు = ఎన్నికరినపుఁగూఁతలు, అఱచెన్ = కూసెనో, కంటే = చూచితివా, వీరెల్లన్ = ఈచదివెడివారందఱును, విద్యకున్ = చదువునకు, నాకంటెన్ = నాకన్నను, పాత్రులె = తగినవారా-వీరియందు నాయెడలేనిపాత్రత యేదియుఁగానమనుట ఎట్లును = ఏవిధముచేతనైనను, ఇది = ఈవిద్యను, కైకొందున్ = గ్రహించెదను, అంచున్ = అని, మదిన్ = మనస్సునందు, గెంటెంపుంజలము = రెట్టించినపట్టుదల, ఉప్పతిల్లన్ = పుట్టఁగా, శాంబరిన్ = మాయచేత, కపటాంతేవాసియై = మోసపుశిష్యుఁడై - అక్కడనున్న యతనిశిష్యులవలెనే వేషము వేసికొని శిష్యుఁడనై యనుట, గొంటుంజందము = దుష్టనిరీతి-దుష్టత్వము, మీఱన్ = అతిశయింపఁగా, శిష్యులగెడన్ = అతనిశిష్యులజతను, కూర్చుండి = కూర్చున్నవాఁడనై, చర్చారతిన్ = విషయవిచారణచేయుటయందలి యాసక్తితో-మీఁదిపద్యముతో నన్వయము.

తా. ఈబ్రాహ్మణుఁ డిట్లు గర్వించి నన్ను దూఱినాఁడనే. ఇతనియొద్దఁ జదివెడువారు మాత్ర మీవిద్య నభ్యసించుటకు నాకంటెయోగ్యులా కానిమ్మని మనసున నావిద్య నేర్చుకొనుటయందు మిక్కిలి పట్టు గలవాఁడనై మాయచేఁ గపటవేషము వేసికొని యతనిశిష్యులతోఁ జేరి కూర్చుండి యక్కఱతో విషయవిచారము చేయుచు

తే. కాయబాలగ్రహోర్ధ్వాంగకములు నాల్గు, శల్యదంష్ట్రాజరావృషసంజ్ఞ నాల్గు
నైనయష్టాంగకము రావు లారఁగల్గు, వైద్యమెనిమిదినెలల సర్వమును నేర్చి.

అ. కాయ.. ము-కాయ=దేహము, బాల=పసిబిడ్డలు, గ్రహ = క్షుద్రదేవతాది, ఊర్ధ్వాంగకములు=మెడకొంకులకుమీఁదివైనయవయవములు, నాల్గు=నాలుగును, శల్య ..సంజ్ఞన్-శల్య=శలాకాది, దంష్ట్రా = కోఱపంటికాటు, జరా = ముదిమి-ఇట ముదిమియన విషసంకలనాదులచేనైన యాసన్నమరణావస్థ, వృష=రేతస్సు, సంజ్ఞన్ = ఈపేళ్లచేనైనవి, నాల్గున్ = నాలుగును, ఐనయష్టాంగకము రావులు=అయినట్టిచికిత్సాంగము లెనిమిదింటితావులు, ఆరన్=ఒప్పునట్లు, కల్గువైద్యము = కలిగినట్టివైద్యశాస్త్రము, సర్వమున్ = అంతయున్, ఎనిమిదినెలలన్ = ఎనిమిదిమాసములలోపల, నేర్చి = అభ్యసించి.-పైపద్యముతో నన్వయము.

తా. కాయబాలగ్రహాదు లయిన యెనిమిదియంగములు గలవైద్యము నెనిమిదినెలలలోనే తుదముట్ట నేర్చుకొని

వైద్యాష్టాంగములలక్షణం బెట్టిదనిన.—"శ్లో. కాయబాలగ్రహోర్ధ్వాంగ శల్యదంష్ట్రా జరావృషాన్ । అష్టావంగాని తస్యాహు శ్చికిత్సా యేషు సంశ్రితా॥" అను శ్లోకార్థమునుబట్టి-కాయచికిత్స బాలచికిత్స, గ్రహచికిత్స, ఊర్ధ్వాంగచికిత్స, శల్యచికిత్స, దంష్ట్రాచికిత్స, జరాచికిత్స, వృషచికిత్స, అని వైద్యమునకు నంగము లెనిమిది. అందు-కాయచికిత్స యనఁగా దేహమునందుఁ గలిగెడుజ్వరము రక్తస్రావము పిత్తోల్బణము అతిసారము మొదలుగాఁ గలరోగముల నుపశమింపఁ జేయుచికిత్స కాయ మనఁగా దేహ మేకదా దానికిఁజేయుచికిత్స సర్వమును గాయచికిత్సయై యుండఁగా బాలాదివిశేషసంజ్ఞ లేలయ

నిన, పసిబిడ్డలకును నేత్రాద్యంగములకును జికిత్సాక్రమము భేదపడియుండుటచేత నేని యొంటుంగునది-
బాలచికిత్స = పసిబిడ్డలకుపయుక్తమైన చికిత్స ఇందు పసిబిడ్డలకుఁ దగినయౌషధములు వారికిఁ బాలి
చ్చుదాదులు దాదులపాలలోనిదోషాదోషములు ఆపాలదోషములవలనఁ గలిగెడివ్యాధులు వాని నుపశ
మింపఁజేయు మందులు ఇవియన్నియుఁ దెలుపఁబడును. గ్రహచికిత్స = బాలగ్రహాదిక్షుద్రదేవతలు మొ
దలుగాఁగల గ్రహములవలన నైనపీడలు శమింపఁజేయు మంత్రతంత్రప్రయోగాదిరూపమయినచికిత్స
-ఊర్ధ్వాంగచికిత్స = మెడకొంకులకుమీఁది వైనకన్ను ముక్కు చెవి నోరు (లేక) తల వీనియందుఁ గలి
గినవ్యాధులను మాన్పుటకై యాశ్చోతనశలాకాదిక్రియలచేఁ జేయుచికిత్స ఆశ్చోతనమనఁగా "ఉ
న్మీలితేక్షిదృజ్ఞ్యేబిందుభిర్ద్వ్యంగులాద్ధితమ్." అనుప్రమాణముచొప్పునఁ గన్నుదెఱచి దానినడుమ
రెండంగుళములలోఁతునకు దిగునట్లు ఔషధబిందువులను విడుచుట. శలాకయనఁగా సన్ననిలోహపుకడ్డి
లోపలఁజొప్పించి శోధించుట. దీనిని శాలక్యమనియునందురు -శల్యచికిత్స = వ్రణములదైనచికిత్స-అనఁ
గా బాణముకత్తి మొదలగువానిచే నైనగాయములకుఁ జేయుచికిత్స -దంష్ట్రిచికిత్స = పాము మొదలగు
వానికోఱకాటువలనివిషములను నివారణచేయుచికిత్స ఇది విషచికిత్సయనియుఁ జెప్పంబడియెడి. జరా
చికిత్స = విషసంకలనాదులచేనైన యాసన్నమరణావస్థయందు రసాయనాదులం బ్రయోగించి చేయు
చికిత్స. ఇది రసాయనచికిత్స యనియుఁ జెప్పంబడు -వృషచికిత్స = రేతస్సు వికలమయినప్పుడు ఆప్యా
యనప్రసాదోపజననాదిరూపమునఁ జేయుచికిత్స. దీనికి వాజీకరణచికిత్స యనియుఁ బేరు. (ఆప్యాయ
నము = తనుపు. ప్రసాదము = స్వాస్థ్యము. ఉపజననము = అభివృద్ధి. చికిత్స = రోగముమానుటకై
చేయుప్రతిక్రియ.)

క. ఇరుమూఁడురుచులదోషపు, విరసత మానఁగ జ్వరాదివృష్యాంతంబై
పరఁగుచికిత్సయుఁ గని శాం, బరి బాసి తపస్వితోడ కే మదమున నంటిన్. 16

అ. ఇరు.. విరసత-ఇరుమూఁడురుచుల = ఉప్పు పులుసు కారము తీపు చేఁదు వగరు అనెడి
యాఱురుచులయొక్క, దోషపు = తప్పులవలననైన-లోపములవలననైన, విరసత = రసహీనత్వము, మా
నఁగ = పోవునట్లు, జ్వరాదివృష్యాంతంబై = జ్వరచికిత్స మొదలు వృషచికిత్సతుద గాఁగలదై, (ఇచట
వృష్యయనఁగా వృషసంబంధి చికిత్సాసముదాయమనుట) పరఁగు = ఒప్పునట్టి, చికిత్సయున్ = వై
ద్యమును, కని = పొంది-గ్రహించియనుట, శాంబరిన్ = మాయను, బాసి = విడిచి, మదమునన్ =
గర్వములో, తపస్వితోడన్ = ఆమునీశ్వరునితో-బ్రహ్మమిత్రునితో, అంటెన్ - [illegible]

తా. ఉప్పు మొదలయినయాఱురసములందు [illegible] కలుగు [illegible]
చిపుట్టునో యాయాదోషములను వానికిఁ బరిహారౌషధములను జ్వర [illegible]
నైన వైద్యమంతయు నామూలాగ్రముగా గ్రహించి మాయవిడిచి [illegible]
గర్వముచే బ్రహ్మమిత్రునితో నిట్లుపలికెను.

శా. తండ్రీ నాకు ననుగ్రహింపఁగదె వైద్యం [illegible]
గంధ్రల్ గా నటు లాడి ధిక్కృ [illegible]
దీంద్రుల్ గల్గినవారి కేకరణి నేర్పిన విద్య [illegible]
గుంద్రా డాఁచినఁ బెంజ్లి యేమిటికిఁ జెక్కు [illegible] 1

అ. తండ్రీ = ఓనాయనా, వైద్యంబు = వైద్యశాస్త్రము [illegible]
దయచేసినేర్పవయ్యా, అంచున్ = అని, ప్రార్థించినన్ = వేఁడుకొనఁగా, [illegible]

లుగా, అటులు = ఆప్రకారము,ఆడి = నిందించి, ధిక్కృతులన్ = తిరస్కారపుమాటలతో, పోకా ర్చుంటివి = పోఁబొమ్మంటివి, ఓహో = ఔరా-అంతమాత్రముచేత నేమాయెననుట. మదిన్ = మనస్సునందు, తీండ్రల్ = చొరవలు- ఇట బహువచన మాధిక్యమును దెలుపును, కల్గినవారికిన్ = కలవారలకు,ఏకరణి నేనిన్ = ఏవిధముచేతనైనను, విద్య = చదువు, రాకుండునే =రాకయుండునా-రానే వచ్చుననుట, కష్టముష్టింపచా = నీచుఁడవైనబిచ్చపుబాఁపఁడా, గుంద్రా = గుండుత్రాయి- పసుపు లోనగునవి నూఱుకొనెడిపాత్రమును, డాఁచినన్ = దాఁచిపెట్టినను, పెండ్లి = వివాహము, ఏమిటికిన్ = ఎందులకు, చిక్కున్ = జరగకనిలిచిపోవును-గుంద్రాతిని దాఁచిపెట్టినమాత్రమునఁ బెండ్లి నిలుపక జరగునట్లు నీబోఁటిమూర్ఖులు తిరస్కరించినమాత్రముననే విద్యాపేక్షగలవారికి విద్యరాకపోదు. ఎట్లయినను రానేవచ్చును. కనుకనే నీవు నన్నుఁ దిరస్కరించి వెడలిపొమ్మన్నను నేనెట్లో విద్యగ్రహింపనే గ్రహించితి ననుట. అలం. అర్థాంతరన్యాసము

మ. అనినం గన్నులు జేవురింప నధరం♦బల్లాడ వేల్లత్పునః
పునరుద్యద్భ్రుకుటీభుజంగయుగళీ♦ఫూత్కార ఘోరానిలం
బన నూర్పుల్ నిగుడన్ లలాటఫలకం♦బందంద ఘర్మాంబువుల్
చినుకం గంతుదిదృక్షురూక్షనయన♦క్ష్వేళాకరాళధ్వనిన్. 18

అ. అనినన్ =నేనిట్లనియనఁగా, కన్నులు, జేవురింపన్ =ఎఱ్ఱవాఱఁగాను, అధరంబు=పెదవి, అల్లాడన్ = అదురఁగాను, వేల్ల.. నిలంబు - వేల్లత్ = వ్రేలుచున్నదియు, పునఃపునః=మాటిమాటికి, ఉద్యత్ = ఎగయుచున్నదియునైన, భ్రుకుటీ = బొమముడియనెడి, భుజంగయుగళీ = పెనఁగొన్న పాములజంటయొక్క, ఫూత్కార = బుసయొక్క, ఘోర = భయంకరమైన, అనిలంబు=వాయువు, అనన్ =అనునట్లు, ఊర్పులు = నిట్టూర్పులు, నిగుడన్ = అతిశయింపఁగాను, లలాటఫలకంబు=పలకవలెవిశాలమైననొసలు, అందంద = మఱిమఱి - అధికముగాననుట, ఘర్మాంబువుల్ = చెమటనీళ్లు, చినుకన్ = కురియింపఁగాను,కంతు. .ధ్వనిన్ - కంతు = మన్మథుని,దిదృక్షు=కోపదృష్టితోఁజూడ నిచ్ఛగల, రూక్షనయన=అగ్నినేత్రముగలశివునియొక్క, క్ష్వేళా = సింహనాదమువలె, కరాళ=భయంకరమైన, ధ్వనిన్ = ధ్వనితో - పైపద్యముతో నన్వయము

తా. అని నేను గర్వించి పలుకఁగా నామునీశ్వరుఁడు కన్నులెఱ్ఱవాఱఁగాను బెదవు లదురఁగాను బెనఁగొని బుసపెట్టుచున్నపాములజంట విడుచునిట్టూర్పులో యనునట్లు బొమముడిగలముఖభాగమునుండి నిట్టూర్పువాయువులు వెడలఁగాను నొసటఁ జెమటనీళ్లుకాఱఁగాను మన్మథునిఁ దీక్ష్ణదృష్టితోఁజూచి సింహనాదము చేసినరుద్రునిసింహనాదధ్వనియో యనునట్లు కంఠధ్వని మొరయఁగా. అలం ఉత్ప్రేక్ష, స్వభావోక్తియు

జటిలుండు గిటకిటం బండ్లు గొఱికి హుమ్మని కటమ్ము లదుర ముకుఁబుటమ్ములు
చటింపఁ గటగటా కుటిలాత్మ యటమటమ్మున విద్యగొనుటయుం గాక గుటగుటలు
గురువుతోనా యని కటకిటంబడి కకపాలలోనిబూది కేలం గొని యాసురి
యగుమాయ మాయెడం బ్రయోగించి వంచించి యపహసించితివి గావున నసుర
వై పిశితంబును వసయును నస్రగ్రసంబు నశనంబులుగా మెసవి వసుధ వసియిం
పు మఘి బసుమరేభు సల్ల గుండె జల్లుమని కిల్లువడి మునితల్లజుపదపల్లవంబులం 19
బ్రెల్లి యిట్లంటి

ఆ. జటికెలుందు = జడదారి = మునీశ్వరుఁడు, కిటకిటక్ = కిటకిట యను ననుకరణధ్వనితో, పండ్లుగొఱికి = పండ్లుగీఁకి, హుమ్మని = హుంకారము చేసి, కటమ్ములు = కణఁతలు, అదురన్ = చలింపఁగా, కటకటా = అయ్యయ్యో - ఇది కోపాతిశయమును దెలుపును, కుటిలాత్మా = కపటచిత్తుఁడా, అటమటమ్మునన్ = వంచనచేత - వంచనచేసి యనుట, విద్య = చదువు, కొనుటయుంగాక = గ్రహించుటమాత్రముగాక, గుటగుటలు = గర్వపుమాటలు, గురువుతోనా = ఒజ్జతోనా (ఆడెదవు.) అని, కటకటించి = ఆగ్రహించి, కకపాలలోనిబూది = విబూదితిత్తిలోనున్న విబూదిని, కేలన్ = చేతియందు, కొని = గ్రహించి, ఆసురి = అసురసంబంధమైనది, అగుమాయన్ = అయినట్టిమాయను, మాయెడన్ = మావిషయమునందు, ప్రయోగించి = ఉపయోగించి - పన్ని, వంచించి = మోసపుచ్చి, అపహసించితివి = ఎగ్గొడిగములాడితివి. కావునన్ = కనుక, అసురవై = నీవు అసురుఁడవై, పిశితంబును = మాంసమును, వసయును = కడుపులో బొడ్డుక్రిందనుండెడి యుల్లిపొరవంటిక్రొవ్వును, అస్ర్గసంబును = నెత్తురును, అశనంబులుగాన్ = ఆహారవస్తువులుగా, మెసవి = తిని, వసుధన్ = భూమియందు, వసియింపుము = ఉండుము, అని, బసుమంబు = చేతనున్న విబూదిని, చల్లన్ = నా మీఁదఁజల్లఁగా, గుండె = హృదయము, జల్లుమని = తల్లడిల్లి, కల్లువడి = భ్రమానుపడి- నిశ్చేష్టత్వము నొంది, ముని...బులన్ - మునితల్లజు = ఆమునిశ్రేష్ఠునియొక్క, పదపల్లవంబులన్ = చిగుళ్లవంటి యడుగులమీఁద, త్రెళ్లి = పడి, ఇట్లంటిన్ = ఈవిధముగాఁ బలికితిని.

తా. ఆమునీశ్వరుండు పండ్లు పటపట గొఱుకుచు హుంకారము చేసి బెదరించి యోరి మోసకాఁడా! మోసము చేసి మావలన విద్య గ్రహించినదిమాత్రముగాక మీఁదుమిక్కిలి మమ్ముఁ దిరస్కరించి మాటలాడి పరిహసించెదవా యని తనవిబూదిసంచిలోని విబూదిని జేతి కెత్తుకొని యభిమంత్రించి నీవు రాక్షసమాయచే మమ్ము వంచించినవాఁడవు. రాక్షసుఁడవై మనుష్యమాంసము దిని నెత్తురు త్రాగుచు వర్తింపుమని శపించెను. అందులకు నేను భయపడి యాయనపాదములమీఁదఁబడి యీమీఁదఁ జెప్పఁబోవురీతిగాఁ బ్రార్థించితిని

శా. నాయజ్ఞానము సైఁచి సంయమివరేణ్యా కావవే రాక్షసుం
డై యేనెట్లు భజించువాఁడ దురితం బయ్యో నృమాంసంబు కూ
డై యే నెట్లు భరించువాఁడ నుదరం బార్ద్రాంతరంగుండ వై
యోయయ్యా దయసేయవే యవధి యే నోపంగదే హింసకున్. 20

అ సంయమివరేణ్యా = మునిశ్రేష్ఠుఁడా, నాయజ్ఞానము = నా తెలివిలేమిని, సైఁచి = సహించి, కావవే = కాపాడవయ్యా, రాక్షసుండై = రక్కసుండనై, ఏన్ = నేను, దురితంబు = పాపమును, ఎట్లు = ఏవిధముగా, భజించువాడన్ = పొందగలవాఁడను. అయ్యో = అక్కటా - ఇది దుఃఖమును దెలుపును, నృమాంసంబు = మనుష్యమాంసము, కూడై = అన్నమై - అన్నముగా భుజించి యనుట, ఏన్ = నేను, ఉదరంబు = కడుపును, ఎట్లు = ఏవిధముగా, భరించువాఁడన్ = పోషింపఁగలవాఁడను, ఓయయ్యా = ఓ నాయనా, ఆర్ద్రాంతరంగుండవై = (దయారసముచే) తడిసిన మనసుగలవాఁడై - దయగలవాఁడవైయనుట, అవధి = మేర - ఇంతకాలమున కీకారణముచేత నీశాపము తీఱునను మేర ననుట. దయసేయవే = అనుగ్రహింపవయ్యా - సెలవిమ్మనుట, ఏన్ = నేను, హింసకున్ = ప్రాణులనుహింసచేయుటకు, ఓపఁగదే = తాళలేనుగదయ్యా

తా. ఓ మునిశ్రేష్ఠుఁడా! తెలివిమాలి నేను జేసిన తప్పు సహించి నన్నుఁ గాపాడుము. నేను శాపముల ననుభవింపను. మనుష్యమాంసముతోఁ బొట్టబోసికొని జీవింపను. ప్రాణులను బాధించి చంపను నోపను. నాయందు దయచేసి యీశాపము తీఱుటకు నొక మేర నిర్ణయించి గ్రహింపుము

చ. అనినఁ బ్రసన్నుఁడై ముని కరాబ్జములన్ నను నెత్తి వత్సమ
త్సునిశితశాపశూలహతిఁ జిక్కితిగా యికఁ గొన్నినాళ్లపైఁ
దనయను మ్రింగఁ బోయి యొకధన్యునిదివ్యశరార్చిఁ బ్రేలి వే
కనియెదు భద్ర మన్నఁ దురగంబుపయిం బడి ప్రొద్దు గ్రుంకఁగన్. 21

అ. అనినన్ = (అని నేను దుఃఖముతో) మనవిచేసికొనఁగా, ముని=ఋషి-బ్రహ్మమిత్రుఁడు, ప్రసన్నుఁడై = నాయందనుగ్రహముగలవాఁడై, ననున్ = నన్ను, కరాబ్జములన్ = తామరలవలె మృదువులైన తనచేతులలో, ఎత్తి = (తన యడుగులపైనుండి) లేవనెత్తి, వత్స = ఓరిచిన్నవాఁడా, మత్సు.. నాతిన్-మత్ = నాదైన, సునిశిత = మిక్కిలి తీక్ష్ణమైన, శాప=తిట్టనెడు, శూలహతిన్ = శూలాయుధముయొక్క పోటుచేత, చిక్కితిగా = దుఃఖించితివిగదా, ఇఁకన్ = ఇంకను, కొన్నినాళ్లపైన్ = కొన్నాళ్లపైఁ దరువాత, తనయున్ = నీకొమార్తను, మ్రింగఁబోయి = మ్రింగుటకు యత్నించి, ఒక శరార్చిన్ - ఒకధన్యుని = ఒక పుణ్యాత్మునియొక్క, దివ్యశరార్చిన్ = దివ్యాస్త్రజ్వాలలచేత, ప్రేలి = వేఁగి-కాల్పఁబడి యనుట, వే = శీఘ్రముగా-వెంటనే యనుట, భద్రము = మేలు - శాపమోక్షమును, కనియెదు = పొందెదవు, అన్నన్ = అనఁగా, తురగంబుపయిన్ = గుఱ్ఱముమీఁద, పడి = కూర్చుండఁబడి, ప్రొద్దుగ్రుంకఁగన్ = సూర్యాస్తమయసమయమునను - మీఁదిపద్యముతో నన్వయము.

తా. అని ఈవిధముగా నేను బ్రహ్మమిత్రమునీశ్వరుని దైన్యముతో వేఁడుకొనఁగా నతఁడు తనయడుగులపయిం బడియున్న నన్ను లేవనెత్తి ప్రేమతో నోరిచిన్నవాఁడా! నీవు నాశాపమునకు వెఱచి పాదాక్రాంతుఁడవైతివి గనుక స్వల్పకాలములోనే నీకూఁతునే మ్రింగఁబోయి యొక్క పుణ్యపురుషుని బాణాగ్నిజ్వాలలచేత గాలి శాపమువలన విముక్తుఁడవయ్యెదవు పొమ్మనఁగా నందుండి యొక గుఱ్ఱము నెక్కి వెడలి సూర్యాస్తమయమునను.

క. సన్నపుఁదలయేరున మయి, యన్నుకొనుచు నాముదిన్నవియస్థై రాఁగా
ఖిన్నుఁడనై పురి కేఁగితిఁ, దిన్నఁదనం బుడిగి కొన్నిదివియలు వెలుఁగన్. 22

అ. సన్నపుఁదలయేరునన్ = కొంచెపుఁదలనొప్పిచేత, మయి=దేహము, అన్నుకొనుచున్ = పరవశమగుచు, నాముదిన్నవియస్థై = విస్మయుదిన్నవిధమై, రాఁగాన్ = ఏర్పడఁగా, ఖిన్నుఁడనై = ఖేదమునొందినవాఁడనై, తిన్నఁదనంబు = సౌమ్యభావము, ఉడిగి = మాని, కొన్నిదివియలు = కొన్నిదివిటీలు, వెలుంగన్ = వెలుఁగుచుండఁగా, పురికిన్ = నాపట్టణమునకు, ఏఁగితిన్ = పోయితిని.

తా. కొంచెము తలనొప్పియు విస్మయుదిన్నట్లు మైకమునుగలిగి దేహము పరవశముకాఁగా ఖేదమునొంది యదిరిపడుచు గొన్ని దివిటీలు వెలుఁగుచుండ మెల్లగాఁ బోయి పట్టణముచేరితిని. అలం. స్వభావోక్తి.

క. అంపఁ దగువారిఁ గొసరుచు, నంపి నగరుసొచ్చి వెలఁదుకలారతులీఁగా
నింపళుల నిగశోభితహాతులన్, జంపించితి వారి నన్నికేశామధ్యమునన్. 23

అ. (అట్లు పట్టణముచేరి.) అంపక = సెలవిచ్చిపంపుటకు, తగువారికి = తగిన సేవకులు మొదలగువారికిని, కసరుచుక = కోపముతో నదలించుచు, అంపి = వారివారినివాసములకుఁ బంపి, నగరు = దివాణమును, చొచ్చి = ప్రవేశించి, వెలఁదులు = స్త్రీలు, ఆరతులీఁగాక = (వాడుకచొప్పున) నీరాజనము లియ్యఁగా, ఇంపు = సంతోషము, అఱక = చెడునట్లు, వారలక = ఆయారతులియ్య వచ్చిన స్త్రీలను, అన్నిశామధ్యమునక = ఆనడిరేయిని, కశాభిహతులక = కొరడాదెబ్బలచేత, చంపించితిని

సీ. అభ్రమండలి మోచునందాఁక నూరక, పెరిఁగినట్లౌ మేను నరవరేణ్య
యవధిభూధరసానువందాఁక నూరక, పఱచినట్లౌ మేను పార్థివేంద్ర
యబ్జభూభువనంబునందాఁక నూరక, యెగసినట్లౌ మేను జగదధీశ
యహిలోకతలమంటునందాఁక నూరక, పడినయట్లవు మేను ప్రభువతంస
యఖిలజగములుమ్రింగునంతదాఁకలియును, నబ్ధులేడును జెడఁగ్రోలునంతతృషయు
నచలచాలనచణ మైనయదటుఁగలిగె, నసురభావంబు నను జెందునవసరమున.

అ. నరవరేణ్య = ఓరాజా, అసురభావంబు = రాక్షసత్వము, ననుక = నన్ను, చెందునవసరమునక = పొందినసమయమునందు, మేను = నాశరీరము, ఊరక = కారణము లేకయే, అభ్రమండలి = మేఘమండలము- ఆకాశము, మోఁచునందాఁకక = ఒరియునంతవఱకు, పెరిఁగినట్లు = వృద్ధినొందినట్లు, ఔక = అగును, పార్థివేంద్ర = ఓరాజశ్రేష్ఠుఁడా, మేను = నాదేహము, అవధి దాఁకక = అవధిభూధర = చక్రవాళపర్వతముయొక్క, సానువందాఁకక = చఱియ వఱకు, ఊరక = ఎడతెగక, పఱచినట్లు = పేరెమెత్తినట్లు, ఔక = అగును, (పా. పఱపినట్లౌక = వ్యాపింపఁజేసినట్లవును.) జగదధీశ = ఓభూలోకనాయకా, మేను, అబ్జ . దాఁకక - అబ్జభూ= బ్రహ్మయొక్క, భువనంబునందాఁకక = లోకమువఱకును - సత్యలోకపర్యంతము ననుట. ఊరక = మానక, ఎగసినట్లు = ఎగిరిపోయినట్లు, ఔక = అగును, ప్రభువతంస = రాజశ్రేష్ఠుఁడా, మేను, అహిలోకతలము = నాగలోకముయొక్క యడుగు భాగము, అంటునందాఁకక = అంటునంతపర్యంతము, ఊరక = కారణములేకయే, పడినయట్లౌక = దిగఁబడిపోయినట్లగును, అఖిలజగములు = ఎల్లలోకములను, మ్రింగునంత = మ్రింగవలసినంత, ఆఁకలియుక = తుత్తును, అబ్ధులేడును = ఏడుసముద్రములను, చెడఁగ్రోలనంత = తుదముట్టఁద్రాగవలసినంత, తృషయుక = దప్పియును, అచల చాలనచణము - అచల = కొండలనుకూడ, చాలన = చలింపఁజేయుటకు - కదలించుటకు, చణము = చాలినది, ఐనయదటుక = అయినట్టియుద్ధతియును - బలగర్వమును, కలిగెను

తా. ఓమహారాజా! ఆరాక్షసత్వము నన్నుఁబొందినతోడనే నాదేహము పరవశమై కారణము లేకయే యాకాశము నొరయునట్లు, పొడుగుగాఁ బెరిఁగినట్లును, చక్రవాళపర్వతపర్యంతము పరుగెత్తినట్లును, బ్రహ్మలోకపర్యంతము మీఁదికెగిరిపోయినట్లును, పాతాళలోకముదాఁక దిగఁబడిపోయినట్లును పై యెల్లలోకములను మ్రింగునంతటియాఁకలియు, నెల్లసముద్రములను బుడిసిటఁబట్టి త్రాగునంతటి దాహమును, కొండలనుబట్టి కదలించునంతటిక్రొవ్వును గలిగెను అలం. స్వభావోక్తి.

క. రక్కసుఁడనై నెపం బిడి, యొక్కొకయపరాధమునకు నొక్కొక్కఁడు గా
బొక్కఁగ లోకము పురపురఁ, బొక్కఁగఁ బొడయ్యె నంతిపురముం బురమున్.

అ. రక్కసుఁడనై = అట్టి రాక్షసుఁడనై, నెపంబిడి=మిష పెట్టి - ఏదో నొక నేరము మోపి యనుట, ఒక్కొకయపరాధమునకున్ = ఒక్కొక్క నేరమునకును, ఒక్కొక్కఁడు = ఒక్కొక్క మనుష్యుఁడు, కాన్ = అగుచుండఁగా, బొక్కఁగన్ = భక్షించుచుండఁగా, లోకము = జనసమూహము, పురపురఁబొక్కఁగన్ = మిక్కిలితపించునట్లు, అంతిపురమున్ = అంతఃపురమును, పురమున్ = పట్టణమును, పాడయ్యెన్ = పాడుపడిపోయెను - నేను లేని నేరములు కల్పించి పట్టణములోనిజనుల నందఱను బట్టి తిన నారంభించితిని దానిచే రాణివాసము మొదలుగాఁ బట్టణమంతయుఁ బాడుపడిపోయెను. అందులకు లోకులందఱును బరితపించిరని తాత్పర్యము

తే. ఊరు పాడైనఁ గెళవులయూళ్ల కుఱికి
మెసవ దొరఁకొంటిఁ బ్రజ మారి మసఁగినట్లు
తీఱెఁ గతిపయదినముల దేశమెల్ల
మల్లె వట్టినచేనిక్రమంబు గాఁగ.  26

అ. ఊరు=నాయూరు- నాపట్టణము, పాడైనన్ = నాశము కాఁగా, కెళవులయూళ్లకున్ = ఇరుగుపొరుగు గ్రామములకై, ఉఱికి=దాఁటి- పోయి యనుట, ప్రజన్ =జనసమూహమును, మారి మసఁగినట్లు=మారి యనుదేవత విజృంభించి నాశము చేయునట్లు, మెసవన్ = పట్టితినుటకు, దొరఁకొంటిన్ = మొదలుపెట్టితిని, కతిపయదినములన్ = కొన్నిదినములలోపలనే, దేశమెల్లన్ = నాదేశమంతయు, మల్లె = తెగులు, పట్టినచేనిక్రమంబు = తగిలినచేనివిధము, కాఁగన్ = అగునట్లు, తీఱెన్ = నాశమయ్యెను (మల్లె యనఁగాఁ బైరును జెఱుచునట్టియొకవిధమైనచెట్టు. అది బలియఁగాఁ బైరులేనిచేనివలె నాశమయ్యెనని కొందఱర్థము వ్రాసియున్నారు)

తా. నేను నాపట్టణమంతయుఁ బాడై పోఁగా నిరుగుపొరుగుగ్రామములమీఁదఁ బడి మారిదేవత యొకతట్టునుండి క్రమముగా జనులను జంపుచు వచ్చునట్లు సర్వజనులను జంపి తినుచు వచ్చితిని. దానిచేతఁ దెగులుతగిలిన చేనివలె దేశమంతయుఁ గొన్నిదినములలోనే పాడైపోయెను
అలం. ఉపమ.

వ. ఇవ్విధంబున విధివిధానంబున యాతుధానుండనై ధారాధరోత్సేధంబును నతినిశితరోమసంబాధంబును ధూమసమధామంబును ధృతాంత్రదామంబును జలితకపాలకుండలంబును జ్వలితసితదంష్ట్రామండలంబును నాగాయుతత్రాణంబును మస్తకోత్తుంగఘోణంబును నై యనవరతహింసానురూపం బగురూపంబుఁ దాల్చి శకటాంగభంగికమ్ములై యింగలమ్ము లొలుకు నపాంగమ్ములం బిశంగమ్ములగుచుఁ బశ్యజ్జనాసుమోచనమ్ము లగులోచనమ్ములు వెలుంగ బభ్రుకేశమ్ములు దూలి సకలభూతభయంకర మ్మగుపటిమ నిచటియుటజమ్ముల కుఱికి జటి యనక వటు వనక యతి యనక వ్రతి యనక గృహి యనక సతి యనక శిశు వనక భక్షించి భక్షించి కుక్షింభరిత్వంబునం బ్రవర్తిల్లితి నది యట్లుండె వినుము తారలకు వర్షధారలకు నిసుమునకుఁ గసవునకు లెక్క గలిగినం గలుగుఁగాని మదీయజఠరానలజీర్ణజంతుసంతానంబునకు లెక్కయిడ నక్కమలగర్భుండును సమర్థుండు గాఁ డిట్టి కృత్రిమదనుజభావావిష్టుండ నగు నాదౌష్ట్యంబు సవసవగాఁ దెలిసి ముదిరకయు

మున్న మత్కళత్రంబులం బుట్టినింటవా రుత్సవావలోకనవ్యాజంబున ననిపించుకొని చని నిజగృహంబుల నునిచి రక్షించుకొనియుండి రిప్పు డేనశనంబు గానక కానక కన్నయిక్కన్నియం గైలాసకాననంబునం గుసుమంబులు గోయుచుదానిం గని కనికరంబు పుడిగి కడుపుంజిచ్చునకు మ్రింగం దలంచుకొని వచ్చి యిచ్చోట భవదీయదర్శనంబున వృజినరుజవలన విముక్తుండనై నిజప్రకృతిం బొంది కృతార్థుండ నైతి. 27

అ. ఇవ్విధంబునన్ = ఈరీతిని, విధివిధానంబునన్ = దైవకృతముచేత, యాతుధానుండనై = రాక్షసుఁడనై, ధారాధరోత్సేధంబును = మేఘమండలపర్యంతమైన పొడుగును, అతి. . బాధంబును - అతి = మిక్కిలి, నిశిత = వాఁడియైన-బిఱుసైనయనుట, రోమ = మేనివెండ్రుకలచేత, సంబాధంబును = సందులేనిదియు, ధూమ బును-ధూమ = పొగతోడ, సమ = సరిపోలిన, ధామంబును = కాంతిగలదియు, ధృతాంత్రదామంబును-ధృత = ధరింపఁబడిన, అంత్ర = ప్రేఁగులయొక్క, దామంబును = సరములుగలదియు, చలిత . . బును-చలిత = కదలింపఁబడిన, కపాల = పుర్రెపెంకులయొక్క, కుండలంబును = చెవిపోఁగులు గలదియు, జ్వలిత బును - జ్వలిత = వెలుఁగునట్టి, సిత = తెల్లనైన, దంష్ట్రా = కోఱలయొక్క, మండలంబును = సమూహముగలదియు, నాగాయుతత్రాణంబును = పదివేలయేనుఁగులబలముగలదియు, మస్త బునునై - మస్తక = తలమీఁదివలిని, ఉత్తుంగ = ఎత్తుగానిక్కిన, ఘోణంబుననై = ముక్కుగలదియునై, అనవరతహింసాను రూపంబు-అనవరత=ఎడతెగని, హింసా = కట్టుట కొట్టుట చంపుట మొదలగు ప్రాణులబాధకు, అనురూపంబు = తగినది, అగురూపంబున్ = అగునట్టియాకృతిని, తాల్చి = ధరించి, (అలం. స్వభావోక్తి) శక . మ్ములై=శకటాంగ = బండిచక్రములయొక్క, భంగికమ్ములై = విధముగలవియై, ఇంగలమ్ములు = నిప్పులు, ఒలుకునపాంగమ్ములన్ = రాలుచున్నకడగన్నులచేత, పిశంగమ్ములు = పచ్చవాఱినవి, అగుచున్ = అవుచును, పశ్యజ్జనాసుమోచనమ్ములు-పశ్యత్ = చూచుచున్న, జన = మనుజులయొక్క, అసు=ప్రాణములను, మోచనమ్ములు = విడిపించునవి, జనులు చూచినంతనే తల్లడిల్లి ప్రాణములు విడుచునంతటి ఘోరములైన వనుట. అగులోచనమ్ములు = అగునట్టికన్నులు, వెలుంగన్ = ప్రకాశింపఁగా, (అలం ఉపమ, స్వభావోక్తియును.) బభ్రుకేశమ్ములు = పచ్చనితలవెండ్రుకలు, తూలన్ = చలించుచుండఁగా, సకలభూతభయంకరంబు - సకల = సమస్తమయిన, భూత = ప్రాణులకు, భయంకరంబు = వెఱపును గలుగఁజేయునది, అగుపటిమన్ = అయినట్టి సామర్థ్యముచేత, ఇచటియుటజమ్ములకున్ = ఇక్కడిమునులపర్ణశాలలకు, ఉటికి = దుమికి - ఇక్కడిమునిపల్లెల యాకటిండ్లపైఁబడి యనుట. జటియనక = జడలువాల్చినయోగీశ్వరుఁడని యెంచక, వటువనక = బ్రహ్మచారియనియెంచక, యతియనక = సన్న్యాసియనియెంచక, వ్రతియనక = వానప్రస్థుఁడనియెంచక, గృహియనక = గృహస్థుఁడనియెంచక, సతియనక = ఆఁడుదియనితలఁపక, శిశువనక = పసిబిడ్డయని తలఁపక, భక్షించిభక్షించి = తినితిని - ఎల్లవారిని దినితిని, కుక్షింభరిత్వంబునన్ = కడుపుఁబోసికొనువానితనముచేత - కడుపుఁబూడ్చుకొనుటచేతననుట, ప్రవర్తిల్లితిన్ = చరించుచుంటిని, అదియట్లుండెన్ = ఆసాప్రవర్తనము అట్లుండఁగా, వినుము=ఇంక నేఁ జెప్పఁబోవుదాని వినుము, తారలకున్ = నక్షత్రములకును, వర్షధారలకున్ = వానచినుకులకును,

ఇసుమునకును = ఇసుకకును, కసవునకున్ = (భూమిలో మొలచిన) గడ్డిపరకలకును, లెక్కన్ = ఇన్ని యనుసంఖ్య, కలిగినన్ = కలిగనేనియు, కలుగుఁగాని = కలుగవచ్చునుగాని, మదీయ... బునకున్ - మదీయ = నాదైన, జరఠానల = జరఠాగ్నిచేత, జీర్ణంబు = అఱిగినది, అయిన=అయినటువంటి, జంతు = ప్రాణులయొక్క, సంతానంబునకున్ = సమూహమునకు, లెక్కయిడన్ = లెక్కపెట్టుటకు, అక్కమలగర్భుండును = (సృష్టికర్తయైన) బ్రహ్మకూడ, సమర్థుఁడు = సామర్థ్యముగలవాఁడు, కాఁడు, ఇట్టి..విష్టుండను - ఇట్టి=ఇటువంటి, కృత్రిమ = కలుగఁజేయఁబడిన - మునిశాపము చేతవచ్చిన యనుట, దనుజభావ = దానవత్వము - రాక్షసత్వము, ఆవిష్టుండను= ఆవేశించినవాఁడను-కలిగినవాఁడననుట, అగునాదౌష్ట్యంబు = అయిన నాదుష్టత్వమును, నవనవగాన్ = జాడజాడగా-చూచాయగా, తెలిసి = ఎఱిఁగి, ముదురకయున్న = ఆదౌష్ట్యము హెచ్చకముందే, మత్కళత్రంబులన్ = నాభార్యలను, పుట్టినింటివారు = ఆభార్యల తల్లిదండ్రులు మొదలగువారు, ఉత్సవావలోకనవ్యాజంబునన్ - ఉత్సవ= పెండ్లి మొదలగు వేడుకలు, అవలోకన= చూచుటయనెడి, వ్యాజంబునన్ = సాకుచేత, అనిపించుకొని = నేనుబంపునట్లు చేసికొని, చని=పిలుచుకొనిపోయి, నిజగృహంబులన్ = తమయిండ్లయందు, ఉనిచి = పెట్టుకొని, రక్షించుకొని=కాపాడుకొని, ఉండిరి, ఇప్పుడు=ఈ సమయమునందు, ఏన్ = నేను, అశనంబు=ఆహారము, కానక=పొందక-చిక్కక, కానక=లేకలేక, కన్నయిక్కన్నియన్ = కనినట్టియీకూఁతును, కైలాసకాననంబునన్ = కైలాసపర్వతముయొక్క యడవియందు, కుసుమంబులు=పువ్వులు, కోయుదానిన్ = కోయుచున్నదానిని, కని=చూచి, కనికరంబు=దయ, ఉడిగి=మాలి, కడుపుచిచ్చునకున్ =జఠరాగ్నికి-ఆఁకటికిననుట, మ్రింగన్ = మ్రింగవలెనని, తలఁచుకొనివచ్చి, ఇచ్చోటన్ = ఇక్కడ, భవదీయదర్శనంబునన్ = నీదైనచూపుచేత - నిన్నుఁజూచుటచేత ననుట, వృజినరుజవలనన్ = పాపమనెడి రోగమువలననుండి, విముక్తుండనై = విడువఁబడినవాఁడనై - నిజప్రకృతిన్ = ఎప్పటినాస్వభావమును, పొంది=పడసి, కృతార్థుండను=ధన్యుఁడను, ఐతిన్ = అయితిని - ఆముని యనుగ్రహించినట్లు శాపవిముక్తుఁడనై స్వస్వరూపముం బడసితిననుట

క. ఈయుపకారమ్మునకుఁ బ్రతి, సేయఁగ శక్యంబె జంభజిన్నిభ శఫరా
త్యాయతలోచన యైనమ, దీయాత్మజ నీకు నిత్తు దేవీమణిఁగన్. 28

అ. జంభజిన్నిభ = దేవేంద్రునిఁబోలినయోమహారాజా, ఈయుపకారమునకున్ = ఈమేలునకు - నీవుచేసినశాపవిమోచనరూపమైన యీమేలునకనుట, ప్రతి=బదులుమేలు, చేయఁగన్ = చేయుట, శక్యంబె=సాధ్యమా-అసాధ్యమనుట, శఫరాత్యాయతలోచన- శఫర=బేడిసచేఁపలవలె, అత్యాయత= మిక్కిలినిడుపులైన, లోచన=కన్నులుగలది, ఐనమదీయాత్మజన్ = అయినట్టినాకొమార్తెను, నీకు, దేవీమణిఁగన్ = పట్టపుభార్యయగునట్టుగా, ఇత్తున్ = ఇచ్చెదను

తా ఓమహారాజా! నీవు నాకుఁగలిగినశాపమును దొలఁగించి చాల మేలుచేసితివి. దీనికిఁదగిన మఱుమేలుచేయ నాకుఁ దరముకాదు. అయినను నాకూఁతురైన యీమనోరమ యనుకన్యకను నీకుఁ బట్టపుభార్యగా నిచ్చెదను పెండ్లియాడుము.

క. ఆయుర్వేదముఁ గైకొని, యీయింతిం బెండ్లియాడు మొలమి రమానా
రాయణపరిణయ గేయవి, గాయనగంధర్వమైన కవ్వపుఁగొండన్. 29

అ. (నీవు) ఆయుర్వేదముఁ = (నేను నేర్పిన) వైద్యశాస్త్రమును, కైకొని=(నావలనఁ) బరిగ్రహించి, ఎలమిన్ =సంతోషముతో, ఈయింతిన్ =ఈనాకన్యను, రమా...గంధర్వము-రమా నారాయణ=లక్ష్మీనారాయణులయొక్క, పరిణయ=పెండ్లికథగల, గేయ=పాటలను, విగాయన=విశేషముగా బాడుచుండెడి, గంధర్వము=గంధర్వులుగలది, ఐనకవ్వపుఁగొండన్ =అయినట్టిమందరపర్వతమునందు, పెండ్లియాడుము=వివాహము చేసికొనుము

తా. నేను నాకూఁతుతోడ వైద్యశాస్త్రమునుసయితమిచ్చెదను. దానిని బరిగ్రహించి మందర పర్వతమునకు వచ్చి యచ్చట నాయింటిలో గంధర్వులు లక్ష్మీనారాయణులపెండ్లిపాటలు పాడఁగా సంతోషముతో నాకూఁతురయిన యీమనోరమను బెండ్లియాడుము.

లయ అన్నగముపై జరఠపన్నగపతిస్ఫటలన న్నెగసి కోటతుదల న్నెగడుకొమ్మల్
మిన్నగలరాయరుచిఁ జెన్నగువిమానములపన్నుగడపన్నుగఁ బ్రభిన్నగజఘోట
చ్ఛన్నగహనాపణముల న్నిగనిగద్యుతి రవి న్నగుమణిప్రకరమున్నగరిమం బే
రెన్నఁగలయంగడుల వన్నెగని సంపదల మన్నగరి యొప్పు బలభిన్నగరి రేవన్.

అ. అన్నగముపైన్ =ఆకవ్వపుఁగొండమీఁద, జరఠ స్ఫటలు-జరఠ=ముదిసిన, పన్నగపతి=సర్పరాజైన శేషునియొక్క, స్ఫటలు=పడగలోయేమో, అనన్ =అనునట్లు, నెగసి=మీఁదికినిక్కి, కోటతుదలన్ =ప్రాకారపుగోడయొక్కచివరలయందు, నెగడుకొమ్మల్ =అతిశయిల్లునట్టి శిఖరములు, మిన్ను=ఆకాశము, అగలన్ =భేదిల్లునట్లు, రాయన్ =ఒరయఁగా, రుచిన్ =ప్రకాశముచేత, చెన్నగు. గడ-చెన్నగు=అందగించుచున్న, విమానముల=మేడమీఁదఁ జప్పరములవలెఁ జౌకముదీర్చి కట్టఁబడినకట్టనములయొక్క, పన్నుగడ=రచన, పన్నుగన్ =ఒప్పిదముకాఁగా, ప్రభిన్న. .ములన్ -ప్రభిన్న=మదముపట్టిన, గజ=ఏనుఁగులచేతను, ఘోట=గుఱ్ఱములచేతను, ఛన్న=కప్పఁబడినవై, గహన=చొరరానివైన, ఆపణములన్ =అంగళ్లయందు, నిగనిగద్యుతిన్ =నిగనిగలాడుచున్నకాంతిచేత, రవిన్ =సూర్యుని, నగుమణిప్రకరము=అపహసించునట్టి రత్నములసమూహము, ఉన్నగరిమన్ =ఉన్నట్టిగౌరవముచేతను, పేరు=ప్రసిద్ధిని, ఎన్నన్ =ఎంచుటకు - కొనియాడుటకు, కలయంగడులన్ =తగిన రచ్చపట్టులచేతను, వన్నెగని=శ్లాఘ్యత్వముపొంది, సంపదలన్ =ఎల్లకలుములచేతను, బలభిన్నగరి రేవన్ =ఇంద్రునిదైన యమరావతిపట్టణమువలె, మన్నగరి=నాపట్టణము, ఒప్పున్ =ఒప్పుచుండును.

తా. ఆమందరపర్వతముమీఁద నాపట్టణము మిక్కిలి యున్నతమయిన కొమ్మలతోడికోటయును మిక్కిలి వెలుఁగుచున్న మేడలమీఁది పొడుగుమీఱినగోపురములును గలిగి యెల్లయెడలను మదపుటేనుఁగులును గుఱ్ఱములును నిండుకొనఁగా నంగళ్లయందు బఱపిపెట్టఁబడిన రత్నములు సూర్యుని వెలుఁగును గ్రిందుపఱిచి వెలుఁగఁగా మెచ్చుకోఁదగినరచ్చపట్లు వెలయఁగా నింద్రునిదైన యమరావతిపట్టణమువలె నెల్లవిభవములతోను వెలయుచుండును. అలం. ఉపమ, అతిశయోక్తి, ఉత్ప్రేక్షయును.

తే. అని నిజోదంత మాగంతయైన దాఁప, కంతయును జెప్ప నద్భుతం బంతరంగ
మంతయును నిండ హర్షించె నాస్వరోచి, యంతరవి యేఁగెఁ బశ్చిమాశాంతమునకు.

అ. అని = ఇట్లని, నిజోదంతము = తనవృత్తాంతము, ఆవంతయైనన్ = ఆవగింజంతయైనను - అవంతయైననునుట, దాఁపక = మఱుఁగుపెట్టక, అంతయున్ = సర్వమును, చెప్పన్ = (తనతో నిం దీవరాక్షుఁడు) చెప్పఁగా, ఆస్వరోచి, అద్భుతంబు = ఆశ్చర్యము, అంతరంగము = మనస్సు, అంత

యున్ = సర్వత్ర, నిండన్ = నిండుఁగా - తనమనస్సునందు మిక్కిలి యాశ్చర్యపడియున్నట్లు. హర్షించెన్ = సంతోషించెను. అంతన్ = అంతట, రవి = సూర్యుఁడు, పశ్చిమాశాంతమునకున్ = పడమటిదిక్కు చివరకు, ఏఁగెన్ = పోయెను - సాయంకాలమయ్యెననుట.

తా. ఈవిధముగా గంధర్వరాజైన యిందీవరాక్షుఁడు తనవృత్తాంతమంతయు నవంతయైన దాఁపక చెప్పఁగా స్వరోచి విని మిక్కిలి యాశ్చర్యమును సంతోషమును బొందెను అంతటఁ బ్రొద్దు పడమటికి వాలఁగా సూర్యాస్తమయము నయ్యెను.

మ. వికసిల్లం బ్రజ చక్రపాలనము గావించెం గరవ్యాపృతిం
గకుబంతంబుల నాక్రమించెఁ బొసఁగంగా నేర్చె వర్ణాళిఁ గాం
తికిఁ బాపెం బెఱరాజకోటిఁ దుది శాంతిం బొందె దైవంబుసేఁ
తకుఁ దాపం బిఁక నేలనంగ నినుఁ డస్తప్రాప్తుఁ డయ్యెం గడున్. 32

అ. (ఇందుఁ గడపటికి రెండర్థములు గ్రాహ్యములు) ఇనుఁడు = సూర్యుఁడు, రాజు అని యర్థాంతరము ప్రజ = జనసమూహము, వికసిల్లన్ = తెలివిపొందఁగా - ఇది యీవస్తువు ఇది మఱియొకవస్తువు అని తెలిసికోఁజాలనిది కాఁగా ననియర్థము, సంతోషింపఁగా నని యర్థాంతరము చక్రపాలనము = జక్కవపక్షులను బాలించుటను; భూమండలము నేలుట నని యర్థాంతరము, గావించెన్ = చేసెను, కరవ్యాపృతిన్ = కిరణములయొక్క వ్యాపనముచేత, చేతులయొక్క చాఁచుటచేత, కకుబంతంబులన్ = దిక్కులకొనవఱకుఁగల దేశములెల్లను, ఆక్రమించెన్ = క్రమ్ముకొనెను, స్వవశముచేసికొనెను, వర్ణాళిన్ = తెలుపునలుపు మొదలైనవర్ణములను; బ్రాహ్మణులు క్షత్రియులు మొదలుగాఁగల వర్ణములను, పొసఁగంగాన్ = పొందుపడునట్లు, ఏర్చె = ఏర్పాటుచేసెను - అనఁగా ఇది యిది యీవన్నె యని తెలిసికొనునట్లు చేసెననుట, ఈజాతి యిట్టి యిట్టి నడతలు నడుచుకోవలెనని నియమించెనని యర్థాంతరము. పెఱరాజకోటిన్ = తనకంటె నితరుఁడైన చంద్రుని యతిశయత్వమును; శత్రురాజులయొక్క సమూహమును, కాంతికిన్ = ప్రకాశమువలననుండి, ప్రతాపమువలననుండి, పాపెన్ = తొలగించెను - చంద్రునిప్రకాశము నణఁచివేసెననుట శత్రురాజులప్రతాపము నణఁచెనని యర్థాంతరము దైవంబుసేఁతకున్ = దైవము చేసినపనికి - దైవనిర్ణయమునకు, ఇఁకన్ = ఇఁకమీఁద, తాపంబు = తపింపఁజేయుట - వేఁడిమి, మనస్తాపము, ఏల = ఏమిటికి, అనంగన్ = అనునట్లు, తుదిన్ = కడపట, శాంతిన్ = వేఁడిమిలేమిని, శమగుణమును = కామక్రోధాదులులేకుండుటను, పొందెన్ = చెందెను, కడున్ = మిక్కిలి, అస్తప్రాప్తుఁడు - అస్త = అస్తమయపర్వతమును; అస్తమించుటను - చచ్చుటను, ప్రాప్తుఁడు = చేరుకొన్నవాఁడు, పొందినవాఁడు, అయ్యెన్ = ఆయెను - అనఁగాఁ బ్రొద్దుగ్రుంకెననుట, రాజు మృతినొందెనని యర్థాంతరము

తా. ప్రతాపవంతుఁడయిన యొకమహారాజు తనభుజబలముచేత నెల్లదేశములరాజులనుజయించి చక్రవర్తియై యెల్లజనులను వర్ణాశ్రమధర్మములుతప్పక జరపుచు సుఖముగా జీవించునట్లు రాజ్యపాలనముచేసి దైవికముగా నంత్యకాలము రాఁగా శాంతినహించి మరణము నొందెనో యనునట్లు, సూర్యుఁడు తనవెలుఁగులచేత నీబ్రహ్మాండమంతయు నిండుకొనఁగాఁ జంద్రుఁడు నక్షత్రములు నీనిప్రకాశ మణఁగిపోఁగాను తెలుపు నలుపు మొదలయినవర్ణములు తళతళ వెలుఁగఁగాను వేఁడిమి వెదచల్లుచుఁ బ్రకాశించి సాయంకాలమునకు వేఁడిమితగ్గఁగాఁ గ్రమముగా నస్తమించెను. ప్రొద్దుగ్రుంకె నని భావము. అలం. శ్లేషము, ఉత్ప్రేక్ష, అర్థాంతరన్యాసమును.

తే. అసురవరుఁ డైనయిందీవరాక్షుమేన, నంటుకొన్నస్వరోచి బాణాగ్నిపోలె
నంతఁ గనుపట్టె శుకతుండకాంతిఁ దెగడి, సాంధ్యరాగంబు పశ్చిమాచలమునందు.

అ. అసురవరుఁడు=రాక్షసశ్రేష్ఠుఁడు, ఐనయిందీవరాక్షుమేనన్=అయినటువంటి యిందీవరాక్షుగంధర్వునిదేహమునందు, అంటుకొన్న...పోలెన్ - అంటుకొన్న=తగులుకొన్న, స్వరోచి = స్వరోచియొక్క, బాణాగ్నిపోలెన్ = అస్త్రసంబంధమైనయగ్నివలెనే, అంతన్ = అంతట - ప్రొద్దుగ్రుంకినతోడనే, శుకతుండకాంతిన్ = చిలుకముక్కుయొక్క ప్రకాశమును- ఎఱుపుననుట, తెగడి=తిరస్కరించి-మించి, సాంధ్యరాగంబు=సంధ్యాకాలమునందలి యెఱుపు, పశ్చిమాచలమునందున్ = పడమటికొండయందు-అస్తమయపర్వతమునందు, కనుపట్టెన్=కనఁబడెను

తా. మునిశాపముచేత రాక్షసత్వము నొందినయిందీవరాక్షుఁడనెడి గంధర్వునిదేహమునం దంటుకొన్న స్వరోచియొక్క యాగ్నేయాస్త్రపుమంటలో యనునట్లు ప్రొద్దుగ్రుంకఁగానే పడమటిదిక్కునం దెఱ్ఱనిచాయతో సంధ్యారాగము తోఁచెను అలం. ఉత్ప్రేక్ష, ఉపమయును

క. తలచూపె నప్పు డఖిలా, శల దట్టపుటిరులుచిలువజవరాలు నభ
స్స్థలమండపకోపరిసీ, మల నిడినసితాండపటలిమాడ్కిం జుక్కల్. 34

అ. అప్పుడు=ఆసమయమునందు, అఖిలాశలన్ = ఎల్లదిక్కులయందును, దట్టపు...రాలు-దట్టపు=తఱుచైన, ఇరులు=చీఁకటియనెడి, చిలువజవరాలు=సర్పస్త్రీ, నభస్ సీమలన్-నభస్స్థల=ఆకాశస్థానమనెడి, మండపక=చావడియొక్క, ఉపరిసీమలన్=మీఁదిప్రదేశములందు, ఇడిన...మాడ్కిన్- ఇడిన=పెట్టిన, సిత=తెల్లనైన, అండపటలిమాడ్కిన్ = గ్రుడ్లసమూహమువలె, చుక్కలు=నక్షత్రములు, తలచూపెన్=కనఁబడెను.

తా. ఆసమయమునం దెల్లదిక్కులయందును దట్టమైనచీఁకటి వ్యాపింపఁగా నాకాశమునందు నక్షత్రములు ప్రకాశించెను. అలం రూపకము, ఉత్ప్రేక్షయు.

ఆ. సాంధ్యనటనచండచండీశపదహతిఁ, దరణిచక్ర మొరగి శరధిఁ గ్రుంగ
దొరగల్లువడియె భూరథేతరభాగ, చక్ర మనఁగ నపుడు శశియుఁ దోఁచె. 35

అ. అపుడు = ఆసమయమునందు, సాంధ్య ..హతిన్ - సాంధ్య = సంధ్యాకాలమునందలి, నటన=తాండవము చేయునప్పటి, చండ=మిక్కిలియుద్ధతమయిన, చండీశ=శివునియొక్క, పదహతిన్ = అడుగుల తాఁకుడుచేత, తరణిచక్రము=సూర్యరూపమయినచక్రము, ఒరగి=వాలి, శరధిన్ = సముద్రమునందు, గ్రుంగన్=దిగఁబడిపోఁగా, భూ . చక్రము-భూరథ = భూరూపమైనరథముయొక్క, ఇతరభాగ=మఱియొకతట్టుదైన, చక్రము=కల్లు, దొరగల్లువడియెన్ = ఒడ్డగిలఁబడియెనో, అనఁగన్ = అనునట్లు, శశియున్=చంద్రుఁడును, తోఁచెన్=ఉదయించెను.

తా. సూర్యాస్తసమయమునందు సంధ్యాకాలతాండవము చేయుచున్న శివునియొక్క మిక్కుటమయినయడుగుల యదుముడులచేత భూమియనెడిరథముయొక్క యొకచక్రమయిన సూర్యుఁడు సముద్రములో దిగఁబడఁగా రెండవప్రక్క చక్రమైన చంద్రుఁ డొడ్డగిలఁబడియెనో యనునట్లు చంద్రోదయమయ్యెను. అలం. రూపకము, ఉత్ప్రేక్షయు.

క. తమ మనుకాలాహి ప్రపం, చము నెరగొని యోషధీశ సద్యఃకృతదం
డీమున మగుడం గ్రక్కెడు, క్రమమున నొయ్యొయ్య విచ్చెఁ గడలకుఁ దొలఁగెన్.

అ. తమము=చీఁకటి, అనుకాలాహి=అనునట్టికృష్ణసర్పము, ప్రపంచముఁ=లోకమ్మునంతయు, ఎరగొని=మ్రింగి, ఓషధీశ=చంద్రుఁడనెడిరాజుచేత, సద్యః=అప్పుడే, కృత = చేయఁబడిన, దండమునఁ=శిక్షచేత, మగుడంగఁ=మరల, క్రక్కెడుక్రమమునఁ=వెడలఁగ్రక్కెనవిధమున, ఒయ్యొయ్యఁ=మెల్ల మెల్లగా, విచ్చి=విరిసి, కడలకుఁ = దిక్కులకు-దూరపుగొందులలోనికనుట, తొలఁగెఁ = ఒదిఁగిపోయెను.

తా. నల్లనినాగుఁబాము కప్పలోనగువానిని మ్రింగినట్లు చీఁకటి లోకము నెల్ల నాక్రమించుకొనఁగా జంద్రుఁడుదయించెను. అంతటఁ జంద్రప్రకాశము వ్యాపింపఁగాఁ జీఁకటి తొలగిపోయెను. అలం. రూపకము, ఉత్ప్రేక్షయు.

వ. అనంతరంబ క్రమక్రమంబున 37

సీ. కలయ వెల్లువగట్టి జలజలఁ బ్రవహించు, శశికాంతవాంతనిర్ఝరముజలము
మలయానిలముచే దుమారంబు రేఁగుసౌ, గంధికంబురజంబుకఱకుదుమ్ము
నిండారి విరిసినబొండుమల్లెలనుండి, పడియుమరందంబుగుడరసంబు
తొలఁకి మింటికిఁ బొంగుదుగ్ధపాథోరాశి, కరడులమీఁదిమీఁగడలమెఱుఁగు
తనకు రసవర్గములుగా సుధాకరుండు, సారెసారెకుఁ గరములు సాఁచిచాఁచి
యచ్చతెలుపుగ నపుడు బ్రహ్మాండమండ, పంబు వెన్నెలసన్నసున్నంబు సేసె. 38

అ. సుధాకరుండు=చంద్రుఁడనెడుసున్నపుగచ్చుచేయువాఁడు, అపుడు=ఆసమయమునందు, కలయఁ=అంతటను, వెల్లువగట్టి=వఱదగా నేర్పడి, జలజలఁ = =జలజలయను ననుకరణధ్వనితో, ప్రవ.. లము-ప్రవహించు=పాఱుచున్న, శశికాంత=చంద్రకాంతమణులచేత, వాంత=క్రక్కఁబడిన, నిర్ఝరము=జలప్రవాహముయొక్క, జలము=నీరును, మలయానిలముచేఁ = మలయపర్వతమునందలి గాలిచేత-తిన్నగావీచునట్టి దక్షిణపుఁజల్లగాలిచేత, దుమారంబు=దుమ్ము, రేఁగు . దుమ్ముఁ - రేఁగు=పైకెగయునట్టి, సౌగంధికంబు=మిక్కిలిపరిమళము నించుకయెఱుపునుగలకలువలయొక్క, రజంబు=పుప్పొడియనెడి, కఱకుదుమ్ముఁ=ఇసుకయు, (ఒకవిధమయిన బూడిదయనికొందఱు.) నిండారఁ=పూర్ణముగా-లెస్సగా, విరిసిన. .నుండి-విరిసిన=పూచిన, బొండుమల్లెలనుండి=పెనుమల్లెపువ్వులనుండి, పడి రసంబు-పడియు=కాఱుచున్న, మరందంబు=పూఁదేనెయనెడు, గుడరసంబు=బెల్లపునీరును, తొలఁకి=అతిశయించి, మింటికిఁ=ఆకాశమువైపునకు, పొంగు=ఉబుకునట్టి, దుగ్ధ మెఱుఁగు-దుగ్ధపాథోరాశి=పాలసముద్రముయొక్క, కరడుల=అలలయొక్క, మీఁది=పైభాగమునందలి, మీఁగడల=మెఱుఁగుతెట్టెలనెడి, మెఱుఁగు=చమురును, తనకు, రసవర్గములు=గచ్చునకుఁగావలసినవస్తుసామగ్రులు, కాఁ=అగుచుండఁగా, సారెసారెకుఁ=మాటిమాటికి, కరములు=కిరణములనెడిచేతులను, చాఁచిచాఁచి=చాఁగించి చాఁగించి, బ్రహ్మాండమండపంబు=బ్రహ్మాండమనెడి పెద్దచవిక, అచ్చతెలుపుగఁ=స్వచ్ఛమైన తెలుపుగలదియగునట్టుగా, వెన్నె..నంబు - వెన్నెల=చంద్రికయనెడి, సన్నసున్నంబు=పాలగార - చేసెఁ = కావించెను.

తా. ఆసమయమునందు వెన్నెల యెల్లయెడలవ్యాపించి ప్రకాశింపఁగాఁ జంద్రుఁడనెడిగచ్చుపూయునట్టివాఁడు కరిఁగి ప్రవహించుచున్న చంద్రకాంతమణిద్రవము జలమును, చల్లగాలిచే రేఁగుచున్న పుప్పొడి యిసుకయును, పూఁదేనె బెల్లపునీరును, పాలసముద్రముయొక్క యలలమీఁదఁ దేలు

చున్న మీఁగడ మెఱుఁగునా నెయ్యును, కాఁగా బ్రహ్మాండమనెడి కచ్చేరిచావడికి బొంగరాల చేసినాఁడేమో యన్నట్లుండెను. అలం. రూపకము

వ. ఆసమయంబునం బరిశ్రాంతుం డగునమ్మహీకాంతుం డొక్కశశికాంతశిలామండపంబున దట్టంబుగాఁ బఱచినచిగురుటాకుపాన్పుల గంధర్వరాజునుం దానును సుఖాసీనుండై యిష్టకథాగోష్ఠి నారాత్రి గడపె నంత. 39

అ. ఆసమయంబునన్ = అటువంటి వెన్నెలకాయుచున్న సమయమునందు, పరిశ్రాంతుండు = బడలికనొందినవాఁడు, అగునమ్మహీకాంతుండు = అయిన యా రాజు, ఒక్కశశికాంతశిలామండపంబునన్ = ఒకచంద్రకాంతపుఱాళ్లచే నేర్పరచినచుట్టుగోడలులేని తాతిమిద్దెయందు, దట్టంబుగాన్ = తఱుచుగా, పఱచినచిగురుపఱుపులన్ = పఱచినట్టిచిగురుటాకులపాన్పులందు, గంధర్వరాజునుందానును = ఇందీవరాక్షుఁడును రాజును, సుఖాసీనుండై = హాయిగాఁ గూర్చున్నవాఁడై, ఇష్టకథాగోష్ఠిన్ = ఇష్టములైన కథలుచెప్పుకొనుటచేత, ఆరాత్రి, కడపెన్ = జరపెను, అంతన్ = అప్పుడు - మీఁదిపద్యముతో నన్వయము.

సీ. తను బాసి శశి దవ్వుఁ జనిన నెవ్వగఁ బోలెఁ, దొలిదిక్కుజవరాలు వెలుకఁ బాఱెఁ
బ్రథమాద్రిసభయందుఁ బఱచిన కెంబట్టు, జముకాణ మనఁగ రాగము జనించె
ధవుఁగూర్మిఁ గోరుచున్నవిపోలె ముఖరాళి, వనరుహాస్యములఁ బద్మినులు తెఱచె
భానూష్మభీతి ముందె పడినచుక్కలభంగి, దొరలె వేకువగాలిఁ దరుల మంచు
కాలగుణయుక్తి మింటిచక్కటికి నెగయ, వాసవునిపట్టి పొదువుగాఁ బైచి యాడు
గచ్చుచమరినదారుచక్రంపుబిళ్ళ, వ్రాలె నొయ్యనఁ బ్రాచి లేఁబ్రొద్దుపొడిచె.

అ. తొలిదిక్కుజవరాలు = తూర్పుదిక్కనెడియౌవనస్త్రీ, శశి = చంద్రుఁడు, తనున్ = తన్ను, పాసి = విడచి, దవ్వు = దూరముగా, చనిన నెవ్వగఁబోలెన్ = పోయెననుటచేనైన యధికవిచారముచేత నేమో యనునట్లు, వెలుకఁబాఱెన్ = వెలవెలపోయెను - తెల్లవాఱెననుట, ప్రథమాద్రిసభయందున్ = తొలికొండ (ఉదయపర్వతము) అనెడికొలువుఁగూటమునందు, పఱచిన. కాణము - పఱచిన = కూర్చుండుటకై పఱచినట్టి, కెంబట్టు = ఎఱ్ఱపట్టుతో నేసిన, జముకాణము = ముతకనేఁతపఱుపుబట్టయో, అనఁగన్ = అనునట్లు, రాగము = ఉదయరాగము - సూర్యోదయకాలమునందుఁ దూర్పుదిక్కునఁ దోఁచునట్టియెఱ్ఱనికాంతియనుట, జనించెన్ = కలిగెను, పద్మినులు = తామరతీఁగలనెడి పద్మినీజాతిస్త్రీలు, ధవున్ = ప్రియుఁడయినసూర్యుని, కూర్మి = స్నేహమును, కోరుచున్ = ప్రార్థించుచు, ఉన్నవిపోలెన్ = ఉన్నవో యనునట్లు, ముఖ ముఖరాళి - ముఖరాళి = మొరియుచున్నతుమ్మెదలధ్వనులతోఁడి, వనరుహాస్య ములమ్ములయొక్క, ఆస్యములన్ = ముఖభాగములనెడినోళ్లను, తెఱచెన్ = విరియించెను, భానూష్మభీతిన్ = సూర్యునివేఁడిమియనెడి ప్రతాపమువలని భయముచేత, మున్ = ముందే - సూర్యుఁ డుదయింపకముందేయనుట, పడినచుక్కలభంగిన్ = నేలరాలిననక్షత్రములవలె, వేకువగాలిన్ = తెల్లవాఱుజామున వీచునట్టిగాలిచేత, తరులమంచు = వృక్షములందలిమంచు, దొరలెన్ = బొట్టుబొట్టుగారాలెను, వాసవునిపట్టి = ఇంద్రునికొడుకయిన జయంతుఁడు, కాలగుణయుక్తిన్ = సమయమనెడి దారముయొక్క కూడికచేత - సమయమనెడిదారమును జుట్టి యనుట, మింటిచక్కటికిన్ = ఆకాశముతిట్టునకు - మీఁదికనుట, ఎగయన్ = ఎగురునట్లు, పొదువుగాన్ = ఎత్తుగా, వైచి...పోలెన్ - వైచియాడు = వేసియాడుకొనునట్టి, గచ్చుచమ

రిన=బచ్చెనపూసిన, దార్ఢ్య=క్రమానితోఁ జేసిన, చక్రంపువిల్లవో లేక్=గుండ్రనైన విల్లయో యనునట్లు, య్యనక్=మెల్లగా, ప్రాచిక్=తూర్పుదిక్కునందు, లేఁబ్రొద్దు=బాలసూర్యుఁడు, పొడిచెక్ యించెను.

తా. తూర్పు తెల్లవాఱఁగా నుదయరాగము గలిగెను. తామరలు వికసించెను ఆట్లయందుండి మంచుబిందువులు రాలసాగెను. సూర్యుఁడు నుదయించెను. అలం ఉత్ప్రేక్ష.

క. ఈగతి నత్తఱిఁ దెలతెల, వేగిన గంధర్వపతికి వేగుట విని తా
రాగమున కేఁగి కాంచిరి, రాగమ్మునఁ గొలిచి మనుపురాతనఖచరుల్. 41

అ. అత్తఱిక్=ఆసమయమునందు, ఈగతిక్=ఈవిధమున, తెలతెలవేగినక్=తెల్లగాఁ దెల్లవాఱఁగానే, గంధర్వపతికిక్=గంధర్వరాజైనయిందీవరాక్షునికి, వేగుట=శుభోదయమగుట - శాపముక్తి యగుట, విని=వినినవారై, రాగమ్మునక్=అనురాగముతో - ప్రీతితో, కొలిచి=సేవించి, మనుపురాతనఖచరులు=జీవించుచుండిన తొల్లిటిగంధర్వులు, తారాగమునకుక్=వెండికొండకు, ఏఁగి=పోయి, కాంచిరి=(ఆయిందీవరాక్షుని) చూచిరి.

తా. ఇట్లు సూర్యోదయము కాఁగానే తమయేలిన వానికి శాపవిమోచనరూపమైన శుభోదయము య్యె ననువృత్తాంతము విని యిందీవరాక్షుని ప్రాఁత కొలువుడుకాండ్రయిన గంధర్వులు వచ్చి యతని దర్శనము చేసికొనిరి

ఉ. కాంచినఁ బొంగి వారొసఁగుకానుక లర్థిఁ బరిగ్రహించి మ
న్నించి పురప్రయాణరతి నిక్క నరేంద్రుఁడు మున్నుగాఁ దటి
చ్చంచలవాహమై మణులచాయల దిక్కు లలంకరించుహొ
న్నంచురథంబు చాఁగు బళి యంచు నకీబులు మ్రోయ నెక్కెనన్. 42

అ. కాంచినక్=(తనపురాతనసేవకులయిన గంధర్వులువచ్చి) చూడఁగా, పొంగి=(ఇందీవరాక్షుఁడు) సంతోషించి, వారు=ఆగంధర్వులు, ఒసఁగుకానుకలు=ఇచ్చినయుపహారములను, అర్థిక్=ప్రీతితో, పరిగ్రహించి=పుచ్చుకొని, మన్నించి=(తగినట్లు) మన్ననచేసి, పురప్రయాణరతి=పట్టణమునకుఁ బోవలెననునపేక్ష, నిక్కఁగ్=అతిశయింపఁగా, నకీబులు=వెండిబెత్తాలుపూనినబంట్లు - వేత్రధరులు, చాఁగు=సెబాసు, బళి=బళా, అంచుక్=అని ప్రశంసచేయుచు, మ్రోయఁగ్=కేకలువేసి చప్పుడుచేయఁగా, తటిచ్చంచలవాహమై - తటిత్=మెఱపులవలె, చంచల=చలించునట్టి - పోవుటకై తత్తఱపడునట్టియనుట, వాహమై=గుఱ్ఱములుగలదై, మణులచాయలక్=(తనయందుఁ జెక్కఁబడిన) రత్నకాంతులచేత, దిక్కులు=ఎల్లదిక్కులను, అలంకరించు రథంబుక్ - అలంకరించు=కైసేయుచున్న, హొన్నంచు=బంగారుపూఁతపూసిన పార్శ్వభాగములుగల, రథంబు=తేరిని, నరేంద్రుఁడు=రాజు - స్వరోచి, మున్నుగాక్=ముందగునట్లుగా, ఎక్కెనక్=ఎక్కఁగానె - స్వరోచిని ముందెక్కుమని వెంటనే తాను నెక్కఁగానే యనుట.

తా. ఇందీవరాక్షుఁడు తనతొల్లిటిసేవకులైన గంధర్వులువచ్చి కానుకలు పెట్టి తన్నుఁ జూడఁగా వారు పెట్టినకానుకలు ప్రీతితోఁ దీసికొని వారిని మన్ననచేసి వారు తెచ్చిన వడిగలగుఱ్ఱములను బూన్చిన బంగారుపూఁతపూసిన తేరిపై బెత్తాలవా రెచ్చరికలుచేసి ప్రశంసింపఁగాఁ దొలుత స్వరోచి నెక్కుమని వెనుకఁ దాను నెక్కఁగాను.

క. నందనయు నుచితరత్న, స్యందనమునఁ జనియె నర్థి జనకునిబడి
యిందీవరాక్షుఁ డీగతి, మందరమున కెగయఁ గగనమార్గమున

అ. నందనయున్ = వానికూఁతురైనమనోరమయును, సుచితరత్నస్యందనములు పొదిఁగిన తేరియందు, అర్థిన్ = ప్రీతితో, జనకునిజాడన్ = తండ్రివెంబడినే, చనిరి, గతిన్ = ఈవిధముగా, అయ్యిందీవరాక్షుఁడు, గగనమార్గమునందున్ = మింటిత్రోవను కవ్వపుఁగొండను - కవ్వపుఁగొండమీఁఁగికనుట, ఎగయన్ = ఎగురఁగా - సైన్యస

సీ. మండిగాలిడి దంతిశుండాగ్రహతిఁ జించి, జలధరాంభముఁ గగ
నహిమాంశుహయ హేషలాలించి చెవివంచి, కెరలివాజులుబయల
ధ్వజవాతహతి నాజి వైద్యుతాగ్నులఁ జూడి, పగలుదివియలవా
టెటులుచప్పుడు లాత్మభీరుస్వయంగ్రాహ, పరిరంభసుఖము ఖేచ
జామరప్రభ గగనగంగామరాళి, చకచకభ్రమ మొదవింప
కాననము మోచి మందరాగంబుదాఁకఁ, బౌఁజువెట్టిరి సైన్యాల

అ. కరులు=(సేనలోని) యేనుఁగులు, మండిగాలిడి = ఒకకాలు ముడుఁచుకొంచెమువంచియు నేలకు మ్రొగ్గి కూర్చుండి, దంతిశుండాగ్రహతిన్ - దంతి = ఏనుఁగులయొక్క, శుండా = తొండముయొక్కయున్, అగ్ర = కొనలయొక్క, హతిన్ = దెబ్బచేత - దంతముచేతను చియుఁ దొండములకొనలతోఁ గొట్టియు ననుట, చించి = (మేఘములను) చీలుఁగ ములన్ = ఆ మేఘములలోని జలములను, చల్లులాడన్ = ఎగఁజల్లుచుఁ గ్రీడింపఁగా, ములు, అహి .. హేషలు - అహిమాంశు = సూర్యునియొక్క, హయ = గుఱ్ఱములయొక్క లింతలను, చెవివంచి = చెవియొగ్గి, ఆలించి = విని, కెరలి = విజృంభించి - లేక కోపించి, మును, గొరిజన్ = కాలిగిట్టలతో - (ఇక్కడ గొరిజశబ్దము జాత్యేకవచనము,) ... కాళ్లపైకెత్తి యాఁడింపఁగా - వానితోఁ గచ్చింపునకుఁ బూనఁగా ననుట, పగలుదివి టీలనుపట్టెడివారు, ధ్వజ హతిన్ - ధ్వజ = జెండాచీరలయొక్క, వాత హతిన్ = ఆజిన్ = (తమచేతిదివటీలు) ఆరిపోఁగా, వైద్యుతాగ్నులన్ = మేఘజ్యోతిసంబం యందు, చూఁడి = వెలిఁగించి, పంజులు = దివటీలను, ఎత్తన్ = ఎగఁబట్టఁగాను, పెట్లుఁగ్రోవులయొక్క - ధ్వనులు - అదురువేట్లధ్వనులు, ఆత్మ ... సుఖము - ఆత్మ = తమ పిపీకితనముగలప్రియురాండ్రయొక్క, స్వయం = తమకుఁదామే, గ్రాహ = గ్రహిం ఆలింగనముయొక్క, సుఖము = సౌఖ్యమును, ఖేచరులకున్ = ఆకాశమునందుఁ దిరి ఒసఁగన్ = ఇయ్యఁగా - కలుగఁజేయఁగా ననుట, చామరప్రభ = వింజామరలయొక్క న ... భ్రమము - గగనగంగా = ఆకాశగంగయందలి, మరాళి = హంసలయొక్క, పోయెనేడి, భ్రమము = భ్రాంతిని, ఒదవింపన్ = కలుగఁజేయఁగా, శంకరాద్రికానన పర్వతమునడవి, మోచి = మొదలుకొని, మందరాగంబుదాఁకన్ = కవ్వపుఁగొండవ దొరలు = ఆయిందీవరాక్షునిప్రధానసేనయొక్క యోధులు, పౌఁజువెట్టిరి = దండుసాగఁ

తా. ఇందీవరాక్షుఁడు స్వరోచితోను మనోరమతోను గూడి తనపట్టణమును గా నెతనిదండు తానున్న వెండికొండతోఁ జేరినయడవినుండి కవ్వపుఁగొండవఱ

చెను. అప్పుడేనుఁగులు మబ్బులను భేదించి నీ శ్లేగఁ ట్లెను. గుఱ్ఱములు సూర్యునిగుఱ్ఱములపకిలింతలు విని వానితోఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వెను పగలుదివటీలవారు జెండాగుడ్డలగాలిచేతఁ జల్లాఱిన తమచేతి దివటీలను మెఱపునిప్పులందు వెలిఁగించి పట్టిరి. పెట్లుఁ గ్రోవులధ్వనులకు వెఱచి యాకాశమునందు మెలఁగుచున్న దేవతాస్త్రీలు తమకుఁదామే ప్రియులఁజేరి యాలింగనము చేసికొనిరి. వింజామరములకాంతు లాకాశగంగలోనిహంసల దేహకాంతులో యనుభ్రమను బుట్టించెను అలం ఉదాత్తము,ఉత్ప్రేక్షయు.

క. కుంజరశతాంగహయభట, రంజిత మై పై రజఃపరంపర లలమన్
మంజులకాంతిఁ గసీసపు, మాంజిష్ఠముఁబోలె గగనమండప మమరెన్ 45

అ గగనమండపము = ఆకాశమనెడిమండపము, (మండపము = చుట్టుగోడలు లేక ప్రాతికంబములు నిలిపినజాతిమిద్దె) కుంజర రంజితమై-కుంజర = ఏనుఁగులచేతను, శతాంగ=రథములచేతను, హయ=గుఱ్ఱములచేతను, భట = కాల్బలములచేతను, రంజితమై=ప్రకాశింపఁజేయఁబడినదై, పైన్ = వానిమీఁద, రజఃపరంపరలు=దుమ్మునొంతరలు, అలమన్ = వ్యాపింపఁగా, మంజులకాంతిన్ =మనోహరమైనకాంతిచేత, కసీసపుమాంజిష్ఠముఁబోలెన్ =ఎఱుపుమించినపసుపుచాయవేసిన నీలిచీరవలెనే, అమరెన్ =ఒప్పెను.

తా ఆసమయమునందు నిందీవరాక్షునిచతురంగసేన లాకాశమార్గమునఁ గ్రమ్మి నడవఁగా దొంతరలుగా వ్యాపించినయాకాశమనెడిమండపము పసుపునెఱుపుగలసినచాయవేసిన నీలివస్త్రమో యనునట్లుండెను. అలం ఉత్ప్రేక్ష.

తే. సొరిది నీరీతి దివిఁ దోడుసూపినట్టి, దొరలుగొలువంగ ఖచరేంద్రుఁడరిగియరిగి
మింట గ్రహరాజు తనసగమింట వెలుఁగు,మంథగిరిఁగాంచి పలికె నమ్మనుజపతికి.

అ. ఖచరేంద్రుఁడు=గంధర్వరాజైన యిందీవరాక్షుఁడు, సొరిదిన్ = క్రమముతో, ఈరీతిన్ = ఈవిధమున, దివిన్ =ఆకాశమునందు, తోడు=సహాయము, చూపినట్టిదొరలు = కనఁబఱిచిన సరదార్లు, కొలువంగన్ =తన్ను సేవింపఁగా, అరిగియరిగి=బహుదూరముపోయి, మింటన్ =ఆకాశమునందు, గ్రహరాజు=సూర్యుఁడు, తనసగమింటన్ = తనమధ్యభాగమునకుసరిగా, వెలుఁగుమంథగిరిన్ =ప్రకాశించుచున్నకవ్వపుఁగొండను, కాంచి= చూచి, అమ్మనుజపతికిన్ =ఆరాజునకు-స్వరోచితోననుట, పలికెన్ = (ఒకమాట) చెప్పెను

తా. గంధర్వరాజయిన యాయిందీవరాక్షుఁ డీచెప్పినచొప్పున సహాయులై వెంట సేవచేయుచు సరదార్లు నడవఁగాఁ బహుదూరముపోయి యెదుటఁ దనమధ్యభాగమునకుసరిగా సూర్యుఁడు వెలుఁగుచున్న కవ్వపుఁగొండను జూచి స్వరోచితో నిట్లు పలికెను

సీ. జరఠకచ్ఛపరాజుచరమాంగగృహమేధి, భోగివేష్టనరేఖఁ బొలుచుజాణ
కులముఁగోఁ దరితీపుగలిగిమించినమేటి, మైనాకు నొరసినమానసటీఁడు
తొలువేలుపులవేలుపులపనుల్ గొనుఱేఁడు, కడలిరాయలలోఁతుగన్న గబ్బి
సురరాజునకుఁ బాండుకరిఁ జేర్చు మరకాఁడు, కల్పకంబులపంటకర్తఁ తీఁడు
కంటె మథితసుధాధౌతకటకజాత, చంపకవనప్రకంపనాకంపవిసగ
దఖరీముఖరవమధుకరముఖరశిఖర, నందరసమందిరం బగుమందరంబు. 47

అ. జరఠ .. మేధి-జరఠ = ముసలిదైన, కచ్ఛపరాజు = తాఁబేళ్లరాజైన యాదికూర్మముయొక్క, చరమాంగ = వీఁపుచిప్పయందలి, గృహమేధి = గృహస్థుఁడు-కాపురము చేసినవాఁడనుట, భోగి. రేఖల్-భోగి = సర్పరాజైన వాసుకియొక్క, వేష్టన = చుట్టుకొనుటవలన నేర్పడిన, రేఖల్ = ఒత్తుడుపల్లపుగీఱచేత, పొలుచుజాణ = ఒప్పుచున్న చతురుఁడు, కులధ్రుల్లోన్ = పర్వతసమూహములోపల, తరితీపు = మథనమాధుర్యమనెడియాధిక్యము, కలిగి, మించిన మేటి = అతిశయించినగొప్పవాఁడు, మైనాకున్ = మైనాకగిరిని, ఒరసిన మాసటీఁడు = సరిపోలినమల్లుఁడు, తోలు . పసుల్-తోలువేలుపుల = అసురులయొక్కయు, వేల్పుల = దేవతలయొక్కయు, పసులు = త్రచ్చునట్టిపసులను, కొనుతేఁడు = పరిగ్రహించునట్టిరాజు, కడలిరాయలలోఁతు = సముద్రములకురాజైన పాలసముద్రపులోఁతును, కన్నగబ్బి = చూచితెలిసికొన్న గంభీరుఁడు, సురరాజునకున్ = దేవేంద్రునకు, పాండుకరిన్ = తెల్లయేనుఁగును - ఐరావతమునుఅనుట, చేర్చుపురకాఁడు = చేరునట్లుచేసినయోడవాఁడు, కల్పకంబులపంటకమ్మతీఁడు-కల్పకంబుల = కల్పవృక్షములయొక్క, పంట = ఫలమునకు - పైపంట కనుట, కమ్మతీఁడు = కమతకాఁడు - సేద్యపుఁగాఁడనుట, మథిత మందిరంబు - మథిత = త్రచ్చియెత్తఁబడిన, సుధా = అమృతముచేత, ధౌత = కడుగఁబడిన - పరిశుద్ధముగాఁ జేయఁబడిన, కటక = మధ్యప్రదేశమునందు, జాత = పుట్టిన, చంపకవన = సంపెంగతోఁటయందలి, ప్రకంపన = గాలివాన, ఆకంప = అంతటనుజలించుటచేత, విసరత్ = విశేషముగాఁవొలఁగుచున్న, అఖర = తీక్ష్ణములుగాని - మృదువులైన, ముఖ = మొగములవలని, రవ = రొదలుగల ఝుంకారధ్వనులు గలిగినయనుట, మధుకర = తుమ్మెదలచేత, ముఖర = మ్రోఁగుచున్న - ధ్వనించుచున్న, శిఖర = శృంగములచేత, నందరస = ఆనందరసమునకు, మందిరంబు = ఇల్లు, అగుమందరంబు = అగునట్టిమందరపర్వతమును, కంటె = చూచితివా.

తా. ఓమహారాజా! ఈమందరపర్వతమును జూచితివా ఇది సముద్రమథనకాలమందుఁ దనకాధారముగానిలిచినయాదికూర్మమువీఁపునకునికి చేసికొని యుండెను. మఱియు వాసుకితన్నుఁ జుట్టుకొనుటచే నేర్పడినయొత్తుడురేఖలు కలిగి పర్వతసమూహములోపల మేలిమివహించినది. మైనాకపర్వతముతో సరిపోలినది దేవదానవులచేత మథనరూపమయినపని చేయించి సముద్రముదైన లోఁతుగని పెట్టి దేవేంద్రునికిఁ దెల్లయేనుఁగును గల్పవృక్షములను బుట్టించియిచ్చినది తనచేఁ ద్రచ్చియెత్తఁబడినయమృతముచేతఁ గడుగఁబడి పరిశుద్ధమయిన నడిమిభాగమునందు మొలచిపెరిఁగిన సంపెఁగపూఁదోఁటమీఁదిగాలి సోఁకుటచేత రొదలు చేయుచు నెగిరిపోవుచున్న తుమ్మెదల ఝుంకారధ్వనులచేత సంతోషరసమునకు నునికిపట్టయిన శిఖరములు గలిగి యొప్పుచున్నది (సంపెఁగలకును దుమ్మెదలకును విరోధమగుట నిటభావ్యము) అలం. ఉదాత్తము.

శా. వైకుంఠాంగదహేమ మాతతవలద్వాతాశనాకృష్టరే
ఖాకారంబుల జుట్టు నంటి మొలనూళ్లై మేటియొడ్డాణమై
శ్రీకారప్రభఁ గంతియై శిఖరిరాట్సింహాళ్లసత్పట్టమై
యీకొండం గనుఁగొంటె మాయ దిపుడున్ హేరాళపుంగాంతులన్. 48

అ. వైకుంఠాంగదహేమము-వైకుంఠ = విష్ణునిదైన, అంగద = భుజకీర్తులయొక్క, హేమము = బంగారు, ఆతత బులన్- ఆతత = విస్తారముగా, వలత్ = చుట్టివచ్చుచున్న, వాతాశన = సర్పమయిన వాసుకిచేత, ఆకృష్ట = (తిరిగిరా) ఈడువఁబడిన, రేఖాకారంబులన్ = ఒత్తుడుగీఱలయొక్కపొడల్లతో,

చుట్టును, అంటి=తీంటుకొని, మొలనూలై=అల్లిక మొలత్రాడై, మేటియొడ్డాణమై = మేలైననడుము బిగికై ధరించునట్టి తగడుపట్టియై, శ్రీకారప్రభః = శ్రీకారమయొక్క ప్రకాశము(విధము) చేత, కంఠియై=కంఠాభరణమై-కంటెయై, శిఖరి...త్పట్టమై-శిఖరి=పర్వతములకు, రాట్సింహ=రాజశ్రేష్ఠుఁడగుటచేత, ఉల్లసత్=ప్రకాశించుచున్న, పట్టమై=రాజ్యాభిషేకకాలమునందు నొసటఁగట్టినపట్టయై, ఈకొండక్ = ఈపర్వతమునందు, హేరాళపుంగాంతులక్ = అధికమైనవెలుఁగులతో, ఇపుడుక్ = ఈసమయమునందుఁగూడ, మాయదు=మాసిపోదు-ఏకాకారముగాఁ బ్రకాశించుచున్నదనుట.

తా. సముద్రమథనకాలమునందుఁ గవ్వమైనయీకొండకు వాసుకిని దరిత్రాడుచేసి క్రిందనుండి మీఁదిదాఁకఁ దిరుగఁజుట్టి లాగుటవలన వాసుకిదేహ మొరసికొని యేర్పడిననాలుగురేఖలయందును ద్రచ్చువారిలోముఖ్యుఁడగు విష్ణుదేవుని బాహుపురులబంగారంటుకొనఁగా నానాలుగురేఖలును గ్రిందనుండి పైవఱకు నాయాచోట్లకుఁ దగినట్లు వరుసగా మొలనూలు ఒడ్డాణము కంటె రాజ్యపట్టము ననెడినాలుగుభూషణములయి యిప్పుడుగూడ మాయక ప్రకాశించుచున్నవి చూచితివా. అలం ఉల్లేఖము.

తే. వేదవేదాంతముల వేధ ✽ వెదకి కనని, పద్మలోచనుశ్రీపాద✽పంకరుహము
లబ్జరేఖాంకితము లవే ✽ యచలవంశ, వల్లభునిమేఖలాసీమ ✽ నెల్ల మెఱయు. 49

అ. వేధ=బ్రహ్మ, వేదవేదాంతములక్ = వేదములయందును వేదాంతములయిన యుపనిషత్తులందును, వెదకి=శోధించియు, కనని ముల - కనని=చూడఁజాలని, పద్మలోచను=తామరలవంటికన్నులుగలవాఁడైన విష్ణుదేవునియొక్క, శ్రీ=సంపత్కరములయిన, పాదపంకరుహములు=చరణకమలములు, అబ్జరేఖాంకితములు=పద్మరేఖలచేత గుఱుతుపెట్టఁబడినవి, అవే=అవిగో, అచల.. మక్-అచలవంశ=కొండలగుంపునకు, వల్లభుని=రాజైన యీమందరపర్వతముయొక్క, మేఖలాసీమక్=మధ్యప్రదేశమునందు, ఎల్లక్=అంతటను, మెఱయుక్=ప్రకాశించుచున్నవి.

తా. బ్రహ్మయంతటిదొడ్డవానికిఁగూడ వేదములయందును వేదాంతములయందును వెదకియుఁ జూడఁదరముకానివియై పద్మరేఖలతోఁ బ్రకాశించునట్టి విష్ణుదేవునిపాదకమలములు కొండలలో దొడ్డదైన యీకవ్వపుఁగొండయొక్క మధ్యప్రదేశములం దెల్లయెడలను వెలుఁగుచున్నవి. విష్ణుదేవునియడుగులగుఱుతు లీకొండయం దెక్కడఁజూచిన నున్నవనిభావము. అలం. విశేషము.

ఉ. నాలుకబంతి వ్రేలఁబడి ✽ నంజునఁ దోఁగి తమాలపల్లవ
శ్రీల హసింప నుబ్బి కనుఁగ్రేవల జేవుఱు పుక్కిలింపఁగా
వాలికమేనిపీఁ చెగయ ✽ వాడినమాల్యము వ్రాలె నాదిమ
వ్యాళము దీనిపగ్గ మయినట్టియవస్థఁ దలంతు నెప్పుడున్. 50

అ. ఆదిమవ్యాళము=మొట్టమొదటిదైనపాము-వాసుకి, నాలుకబంతి = నాలుకలయొక్కవరుస, వ్రేలఁబడి=క్రిందికివాలి, నంజునక్=విషముచేత, తోఁగి=చక్కఁగాఁదడిసి,తమాలపల్లవశ్రీలక్=చీఁకటిమ్రానిచిగుళ్లకాంతిసంపదలను, హసింపక్ = పరిహసింపఁగా - మీఱఁగాననుట, జేవుఱు=రక్తకాంతి, కనుఁగ్రేవలక్ = కన్నులపార్శ్వములందు-కన్నుఁగొనలయందు, ఉబ్బి= ఉబికి - హెచ్చి, పుక్కిలింపఁగాక్=వెడలనిమియఁగా- బయటవ్యాపింపఁగా ననుట, వాలికమేనిపీఁచు - వాలిక=నిడుపైన, మేని=శరీరముయొక్క, పీఁచు=పైతోలు, ఎగయక్ = లేచిపోఁగా-దోఁచుకొనిపోఁగాననుట.

వాడినమాల్యమువోలెన్ = వాడిపోయినపూదండవలె, దీనిసగ్గము = ఈకొండపుఁదరిత్రాడు, అయిన ట్టియవస్థన్ = అయినదుర్దశను, ఎప్పుడున్ = ఎల్లప్పుడును, తలంతున్ = తలఁచుచుండుదును.

తా. దేవాసురులు సముద్రమథనకాలమునందుఁ దరిత్రాడుగాఁ జేసి యీకొండకుఁ జుట్టిన సర్ప రాజయిన వాసుకిదురవస్థ నాకిప్పటికిని మఱవలేదు. అప్పుడావాసుకి విషము గ్రక్కుచు నావిషముచే తఁ దడిసిన నాలుకలచాలు చీఁకటిమ్రాని చివుళ్లవలె నల్లగా వ్రేలాడుచుండఁ గన్నులెఱ్ఱవాఱ నెత్తురు గ్రక్కుచు తెలుఁగ శరీరముపైతోలు దోఁచుకొనిపోవ వాడిపోయినపూదండవలె నుండెను అలం. ఉపమ. భావికమును.

చ. బిలముఖపంక్తి నీధరణిభృత్పతి వారిధినిర్భరభ్రమిన్
దలముగ మున్ను ద్రావినసుధారసధారగుణంబునం జుమీ
పలితవికారదూరనిరపాయసుఖస్థితిఁ గాంచె నాఁగఁ గో
మలవిచలచ్ఛిరోరుహతమాలవినీలిమ రేఖ యొప్పెడిన్. 51

అ. ఈధరణిభృత్పతి = ఈపర్వతరాజు, మున్ను = మునుపు, బిలముఖపంక్తిన్ = గుహ లనెడిముఖ (నోళ్ల) సమూహముచేత, వారిధినిర్భరభ్రమిన్ - వారిధి = పాలసముద్రమునందలి, నిర్భర = అతిశయిం చిన, భ్రమిన్ = తిరుగుడుచేత, దలముగన్ = దట్టముగా - అధికముగా, త్రావిన..గుణంబునన్ - త్రావిన = త్రాగిన, సుధారస = అమృతరసముయొక్క, ధార = దారయొక్క, గుణంబునన్ = గుణవిశేష ముచేతనే, చుమీ = చూడుమీ, పలిత...స్థితిన్ - పలిత = నరయుటవలని, వికార = మాఱుపాటునను, దూర = ఎడమయిన, నిరపాయ = అపాయములేని, సుఖ = సౌఖ్యముయొక్క, స్థితిన్ = ఉనికిని, కాం చెన్ = పొందెను, నాఁగన్ = అనునట్లు, కోమల...రేఖ - కోమల = మృదువైన, విచలత్ = మిక్కిలి చలించుచున్న, శిరోరుహ = శిఖరము లనెడితలలయందు మొలచినవెండ్రుకలో యనఁదగిన, తమాల = చీఁ కటిమ్రాఁకులయొక్క, వినీలిమ = మిక్కుటమైన నల్లఁదనముయొక్క, రేఖ = పంక్తి, ఒప్పెడిన్ = ఒప్పుచున్నది.

తా. ఈమందరపర్వతము పూర్వకాలమునందుఁ బాలసముద్రములోఁ గవ్వమై తిరుగునప్పుడు గుహ లనెడినోళ్లచే నమృతపానము చేసినకారణముచేతనేమో ముదిమిలేమిని నరయక నల్లగానుం డెడి దీనితలవెండ్రుకలవలె దీనిశిఖరములయందలి చీఁకటిమ్రాఁకులతోఁపు లొప్పుచున్నవి. అలం. ఉత్ప్రేక్ష, రూపకమును.

చ జడధి మథింపఁ జిక్కి సుధాసౌరభ మానుటఁ జావు దక్కి యీ
పడఁకులనుండి దుగ్ధభవపాండిమ బొందుల నందమొంద నిం
దడవిమెకాలతోఁ గదుపులై చరియించును మేఁతకై బయల్
వెడలి డులీకుళీరశకులీమకరీముఖవారిజంతువుల్. 52

అ. జడధి = సముద్రమును, మథింపన్ = త్రచ్చుచుండఁగా, చిక్కి = (కవ్వపుఁగొండక్రింద) చిక్కుకొని, సుధసౌరభమున్ = అమృతముయొక్కసువాసనను, అనుటన్ = ఆస్వాదించుటచేత, చావు = మృతి, తక్కి = లేకపోఁగా, దుగ్ధభవపాండిమ - దుగ్ధ = పాలవలన, భవ = కలిగిన, పాండిమ = తెల్లఁద నము, బొందులన్ = తమశరీరములయందు, అందమొందన్ = ఒప్పియుండఁగా, ఇందున్ = ఈకొండ యందు, జాపడఁకులనుండి = జాళ్లసందులయందుండి, డులీ...వుల్ - డులీ = ఆఁడుఁదాఁబేళ్లు, కుళీర =

ఎండ్రకాయలు, శకులీ=ఆఁడుజేఁపలు, మకరీ=ఆడుమొసళ్లు, ముఖ=మొదలుగాఁగల, వార్జంతువుల్=జలజంతువులు, అడవిమెకాలతోన్=వనమృగములతోఁబాటు, మేఁతకై=మేయుటకై, బయల్వెడలి=బయలుదేఱి, కదుపులై=గుంపులై, చరియించున్ = సంచరించును.

తా. పాలసముద్రమును ద్రచ్చునప్పుడు బయటఁ బోలేక కొండక్రిందఁ జిక్కుకొనియున్న తాఁబేళ్లు మొసళ్లు చేఁపలు ఎండ్రకాయలు మొదలుగాఁగలజంతువులు పాలలోనున్నందునఁ దెల్లవాటినశరీరములుగలవై యందుఁబుట్టినయమృతము సోఁకుటచేఁ జావులేనివై కవ్వమైన యీకొండయొక్కతాళ్లసందులలోనుండి మేఁతకై యడవిమృగములతోఁబాటు బయలువెడలి గుంపులుగుంపులై తిరిగి మేయుచుండును.

మ. అనుచుం జందనపంకపంకిలతలంబై కేతురుద్ధాతపా
ధ్వనిరుష్ణంబయి మంచకోపరికుటీవాటీనటన్నర్తకీ
జనమై యూథవతీసర్వతఃకలితవీక్షాతోరణస్రఙ్నిబం
ధనమై యొప్పుపురంబు సొచ్చి భవనద్వారప్రఘాణంబునన్. 53

అ. అనుచున్=అని చెప్పుచు, చంద...బై - చందనపంక=గుజ్జుగాఁగలిపినగంధపునీళ్లచేత, పంకిల=బురదపడనైన, తలంబై=భూప్రదేశముగలదై, కేతు..రుష్ణంబయి- కేతు=జెండాలచేత, రుద్ధ=నివారింపఁబడిన, ఆతప=ఎండగలిగిన, అధ్వ = మార్గమందలి, నిరుష్ణంబయి = వేఁడిమిలేమిగలదై, మంచ...జనమై-మంచక=నప్పరములయొక్క, ఉపరి = మీఁదిభాగములయందలి, కుటీ = గుడిసెలయొక్క, వాటీ=వాడలయందు-వరుసలయందు, నటత్=నాట్యమాడుచున్న, నర్తకీజనమై=నట్టువపడుచులుగలదై, యూథవతీ=యౌవనస్త్రీసమూహముయొక్క, సర్వతః=యెల్లయెడలను, కలిత=కూడిన-నిండుకొన్న, వీక్షా=చూపులనెడి, తోరణ=తోరణములవలెనొప్పుచున్న, స్రక్=పుష్పసరములయొక్క, నిబంధనమై=కట్టుటకలదై, ఒప్పుపురంబు=అమరియున్నపట్టణమును, చొచ్చి=ప్రవేశించి, భవన...బునన్ - భవన=ఇంటియొక్క, ద్వార=గుమ్మముముంగలి, ప్రఘాణంబునన్ = చావడియందు. - పైపద్యముతో నన్వయము.

తా. ఇందీవరాక్షుఁ డీవిధముగా స్వరోచితోఁ బలుకుచు గుజ్జుగాఁగలిపిన మంచిగంధపుఁగలయంపులుచల్లి మార్గములయం దెండసోఁకకుండ నీడలుకలుగునట్లు జెండాలెత్తి మంచెలవరుసలమీఁది గుడిసెలలోనున్న నాట్యమాడుచున్న భోగముపడుచులచూపులు దిక్కులందుఁ బూదండలతోరణము గట్టినట్లు వ్యాపింపఁగా నొప్పుచున్నపట్టణము చొచ్చి తన యింటివాకిటి ముందటిచావడిలోను. అలం. రూపకము.

క. పంతుల బాంధవభటసా, మంతుల నాశ్రితుల నిలిపి మహికాంతుఁడు నిశా
కాంతమణికాంతికందళ, కాంతం బగు నొక్కదొరనగర విడియించెన్. 54

అ. పంతులన్=పినముఖ్యులను, బాంధవ...మంతులన్ - బాంధవ=చుట్టములను, భట=సేవకులను, సామంతులన్ = పొరుగుదేశములరాజులను, ఆశ్రితులన్ = తన్నాశ్రయించినజనులను, నిలిపి=అక్కడక్కడ నిలిపి నాజ్ఞాపించి, మహీకాంతుఁడు=ఆరాజు-స్వరోచి, నిశా...కాంతంబు-నిశాకాంతమణి=చంద్రకాంతమణులయొక్క, కాంతికందళ=వెలుఁగుమొలకలచేత, కాంతంబు= మనోహరమైనది, అగునొక్కదొరనగరన్ =అయినట్టియొకరాజగృహమునందు, విడియించెన్=దించెను.

వ. విడియించి యనంతరంబ యంతఃపురకాంతాకరాంతతలంతన్యమానమణిభాజన నీరాజనమంగళంబు లంగీకరించి ప్రియాంగనల సంభావించి మగుడ నాస్థానమం డపంబున కేతెంచి మతంగ మంకి మంకణ మందపాల మరీచి మాండవ్య మా ర్కండేయాదిమహామునుల రావించి లగ్నంబు నిశ్చయించి గగనచరజంఘాల కరప్రేషితలేఖతరులేఖాముఖంబులఁ జిత్రరథ చిత్రాయుధ చిత్రసేనాదు లగు గంధర్వులను వరాహకర్ణ గజకర్ణ సుకేతు మాణిభద్రప్రముఖయక్షులును రేవంతి ప్రముఖగుహ్యకులను మందారముఖ్యవిద్యాధరులను బిలిపించి వినయపూర్వ కంబుగా విత్తాధిపతికి విజ్ఞాపనపత్రిక లిఖయించి నిజప్రధానులం బంచి సలకూ బరు రావించె నంత. 55

అ. విడియించి=స్వారోచినిరాజసౌధమునందుదింపి, అనంతరంబ=వెంటనే, అంతఃపురి ... లంతన్యమాన=విస్తరిల్లఁజేయఁబడుచున్న — తాల్పఁబడుచున్న, మణిభాజన = రత్నపుబంగారు ... అంతఃపురకాంతా=రాణివాసపువనితలయొక్క, కరాంత=చేతులకొనలయందు — ... న్యమాన=విస్తరిల్లఁజేయఁబడుచున్న — తాల్పఁబడుచున్న, మణిభాజన = రత్నపుబంగారు ... జన=హారతులయొక్క, మంగళంబులు=శుభక్రియలను — మంగళహారతులననుట, అంగీకరించి ..., ప్రియాంగనలన్=ప్రియభార్యలను, సంభావించి=మన్నించి — గారవించి, మగుడన్=మరల, ఆస్థానమండపమున కున్=కొలువుకూటమునకు, ఏతెంచి=వచ్చి, మతంగ ... మహామునులన్=మతంగుఁడు మంకి మంకణుఁడు మందపాలుఁడు మరీచి మాండవ్యుఁడు మార్కండేయుఁడు మొదలుగాఁ గల ..., రావించి=రప్పించి, లగ్నంబు=రాశ్యుదయమును — పెండ్లిముహూర్తముననుట, నిశ్చయించి=నిర్ణయించి, గగన ... ముఖంబులన్ — గగనచర=గంధర్వులైన, జంఘాల = పిక్కబలిమి గలసేవకులయొక్క ... నడవఁజాలిన బంట్లయొక్క, కర=చేతులలోఁ బెట్టి, ప్రేషిత=పంపఁబడిన, ... గడించిన, లేఖాముఖంబునన్=పెండ్లిజాబులమూలమున, చిత్రరథ ... నాదులు = ... యుధుఁడు చిత్రసేనుఁడు మొదలయినవారు, అగుగంధర్వులన్=అగునట్టిగంధర్వులను, ... యక్షులను=వరాహకర్ణుఁడు గజకర్ణుఁడు సుకేతుఁడు మాణిభద్రుఁడు మొదలయినయక్షులను, ... ప్రముఖగుహ్యకులను=రేవంతుఁడులోనుగాఁగల గుహ్యకులను, మందారముఖ్యవిద్యాధరులను — మందా రుఁడు లోనుగాఁగల విద్యాధరులను, పిలిపించి=పిలువఁబంపి, విత్తాధిపతికిన్=ధనపతికి — కుబేరునకు, వినయపూర్వకంబుగాన్=విశేషమయినవినమ్రత ముందుగలుగునట్టుగా — మిక్కిలియణఁకువతోఁగూడినట్లనుట, విజ్ఞాపనపత్రిక=మనవిజాబు, లిఖయించి=వ్రాసి, నిజప్రధానులన్=తనమంత్రులను, పంచి=పంపి, సలకూబరున్=నలకూబరునితోడుకొను, రావించెన్=రప్పించెను, అంతన్=అప్పుడు. — విూఁగిన వ్యయము.

క. పసుపులనలుఁగిడి రైదువ, బిసరుహలోచనలు పెండ్లి పెద్దలయాజ్ఞన్ వసుధాధ్యక్షుబుభుక్షున, కసితాలకభరకుఁ బేరఁటాం డ్రాగిర నౌలుఁ. 56

అ. వసుధాధ్యక్షుబుభుక్షునకున్ = రాజపుత్రునకును — స్వారోచికిని, ... నల్లనిముంగురులు గలపడుచునకును — మనోరమకును, ఐదువబిసరుహలోచనలు — ... కన్నులుగలసువాసినులు — ముత్తైదువలు, పెండ్లిపెద్దలయాజ్ఞన్ = పెండ్లిపెద్దలయనుమతిచేత, ... క్రమముగా, పేరటాండ్రు = పేరంటముఁ జేయవచ్చిన ముత్తయిదువలు, పాడన్=పాటపాడఁగా

పసుపులనలుఁగులు=పసుపుతోడినలుఁగులు, ఇడిరి=పెట్టిరి. (పేరంటము=శుభకార్యములందుఁ బసుపు కుంకుమతాంబూలములకై సువాసినులనుబిలుచుట, అందులకయి సువాసినులువచ్చుటయును. పేరఁటముగలవారు పేరఁటాండ్రు నలుఁగు=స్నానకాలమునందు స్త్రీపురుషులకు సున్నిపిండి దేహములకురాచి నలఁచుట.)

ఉ. మజ్జన మాడె రాజు కృశమధ్యము లింపున వంప గుంపు లై
గొజ్జఁగనీటివెల్లువలు గోవజవాజులనిగ్గుఁ జూపఁ జం
చజ్జరఠాహికంచుకముచాయమడుంగుల నొత్తెఁ జెమ్మనీ
రుజ్జగిలన్ వహించె మెయినూఁదినఁ బాఱుదుకూలచేలముల్. 57

అ. రాజు=స్వరోచి, కృశమధ్యములు=సన్ననినడుములుగల స్త్రీలు, ఇంపునన్=ఆనందముతో, గుంపులై=గుంపులుగూడి, వంపన్=పోయఁగా, గొజ్జఁగనీటివెల్లువలు = పన్నీటివఱదలు, గోవజవాజులనిగ్గున్=శ్రేష్ఠమయినగోపదేశపు జవ్వాజియొక్క పరిమళాతిశయమును, చూపన్ = కనఁబఱుపఁగా, మజ్జనమాడెన్=స్నానము చేసెను, చంచత్.. మడుంగులన్-చంచత్=ఒప్పుచున్న, జరఠాహి=ముసలిపామైన యాదిశేషునియొక్క, కంచుకముచాయ=కుబుసమువన్నెగల - తెల్లగాఁ బ్రకాశించుచుండెడి, మడుంగులన్=చలువవస్త్రములచేత, చెమ్మనీరు=దేహమునందుఁ దేమగానుండెడినీరు-నీటితడియనుట, ఉజ్జగిలన్=విడిచిపోవునట్లు-ఆఱునట్లు, ఒత్తెన్=అద్దెను-తుడుచుకొనెననుట. ఊఁదినన్ = నోటితో నూఁదినమాత్రమున, పాఱు... ముల్-పాఱు = ఎగిరిపోవునట్టి-మిక్కిలినాణెమును సన్ననివియునైన, దుకూల=శుభ్రములైన, చేలములు=వస్త్రములను, మెయిన్=దేహమునందు, తాల్చెన్=ధరించెను.

తా. అప్పుడు స్వరోచి పరిచారికలు ముంచిముంచిపోయఁగాఁ బన్నీట జలకమాడి ముతికిలేని చలువబట్టలతో మేనితడి తుడుచుకొని నాణెముమీఱిన శుభ్రవస్త్రములు ధరించెను. అలం. నిదర్శన, అతిశయోక్తియు.

చ. గరువున కొత్తఁ జెంగలువకచ్చు ఘటించినమాళిఁ జుట్టెఁ జెం
దిరికచెఱంగునఁ బసిఁడితీఁగెలు నించినజిల్గుపాగ బం
భరసభ వాసనాపవనపారణఁ దేల నలందెఁ గస్తురిన్
మరకతమౌక్తికాదిమణిమండనమండితుఁ డయ్యె నయ్యెడన్. 58

అ. అయ్యెడన్=ఆసమయమునందు, గరువునకున్ = ఒకచెంపకు, ఒత్తన్=ఒఱగునట్లు, చెంగలువకచ్చు = ఎఱ్ఱకలువపూసిగబంతి, ఘటించినమాళిన్=కూర్చిన (ఎఱ్ఱకలువపువ్వురీతిగా పింజెగూర్చిన యని కొందఱు) సిగపైని, చెందిరికచెఱంగునన్ = చంద్రకావివస్త్రముకొంగునందు, (పా. చెందిరికతెఱంగునన్ = కమ్మపెదుద్దు విధమున) పసిఁడితీఁగలు=తీఁగలల్లినట్లు బంగారుసరిగపోఁగులు, నించిన జిల్గుపాగన్-నించిన=నిండినట్లుచేసిన, జిల్గు=సన్నఁదనముగల, పాగన్=తలచుట్టువస్త్రమును, చుట్టెన్=చుట్టుకొనెను, బంభరసభ=తుమ్మెదలగుంపు, వాసనాపవనపారణన్-వాసనా=పరిమళముతోడి, పవన=గాలియొక్క, పారణన్ = (మూర్కొనుటయనెడి) విందుచేత, తేలన్=ఆనందింపఁగా, కస్తురిన్= కస్తూరిని, అలందెన్ = శరీరమునందుఁ బూసికొనెను, మరకత... మండితుఁడు - మరకత = పచ్చలు, మౌక్తిక=ముత్తెములు, ఆది=మొదలయిన, మణి=రత్నములుతాఁపిన, మండన=ఆభరణములచేత, మండితుఁడు=అలంకరింపఁబడినవాఁడు, అయ్యెన్=ఆయెను.

తా. అప్పుడు స్వరోచి సరిగతీఁగలు పాఱనేసి కుసుంభాచాయవేసిన తెలిపాగ యెఱ్ఱకలువ పూబంతిఁదాల్చిన సిగచుట్టి రాఁ జుట్టెను. కస్తూరికలపము పూసికొనెను. రత్నములు దాఁపినసొమ్ములు దాల్చెను.

మ. కదిసెన్ లగ్న మటంచు మంత్రులు దొరల్ గంధర్వరాజాజ్ఞను
న్మదవేదండఘటాభటాశ్వరథసేనాజైత్రవాదిత్రసం
పద మీఱం జను దెంచి కాంచి ముద మొప్పం జేసి రారూఢుఁగాఁ
గదళీకాంచనకక్ష్యలన్ మెఱయులేఖస్వామిచౌదంతిపై. 59

అ. మంత్రులు=ఇందీవరాక్షునిమంత్రులును, దొరల్ = పెండ్లిపెత్తనముచేయవచ్చిన ప్రభువులును, లగ్నము=పెండ్లిముహూర్తము, కదిసెన్ = సమీపించెను, అటంచున్=అని, గంధర్వరాజాజ్ఞన్=ఇందీవరాక్షునియాజ్ఞచేత, ఉన్మద . సంపద-ఉన్మద=మదముచేత నతిశయించిన, వేదండ = ఏనుఁగుల యొక్క, ఘటా=గుంపులును, భటా=కాలిబంట్లును, అశ్వ=గుఱ్ఱములును, రథ=తేరులును నైన, సేనా= చతురంగబలములయు, జైత్ర=జయశీలములైన, వాదిత్ర = భేరిమొదలయినవాద్యములయు, సంపద = కలిమి-వైభవమనుట, మీఱన్=అతిశయింపఁగా, చనుదెంచి=వచ్చి, కాంచి=స్వరోచినిజూచి, ముదము=సంతోషము, ఒప్పన్=అమరఁగా, కదళీ...కక్ష్యలన్-కదళీ = పెక్కెములచేతను, కాంచన= బంగారుతోఁజేయఁబడిన, కక్ష్యలన్=నడికట్టుపట్టచేతను, మెఱయు.. పైన్ - మెఱయు=ప్రకాశించుచున్న, లేఖస్వామి=ఇంద్రునిదైన, చౌదంతిపైన్ = నాలుగుకొమ్ములుగలయేనుఁగుమీఁద-ఐరావతముమీఁద, ఆరూఢుఁగాన్=ఎక్కినవానిఁగా, చేసిరి-ఎక్కించిరనుట.

తా. అంతట గంధర్వరాజైన యిందీవరాక్షునిచేత నియమింపఁబడిన మంత్రులును పెండ్లిపెద్దలును లగ్నముసమీపించెనని చతురంగసేనతో మంగళవాద్యములు మ్రోయఁగా బయలుదేఱి పెండ్లికొడుకైన స్వరోచివిడిదికిఁ బోయి యతనిదర్శనముచేసి సంతోషించి బంగారునడికట్టుపట్టిఁగట్టి జెండాలెత్తి తీసికొనివచ్చియున్న యైరావతగజముపైఁ గూర్చుండఁబెట్టిరి.

ఉ. అత్తఱిఁ బట్టణాంబువికచాంబురుహాక్షులు కౌతుకంబునం
జిత్తము లుల్లసిల్లఁ గయిసేసి గృహాంగణసౌధమాలికల్
హత్తి నరేంద్రవీథిఁ జతురంగబలంబులుఁ గొల్వఁగా మరు
న్మత్తగజంబుపైఁ జనుకుమారశిరోమణిఁ జూచి రుబ్బునన్. 60

అ. అత్తఱిన్=ఆసమయమునందు, పట్ట..క్షులు-పట్టణాంబు = పట్టణమునందలి, వికచాంబురుహాక్షులు=విరిసినకమలమువంటి కన్నులుగలవారు-స్త్రీలు, కౌతుకంబునన్=వేడుకతో, చిత్తములు=మనసులు, ఉల్లసిల్లన్=సంతోషింపఁగా, కయిసేసి=అలంకరించుకొని, గృహాంగణసౌధమాలికల్ - గృహాంగణ=ఇండ్లముంగిళ్లయొక్కయు, సౌధ=మేడలయొక్కయు, మాలికల్=వరుసలను, హత్తి=చేరి, నరేంద్రవీథిన్=రాజమార్గమునందు, చతురంగబలంబులున్=రథగజతురగపదాతులనెడి నాలుగంగములసేనలును, కొల్వఁగాన్=సేవింపఁగా, మరున్మత్తగజంబుపైన్ = దేవతలమదపుటేనుఁగైన యైరావతముమీఁద, చనుకుమారశిరోమణిన్-చను=పోవుచున్న, కుమారశిరోమణిన్ = రాజకుమారశ్రేష్ఠుఁడయిన స్వరోచిని, ఉబ్బునన్=సంతోషముతో, చూచిరి.

తా. ఆసమయమునందుఁ బురస్త్రీలందఱును మనసులందు వేడుకతో నలంకరించుకొనివచ్చి యిండ్లముంగిళ్లయందును మేడలయందును జేరి రాజమార్గమునందు నైరావతము నెక్కి పోవుచున్న స్వారోచిమహారాజును సంతోషముతోఁ జూచిరి.

ఉ. అంచెలుగట్టి కాలితొడుసై చననీవుగదమ్మ ప్రోదిరా
యంచ లివేటిసంగడము లయ్యెను దయ్యమ యేటివేడ్క నా
కంచుఁ బదంబునన్ మొరయు నందియ యూడఁగఁ దన్ని పోయి వీ
క్షించె లతాంగి యోర్తు మురజిన్నిభు సాగరమేఖలావిభున్. 61

అ. లతాంగి=తీఁగవంటి మేనుగలదయినస్త్రీ, ఓర్తు=ఒకతె, ప్రోదిరాయంచలు= పెంపుడురాజహంసలు, అంచెలుగట్టి=వరుసలుదీరి, కాలితొడుసై= కాళ్లయందెలమ్రోఁత వినుటవలనిసంబంధముగలవై, చననీవుగదమ్మ=పోనియ్యవుగదా, ఇవి= ఈహంసలు, ఏటిసంగడములు = ఏమిటిపరివారములు, (సహచరములు అనికొందఱు) అయ్యెన్=అయెను, దయ్యమ=దైవమా, నాకున్=నాకంటిజంజాటముగలదానికి, ఏటివేడ్క=ఏమిటివినోదము, అంచున్=అని, పదంబునన్=కాలియందు, మొరయు నందియ=మ్రోఁగుచున్నయందెను, ఊడఁగఁదన్ని=ఊడిపోవునట్లు కాలుజాడించి, పోయి=తలవాకిటికిఁబోయి, మురజిన్నిభున్=శ్రీకృష్ణదేవునిఁబోలిన, సాగరమేఖలావిభున్= భూపతిని-స్వారోచిని, వీక్షించెన్=చూచెను. -కాలియందెలమ్రోఁత హంసలక్రేంకారధ్వనులనుబోలియుండె ననియు, అది తమజాతిపక్షులధ్వని యని యెంచి హంసలు కాళ్లఁజుట్టుకొని తిరుగఁగా వానితొందర తప్పించుకొనుటకై కాలియందె నూడఁదన్నుకొని వడలిపోయె ననియు సంబంధము.

చ. వలపులపల్లవుం డొకఁడు వట్టిచలంబున నేప నీసమై
యలుకలు తీర్చి తీర్చి యొకయచ్చర వచ్చి నృపాలు నన్నగ
ర్వ్యాలువడి చూచెఁ గాముకుఁడు వెంటనె రా నపు డాత్తఘర్మమై
వెలవెలఁబాఱెఁ దన్ముఖము వెల్వెలఁబాఱె విటాననాబ్జమున్. 62

అ. ఒకయచ్చర=ఒకయప్సరస, వలపులపల్లవుండొకఁడు=ప్రేమాస్పదుఁడయినయొకవిటుఁడు, వట్టిచలంబునన్=కారణములేనిమత్సరముచేత, ఏఁపన్=పీడింపఁగా, నీసమై=దుఃఖపడినదై, అలుకలు= ఆవిటునికోపములను, తీర్చితీర్చి=అలుగఁగా నలుగఁగాఁ దీర్చితీర్చి, అన్నగర్వ్యాలువడి=తానున్నయామేడనుండి వెడలి, వచ్చి=బయటవచ్చినదై, నృపాలున్=రాజును, చూచెను. అపుడు=ఆసమయమునందు-రాజును జూడవచ్చునసమయమునందనుట, కాముకుఁడు=వలపుకాఁడును, వెంటరాన్=వెంబడించిరాఁగా, ఆత్తఘర్మమై=పొందఁబడినచెమటగలదై-మేను చెమర్పఁగా ననుట, తన్ముఖము=ఆయప్సరసముఖము, వెలవెలఁబాఱెన్=తెల్లఁబోయెను-వివర్ణమయ్యెననుట, (అంతట) విటాననాబ్జమున్=కమలమువలె వికాసముకలిగియున్న విటునిముఖమును, వెల్వెలఁబాఱెన్=వివర్ణమయ్యెను.

తా. ఒకయప్సరస యొకవలపుకాఁడు చలపట్టి పలుమాఱును గోపించుకొనుచుండఁగా వాని యలుక చాలసేపు తీర్చుచుండి పిదప వానిని విడిచి తనమేడ వెడలి బయటవచ్చి రాజును జూచెను. అప్పుడు విటకాఁడును దాసివెంట నేవచ్చెను గనుక నది వానినట్టు చూచినదై వానిని నిరసించి తాను రాజును జూడవచ్చినట్టు లాతనవలపుకానికి తెలిసెనో యనువిచారముచేత మేను చెమర్పఁగా ముఖము

చిన్నపుచ్చుకొనెను అప్పుడే తనపద్దు చెల్లకపోయెనే యనుచింతచేత విటకాఁడును ముఖము చిన్నపుచ్చుకొనెను.

చ. చిలుకలకొల్కి కల్కి యొకచేడియ నాటకసాలమేడపై
నిలువున నాడుచుండి ధరణీపతిఁ జూడఁ దలంచి యంచునన్
నిలిచి రహిం గనుంగొనుచు నెయ్యమునం దనువల్లి యుబ్బి కం
చెల తెగి పడ్డఁ గేతనముచీర చెఱంగున మూసెఁ జన్నులన్. 63

అ. చిలుకలకొల్కి=చిలుక ముక్కువంటి కనుఁగొలుకులుగల, కల్కి=మనోహరురాలైన, ఒకచేడియ=ఒకస్త్రీ, మేడపైనిలువునన్=మిద్దెయింటిమీఁదియంతస్తునందలి, నాటకసాలన్ = నృత్యము చేసెడికూటమునందు, ఆడుచుండి=నృత్యము చేయుచుండి, ధరణీపతిన్=రాజును, చూడఁదలంచి=చూడవలెననుతలఁపుపుట్టి, అంచునన్ = ఆనాటకసాలచివరను, నిలిచి = నిలువఁబడి, రహిన్=అభిలాషతో, కనుంగొనుచున్ = స్వారోచినిజూచుచు, నెయ్యమునన్ = స్నేహముచేత-చూచుటవలనఁ గలిగినయానందాతిశయముచేతననుట, తనువల్లి=తీఁగవంటిదైన మేను, ఉబ్బి=ఉప్పొంగి-బలుపునొందియనుట, కంచెల-అవిక, తెగి=బిగువుచేముడి తెగి, పడ్డన్=జాఱిపడిపోఁగా- (కంచెల యనఁగా నాట్యమాడునప్పుడు మొగ్గవాలుట మొదలగుసమయములందు బిగిసడలకుండుటకై బొమ్ములమీఁదఁగట్టుకొనెడు వస్త్రవిశేషము అని బ్రౌన్ దొరగారు వ్రాయించినటీకలో వ్రాయఁబడియున్నది.) కేతనముచీర చెఱంగునన్=జెండాగుడ్డచెఱఁగుచేత, చన్నులన్ = స్తనములను, మూసెన్=కప్పెను.

తా. ఒక్క చక్కఁదనము గలయువతి మేడమీఁది పైయంతస్తునందు నృత్యశాలలో నృత్యము చేయుచుండి రాజునుజూడఁ దలఁపుపుట్టఁగా నాటకసాలచివర నొకపార్శ్వమునందు నిలిచి రాజును జూచి యతనిఁజూచుటవలనియానందాతిశయముచేత దేహముబ్బి బిగిసికొనగా అవికముడి తెగి జాఱిపోవుటచే స్తనమ్ములు బయలుపడఁగా నచట నలంకారముకొఱకై కట్టియున్న జెండాగుడ్డకొనకొంగుతో స్తనములను మూసికొనెను.

ఉ. కీరమనోజ్ఞవాణి యొకకిన్నరి కిన్నర మీటిమీటి యొ
య్యారపులీల నేఁగి వసుధాధిపుఁ గన్గొనె జిల్గుపయ్యెదన్
హారముఁ జక్కఁబెట్టెడుకుచాహితహస్తము పైఁడిగోళ్లు హిం
సారతి సేయుదర్పకునిసంపఁగెములుకులుఁబోలె మించఁగన్. 64

అ. కీరమనోజ్ఞవాణి=చిలుకపలుకులవంటి యింపైనపలుకులుగలదైన, ఒకకిన్నరి = ఒకానొక కిన్నరస్త్రీ, కిన్నెర=కిన్నెరయనెడి యొకవిధమైనవీణను, మీటిమీటి=చాలసేపువాయించి, ఒయ్యారపులీలన్=విలాసవైఖరితో, పోయి = రాజునుజూడఁబోయి, జిల్గుపయ్యెదన్=సన్నపుఁబయ్యెఁటను, హారమున్ = మెడలోనిముత్యాలసరమును, చక్కఁబెట్టెడుకుచాహితహస్తము పైఁడిగోళ్లు - చక్కఁబెట్టెడు=సవరించుకొనుచున్న, కుచ=స్తనములమీఁద, ఆహిత = ఉంపఁబడిన, హస్తము = చేతియొక్క, పైఁడిగోళ్లు = తంత్రులుమీటునపుడు దెబ్బతగులకుండుటకై వ్రేళ్లకుఁబెట్టుకొన్న బంగారుపుగోళ్లు, హింసారతి ..ములుకులుబోలెన్-హింస = విరహిజనహింసయందు, రతిసేయు = ఆసక్తిపడునట్టి, దర్పకుని=మన్మథునియొక్క, సంపఁగెములుకులుఁబోలెన్ = సంపెఁగపూబాణములవలె, మించఁగన్ అతిశయింపఁగా-తోఁచుచుండఁగాననుట, వసుధాధిపున్=రాజును, కన్గొనెన్=చూచెను.

తా. ఒకకిన్నరస్త్రీ చాలసేపటినుండి కిన్నరమీటుచుండి లేచి రాజునుజూడఁబోయి తంతిమీటు నపుడు వ్రేళ్లకొనలకుఁ బెట్టుకొనెడి బంగారపుమాలుగోళ్లతోడిచేతితో బొమ్మమీఁదిచెమటను హారములను సవరించుకొనుచు రాజును జూచెననియు నప్పుడా వ్రేళ్లలోనిమాలుగోళ్లు విరహముగల స్త్రీపురుషులను బాధింపఁగోరుచున్న మన్మథునిసంపెంగపూబాణములో యనున ట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

చ. పరవశదైన్య మాఁకుకొను ప్రౌఢలఁ గానదు ఘర్మవారిచేఁ
గరఁగి స్రవించుచిత్రకము గాన దనాదృతవీటిపాటలా
ధరమున నున్న మంటినవిధంబును గానదు నవ్వుటాల కా
భరణము గొన్నఁ గాన దొకబాల నృపాలునిఁ జూచి నివ్వెఱన్. 65

అ. ఒకబాల=ఒకపడుచుచిన్నది, నృపాలునిన్=రాజును, చూచి, నివ్వెఱన్=(చూచుటవలన నైన) విభ్రాంతిచేత, (ఇది మీఁదఁజెప్పెడి వానికన్నిటికిని హేతువు) పరవశదైన్యము = తనదైన చొక్కువలని దీనభావమును, ఆఁకుకొను ప్రౌఢలన్=నిందించుచున్న ప్రగల్భస్త్రీలను, కానదు=చూడదు, ఘర్మవారిచేన్=చెమటనీటిచేత, కరఁగి, స్రవించుచిత్రకము=దిగజాఱుచున్న తిలకమును, కానదు = చూడదు, అనాదృత. ధరమునన్ - అనాదృత = ఆదరింపఁబడని, వీటి = తాంబూలరసముగల, పాటల = ఎఱ్ఱనైన, అధరమునన్ = క్రిందిపెదవియందు, నున్నము, అంటినవిధంబున్ = అంటుకొన్నరీతిని, కానదు - చూడదు, నవ్వుటాలకున్=పరిహాసమునకు, ఆభరణము తానుధరించినసొమ్మును, కొన్నన్=ఇతరులు తీసికొన్నను, కానదు=చూడదు - అనగా ముగ్ధయైన యొకానొకపడుచు రాజును జూచి పరవశయై సర్వమును మఱచియుండెను. (ఇందు స్తంభస్వేదము లనెడిసాత్త్వికభావములు చెప్పఁబడినవి)

చ. అలికులవేణి యొక్కతె రతాంతమునం దనయంగవల్లికం
బులకలు చొక్కు లేఁజెమరు పుట్టఁగ నేఁగి నరేంద్రుఁ జూడ నా
పులకలు చొక్కు లేఁజెమరుఁ బోవక యట్టుల యుండె నట్టిదౌఁ
జెలువగువానిఁ గన్గొనిన చెల్వకుఁ జూపుల కావె కూటముల్. 66

అ. అలికులవేణి=తుమ్మెదబారువంటి జడగలదైన, ఒక్కతె=ఒకవనిత, రతాంతమునన్=సంభోగమయినతోడనే, తనయంగవల్లికన్=తీఁగవంటితనదేహమునందు, పులకలు=గగురులు - మేనివెండ్రుకలు నిక్కపొడుచుకొనుటలును, చొక్కు=పరవశత్వమును, లేఁజెమరు = చిఱుచెమటయు, పుట్టఁగన్ = కలుగఁగా, ఏఁగి=బయటఁబోయి, నరేంద్రున్=రాజును, చూడన్=చూడఁగా, ఆపులకలుచొక్కు లేఁజెమరు=ఆసంభోగకాలమునందుఁ గలిగినగగురులును బరవశత్వమును చిఱుచెమటయును, పోవక = అణఁగిపోనక, అట్టుల=అరీతిగనే, ఉండెను, అట్టిది=ఆస్థితియట్టిది, ఔన్=అగును, చెలువగువానిన్ = అందమయినవానిని, కన్గొనిన చెల్వకున్ = చూచినసుందరికి, చూపుల=చూచుటలే, కూటములు=సంభోగములు, కావె=కావా - అగుననుట - అనఁగా సంభోగజనితరోమాంచాదులు సుందరపురుషావలోకజనిత సాత్త్వికభావధర్మములుగాఁ బరిణమించి యట్లె నిలచియుండెనని తాత్పర్యము. (ఇందు రోమాంచ స్తంభ స్వేదములు సూచితములు.) అలం. అర్థాంతరన్యాసము.

చ. అలకులఁ ద్రాతి జృంభికకు నంకము సేయుచుఁ గర్ణపాళిపైఁ
గులుకలఁ గ్రోయుచుం దగఁగ నా ప్రమదాశ్రులు గోట మీటుచుం

జెలిభుజపీఠి నొత్తిగిలి చిల్కను దువ్వుచు వాలుగన్నుఁ గ్రే
వల కుదధార చేర నొకవారవిలాసిని చూచె రాసుతున్. 67

అ. ఒకవారవిలాసిని=విలాసవతియైన యొకభోగముది, అలరులబంతిన్ = పూబంతిని, జృంభికకున్=ఆవులింతకు, అడ్డము సేయుచున్=చాటు చేసికొనుచు, కర్ణపాళిపైకిన్=చెవితమ్మెమీఁదికి, అలకలన్=ముంగురులను, త్రోయుచున్=ఎగసనఁద్రోయుచు, తరఁగలు = అలలు, ఔ ప్రమదాశ్రులు = అగుసట్టి సంతోషబాష్పములను, గోటన్=కడవ్రేలిగోటితో, మీటుచున్ = ఎగఁజిమ్ముచును, చెలిభుజపీఠిన్=చెలికత్తెయొక్క పీఠమువంటి బుజముమీఁద, ఒత్తగిలి=ఒఱగి, చిల్కను=పెంపుడుచిలుకను, దువ్వుచున్=చేతితో నిమురుచు, వాలుఁగన్నుఁ గ్రేవలకున్=నిడుదలైనకడగన్నులకు, ఉదధార=అనురాగాతిశయముచేఁ గలిగిన కన్నీటిదార, చేరన్=చేరుకొనఁగా, రాసుతున్ = రాజపుత్రుఁడైన స్వరోచిని, చూచెను

తా. ఒకభోగముది యావులింతరాఁగా నోటికడ్డముగాఁ బూచెండు పెట్టుకొని కన్నులకడ్డము పడుచున్న ముంగురులు చెవులప్రక్కల కెగసనఁద్రోయుచును జిలుకను జేతితో నిమురుచును గన్నుల నీళ్లు గ్రుక్కుకొనుచును జెలికత్తెబుజముపైకి నొఱగి నిలుచుండి రాజును జూచెను. (ఇందు దశ్రు పనుసాత్త్వికభావము సూచితము.)

చ. జిలుఁగులఁ బెట్టుచుం దొడలఁ జెంద్రికపావడ యంటమైతడిం
బెళపెళలేనిచీరఁ గటిఁ బింకపుఁజన్నులఁ జేర్చికొంచు వే
జలకము లాడియాడి యొకచాన కరస్థితకేశ యై నృపు
న్వెలువడి చూచె లోఁబడితి నీకని బాసకు నిల్చెనో యనన్. 68

అ. ఒకచాన=మఱియొకవనిత, జలకము లాడియాడి=స్నానములు చేసిచేసి, (ఇట బహువచన ద్విరుక్తు లాదరముచు దెలుపును.) జిలుఁగులన్=సన్ననిచిన్నవస్త్రములను, పెట్టుచున్ =తడియొత్తుటకు మేనిపైఁ బెట్టుకొనుచు, తొడలన్=తొడలమీఁద, చెంద్రికపావడ=చెంద్రకావిగాగర, అంటన్ = తడిచేత నంటుకొనఁగా, మైతడిన్=దేహమునందలి తడిచేత, పెళపెళలేనిచీరన్=తడసి పెళపెళధ్వని లేకుండెడి పైఁటకొకను, కటిన్=మొలను, బింకపుఁజన్నులన్=బిగువుగల పాలిండ్లమీఁదను, చేర్చికొంచున్=పొందించుకొనుచును, కరస్థితకేశయై=చేతనున్న తలవెండ్రుకలుగలదై- తడివెండ్రుకలను జేత మలఁచిపట్టుకొనియనుట, వెలువడి=బయటవచ్చి, నీకు, లోఁబడితిన్=వశమైతిని, అని, బాసకున్ = ప్రమాణముచేయుటకై, నిల్చెనోయనన్ = నిలిచినదోయేమో యనునట్లు (నిల్చి) నృపున్=రాజును, చూచెను

తా. ఒకస్త్రీ స్నానముచేయుచుండి రాజురాక విని సన్ననివస్త్రములచే దేహమునందలి తడి నొత్తియొత్తక యాతడిచేతఁ జెంద్రకావిపావడ తొడలయం దంటుకొనుచుండఁగా మొలనుగట్టుకొని యట్లే మేనితడిచేఁ దడిసినపయఁటచీరను బొమ్ములఁగప్పుకొని నీళ్లువడియుచున్న తలవెండ్రుకల నొకచేత మలఁచిపట్టుకొని వెలుపలికివచ్చి రాజును జూచెను. అట్లుచూచుట తన్నుఁ బరిగ్రహింపఁగోరి యోరాజా! నేను నీకు స్వాధీనురాలనైతినని ప్రమాణముచేసెనో యన్నట్లుండెను (లోకమునందు ఘోరప్రమాణములుచేయువారు తడితలతోను దడివస్త్రములతోను బ్రమాణమ్ముసేయుట సుప్రసిద్ధము) (ఇందు ఔత్సుక్యమనెడిసంచారిభావము సూచితము.) అలం ఉత్ప్రేక్ష.

మ. ఒకనేత్రాంబుజ మొక్కగల్ల మొకచన్నొయ్యారపుంలీల వీ
థికిఁ దోఁపం దలుపోరగా నొకపురంధ్రీరత్న మీక్షించె రా
జకిశోరంబుఁ దదీయలై వెలయుభాగ్యశ్రీలక్ష్ములం జూచి త్ర్యం
బకభాగంబు మొఱంగి మైత్రికి శివాభాగంబ యేతెంచె నాన్. 69

అ॥ ఒకపురంధ్రీరత్నము = శ్రేష్ఠురాలైనయొక యిల్లాలు, తదీయలై = రాజకుమారునివారలై - అతనికి వశ్యలై, వెలయుభాగ్యశ్రీలక్ష్ములన్ = ప్రకాశించునట్టి సరస్వతిని లక్ష్మిని - విద్యయు సంపదయు నతనిఁబొందియున్న వనుట, చూచి - తానుజూచినదై, మైత్రికిన్ = ఆలక్ష్మీసరస్వతులతోడి చెలిమికై, త్ర్యంబకభాగంబున్ = అర్ధదేహమైన శివునిభాగమును, మొఱంగి = వంచించి - దాఁచియనుట, శివాభాగంబ = తక్కినయర్ధదేహమైన పార్వతీభాగముమాత్రమే, ఏతెంచెనాన్ = రాజును జేరవచ్చెనో యనునట్లుగా, ఒకనేత్రాంబుజము = కమలమునుబోలినయొక కన్నును, ఒకగల్లము = ఒకచెంపయును, ఒకచన్ను = ఒకస్తనమును, ఒయ్యారపుంలీలన్ = విలాసగతితో, వీథికిన్ = ఇండ్లనడిమిమార్గమునకు - వెలుపలికనుట, తోఁపన్ = కనఁబడునట్లుగా, తలుపోరగాన్ = తలుపు ప్రక్కగా - తలుపు తనకుమఱుఁగుగా నుండునట్లు కొంచెము మూసి నిలిచి యనుట, రాజకిశోరంబున్ = రాజకుమారుని - స్వరోచిని, ఈక్షించెన్ = చూచెను.

తా॥ ఒకయిల్లాలు స్వరోచిని జూడఁగోరి సిగ్గుచేఁ దలవాకిటితలుపు నోరవాకిలిగా మూసి దాని మఱుఁగున నొకకన్నును నొకచెంపయు నొకస్తనమును బయటికిఁ దెలియునట్లు నిలిచిచూచెను. ఆచూచుట శంకరార్ధశరీరయైన పార్వతీదేవి తనచెలిమికి నైలయిన లక్ష్మీసరస్వతులు కలిమియు విద్యయునై యీరాజకుమారునికి వశ్యలైరిగనుక నేను వారితోఁ జేరి సుఖింపవలెఁ గాక యని శివునిభాగమయిన యర్ధదేహమును దాఁచి తనభాగమైన యర్ధదేహముతో వచ్చి సాక్షాత్కరించెనో యనునట్లుండెను. అలం॥ ఉత్ప్రేక్ష.

మ. కలయం గూర్మిఁ జెమర్చునంగములలగ్నంబై నసన్నంపుమం
జులకౌశేయమునందు మించుకమలస్తోమంబుచేఁ జూచె నొ
క్కలతాతన్వి చెలంగి పొంగుమదికాంక్షల్ గేర మేనెల్లఁ గ
న్నులు గావించి కుమారుజవ్వనముచెన్నుం జూచుచందంబునన్. 70

అ॥ ఒక్కలతాతన్వి = తీఁగవంటిదేహముగల యొక స్త్రీ, చెలంగి = ఉత్సహించి, పొంగుమదికాంక్షల్ - పొంగు = అతిశయించుచున్న (లేక) నిండిపొంగుచున్న, మదికాంక్షల్ = మనసులోనికోరికలు, గేరన్ = నెఱవేఱఁగా, మేనెల్లన్ = దేహమంతయు, కన్నులుగాన్ = కన్నులగునట్లుగా, కావించి = చేసికొని, చూచుచందంబునన్ = చూచుచున్నదో యనునట్లు, కుమారు...చెన్నున్ - కుమారు = రాజకుమారుఁడయిన స్వరోచియొక్క, జవ్వనముచెన్నున్ = యౌవనసౌందర్యమును, కూర్మిన్ = ప్రేమచేత, కలయన్ = అంతటను, చెమర్చునంగములన్ = చెమటపట్టినయవయవములందు, లగ్నంబు = అంటుకొన్నది, ఐన...నందున్ - ఐన = అయినట్టి, సన్నంపు = పలుచనైన, మంజుల = అందమైన, కౌశేయమునందున్ = పట్టుచీరయందు, మించుకమలస్తోమంబుచేన్ = ప్రకాశించునట్టి పద్మాకారపుబుట్టాలచాలుచేత, చూచెను.

తా. ఒకయువతి పెండ్లికొడుకును జూడవలె ననెడిమిక్కుటమైనతమకముచేత దేహమంతయుఁ గన్నులుగాఁ జేసికొని చూచుచున్నదో యనునట్లు 'తామరపూబుట్టాలపట్టుచీరఁ గట్టుకొని యది యెల్లయంగములందును జెమర్చిన దేహమునం దంటుకొనఁగా వచ్చి స్వరోచిని జూచెను అలం. పరిణామము, ఉత్ప్రేక్షయు (ఇందు స్వేదౌత్సుక్యము లనెడిసాత్త్వికభావములు సూచితములు).

వ. ఇత్తెఱంగునం గరంగునంతరంగంబులు గలకురంగాక్షులయపాంగంబులం దుఱంగలించుచుసితేతరతరళతరదృగ్రోచులసభంగశృంగారరసవీచులచాలునం బోలెం బొదువంబడి యాలంబితచీనాంబరప్రాలంబమాలికాచిత్రమ్ము లగునాతపత్రమ్ములు మెఱయఁ బత్రమ్ముల డిగ్గి దుర్గాధిపతు లేమేమ యని త్రోపుత్రోపు పాడుచు వీచువీచోపు లచ్ఛమ్ము లగుకౌముదీగుచ్ఛమ్ముల సంతరింప సంతికవైజయంతికలం గ్రాలు వలువలం బొలయుచిఱుగరువలిం దూలునీలాలకలయలక లుభయపార్శ్వసముత్తుంగమత్తమాతంగమదసౌరభసంగిభృంగసంఘంబుల నెలయింప నింపారుకలపంబు లబ్బాటునం బేటులెత్తి యొండొరులయొత్తడిం బొడిపొడియై యెగయు విస్ఫుమరపరాగపూగంబు చదలనెల్లెడ నుల్లెడ గట్టిన ట్టమర దట్టదట్టమ్ముగ సాగు నాగరులవాగారవమ్ములు నిగుడ నెడవడక పొగడుపొగడికలకలకలమ్ములును బుంఖానుపుంఖశంఖభేరీపటహకాహళవేణువీణాదివాదనధ్వానంబును గలమధురకిన్నరీనిక్వాణంబులరాణం ద్రాణఁజెఱుచువిన్నాణంపుఁగొల్పుటెలుంగులును వేల్పుగాణలు వాడులక్ష్మీనారాయణులకల్యాణంపుఁబాటలం దీటుకొనుతిప్పనిరవంబులుం గలసి బలసికొనుకోలాహలమ్ము లిమ్ముగ సందడుల నెడఁగిలుగం జడియువేత్రహస్తులప్రశస్తతరసాహోనినాదంబు సంబంధించి వెంపొలయ సత్యంతకాంతంబయి నిరంతరంగతిం గ్రంతనడవ నడదివియలై మకుటారవిందరాగంబులు వెలుంగ నలుగడల సామంతసందోహంబు క్రందుకొన మందమందగమనంబునం జనుబృందారకవేదండంబుపై నుద్దండతనుచ్ఛాయాకలాపంబు జంబేటిజంబాలకదంబకంబుడంబు విడంబింపఁ దిన్ననిరవంబునం గలసి బలసినకోలాహలంబు హంసాదివిహంగమహృదయంగమరావంబునఁ బెడంగుపడ నడచు క్రంత నత్యంతదర్శనీయంబులై మెఱయుమంగళద్రవ్యంబుల నెడనెడం గీండ్రించుపుండ్రేక్షుదండంబులకడలఁ గడలుకొనుపసరుటాకులడాలు శైవాలంబు నందంద క్రందుగా మందుచేదివియలు చెందొవలునుం గాఁ బార్శ్వద్వయసముత్తుంగమణిసౌధవీధికారోదోంతరాళంబున గంధగజఘటాఘనాఘనకాంతికి ధూళిమాగధప్రవాహంబునం గూలంకషం బగునృపతిపథయమునాహ్రదంబు గగనగంగావగాహనాభ్యాసంబున నిలుడుకొని పోవునదియునుం బోలెఁ దనరఁ దనసముద్దామతేజోభరంబునం జడిసినమేరుగిరిమోరులుం బోలెఁ దీరుగలభుజంబులం దాఱుమాఱుగా నిడినతారతారంపుఁబంచసరంబులు దోరంతరహారంబులుఁ గేయూరహీరరంబులుఁ గరకంకణకురువిందకందళంబులుఁ గటకనకమేఖలాఘటితంబగుచారు

కరాచరీమరీకతంపుఁబిడిమెఱుంగులుం దఱిసి వెన్నెలక్రొన్నురువుల బోరన న్నాగు నరపడుగుజిలుఁగుకంచుకంబున మించి వెలుపలం దోఁప మెఱచు గవిసినరోహణా మహీధరంబునుంబోలె రాజభవనాంగణంబు చేరవచ్చె నంత నక్కడ. 71

అ. ఇత్తెఱంగునన్ = ఈవిధముగా, కర్గగుసంతరంగంబులు=అనురాగమునొందిన మనస్సులు, కల...గంబులన్-కలసురంగాత్ములు=కలిగినట్టి స్త్రీలయొక్క, అపాంగంబులన్ = కడగన్నులయందు, తుఱంగలించు...గ్రోచులన్-తుఱంగలించు=ప్రకాశించుచున్న, సితేతర=నల్లని, తరళతర=మిక్కిలి చంచలములైన, దృగ్రోచులన్ = చూపువెలుఁగులచేత, అభంగ...బోలెన్-అభంగ=చెడని-తక్కువ కాని, శృంగారరస=శృంగారరసమనెడి జలప్రవాహమునందలి, వీచుల = అలలయొక్క, చాలనం బోలెన్=పంక్తిచేతవలె, పొదువంబడి = క్రమ్మఁబడి, (అలం. ఉత్ప్రేక్ష.) ఆలంబిత ..చిత్రమ్ములు - ఆలంబిత=పట్టఁబడిన, చీనాంబర=చీనదేశపుఁబట్టుగుడ్డతోఁ గట్టఁబడిన, ప్రాలంబ = బాగుగా వ్రేలు చున్న జాలరులయొక్క, మాలికా=వరుసలచేతను, చిత్రమ్ములు=వింతలుగొలుపునవి, అగునాతపత్రమ్ములు= అయినగొడుగులు, మెఱయన్ = ప్రకాశింపఁగా, పత్త్రమ్ములన్=వాహనములను, డిగ్గి=దిగి, (''పత్త్రం వాహనపక్షయోః'' అని యమరము )దుర్గాధిపతులు=చౌరరానికోటలుగలపట్టణముల నేలువారైన రాజు లు, ఏమేమ=మేమే మేమే, అని = (సేవచేయఁదగినవారము) అని, త్రోపుత్రోపాడుచున్ = ఒకరినొకరు తొలఁగద్రోసికొనుచు, వీచువీచోపులు=విసరునట్టి వింజామరలు-సీవిరులు, అచ్ఛమ్ములు= తెల్లగా వెలుఁగునవి, అగుకొమ్మదీగుచ్ఛమ్ములన్ = అగునట్టివెన్నెలగుత్తులను, సంతరింపన్ = కలుగఁజే యఁగా,(అలం. ఉపమ.) అంతికవైజయంతికలన్ = సమీపమునందున్న టెక్కెములయందు, క్రాలు వలువలన్=అల్లలాడుచున్న గుడ్డలవలన, పొలయుచిఱుగరువలిన్=వ్యాపించుచున్న కొంచెపుగాలిచేత, తూలు...కలు-తూలు=కదలుచున్న -అసియాడుచున్న, నీలాలకల=నల్లనిముంగురులుగల స్త్రీలయొక్క, అలకలు=పొడితలవెండ్రుకలు,ఉభయ ..సంఘంబులన్-ఉభయపార్శ్వ=ఇరుప్రక్కలనుండెడి, సముత్తుంగ=మిక్కిలియున్నతములయిన, మత్తమాతంగ=మదపుటేనుఁగులయొక్క, సౌరభ=మంచివాసన లకు, సంగి=చేరవచ్చుచున్న, భృంగసంఘంబులన్ = తుమ్మెదగుంపులను, ఎలయింపన్ = తమదగ్గఱ కురప్పింపఁగా-స్త్రీలముంగురులు ఏనుఁగులచెక్కిళ్లయందలి మదజలపరిమళమునకువచ్చియాపరించుచున్న తుమ్మెదలకుఁ దామును దుమ్మెదలే యనుభ్రమకల్పించి వానిఁ జేరఁదీయుచుండఁగా ననుట. (అలం. భ్రాంతిమంతము ) ఇంపారుకలపంబులు = ఇష్టమును బెంచునట్టి పరిమళవస్తువులు చేర్చిన గందపుఁ బూఁతలు, అబ్బాటునన్ =జనులచేరికవలననైన కాఁకచేత, పేటులెత్తి=ఎండి పెల్లలెగసి, ఒండొరుల యొత్తడిన్ =పరస్పరముగలుగు నొత్తిడిచేత, పొడిపొడియై = నలఁగి మిక్కిలిపొడియై, ఎగయు... పూగంబు-ఎగయు=ఎగురుచున్న, విసృమర=వ్యాపించుస్వభావముగల, పరాగపూగంబు=ధూళిరాశి, చదలన్ =ఆకాశమునందు, ఎల్లెడన్ =అంతటను, ఉల్లెడగట్టినట్లు = మేలుకట్లుకట్టినట్లు, అమరన్ = ఒప్పుఁగా, (అలం. అతిశయోక్తి.) దట్టదట్టమ్ముగన్ = మిక్కిలితఱుచుగా-త్రోపుత్రోపిళ్లతో ననుట, సాగునాగరులవాగారవమ్ములు=బారులుదీరివచ్చుచున్న పురజనులు మాటలమ్రోఁతలు, నిగుడన్ =అతిశ యింపఁగా, ఎడపడక=విరామములేక, పొగడు... బులును-పొగడు=స్తోత్రముచేయునట్టి, పొగడికల= స్తుతిపాఠకులపొగడ్తలయొక్క, కలకలమ్ములును=కోలాహలధ్వనులును, పుంఖా...ధ్వానంబును - పుం ఖానుపుంఖ=తరముల వెంబడి మ్రోఁగుచున్న, శంఖ=శంఖములు, భేరీ = పెద్దనగారాలు, పటహ=తప్పె ట్లు, కాహళ=తుతారలు, వేణు = పిల్లనఁగ్రోవులు, వీణా=వీణెలు, ఆది=మొదలుగాఁగల, వాదన=

వాద్యములువాయించునట్టి, ధ్వానంబును=ధ్వనియును, కల. రాణన్ - కల=అవ్యక్తమయిన, మధుర= చెవులకింపైన, కిన్నరీ=కిన్నెరలనెడి వీణలయొక్క, నిక్వాణంబుల=ధ్వనులయొక్క, రాణన్=మనోజ్ఞతను, త్రాణ. గిలన్ - త్రాణఁజెఱుచు=పటిమచేనణఁచునట్టి, విన్నాణంపుఁ గొల్పు టెలుంగులన్ = నేర్పుతోడిపాతకులు కొనుగోలుచేయు కంఠస్వరములును, వేల్పుగాణలు = అప్సరసలు, పాడు... పాటలన్ - పాడు=పాడుచున్న, లక్ష్మీనారాయణుల=లక్ష్మీవిష్ణువులయొక్క, కల్యాణంపుఁబాటలన్ = పెండ్లిపాటలచేత, దీటుకొనుతిన్ననిరవంబులన్=నిండుకొనుచున్న మెల్లనిధ్వనులును, కలసి=ఒకటిగాఁ గూడి, బలసికొనుకోలాహలమ్ములు = వ్యాపించుచున్నకలకలధ్వనులు, ఇమ్ముగన్=యుక్తముగా, సందణులన్ = సమ్మర్దములను-ఒరసికొనివచ్చుజనసమూహములను, ఎడగలుగన్=దూరముగా, జడియు... నినాదంబు - జడియు=తొలఁగఁద్రోయునట్టి, వేత్రహస్తుల=బెత్తాలవారియొక్క - బెత్తములుచేతఁ బట్టుకొని బరాబరులుచేయునట్టిబంట్లయొక్క, ప్రశస్తతర=మిగులశ్లాఘ్యములయిన, సాహోనినాదంబులన్ = ఎచ్చరికచేయుపలుకులధ్వనిని, సంబంధించి = కూడుకొని, పెంపు = అతిశయము (లేక) అభివృద్ధిని, ఒలయన్=పొందఁగా, అత్యంతకాంతంబై=మిగులమనోహరమయి, నిరంతరగతిన్=ఎడఁబాటులేనివిధమున, క్రంతనడవన్ = పెండ్లికొడుకువారు పెండ్లికూఁతునకుఁ బ్రధానశుభద్రవ్యములెత్తించుకొని పరిజనముతోనడవఁగా, నడ్డదివియలై=నడచునట్టిదివటీలై, మకుటారవిందరాగంబులు=కిరీటములయందలిపద్మరాగమణులు, నెలుంగన్=ప్రకాశించుచుండఁగా, నలుగడలన్ =నాలుగుప్రక్కలయందును, సామంతసందోహంబు=ఇరుగుపొరుగురాజులయొక్క సమూహము, క్రందుకొనన్=సందడింపఁగా, మందమందగమనంబునన్ = మెల్లమెల్లనినడకతో, చను...పై-చను=పోవునట్టి, బృందారకవేదండంబుపైన్ = దేవతలయేనుఁగయిన యైరావతముమీఁద, ఉద్దండ .కలాపంబు-ఉద్దండ=ఎక్కువైన,తనుచ్ఛాయా= దేహకాంతులయొక్క, కలాపంబు=సమూహము, జంబేటి .డంబున్ -జంబేటి = జంబూనదియొక్క, జంబాల=అడుసుయొక్క, కదంబకంబు=రాశియొక్క, డంబున్=విధమును, విడంబింపన్ =అనుకరింపఁగా-సరిపోలఁగా ననుట, తిన్ననిరవంబునన్=మృదుధ్వనితో, కలసి = కూడి, బలసినకోలాహలంబున్=ఆవరించుకొన్న కలకలధ్వనియును, హంసాది=హంసలుమొదలయిన, విహంగమ = పక్షులయొక్క, హృదయంగమ=మనోహరమయిన, రావంబును=ధ్వనియును, బెడంగుపడన్ = అందగించునట్లు, నడచుక్రంతన్ = నడచుచుండెడిప్రధానద్రవ్యము గొనిపోవువారి సమూహమునందు, (అలం. ఉపమ )అత్యంతదర్శనీయంబులై=మిక్కిలిచూడఁదగినవై - మిక్కిలిమనోహరములై, మెఱయు... బులన్ - మెఱయు=ప్రకాశించునట్టి, మంగళద్రవ్యంబులన్ =శుభవస్తువులయందు, ఎడనెడన్ =నడుమనడుమ, తీండ్రించు=వెలుఁగుచున్న, పుండ్రేక్షు=నామాలచెఱకులయొక్క, దండంబుల=గడలయొక్క, కడలన్ =కొనలయందు, కడ.. డాలు-కడలుకొను=అతిశయించుచున్న, పసరుటాకుల=పచ్చనియాకులయొక్క, డాలు=వెలుఁగు - కాంతి, శైవాలంబులు=నాఁచుతీఁగెలసమూహమును, అందందు=అక్కడక్కడ, క్రందుగాన్ =అధికముగా, మండుచేదివియలు= తేజరిల్లుచున్న చేదివటీలు, చెందొవల్లును= ఎఱ్ఱకలువలును, కాన్ = అగుచుండఁగా, పార్శ్వ బునన్ - పార్శ్వద్వయ = ఇరుప్రక్కలను, సముత్తుంగ=మిగులఁబొడుగులైన, మణిసౌధ=రత్నాలమేడలయొక్క, వీథికా=వాడలనడిమిత్రోవలనెడి, రోదోంతరాళంబునన్ = భూమ్యాకాశములమధ్యభాగమునందు, గంధ... బునన్ -గంధగజ= మదపు టేనుఁగులయొక్క, ఘటా = సమూహములనెడి, ఘనాఘన = వర్షాకాలమేఘములయొక్క, కాంతిక్ = కాంతివంటికాంతిగల, ధూళి = దుమ్ముతోడి-దుమ్ముగమ్మిన యనుట, మాగధ = మగధ

దేశపుగుజ్జుమామిడులయొక్క, ప్రవాహంబునన్ = ధార అనెడు వెల్లువచేత, కూలంకషంబు = దరులనొరయుచుండునది, అగు ... హ్రదంబు - అగు = అగుచున్న, నృపతిపథ = రాజమార్గమనెడి, యమునాహ్రదంబు = కాళిందీనదియందలిమడుఁగు, గగన. బునన్ - గగనగంగా = ఆకాశగంగయందు, అవగాహన = మునుఁగునట్టి, అభ్యాసంబునన్ = పరిచయముచేత, నిండుకొని = పూర్ణీభవించి, పోవునదియునుంబోలెన్ = ప్రవహించుచున్నదానివలె, తనరన్ = ఒప్పఁగా, (అలం రూపకము, ఉత్ప్రేక్షయు.) తన .. భరంబునన్ - తన = తనదైన - స్వరోచిదియనుట, సముద్దామ = అడ్డములేని, రేజోభరంబునన్ = కాంతివిశేషముయొక్క యతిశయముచేత, జడిసిన మేరుగిరిమోరులుంబోలెన్ = వెలిచిన మేరుపర్వతముయొక్క శిఖరములో యనునట్లు, తీవ = చక్కఁదనము, కలభుజంబులన్ = కలిగినబుజములయందు, తాలుమాలుగాన్ = వ్యత్యస్తముగా, ఇడిన . బులు - ఇడిన = పెట్టుకొన్న, తారలారంపు = ఫులుగడిగిన ముత్యాలయొక్క, పంచసరంబులున్ = ఐన్నసరములును - అయిదు పేటలహారములును, దోరంతరహారంబులున్ = బోమ్మనందలి రత్నాలపేరులును, కేయూరహారంబులున్ = బాహుపురులయందలి వజ్రమణులును, కరకంకణకురువిందకందళంబులున్ - కరకంకణ = ముంజేతికడియములయొక్క, కురువింద = కురువిందములనెడి కెంపులయొక్క, కందళంబులున్ = మొలకలును - తళతళ మెఱయు కురువిందపుఁగెంపులకాంతులనుట, కటి .. ఘటితంబు - కటి = మొలయందు, ఘటితంబు = కూర్పఁబడినది - ధరింపఁబడినది యనుట, అగుచేర . మెఱుఁగులున్ - అగు = అయిన, చేరు = మొలకట్టుసరముతోడి, కరాచురి = కత్తియొక్క, మరకతంపు = పచ్చలుచెక్కిన, పిడి = చేపట్టుకామయొక్క, మెఱుంగులును = కాంతులును, తిలకి = చేరి, వెన్నెలక్రొన్నురువులన్ = వెన్నెలయనుక్రొత్తగాఁ గలిగినమురుఁగును, బోరనన్ = శీఘ్రముగా - కనఁబడినప్పుడే యనుట, నగు . . బునన్ - నగు = పరిహసించునట్టి, అరపడుగు = అచ్చువెలితిగలపడుగుచేసి నేసిన, జిలుఁగు = సన్ననివస్త్రముతోఁగుట్టిన, కంచుకంబున్ = అంగీని, మించి = అతిక్రమించి, వెలుపలన్ = బయట, తోఁపన్ = కనఁబడఁగా - ఆభరణములరత్నకాంతులును మొలకట్టుసరముతోడి కత్తియొక్క తళతళయను కాంతులునుగూడి మేనఁదాల్చిన తెల్లపట్టుతోఁ గుట్టినయంగీయొక్క తెల్లఁదనమును మించి వెలుగుచుండఁగా ననియర్థము, మంచు = హిమము, కవిసిన .. బోలెన్ - కవిసిన = ఆవరించిన, రోహణమహీధరంబునుంబోలెన్ = రత్నపర్వతమువలెనే, రాజభవనాంగణంబు = రాజునగిరిముంగిటిని, చేరవచ్చెన్ = వగ్గఱవచ్చెను. అంతన్ = అప్పుడు, అక్కడన్ = ఆగంధర్వరాజగృహమునందు - పైపద్యముతోనన్వయము.—(అలం ముద్ర. ఉపమయు.)

క. కాంతాకదంబకిసలయ, కాంతకరావర్జ్యమానకనకఘటీని
ర్వాంతసుగంధిజలంబుల, నింతి జలకమాడి జిలుఁగు వలిపెఁ దడిసెత్తెన్. 72

అ. ఇంతి = గంధర్వరాజకూఁతురైన మనోరమ, కాంతా = ... బులన్ - కాంతా = పరిచారికలైన స్త్రీలయొక్క, కదంబ = సమూహముయొక్క, కిసలయ = చిగుళ్లవలె, కాంత = మనోహరములయిన, కర = చేతులచేత, ఆవర్జ్యమాన = చక్కఁగాఁబోయఁబడుచున్న, కనకఘటీ = బంగారుకుండలనుండి, నిర్వాంత = మిక్కిలి క్రక్కఁబడుచున్న - మిక్కిలిపడుచున్న, సుగంధి = మంచివాసనతోఁగూడిన, జలంబులన్ = నీళ్లచేత, జలకమాడి = స్నానముచేసి, జిలుఁగులు = సన్ననివస్త్రములు, ఇడి = పెట్టి, తడియొత్తెన్ = ఒడలితడితుడిచెను.—అనఁగా మనోరమపరిచారికలు బంగారుకుండలతోఁ దెచ్చి పోయఁగాఁ బన్నీట స్నానముచేసి సన్నని మృదువస్త్రములతో దేహమునడి తుడుచుకొనెను.

చ. తళుకుదుకూలశాటిఁ గటిఁ దాల్చి పటీర మలంది, హారకుం
డలమణిపారిహార్యరశనాకటకాంగుళిముద్రికాదిభూ
షలు తొడి పారిజాతవికసత్ప్రసవావళిఁ బూని యొయ్యన
న్వెలఁది వివాహవేది కలివేణులు తేఁ జనుదెంచె సిగ్గునన్. 73

అ. అవ్వెలఁది=ఆస్త్రీ-మనోరమ, తళుకుదుకూలశాటిన్ - తళుకు=సరిగపోఁగులచేఁ దళతళలాడుచున్న, దుకూల=చలువచేయుటచే దెల్లనైన, శాటిన్=పట్టుచీరను, కటిన్=నడుమునందు,(పిఱుఁదులందు అనుకొందము) తాల్చి=ధరించి, పటీరము=మంచిగంధము, అలంది=(శరీరమునందుఁ) బూసికొని, హార భూషలు-హార=ముత్యాలపేరులు, కుండల=కమ్మలు, మణి=రత్నములు చెక్కిన, పారిహార్య=నూడిగములు - మట్టిగాజులు, రశనా = పదియారుపేటలమొలనూలు, కటక = ముంజేతికడియములు, అంగుళిముద్రికా=వ్రేళ్లయుంగరాలు, ఆది = మొదలుగాఁగల, భూషలు=సొమ్ములు,తొడి = తొడిగి-ధరించి, పారి. వళిన్ -పారిజాత=కల్పవృక్షముయొక్క, వికసత్=పూచిన, ప్రసవ=పువ్వులయొక్క,ఆవళిన్= పంక్తిని-పారిజాతపుఁ బూదండలననుట, పూని = పెట్టుకొని, ఒయ్యన్=తిన్నగా, అలివేణులు=స్త్రీలు - ముత్తైదువలు, తేన్ = వెంటఁబెట్టుకొనిరాఁగా, వివాహవేదికిన్ = పెండ్లియరుఁగుమీఁదికి, సిగ్గునన్=లజ్జతో, చనుదెంచెన్ = వచ్చెను-మనోరమ తనకుఁదగినవస్త్రాభరణములను బుష్పచందనములను ధరించి ముత్తైదువలు వెంటఁబెట్టుకొనిరాఁగాఁ బెండ్లియరుఁగుమీఁదికి వచ్చెనని తాత్పర్యము అలం. స్వభావోక్తి.

తే. ఇట గృహద్వారసీమకు నేఁగుదెంచు, నాకుమారున కిందీవరాక్షుఁ డెదురు
సని మనుత్కారి డిగ్గి వందన మొనర్చు,నతనిదీవించి హితమంత్రియుతముగాఁగ.

అ. ఇటన్=ఇక్కడ-పెండ్లికొడుకునొద్ద ననుట, గృహద్వారసీమకున్=నగరివాకిటిప్రదేశమునకు, ఏఁగుదెంచునాకుమారునకున్ =వచ్చినయాపెండ్లికొడుకునకు, ఇందీవరాక్షుఁడు, ఎదురుసని=ఎదురేఁగుటలు చేసి, మనుత్కారిన్ = వేల్పుటేనుఁగును-ఐరావతమును, డిగ్గి=దిగి, వందనము=నమస్కారము, ఒనర్చునతనిన్=చేసినయాస్వరోచిని, దీవించి = ఆశీర్వదించి, హితమంత్రియుతముగాఁగన్=ఇష్టులతోను మంత్రులతోను గూడుకొనునట్టుగా-పైకినన్వయము.

వ. భూసురాశీర్వాదనాదంబులు రోదసి నిండ నభ్యంతరగృహంబునకుం దోడ్కొని పోవునప్పు డప్పుడమిఱేఁ డెడనెడం బుణ్యాంగన లొసంగునీరాజనోపచారమ్ము లాదరించుచుఁ గక్ష్యాంతరద్వారదేశంబుల మంగళార్థంబుగా నిడినపూర్ణకలశ ముకురాదిపదార్థంబులఁ గనుంగొనుచుఁ దోరణస్తంభాయమానరంభాతరుకిసలయోత్తాలతాళవృంతానిలంబులఁ గుంతలంబులు చలింపఁ మంథరగతిఁ గింపురుషవృషభుం డగుగంధర్వరాజప్రధానుం డొసంగు కైదండ గొని యల్లనల్లన నడచి పురోహితబ్రాహ్మణబంధుపురంధ్రీసందోహసీరంధ్రం బయి వైవాహికక్రియారంభసంభారసంభ్రమదంభాదిమరుద్రంభోరువుల కలికినునుసోగపలుకుల కలకలంబునం గొలగొల మనుకౌతుకాగారంబు సొత్తెంచి. 75

అ. భూసురాశీర్వాదనాదములు = బ్రాహ్మణుల దీవనలధ్వనులు, రోదసి = భూమ్యాకాశముల మధ్యభాగమంతయు,నిండఁ = నిండుకొనఁగా, అభ్యంతరగృహంబునకుఁ =నడిమియింటికి-నగరినడిమి కూటమునకు ననుట, తోడ్కొని= పిలుచుకొని, పోవునప్పుడు = పోవునట్టిసమయమునందు, అప్పుడమి ఱేఁడు=ఆభూపతి-స్వరోచి, ఎడనెడఁ = నడుమనడుమ, పుణ్యాంగనలు=ముత్తయిదువలు, ఒసంగు నీరాజనోపచారమ్ములు=ఇచ్చునట్టిమంగళారతిమర్యాదలను,ఆదరించుచుఁ =ఆదరణతో నంగీకరించుచు, కక్ష్యాంతరద్వారదేశంబులఁ =ఒక్కొక్కతొట్టికట్టుయొక్కయువాకిళ్లయందు,మంగళార్థంబుగాఁ = శుభనిమిత్తముగా-శుభసూచకముగాననుట, ఇడిన . పదార్థంబులఁ -ఇడిన=ఉంచినట్టి, పూర్ణకలశ= నీళ్లునింపి పూజించి యుంచినబంగారుకుండలు, ముకుర=అద్దములు,ఆది= మొదలయిన, పదార్థంబులఁ = వస్తువులను, కనుంగొనుచుఁ = చూచుచు, తోరణ ..నిలంబులఁ -తోరణ=గోపురద్వారములయొక్క, స్తంభాయమాన=కూచములవలె నాచరించుచున్న, రంభాతరు=అరఁటిమ్రాఁకులయొక్క, కిసలయ=మోవులనెడి - లేఁతయాకులనెడి, ఉత్తాల=ఉన్నతములయిన, తాళవృంత=విసనకఱ్ఱలవలని, అనిలంబులఁ = వాయువులచేత-గాలిచేత-అరఁటిచెట్లలేఁతయాకులు కదలుటచేఁగలిగినగాలిచేతననుట, కుంతలంబులు=తలవెండ్రుకలు, చలియింపఁ =కదలియాడఁగా,మంథరగతిఁ = మెల్లనినడకతో, కింపురుషవృషభుఁడు=కింపురుషులలో శ్రేష్ఠుఁడు, అగుగంధర్వరాజప్రధానుండు = అయినయిందీవరాక్షుని మంత్రి, ఒసంగు కైదండ=ఇచ్చునట్టిచేపట్టు, కొని=గ్రహించి-పట్టుకొని,అల్లనల్లనఁ = మెల్లమెల్లగా, నడచి, పురోహిత .నీరంధ్రంబై - పురోహిత=పురోధసుఁడు, బ్రాహ్మణ= విప్రులు, బంధు=చుట్టములు, పురంధ్రీ =ముత్తయిదువలు, సందోహ=వీరియొక్కసమూహముచేత, నీరంధ్రంబై= సందులేనిదై, వైవాహిక...కలకలంబునఁ -వైవాహిక = పెండ్లిసంబంధమైన, క్రియా=పనులయొక్క, ఆరంభ = మొదలుపెట్టునప్పుడుకావలసిన, సంభార=సమూహములను దెచ్చుటయందు, సంభ్రమత్ = తత్తఱపడుచున్న, రంభాది = రంభ మొదలయిన, మరుద్రంభోరువుల=దేవతాస్త్రీలయొక్క, కలికి=మనోహరములైన, నును=మృదువులైన, సోగ=తీఁగదీసిన ట్టిడ తెగని, పలుకుల=మాటలయొక్క, కలకలంబులఁ = కోలాహలధ్వనులచేత, గొలగొలమను-గొలగొలయనెడి యనుకరణముతో సందడించుచున్న, కౌతుకాగారంబు=పెండ్లిచవికను, చొత్తెంచి=ప్రవేశించి, -పైపద్యముతో నన్వయము.

చ. ప్రభలు నభోవిటంకమున కౌభానుమరీచులఁ బ్రోదిసేయఁ గౌ
స్తుభనిభనూత్నరత్నపరిశోభితమై గరుడాశ్మవేదిరు
గ్విభవము పొల్చుగుంజవికవిద్రుమపాదసువర్ణపీఠిపైఁ
బ్రభుత దలిర్ప మాము వసుకొపఁ వసియించె నుదంచితస్థితిన్. 76

అ. ప్రభలు=వెలుఁగులు, నభోవిటంకమున = ఆకాశముయొక్క ముందటిభాగమునందలి, భానుమరీచులకౌ =సూర్యకిరణములను, ప్రోదిసేయఁ = పోషింపఁగా-పెంపఁగాననుట, కౌస్తుభ... శోభితమై-కౌస్తుభ=(విష్ణునిదైన) కౌస్తుభమనుమణితో, నిభ=సమానమైన, నూత్న = క్రొత్తవైన, రత్న = రత్నములచేత, పరిశోభితమై= ఎల్లయెడలఁ బ్రకాశించునదియై, గరు ..వము-గరుడాశ్మ= గరుడపచ్చలతో నేర్పఱుపఁబడిన, వేది=అరుఁగుయొక్క,-రుగ్విభవము=ప్రకాశముకలిమి, పొల్చుగుంజవికఁ = ఒప్పుచున్న పెండ్లిచావడియందు, విద్రుమ పైఁ -విద్రుమ=పగడములచేఁ జేయఁబడిన, పాద=కోళ్లుగల, సువర్ణపీఠిపైఁ =బంగారుగద్దియమీఁద, ప్రభుత=ప్రభుత్వము, తలిర్పఁ =అతిశయిం

పంగా, మామ=మామయైన యిందీవరాక్షుఁడు, పనుపన్ = నియమింపఁగా, ఉదంచితస్థితిన్ = మిక్కిలి యొప్పిద మైనయునికతో, వసియించెన్ = కూర్చుండెను.

తా. ముందు చెప్పినచొప్పునఁ బెండ్లిచవికఁ బ్రవేశించి మేలైనరత్నకాంతులచేత వెలుఁగుచున్నయా పెండ్లిచవికయందుఁ బచ్చలు దాఁపిన మెట్లదియ్యరుఁగు వెంబడిఁ బగడపుఁగోళ్లువేసిన యెత్తు పీఁటమీఁద మామయయిన యిందీవరాక్షుఁడు కూర్చుండుమని చెప్పఁగాఁ గూర్చుండెను.

క. విధియుతముగ ఖచరుఁ డవ, న్యధినాథున కొసఁగెఁ బసిఁడిసోహరివాణమునన్
మధురమఖభుగ్గవీదధి, మధురససంపర్కమయిన మధుపర్కంబున్. 77

అ. ఖచరుఁడు=గంధర్వుఁడయిన యిందీవరాక్షుఁడు, అవన్యధినాథునకున్ = భూపతికి-స్వారోచికి, విధియుతముగన్ = శాస్త్రోక్తక్రమముతోఁ గూడుకొనునట్లుగా, పసిఁడిహరివాణమునన్ = బంగారుగిన్నెలో, మధుర సంపర్కము-మధుర=తియ్యనైన, మఖభుగ్గవీ=దేవతలయావుయొక్క-కామధేనువుయొక్క, దధి=పెరుఁగుతోడ, మధురస=తేనెయొక్క, సంపర్కము=కూడికగలది-కామధేనువు పెరుఁగును దేనెయుఁగలసినదియనుట, అయినమధుపర్కంబున్ =అయినట్టి పెరుఁగుపాలు తేనెమొదలగువానిఁగలిపినద్రవ్యమును, ఒసఁగెన్ = ఇచ్చెను -కన్యాదానకాలమునందుఁ బెండ్లికొడుకునకుఁ గన్యకతండ్రి పెరుగుఁ దేనె పాలు నెయ్యి యరఁటిపండు కలిపి పుచ్చుకొనుటకై యిచ్చుట మర్యాద గనుక నామర్యాద నడపెనని తెలియునది.

తే. అంచితాకృతి సాక్షాత్కరించినట్టి, రమకుఁ బ్రతివచ్చుసురమనోరమ మనోర
మ యనుదాని ననుంగుజామాతఁ గైట, భారి సరిగాఁగ నర్చించి ధారవోసె

అ. (ఇందీవరాక్షుఁడు) అనుంగుజామాతన్ = ముద్దులయల్లుని-స్వారోచిని, కైటభారిసరిగాఁగన్ =విష్ణునితోసమానముగా-విష్ణుదేవుని నర్చించురీతిగాననుట, అర్చించి=పూజించి, అంచితాకృతిన్ = ఒప్పిదమైనరూపముచేత, సాక్షాత్కరించినట్టిరమకున్ =ప్రత్యక్షమైన లక్ష్మీదేవితో, ప్రతి. . రమన్ - ప్రతివచ్చు=సరియగుచున్న, సుర=దేవతలయొక్క, మనోరమన్ =మనస్సులందు రమించుదానిని-దేవతలకుఁ బ్రియమైనదానిననుట, మనోరమయనుదానిన్ =మనోరమ యను పేరుగల తనకొమార్తను, ధారవోసెన్ = ధారాపూర్వకముగా దానముచేసెను -అనఁగా నిందీవరాక్షుఁడు "దాస్యామి విష్ణవే తుభ్యమ్-విష్ణువవైన నీకు నిచ్చుచున్నాను" అనువాక్యమును జెప్పి కన్యాదానము చేయువారు చేయుదురు గనుక, అల్లుని విష్ణువునుబూజించినట్లు పూజించి లక్ష్మీతుల్యురాలైన ముద్దులకూఁతును ధారాపూర్వకముగా దానము చేసెననుట. అలం. ఉపమ.

క. తదనంతరంబ హర్షము, పొదలుమదిన్ మెట్టుఁబ్రాలపుట్టికలయెడం
గదియఁబట్టిన పెందెరఁ, గదియించిరి బంధుజనులు కన్యావరులన్. 79

అ. తదనంతరంబ=కన్యాదానముచేసినతోడనే, బంధుజనులు=చుట్టములు, హర్షము=సంతోషము, పొదలుమదిన్ = పెరుఁగుచున్నమనసుతో-మనసున సంతోషించియనుట, మెట్టుఁబ్రాలపుట్టికలయెడన్ =వధూవరులముందరరాశిగాఁ బెద్దలు పోయఁదగిన దీవనప్రాలగంపలున్నచోట, కదియంబట్టినపెందెరన్ = చేరఁబట్టినపెద్దతెరచీరను, కన్యావరులన్ = పెండ్లికూఁతును బెండ్లికొడుకును, కదియించిరి=దగ్గఱునట్లుచేసిరి -కన్యాదానముచేసి కాఁగానే పెండ్లిపెద్దలయిన చుట్టములు పెండ్లికూఁతును బెండ్లికొడుకును సేసఁబ్రాలగంపలవెంబడి కట్టఁబడినతెరదగ్గఱఁ జేర్చిరనుట.

ఉ. అప్పుడు తూర్యముల్ మొరయ నమ్మిథునమ్ము విలోకనస్పృహం
దెప్పలఁదేల వంపఁబడు తెల్లనిచీర తెరం గ్రమంబునం
గొప్పు మొగంబు నఱ్ఱు జనుఁగొండలుఁ దోఁప లతాంగి పోలెఁ జె
ల్వుప్పతిలన్ సుధారసపయోనిధి పెద్దెరఁ బుట్టునిందిరన్. 80

అ. అప్పుడు=ఆసమయమునందు, తూర్యముల్=వాద్యములు, మొరయన్=మ్రోయఁగా=ధ్వనింపఁగా, అమ్మిథునమ్ము=ఆవధూవరులు-పెండ్లికూఁతురు పెండ్లికొడుకును, విలోకనస్పృహన్=ఒకరి నొకరు చూచుకోరికయందు, తెప్పలఁదేలన్=తేలియాడుచుండఁగా-మిక్కిలి యిచ్ఛగలవారైయుండఁగా, వంప.. తెరన్-వంపఁబడు=క్రిందికిదింపఁబడుచున్న, తెల్లనిచీర తెరన్=తెల్లనిదైన తెరచీర యందు, క్రమంబునన్=వరుసవెంబడిని, కొప్పును, మొగంబున్=ముఖమును, అఱ్ఱున్=మెడయును, చనుఁగొండలున్=కొండలవలె నున్నతములైన స్తనములును, తోఁపన్=కనఁబడఁగా, లతాంగి=పెండ్లి కూఁతురైన మనోరమ, చెల్వు=చక్కఁదనము, ఉప్పతిలన్=కలుగునట్లు, సుధా... పెంద్దెరన్-సుధారసపయోనిధి=పాలసముద్రముయొక్క, పెంద్దెరన్=పెద్దయలయందు, పుట్టునిందిరన్=పుట్టుచున్న లక్ష్మీదేవిని, పోలెన్=పోలియుండెను

తా. ఆసమయమునందు భేరులు మొదలగు మంగళవాద్యములు మ్రోఁగుచుండఁగాఁ బెండ్లికొమార్తెకుఁ బెండ్లికొమారునికి నడుమఁ బట్టఁబడియున్న తెల్లనితెరచీరను ముత్తయిదువలు కొంచెముకొంచెముగా దిగువకు దించిరి. అట్లు దించునప్పుడు తెరమఱుఁగుననుండి క్రమముగా మనోరమయొక్క కొప్పు ముఖము మెడస్తనములును గనఁబడెను. అట్లు కనఁబడుటచేత నా పెండ్లికూఁతురు పాలసముద్రము యొక్క పెద్దయలవలనఁ బుట్టుచున్న లక్ష్మీదేవిని బోలియుండెను అలం. ఉపమ.

చ. కటకరవంబు బోరుకలఁగన్ రమణుల్ తెరచీర వంచినం
దటుకున రాజుమోమెదుటఁ దారసమైన లతాంగినేత్రముల్
చటులత లజ్జఁ దల్లడిలె జాలరిచేవలఁ బాసి ధాత్రిపై
నటునిటు మిట్టిమిట్టి పడుమీనంబుచరంబులుఁబోలె నత్తఱిన్. 81

అ. అత్తఱిన్=ఆసమయమునందు, కటకరవంబు=కంకణధ్వని, బోరుకలఁగన్=గల్లునమ్రోయఁగా, రమణుల్=స్త్రీలు, తెరచీర=తెరగుడ్డను, వంచినన్=క్రిందికిదింపఁగా, తటుకునన్=తటాలున, రాజుమోము=రాజైనస్వరోచిముఖము, ఎదుటన్=ఎదుటితట్టు, దారసమైనన్=సమీపింపఁగా, లతాంగినేత్రముల్=తీఁగవంటిదేహముగలదైన మనోరమకన్నులు, చటులతన్=చంచలత్వముచేతను, లజ్జన్=సిగ్గుచేతను, జాలరిచేవలన్=చెంబడివానిచేతివలనుండి, పాసి=తొలఁగి-తీసిక్రిందవేయఁబడి, ధాత్రిపైన్=భూమిమీఁద, అటునిటున్=అత్తట్టునీతట్టును, మిట్టిమిట్టి=ఎగిరియెగిరి, పడుమీనంబుచరంబులుఁబోలెన్=పడునట్టిచేఁపలవలెనే, తల్లడిలెన్=చలించెను

తా. స్త్రీలు వధూవరులనడుమఁ బట్టినతెరగుడ్డను దించునప్పుడు పెండ్లికొడుకు మొగము పెండ్లికూఁతునకు దగ్గఱఁ గానవచ్చెను. అంతటఁ బెండ్లికూఁతురు బెదరుచూపులతోఁ జూచెను అలం ఉపమ.

మ. అవనీశత్రిదశేంద్రుమాపుబరికన్యాగండపాళిద్వయీ
నవలావణ్యరసంబుఁ గొల్లగొని యంతంతం జెంత ఫాలంపురా

జు విలోకించి చలించి కైకొనినయాసొమ్మెల్ల ఘర్మాంబుకై
తవ నొప్పన్ వెస డించి తూఱెఁ గబరీతాపింఛకుంజాంతమున్. 82

అ. అవ .. బరి-అవనీశత్రిదశేంద్రు=రాజదేవేంద్రునియొక్క-స్వరోచియొక్క, చూపు=దృష్టి యనెడి, బరి=దొంగ, కన్యా.. రసంబున్-కన్యా=పెండ్లికూఁతుయొక్క, గండపాళిద్వయీ=చెక్కిటిప్రదేశములజంటయొక్క, నవ=క్రొత్తయయిన, లావణ్యరసంబున్=ముత్తెపునీటివలెఁ దళతళలాడెడి కాంతివిశేషమును, కొల్లగొని=దోఁచుకొనిపోయి, అంతన్ = (అట్లుదోఁచుకొనిపోవు) నప్పుడు, చెంతన్=సమీపప్రదేశమునందు, ఫాలంపురాజున్=అర్ధచంద్రునివంటి నొసలనెడిరాజును, విలోకించి=చూచి, చలించి=దిగులుచేతవణఁకి, కైకొనినయాసొమ్మెల్లన్=తా నపహరించినలావణ్యరస మనెడిధనము నెల్లను, ఘర్మాంబుకైతవము=చెమటనీరనెడి నెపము, ఒప్పన్ = పొందుపడఁగా, వెసన్ = శీఘ్రముగా, డించి=దిగవిడిచి, కబరీ...తమున్-కబరీ = కొప్పనెడి, తాపింఛ= చీఁకటిచెట్లయొక్క, కుంజాంతమున్=పొదరింటిలోపలను, తూఱెన్=చొచ్చెను

తా. రాజశ్రేష్ఠుఁడయిన స్వరోచియొక్క చూపనెడి దొంగ చెక్కిళ్లకాంతియనెడి ధనమును దొంగిలి వెంటనే నొసలనెడి రాజునుజూచి వెఱచివణఁకుచుఁ జెమటయనెడిమిషచేఁ దానుదొంగలించిన ధనమును జాఱవిడిచి కొప్పనెడి చీఁకటిమ్రానిపొదరింటిలో దాఁగె నని తాత్పర్యము. రాజు చెక్కిళ్లను దొలుతఁజూచి క్రమముగా నావలనొసటిని గొప్పనుజూచెనని భావము. (ఇందు చక్షుఃప్రీతియనెడిమన్మథావస్థయు, స్వేదమనెడి సాత్త్వికభావమును రాజునందుఁ దెలుపనయ్యెను.) అలం. రూపకము, అపహ్నుతియు

ఆ. రాజుచూడ్కి కపుడు రాజీవముఖిచూడ్కు, లెదురుకొనియె లజ్జఁ గొదికి కొదికి
జడిసి జడిసి జహ్నుసంభవాంభోవేణి, కెదురులెక్కు మీలకొదమ లనఁగ. 83

అ. అపుడు=ఆసమయమునందు, రాజుచూడ్కికిన్=రాజైనస్వరోచిచూపునకు, రాజీవముఖిచూడ్కులు=చేఁపలవంటికన్నులుగలదైన మనోరమచూపులు, లజ్జన్=సిగ్గుచేత, కొదికి కొదికి=జంకి జంకి, జడిసి జడిసి=చలించిచలించి, జహ్నుసంభవాంభోవేణికిన్=గంగానదీప్రవాహమునకు, ఎదురు...కొదమలు - ఎదురులెక్కు=ఎదురీఁదుకొనిపోవునట్టి, మీలకొదమలు = చేఁపపిల్లలలోయేమో, అనన్=అనునట్లు, ఎదురుకొనియెన్=ఎదుర్కొలుగాఁబోయెను.

తా. అపుడు పెండ్లికొడుకు పెండ్లికూఁతును జూడఁగాఁ బెండ్లికూఁతురు పెండ్లికొడుకును గాఁడఁగా నాయిరువురిచూపులు నొకటికొకటి యెదుర్కొలు చేసినట్లుండెను అలం. ఉత్ప్రేక్ష.

మ. తనుమధ్యా త్రివళుల్ నటింప నిలమీఁదన్ మట్టియల్ మ్రోవఁగాఁ
గనుపాపల్ పయిఱెప్పలం గదియ నుత్కంఠాగ్రయై నిక్కి నా
ఘనిమాళిం దలఁబ్రాలు వ్రాసె నవలా దోర్మూలకూలంకష
స్తనవిస్ఫూర్తికి సందివంశలధళల్ నాహాసినాదం బిడన్. 84

అ. తనుమధ్యాత్రివళుల్ = సన్ననినడుమును గడుపుమీఁదిమూఁడుముడుఁతలును, నటింపన్=కదలియాడఁగా, ఇలమీఁదన్ = భూమిపైని, మట్టియల్ = కాలిమెట్టెలు, మ్రోవఁగాన్ = ఆనఁగా, కనుపాపల్ = కంటినల్లగ్రుడ్లలోనిప్రతిరూపములు, పయిఱెప్పలన్ = మీఁదిఱెప్పలను,

కదియన్ = చేరుకొనఁగా, ఉత్కంఠాగ్రమై = ఎత్తఁబడినకుతుకకొనగలదై, నిక్కి = పైకినిగిడి, దోర్మూల... ద్రికిన్ - దోర్మూల=చంకలయొక్క, కూలంకష = ప్రక్కలనొరయుచున్న, స్తన = పాలిండ్లయొక్క, విస్ఫూర్తికిన్ =విశేషమయినప్రకాశమునకు, సందిదండలధళల్ = సందిదండలయొక్క ధళధళ యనెడి కాంతులు, సాహానినాదంబ్బిడన్=పరాకు తెలిపెడి ధ్వనినిగలుగఁజేయఁగా, నవలా= వనిత-మనోరమ, నాథునిమౌళిన్ = పెనిమిటియైన స్వరోచితలయందు, తలఁబ్రాలు=తలమీఁదఁబో యఁదగిన సేసలను, బోసెను.-అనఁగా మనోరమ యొయ్యారముతో నిక్కి మగనితలపై సేసలు దిగఁ బోసె ననుట. అలం. స్వభావోక్తి.

చ. ముడివడుకంకణప్రభల మౌక్తిక సేసలు దోయిలించి యె
త్తెడుతఱి బాహుమూలకుచదీప్తులపైఁ బతిదృష్టి పర్వినం
బొడమినలజ్జఁ బాణియుగళంబున వేస వంచియ మౌళిమీఁదికై
పొడువునఁ జల్లె లేనగవు పొల్పుక తెప్పల నప్పళించుచున్. 85

అ. ముడి...భలన్ - ముడివడు=పెనఁగొనుచున్న, కంకణ = ముంజేతికడియములయొక్క, ప్రభలన్=కాంతులతో, ముత్తెపుసేసలు=ముత్యాలతలఁబ్రాలు, దోయిలించి=దోసిటఁబట్టి, ఎత్తెడు తఱిన్ = పైకెత్తునపుడు, బాహుమూలకుచదీప్తులపైన్ = చంకలయొక్కయు స్తనములయొక్కయు కాంతులమీఁద, పతిదృష్టి=పెనిమిటియొక్కచూపు, పర్వినన్ =వ్యాపింపఁగా, పొడమినలజ్జన్ = కలిగినసిగ్గుచేత, పాణియుగళంబున్ =రెండుచేతులను, వేసన్ =శీఘ్రముగా, వంచియ = క్రిందికివంచియే, లేనగవు=చిఱునవ్వును, తెప్పలన్ =కనుఱెప్పలచేత, అప్పళించుచున్ = కప్పుచు, మౌళిమీఁదికై = ప్రియునితలమీఁదికిట్టునకు, పొడువునఁజల్లెన్ =ఎగఁజల్లెను

తా. అప్పుడు మనోరమ తలఁబ్రాలుపోయుటకై సేసలు దోసిటఁబట్టి పైకెత్తఁబోఁగాఁ బ్రియుఁడు చంకలకాంతులమీఁదను స్తనములమీఁదను దృష్టిపఱపెను. అది తెల్సి యామె చేతులు పైకెత్తకయే భర్తతలపైఁబడునట్లు సేస లెగజల్లెను (ఇం దవహిత్థము సూచితము.)

క. సకలక్ష్మాపతి యిడఁ గొ, ప్పకచంబులనుండి రాలె మౌక్తికములు సా
త్త్వికజనితగండఘర్మాంబుకదంబాసారగరిమఁ బునరుక్తములై. 86

అ. సకలక్ష్మాపతి=చక్రవర్తియయినస్వరోచి, ఇడన్ =తలఁబ్రాలుపోయఁగా, కొప్పకచంబుల నుండి=మనోరమ తలవెండ్రుకలయందుండి, మౌక్తికములు=ముత్యాలు, సాత్త్విక...గరిమన్ -సాత్త్విక= సాత్త్వికభావమువలనఁబుట్టిన, (సత్త్వము=మనోవృత్తి-దానివలనఁ బుట్టినది సాత్త్వికము, సాత్త్వికముయొక్క స్వభావము సాత్త్వికభావము.) గండ=చెక్కిళ్లయందలి, ఘర్మాంబు=చెమటనీటియొక్క, కదంబ= సమూహముయొక్క, ఆసార=ఎడతెగక కురియునట్టివానయొక్క,గరిమన్ = గౌరవముచేత-ఆధిక్యము చేత, పునరుక్తములై=ఇబ్బడించినవై, రాలెన్ =జలజలరాలెను

తా. పెండ్లికొడుకైన స్వరోచి తలఁబ్రాలుపోయఁగా మనోరమదేహమునందుఁ జెమటపట్టి యా చెమటబిందువులును దలఁబ్రాలముత్యములును జేరి యిబ్బడియై మబ్బును బోలిన తలవెండ్రుకలనుండి యెడతెగనివాన కురిసినట్టు జలజలరాలెను అలం ఉపమ.

క. పతి సతిపై నిడుముక్తా, వితతి పడం దొడఁగె వడి భవిష్యత్పురుషా
యితనిర్దయరతిరభస, చ్యుతసితకబరీప్రసూనసూచక మగుచున్. 87

అ. పతి=భర్తయయినస్వరోచి, సతిపైన్=భార్యయైనమనోరమమీఁద, ఇడుముక్తావితతి=పోయునట్టి సేసముత్యాలసమూహము, భవిష్య...మగుచున్ - భవిష్యత్=మీఁదటికాలమునందలి, పురుషాయితి=పురుషునివలె నాచరించునట్టి, నిర్దయ=దయమాలిన, రతి=సంభోగముయొక్క - గాఢమయిన యుపరతియొక్క యనుట, రభస=వేగముచేత, చ్యుత=రాలునట్టి, సిత = తెల్లని, కబరీప్రసూన=కొప్పునందలి పువ్వులను, సూచకము= సూచించునది-ఇట్లు రాలునని తెలుపునది, అగుచున్ = అవుచును, వడిన్=వేగముతో, పడఁదొడఁగెన్=రాల నారంభించెను

తా. ఆసమయమునందు స్వరోచి తలఁబ్రాలు పోయఁగా నాతలఁబ్రాలముత్యములు మనోరమతలపైనుండి రాలుట యిఁకమీఁద నామె చేయఁబోవుగాఢోపరతి కాలమునందుఁ గొప్పునందుండి రాలెడి తెల్లనిపువ్వు లిట్లే రాలునని సూచించున ట్లుండెను అలం. ఉత్ప్రేక్ష.

శా. కట్టెన్ మంగళసూత్రమున్ శరధిశంఖశ్రీలకున్ బొమ్మలం
గట్టం జాలెడుకంఠపీఠి నిఖిలక్ష్మాభర్త శోణద్యుతుల్
దట్టంబై నఖకోరకోత్కరము తద్గ్రైవేయహైమస్ఫుర
త్పట్టస్థాపితపద్మరాగములపంతంబుల్ విడంబింపఁగాన్. 88

అ. నిఖిలక్ష్మాభర్త=సార్వభౌముఁడయినస్వరోచి, శోణద్యుతులు=ఎఱ్ఱని కాంతులు, దట్టంబై=తఱుచై, నఖకోరకోత్కరము = గోళ్లనెడి మొగ్గలయొక్క సమూహము, తద్గ్రైవేయ .పంతంబుల్ - తత్=ఆమనోరమయొక్క, గ్రైవేయ=కంఠాభరణమైన, హైమ=బంగారుదైన, స్ఫురత్ = వెలుఁగుచున్న, పట్ట=పట్టెడయందు, స్థాపిత=పొదుఁగఁబడిన, పద్మరాగముల=కెంపులయొక్క, పంతంబుల్=వెలుఁగులయాధిక్యరీతులను, విడంబింపఁగాన్=వంచింపఁగా-మీఱఁగాననుట, (మహాపురుషుల గోళ్లెఱ్ఱగానుండునని సాముద్రికశాస్త్రమునందుఁ జెప్పఁబడియున్నదిగనుక స్వరోచిగోళ్లెఱ్ఱగానుండెనని యెఱుంగునది.) శరధిశంఖశ్రీలకున్=సముద్రమునందలి శంఖములయొక్క సౌందర్యసంపదలకు, బొమ్మలంగట్టన్ = జయించి వానిరూపములు చెక్కినగండపెండేరములఁ దాల్పను, చాలెడుకంఠపీఠిన్=చాలినట్టిమనోరమకంఠప్రదేశమునందు, మంగళసూత్రమున్=తాలిబొట్టును, కట్టెన్=కట్టినవాఁడాయెను.

తా. అనంతరము స్వరోచి పద్మరాగములవలెఁ జేతివ్రేళ్లగోళ్లు రక్తకాంతితో వెలుఁగుచుండఁగా, దక్షిణావర్త శంఖములనుమించి వట్రువయై యొప్పుచున్న మనోరమమెడను దాలిబొట్టు కట్టెను. అలం. ఉపమ

క. అట్టియెడఁ బెండ్లిపనులన్, దిట్టలగుపురంధ్రు లచటన్ నిలిపిరి వహ్నిం
బెట్టిరి మణిపీఠి సురీ, పట్టము పైఁ బఱచి రందున్ బతియును సతియున్. 89

అ. అట్టియెడన్ = ఆబొట్టుగట్టిన సమయమునందు, పెండ్లిపనులన్ = పెండ్లిపనులయందు, దిట్టలు=నేర్పరులు, అగుపురంధ్రులు=అయినట్టిముత్తయిదువలు, అచటన్ = ఆపెండ్లియరుఁగునొద్ద, వహ్నిన్= (హోమమునకొఱకైన) యగ్నిని, నిలిపిరి=తెచ్చియుంచిరి, మణిపీఠిన్=రత్నములుపొదిఁగిన పెండ్లిపీఁటను, పెట్టిరి=తెచ్చివేసిరి, పైన్=ఆపెండ్లిపీఁటమీఁద, సురీపట్టము = సురీదేశమునఁబట్టుపచ్చడము-సూరత్తుపట్టుతాపితాననుట, పఱచిరి=పఱపుగాఁ గప్పిరి, అందున్=అట్టి పట్టుతాపితాకప్పిన పెండ్లిపీఁటయందు, పతియున్ = రాజైన స్వరోచియును, సతియున్=రాణియైన మనోరమయును, (కూర్చుండిరి) - పైపద్యముతో నన్వయము

తా. మాంగల్యధారణ మైనపిమ్మట యుత్తయిదువలు పెండ్లిపరుఁగుమీఁదఁ బెండ్లిపీఁటవేసి దానిపైనూరత్తుపట్టుతాపితా పఱచి దానికెదుట హోమార్థముగా నగ్ని తెచ్చి పెట్టఁగా వధూవరులా పెండ్లిపీఁటపైఁ గూర్చుండిరి.

క. ఆశుద్విజహుతహరితశ, మీశాఖాశకలనినదమేదురవిశదా
భీశుజ్వాలాజాలహు, తాశక్రోడమున వేల్చి రాహుతు లెలమిన్. 90

అ. ఆశు . క్రోడమునన్ - ఆశు=త్వరితముగా, ద్విజ= బ్రాహ్మణులచేత, హుత=హోమముచేయఁబడిన, హరిత=పచ్చని, శమీశాఖాశకల=జమ్మిపుడక సమిధలయొక్క, నినద=చిటచిటధ్వనులతోడ, మేదుర=దట్టమైన, విశద = స్వచ్ఛమైన, అభీశు=ప్రకాశముగల, జ్వాలా=మంటలయొక్క, జాల=సమూహముగల, హుతాశ=అగ్నియొక్క, క్రోడమునన్=నడుమ, ఎలమిన్=సంతోషముతో, ఆహుతులు = వేల్వఁదగిన నేయి మొదలగు ద్రవ్యములను, వేల్చిరి = (వేసి) హోమముఁజేసిరి.

తే. తోయజామోదలాజలు దోయిలించి, ప్రమదమున వేల్వ నొకకొన్ని చెమటనంట
వ్రేళ్లు గనుపట్టెఁ గెంజాయ వీతిహోత్రు, నాలుకలు సాటిరాకున్న నవ్వెననఁగ.

అ. తోయజామోద = కమలములవాసనవంటి దేహవాసనగల మనోరమ, లాజలు = పేలాలు, దోయిలించి= దోసిటఁబట్టి, ప్రమదమునన్=సంతోషముతో, వేల్వన్=హోమముఁజేయఁగా, ఒకకొన్ని=ఆపేలాలలోఁగొన్ని, చెమటన్ = చెమటచేత, అంటన్ = (వ్రేళ్లలో) అంటుకొనఁగా, వ్రేళ్లు= ఆవ్రేళ్లు, కెంజాయన్=ఎఱ్ఱనిచాయచేత, వీతిహోత్రునాలుకలు=అగ్నిజిహ్వలు-నిప్పుమంటలు, సాటిరాకున్నన్=తమసరిపోలఁజాలకుండఁగా, నవ్వెన్=ఆయగ్నిజ్వాలలను బరిహసించెను, అనఁగన్=అనునట్టుగా, కనుపట్టెన్=కనఁబడెను.

తా. లాజహోమము చేయునప్పుడు పెండ్లికూఁతురైన మనోరమ దోసిటఁబట్టిన కొన్ని పేలాలు వ్రేళ్లనంటుకొనఁగా నా పేలాలతెల్లనికాంతిచేత నగ్నిజ్వాల లెఱుపునఁ దమ్ముఁబోలవని యావ్రేళ్లు నవ్వి పరిహాసము చేయుచున్నవో యనునట్లుండెను (పేలాలకును నవ్వునకును ధవళకాంతిసాధర్మ్యము గ్రహింపవలయును) అలం ఉత్ప్రేక్ష

తే. స్తనగుళుచ్ఛవధూదేహదాడిమీల, తాంతతల్లికపై హోమధూమ మడరె
భర్తకభిమతరతిమహాఫలవిపాక, మగుటఁ గోరి ఘటించుదోహద మనంగ. 92

అ. స్తన...పై- స్తన = చన్నులనెడి, గుళుచ్ఛ = పూఁగుత్తులతోడి, వధూ = పెండ్లికూఁతురు యొక్క, దేహ = శరీరమనెడి, దాడిమీ = దానిమ్మచెట్టుయొక్క, లతాంతతల్లికపైన్ = శ్రేష్ఠమైన కొమ్మమీఁద, హోమధూమము = హోమముయొక్కపొగ, భర్తకున్ = పెనిమిటికి, అభిమత=అభీష్టమైన, రతి = సంభోగమనెడి, మహాఫల = ఘనమైన ప్రయోజనరూపమైన పండు, విపాకము = విశేషపక్వమగుటను-చక్కఁగాఁబండుటను, కోరి = అపేక్షించి, ఘటించుదోహదము = పొందించునట్టి దోహదక్రియయో, అనంగన్ = అనునట్లు, అడరెన్ = వ్యాపించెను. (దోహదము అనఁగా వృక్షములు తీఁగెలు మొదలగువానియందుఁబువ్వులులోనగునవి కలుగుటకై యుపయోగించు ద్రవ్యము-లేక - చేయునట్టిక్రియ, "ధూమస్సర్వార్తుదాడిమీ" అని ఫలదోహదప్రకరణమునందుఁ జెప్పఁబడినప్రమాణ మిచట గ్రాహ్యము.)

తా. హోమసమయమునందుఁ జూచినదానిమ్మకొమ్మవలె నున్న మనోరమదేహముపై వ్యాపించిన పొగ యాదానిమ్మకొమ్మయందు శీఘ్రముగా రతిరూపఫలముఫలించి పక్వమగుటకై చేయునట్టి దోహదక్రియయో యనునట్లుండెను అలం. రూపకము, ఉత్ప్రేక్షయు.

మ. జగతీనాథవతంస మానతశిరస్సమ్మేళనన్ నెయ్యపుం
జగడంబుల్ ప్రియ మొప్ప మాన్పెడుతఱిం జంచత్కిరీటాగ్రర
త్నగణస్పర్శసహంబు గానలసియో నాఁ గోర్కి దైవాఱ న
మ్మగువం బాదతలంబు వట్టి సనెకల్ మట్టించె మోదంబునన్. 93

అ. జగతీనాథవతంసము=రాజశ్రేష్ఠుఁడు - స్వరోచి, ఆనత . శిరస్ - ఆనత = వంపఁబడిన, శిరస్ = తలయొక్క, సమ్మేళనన్ = చేరికతో, నెయ్యపుంజగడంబులు = (ఇఁకమీఁద) కలుగఁబోవు ప్రణయ కలహములు, ప్రియము = ప్రేమ, ఒప్పన్ = ఒప్పుచుండఁగా, మాన్పెడుతఱిన్ = దీర్చునట్టి సమయమునందు, చంచ సహంబు - చంచత్ = ప్రకాశించుచున్న, కిరీటాగ్ర = కిరీటము చివరయందలి, రత్నగణ = మణిసమూహముయొక్క, స్పర్శ = తాఁకుడును, సహంబు = ఓర్చుట, కావలసియో = కావలయుట నపేక్షించియో, నాన్ = అనునట్లు, కోర్కి = తనయొక్క కోరిక, దైవాఱన్ = అతిశయింపఁగా, మోదంబునన్ = సంతోషముతో, అమ్మగువన్ = పెండ్లికూఁతురైన యామనోరమను, పాదతలంబు = అఱకాలు, పట్టి=పట్టుకొని, సనెకల్ = సన్నెఱాతిని - నూఱుడుబండను, మట్టించెన్ = త్రొక్కించెను.

తా. పెండ్లికొడుకైన స్వరోచి వంగి తలవంచి పెండ్లికొమార్తకాలు పట్టుకొని సన్నెకల్లుత్రొక్కించెను. అది యిఁకమీఁదఁ గలుగఁబోవు ప్రణయకలహము తీర్ప మ్రొక్కునప్పుడు తనకిరీటమునందుఁ జెక్కఁబడిన రత్నములను త్రొక్కనుక వానియొరపిడినోర్చుటకు నలవాటుచేయుటకై యామెపాదములు సోఁకునట్లు తలవంచి సన్నెకల్లుత్రొక్కించెనో యన్నట్లుండెను. అలం ఉత్ప్రేక్ష.

క. కడునవ్వించుచుఁ జెఱఁగులు, ముడివెట్టం బేరఁటాండ్రు ముదిత కనుబొమల్
ముడివెట్టె నాలిసిగ్గున, ముడివెట్టన్ నారి చెఱకుమోసున మరుఁడున్. 94

అ. పేరఁటాండ్రు = పేరంటమునకువచ్చినముత్తయిదువలు, కడున్ = మిక్కిలి, నవ్వించుచున్ = నవ్వునట్లుచేయుచు, చెఱఁగులు = వధూవరుల చీరచెఱఁగులు, ముడివెట్టన్ = ముడివేయఁగా, ముదిత = మనోరమ, నాలిసిగ్గునన్ = కపటపుసిగ్గుచేత, కనుబొమల్ ముడివెట్టెన్ = కోపము నొందినదానివలె మొగము ముడుఁచుకొనెను, మరుఁడును = మన్మథుఁడును, చెఱకుమోసునన్ = చెఱకుమొలకయందు - తనవిల్లయినచెఱకునందనుట, నారి = అల్లెత్రాటిని, ముడివెట్టెన్ = ముడివేసెను - ఎక్కుపెట్టెననుట.

తా. పేరఁటపుముత్తయిదువలు, నవ్వుపుట్ట మాటలాడుచుఁ గొంగుముళ్లువేయఁగా సిగ్గుచేత మనోరమ కోపించినట్లు బొమముడిచూపెను. తోడనే వధూవరులకుఁ బరస్పరము వలపును జనించెను అలం ఆవృత్తిదీపకము

సీ. పరిణమించిరి ధరామరపురంధ్రీహస్త, ఘటితచేలాంచలగ్రంథికలనఁ
బరిపూర్ణనిష్ఠఁ గొల్చిరి ప్రదక్షిణపూర్వ, వినతి నాలుకలార్చు వేఁడివేల్పు,

వీక్షించి రుడువీథినక్షీణసుస్థితి, స్థాయిఁ దోషితరమాధవుని, ధ్రువుని,
బరిణయప్రాప్తసప్తర్షిప్రియాప్రేక్ష్య, సాక్షాదరుంధతీసతి కెరఁగిరి
సకలసంయమిగణనమస్కారణకృత్య, మాచరించి తదీయహస్తాభిమంత్రి
తాక్షతలు మౌళిఁదాల్చిరత్యాదరమున, దంపతులు బంధుకోటికుత్సవమెలర్ప.

అ. దంపతులు = వధూవరులిద్దఱును, బంధుకోటికిన్ = చుట్టాలసమూహమునకు, ఉత్సవము= వేడుక, ఎలర్పన్ = అతిశయింపఁగా, ధరామర . కలన్ - ధరామరపురంధ్రీ=బ్రాహ్మణులముత్తయిదువలయొక్క, హస్త = చేతులచేఁగూర్పఁబడిన, చేలాంచలగ్రంథికలన్ = కొంగుముళ్లకూడికచేత, పరిణమించిరి = సంతోషించిరి, నాలుకలార్చువేఁడివేల్పున్ = నాలుకలాడించుచున్న (జ్వాలలెగయించుచున్న) యగ్నిదేవుని, ప్రదక్షిణపూర్వవినతిన్ = ప్రదక్షిణము ముందుగలుగునట్టుగాఁ జేసెడినమస్కారముచేత-ముందుప్రదక్షిణమును దరువాత నమస్కారమును జేసి యనుట, పరిపూర్ణనిష్ఠన్ = నిండిననియమముతో, కొల్చిరి = సేవించిరి, ఉడువీథిన్ = నక్షత్రమార్గమునందు-ఆకాశమునందు, అక్షీణసుస్థితిస్థాయిన్-అక్షీణ = తగ్గని, సుస్థితి = మంచియునికిచేత, స్థాయిన్ = ఉండెడివానిని, తోషితరమాధవునిన్-తోషిత = సంతోషింపఁజేయఁబడిన, రమాధవునిన్ = లక్ష్మీభర్తయైన విష్ణుదేవుఁడుగలవానిని-తపస్సుచేసి విష్ణువును మెప్పించినవానిననుట, ధ్రువుని = ఔత్తానపాదిని, వీక్షించిరి = చూచిరి, పరిణయ...సతికిన్ - పరిణయ=పెండ్లికి, ప్రాప్త=వచ్చిన, సప్తర్షిప్రియా = సప్తమహామునులభార్యలలోపల, ప్రేక్ష్య = చూడఁదగినదైన, సాక్షాత్ =ప్రత్యక్షమయిన, అరుంధతీసతికిన్ = పతివ్రతాశిరోమణియైన యరుంధతీదేవికి, ఎరఁగిరి = మ్రొక్కిరి, సకల .. కృత్యము-సకల=సమస్తమయిన, సంయమిగణ = మునులసమూహమునకు, నమస్కారణ = సమస్కరించుటయనెడి, కృత్యము = వ్యాపారమును, ఆచరించి = చేసి, తదీయ...క్షతలు- తదీయ = వారిదైన, హస్త = చేతులవలని, అభిమంత్రిత = మంత్రములచేత పరిశుద్ధములుగాఁజేయఁబడిన, అక్షతలు = దీవనబ్రాలు, అత్యాదరమునన్ =మిక్కిలి యక్కఱతో, మౌళిన్ =తలయందు, తాల్చిరి =ధరించిరి.

తా. ఆదంపతులు తమచుట్టములు హర్షింపఁగా బ్రాహ్మణులముత్తయిదువలు వేసినకొంగుముళ్లకు సంతోషించిరి హోమాగ్నికిఁ బ్రదక్షిణనమస్కారములు చేసిరి. ధ్రువదర్శనము చేసిరి. అరుంధతీదర్శనముచేసి మ్రొక్కిరి పెండ్లివేడుకచూడవచ్చియున్న మునులకెల్ల నమస్కరించి వారు వేసిన శోభనాక్షతలు తలల ధరించిరి. (వివాహకాలమునందు ఆయుర్వృద్ధికై ధ్రువదర్శనమును పాతివ్రత్యసిద్ధికై యరుంధతీదర్శనమును వధూవరులచేఁ జేయింతురు.)

ఉ. కూరిమి మంత్రితోడ నలకూబరుఁ డేకత మాడి పెద్దబం
గారపుఁగోటఁ గల్పవనికాజనికాంతిమ లైనచీరలున్
హారవిభూషణావళియు నమ్మిథునంబునకుం బ్రియంబుతో
నారదహాని చేత నొసఁగం జదివించెఁ గుబేరుపేరుగాన్.' 96

అ. నలకూబరుఁడు, కూరిమిమంత్రితోడన్ = తనప్రియమంత్రితో, ఏకతమాడి = రహస్యముగా నాలోచనచేసి, పెద్దబంగారపుఁగోటన్ = పెద్దదయిన బంగారపుఁబట్టెరమునందు, కల్పవనికాజనికాంతములు - కల్పవనికా = కల్పవృక్షములవనమునందు, జని = పుట్టుకగలవగుటచేత - పుట్టిన

పగుటచేతననుట, కాంతములు=మనోహరములు, ఐనచీరలుఁ = అయినట్టి వస్త్రములును, హారవి భూషణావళియుఁ - హార = ముత్యాలపేరులులోనగు, విభూషణ = ఆభరణములయొక్క, ఆవళి యుఁ = పంక్తియును- సమూహమును, ప్రియంబుతోఁ = ప్రీతితో, ఆమ్మిథునంబునకుఁ = ఆదం పతులకు, నారదమౌనిచేత, అదనఁ = ఆశీర్వచనసమయమునందు, కుబేరుపేరుగాఁ =తనతండ్రియ యిన కుబేరునిపేరిట, చదివించెఁ = పనసచెప్పి యాశీర్వదింపఁజేసెను.- ఆదంపతులకు నాశీర్వచన సమయమునందు నలకూబరుఁడు తనతండ్రియైనకుబేరునిపేరిటఁ గల్పవృక్షములవలనఁ బుట్టినవెలలేనివ స్త్రాభరణములను జదివించె నని తాత్పర్యము.

క. కలిమి మెఱయంగ మఱియుం, గలబాంధవు లొసఁగి రపుడు కాంచనమణిభూ
షలుఁ జీరలు నరపతికిం, బొలఁతికి నుడుగరలు ముదము పొదలఁగ నంతన్. 97

అ. అపుడు = ఆసమయమునందు, మఱియుఁ = నలకూబరుఁడు చదివించినపిమ్మట, కలబాం ధవులు = ఉండునట్టి చుట్టములు, కలిమి = తమతమకుఁ గలసంపద, మెఱయంగఁ = ప్రకాశింపఁ గా- తమతమకలకొలఁది ననుట, కాంచనమణిభూషలును = బంగారుసొమ్ములును, చీరలును=వస్త్ర ములును, ముదము = సంతోషము, పొదలఁగఁ = వర్ధిల్లఁగా, నరపతికిఁ = రాజునకును-స్వారోచి కిని, పొలఁతికిఁ = స్త్రీకిని - మనోరమకును, ఉడుగరలు = బహుమానములుగా, ఒసఁగిరి=ఇచ్చిరి- చదివించిరనుట. అంతఁ = అనంతరము- పైపద్యముతో నన్వయము.

సీ. పొగడపూవంటికంపులమదాంబువులును, మధువర్ణదంతశంబములు మెఱయ
భీకరస్వరచారుబృంహితంబులు ఘనాం, గారకగ్రహకాంతికన్ను లమర
నిలఁ జుట్టువడు తొండములమించుపూర్వాంగ, మెత్తరంబై పిఱుం దత్తమిల్లఁ
గటము లుత్కటములై నిటలముల్ బటువులై, సిబ్బెంపుమొగములనుబ్బు మీఱ
స్వర్ణకక్ష్యాంకుశప్రాసశరధిశార్ఙ్గ, ఖేటకుథఘంటికాద్యలంకృతులఁ జెలువ
మెసఁగు గంభీరవేదిభద్రేభశతము, నల్లునకు నిచ్చె గంధర్వవల్లభుండు. 98

అ. పొగడ...వులును-పొగడపూవంటి = పొగడపువ్వులపరిమళమువంటి, కంపుల = పరిమళ ముగల, మదాంబువులును = మదజలములును, మధు...ములు-మధువర్ణ = తేనెవన్నెగల, దంతశంబ ములు = వజ్రాయుధములనుబోలినకొమ్ములును, మెఱయఁ = ప్రకాశింపఁగాను, భీకర..బులు-భీ కర = భయంకరములైన, స్వర = కంఠస్వరముతోడి, చారు = ఒప్పిదములయిన, బృంహితంబులు = ఘీంకారములును, ఘనాం...కన్నులు - ఘన = అధికమయిన, అంగారకగ్రహ = అంగారకగ్రహము యొక్క, కాంతి=కాంతివంటికాంతిగల-ఎఱ్ఱగానుండెడి,కన్నులు=కన్నులును, అమరఁ=ఒప్పఁగాను, ఇలఁ=భూమియందు, చుట్టువడు = చుట్టగాఁబడుచున్న-మిక్కిలి నిడుపులైన, తొండములఁ = తొండములచేత, మించుపూర్వాంగము=అతిశయించునట్టి ముందటిభాగపుదేహము, ఎత్తరంబై = ఉ న్నతమయి, పిఱుందు = వెనుకటిభాగపుదేహము, అత్తమిల్లఁ = ఆనతమయియుండఁగాను – తగ్గి యుండఁగాను, కటములు = చెక్కిళ్లు, ఉత్కటములై = విశాలములై, నిటలములు = నొసళ్లు, బటు వులై = వట్రువలై, సిబ్బెంపుమొగములఁ = పొడలుగలముఖములయందు, ఉబ్బు = ఉబుకు, మీ ఱఁ = అతిశయింపఁగా, స్వర్ణ...కృతులఁ - స్వర్ణ = బంగారుపూఁతగల, కక్ష్య = నడికట్టు

పట్టి, అంకుశ=అంకుసమనెడియాయుధము, ప్రాస = ఈఁటె, శరధి = అమ్ములపొది, శార్ఙ్గ = శిఖరములుంచినవిల్లు, ఖేట = డాలువాలు, కథ = మీఁదఁబడుచెడికంబళి, ఘంటికా = గంట, ఆది= మొదలగువానిచేనైన, అలంకృతులన్ =అలంకారములచేత, చెలువము=అందము, ఎసఁగు...శతము- ఎసఁగు=అతిశయించునట్టి, గంభీరవేది=ఎడతెగనిమదముతోఁగూడినవైన, భద్రేభ=భద్రజాతియేనుఁగులయొక్క, శతమున్ =నూటిని-నూఱుభద్రజాతియేనుఁగులననుట, గంధర్వవల్లభుండు = గంధర్వరాజైనయిందీవరాక్షుఁడు,అల్లునకున్ =అల్లుఁడైనస్వరోచికి, ఇచ్చెన్ = అరణముగానిచ్చెను - (గంభీరవేది లక్షణము- "శ్లో॥ త్వగ్భేదా చ్ఛోణితస్రావా న్మాంసస్య వ్యపనాదపి, ఆత్మానం యోనజానాతి సస్యాద్గంభీరవేదికః. " అనఁగా దేహమునందుఁ దోలూడినను నెత్తురుగాఱినను మాంసము తెగిపడినను దెలియని మత్తుచేనుఁ గేదిగలదో యది గంభీరవేది యనంబరఁగు ననియర్థము.)అలం.స్వభావోక్తి,ఉదాత్తమును.

శా. ఉర్వీజానికి మామ యిచ్చె శిఖిపింఛోద్భాసివర్ణంబుచే
నర్వాచీనఘనాళి రోహితసహస్రాకీర్ణగా మింటఁ బూ
షార్వస్తోమముఁ జిత్రయానముల నూటాడించుగాంధర్వగం
ధర్వవ్యూహము దీప్తిచండమణికాండస్వర్ణసన్నాహమున్. 99

అ. మామ = శ్వశురుఁడయినయిందీవరాక్షుఁడు, ఉర్వీజానికిన్ = భూపతియైన యల్లునికి, శిఖిపింఛోద్భాసివర్ణంబుచేన్ = నెమిలికుంచెవన్నెవలెఁ బ్రకాశించునట్టివన్నెచేత, అర్వాచీనఘనాళి= నేలకుదిగిన మేఘపంక్తి, రోహిత = వంకరలేనియింద్రధనుస్సులయొక్క, సహస్ర = వేయింటిచేత, ఆకీర్ణగాన్ = వ్యాపించినదగునట్లుగా, దీప్తి...సన్నాహమున్ - దీప్తి = కాంతిచేత, చండ=తీక్ష్ణములైన- మిక్కిలి వెలుఁగుచున్న, మణీకాండ = రత్నసమూహములు గూర్చిన, స్వర్ణసన్నాహమున్ = బంగారుకవచముగలదానిని, మింటన్ = ఆకాశమునందు, పూషార్వస్తోమమున్ = సూర్యునిగుఱ్ఱములసమూహమును, చిత్రయానములన్ = పెక్కుతెఱఁగుల వింతనడకలచేత, ఊటాడించు... వ్యూహము- ఊటాడించు = ఉట్టూఁతలూఁగించునట్టి-తిరస్కరించునట్టి, గాంధర్వ = గంధర్వులదైన, గంధర్వవ్యూహమున్ = గుఱ్ఱములగుంపును, ఇచ్చెను.

తా. మఱియు నల్లునికి నాగంధర్వరాజు నెమిలిపురివన్నెగలిగి పెక్కులయినవంకర లేనియింద్రధనుస్సులతోఁడఁగూడి నేలకు దిగివచ్చిన మేఘములో యనునట్లు మిక్కిలి వెలుఁగుచున్నరత్నములు గూర్చిన పక్కెరలు వైచినవానిని, ఆకాశమునఁ బాఱునట్టిసూర్యునిగుఱ్ఱములను దిరస్కరింపఁజాలినపలుతెఱఁగులవింతనడకలుగలవానిని, గంధర్వులవైనవానిని, గుంపులకొలఁది గుఱ్ఱముల నరణముగా నిచ్చెను. అలం. ఉపమ ఉత్ప్రేక్షయు.

క. తళతళనితరణిమెఱుఁగులఁ, దలతల మనుమణుల మెఱసి తాఁ దలఁచినచోటన్
నిలుచు విమానము ఖేచర, కులతిలకుఁడు కూర్మి పెండ్లికొడుకున కొసఁగెన్.

అ. ఖేచరకులతిలకుఁడు=గంధర్వవంశశ్రేష్ఠుఁడు-ఇందీవరాక్షుఁడు,తళతళనితరణి మెఱుఁగులన్ = తళతళ యనివెలుఁగుచున్న సూర్యునివెలుఁగులను, తలతలము=తొలఁగుముతొలఁగుము, అనుమణులన్ = అనునట్టిరత్నములచేత - సూర్యకాంతులనుమించి వెలుఁగునట్టి మణులచేతననుట, మెఱసి = ప్రకాశించి, తలఁచినచోటన్ = ఒడయఁడుతలఁచినతావునందు, నిలుచువిమానమునన్ = నిలుచునట్టిదయిన

దహాకాశమునఁ బోవునట్టిరథమును, కూర్మిపెండ్లికొడుకునకున్ = ప్రేమాస్పదుఁడయినయల్లునికి-స్వారోచికి, ఒసఁగెన్ = ఇచ్చెను.

వ. మఱియు రజతమహారజతశయ్యాసనభాజనడోలాకలాచికాఘటకటాహపీటికాపేటికాదిగృహోపకరణంబులును, మరకతకురువిందపురుషరత్నపురందరమణిమౌక్తికాదిమహారత్నఘటితకటకతులాకోటికంఠికాంగదైకావళీకాంచికోర్మికాదికలాపకలాపంబులును, విచిత్రనేత్రపేశలకౌశేయచీనాంశుకఘట్టంబులం బెట్టిపెట్టి పెట్టియలును, అమూల్యాగరు మృగమద సంకుమద కుంకుమపటీరకర్పూరహిమాంబుపూరంబులు దట్టుపునుంగు నగలుసత్తును మంచిగందపుఁబొడి చాఁదుదయ భాస్కరంబు లోనుగాఁ గలపరిమళద్రవ్యసంభారపరంపరలును, జవ్వనంపుఁగ్రొవ్వున నివ్వటిల్లి మవ్వంపువాతెఱలు విన్వ నవ్వు నునుసోగవెన్నెలలం గలిసి పిసాళించుచంచలదృగంచలప్రభలం బచారించి, మెఱుంగుఁజన్నులం గన్నెతమ్మిమొగ్గలవన్నె నటమటించి, పెన్నెఱులమెఱుంగుఁదుమ్మెదవన్నెఁ దటమటించి, నెన్నడుముల విన్ను వెన్నుదన్ని, బటువుమిగిలి విటసికాయుంబురాయిడిం బఱి పుటపుటనై సకూలంకషచాటువులమాటకారితనంబు మెఱసి నాగరికపుంబనులం గరికిల గళారవచ్ఛలాలాపాచరణంబుల రవణంబులమిసమిసలం బసగలిగి మేలిమైసకులుకుల రసికజనంబులమనంబుల మరుఁగుకొలుపం జాలి సురుచిరాభరణభూషితం బగుపరిచారికాసహస్రంబును గూఁతునకు నరణంబుగా నిచ్చి మఱియును. 101

అ. మఱియును=(అట్లు అల్లునికిచ్చినదిగాక) ఇంకను, కూఁతునకున్=కొమార్తెయయిన మనోరమకు, రజత...బులును-రజత=వెండివియు, మహారజత = బంగారువియు నైన, శయ్యా=పానుపులు, ఆసన=పీఁటలు, భాజన=పళ్లెములు, డోలా=ఉయ్యాలమంచములు, కలాచికా=తమ్మపడిగములు, ఘట=బిందెలు, కటాహ=కొప్పెరలు, పీటికా పేటికా=పక్కలాకులపెట్టెలు, ఆది=మొదలుగాఁగల, గృహోపకరణంబులును=ఇంటివాడుకముట్లును, మరకత ... కలాపంబులును-మరకత = పచ్చలు, కురువింద=కోయిలకన్నువన్నెగలకెంపులు, పురుషరత్న=మగరాలు-రవలు, పురందరమణి=ఇంద్రనీలములు, మౌక్తికా=ముత్యాలు, ఆది=మొదలయిన, మహారత్న=గొప్పమణులచేత, ఘటిత = కూర్పఁబడిన, కటక = కడియములు, తులాకోటి= అందెలు, కంఠికా=కంటెలు, అంగద = బాహుపురులు, ఏకావళీ=ఒంటిపేట మొలనూళ్లు, ఊర్మికా=ఉంగరములు, ఆది=మున్నుగాఁగల, కలాప = ఆభరణములయొక్క, కలాపంబులును=సమూహములును, విచిత్ర ..బులన్-విచిత్ర=వింతలయిన, పేశల=మృదువులైన, కౌశేయ=పట్టుతో నేసిన, చీనాంశుక=చీనదేశపుఁజీరలయొక్క, ఘట్టంబులన్=సమూహములను, పెట్టిపెట్టి పెట్టియలును=ఉంచినపెట్టెలును, అమూల్య...పూరంబులు-అమూల్య=వెలలేని, అగరు=చేవగంధపుఁజెక్కలు, మృగమద=కస్తూరి, సంకుమద=జవ్వాజి, కుంకుమ=కుంకుమపువ్వు, పటీర=మంచిగంధము, కర్పూర=పచ్చకప్పురము, హిమాంబుపూరంబులు=పన్నీటిప్రవాహములు-కావలసినంతపన్నీరు, దట్టుపునుఁగు=గడ్డవాటుపునుఁగు, అగలుసత్తు=అగరుగంధపుధృతి-అగరువలనఁ దీసినయత్తరు, మంచిగందపుఁబొడి=మంచిగంధపుఁజెక్కలవలని బుక్కాపుపొడి, చాఁదు=చాఁదిబొట్టుపెట్టుకొనెడి ద్రవ్యవిశేషము,

ఉదయభాస్కరంబు=ఉదయభాస్కరమనెడి రంజకద్రవ్యవిశేషము, లోనుగాఁ=మొదలుగా, కల...లును-కల=కలిగిన, పరిమళ=మంచివాసనగల, ద్రవ్య=వస్తువులయొక్క, సంభార=సమూహములయొక్క, పరంపరలును=వరుసలును, జవ్వనంపుఁగ్రొవ్వునన్ = యౌవనమదముచేతను, నివ్వటిల్లి = అతిశయించి, మవ్వంపువాతెఱలు=కోమలములయిన పెదవులు, విప్పన్=విచ్చునట్లు, నవ్వు... వెన్నెలలన్-నవ్వు=నగవులనెడి, నున=లేఁతయయిన, సోగ=తీఁగలుసాగుచున్న, వెన్నెలలన్=చంద్రప్రకాశములను, కలసి=కూడి, పిసాళించు...ప్రభలన్-పిసాళించు = ప్రకాశించుచున్న, చంచల = చలనముగల, దృగంచల=కన్నుఁగొనలయొక్క, ప్రభలన్=కాంతులను, పచారించి =ప్రసరింపఁజేసి, మెఱుంగుఁజన్నులన్ = మెఱుఁగులుదేఱుచున్న స్తనములచేత, కన్నె. వన్నెన్-కన్నె=పరువముగల, తమ్మిమొగ్గలయొక్క, వన్నెన్=గౌరవమును, అటమటించి=వంచించి-తిరస్కరించి, పెన్నెఱులన్=నొక్కులుగల నిడుపాటితలవెంట్రుకలచేత, మెఱుంగుఁదుమ్మెదవన్నెన్ = మెఱయుచున్నతుమ్మెదలయొక్క వర్ణమును, అటమటించి=వంచించి-తక్కువపఱిచి, సన్నడుములన్=మనోహరములయిన మధ్యములచేత, విన్ను=ఆకాశమును, వెన్నుదన్ని=వీఁపుదన్ని-లోఁబఱుచుకొని, బటువు=దృఢత్వము, మిగిలి=హెచ్చి, విటనికాయంబురాయిడిన్=విటకాండ్రసమూహముయొక్క యొరపిడిని, పడి=పొంది, పుటపుటనైనకూలంకషచాటువులన్ - పుటపుటనైన=గడిదేఱిన, కూలంకష=దరులనొరయునట్టి-సమగ్రమైన, చాటువులన్ = చమత్కారపుమాటలచేత, మోటకారితనంబు=వాచాలత్వము, మెఱసి=ప్రకాశింపఁజేసి, నాగరికపుఁబనులగరగరికలన్ =నాజూకులయిన పనులయందలి మనోజ్ఞతలచేత, గళరవచ్ఛలాలాపాచరణంబులన్ - గళరవ=రతికాలమునందలి కంఠధ్వనులవంటి కంఠధ్వనులయొక్కయు, ఛలాలాప=అభిప్రాయగర్భితములయినమాటలాడుటయొక్కయు, ఆచరణంబులన్ = నడపుటలచేతను, రవణంబులమినమినలన్ = సొమ్ములయొక్క కాంతులచేతను, పసగలిగి=సత్తుగలిగి, మేలిమైనకులుకులన్=శృంగారముగాఁ గదలించునట్టిమేలయినయవయవములకదలికలచేత, రసికజనంబులమనంబులన్ = సరసులైనపురుషులయొక్క మనసులను, మరులుకొలుపన్ = మోహింపఁజేయను, చాలి=సమర్థమైన, సురుచిరాభరణభూషితంబు-సురుచిర=మిక్కిలిప్రకాశించునట్టి, ఆభరణ=సొమ్ములచేత, భూషితంబు=అలంకరింపఁబడినది, అగుపరిచారికాసహస్రంబున్ =అయినదాసీసహస్రమును-వేగురుపనికత్తెలనుట, అరణంబుగాన్=కన్యాధనముగా, ఇచ్చి, మఱియును=ఇంకను.-పైపద్యముతో నన్వయము

తా॥ మఱియు నాగంధర్వరాజు కొమార్తయయిన పెండ్లికూఁతునకు వెండిబంగారములతోఁ జేసిన యింటివాడుముట్లును రత్నమయము లయినబహువిధాభరణములును, బలుతెఱఁగుల సరిగపట్టు వస్త్రములును, వస్త్రాభరణము లుంచుకొనెడి రత్నములుచెక్కిన పెట్టెలును, అగరు జవ్వాజి పచ్చకప్పూరము మొదలయిన పరిమళద్రవ్యములును, చక్కఁదనమును శృంగారచేష్టలును గలిగి యౌవనవతులయి పనులయందు నాగరికముగా మెలఁగ నేర్చిన పెక్కండ్రుపరిచారికలను, అరణముగా నిచ్చెను.

అలం॥ ఉపమ.

సీ. అవనతాంగుష్ఠాగ్రకహార్యనిర్యద్రత్న, ఖనిఘనాంతరితశృంగాటకములు
మదముదాసహాదివ్యకస్తూరికేయకౌశేయ, గోత్రభిద్విటపినిష్కుటయుతములు
మహిమోల్కఁదంబడింభఁగ్రామ్యగృహచర, న్మృగనాభిసౌరభ్యనిర్భరములు
ప్రఖరఖురనఖరధారాపిష్టోద్దీర్ణ, సౌవర్ణమృత్తికాకీర్ణజాంగలములు

కోకకలహంసముఖరితాబ్జాకరములు, సిద్ధచారణగంధర్వసేవితములు
మందరద్రోణిఁ గొన్నిగ్రామములు గూఁతునయపసుపునకొసఁగెఁ గంధర్వవిభుఁడు.

అ. గంధర్వవిభుఁడు=గంధర్వరాజయినయిందీవరాక్షుఁడు, అవనత...ములు- అవనత=వంపఁబడిన, అంగుష్ఠ=కాలిబొటనవ్రేలియొక్క, అగ్ర=కొనచేత, హార్య=హరింపఁదగినవై, నిర్యత్ = బయలుదేఱుచున్న, రత్న=మణులయొక్క, ఖని=గనులచేత, ఘన=దట్టముగా, అంతరిత = క్రమ్మఁబడిన, శృంగాటకములు = చదుకములుగలవియును, మద...ములు-మద=మత్తతను, ముద=సంతోషమును, ఆవహ = కలిగించునట్టి, దివ్య=శ్రేష్ఠమైన, మైరేయ=చెఱకురసము లోనగువానితోఁ జేసినమద్యమునకు, ధౌరేయ=భారవాహులైన, గోత్రభిత్=ఇంద్రునిదైన, విటపి=కల్పవృక్షములతోఁగూడిన, నిష్కుట=ఇంటితోఁటలతోడ, యుతములు = కూడినవియును, మహిళా...ములు- మహిళా = స్త్రీలయొక్క, కదంబ=సమూహముచేతను, డింభ=పసిపిల్లలచేతను, గ్రాహ్య=గ్రహింపఁదగిన, గృహ=ఇండ్లయందు, చరత్=తిరుగుచున్న, మృగ=కస్తూరిమృగములయొక్క, నాభి=పొక్కిళ్లవలనఁ గలిగిన కస్తూరియొక్క, సౌరభ్య=పరిమళములచేత, నిర్భరిములు=నిండుకొన్నవియును, ప్రఖరా...ములు-ప్రఖర = మిక్కిలి వాఁడులైన, ఆఖు=ఎలుకలయొక్క, నఖరధారా=గోళ్లమొనలచేత, విదీర్ణ=త్రవ్వఁబడుటచేత, ఉద్గీర్ణ=బయలువెడలిన, సౌవర్ణమృత్=బంగారుమట్టి, కీర్ణ=చెదరివ్యాపించిన, జాంగలమ్ములు = మెరకనేలలు గలిగినవియును, కోక...ములు- కోక=చక్రవాకపక్షులచేతను, కలహంస=రాజహంసలచేతను, ముఖరిత=ధ్వనింపఁజేయఁబడిన, అబ్జాకరములు=తామరకొలఁకులు గలిగినవియును, సిద్ధచారణగంధర్వసేవితములు=సిద్ధులచేతను చారణులచేతను గంధర్వులచేతను సేవింపఁబడునవియునైన, మందరద్రోణిన్ = కవ్వపుఁగొండలోయలోనివైన, కొన్నిగ్రామములు=కొన్నియూళ్లు, కూఁతునయపసుపునకున్ = ప్రియపుత్రిక యైనమనోరమపసుపుఁగుంకుమునకుఁగాను, ఒసఁగెన్=ఇచ్చెను.

తా. తరువాత నిందీవరాక్షుఁడు తనకూఁతునకుఁ బసుపునకని మందరపర్వతపులోయలోని తన యూళ్లను గొన్నిటి నిచ్చెను అవి కాలివ్రేలు సోఁకినమాత్రమునఁ బెల్లగిలివచ్చునట్టి రత్నపుగనులుగల చదుకములతోను, మత్తును సంతోషమును బొందించునట్టి పూఁదేనె లోనగువాని వలననైన మద్యముల నొసఁగెడికల్పవృక్షవనములతోడను, పసిపిల్లకాయ లాఁడువారు వలసినట్లు కస్తూరిగైకొనుట కనువుగా నిండ్లలోఁ దిరుగుచున్న కస్తూరిమృగములతోను, ఎలుకలు త్రవ్వి వెదచల్లుటచే నెల్లయెడల బంగారుమట్టి నిండుకొన్న మెరకనేలలతోను, చక్రవాకములు హంసలు మొదలుగాఁగల జలపక్షులకు విహారస్థానము లైనసరోవరములతోను, సిద్ధచారణాదుల సంచారస్థానములతోను మనోహరములై యొప్పుచుండెను. అలం. ఉదాత్తము.

తే. పౌరయాత్రికసురసిద్ధచారణాహి, యక్షగంధర్వసాధ్యవిద్యాధరులను
నిజపురంబుల కనిచె నిందీవరాక్షుఁ, డుడుగర లొసంగి విభవంబుకడలుకొనఁగ:

అ. ఇందీవరాక్షుఁడు, పౌర...ధరులను-పౌరయాత్రిక=తమతమపురములకుఁ బయనమైన,సుర=దేవతలు, సిద్ధ=సిద్ధులు, చారణ=చారణులు, అహి=నాగులు, యక్ష=జక్కులు, గంధర్వ=గంధర్వులు, సాధ్య=సాధ్యులు, విద్యాధరులను=విద్యాధరులునయిన పెండ్లికి వచ్చినవారలను,విభవంబు=(తనదైన) యైశ్వర్యము, కడలుకొనఁగన్=అతిశయింపఁగా-తనకలిమికిఁ దగినట్లనుట, ఉడుగరలు=కట్నములును, గానుకలును, ఒసంగి=ఇచ్చి, నిజపురంబులకున్=వారివారి సొంతపట్టణములకు, అనిచెన్=పంపెను.

విని జైమినిమునీంద్రుండు మీఁదటివృత్తాంతం బానతీవలయు నని యడిగెను. 104

అనినన్=అని పక్షులుచెప్పఁగా, విని, జైమినిమునీంద్రుండు=మునిశ్రేష్ఠుఁ డయిన జైమిని, త్తాంతంబు=తరువాతివర్తమానము (కథ), ఆనతీవలయున్=చెప్పవలయును, అని యడుగుట ని యడుగఁగా.- దీనికి మీఁది యాశ్వాసములోని 'బాపరాయణాంతేవాసి కిట్లనియె' నను న్వయము.

ంలక్షాంతిగభీర భీరహితచిత్తాంభోజ భోజక్షమా
ద్యాపరిపాక పాకరిపుశుంభద్భోగ భోగాశిప
రసస్ఫూర్త్యనుభావ భావభరితశ్రీకాంత కాంతారపా
ాళింగకులేశ లేశతరవృత్తిక్షీణవైరివ్రజా. 105

అతుల...గభీర-అతుల= ఈడులేని, క్షాంతి= ఓర్పుచేత, గభీర=గంభీరుఁడా- మిక్కిలి వాఁడా యనుట. భీ...భోజ-భీరహిత=భయములేని, చిత్తాంభోజ=మనఃకమలముగలవాఁ లేనివాఁడా యనుట. భోజ...పాక- భోజక్షమాపతి=భోజరాజుయొక్క, విద్యాపరిపాక= ాకమునంటి విద్యాపరిపాకముకలవాఁడా - విశేషమైన విద్యాసంపత్తిగలవాఁడా యనుట, భోగ-పాకరిపు=ఇంద్రునిదైన, శుంభత్ = అతిశయించుచున్న, భోగ=సుఖానుభవమువంటి వముగలవాఁడా, భోగా...భావ-భోగాశిపత్రి=సర్పశేషాయులను దినెడిపక్షియొక్క- గరు ుక్క, తరస్=వడివంటివడియొక్క,స్ఫూర్తి=ప్రకాశముయొక్క,అనుభావ=మహిమగలవాఁ . .కాంత-భావ=మనస్సునందు, భరిత=భరింపఁబడిన-నిలుపఁబడిన, శ్రీకాంత=లక్ష్మీభర్తయ పుఁ లవాఁడా-సదావిష్ణుస్మరణను చేయువాఁడా యనుట. కాంత ...లేశ- కాంతార = యందు, పాతిత=పడవేయఁబడిన, కాళింగకులేశ = కళింగదేశాధిపతి యైనగజపతిరాజుగల గజపతిరాజును గాఅడవులకుఁ దఱిమినవాఁడా యనుట. లేశ...వ్రజా-లేశతర = మిక్కిలి గు, వృత్తి=జీవనోపాయమునందును, క్షీణ=క్షయించిన, వైరివ్రజా = శత్రుసమూహముగల శత్రువులకు లేశమాత్రమును జీవనములేకుండునట్లు చేసినవాఁడా యనుట.

. మిక్కుటమయిన యోర్పును వెఱపులేమియు విద్యాసంపత్తియు నింద్రభోగమును గరుడ సదా విష్ణుస్మృతియు శత్రువులనణఁచుశక్తియుఁ గలవాఁడా (ఇదియును మీఁది రెండు ను గృతిపతి యైనకృష్ణరాయనికి సంబుద్ధులు అమరమున 'భోగస్సుఖేస్త్ర్యాదిభృతావహేశ్చ యోః' అని యుండుటవలన భోగశబ్దమునకు సర్పశరీరమును ఫణమును నర్థముగును గనుక యిన సర్పము నిట గ్రహింపవలయును ) అలం. నిదర్శన

ాంబాసుత జితకదన, నాగతమదనాగసంగతేమానూపగృహా
ా భోగపురందర, భోగీంద్రశయానపురుషసేవూజాప్రవణా. 106

. నాగాంబాసుత = నాగమ్మకొమారుఁడా, జిత...భోగా-జిత = జయింపఁబడిన, కదన= నవలన, ఆగత=వచ్చిన, మదనాగ=మదపుటేనుఁగులయొక్క, సంగమ = కూడికచేత, అనూ ాయదేశమైన-జనులకు నేలయైన, గృహా=ఇంటియొక్క, ఆభోగా=పరిపూర్ణత్వముగలవాఁడా,

భోగపురందర=సుఖానుభవమునం దింద్రుఁడా, భోగీంద్ర ..ప్రసూనా-భోగీంద్ర=సర్పరాజైన శేషుఁడే, శయాన=పానుపుగాఁగల, పురుష=పురుషుఁడైన విష్ణునియొక్క, పూజా=అర్చనమునందు, ప్రవణా=ఆసక్తుఁడా.

తా. నాగమ్మ కొమారుఁడవై యుద్ధములయందు గెలుపుఁగొని తెచ్చినయేనుఁగుల మదజలముచేత జవుకు నేలగా నేర్పడినగరియందు శేషశయనుఁడైన విష్ణునిఁ బూజించుచు నివసించి సుఖించుచువాఁడా. అలం. నిదర్శన.

మాలిని. సరభసజయధాటీచండవేదండకోటీ
కరవమథుహిమానీకంపితాశావధూటీ
పరమహితహసంతీభావభాగ్భూరితేజః
పరుషదహనకీలాప్రస్ఫురచ్చక్రవాళా. 107

అ. సరభస.. చక్రవాళా - సరభస = వేగిరపాటుతోఁగూడిన, జయధాటీ = గెల్పునకయిన యుద్ధయాత్రయొక్క, చండ=భయంకరములైన, వేదండ = ఏనుఁగులయొక్క, కోటి = గుంపుయొక్క, కర=తొండములవలని, వమథు=తుంపురుల నెడి, హిమానీ=మంచుతెట్టెలచేత, కంపిత=వణఁకింపఁబడిన, ఆశావధూటీ=దిక్కులనెడి స్త్రీలకు, పరమహిత=మిక్కిలి హితములయిన, హసంతీభావభాక్=కుంపటితనమును బొందుచున్న, భూరి=అధికమైన, తేజః=ప్రతాపమనెడి, పరుష=కఠినమైన, దహన=అగ్నియొక్క, కీలా=మంటలచేత, ప్రస్ఫురత్=ప్రకాశించుచున్న, చక్రవాళా=చక్రవాళపర్వతములుగలవాఁడా- అనగా నసంఖ్యములయిన యేనుఁగులపంజు గలిగి యుద్ధయాత్రలు [illegible] చేసి [illegible] వ్యాపించినప్రతాపముచేత వెలసినవాఁడా యనుట. అలం. రూపకము.

గద్యము. ఇది శ్రీమదంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక [illegible] చరణారవిందాధీనమానసేందిందిర నందవరవంశోత్తంస శఠగోపతాపసప్రసాదాసాదితచతుర్విధకవితామతల్లి కాల్లసానిచొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్యప్రణీతంబైన స్వారోచిషమనుసంభవం బనుమహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

అ. పాండురప్రభఁ = తెల్లనికాంతిచేత, క్రిందుపడినచీఁకటివో లెన్ = అడుగంటినచీఁకటియో యనునట్లు, జిగిన్ = మెఱుఁగుచేత, ఒప్పునీలంపుజగతిన్ = ఒప్పునట్టియింద్రనీలమణులుగాఁపిన నేలచేత, మెఱసి = ప్రకాశించి, ఔన్నత్యమునన్ = పొడుగుచేత, మ్రింగినట్టినింగులన్ = తనలోపలనణఁచుకొన్న యాకాశములను, క్రక్కుకరణిన్ = వెడలఁగ్రక్కినట్లు, ధూపము = అగరుమొదలగువాని వాసనతోడి పొగ, గవాక్షములన్ = కిటికీలనుండి, వెడలన్ = బయలువెడలుచుండఁగా, ధారుణీపతి = భూమియొక్క యిల్లాలు, సుగంధద్రవ్యము = పరిమళవస్తువులను, దాఁచునరలపేటికవో లెన్ = దాఁచిపెట్టునట్టియరలు గలిగిన పెట్టెవలె, పరిమళములనెలవులై = మంచివాసనలకు ననికిపట్టయి, వెలువారునిలువులన్ = అందగించుచున్న యంతస్తులచేత, విలసిల్లి = ఒప్పి, కొణిగన్ = ముంగాఱుసంఘము, పారావతకులము = పావురాల గుంపు, వదరన్ = కూయుచుండఁగా, పసిఁడినీటన్ = బంగారపునీటచేత, లిఖించిన ప్రతిమలు = వ్రాయఁబడిన చిత్తరుబొమ్మలు, అమరన్ = ఒప్పఁగా, ఈఁగవాలినను, అంపంప = అప్పటికప్పుడే, ఎలుఁగులు = ధ్వనులు, ఒసఁగునట్టిసకినలమంచములు = ఇచ్చునట్టి కృత్రిమపక్షులు కీఁచుబిళ్లలుగల పట్టెమంచములు, ఆదిగాఁగన్ = మొదలుగా, మెఱయుపరికరములన్ = ప్రకాశించుచున్న యుపకరణములతో, ఒప్పు మేడమీఁదన్ = ఒప్పునట్టి యుప్పరిగమీఁద - పైకి నన్వయము.

తా. దిగువలట్టి నీలాలు చాఁపినయుపరిగ లొప్పఁగాను, మిన్నంటునపొడుగుగలిగి కిటికీలనుండి ధూపములపొగలు వెడలఁగాఁ, బరిమళములచే నిండుకొన్నయంతస్తు లొప్పఁగాను, బంగారునీట పెట్టఁ జిత్తరువులు వ్రాయఁబడి కీఁచుబిళ్లలు మొదలగునవి యమర్చినపట్టెమంచము లోనగువానిచే నొప్పుచున్న యుప్పరిగమీఁదను. అలం. ఉత్ప్రేక్ష, అతిశయోక్తియు.

క. రమణునికడ కనుప మనో, రమకున్ మజ్జనము దీర్చి రవరవసిఁ జపిం
ఛమునకుఁ గాలాగురుధూ, పము వెట్టి జవాది నంటు వాపి నిపుణాతన్. 4

అ. రమణునికడకున్ = ప్రియునియొద్దకు, అనుపన్ = పంపుటకై, మనోరమకున్ = పెండ్లికూఁతురైన మనోరమకు, మజ్జనము = అభ్యంగనస్నానము, తీర్చి = నెఱవేర్చి - చేయించి, (నెమ్మిపురిసింధు కర్త) రవరవకపింఛమునకున్ - రవరవ = తళతళ మెఱయుచున్న, కిసలయభాసనకున్ = నెమలిపించెమువంటి ముంగురులకు (?) వెండ్రుకలసమూహమునకు, కాలాగురుధూపము = నల్లయగరుపొగ, పెట్టి = వేసి, జవాదిన్ = జవ్వాజి మెఱుఁగుచేత, అంటు = ఆతలవెండ్రుకలచిక్కు, వాపి = తీసి, నిపుణతన్ = నేర్పుతో - పైపద్యముతో నన్వయము.

తా. పరిచారికలు మనోరమను చెలికానియొద్దకుఁ బంపుటకై తలయంటి స్నానము చేయించి తళతళలాడుచున్న నెమలిపించెము బోలినతల వెండ్రుకలకు నల్లయగరుధూపము వేసి జవ్వాజి మెఱుఁగుతో నాతల వెండ్రుకల చిక్కుదీసి. అలం. రూపకము

సీ. చెంగల్వపూదండ సేర్చి పెందుఱుముప్ప, ఘనసారనుస సూసకము ఘటించి
నన్నెటికెతోఁ గడంకబొట్టుచేసి మృగనాభిఁ, బూసి కుంకుమ సేసబొట్టు తీర్చి
విశదముక్తాదామకరశనఁ బండురకావి, పలిపవువలు సప్పై సలవరించి
యంచుల వెన్నెలగాయుహాళి మొక్కుటిక్కెట్టి, మడ లసొమ్ములు మేనమట్టుపఱచి
కన్నుఁగవ గెల్చి కాటుకల్ గట్టి సనఁగ, ఘల్లుఘల్లున బెండెంబు గండపుమీఁగు
గదల నల్లన నడపించి పొగిడి తెచ్చి, నెచ్చెలులపింఛ యువతి నాథుసన్నిధకును.

అ. నెచ్చెలులపేఁడు=స్నేహాతిశయముగల చెలికత్తెలసమూహము, చెంగల్వపూదండ=ఎఱ్ఱగలువపూవులసరమును, చేర్చి=కొప్పునఁదుఱిమి, పెందుఱుముపైన్ =పెద్దదైనయాకొప్పుమీఁదఁ, ఘనసారమునన్ = పచ్చకర్పూరముతో, నూసకము=పుష్పమాలికలుగూర్చిచేసిన కొప్పువలను(తిరుగుడుబిళ్ల యని కొందఱు), (ఘనసార మనఁగా అధికమయినశిరాంశము. అట్టిశిరాంశముగలజడబిళ్ల నమర్చి యని కొందఱు )ఘటించి=కూర్చి, పన్నీటితోన్ =హిమాంబువుతో, కదంబము చేసి=కలిపి, నృగనాభిన్ =కస్తూరిని-కస్తూరిచందనమునటు, పూసి=దేహమునందుఁబూసి, కుంకుమన్ =కుంకుమపువ్వుతో, నేఁబొట్టు=అక్షింతలబొట్టు, తీర్చి=దిద్ది-నొసటఁబెట్టి యనుట, విశద...రశనన్ -విశద=స్వచ్ఛమ్మయిన, ముక్తాదామ=ముత్యాలసరములచే రచియించిన, రశనన్ =మొలనూలును, చందుర...పైన్ -చందురకావి=కుసుమపూవన్నెగల, వలిపపు=సన్నఁదనముగల, వలువపైన్ =చీరమీఁద, అలవరించి=సవరించి-పెట్టి యనుట, అఱుతన్ = మెడను, వెన్నెలగాయుహారము = వెన్నెలగాయునట్లు తెల్లనికాంతులు వెదచల్లుచున్న ముత్యాలపేరు, ఒక్కటి పెట్టి=ఒకటేధరింపఁజేసి, మణులసొమ్ములు = రత్నములుచెక్కిన యాభరణములను, మేనన్ = దేహమునందు, మట్టుపఱిచి = గుత్తముగాఁబెట్టి, కన్నుఁగవన్ = కన్నులజంటచేత, గెల్చి=జయించి, డాకాలన్ ఎడమకాలియందు, కట్టెనో=కట్టివేసెనోయేమో, అనన్ = అనునట్లు, ఘల్లుఘల్లునన్ =ఘల్లుఘల్లను ధ్వన్యనుకరణముతో, పెండెంబుగండుమీలు=కాల్నియందెలందుఁ గూర్పఁబడిన బంగారపుగండుచేఁపరూపులు, కదలన్ =చలింపఁగా, యువతిన్ =జవరాలైనమనోరమను, అల్లనల్లనన్ = మెల్లమెల్లగా, నడపించి=నడపించుకొని, ఆనృపతికడకున్ =పెండ్లికొడుకైన యాస్వరోచియొద్దకు, పొదివి=క్రమ్ముకొని, తెచ్చెన్ =తీసుకొనివచ్చెను.

తా. అనంతరము మనోరమచెలికత్తెలు ఆమెకు నేర్పుతోఁ దలదువ్వి కొప్పుపెట్టి కొప్పు నిండఁ జెంగల్వపూదండలు చెరివి దానిపైఁ బచ్చకర్పూరము గూర్చిచేసిన పువ్వుల కొప్పువల యమర్చి చెంద్రకావివలిపపుఁజీరగట్టి ముత్యాలమొలనూలు దానిమీఁద నడుమునధరింపఁజేసి కస్తూరిపన్నీరు చేర్చి కలిపినకలపము పూసి కుంకుమపువ్వుచాఁది చుక్కబొట్టుపెట్టి యొంటిపేటముత్యాలహారము మెడను వేసి గుత్తముగా రత్నాభరణములు దొడిగి కాలియందెలు ఘల్లుఘల్లున మ్రోఁగఁగా మనోరమను మెల్ల మెల్లగా నడపించుకొని యామెప్రియుఁడైన స్వరోచియొద్దకుఁ దీసికొనివచ్చిరి. అలం ఉత్ప్రేక్ష, స్వభావోక్తియు.

క. తెచ్చుటయుఁ గేలిభవనముఁ, జొచ్చెనొ చొరదొ యనంగ సుదతులనీడం
జొచ్చి పయిఁ గొప్పు దోఁపఁగ, నచ్చేడియ తలుపుదండ నల్లన నిలిచెన్. 6

అ. తెచ్చుటయున్ =చెలికత్తె లిట్లుతీసికొనిరాఁగా, అచ్చేడియ=ఆస్త్రీ-మనోరమ, కేలిభవనమ్మున్ =క్రీడాగృహమును-పడకటింటిని, చొచ్చెనో=ప్రవేశించెనో, చొరదో=ప్రవేశింపలేదో, అనంగన్ =అని తలఁచునట్లు, సుదతులనీడన్ = చెలికత్తెలనీడయందు, చొచ్చి=ప్రవేశించి, పయిన్ =మీఁదిపట్టు, కొప్పుదోఁపఁగన్ =కొప్పుమాత్రము కనఁబడఁగా, తలుపుదండన్ =తలుపువెంబడని, అల్లనన్ = మెల్లగా-సద్దుగాకుండునట్లు, నిలిచెను.-అనఁగా చెలికత్తె లట్లు పిలుచుకొనిరాఁగా వచ్చినమనోరమ తనవచ్చినజాడ తెలియకుండునట్లు చెలికత్తెలమఱుఁగున బడకటింటితలుపువెంబడి నిలువఁబడె ననుట

క. తదనంతరంబ బోటులు, చతురుల నగవులను బ్రొద్దు జరిగించఁ గేళీ
సదనము నొక్కొకపనిపెప, మొదవఁగ వెడలుటయుఁ జిత్త ముప్పిళ్లూరన్. 7

అ. తదనంతరంబ=అట్లు మనోరమ నిలువఁబడినతోడనే, చదురులన్=కోడిగపుమాటల చేతను, నగవులన్=నవ్వుల చేతను, ప్రొద్దు=కొంతసేపు, జరగినన్=కడవఁగా, బోటులు = మనోరమచెలికత్తెలైన స్త్రీలు, ఒక్కొక్కపనినెపము = ఒక్కొకరొక్కొక పనికలదను నెపము, ఒదవఁగన్=తమకుఁగలుగఁగా-కలుగఁజేసికొని యనుట. కేళీసదనమున్=క్రీడాగృహమును, వెడలుటయున్ = బయలువెడలి పోఁగా, చిత్తము=స్వారోచిమనస్సు, ఉవ్విళ్లూరన్=తత్తఱిల్లఁగా-పైపద్యముతో నన్వయము. అలం. పర్యాయోక్తము.

సీ. దట్టంబు నీకట్టినట్టిచెంగావికి, బాగు గా దని కేలఁ బయఁట నిమిరె
గోరంటా గోళ్లనిక్కువపుఁగెంపో యని, చెయిపట్టి నయమునఁ సెజ్జ సేర్చె
నగరుధూపముచేత నయ్యో తనూవల్లి, సెక సోఁకెనని యెదఁ జెయ్యి వెట్టె
మృగనాభికామకరికలఁ గప్రము మించె, నని మూరుకొనుచుఁ జుంబన మొనర్చె
హారమణు లిటుసూపు నాయఱుత నున్న, హారమణులకుఁ గాంతి నీడౌనొ కావొ
యనుచు నక్కునఁ గదియించుకొనా నెపమునఁ, గంపమును బొందు సతిమేను గౌఁగిలించె.

అ (స్వారోచి) దట్టంబు = పావడ, నీకట్టినట్టిచెంగావికిన్=నీవు కట్టుకొన్న చెంగావిచీరకు, బాగు=అందము, కాదు=కానేరదు, అని, కేలన్ =చేతితో, పయఁట=ఱొమ్ముమీఁదివస్త్రమును, నిమిరెన్=తడవెను. గోరంటా=గోరంటాకురసమంటినయెఱుపో, గోళ్ల..కెంపో-గోళ్ల=గోరులయొక్క, నిక్కువపు=నిజమయిన, కెంపో=ఎఱుపో, అని, చెయిపట్టి=ప్రియురాలిచేయిపట్టుకొని, నయమునన్ = మృదుత్వముతో, సెజ్జ=పాన్పును, చేర్చెన్ =చేరునట్లుచేసెను-పాన్పుపైకిఁ జేరఁదీసె ననుట అగరుధూపముచేతన్ =అగరుచెక్కయొక్కపొగచేత, తనూవల్లి=తీఁగెవంటిదైననీదేహము, సెకసోఁకెన్ = కాఁకతాఁకినదాయెను, అయ్యోయని=అక్కటాయని, ఎదన్ =ఱొమ్మునందు, చెయ్యివెట్టెన్ =చేయిపెట్టి యంటిచూచెను మృగ...కలన్ -మృగనాభికా=కస్తూరిచేత వ్రాయఁబడిన, మకరికలన్=మకరికాపత్త్రములందు, కప్రము = పచ్చకర్పూరము, మించెన్ = హెచ్చాయెను, అని, మూరుకొనుచున్ = మూచూచుచు, చుంబనమొనర్చె=ముద్దుపెట్టుకొనెను హారమణులు=ముత్యాలపేరునందలిపూసలును, ఇటుసూపు=ఈతట్టునకనఁబఱుపుము, నాయఱుతన్ = నా మెడయందు, ఉన్న హారమణులకున్ =ఉండునట్టిహారములోనిపూసలకు, కాంతిన్ =లోపలనిగ్గుయొక్కప్రకాశముచేత, ఈడు=సమానము, ఔనో=అగునో, కావో=కాకపోవునో, అనుచున్ =అనిపలుకుచు, అక్కునన్ =ఱొమ్మునందు, కదియించునా నెపమునన్ =అనించిచూచుమిషచేత, కంపమునుబొందుసతిమేను = సాత్త్వికచేష్టచేవణఁకుచున్నప్రియురాలిదేహమును, కౌఁగిలించెన్ =ఆలింగనముచేసికొనెను.

తా. అప్పుడు స్వారోచి ప్రియురాలిదగ్గఱఁ జేరి నీవు కట్టినపావడ పైచెంగావిచీరకుఁ దగినదికాదనిచెప్పుచుఁ బయఁటనంటి వ్రేళ్లగోళ్లు గోరంటఁ బెట్టుకొంటవా యని యడిగి చేయిపట్టి పాన్పునకుఁ జేరఁదీసి యటుపిమ్మటఁ గ్రమముగా నొక్కొక్క నెపముచే నొక్కొక్క శృంగారచేష్ట చేయుచుఁ గడపటహారములలోని ముత్యాలపూసలు సరిచూచుట యనుమిషచేత ఱొమ్ముతో ఱొమ్ముఁ జేర్చి కౌఁగిలించుకొనెను అలం పర్యాయోక్తము.

వ. అట్లు కవియుం దమకించి ప్రత్యుత్తరులఁ గుస్తరింప నింపుగలిగియు మునుమున్న
మనంబునం బ్రౌఢిమ యుండునడ లప్పుడు తలంపునం బొడమిన సమర్థుం డగునత

నిచే నదె తర్పించుకొనంగల యద్దియై నవోఢ గావున మాటలం దేటపడం జెప్ప శంకించి స్త్రీస్వభావంబునం దొరఁగుకన్నీరు కరికణ క్రేంకృతులు మీఱ గోరఁ బాఱమీటుచు నూరకయున్నం గనుంగొని యవనిపతిపుంగవుం డంతరంగంబునం జెంగలించు కౌతుకాంకురంబు కరఁగుపడ వెఱఁగుపడి యుద్వేగసమన్వితుండై సంభ్రమించుచుఁ జెక్కుటద్దంబులు నొక్కి కురులు చక్కంద్రోయుచుం దోయజాక్షి యానందసంధాయకం బగునిట్టిక్రీడాసమయంబున వగపునకుం గారణంబేమి నాయెడం గల్ల యేమేనియుం బొటిల్లదు గదా యెవ్వరే మప్రియంబు గావించి రెఱింగింపు వారిం దండించెద నేమి సాధింప వలయుఁ జెప్పు మది వేధ చేనున్న సాధించెద మదీయంబు లగునర్థజీవితంబులు భవదధీనంబు లుమ్మలిక యింత యేటి కనుటయు నబ్బోటి గ్రేఁటుచు నిట్లనియె. 9

అ. అట్లు=ఆరీతిని, కవియఁగ=తన్నుఁ జేరుటకు, తమకించి=త్వరపడి, త్రస్తురలఁగ=పరిహాసపు మాటలచేత, ప్రస్తరింపఁగ = సమాధానపఱుపఁగా, ఇంపుగలిగియుఁగ=కూటమికి నిష్టముగలదయ్యును, ఘనుగాయున్న = మొట్టమొదటనే - పెండ్లిగాకమునుపే యనుట, మనంబునఁగ=తనమనసునందు, పొడమియుండునడలు=పుట్టియున్నవిచారము, అప్పుడు=ఆసమయమునందు, తలంపునంబాఱినఁగ=మనసునఁ బ్రసరింపఁగా-జ్ఞప్తికిరాఁగా, సమర్థుండు = సామర్థ్యముగలవాఁడు, అగునతని చేఁ=అయినయామహాపురుషుని చేత, అది=దానిని-ఆవిచారమును, తీర్పించుకొనంగలయదియై=మాన్పుకోఁదలఁచినదై, నవోఢ=క్రొత్తపెండ్లికూఁతురు, కావునఁ=కనుక, మాటలఁ=మాటలతో-సిగ్గువిడిచిమాటలాడి యనుట, తేటపడఁగ=స్పష్టమగునట్లు, చెప్పఁ=ప్రియునితోఁ జెప్పుటకు, శంకించి=జంకి, స్త్రీస్వభావంబునఁ = ఆఁడుదగుటవలఁదగినస్వభావముచేత, తొరఁగుకన్నీరు=కాఱుచున్నకంటినీటిని, కంకణక్రేంకృతులు = గాజులయొక్క క్రేష్మనెడి ధ్వనులు, మీఱఁ=అతిశయింపఁగా, గోరఁ=వ్రేలిగోటితో, పాఱమీటుచుఁ=తొలఁగఁజిమ్ముచు, ఊరకయున్నఁ=ఏమియు ననక మిన్నకుండఁగా, కనుంగొని= చూచి, అవనిపతిపుంగవుండు=రాజశ్రేష్ఠుఁడు-స్వరోచి, అంతరంగంబునఁ=మనసునందు, చెంగలించుకౌతుకాంకురంబు = అతిశయించునట్టివేడుకమొలక, కరఁగుపడఁ = తగ్గఁగా, వెఱఁగుపడి=ఆశ్చర్యపడి, ఉద్వేగసమన్వితుండై=నెమ్మదిలేమితోఁ గూడుకొన్నవాఁడై, సంభ్రమించుచుఁ = తత్తఱిల్లుచు, చెక్కుటద్దంబులు=అద్దములవంటి మనోరమచెక్కిళ్లను, నొక్కి = పుణికిపట్టి, కురులు = తలవెండ్రుకలను, చక్కంద్రోయుచుఁ =సరిగా నెగదువ్వుచు, తోయజాక్షి=తామరలవంటికన్నులుగలయో ప్రియురాలా, అక్షి యనఁగా కంటి-అక్షి=కన్ను, ఆనంద=సంతోషమును, సంధాయకంబు=కూర్చునది-పొందించునది, [illegible]-అగు=అయిన, ఇట్టి=ఇటువంటి, క్రీడాసమయంబునఁ=సంభోగకాలమునందు, వగపునకుఁ=విచారమునకు, కారణంబు=హేతువు, ఏమి=ఏమిటిది, నాయెడఁ=నాయందు, కల్ల=అసత్యము, ఏమేనియుఁ = ఏదైనను, పొటిల్లదుగదా = కలుగదుగదా, ఎవ్వరు=ఇతరులెవ్వరు, ఏమప్రియంబు = ఏమిటిప్రియము, కావించిరి=చేసిరి, ఎఱింగింపు=తెలియఁజేయుము-చెప్పుము, వారిఁ=ఆతప్పు చేసినవారిని, దండించెదఁ=శిక్షించెదను, ఏమి = దేని, సాధింపవలయుఁ = సమకూర్పవలయును, చెప్పుము=నాతోఁ జెప్పుము, అది=ఆసమకూర్పవలసినవస్తువు, వేధచేనున్నఁ=బ్రహ్మదేవుని చేతనున్నను, సాధించెదఁ=సమకూర్చెదను, మదీయంబులు=నావి, అగునర్థజీవితంబులు=అయినట్టిధనమును ప్రాణ

మును, భవదధీనంబులు=నీవశములు, ఉమ్మలిక=దుఃఖము, ఇంత=ఇంతవిశేషము, ఏల=ఎందులకు, అనుటయున్=అని ప్రియుఁడడుగఁగా, ఆబోటి=ఆస్త్రీ-మనోరమ, క్రేఁటుచున్ = గొంతుసవరించుకొనుచు, ఇట్లనియెన్=ఇట్లుపలికెను.

ఉ. అక్కట నాయెడన్ మిగుల నక్కఱ గల్గి చరించునెచ్చెలుల్
చిక్కి మునీంద్రశాపహతిఁ జెందినదుర్దమరోగబాధలం
బొక్కుచునున్నవారు వనభూములఁ దద్దశ మాన్పవేని నా
కెక్కడిసౌఖ్య మన్నఁ దరళేక్షణఁ జూచి స్వరోచి యిట్లనున్. 10

అ. అక్కట=అయ్యో, నాయెడన్ = నావిషయమునందు, మిగులన్=మిక్కిలి, అక్కఱ=అపేక్ష, కల్గి=కలిగినవారై, చరించునెచ్చెలుల్=ప్రవర్తించునట్టిప్రియసఖులు, మునీంద్రశాపహతిన్ = ఒకానొకముని శ్రేష్ఠుని శాపపుదెబ్బచేత, చెందిన...ధలన్ – చెందిన=పొందినటువంటి, దుర్దమ=అణఁపరాని, రోగబాధలన్=వ్యాధిపీడలచేత, చిక్కి=చిక్కుకొని, పొక్కుచున్=తపించుచు, వనభూములన్=అడవినేలలందు, ఉన్నవారు=ఉన్నారు, తద్దశ=వారిదైన యాదురవస్థను, మాన్పవేనిన్=నీవు పోఁగొట్టనిపక్షమున, నాకు, ఎక్కడిసౌఖ్యము = సౌఖ్యమెక్కడిది- నాకుసుఖముకలుగ నేరదనుట, అన్నన్=అని మనోరమ యనఁగా, తరళేక్షణన్=చలించుచున్నకన్నులుగలదైనమనోరమను, చూచి, స్వరోచి, ఇట్లనున్=ఈమీఁదఁజెప్పెడిరీతిని బలికెను.

తా. నాయందు మిక్కిలి ప్రేమగలచెలికత్తెలు మునీశ్వరుఁ డొకఁడు శపింపఁగా మానని వ్యాధిచేఁ బీడింపఁబడుచు నడవులయందుఁ బడియున్నారు వారివ్యాధిని మానునుపాయము గానక దుఃఖించుచున్నదానను గనుక నీ వావ్యాధిబాధ నివారింతువేని నాకు సుఖేచ్ఛపుట్టును. నివారించునంతవు నిట్లు దుఃఖపడఁగలదాననే యనఁగా స్వరోచి యిట్లు వచియించెను

క. పరితాప మింక నేటికి, హరిణాక్షి మదీయసంచితాయుర్వేద
స్ఫురణమునఁ బరిహరించెద, నరు దనఁగ భవత్సఖీజనామయభరమున్. 11

అ. హరిణాక్షి = జింకకన్నులవంటి కన్నులుగలయో ప్రియురాలా, ఇంకన్ = ఇంకమీఁదను, పరితాపము=దుఃఖమువలనియారాటము, ఏటికిన్=ఏమిటికి, మదీయ...మునన్ - మదీయ=నాదైన, సంచిత=సంగ్రహింపఁబడిన- నేనభ్యసించినయనుట, ఆయుర్వేద==వైద్యశాస్త్రముయొక్క, స్ఫురణమునన్ = స్ఫూర్తిచేత-సామర్థ్యముచేత, భవ. మున్ -భవత్సఖీజన=నీచెలికత్తెలయొక్క, ఆమయభరమున్ = రోగాతిశయమును, అరుదు=ఇది యాశ్చర్యము, అనఁగన్=అని చూచినవారనునట్లుగా, పరిహరించెదన్=మాన్పెదను.-అనఁగా, ఓప్రియురాలా! నేను నేర్చినవైద్యసామర్థ్యముచేత నీచెలికత్తెలవ్యాధి మాన్పెదను నీవిఁక నీవిచారము మానుమనియెను.

క. నావెనుక రమ్ము నీసఖు, లేవనమున నున్నవార లిపుడ చికిత్సం
గావింతు ననుచు రయమున, నావనితయుఁ దాను నచటి కరిగి యొకయెడన్.

అ. నీసఖులు=నీచెలికత్తెలు, ఏవనమునన్=ఏయడవియందు, ఉన్నవారలు=ఉన్నారు, ఇపుడ=ఇప్పుడె, చికిత్సన్=తగినవైద్యమును, కావింతున్=చేసెదను, నావెనుకన్=నావెంబడి, రమ్ము=నీవు రమ్ము, అనుచున్=అనిపలుకుచు, ఆవనితయున్=ఆస్త్రీయు- మనోరమయు, తానును, రయమునన్=వడితో, అచటికిన్=ఆమనోరమచెలికత్తె లున్నయడవికి, అరిగి=పోయి, ఒకయెడన్ = ఒకానొకప్రదేశమునందు-పైపద్యముతో నన్వయము.

ఉ. ఆరజనీశబింబరుచిరాస్యలఁ గాంచి తదామయవ్యథా
భారము మాన్పఁగాఁ దమి నృపాలుఁడు తత్కలధౌతగోత్రకాం
తారపదంబునం దుపచితం బగుమందును దత్క్రియోచితా
హారము నెమ్మి నిచ్చుచు ననామయధన్యలఁ జేసె వన్నెగాన్. 13

అ. ఆరజనీశబింబరుచిరాస్యలన్=చంద్రబింబములవలె వెలుఁగుచున్న ముఖములుగల యాపడుచుల, కాంచి=చూచి, నృపాలుఁడు=రాజు-స్వరోచి, తదామయవ్యథాభారమున్=వారివ్యాధిబాధాతిశయమును, మాన్పఁగాన్=పోఁగొట్టుటకై, తమిన్=తమకముతో, తత్కలధౌత...నందున్. తత్కలధౌతగోత్ర=ఆవెండికొండయొక్క, కాంతారపదంబునందున్=అడవిపట్టునందు, ఉపచితంబు=పెరిఁగినది, అగుమందును=అయినట్టియౌషధమును, తత్క్రియోచితాహారమున్=ఆయౌషధక్రియకుఁ దగినయాహారమును, నెమ్మిన్=ప్రీతితో, ఇచ్చుచును, వన్నెగాన్=కాంతియుక్తలగునట్లుగా, అనామయధన్యలన్=వ్యాధిలేమిచేతఁ గృతార్థలనుగా, చేసెను

తా. వ్యాధిగ్రస్తలయిన యామనోరమచెలికత్తెలను జూచి స్వరోచి వారివ్యాధి మానునట్టి మందు లావెండికొండయడవులలోనే సంపాదించి యిచ్చి యందులకుఁ దగినట్లు పథ్యము పెట్టి రోగములని గేనాపకారము పోయి వన్నె హెచ్చునట్లు వారిరోగమును మాన్పి కృతార్థలనుగాఁ జేసెను.

శా. ఆదివ్యౌషధరాజిచేఁ దమమహావ్యాధివ్యథల్ దీఱినన్
మోదం బంది లతాంగు లంబుజకులంబున్ నవ్వుకందోయితో
సౌదామిన్యభిరామదేహరుచితో సంపూర్ణచంద్రానన
శ్రీగర్వోన్నతితోఁ జెలంగి సురనారీసూనుఁ గీర్తించుచున్. 14

అ. లతాంగులు=మనోరమచెలికత్తెలు, ఆదివ్యౌషధరాజిచేన్ = వెండికొండయందు సంగ్రహించి యిచ్చినయామంచిమందులసమూహముచేత, తమమహావ్యాధివ్యథలు=తమయొక్కయధికమైన రోగబాధలు, దీఱినన్=నివారణములుకాఁగా, మోదంబు=సంతోషమును, అంది=పొంది, అంబుజకులంబున్=తామరలసమూహమును, నవ్వుకందోయితోన్= పరిహసించునేత్రద్వయముతోను, సౌదామి...తోన్- సౌదామినీ=మెఱపుఁదీఁగవలె, అభిరామ=ఒప్పిదమయిన, దేహరుచితోన్=శరీరకాంతితోను, సంపూర్ణచంద్ర=నిండుచందురునివంటి, ఆనన = ముఖముయొక్క, శ్రీ=కాంతిసంపదయొక్క, గర్వ=గర్వముయొక్క, ఉన్నతితోన్=అధిక్యముతోను, చెలంగి=ఒప్పి, సురనారీసూనున్=దేవతాస్త్రీకుమారుఁడయిన స్వరోచిని, కీర్తించుచున్=పొగడుచును-పైపద్యముతో నన్వయము అలం. ఉపమ.

క. మా కుపకార మొనర్చితి, నీకుం బ్రతిసేయ నెట్లు నేరుతు మైనన్
లోకోత్తర మావలనను, జేకొనుకార్యములుఁ గలవు చెప్పెద మెలమిన్. 15

అ. లోకోత్తర=లోకమునందు శ్రేష్ఠుఁడవైనయోమహారాజా, మాకు, ఉపకారము=మేలు, ఒనర్చితి=చేసితివి, నీకు, ప్రతిసేయన్=మఱుమేలుచేయుటకు, ఎట్లు నేరుతుము=ఏవిధముగా సమర్థుల మగుదుము-మేము మఱుమేలు చేయఁగలవారము కామనుట. ఐనన్=మఱుమేలు చేయలేనివార మయినను, మావలనను=మావలనఁగూడ, చేకొనుకార్యములున్=గ్రహింపఁదగినపనులును, కలవు=కొన్ని గలవు, ఎలమిన్=సంతోషముతో, చెప్పెదము=ఆపనులను జెప్పెదము. (వినుము.)

తా. ఓమహారాజా నీవు మాకు నుపకారము చేసితివి. అందులకుఁ బ్రత్యుపకారము చేయ మేము చాలినవారము కాము. అయినను మావలనఁ గూడ నీకు గ్రహింపఁదగినవి కొన్ని గలవు. వానిని జెప్పెదము వినుము

క. మును మాదగువృత్తాంతము, వినిపింపఁగ వలయు నీకు విశ్రుతముగ భూ
వినుత విను మనుచు నందొక, వనజేక్షణ పలికె మధురవాగ్జితశుకియై. 16

అ. భూవినుత=భూమియందుఁ బొగడఁబడిన యోరాజా, మును=ముందు, మాదగువృత్తాంతము=మాదైన సమాచారము, విశ్రుతముగన్ = చక్కఁగాఁ దెలియునట్లు, నీకు, వినిపింపఁగవలయున్ = శ్రుతపఱుపవలయు- చెప్పవలెను. వినుము, అనుచున్ = అనిపలుకుచు, అందొకవనజేక్షణ=వారిలో నొకచిన్నది, మధురవాగ్జితశుకియై = తియ్యనిమాటలచేత గెలువఁబడిన యాఁడుఁజిలుకలుగలదై-చిలుకపలుకులవంటి పలుకులుగలదై యనుట పలికెన్ = చెప్పెను-అనఁగా, ఆమనోరమ చెలికత్తెలలో నొకతె ముందు మాసమాచారము చెప్పెదను వినుమని యింపైనమాటలతోఁ జెప్ప నారంభించెను. అలం ఉపమ.

తే. అనఘ మందారవిద్యాధరాత్మభవను, నను విభావసి యండ్రు గంధర్వవరులు
తెలిసియుండుదు నిమ్మహీతలమునందుఁ, బరఁగుమృగపక్షిజాతులభాష లెల్ల. 17

అ. అనఘ=పాపము లేనివాఁడవైన యోరాజా, (నేను) మందార...వను-మందార=మందారుఁడను పేరుగల, విద్యాధర=విద్యాధరునియొక్క, ఆత్మభవను=కూఁతురను, ననున్=నన్ను, గంధర్వవరులు=గంధర్వశ్రేష్ఠులు, విభావసి, అండ్రు=అని చెప్పుదురు, ఇమ్మహీతలమునందున్=ఈభూమండలమునందు, పరఁగు...భాషలు- పరఁగు=ప్రవర్తిలునట్టి, మృగపక్షిజాతుల=మృగజాతులయొక్కయు పక్షిజాతులయొక్కయు, భాషలు=మాటలు, ఎల్లన్=అన్నియును, తెలిసియుండుదున్=నేను గుర్తెఱిఁగియున్నాను.

క. అమ్మేటివిద్య నాచే, నిమ్ముగ నంతయు నెఱింగి నృప నన్ను వివా
హ మ్మగు మనవుడు రెండవ, కొమ్మ మదిం బ్రేమ గడలుకొన నిట్లనియెన్. 18

అ. నృప=రాజా, అమ్మేటివిద్య = పూజ్యమయిన యావిద్యను, నాచేన్=నావలన, ఇమ్ముగన్=బాగుగా, అంతయున్=సర్వమును, ఎఱింగి=తెలిసికొని, నన్ను, వివాహమ్మగుము = పెండ్లియాడుము, అనవుడున్ =అనఁగానే, రెండవకొమ్మ=దానితోడిదైనమఱియొకవనిత, మదిన్=మనసునందు, ప్రేమ=ప్రియము-అనురాగము, కడలుకొనంగన్=అతిశయింపఁగా, ఇట్లనియెన్=ఇట్లుపలికెను

ఆ. పారుఁడనఁగఁ బరఁగుబ్రహ్మర్షి మాతండ్రి, యతఁడు విద్యలెల్ల నభ్యసించి
తపము నిచ్చఁ జేయఁ దలపోసి కీరభృం, గాలి రమ్యమైన యాశ్రమమున 19

అ. మాతండ్రి, పారుఁడనఁగన్ = పారుఁడనుపేరిచేత, పరఁగుబ్రహ్మర్షి=ప్రసిద్ధుఁడైన బ్రహ్మఋషి, అతఁడు=ఆయన, విద్యలెల్లన్ = అన్నివిద్యలను, అభ్యసించి=నేర్చి, ఇచ్చన్ = మనసునందు, (నిచ్చ=ఎల్లప్పుడును, అనికొందఱు.) తపమున్=తపస్సును, చేయన్=చేయునట్లు, తలపోసి=తలఁచి, కీరభృంగాలిన్=చిలుకలయుఁ దుమ్మెదలయు బారులచేత, రమ్యము=మనోహరము, ఐన యాశ్రమమున్=అయినట్టి తపోవనప్రదేశమునందు-పైపద్యముతో నన్వయము.

మ. ఫలమూలచ్ఛదనాంబుభుక్తిఁ బవనాభ్యాసక్రియాయుక్తి ని
ర్దళితాంతర్గతశాత్రవప్రకరజాగ్రద్గర్వసర్వస్వుఁడై
చలికిన్ వానకు నెండకున్ మన మనుత్సాహంబు గానీక కం
దళితానందమునన్ ముకుందచరణధ్యానావధానంబునన్. 20

అ. ఫల...భుక్తిన్-ఫల=పండ్లయొక్కయు, మూల=వేళ్లయొక్కయు, ఛదన = ఆకులయొక్కయు, అంబు=నీటియొక్కయు, భుక్తిన్=భోజనముచేతను, పవనాభ్యాసక్రియాయుక్తిన్=వాయుధారణము వాడుక చేయునట్టి వ్యాపారముయొక్క కూడికచేతను-వాయుధారణ చేయుటచేత ననుట, నిర్దళిత..సర్వస్వుఁడై-నిర్దళిత=ఖండింపఁబడిన, అంతర్గత = తనలోపలనుండెడి కామక్రోధాదులయిన, శాత్రవ=శత్రువులయొక్క, ప్రకర = సమూహముయొక్క, జాగ్రత్=హెచ్చరికగల-అతిశయించిన, గర్వసర్వస్వుఁడై=సర్వగర్వముగలవాఁడై-అరిషడ్వర్గము నణఁచినవాఁడై యనుట, చలికిన్=శీతబాధకును, వానకును, ఎండకును, మనము=మనస్సు, అనుత్సాహంబు=ప్రయత్నముమాలినది, కానీక=కానియ్యక-చలి వాన యెండ వీనివలని బాధను సహించి యనుట, కందళితానందమునన్ = మొలచుచున్న సంతోషముతో, ముకుంద ..బునన్-ముకుంద=విష్ణుదేవునియొక్క, చరణ=పాదములయొక్క, ధ్యాన=ఎడతెగక తలఁచుచుండుటయందలి, అవధానంబునన్=ఎచ్చరికతో-మీఁదికన్వయము.

తా. పండ్లు వేళ్లు దుంపలు పండుటాకులు నాహారముగా వాయుధారణచేసి యరిషడ్వర్గము నణఁచి చలి యెండ వాన వీనివలనిబాధచేత మనస్సు చలింపనీయక స్థిరముగా నిలుపుకొని సంతోషముతో విష్ణుదేవునిపాదములను ధ్యానించుటయందుఁ బరాకులేనివాఁడై.

క. అంగుష్ఠము నిల మోపి ప, తంగునిపైఁ జూపు సాఁచి ధగధగ లర్చి
స్తుంగత నింగులు నాకెడు, నింగలములు నాల్గుదెసల నిడుకొని కడకన్. 21

అ. అంగుష్ఠమున్=కాలిబొటనవ్రేలిని, ఇలన్=భూమియందు, మోపి=నిలిపి, పతంగునిపైన్=సూర్యునిమీఁద, చూపు=దృష్టిని, చాఁచి=పఱపి, ధగధగలు=ధగధగయనెడివెలుఁగులు, అర్చిస్తుంగతన్=మంటలయొక్క పొడుగుచేత-మీఁదికెగసినమంటలచేత ననుట, నింగులు=ఆకాశమును,(ఇచ్చట బహువచనము హెచ్చును దెలుపును)నాకెడునింగలములు=అంటుచున్నయగ్నులను, నాల్గుదెసలన్=నాలుగుప్రక్కలను, ఇడుకొని=ఉంచుకొని, కడఁకన్=పూనికతో-మీఁదికన్వయము.

తా. కాలిబొటనవ్రేలు నేలమీఁద మోపి నిలిచి సూర్యునిఁ జూచుచు మిన్నంటమండుచున్నయగ్నులు చుట్టు నుంచుకొని పూనికతోను, పంచాగ్నిమధ్యమున మిన్ను చూచుచుఁ గాలిబొటనవ్రేలితో నిలిచె యని భావము. అలం అతిశయోక్తి

క. సురగరుడయక్షరాక్షస, నరకిన్నరసిద్ధసాధ్యనాగోత్కర మి
ట్లరు దనఁగఁ దప మొనర్చెం, బురుహూతుఁడు దాన నాత్మఁ బొడమినభీతిన్.

అ. సుర ..త్కరము=దేవతలు గరుడులు యక్షులు రాక్షసులు నరులు కిన్నరులు సిద్ధులు సాధ్యులు నాగులు వీరియొక్క సమూహము, ఇట్లు=ఈవిధముగాఁ దపస్సుచేయుట, అరుదు=దుర్లభము, అనఁగన్=అనునట్లుగా, తపము=తపస్సు, ఒనర్చెన్=చేసెను. దానన్=అట్లు తపస్సు చేయుటచేత, పురుహూతుఁడు=ఇంద్రుఁడు, ఆత్మన్=మనస్సునందు, పొడమినభీతిన్=పుట్టినభయముతో-మనసునందు భయ

ముగలవాఁడై యనుట. (ఇంద్రుఁడెవ్వరేని ఘోరతపస్సుచేయునప్పుడు వారు తపస్సిద్ధిఁబొందిరేని తన త్రిలోకాధిపత్యము నాక్రమింతురని వెఱచి వారితపస్సులు చెఱచుచుండునందురు )

క. తనయొద్దఁ బుంజికస్థల, యనునచ్చరలేమ యున్న నమ్మునికడకుం
జను మని యనిపినఁ బతిశా, సనమున వ్వని యేఁగుదెంచె సంభ్రమలీలన్. 23

అ. తనయొద్దన్=తనదగ్గఱ, పుంజికస్థల, అనునచ్చరలేమ=అను పేరుగలయప్సరస్త్రీ, ఉన్నన్=ఉండఁగా, (దానిని) అమ్మునికడకున్=ఆతపస్సుచేయుచున్న ఋషిదగ్గఱకు, చనుము=నీవుపొమ్ము, అని, యనిపినన్=అని చెప్పిపంపఁగా, (అది)పతిశాసనమునన్=తనప్రభువుయొక్క యాజ్ఞచేత సంభ్రమలీలన్=తొందరతోడి విలాసముతో, వనికిన్=(ఆయనతపస్సు చేయుచున్న)వనమునకు, ఏఁగుదెంచెన్=వచ్చెను.

చ చిలుకలు ముద్దుఁబల్కులకుఁ జేరఁగ రా నెఱివేణికాంతికిన్
మలయుచుఁ బైఁ బయిన్ మధుపమాలిక పాయక సంచరింపఁగా
నలసవిలాసయానమున నమ్మునిపాలికి వచ్చె వేల్పుఁబో
య్యాలి నునుసానఁబట్టినయనంగుని మోహనబాణమో యనన్ 24

అ వేల్పుఁబోయ్యాలి=దేవతాస్త్రీయయిన పుంజికస్థల, ముద్దుఁబల్కులకున్=తనయొక్క మనోహరములైన మాటలకు, చిలుకలు, చేరఁగరాన్=(చిలుకలే మాటలాడుచున్నవని) దగ్గఱ రాఁగా, నెఱివేణి కాంతికిన్=అందమయినజడయొక్క ప్రకాశమునకు, మధుపమాలిక=తుమ్మెదలచాలు, పైపయిన్=మీఁద మీఁద, మలయుచున్=పర్వుచు, పాయక=ఎడఁబాయక, సంచరింపఁగాన్=తిరుగఁగా- తుమ్మెదలు జడనుజూచి తుమ్మెదలబారని భ్రమించి యావరించి సంచరింపఁగా ననుట, అలస... మునన్ -అలస= మెల్లని, విలాస=ఒయ్యారముతోడి, యానమునన్=నడకతో, నును బాణమో-నును=నునుపైన, (బాణమునకు విశేషణము) సానఁబట్టిన=సానయందుఁ బదును రానూఁదిన, అనంగుని=మన్మథునియొక్క, మోహనబాణమో=మోహమును గలిగించుటచే మోహనమనెడిబాణమో యేమో, అనన్ = అనునట్లు, అమ్మునిపాలికిన్=ఆఋషియొద్దకు, వచ్చెను.

తా. చిలుకపలుకులవంటి మనోహరములైనమాటలును, తుమ్మెదలబారువంటి బారైనజడయును, ఒయ్యారముతోడి మెల్లనినడకయు, నొప్పఁగా మన్మథునిదైన మోహనబాణమువలె వలపుపుట్టించునదియై యాయప్సరస తపస్సుచేయుచున్న పారఁడనెడిమునియొద్దకు వచ్చెను అలం॥ ఉత్ప్రేక్ష, ఉపమ, భ్రాంతిమంతమును.

వ ఆసమయంబున. 25

చ. అనువగుసుళ్ల నొప్పుమలయానిలవాహము నెక్కి తేఁట్లు న
ల్లినవిడువాగెఁ బూని లవలీనవవల్లిక లెమ్మెసొమ్ములై
పనుపడఁ జెట్లు వట్టి మనుశ్రాంతదళిమ్ములతోడఁ దోలె నా
మనిదొర మంచురాజు మిడిసిమాచగఁ గోయిలగంట మ్రోయఁగన్. 26

అ. (ఇందు వసంతఋతువును బగతునిపై దండెత్తు నొకరాజుఁగాఁ గవి రూపించుచున్నాఁడు) ఆమనిదొర = వసంతఋతువనెడిరాజు, అనువు = యుక్తము, అగుసుళ్లన్ = అయినట్టి చుట్టిచుట్టి వీచుట లనెడిదేవమణి మొదలయినసుళ్లచేత, ఒప్పుమలయానిలవాహమున్ = ఒప్పిదమైన గంధపుఁ

గొండనుండి వచ్చునట్టిచల్లగాలి యనెడుగుఱ్ఱమును, ఎక్కి=ఎక్కినవాఁడై, తేంట్లన్=తుమ్మెదలచేత, అల్లినసిడువాగెన్ - అల్లిన=పెనఁచిన, సిడువాగెన్=సిడుపైనకట్టినపగ్గమును, పూని=వహించి-పట్టి, లవలీనవపల్లికలు=క్రొత్తవెన్నెలతీఁగలు, ఎమ్మెసొమ్ములై = అందమైనయాభరణములై, పనుపడన్=జత పడఁగా, చెట్లుపట్టి=వృక్షముల నాశ్రయించి,మనుప్రాంతదళములతోడన్=వర్తించునట్టి పండుటాకుల నెడి జీవించునట్టి పురాతనభృత్యులదండులతో, మంచురాజు=మంచుకాలమనెడిపగరాజు, మడిమంచగన్=బలహీనుఁడు కాఁగా, కోయిలగంట=కోయిలకూఁత యనెడిజయఘంట, మ్రోయంగన్=వాఁగుచుండఁగా, తోలెన్=తఱిమెను.

తా. సుడిసిసుడిసి వీచుచున్న చల్లగాలితోడను బారులుదీరి మెరయుచున్న తుమ్మెదలతోడను వెన్నెలతీఁగలపెంపుతోను వసంతఋతువు మంచిసుళ్లుగల గుఱ్ఱమునెక్కి కళ్లెపువాఱు బిగఁబట్టి మనోహరములైన సొమ్ములుధరించి వచ్చునట్టిమహారాజువలె వచ్చి పెంపుతగ్గినమంచుకాలమనెడి పగరాజును వృక్షములందలి పండుటాకు లనెడిపురాతనభటులసేనలతోడఁ దఱుమఁగొట్టి గోయిలకూఁత లనెడి జయఘంటను మ్రోఁగించెను మంచుకాలము కడచిపోఁగా వృక్షములలోనియాకులు పండిరాలెననియు, వసంతఋతువురాఁగా దక్షిణపుఁజల్లగాలివీవఁగాఁ దుమ్మెదలు బారులుదీరి తిరుగసాగెననియు, వెన్నెలతీఁగెలు చిగిర్చి యల్లుకొనసాగె ననియు భావము. అలం. రూపకము

సీ. సానదేఱి పొటమరించి నెఱె వాసినయట్టి,యాకురాలుపుగండ్లయందుఁదొఱఁగి
యతిబాలకీరచ్ఛదాంకురాకృతిఁ బొల్చి, కరవీరకోరకగతిఁ గ్రమమున
నరుణంపుమొగ్గలై యరవిచ్చి పికిలియీఁ, కలదండలట్లు గుంపులయి పిదప
రేఖ లేర్పడఁగ వర్ధిలి వెడల్పయి రెమ్మ, పసరువాఱుచు నిక్కఁ బసరు కప్పు
పూఁటపూఁటకు నెక్కఁగప్పునకుఁదగిన, మెఱుఁగు నానాఁటికిని మీఁద గిటికొనంగ
సొగసైయాకువాలంగ జొంపమగుచుఁ,జిగురుదళుకొత్తెఁదరులతాశ్రేణులందు.

అ. సాన=ద్రవము, తేఱి=తేటగాఁగనఁబడి - చెమ్మయుబికియనుట, పొటమరించి=మొలకెత్తి, నెఱె=సందు, పాసిన..యందున్ - పాసినయట్టి=విచ్చినటువంటి,ఆకురాలుపుగండ్లయందున్=ఆకులురాలినపట్లములయందుండి,తొఱఁగి=బయలు వెడలి, అతి..కృతిన్ - అతి=మిక్కిలి, బాలకీర=లేఁతయైనచిలుకపిల్లలయొక్క,ఛదాంకుర=ఱెక్కమొలకలయొక్క, ఆకృతిన్=ఆకారముతో,పొల్చి=ఒప్పి,క్రమమునన్=వరుసవెంబడిని, కరవీరకోరకగతిన్=ఎఱ్ఱగన్నేరుమొగ్గలవలె, అరుణంపుమొగ్గలై=ఇంచుకయెఱుపైనముకుళములై, అరవిచ్చి=సగమువిరిసి,పికిలియీఁకలదండలట్లు=పికిలిపక్షులయీఁకలతోఁగూర్చినసరములవలె, గుంపులయి=గుబురులై, పిదపన్=తరువాత, రేఖలు=ఈనెలగీఱలు, ఏర్పడఁగన్ = ఏర్పడునట్లు, వర్ధిలి=వృద్ధిపొంది, వెడల్పయి=విశాలమై, రెమ్మ=చిఱుఁగొమ్మ, పసరువాఱుచున్=పచ్చగిల్లుచు, నిక్కన్=ఎగువునొందఁగా, పసరు=పచ్చగిల్లఁగానైన పచ్చఁదనము, పూఁటపూఁటకున్=ఒక్కొక్క పూఁటకు, కప్పు=నలుపు, ఎక్కన్=కలదికాఁగా, కప్పునకున్=ఆనలుపునకు, తగిన మెఱుఁగు=యుక్తమయిన ప్రకాశము, మీఁదన్-పైభాగమునందు, నానాఁటికిన్=దినదినమునకు,గిటికొనంగన్=ఆవరింపఁగా, సొగసై=నిడుపై, ఆకు, వాలంగన్=వ్రేలఁబడఁగా, జొంపము=గుబురుగొన్నది, అగుచున్= అవుచును, తరులతాశ్రేణులందున్=వృక్షములయొక్కయు తీఁగలయొక్కయు పఙ్క్తులయందు, చిగురు, దళుకొత్తెన్=ప్రకాశించెను

తా॥ వసంతఋతువు రాఁగా ద్రాక్షలు తీఁగలు మొదలగువానియందలి పండుటాకులు రాలఁగాఁ గా నాయాకులు రాలినచోటులందుఁ జెమ్మ గలిగి మొలకలు పొటమరించి తొలుత గ్రుడ్డువిచ్చి వెడలినచిలుకపిల్లలయొక్క ముక్కులవలెఁ దోఁచి పిమ్మట నెఱ్ఱగ నెఱుపువన్నె మొగ్గలై యనంతరము నాయెగ్గలు విరిసి పికిలిపిట్టలయీఁకలవలె నేర్పడి తరువాత నీనెలుబలియ నెదిగి పసరువన్నె గలిగి యాపసరువన్నె నల్లఁబాఱి యందులకుఁ దగినకాంతితో నిడుపై యాకు వాలఁబడఁగా గుబురుగొని చిగురు ప్రకాశించెను. అలం॥ స్వభావోక్తి.

క. హిందోళంబునఁ బాడిరి, బృందారకసతులు విరహిబృందార్తిగఁ ద్రేఁ
చెం దేఁటులు వాసంతిక, విందునఁ బికశిశువు దాదిఁ వెడలం ద్రోలెన్. 28

అ. (ఆసమయమునందు) బృందారకసతులు=దేవతాస్త్రీలు, విరహిబృందార్తిగన్=ప్రియుల నెడఁబాసిన స్త్రీలయొక్కయుఁ బ్రియల నెడఁబాసినపురుషులయొక్కయు సమూహమునకు బాధకలుగునట్టుగా, హిందోళంబునన్=హిందోళమనెడిరాగముతో, పాడిరి=గానము చేసిరి, తేఁటులు=తుమ్మెదలు, వాసంతికవిందునన్ = బండిగురివెందపూఁదేనె త్రాగుట యనెడిప్రియభోజనముచేత, త్రేఁచెన్=తృప్తి నొంది త్రేనుపువిడిచెను, పికశిశువున్=కోవెలపిల్లను, దాది=పెంపుడుతల్లియైనకాకి, వెడలం ద్రోలెన్=గూఁటినుండి వెడలఁగొట్టెను–కోవెలకూసెననుట. (వసంతకాలము రాఁగానే కోవెలకూయుటయు నాకూఁతవిని కాకి కోవెలను గూఁటినుండి వెడలఁదఱుముటయు సుప్రసిద్ధము. ‘‘శ్లో॥ శిశిరస్య వసంతస్య సంధౌ హిందోళరాగకః–శిశిరఋతువుయొక్కయు వసంతఋతువుయొక్కయు చేరికయందు హిందోళరాగముతో గానముచేయవలయు’’ అనుప్రమాణముచేత వసంతాదియగుటంబట్టి హిందోళంబునఁ బాడిరని చెప్పఁబడెను.

సీ. చలిగాలి బొండుమల్లెలపరాగము రేఁచి, నిబిడంబు సేసె వెన్నెలరసంబు
వెన్నెలరస మిబ్బి వెడలించె దీర్ఘికా, మందసౌగంధికమధునదంబు
మధునదం బెగఁబోసె మాకందమాలికా, క్రీడానుషంగిభృంగీరవంబు
భృంగీరవం బహంకృతిఁ దీఁగెసాగించెఁ, బ్రోషితభర్తృకారోదనముల
విపినవీథుల వీతెంచెఁ గుపితమదన, సమదభుజనతసుమధనుష్టాంకృతములు
సరసమధుపాననిధువనోత్సవవిలీన, యువతియువకోటికోరికల్ చివురులొత్త.

అ. చలిగాలి=చల్లగాలి, బొండుమల్లెలపరాగమున్ = బొండుమల్లెపూవులందలి పుప్పొడిని, రేఁచి = రేఁగించి, వెన్నెలరసంబున్ = చంద్రప్రకాశముయొక్క నీటిని, నిబిడంబు సేసెన్ = నిండుకొనునట్లు చేసెను, వెన్నెలరసము = ఆవెన్నెలయొక్క ద్రవము, ఉబ్బి = ఉబికి – పొంగి, దీర్ఘికా నదంబున్ – దీర్ఘికా=నడబావులయందలి, అమంద=తక్కువకాని – అధికమైన, సౌగంధిక=మిక్కిలిపరిమళముగల చెంగలువలవలని, మధు=పూఁదేనెయొక్క, నదంబున్=ఏటిని, వెడలించెన్=బయలు వెడలించెను–ప్రవహింపఁజేసెను. మధునదంబు=ఆపూఁదేనెయేఱు, మాకంద...రవంబున్ –మాకంద = తియ్యమామిడిచెట్లయొక్క, మాలికా=వరుసలయందలి, క్రీడా=విహారములతోడ, అనుషంగి=కూడుకొన్న, భృంగీ=ఆఁడుతుమ్మెదలయొక్క, రవంబు=ఝుంకారధ్వనిని, ఎగఁబోసెన్ = అతిశయింపఁజేసెను, భృంగీరవంబు=ఆయాఁడుతుమ్మెదలరొద, అహంకృతిన్ = గర్వముచేత, ప్రోషితభర్తృకా

రోదనములన్ - ప్రోషితభర్తృకా=భర్తదేశాంతరగతుఁడైయుండుటచే ఖేదమునొందిన స్త్రీలయొక్క, రోదనములన్ =ఏడ్పులను, తీఁగసాగించెన్ =మిక్కిలిపెంచెను; కుపిత కృతములు-కుపిత=కోపించిన, మదన=మన్మథునియొక్క, సమద=మదముతోఁగూడిన, భుజ=బాహువులచేత, నత=వంపఁబడిన, సుమధనుః=పూవింటియొక్క, టాంకృతములు=టఙ్కారధ్వనులు, సరస కోరికలు- సరస=రసవంతమైన, మధుపాన=మద్యముత్రాగి, నిధువన=సురతక్రీడనడపుటయొక్క, ఉత్సవ=వేడుకయందు, విలీన=ఐక్యమైయున్న, యువతి=యౌవనస్త్రీలయొక్కయు, యువ=యౌవనపురుషులయొక్కయు, కోటి =సమూహముయొక్క, కోరికలు=అభీష్టములు, చివురులొత్తెన్ =చిగిరింపఁగా- పెరుఁగఁగొననుట, విపిన వీథులన్ =వనమార్గములయందు-ఉద్యానవనములందనుట, వీతెంచెన్ =విసరెను-వ్యాపించెను.

తా. ఆవసంతసమయమునందుఁ జల్లగాలిచే రేఁగిన పెనుమల్లెలపుప్పొడిచేత వెన్నెలవలన ద్రవించుచున్న నీరు చిక్కనయ్యెను. వెన్నెలనీటినింపుచేత నడబావులలోనిచెంగలువలవలని పూఁదేనె యేఱులైపాఱెను. ఆపూఁదేనెవెల్లువలచేతఁ దియ్యమామిడిమ్రాఁకులలో విహరించుచున్న తుమ్మెదలరొదలు హెచ్చెను. ఆతుమ్మెదరొదలచేత, మగలు దేశాంతరమందుండుటచే దుఃఖపడుచున్న యువతులయేడ్పులతిశయించెను. ఆయేడ్పులచేత మన్మథునిపూవింటిమోఁత లుద్యానములందు వ్యాపించెను. ఆవింటిమ్రోఁతలు వ్యాపింపఁగా రుచ్యములయిన మద్యములు త్రాగి క్రీడించుచున్న స్త్రీపురుషులకోరికలు కొనసాగెను. వసంతఋతువురాఁగానే చల్లగాలియు వెన్నెలయుఁ దుమ్మెదలరొదలును కోనెలకూఁతలును మనోహరములై యొప్పెననియు, వానిచేత విరహిణీస్త్రీలకుఁ దాపమును బ్రియులతోఁగూడియుండుస్త్రీలకు నిష్టార్థసిద్ధులును సిద్ధించెననియు భావము అలం. కారణమాల. కావ్యలింగమును.

క. అత్తఱి మురిపపునడఁ జెలి, కత్తియగమి గొలువ మృదులకలభాషలఁ ద
ళ్కొత్తెడు వెడనగవులతోఁ, జిత్తభవుం డార్వ ననలుఁ జిదుము నెపమునన్. 30

అ. అత్తఱిన్ =ఆవసంతసమయమునందు, మురిపపునడన్ =యౌవనగర్వముతోడినడకతో, చెలికత్తియగమి=చెలికత్తెలయొక్కగుంపు, కొలువన్ =సేవింపఁగా, మృదులకలభాషలన్ =సులభోచ్చారణగలయింపైనమాటలతోను, తళ్కొత్తెడు వెడనగవులతోన్ =ప్రకాశించుచున్న చిఱునవ్వులతోను, చిత్తభవుండు=మన్మథుఁడు, ఆర్వన్ =కేకలువేయఁగా, ననలు=పువ్వులు, చిదుము నెపమునన్ =కోయుటయనెడిసాకుచేత. - పైపద్యముతో నన్వయము

చ. అలకనిజీబులోఁ గుసుమకెమ్మద్దినపావడ దోఁపఁ గొప్పుచెం
గలువలవల్పుఁ జన్నుఁగవకస్తురితావియుఁ బ్రస్తరింప నం
దెలరొద మీఱఁ బెన్నిధిగరితిన్ బ్రతికిం బొడకట్టె వేల్పుఁదొ
య్యాలి చిఱుసానఁబట్టినయనంగునిమోహనబాణమో యనన్. 31

అ. వేల్పుఁదొయ్యాలి=దేవతాస్త్రీయైనపుంజికస్థల, అలకనిజీబులోన్ = సన్ననివలిపపుఁజీరలో, కుసుమము=ఎఱ్ఱచాయ, అద్దినపావడ-అద్దిన=వేసిన, పావడ=గాగర-కుచ్చెళ్లకోక, తోఁపన్ =పైకిఁ గనఁబడఁగా, కొప్పు. . . వల్పున్ - కొప్పు=కొప్పునందుఁదుఱిమిన, చెంగలువల=ఎఱ్ఱగలువలయొక్క, వల్పున్ =పరిమళమును, చన్నుఁ తావియున్ -చన్నుఁగవ=స్తనద్వయమునందుఁ(బూయఁబడిన), కస్తురి=కస్తూరియొక్క, తావియున్ =పరిమళమును, ప్రస్తరింపన్ =లెచ్చునలాడఁగా-నలుప్రక్కలును వ్యాపింపఁగా, అందెలరొద=కాలియందెలయొక్క-ధ్వని, మీఱన్ =అతిశయింపఁగా, పెన్నిధిగరితన్ =పెద్దసంపదయువతె,

చిఱుసానన్ = చిన్నదైన మెఱుఁగుసానియందు, పట్టిన . . బాణమో - పట్టిన = పదునురానూఁదిన, అనంగుని = మన్మథునిదైన, మోహనబాణమో = మోహమును బుట్టించునదియైన యరవిందబాణమో, అనన్ = అనునట్లు, ప్రతికిన్ = ప్రతినిష్ఠఁగలవాఁడయిన యామునీశ్వరునకు, పొడకట్టెన్ = కనఁబడెను

తా. అప్పుడు పుంజికస్థల యనెడియాయప్సరస కుసుంబాచాయ వేసిన పావడగట్టుకొని దానిపై వలిపపుఁబయఁటచీర ధరించి మంచివాసనగలయెఱ్ఱగలువపువ్వులు కొప్పునఁజెరివి బొమ్మనందుఁ గస్తూరి గంధము పూసికొని వానిపరిమళము లెల్లయెడలను వ్యాపింపఁగా మన్మథునిదైన మోహన మనెడిబాణమో యనునట్లు కాలియందెలు మ్రోయ నొయ్యారపునడతో నామునీశ్వరునెదుటఁ బెన్నిధివలెనే నిలువఁబడెను. అలం. ఉత్ప్రేక్ష, అపహ్నవము.

తే. అత్తెఱంగున నదిరిపా టై టారజంపు
వన్నెఁ బొడకట్టి తాఁ బాడు సన్నరవళి
పాట లళిఝంకృతిశ్రుతిఁ బాదుకొనఁగఁ
జూడకయ చూచుచూపుతో సుడియుటయును. 32

అ. అత్తెఱంగునన్ = ఆవిధముగా, అదిరిపాటు = ఉన్నట్టుండి - అకస్మాత్తుగా, ఆరజంపువన్నెన్ = మనోహరమైన వేషముతో, పొడకట్టి = ఆమునికిఁ గనఁబడి, తాన్ = తాను, పాడు పాటలు - పాడు = పాడునట్టి, సన్నరవళి = సూక్ష్మధ్వనితోడి, పాటలు, అళిఝంకృతిశ్రుతిన్ = తుమ్మెదలఝుమ్మనురొదలనెడి సుతియందు, పాదుకొనఁగన్ = నెలకొనఁగా - లయింపఁగాననుట, చూడకయ = చూడనట్లే, చూచుచూపుతోన్ = చూచునట్టియోరచూపుతో, సుడియుటయును = చుట్టిచుట్టి మెలఁగఁగా

తా. ఆవిధముగా నుట్టిపడినట్టు మనోహరమయిన వేషముతో నామునీశ్వరునకుఁ గనఁబడి తుమ్మెదలఝంకారధ్వనితో లయించునట్టు సూక్ష్మధ్వనితోఁ బాటపాడుచు నోరచూపులతో నామునీశ్వరునిఁ జూచుచుఁ జుట్టిచుట్టి తిరుగుచుండఁగా.

చ. తలకొని దానితమ్ములపుఁ దావియు మోవియుఁ గౌను మేను న
గ్గలపుమెఱుంగు లీను తెలిగన్నులుఁ జన్నులు భృంగమాలిక
న్గెలిచినయారుతీరుఁ దగు నెన్నడలుం దొడలున్ వివేకముం
గలఁపఁగఁ గాంచి పంచశరకాండవిఖండితధైర్యసారుఁ డై. 33

అ. దానితమ్ములపుఁదావియున్ = ఆయప్సరసదైన తాంబూలపుఁబరిమళమును, మోవియున్ = అధరమును, కౌనున్ = నడుమును, మేనున్ = దేహమును, అగ్గలపు మెఱుంగులు = అధికమైన కాంతులను, ఈను తెలిగన్నులున్ = పుట్టించునట్టి స్వచ్ఛములయినకన్నులును, చన్నులున్ = స్తనములును, భృంగమాలికన్ = తుమ్మెదలబారును, గెలిచినయారుతీరున్ = జయించిన(మించిన)నూఁగారుచక్కఁదనమును, తగు నెన్నడల్గున్ = తగినమనోహరమ్మయిననడలును, తొడలున్ = ఊరువులును, తలకొని = పూని, వివేకమున్ = మంచిచెడ్డలనెఱిఁగెడి తనతెలివిని, కలఁపఁగన్ = కలఁతనొందింపఁగా (మునీశ్వరుఁడు), కాంచి = పుంజికస్థలనుజూచి, పంచ . సారుఁడై - పంచశర = మన్మథునియొక్క, కాండ = బాణములచేత, విఖండిత = లెస్సగా నఱకఁబడిన, ధైర్యసారుఁడై = ధీరత్వముయొక్క స్థిరాంశముగలవాఁడై - మీఁదిపద్యములో నన్వయము

పుంజికస్థలయనెడి యప్సరసయొక్క తాంబూలపుఁబరిమళమును దాని యవయవముల మనోహరత్వమును దాని చూపులతీరును దానినడలయందమును జూచి యామునిచంద్రుఁడు కాలిక్రిందఁబడు మన్మథవేదనగలవాఁడై. అలం. ఉపమ, కావ్యలింగము.

క. మేను గరుపారఁ దపమిన, మ్మౌని జపముఁ దపముఁ దన్ను మఱచి యనంగ
గ్లానిఁ బడి కదిసి వడఁకుచు, హీనస్వర మెసఁగఁ బ్రోవవే నన్ననుచున్. 34

అ. అమ్మౌని=ఆమునీశ్వరుఁడు, మేను=దేహము, గరుపారన్ = గగుర్పాటుచెందఁగా, తపమునన్=తపముచేత, జపమున్ = మంత్రావృత్తిని, తపమున్=నియమముతోడి నిశ్చలమైనయునికిని, తన్నున్=తన హైనస్థితిని, మఱచి=మఱచిపోయి, అనంగగ్లానిన్=మన్మథతాపమును, పడి=పొంది, కదిసి=ఆయప్సరసను గ్గఱఁజేరి, వడఁకుచున్=సాత్త్వికభావజనితమైనవణఁకును బొందుచు, హీనస్వరము=తొట్రుపాటు గల గొంతుక, ఎసఁగన్=అతిశయింపఁగా, నన్ను, ప్రోవవే=పోషింపవే, అనుచున్=అని వేఁడుకొనుచు,—దీనికి న్వయము.

తే. చెయ్యిపట్టినమాత్రాన శిరసు వంచి, యవశచందానఁ బైవ్రాలు నవ్వధూటిఁ
బర్ణశాలాంతరముఁ జేర్చి బ్రాహ్మణుండు, కెరలుకోర్కులఁ గందర్పకేళిఁ దేలె.

అ. చెయ్యిపట్టినమాత్రానన్=చేయిపట్టుకొన్నమాత్రముచేతనే, శిరసు=తలను, వంచి=వాల్చి, అవశచందానన్=మోహపరవశయైనవిధమున, పైవ్రాలునవ్వధూటిన్=మీఁదికొరిగినయాయప్సరస్స్త్రీని, పర్ణశాలాంతరమున్=ఆకుటింటిలోపల, చేర్చి = చేరఁదీసికొనిపోయి, బ్రాహ్మణుండు=ఆబ్రహ్మర్షి-వాఁడు, కెరలుకోర్కులన్ = అతిశయించుచున్నయపేక్షలతో, కందర్పకేళిన్=మన్మథక్రీడయందు-సురతమునందు, తేలెన్=ఓలలాడెను-సుఖించెననుట.

* క. తపమంతయుఁ బొలివోవఁగ, నపు డన్నియు నుజ్జగించి యయ్యంగనతోఁ
దపసి మనోజక్రీడా, విపులైశ్వర్యంబు లనుభవించుచు నుండెన్. 36

అ. తపసి=ఆతపస్సుచేయుచున్నఋషి, తపమంతయున్=తానుజేసినతపస్సంతయు, పొలివోవఁగన్=వ్యర్థమైపోఁగా, అపుడు=ఆసమయమునందు, అన్నియున్=జపతపాదులన్నియు, ఉజ్జగించి=విడిచి, అయ్యంగనతోన్=ఆపుంజికస్థలతో, మనోజక్రీడావిపులైశ్వర్యంబులు-మనోజక్రీడా=సంభోగములవలని, విపుల=అధికమైన, ఐశ్వర్యంబులు=సుఖసంపదలను, అనుభవించుచునుండెన్=పొందుచుండెను-అనఁగా నామహర్షి తననుని తనతపస్సంతయు వ్యర్థమగునట్లు జపము తపము స్నానము మొదలగు నియమము లన్నియు మాని యాయప్సరసతో సంభోగసుఖము ననుభవించుచుండెను.

* పాఠాంతరము. క. తపనోదయాస్తసమయము
లిపు డని కాలప్రమాణ మెఱుఁగనితని న
చ్చపలాక్షిఁ గూడి రతిసుఖ
విపులైశ్వర్యంబు లనుభవించుచు నుండెన్.

అ. ఇపుడు=ఈసమయమునందు, తపనోదయాస్తసమయములు=ప్రొద్దుపొడుచుటయుఁ గ్రుంకుటయును, (అగును)అని, కాలప్రమాణము=వేళకొలఁది, ఎఱుఁగనితమిన్=తెలియనితమకముతో, అచ్చపలాక్షిన్=ఆపుంజికస్థలను, కూడి=కలసి, రతిసుఖవిపులైశ్వర్యంబులు=సంభోగసుఖములవలని విశేషమయిన కలిములను, అనుభవించుచునుండెన్ = పొందుచుండెను-అనఁగా నతఁడాపుంజికస్థలతోడిసురతసుఖము ననుభవించునపుడు, సూర్యుఁ డుదయించునదియు నస్తమించునదియుఁ దెలియకయుండెను.

క. ఈరీతిఁ గొంతకాలం, బారామమహామహీధరారణ్యములం
దారూఢానువలతిఁ దగిలి, విహారము సలుపంగ గర్భమై తఱి యగుడున్. 37

అ. ఈరీతిన్=ఈవిధముగా, కొంతకాలంబు, ఆరామవలలన్=ఆ పుంజికస్థలపైఁగలవలపులందు, తగిలి = ఆసక్తిగలిగి-దానికివశుఁడై, ఆరా . ములన్-ఆరామ=ఉద్యానవనములందును, మహామహీధర= గొప్పకొండలయందును, అరణ్యములన్ = అడవులయందును, విహారము=సంభోగప్రవర్తనమును, సలుపంగన్=చేయఁగా-జరపఁగా, గర్భమై=అది చూలుదాల్చి, తఱియగుడున్=ప్రసవసమయముకాఁగా-అతఁ డట్లు పుంజికస్థలతోఁగూడ కొంతకాల ముద్యానవనములు మొదలయినరమ్యప్రదేశములందు రమింపఁగా నది గర్భముధరించి ప్రసవసమయము నయ్యెను.

క. అంత ననుఁ గాంచి యది విపి, నాంతరమునఁ బాఱవైచి యరిగెఁ గృపార్ద్రా
స్వాంతుఁ డగుసంయమీంద్రుఁడుఁ, జింతింపక పోయె నేమిచెప్పుదు నధిపా. 38

అ అధిపా=రాజా, అంతన్=అంతట-ప్రసవసమయముకాఁగానే యనుట, అది=ఆయప్సరస, ననున్=నన్ను, కాంచి=కని, విపినాంతరమునన్=ఆయడవినడుమ, పాఱవైచి=విసరిపడవేసి,అరిగెన్=పోయెను, కృపార్ద్రస్వాంతుఁడు=కరుణచేఁగరఁగినమనసుగలవాఁడు, అగుసంయమీంద్రుఁడున్=అగునట్టిమునిశ్రేష్ఠుఁడును, చింతింపకపోయెన్=నన్ను విచారింపకపోయెను, ఏమిచెప్పుదున్=ఇఁక నేమిచెప్పఁగలను - కన్నతల్లిదండ్రు లిద్దఱును బసిపాపనైన నన్ను విచారింపక యేవరంతట వారుపోయి రనఁగా నాదుర్దశ యిట్టిదని చెప్పుటకు నేమిగలదనుట.

వ. అట్లు వైచి చనుటయు నాఁకటం గటకటం బడుచుండి తీండ్రించుశశిమండలం
బున వెడలుశిశిరకిరణప్రణాళికామిళితామృతరసగ్రాసంబునం జేసి కొన్నిపూఁటలం
బుటపుటనైన నన్నుం గనుంగొని మునీంద్రుం డొకఁడు ప్రియం బంది నిజాశ్రమంబున
కుం గొనిచని శశికళాసంవర్ధిత నగుటం జేసి నాకుం గళావతి యనునామం బిడి
పెనుచుచుండ నేనును జనకసేవాపరతం బ్రవర్తిల్లుచుండునంత. 39

అ అట్లు=ఆవిధముగా, వైచిచనుటయున్ = అప్సరసపాఱవేసిపోఁగా, ఆఁకటన్=ఆఁకలిచే త, కటకటంబడుచుండి=బాధపడుచుఁ బడియుండి, తీండ్రించుశశిమండలంబునన్-తీండ్రించు = మిక్కిలివెలుఁగుచున్న, శశిమండలంబునన్=చంద్రబింబమువలననుండి, వెడలు ... బునంజేసి- వెడలు=బయలుదేఱుచున్న, శిశిరకిరణ=చల్లని వెలుఁగులయొక్క, ప్రణాళికా = పరంపరతోడ, మిళిత=కూడుకొనుచున్న, అమృతరస=సుధారసముయొక్క, గ్రాసంబునం జేసి=ఆహారముచేత, కొన్నిపూఁటలన్=కొన్ని దినములలో, పుటపుటన= పెరుఁగుటకలదానను,ఐననన్నున్=అయినట్టినన్ను, కనుంగొని=చూచి, మునీంద్రుండొకఁడు=మునిశ్రేష్ఠుఁడయిన యొకవాఁడు, ప్రియంబు=ప్రేమను, అంది=వహించి, నిజాశ్రమంబునకున్=తనయాశ్రమమునకు, కొనిచని=తీసికొనిపోయి,శశికళాసంవర్ధితన్=చంద్రకళలచేత వృద్ధిఁబొందినదానను, అగుటంజేసి=అగుటచేత, నాకు, కళావతి, అను నామంబు=అనునట్టిపేరు, ఇడి=పెట్టి, పెనుచుచుండన్=వృద్ధిఁబొందించుచుండఁగా, నేనును, జనకసేవాపరతన్ = తండ్రిని సేవించుటయందలి యాసక్తతచేత, ప్రవర్తిల్లుచుండునంతన్ = మెలఁగుచుండఁగా.-పైపద్యముతో నన్వయము.

తా. ఆవిధముగాఁ గన్నతల్లి యడవిలో దిగవిడిచిపోఁగా నేనాఁకలిగొని బాధపడుచుండి యప్పుడువెలుఁగుచున్న చంద్రమండలంబుననుండి స్రవించుచున్నయమృతధారలాహారంబుగాఁ గొన్ని

ష్టములు పెరిఁగితిని. అనంతరము, నాతండ్రియైన పారుఁడు నన్నుఁ జూచి కరుణించి తనయాశ్రమమున కుఁ దీసికొనిపోయి కళావతియని పేరుపెట్టి పెంచెను. నేను నాతండ్రికి సేవచేయుచుంటిని.

(పైవచనమునర్థమే రెండుపద్యములుగాఁ బ్రత్యంతరము లందుండెననియు నాప్రక్షిప్తములనియు నామే గ్రహింపనయ్యె ననియు బ్రౌన్ దొరగారిపతిలో వ్రాయఁబడియున్నది ఆపద్యములిందును క్రిందఁ గనఁబఱుపనయ్యెడి.)

ఉ. ఆసమయంబునం బొగులు చాఁకటిపెల్లున నంతకంతకున్
గాసిలి పైపయిన్ వదనపంకజ మెండఁగ నేడ్చియేడ్చి యే
మాసయుఁ గాన కంతఁ దుహినాంశుఁడు దోఁచినఁ దత్కళారస
గ్రాసవిధిన్ శరీర మమరంగ భజించితి దైవికంబునన్. 40

అ. ఆసమయంబునన్ = అట్లు తల్లిపాఱవేసిపోయిన సమయమునందు, ఆఁకటిపెల్లునన్ = క్షుత్తు యొక్క యాధిక్యముచేత, పొగులుచున్ = తపించుచు, అంతకంతకున్ = అప్పటికప్పటికి. గాసిలి = శ్రమ పొంది, పైపయిన్ = మీఁదమీఁద, వదనగహ్వరము = గుహవలెఁ దెఱవఁబడిననోరు, ఎండఁగన్ = తడియా ఱునట్లు, ఏడ్చియేడ్చి = చాలసేపేడ్చి, ఏమాసయున్ = ఏవిధమయినయాశయును, కానక = చూంపక, అంతన్ = అనంతరము, దైవికంబునన్ = దైవసహాయమువలన, తుహినాంశుఁడు = చంద్రుఁడు, తోఁచినన్ = ఉదయించఁగా, తత్కళారసగ్రాసవిధిన్ = ఆచంద్రకళలద్రవము నాహారముగాఁ జేసికొనుటచేత, శరీరము = దేహమును, అమరంగన్ = ఒప్పఁగా, భజించితిన్ = సేవించితి - కాపాడుకొంటి ననుట.

సీ. ఏ నవ్విధంబున మేను పెంచుచు నుండ, నాచంద మంతయు నాత్మ నెఱిఁగి
కడుసంభ్రమమున నక్కడికి నేతెంచి యింపు, వెసఁగ మైనిండినకసటు దుడిచి
తనయురంబునఁ జేర్చుకొనిపోయి యాశ్రమ, స్థలమున నిజపర్ణశాల నుంచి
విధుకళాంశాహారవిధి వసించితిఁ గాన, నాకుఁ గళావతీనామ మొసఁగి
నయము మీఱంగఁ బెనుపనానాఁటఁ బెరిఁగి
శైశవముమాని యౌవనోత్సవముఁ జెంది
జనకు నేమైన నడుగుచు సంతతంబు
నోపి శుశ్రూష చేయుచు నున్నచోట. 41

అ. ఏను = నేను, అవ్విధంబునన్ = ఆప్రకారమున, మేను = దేహమును, పెంచుచునుండఁగ = పెంచుకొనుచుండఁగా, ఆచందము = అట్లునేను బెరుఁగుచుండువిధము, అంతయును, ఆత్మన్ = మనసునందు, ఎఱిఁగి = తెలిసికొని, కడుసంభ్రమమునన్ = మిక్కిలితత్తఱపాటుతో, అక్కడికిన్ = ఆ నేనున్నతావున కు, ఏతెంచి = వచ్చి, ఇంపు = సంతోషము, ఎసఁగన్ = అతిశయింపఁగా, మైన్ - నాదేహమునందు, నిండినకసటు = నిండుకొన్నమురికిని, తుడిచి, తనయురంబునన్ = తనవక్షస్స్థలమునందు, చేర్చుకొనిపోయి = అంటఁబట్టి యెత్తుకొనిపోయి, ఆశ్రమస్థలమునన్ = తపోవనప్రదేశమునందు, నిజపర్ణశాలన్ = తనదైన యాకు టింటియందు, ఉంచి = పెట్టి, విధుకళాంశాహారవిధిన్ = చంద్రకళలయంశముల నాహారముగాఁ జేసికొను టచేత, వసించితిన్ = ఉంటిని, కానన్ = కనుక, నాకు, కళావతీనామము = కళావతియనుపేరు, ఒసఁగి = ఇచ్చి, నయము = సుకుమారత్వము, మీఱంగన్ = అతిశయింపఁగా, పెనుపన్ = పెంపఁగా, నానాఁటన్ =

దినక్రమమున, పెరిఁగి=వర్ధిల్లి, శైశవము=పసిబిడ్డతనము, మాని=విడచి, యౌవనోత్సవము నమును, చెందె=పొంది, జనకుఁడు=తండ్రి, ఏమైననడుగుచున్=ఏదియైనను అడుగుచు ఎల్లప్పుడును, ఓపి =ఓపికకలిగి, శుశ్రూష = సేవ, చేయుచునున్నచోటన్ = చేయ

క. ఎవ్వరుచూచినఁ జూపుల, చివ్వకుఁ బదనడఁగి నడచుసిగ్గున నొఁ
రవ్వకు మొదలగుపాపపు, జవ్వన మెదిరించె జిగి యెసఁగ నామేన

అ. ఎవ్వరుచూచినన్ =ఎవరునన్నుఁజూచినను, చూపులచివ్వకున్ = చూపుల రించి తిరిగిచూచుటకు కనుట, పదను=వాఁడిమి, అడఁగి=తగ్గి, నడచుసిగ్గునన్=ప్రవర్తిం ఒకపై=అంతమై, రవ్వకున్=అల్లరికి - ఇట్లున్నది యట్లున్నదని చూచినవారాడిపోసికొ మూలము - కారణము, అగుపాపపుజవ్వనము=అగునట్టి దోషాస్పదమయినవయసు, నా మునందు, జిగి=నిగనిగనికాంతి, ఎసఁగన్=అతిశయింపఁగా, ఎదిరించెన్=ఎదురొ్కనె

తా. నన్నుఁ జూచినవారిని మరలఁ గన్నెత్తి ఎక్కుడుగాఁ జూచుటకు సంకో సిగ్గు హెచ్చఁగా నీపడుచిట్లున్నదట్లున్న దని చూచినజను లాడిపోసికొనుటకుఁ జ ము నాకుఁ గలిగెను. - యౌవనవంతురాల నైతినని భావము

శా. ఆవేళం బొడగాంచి ఖేచరుఁ డొకం డాసక్తి దేవాపిసం
జ్ఞావంతుండు సబాంధవుం డగుచు నిశ్శంకన్ ననున్ వేఁడువాఁ
డై వాచంయముఁ డగ్నికార్యనిరతుం డై యున్నచోఁ బర్ణశా
లావాసంబున కేఁగుదెంచి నిజభావాకాంక్ష సూచించినన్.

అ. ఆవేళన్ =అట్టినాయౌవనకాలమునందు, ఖేచరుఁడొకండు = ఒకగంధర్వుఁ జ్ఞావంతుండు=దేవాపియను పేరుగలవాఁడు, పొడగాంచి=నన్నుఁజూచి, ఆసక్తిన్=నన్ను ననెడి యపేక్షతో, సబాంధవుండు=చుట్టములతోఁగూడినవాఁడు, అగుచున్ = అవు తోఁగూడననుట, నిశ్శంకన్=జంకులేనితనముతో-జంకకయనుట, ననున్=నన్ను, వే డుగునట్టివాఁడై, వాచంయముఁడు=నాతండ్రియైనపారుఁడనుముని, అగ్నికార్యనిరతుఁ ర్యమునందాసక్తుఁడు - హోమముచేయుచున్నవాఁడు, ఐయున్నచోన్=అయియున్న లావాసంబునకున్=ఆకుటిల్లయిన యునికిపట్టునకు, ఏఁగుదెంచి=వచ్చి, నిజభావాకాంక్ష లోనికోరికను, సూచించినన్=సూచనచేయఁగా - తెలియఁజేయఁగా ననుట.

తా. అట్లు నేను యౌవనవంతురాలనై యుండఁగా దేవాపి యనెడిగంధర్వుఁడ జూచి వలచి చుట్టములతోఁగూడ పారునితపోవనమునకు వచ్చి యాయనహోమకార్య డుసమయమునందుఁ బర్ణశాలఁ జొచ్చి యీమునీశ్వరునిఁ గన్నెనిమ్మని యడుగుట యొక్క మనసులోనికోరిక యాయనకుఁ దెలియఁజేయఁగా.

సీ. శిఖిపింఛదళపరిష్కృతములై సేమంతి, విరుల తీరగు శిరోవేష్టనము
నెఱిగంటిచూడ్కిఁ దాయెతులబాహులు వంచి, నారాజు లల్లార్చుకొ
గాఢకాదంబరీగంధగర్భంబులై వల్చు, ఘనసారమిళదాస్యగంధములును
దరహాసములఁ దోఁచు తాంబూలసేవాంధ, కారితాధరరదక్షతుఁ

చిటులుగందంపుఁబూఁతలు జిహ్వికలకు
ననుపునెఱవాదిబంటుపంతపుఁబదరులు
ఘన మగుజుగుప్స వెనుప నర్జ్జనముఁ జూచి
ఋషి మనంబునఁ గడు నసహ్యించుకొనుచు. 44

అ. శిఖి...ములై-శిఖిపింఛ=నెమలిపురియొక్క, దళ=ఈఁకలచేత, [illegible] కరింపఁబడినవై, సేమంతివిరులతీరు=చేమంతిపువ్వులవిధముగలవి, అగు శిరోవేష్టనములును=[illegible] పాగాలును, ఎఱగంటి మాడ్కిన్ = మద్యపానముచేయుటచే నెఱ్ఱవారినకన్నులమాఁపుతో, [illegible] తులబాహులు=సందిటితాయెతులుగలచేతులను, పంచి=పంగునట్లుపట్టి, నారాజులు = కత్తులను, [illegible] ర్చునారజములున్=ఆడించునట్టి (త్రిప్పునట్టి) యందములును, కాదం...లై-కాదంబరీ=[illegible] క్క, గంధ=వాసన, గర్భంబులై= లోపలఁగలవై, పల్చు...ములును-పల్చు = [illegible] సార=పచ్చకర్పూరముతోడ, మిళత్=కూడిన, ఆస్యగంధములును= నోటికంపులను, [illegible] చిఱునవ్వులతోడ, తోఁచు...యొఱపును-తోఁచు=కనఁబడుచున్న, తాంబూలసేవా= [illegible] టచేత, అంధకారిత=కనఁబడనివిగాఁ జేయఁబడిన, అధర=పెదవులయందలి, రదక్షతుల=[illegible] లయొక్క, ఒఱపును=మనోహరత్వమును, చిటులుగందంపుఁబూఁతలును = దట్టముగాఁబూ[illegible] నెండి పేరెత్తినచందనపుఁబూఁతలును, జిహ్వికలకున్ = నాలుకలకు, ననుపు [illegible] వాడుకపడిన, నెఱవాది=చతురత్వముగల, బంటుపంతపు=శూరులవైనప్రతిజ్ఞలతోడి, [illegible] అపుమాటలును, ఘనము=అధికము, అగుజుగుప్స=అయినట్టిరోఁతను, పెనుపన్=వృద్ధిబొం[illegible]గా, అర్జ్జనమున్=ఆకన్యకనడుగవచ్చినగంధర్వులసమూహమును, ఋషి=ముని-మాతంగ్రడయి[illegible], చూచి, మనంబునన్=మనస్సునందు, కడున్=మిక్కిలి, అసహ్యించుకొనుచున్=రోఁతపడుకొనుచు ను-పైపద్యముతో నన్వయము.

తా. మునియైనమాతంగ్రడు కన్యనడుగఁ దనయింటికివచ్చిన యాగంధర్వులు [illegible] ర్చిచుట్టినగుండుతలపాగాలును, మద్యపానముచేయుటచే నెఱ్ఱవారినచూపులును, [illegible] చేతులందుఁ ద్రిప్పఁబడుచున్నకత్తులును, కల్లుకంపుతోఁ బరుండునట్లు తాంబూలముతోఁ [illegible] పచ్చకర్పూరపునోటికంపును, చిఱునవ్వులును పలునొక్కులు కానరాకుండునట్లుండినల[illegible] తోఁగూడిన యధరములును, చిట్లుగందపుఁబూఁతలును, నేర్పుతోడితత్తఱపుఁబలుకులును [illegible] సునకు రోఁతపుట్టింపఁగాఁ జూచి రోఁతపడుకొనుచు అలం. స్వభావోక్తి

శా. ఆహా ధన్యుఁడ నైతి మద్విమలవంశాచారవిద్యాతప
శ్శ్రీహోమాదులు నేఁడుగా తుది ఫలించెన్ నాగవాసంబు మ
ద్గేహాక్షోణికి బిడ్డ వేఁడుటకు నేతేఁ గాంచుటన్ బ్రాహ్మ్య మిం
కోహో చాలుఁ బ్రాకాలిపోయెదరో పోరో నోటిక్రొవ్వేటికిన్ 45

అ. ఆహా=ఔరా, నాగవాసంబు=భోగమువారిగుంపు, మద్గేహక్షోణికిన్=నా[illegible] బిడ్డన్=కన్యకను, వేఁడుటకున్=అడుగుటకై, ఏతేఁగాంచుటన్=వచ్చుటం[illegible] టచేత, ధన్యుఁడనైతిన్=నేనుకృతార్థుఁడనైతిని, మద్విమల...మాదులు...=నా[illegible] స్వచ్ఛమైన-నిర్దోషమైన, వంశ = కులము, ఆచార=సద్వర్తనము, విద్యా=[illegible]దువు, [illegible]

కన్, శ్రీ=సంపత్తి, హోమ=వైశ్వదేవాదిహోమములు, ఆది=మొదలుగాఁగలవన్నియు, నేఁడుగా= ఈదినముగదా, తుది=కడపలగా, ఫలించెన్=పండెను, ఓహో=బళీ, ఇఁకన్=ఇంకను, బ్రాహ్మ్యము= బ్రాహ్మణత్వము, చాలును, నోటిక్రొవ్వు=నోటియొక్కక్రొవ్వు-క్రొవ్వుతోడిమాటలనుట, ఏటికిన్= ఎందుకు, పోకాలిపోయెదరో=ఇంతటితో వెడలిపోయెదర్గా, పోరో=పోవుదురా (చెప్పుఁడు.)

తా. ఔరా! భోగమువారికుంపంతటిది నాబిడ్డ నడుగవచ్చునంతటిభాగ్య మబ్బెను. నేను గృతార్థుఁడ నైతిని నావంశాచారములు పావనము లయ్యెను. నాచదువు సంధ్య జపము తపము మొదలుగాఁ గలవన్నియు ఫలించెను నాబ్రాహ్మణత్వ మింతమాత్రము మేలిమిపొందినది చాలును. ఈ నోటిక్రొవ్వుమాటలు మాని మీరిప్పుడు వెడలిపోయెదరా పోరా చెప్పుఁడు. అలం. వ్యాజస్తుతి, విషయమును.

క. మీతరమువార లేతఱి, నేతరితనమునఁ దపస్విగృహకన్యకలన్
వీతభయవృత్తి వేఁడిరొ, కో తముఁ దర్కింప కౌర క్రొవ్వు లటంచున్. 46

అ. మీతరమువారలు=మీవంటివారు-మీవంటినీచజాతిజనులనుట, ఏతఱిన్=ఎప్పుడైనను, ఏతరితనమునన్=ఘూర్తత్వముతో, తపస్విగృహకన్యకలన్=తపస్సు చేసికొనునట్టిబ్రాహ్మణులయింటిపిల్లలను, వీతభయవృత్తిన్=భయములేనివర్తనముతో-వీరి నెట్లడుగవచ్చునను భయములేక యనుట, తమున్ = తమ్ము-తమయోగ్యతను, తర్కింపక=విచారింపక, వేఁడిరోకో=అడిగిరా-అడిగినవారుకారు గదా యనుట, ఔర=ఇదియాశ్చర్యము, క్రొవ్వులు=ఏమిమీమదములు, అటంచున్=అనిపలుకుచు.-మీఁదిపద్యముతో నన్వయము.

తా. ఇంతవఱకును పెన్నఁడును మీవంటికులహీనులు తమయోగ్యత యిట్టిది యనువిచారములేక తపస్సుచేసికొనునట్టి మావంటి యుత్తమబ్రాహ్మణకన్యకలను దమ కిమ్మని యడిగి యెఱుఁగరు ఇప్పుడు మీ రడుగుటచూడఁగా మీవంటిక్రొవ్వుపట్టినదుష్టులు మీరే కాని యితరులు కారని తోఁచుచున్న దని పలుకుచు.

క. వసుధేశ ముక్కుడుస్సిన, పసరముక్రియఁ గెరలి తిట్టెఁ బక్కన ఋషి వా
రుసురుమని వెడలి పోయిరి, ముసలి గదా పుట్టినిల్లు ముఖ్యోష్ణతకున్. 47

అ. వసుధేశ=ఓరాజా, ఋషి=నాతండ్రియైనముని, ముక్కుడుస్సినపసరముక్రియన్=ముకుఁద్రాడుదూసిపోయినయెద్దువలె, కెరలి=రేఁగి, పక్కనన్ = తటాలున-ముందువెనుకఁజూడక యనుట, తిట్టెను, వారు=ఆగంధర్వులు, ఉసురుమని = నిరాశచేనైనవిచారముగలవారై, వెడలిపోయిరి=బయలుదేఱిపోయిరి, ముఖ్యోష్ణతకున్ = ప్రధానతీక్ష్ణత్వమునకు-కోపమువచ్చుటకుననుట, పుట్టినిల్లు=జన్మస్థానము, ముసలిగదా=వృద్ధుఁడేకదా-ఎవనికైఁగాని ముదిమిహెచ్చుకొలఁదిని కోపముహెచ్చుట స్వాభావికము గదా - అనఁగా నావృద్ధమునీశ్వరుఁడు కోపము రేఁగితిట్టినంతట నన్నడుగవచ్చిన యాగంధర్వులేల యితనిఁ బడుచు నడుగివచ్చితి మని మనస్తాపముతో లేచిపోయిరి అలం ఉపమ, అర్థాంతరన్యాసమును.

వ. అట్టియెడఁ దనమనోరథంబు విఫలం బగుటకుఁ గ్రోధాంధుం డై న న్నభిలపించు గంధర్వుం డి ట్లనియె.

అ. అట్టియెడన్=ఆసయమునందు, నన్నభిలషించుగంధర్వుండు=నన్నుఁ గోరిన గంధర్వుఁడు, తనమనోరథంబు=తనకోరిక, విఫలంబు=ఫలింపనిది, అగుటకున్=అయినందులకు, క్రోధాంధుండై=కోపముచేతఁ గన్నుగాననివాఁడై-మిక్కిలి కోపించి యనుట, ఇట్లనియెన్=ఇట్లుపలికెను.

శా. నీవైశిష్ట్యము తిట్టులన్ మెఱయునే నీకంటె నేఁ దక్కువే
యీవే కన్యక నీవుగాక మఱి మద్వృత్తాన్వయాచారముల్
నీవా పేర్కొనుపాటివాఁడ విలఁ గానీ నిల్తుగా కేమి పో
పో విప్రాధమ నిన్నుఁ బోల నిఁక నల్పుల్ లేరు దంభవ్రతా. 49

అ. నీవైశిష్ట్యము=నీవిశిష్టత్వము-నీసదాచారసంపన్నత్వము, తిట్టులన్=శాపములచేత, మెఱయునే=ప్రకాశించునా, నీకంటెను, నేన్=నేను, తక్కువే=తక్కువయినవాఁడనా, నీవు, కన్యకన్=పడుచును, ఈవేగాక=ఇయ్యకపోయినఁబోయితివిగాని, మఱి=మఱియును-మీఁదుమిక్కిలి, మద్వృత్తాన్వయాచారముల్-మత్=నాదైన, వృత్త=ప్రవర్తనమును, అన్వయ=వంశమును, ఆచారముల్=శీలమును, పేర్కొనుపాఁటివాఁడవు=ఇట్టిదట్టిదని చెప్పునంతటియోగ్యతగలవాఁడవు, నీవా, ఇలన్=భూమియందు, నిల్తుగాకేమి=నిలువనే నిలుతువులే, కాని=కానిమ్ము, విప్రాధమ=నీచబ్రాహ్మణుఁడా, పోపో=నీవుపొమ్ము పొమ్ము, దంభవ్రతా=కపటపువ్రతచర్యగలవాఁడా, ఇఁకన్=ఇఁకను, నిన్నుఁబోలన్ = నీవంటి, అల్పులు=నీచులు, లేరు=కలుగరు.

తా. ఓరీ నీచబ్రాహ్మణుఁడా! తిట్టులచేతనా నీసదాచారసంపత్తి ప్రకాశించును. నీకంటె నేనుదక్కువైనవాఁడనా. నీవు పడుచునియ్యకపోయినఁ బోవచ్చుఁగాని నాకులశీలముల నెంచవచ్చునా ఇఁకభూమిలో బ్రాణముతో నుందువు గానిమ్ము. వ్రతచర్యగలవానివలె వేషమువేసికొన్న నీవు నీచుఁడవుగాని నీకంటెనీచులు మఱియెవరును లేరు

తే. అనుచుఁ బగచాటి పోయి నాఁ డర్ధరాత్ర
సమయమున శస్త్రనిహతి మజ్జనకుఁ జంపె
నట్ల యగుఁగాక పుడమిఁ గామాంధచిత్తుఁ
డెవ్వరి వధింపఁ డెటుసేయఁ డేమి గాఁడు. 50

అ. అనుచున్=ఆగంధర్వుఁ డట్లు పలుకుచు, పగచాటి=తనకుఁగలవిరోధమును చాటించిచెప్పి, పోయి=తనయింటికిఁబోయి, నాఁడు=ఆదినము, అర్ధరాత్రసమయమునన్=సగమురాత్రివేళ, శస్త్రనిహతిన్=కత్తిదెబ్బచేత-కత్తితోనఱకియనుట, మజ్జనకున్=నాతండ్రిని, చంపెను, అట్లయగుఁగాక = అట్లే యగును గాని-అట్లగుటసహజమే యనుట, పుడమిన్=భూమియందు, కామాంధచిత్తుఁడు=కాముకత్వముచే మంచిసెబ్బరలు విచారింపనేరనిమనస్సుగలవాఁడు, ఎవ్వరిన్=ఎవరిని, వధింపఁడు=చంపఁడు-ఎటువంటిపూజ్యులనైనను జంపనే చంపును. ఎటుసేయఁడు=ఏవిధమైన దుష్కార్యములు చేయఁడు, ఏమి గాఁడు=ఎట్టిదుష్టుఁడుగాఁడు

తా. అని యీవిధముగా నాగంధర్వుఁడు పగచాటించిపోయి యాదినమురాత్రియేవచ్చి మాతండ్రిని కత్తితో నఱకి చంపెను. కాముకుఁడగువాఁ డట్లు చేయుట వింత కాదు. ఇంతకంటెను క్రూరములఘునపనులైనఁ జేయునుగాని యెందులకును వెనుకఁదియనేరఁడు అలం. అర్థాంతరన్యాసము.

అ. వగలన్ = విచారములచేత, వందుర్చి = సంతాపించి, దేహముపొందు = శరీరసంబంధమును, ఎడలఁగన్ = విడుచుటకై, చూచునన్నున్ = యత్నించినట్టినన్ను - దేహత్యాగమునకు బ్రయత్నించిన నన్ననుట, గిరినందన = పార్వతీదేవి, తాన్ = తాను, దివిన్ = ఆకాశమార్గమునందు, ఎందుఁబోవుచునో = ఎక్కడికోపోవుచును, పొడగని - చూచి, దిగివచ్చి = నేలకుదిగి నాయొద్దకువచ్చి, కరుణన్ = దయతో, నాకిట్లనియెన్ = నాతో నిట్లానతిచ్చెను.

తా. తల్లిదండ్రులను బోఁగొట్టుకొని యీదిక్కుమాలిన బ్రదుకు బ్రదుకనేల యనిచచ్చుటకు యత్నించుచుండఁగా నాసమయమునం దాకాశమార్గమున నెక్కడికో పోవుచున్న పార్వతీదేవి నన్నుఁజూచి కరుణించి నేలకు దిగివచ్చి నాతో నిట్లానతిచ్చెను.

మ. అతిసౌందర్యనిశాంత మీతను వలభ్యం బిట్లు శోకాతురా
న్వితవై దీనిఁ దొఱంగఁగాఁ దగునె తన్వీ చాలు నీసాహసం
బతిలోకుండు స్వరోచి నీకుఁ బతి యౌ నారాజుఁ జేపట్టి య
ప్రతిమశ్రీవిభవంబుఁ గాంచెదవు నాపల్కుం బృథ గా నేర్చునే 56

అ. తన్వీ = ఓచిన్నదానా, ఈతనువు = ఈదేహము, అతిసౌందర్యనిశాంతము = మిక్కిలి చక్కఁదనమునకుఁ జోటైనది, అలభ్యంబు = ఇట్టిదేహము లభించుటయరుదు, ఇట్లు, శోకాతురాన్వితవై = శోకముచేతఁ బీడింపఁబడినదానవై - దుఃఖాతిశయముచేత ముందువెనుక విచారింపక, దీనిన్ = ఇటువంటిచక్కఁదనపుశరీరమును, తొఱంగఁగాన్ = విడుచుట, తగునె = ఉచితమగునా, ఈసాహసంబు = ఈతెగువ, చాలున్ = ఇంతమాత్రముచాలును - ఈతెగువవలదనుట, అతిలోకుండు = లోకాతీతుఁడు - మిగులదొడ్డవాఁడనుట, స్వరోచి, నీకు, పతి = పెనిమిటి, ఔన్ = అగును, ఆరాజున్ = ఆస్వరోచిమహారాజును, చేపట్టి = పెండ్లాడి, అప్రతిమశ్రీవిభవంబున్ - అప్రతిమ = సాటిలేని, శ్రీ = ఐశ్వర్యముయొక్క, విభవంబున్ = కలిమిని, కాంచెదవు = పొందెదవు, నాపల్కు = నామాట, పృథ = వట్టిది, గా నేర్చునే = కాఁగలుగునా - నామాట వ్యర్థముకాఁజాలదనుట.

తా. ఓచిన్నదానా! ఇట్టిచక్కఁదనముగల దేహము నుపడయుటశక్యముకాదు దుఃఖాతిశయముచేత ముందువెనుక విచారింపక యిట్టిశరీరమును విడువ యత్నించుచున్నావు ఇది మిగుల సాహసము. ఇట్టిసాహసము చేయరాదు. నీకు మిక్కిలి గొప్పవాఁడయిన స్వరోచి యనుమహారాజు భర్తయగును. ఆమహారాజును బెండ్లాడి మితిలేని సౌఖ్యము ననుభవించెదవు నామాటనమ్మి యీదేహమును గాపాడుకొమ్మనియెను. అలం. కావ్యలింగము.

క. విను మదియుఁగాక పద్మిని, యనఁ బరఁగినవిద్య నేఁ బ్రియంబున నిత్తుం
గొను నీవు తత్ప్రసాదం, బున నీకు నభీష్టసౌఖ్యములు సిద్ధించున్ 57

అ. వినుము, అదియుఁగాక = అట్లామహారాజును బెండ్లాడునట్టిమహాభాగ్యము నీకుఁగలుగుటయే గాక, నేన్ = నేను, ప్రియంబునన్ = ప్రేమతో, పద్మిని, అనఁబరఁగినవిద్యన్ = అనఁగాఁ జెప్పఁబడినవిద్యను, ఇత్తున్ = ఇచ్చెదను, నీవు, కొను = పరిగ్రహింపుము, తత్ప్రసాదంబునన్ = ఆవిద్యయొక్క యనుగ్రహముచేత, నీకు, అభీష్టసౌఖ్యములు = కోరినసుఖములు, సిద్ధించున్ = లభించును.

తా. నీకు నికమీఁద నామహారాజును బెండ్లాడుభాగ్యము లభించుటయేకాక యిప్పుడే నీవు కోరినసుఖములు కలుగఁజేయునట్టిపద్మిని యనువిద్యనుపదేశించెదను. దాని గ్రహింపుము.

అయి, శుభ.. ములు-శుభ=మేలైన, లక్షణ=చిహ్నములుగల, దక్షిణగంధవాహముల్ = దక్షిణపు వాయువులు-మలయమారుతములు, చెలంగెన్=చక్కఁగా వీచెను.

క. ఈవిధమున నుద్వాహంబై వేలుపువెలఁదిపట్టి యంచితమతి న
పూర్వపుంబోఁడులు మువ్వుర, తో వివిధవిహారసంగతులఁ దత్పరుఁడై. 61

అ వేలుపువెలఁదిపట్టి=దేవతాస్త్రీయయినపద్మినికొడుకు-స్వరోచి, ఈవిధమునన్=ఈచెప్పఁబడినరీతిని, ఉద్వాహంబై=విభావసీకళావతులను పెండ్లాడి, అంచితమతిన్=మేలైనబుద్ధితో, అపూర్వపుంబోఁడులు మువ్వురతోన్=పువ్వువలె మనోజ్ఞురాండ్రయిన యాముగ్గురుభార్యలతోను, వివిధవిహారసంగతులన్-వివిధ=నానావిధములైన, విహార=వేడుకగా సంచరించుటకు, సంగతులన్=ప్రవర్తనములయందు, తత్పరుఁడై=ఆసక్తుఁడై - మీఁదికన్వయము.

సీ. గంగాతరంగిణీరంగత్తరంగశీ, కరశీతసైకతోత్కరములందు
మందారమాకందమకరందతుందిలేం, దిందిరానందకృన్నందనములఁ
గాంతనిశాకాంతకాంతవితర్దికా, క్రాంతభూభృద్బృందకందరముల
మసృణబిసాహారమాంసలహంసికా, సంసదాసారకాసారతటులఁ
దమక తమ్మక ప్రియుం డనితమక మెసఁగఁ
బడఁతు లుప్పొంగఁ గ్రీడించెఁ బద్మినీప్ర
భావఘటితాన్నపానభూషావిశేష
మాల్యవస్త్రానులేపసామగ్రిఁ జెంది. 62

అ గంగా ... లందున్-గంగాతరంగిణీ=గంగానదియందు, రంగత్=చలించుచున్న, తరంగ=అలలయొక్క, శీకర=తుంపురులచేత, శీత=చల్లనైన, సైకత = ఇసుకదిబ్బలయొక్క, ఉత్కరములందున్=సమూహములందును, మందార ... ములన్-మందార=మందారపుఁజెట్లయొక్కయు, మాకంద=తియ్యమామిడిచెట్లయొక్కయు, మకరంద=పూఁదేనెలచేత, తుందిల=బలిసిన-తృప్తిగాఁ బూఁదేనె త్రాగిన, ఇందిందిర=తుమ్మెదలకు, ఆనందకృత్ = సంతోషముకలుగఁ జేయుచున్న, నందనములన్= ఉద్యానవనములందును, కాంత ..ములన్ - కాంత = మనోహరములైన, నిశాకాంతకాంత = చంద్రకాంతమణులచేతఁ గట్టఁబడిన, వితర్దికా = అరుఁగులచేత, ఆక్రాంత = ఆక్రమింపఁబడిన - చుట్టఁబడిన, భూభృద్బృంద = కొండలసమూహముయొక్క, కందరములన్ = గుహలయందును, మసృణ . తటులన్ - మసృణ=నునుపైన - మెత్తనయిన, బిస=తామరతూండ్లయొక్క, ఆహార=తిండిచేత, మాంసల=బలిసిన, హంసికా = ఆఁడుహంసలయొక్క, సంసత్=గుంపులయొక్క, ఆసార=అంతటనుసంచరించుటలుగల, కాసార=కొలఁకులయొక్క, తటులన్= తీరములయందున్న, పడఁతులు= స్త్రీలు-భార్యలుముగ్గురును, తమకెతమకె=తమకేతమకే, ప్రియుండు=ప్రేమగలవాఁడు-ఒక్కొక్కతెయుఁ బ్రియుఁడు తక్కినవారికంటెఁ దనయందే ప్రేమగలిగియున్నాఁడు, అని=అనుకొని, ఉప్పొంగన్=సంతోషింపఁగా, పద్మినీ.. సామగ్రిన్-పద్మినీ=పద్మినియనెడివిద్యయొక్క, ప్రభావ=మహిమచేత, ఘటిత=కూర్పఁబడిన-కలిగినయనుట, అన్న=అన్నము, పాన=త్రాగఁదగిన తేనె పాలు మంచినీళ్లు మొదలయినవి, భూషా=సొమ్ములు, మాల్య=పూదండలు, వస్త్ర=కోకలు, అనులేప=గంధపుఁబూఁతలు, సామగ్రిన్=వీనియొక్క సమగ్రతను-కొఱఁతలేమిని, చెంది=పొంది, క్రీడించెను.

తా. స్వారోచి ప్రియురాండ్రు ముగ్గురును ప్రీతితో ననుసరింపఁగాఁ బద్మినీవిద్యాప్రభావముచేత నన్నపానీయములను వస్త్రాభరణములను గంధపుష్పములను నేకొఱఁతయు లేకయుండఁగా గంగానదిలోని చల్లనియిసుకదిన్నెలయందును, పూఁదేనెలతో నిండుకొనియున్న తుమ్మెదలరొదలతోడియుద్యానవనములందును, చంద్రకాంతమణులయూఁగులచే నందగించుచున్న కొండగుహలయందును, హంసలు తామరతూండ్లు దిని బలిసి గుంపులుగూడి మెలఁగుచున్న సరోవరములతీరములందును విహరించుచుఁ గ్రీడించెను. అలం, ఉదాత్తము.

మ. అరవిందాక్షులుఁ దాను నిట్లభిమతవ్యాపారముల్ సల్పుచున్
ధరణీశుం డొకచోటఁ గాంచె లఘుశీతస్వచ్ఛవారిపూరమున్
వరకీరవ్రజచంచుపాటితతటవ్యాకీర్ణమందారకే
సరమాకందవినిస్సరత్ఫలరసాసారంబుఁ గాసారమున్. 63

అ. ఇట్లు=ఈవిధముగా, ధరణీశుండు=రాజు. స్వారోచి, అరవిందాక్షులున్ = భార్యలును, తానును, అభిమతవ్యాపారముల =కోరినవిహారకార్యములను, సల్పుచున్ =చేయుచును, ఒకచోటన్ =ఒకతావునందు, లఘుశీతస్వచ్ఛవారిపూరమున్ - లఘు= తేలికైన, శీత=చల్లనైన, స్వచ్ఛ= తేటయైన, వారిపూరమున్ = జలసమృద్ధిగలిగినదానిని, వర . . . సారంబున్ - వర=శ్రేష్ఠములయిన, కీర =చిలుకలయొక్క, వ్రజ=సమూహముయొక్క, చంచు=ముక్కులచేత, పాటిత=చీల్పఁబడినవై, తట-దరులయందు, వ్యాకీర్ణ=నిండుకొన్న, మందార=మందారపుఁజెట్లపలనను, కేసర = పొగడమ్రాఁకులవలనను, మాకంద=తియ్యమామిడిమ్రాఁకులవలనను, వినిస్సరత్ =విశేషముగాస్రవించుచున్న, ఫలరస= పండ్లరసములయొక్క, ఆసారంబున్ =ఎడతెగనివానగలదానిని, కాసారమున్ =సరస్సును, కాంచెన్ =చూచెను.

తా. ఇట్లు ప్రియురాండ్రతో యథేచ్ఛముగాఁ గ్రీడించుచుండి యొకచోటఁ దేలికై చల్లనైన తేటనీళ్లచే నిండుకొన్నదియు, దరులమ్రాఁకులందుండి చిలుకముక్కులచేఁ జీల్పఁబడినపండ్లనుండి కాఱుచున్న తియ్యనిరసముతోఁ గూడినదియు, నైన యొకసరోవరమును జూచెను.

క. కని తత్తటస్థలంబున, ననుమతి విహరించె సవిధహరిహయవరనం
దననందనహరిచందన, వనపవనార్భకవినోదవశగతుఁ డగుచున్. 64

అ. కని=సరస్సునుజూచి, తత్తటంబునన్ =దానిదరిని, సవిధ = సమీపమునందలి, హరిహయ=ఇంద్రునియొక్క, వర=శ్రేష్ఠమయిన, నందన=నందనమనెడి యుద్యానవనసంబంధియైన, (హరిహయవరనందన=జయంతునియొక్క, నందన=నందనమనెడి వనమునందలి, అనికొందఱు.) నందన=తనయుద్యానవనమునందలి, హరిచందన=హరిచందనమనెడి దేవవృక్షములయొక్క, వన=తోపులనుండివీచునట్టి, పవనార్భక=పిల్లవాయువులచేత- మలయమారుతముచేతననుట, వినోద=విహరించుటకు, వశగతుఁడు=అధీనమైనవాఁడు- ఆసక్తిగలవాఁడు, అగుచున్ =అవుచును, అనుమతిన్ =ఇష్టముతో, విహరించెన్ =వినోదముగా మెలఁగెను.

తా. స్వారోచి యట్టిసరస్సును జూచి దానివెంబడి నింద్రుని నందనవనమువలెనే హరిచందనము మొదలయిన దేవవృక్షములతోపులు గల తనశృంగారపుఁదోఁటఁ మీఁదుగా వచ్చునట్టి చల్లని మెల్లనిగాలిచే వినోదింపఁ గోరినవాఁడై యిష్టముతో నాకొలనిదరిని గొంతసేపు విహరించెను.

ఉ. అందొకయంచలేమ గహనానిలసంచలదూర్మిమాలికా
మందవిహారసౌఖ్యమున మత్తిలి దవ్వుల నున్న చక్రవా
కిం దగఁ జేరఁ బిల్చి పరికించితె యెంతతపం బొనర్చిరీ
యిందునిభాస్యలుం బతియు నేకమతిం గవగూడి యుండఁగాన్. 65

అ. అందున్ = ఆకొలఁకునందు, ఒకయంచలేమ = ఒక్కహంసస్త్రీ, గహనా... మునన్ - గహన = ఉద్యానవనము మీఁదుగా వచ్చుచున్న, అనిల = గాలిచేత, సంచలత్ = బాగుగాఁ గదలుచున్న, ఊర్మి = అలలయొక్క, మాలికా = సమూహమునందు, అమంద = తక్కువ కాని - అధికమైన, విహార = వినోదసంచారము వలని, సౌఖ్యమునన్ = సుఖముచేత, మత్తిలి = మత్తుగొని, దవ్వులన్ = దూరమునందు, ఉన్న చక్రవాకిన్ = ఉండినయాఁడుజక్కవను, తగన్ = తగునట్లు, చేరఁబిల్చి = దగ్గఱఁ బిలిచి, ఈయిందునిభాస్యలున్ = చంద్రునివంటిముఖముగల యీస్త్రీలును, పతియున్ = వీరిపెనిమిటియయినయీరాజును, ఏకమతిన్ = అభేదబుద్ధితో, కవగూడి = జతగూడి, ఉండఁగాన్ = ఉండుటకు, ఎంతతపంబు = ఎంతయధికమైనతపస్సు, ఒనర్చిరి = చేసిరో, పరికించితె = (వీరివిహారవైఖరిని) చూచితివా.

తా. అప్పు డాసరస్సునందు విహారసుఖము ననుభవించుచున్న యొక యాఁడుహంస తనకుఁ గొంతదూరమునందు విహరించుచున్న యాఁడుజక్కవను జేరఁబిలిచి యాదంపతులనుజూపి వీరిట్లరమరలేక జతగూడి విహరింపఁ బూర్వ మెంతతపస్సు చేసిరో మిక్కిలి హాయిగా విహరించుచున్నారు చూడుమనియెను. ఇట్టివిహారసుఖము మిక్కుటమయినతపస్సు చేయక యే లభింప నేరదని భావము.

క. మెలఁతకుఁ బతిపైనైనను, మెలఁతుకపైఁ బతికినైన మేలగు టెందుం
గలయది మెఁలతకుఁ బతికిన్, వలపు సమం బగుట జన్మవాసన చెలియా. 66

అ. చెలియా = ఓచెలీ, మెలఁతకున్ = స్త్రీకి - భార్యకు, పతిపైనైనన్ = పెనిమిటిమీఁద నైనను, మెలఁతుకపైన్ = భార్యమీఁద, పతికినైనన్ = భర్తకైనను, మేలు = మోహము, అగుట = కలుగుట, ఎందున్ = ఎచ్చోటను, కలయది = సహజము, మెలఁతకున్ = స్త్రీకిని - భార్యకును, పతికిన్ = భర్తకును, వలపు = మోహము, సమంబగుట = ఎచ్చుతక్కువలులేక సరిగానుండుట, జన్మవాసన = పూర్వజన్మసంబంధియైన సంస్కారము.

తా. ఓచెలీ! పెండ్లామునందుఁ బెనిమిటికో పెనిమిటియందుఁ బెండ్లామునకో మోహ మతిశయించియుండుట లోకమునందు సహజము గాని యాలుమగ లిద్దఱికిని సమానమయిన మోహము గలిగియుండుట సహజముకాదు. అట్లుగాక యుభయులకు వలపు సరిగానుండుట పూర్వజన్మమునందుఁ జేసిన పుణ్యఫలమే కాని యితరము గాదు.

ఉ. కావున వీరియందు నధికం బగుకూరిమి గల్గియుండు నీ
భూవలయాధినాథునకుఁ బొల్పుగ నీవిభునందు నగ్గలం
బీవనజాయతాక్షులకు నిచ్చఁ బ్రియం బది గానఁ బూవునుం
దావియుఁ బోలెఁ జాలఁ బ్రమదం బొనరించిరి నాకు నెచ్చెలీ. 67

అ. నెచ్చెలీ = ఓస్నేహితురాలా, కావునన్ = కనుక, వీరియందున్ = ఈస్త్రీలయందు, ఈభూవలయాధినాథునకున్ = ఈరాజునకును, అధికంబు = హెచ్చు, అగుకూరిమి = అయినప్రేమ, పొల్పుగన్ = ఒప్పిదముగా, గల్గియుండెడున్ = కలిగియున్నది, ఈవిభునందున్ = ఈరాజునందు, ఈవనజాయతాక్షుల

కుఁ = ఈ స్త్రీలకును, ఇచ్చన్ = మనసునందు, ప్రియంబు = ప్రేమము, అగ్గలంబు = అధికము, అది గానన్ = అట్లగుటచేత, పూవుఁదావియుంబోలెన్ = పువ్వును బరిమళమునువలె (ఎడఁబడని కూడికగలవారై,) చాలన్ = మిక్కిలి, నాకు, ప్రమదంబు = సంతోషమును, ఒనరించిరి = (వీరు) కలుగఁజేసిరి.

తా. ఓచెలియా! ఈ స్త్రీలయం దీరాజునకు ననురాగము కలిగియున్నట్టె యీరాజునం దీ స్త్రీలకు ననురాగము కలిగియున్నది. ఇది యెట్లున్నదియన్నఁ బువ్వుతోఁ బరిమళము సంబంధిచియున్నట్లున్నది దానిచే వీరిని జూడఁగా నాకు మిక్కిలి సంతోషమగుచున్నది అలం ఉపమ.

వ. అని పలుకునమ్మరాళలోలనయనపలుకు లాలంబుచేసి చక్రవాకి యిట్లనియె 68

అ. అని = ఇట్లని, పలుకునమ్మరాళలోలనయనపలుకులు = చెప్పునట్టియాహంస స్త్రీమాటలు, ఆలంబుచేసి = ఉపేక్ష చేసి-సరియని యొప్పుకొనక, చక్రవాకి = చక్రవాక స్త్రీ, ఇట్లనియెను.

చ. ముదమున నిమ్మహీశుఁ డొకయుద్దియ చూడఁగ నొక్కకాంతతో
సదమదమై కడంగి రతిసల్పుట తెల్లమిగా నెఱింగియున్
మది వివరించి రోయ కభిమానము దక్కిన వీరి కూరుముల్
వదలక పెద్దసేసెదవు వందిగతిం దగ వీవిచారముల్. 69

అ. ముదమునన్ = సంతోషముతో, ఇమ్మహీశుఁడు = ఈరాజు, ఒకయుద్దియ = ఒక్కయువతి, చూడఁగన్ = చూచుచుండఁగా, ఒక్కకాంతతోన్ = ఇంకొకమగువతో, సదమదమై = పెనఁగి, కడంగి = పూని, రతి = సంభోగము, సల్పుట = చేయుట, తెల్లమిగాన్ = స్పష్టముగా, ఎఱింగియున్ = తెలిసియు, మదిన్ = మనసునందు, వివరించి = ఇతఁ డితర స్త్రీప్రియుఁడని విచారించి, రోయక = రోఁతపడక, అభిమానము = చిత్తౌన్నత్యమును - గౌరవమును, తక్కినవీరికూరుములు = వదలిన యీస్త్రీల చెలిమములు, వదలక = మానక, వందిగతిన్ = బట్టువానివలె, పెద్దసేసెదవు = ఏమోగొప్పగాఁ దలఁచిపొగడెదవు, ఈవిచారములు = ఈయాలోచనలు - ఇట్లుతలఁచి పొగడుటలు, తగవు = యుక్తములుకావు.

తా. ఈరాజు సంతోషముతో నొకదానితో రమించుట స్పష్టముగా నెఱిఁగియుఁ దక్కిన స్త్రీలందులకు రోసి కోపింపక మానము చెడి యట్టిపురుషునం దనురాగముగలవారై యుండుట యెక్కువయని స్తుతిపాఠకునివలె నీవేమో పొగడుచున్నావు కాని యదిసరియని నేనెంచఁజాలను. అలం. ఉపమ.

చ. పలువురయందు నొక్కనికి బ్రాఁతియు నొక్కనియందుఁ జూడ న
గ్గల మగుప్రేమ పల్వురకుఁ గల్గుట యద్భుత మట్లు గాన ని
వ్వెలఁదులయందుఁ గూరిమి వీనికి నేమియు లేదు వీనియం
దలవడఁ గల్గ దీజలరుహాక్షులకుం బ్రియ మెవ్విధంబునన్. 70

అ. చూడన్ = ఆలోచించి చూడఁగా, పలువురయందున్ = అనేక స్త్రీలయందు, ఒక్కనికిన్ = ఒకపురుషునికి, బ్రాఁతియున్ = ప్రేమయును, ఒక్కనియందున్ = ఒక పురుషునియందు, పల్వురకున్ = పలువురు స్త్రీలకు, అగ్గలము = అధికము, అగుప్రేమ = అగునట్టియనురాగమును, కల్గుట = కలిగియుండుట, అద్భుతము = ఆశ్చర్యము, అట్లుగానన్ = కాఁబట్టి, ఇవ్వెలఁదులయందున్ = ఈ స్త్రీలయందు, వీనికిన్ = ఈపురుషునకు, కూరిమి = అనురాగాతిశయము, ఏమియు లేదు = కొంచెమైనను లేదు, వీనియందున్ = ఈపురుషునందు, ఈజలరుహాక్షులకున్ = ఈ స్త్రీలకు, ప్రియము = ప్రేమ - అనురాగము, ఎవ్విధంబునన్ =

ఏవిధముచేతను, అలవడఁగ = పన్నుపడుట, కల్గదు = కలుగనేరదు "శ్లో. ఏకత్రైవానురాగశ్చే త్తిర్యక్మ్లేచ్ఛగతోపివా, యోషితాంబహుసక్తిశ్చరసాభాసస్త్రిధాస్మృతః" అనునది యిందులకుఁ బ్రమాణము

తా. ఒకపురుషునకుఁ బలువురుస్త్రీలయందును బలువురుస్త్రీల కొకపురుషునియందును ననురాగము కలుగుటయరుదు కాఁబట్టి యిప్పు డీపురుషునియం దీస్త్రీలకుఁగాని యీస్త్రీలయం దీపురుషునికిఁగాని యనురాగము కొంచెమయినను లేదు.

క. మనుజేశుఁడు కొలిచినపరి, జనములతో నిష్టగోష్ఠి సలిపెడిచో నె
ట్లనురాగ మట్ల కూరిమి, వనితలు పెక్కండ్రయం దవశ్యము పతికిన్. 71

అ. మనుజేశుఁడు = రాజు, కొలిచినపరిజనములతోన్ = తనకొలువు చేయునట్టిపరివారజనులతో, ఇష్టగోష్ఠి = ప్రియసల్లాపము - ప్రీతితో మాటలాడుట, సలిపెడిచోన్ = జరపునప్పుడు, అనురాగము = ప్రేమ, ఎట్లు = ఏవిధమో, అట్ల = ఆవిధముగానే, వనితలు = స్త్రీలు, పెక్కండ్రయందున్ = అనేకులయందు, పతికిన్ = భర్తకు, కూరిమి = ప్రేమ - అనురాగము, అవశ్యము = నిశ్చయముగా - కలుగునని క్రియయధ్యాహార్యము. - అనఁగా రాజునకుఁ బరివారజనులందుఁబోలె బురుషునకుఁ బలువురుస్త్రీలయందు ననురాగము గలిగియుండునే కాని యొకతెయయినప్రియభార్యయందుఁబోలె దృఢానురాగము కలిగియుండదు

క. ఈనెలఁత లీమహీశు న, హీనగతిం దగిలి రేని యితఁ డొకతె లేమం
దా నెలమిఁ గూడునెడ నే, మానిని ప్రాణేశుమీఁదిప్రేమమ్మత మెలంగున్. 72

అ. ఈనెలఁతలు = ఈస్త్రీలు, ఈమహీశున్ = ఈరాజును, అహీనగతిన్ = తక్కువకానివిధముతో - మనసునం దేకొంచెయు లేక, తగిలిరేనిన్ = వలపుగొన్నవారైనపక్షమున, ఇతఁడు = ఈరాజు, తాను, ఒకతెలేమన్ = ఒకస్త్రీని, ఎలమిన్ = ప్రీతితో, కూడునెడన్ = సంగమము చేయునప్పుడు, ఏమానిని = వీరిలో నేయాఁడుది, ప్రాణేశుమీఁదిప్రేమమతన్ = పెనిమిటిమీఁదియనురాగముతో, మెలంగున్ = ప్రవర్తించును - దేనితోఁ గలసియున్నప్పుడది యనురక్తయైనట్టు మెలఁగునేకాని యందఱకు నెన్నియెడలను ననురాగము గలిగియుండదనుట

క. కావున దాసీనికరము, కైవసమై సంచరించుక్రమమున విద్యా
ప్రావీణ్యవైభవోన్నతిఁ, జే వచ్చినవారి వీరిఁ జెప్పకు మింకన్ 73

అ కావునన్ = అటుగనుక, దాసీనికరము = పరిచారికలసమూహము, కైవసమై = స్వాధీనమై, సంచరించుక్రమమునన్ = మెలఁగునట్టిరీతిని, విద్యా . చేన్ - విద్యా = విద్యలయందలి, ప్రావీణ్య = నేర్పుయొక్క, వైభవ = సంపత్తివలని, ఉన్నతి చేన్ = ఆధిక్యము చేత, వచ్చినవారిన్ - లభించినవారిని, వీరిన్ = ఈస్త్రీలను, ఇంకన్ = ఇఁకను, చెప్పకుము = హెచ్చుగాఁజెప్పకుము.

తా. కాఁబట్టి పరిచారికలు పెక్కండ్రొక్కరికి లోఁబడి మెలఁగునట్లు విద్యలకౌశలమువలనిగొప్పతనముచేత నీతనికి లభించిన యీస్త్రీలవిషయమయి మెప్పులు పలుకవలదు.

ఆ. తగులు నెవ్వఁ డొక్కతరుణికి నొకనికి, మెలఁత వలచు నదియ మేలనంగ
వచ్చుఁ గాని పెక్కువనితలపైఁ గూర్మి, గలుగు ననుట బొంకు గాదె తరుణి.

అ తరుణి = ఓవనితా, ఎవ్వఁడు = ఏపురుషుఁడు, ఒక్కతరుణికిన్ = ఒకజవరాలియెడ, తగులున్ = వలపునొందునో, మెలఁత = ఒకజవరాలు, ఒకనికిన్ = ఒక్కపురుషునియెడ, వలచున్ = వలపుగొనునో, అదియ = అదియే, మేలు = శ్రేష్ఠమయినది, అనంగవచ్చున్ = అనిచెప్పవచ్చును, కాని = అంతేకాని, పెక్కు

వనితలపైన్ = పలువురు స్త్రీలమీఁద, కూర్మి = అనురాగము, కలుగును = ఒకనికిఁగలిగియుండును, అనుట = అనియొప్పుట, బొంకు = కల్ల, కాదె = కదా.

తా. ఓ చెలియా! ఒకపురుషుని కొక స్త్రీమీఁదను ఒక స్త్రీకొకపురుషునిమీఁదను వలపుగలదన్న ననవచ్చును గాని పలువురు స్త్రీలయం దొకపురుషునికి వలపుగలదనుట సత్యము కాదు.

చ. పలుకులు వేయు నేమిటికిఁ భాగ్యసమన్విత నేన మద్విభుం
డిలఁ గలధన్యుఁ డంచు నెలుఁగెత్తి వరూథినిపట్టిముందటం
బలుకు రథాంగమానవతిపల్కు లతం డిల జంతుమండలీ
విలసదశేషభాషలఁ బ్రవీణుఁడు గాన నెఱింగి సిగ్గునన్. 75

అ. పలుకులు = మాటలు, వేయున్ = అనేకములు, ఏమిటికిన్ = ఎందులకు - పలుపలుకులవలనఁ బ్రయోజనములేదనుట, భాగ్యసమన్వితను = అదృష్టముతోఁగూడినదానను - అదృష్టవంతురాలను, నేన = నేనే, ఇలన్ = భూమియందు, కలధన్యుఁడు = కలిగినభాగ్యసంపన్నుఁడు, మద్విభుండు = నామగఁడు, అంచున్ = అని, వరూథినిపట్టిముందటన్ = వరూథినికొడుకైన స్వారోచియెదుట, ఎలుఁగెత్తి = గొంతెత్తి - గట్టిగావినునట్లు, పల్కు రథాంగమానవతిపల్కులు = చెప్పుచున్న చక్రవాకస్త్రీయొక్క మాటలు, ఇలన్ = భూమిలోఁగలిగియుండెడి, జంతు.. భాషలన్ - జంతుమండలీ = ప్రాణిసమూహములయొక్క, విలసత్ = ఒప్పుచున్న, అశేష = సమస్తమయిన, భాషలన్ = మాటలయందు, ప్రవీణుఁడు = నేర్పరి - ఎల్లజంతువుల భాషలు నెఱిఁగినవాఁడనుట, కానన్ = కనుక, ఎఱింగి = తెలిసికొని, సిగ్గునన్ = లజ్జచేత - పైకన్వయము.

తా. వేయిమాటలేల. నేనే యదృష్టవంతురాలను. నామగఁడే కృతార్థుఁడు అని యొదుట గొంతెత్తిచక్కఁగా వినఁబడునట్లు పలుకుచున్న యాడుదుబక్కివమాటలు విని స్వారోచి యెల్లజంతువులమాటలు తెలిసినవాఁడు గనుక నామాటలయభిప్రాయము తెలిసికొని సిగ్గుతో.

క. తలవాంచి యుస్సురని మదిఁ, దలపోయుచు మానరానితమకంబున నా
నెలఁతలతో నూఱేఁడులు, విలసితగతి సౌఖ్య మనుభవించుచు నెలమిన్. 76

అ. తలవాంచి = తలవంచుకొని, ఉస్సురని = ఉస్సునను నుకరణముతో నిట్టూర్పువిడిచి, మదిన్ = మనస్సునందు, తలపోయుచున్ = (తిర్యగ్జంతువులకుఁగూడ మనవిహారము పరిహాసము నకుఁ జోటయ్యె నే యని) విచారపడుచు, మానరానితమకంబునన్ = విడలఁగూడని వలపుచేత, ఆనెలఁతలతోన్ = ఆ స్త్రీలు మువ్వురతోను, విలసితగతిన్ = మనోహరమైనరీతిలో, నూఱేఁడులు = నూఱుసంవత్సరములు, ఎలమిన్ = ప్రీతితో, సౌఖ్యము = సుఖమును, అనుభవించుచున్ = పొందుచును - మీఁదికన్వయము.

శా. కాంచెన్ భూవిభుఁ డొక్కనాఁడు కనకాంకఖర్వప్రభామంజులా
స్యాంచన్మేచకరత్నవిభ్రమసనాథానూనదృగ్గోచులన్
మించుం బ్రాయపులేటిపిండు తనుఁ గూర్కిం జుట్టి రాఁ దస్వనో
దంచద్దూర్వామిఁ జరించునొక్కహరిణీత్రంసంబు సింఫారఁగాన్. 77

అ. భూవిభుఁడు = రాజు - స్వారోచి, ఒక్కనాఁడు, కనకా... చులన్ - కనక = బంగారుయొక్క, అఖర్వ = అధికమయిన, ప్రభా = కాంతులచేత, మంజుల = మనోహరములైన, ఆస్య = ముఖములందు, అంచత్ = ఒప్పుచున్న, మేచకరత్న = నీలమణులయొక్క, విభ్రమ = విలాసమువంటివిలాసముతో, సనాథ = కూడిన, అనూన = తక్కువకాని, దృగ్గోచులన్ = చూపుల వెలుఁగులచేత. మించుం...పిండు - మించుచుం

ప్రాయపు=వెలుఁగుచున్న యౌవనముగల, లేటిపిండు=ఆఁడుజింకలగుంపు, తనుక్ = తన్ను, కూర్మిన్ = అనురాగముతో, చుట్టిరాన్ = పరివేష్టించిరాఁగా, తద్వనోదంచద్భూమిక = ఒప్పుచున్న వనభూమియందు, చరించు... త్తంసంబుక్ - చరించు = తిరుగుచున్న, ఒక్క హరిణోత్తంసంబుక్ = శ్రేష్ఠమయిన యొకయిఱ్ఱిని, ఇంపారఁగాన్ = సంతోషమతిశయింపఁగా, కాంచెన్ = చూచెను.

తా. అట్లాస్త్రీలతో సుఖించుచుండునట్టియెడ నాస్వరోచి యొకనాఁడు విహారవనమునందు బంగారుచాయ ముఖములును నీలములకాంతులవంటికాంతులుగలచూపులును గల లేళ్లతోఁ గ్రీడించుచున్న యొకయిఱ్ఱిని జూచెను. అలం. నిదర్శన

క. కని సతులకుఁ జూపెడుతఱి, ఘనముగఁ దమచెవుల వాలుఁగన్నులు సోలన్
మొనసెలవి యెత్తి ప్రియునా, ననముక్ మూర్కొనుచు నట్లునాకెడువేళన్.

అ. కని=అట్లున్నమృగమునుజూచి, సతులకున్ = తనప్రియురాండ్రకు, చూపెడుతఱిన్ = స్వరోచి చూపునప్పుడు, (ఆఁడుమృగములు) ఘనముగన్ = మిక్కిలిగా, తమచెవులన్ = తమయొక్క చెవులయందు, వాలుఁగన్నులు = వాలికలైన (దీర్ఘములైన) కన్నులు, సోలన్ = ఒరగఁబడఁగా - చెవులవఱకు వ్యాపించినవిశాలములయినకన్నులతో ననుట, మొనసెలవి = ముందఱిపెదవిమూల - మోరమొన, ఎత్తి = పైకెత్తి, ప్రియునాననమున్ = తమప్రియుఁడైనయిఱ్ఱి యొక్కముఖమును, మూర్కొనచున్ = మూచూచుచు, అట్లునాకెడువేళన్ = మెడనాకునప్పుడు. - మీఁదికన్వయము.

తా. అట్లు తిరుగుచున్న మృగమును స్వరోచి తనప్రియురాండ్రకుఁ జూపునపుడు దానితోడి పెంటిమృగములు తమవిశాలనేత్రములు చెవులవఱకు వ్యాపించియొప్పఁగా మోరలెత్తి యామృగము మొగమును మూర్కొనుచు మెడను నాకుచుండెను. ఆసమయమునందు. అలం. స్వభావోక్తి

శా. హుంకారం బొనరించి వే తలఁగుఁడోహో నేను స్వారోచినే
పంకేజాక్షులతోడ నెల్లపుడు దర్పస్ఫూర్తిఁ గ్రీడింప ల
జ్జాంకూరం బడఁగించినారు తలపోయన్ నాకు రోఁతయ్యె మీ
రింకం బోయి వరింపుఁ డొక్కరుని భోగేచ్ఛన్ నివారించితిన్. 79

అ. (ఆమృగము పెంటిమృగములనుజూచి) హుంకారంబు=హుం అనెడి కోపమును దెలిపెడి ధ్వనిని, ఒనరించి=చేసి, ఓహో=ఓస్త్రీలారా, వే=శీఘ్రముగా, తలఁగుఁడు = తొలఁగిపొండు, ఎల్లపుడున్ = సర్వదా, దర్పస్ఫూర్తిన్ = మదాతిశయముచేత, పంకేజాక్షులతోడన్ = తామరలవంటికన్నులుగలవారితో - అందగత్తెలయిన స్త్రీలతో, క్రీడింపన్ = రమింపను, నేను, స్వారోచినే=స్వరోచి యను రాజనా - ఎల్లప్పుడు స్త్రీలోలుఁడై విహరించుట స్వరోచికిఁ దగునుగాని నాకుఁ దగదనుట. లజ్జాంకూరంబు=సిగ్గుమొలకను, అడఁగించినారు=(మీరు) అణఁచివేసినారు - బొత్తిగా సిగ్గువిడిచినారనుట. తలపోయన్ =(మీసిగ్గుమాలినతనమును) విచారింపఁగా, నాకు, రోఁతయ్యెన్ = అసహ్యమయ్యెను, మీరు, ఇంకన్ = ఇఁకమీఁద, పోయి=ఎక్కడనైనపోయి, ఒకరునిన్ = మఱియొక పురుషుని, వరింపుఁడు=కోరుకొనుఁడు, భోగేచ్ఛన్ = స్త్రీసుఖమునందలియపేక్షను, నివారించితిన్ = (నేను) నిలిపివేసితిని - మానితిని.

తా. ఆమృగము పెంటిమృగముల నదలించి యెల్లప్పుడు నాఁడువారితోఁ గూడి క్రీడించుటకు నేను స్వరోచినిగాను మీరు సిగ్గువిడిచి చరించుచున్నారు. మీనడతలుచూచిన నాకు రోఁత యగుచున్నది. కనుక మీతోడిసుఖము నొల్లను. వలయునేని మీరింకొక పురుషుని వరింపుఁడు పొండనియెను.

చ. బరువన కింతులం దనకుఁ బల్వురఁ గూర్చుట భోగవాంఛఁ గా
కరయఁగ నొండు గాదు ధన మన్న ధ్రువంబుగ నంగనాజనో
త్కరసముపార్జితం బటులు గావున వీనికి లే దిహంబునుం
బరమును నన్ను నట్ల పఱుపం బని లే దిది చెప్ప నేటికిన్ 80

అ. బరువు=భారము-కష్టము, అనక=అనియెంచక, తనకున్=తనకై, ఇంతులన్=స్త్రీలను, పల్వురన్=పెక్కండ్రను, కూర్చుట=కూర్చుకొనుట, భోగవాంఛన్=సుఖానుభవాపేక్షచేతనే, కాక=కాని, అరయఁగన్=విచారింపఁగా, ఒండుగాదు=ఇతరముగాదు, ధనము=ధనమో, అన్నన్=అనినను, ధ్రువంబుగన్=స్థిరముగా, అంగ.. త్తంబు-అంగనాజన=ఈస్త్రీజనముయొక్క, ఉత్కర=సమూహముచేతనే, సముపార్జితంబు=సంపాదింపఁబడినది, అటులు గావునన్=అట్లుగనుక, వీనికిన్=ఈరాజునకు-స్వరోచికి, ఇహంబును=ఈలోకపుమేలును, పరంబును=పరలోకపుమేలును, లేదు=కలుగదు, నన్నును=ననుఁగూడ, అట్ల=ఆవిధముగానే, పఱుపన్=పాటుపడఁజేయుట, పనిలేదు=అక్కఱలేదు, ఇది=ఈస్త్రీలవలని సుఖమును, చెప్పన్=ఇట్టిదియనిచెప్పుట, ఏటికిన్=ఎందులకు-అక్కఱలేదు.

తా. పురుషుఁడు తనకుఁ గలుగుశ్రమమును దలఁపక స్త్రీలను గూర్చుకొనుట భోగవాంఛచేతనే కాని మఱి దేనిచేతను గాదు ఈఅనిధనసంపద యీస్త్రీలమూలముననే సంపాదింపఁబడినది. ఇది స్థిరమయినమాట విచారించునెడ నింతకంటె నితరమేదియుఁ గానరాదు. కాఁబట్టి యీరాజునకు నిహపరములు రెంటను మేలు గానరాదు ఇతనివలెనే నన్నును వ్యర్థునిఁగా నెంచవలదు. ఈవిషయ మిట్లని వివరింపను నక్కఱలేదు

క. వీనివిధంబున వనితా, ధీనుఁడ నై పెంపు దక్కి తిరుగుచు నుండం
గా నే వెఱ్ఱినె తమకము, మాని చనుం డన్న నవియు మసలక చనియెన్. 81

అ. వీనివిధంబునన్=ఈస్వరోచివలె, వనితాధీనుఁడనై=స్త్రీలకులోఁబడినవాఁడనై, పెంపు=గౌరవము, తక్కి=చెడి, తిరుగుచున్=సంచరించుచు, ఉండంగాన్=ఉండుటకు, నేన్=నేను, వెఱ్ఱినె=పిచ్చివాఁడనా, తమకము=మోహము, మాని=విడిచి, చనుండు=పొండు, అనన్=అనఁగా, అవియున్=ఆయాఁడుమృగములును, మసలక = ఆలస్యముచేయక-అంతట నక్కడనిలువక, చనియెన్=వెడలిపోయెను.

తా. ఈస్వరోచివలె స్త్రీవశ్యుఁడనై చరింప నేను వెఱ్ఱివాఁడను గాను. నావలని మోహము మాని వెడలిపొండు అనఁగా నాయాఁడుమృగంబులు తడయక వెడలిపోయెను

క. ఈకరణి దూఱ నాడిన, యాకృష్ణమృగంబుపలుకు లటు మున్నుగ న
క్కోకసతి యన్నమాటలు, నేకంబై తనమనంబు నెరియం జేయన్. 82

అ. ఈకరణిన్=ఈవిధముగా, దూఱ...పలుకులు-దూఱన్=నిందించుటగా, ఆడిన=పలికిన, ఆకృష్ణమృగంబుపలుకులు=ఆనల్లయిఱ్ఱియొక్కమాటలును, అటుమున్నుగన్=అంతకుముసుపు, అక్కోకసతి=ఆచక్రవాకస్త్రీ, అన్నమాటలును=చెప్పినమాటలును, ఏకంబై=ఒక్కటియై, తనమనంబున్=తనదైనమనస్సును, ఎరియంజేయన్=తపింపఁజేయఁగా.-మీఁదికన్వయము.

ఉ. ఆరయ నిట్టిరోఁతలకు నాలయముల్ జలజాక్షు లేటికిన్
వీరలతోడిసంగ మిఁక వీడెద నంచుఁ దలంచి తోన దు

ద్వారము లైనకోరికలవంక వివేకము చొప్పు డక్కి యిం
పారఁగ నాలునూఱుసురహాయనముల్ చరియించెఁ గ్రమ్మఱన్. 83

అ. ఆరయన్ = విచారింపఁగా, ఇట్టిరోఁతలకున్ = ఇటువంటియసహ్యములకు, ఆలయముల్ = ఉనికిపట్లు, జలజాక్షులు = స్త్రీలు, వీరలతోడిసంగము = ఇట్టియీ స్త్రీలతోడిదైనసహవాసము, ఏటికిన్ = ఎందులకు, ఇఁకన్ = ఇఁకమీఁద, వీడెదన్ = విడిచిపెట్టెదను, అంచున్ = అని, తలంచి = తనలో నెంచుకొని, తోన = తోడనే - వెంటనే, దుర్వారములు = నివారింపశక్యములుకానివి, ఐనకోరికలవంకన్ = అయినట్టికోరికలవలన, వివేకముచొప్పు = ఆ తెలివియొక్క మార్గము, డక్కి = వదలి, క్రమ్మఱన్ = మరల, ఇంపారఁగన్ = ఆనందమునిండుకొనఁగా, నాలునూఱుసురహాయనముల్ = దేవమానమున నాలుగువందలయేండ్లు, చరియించెన్ = ఆభార్యలతోఁ గూడి విహరించెను.

తా. అట్లు మనస్తాపముపొంది స్వరోచి తనలో విచారింపఁగా నిట్టిరోఁతల కన్నిటికి నునికిపట్లు స్త్రీలుగనుక నీ స్త్రీలతోడి సహవాసము మాని ఘనతవహించెద నని యెంచి యంతలోనే యా తెలివి మాసిపోఁగా నెప్పటివలె నాముగ్గురుభార్యలతోడను గూడి దేవమానమునం దాలునూఱేండ్లు విహరించెను.

వ. తదనంతరంబ క్రమక్రమంబున మనోరమయందు విజయుండును విభావసియందు మేరునందనుండును, గళావతియందు విభావసుండును ననునందనులంగాంచి పద్మినీవిద్యాప్రభావంబునం బాకశాసనదిశాముఖంబున విజయునకు విజయాఖ్యాపురంబును గిన్నరేశ్వరహరిదంతంబున మేరునందనునకు గంధవతి యనుపుటభేదనంబును దక్షిణంబున విభావసునకు ధారాహ్వయోదారమహానగరంబునుం గల్పించి యనల్పవిభవంబున నక్కుమారుల నప్పట్టణంబులకుఁ బట్టంబుగట్టి కృతార్థుండై యొక్కనాఁడు. 84

అ. తదనంతరంబ = ఆవెంటనే, క్రమక్రమంబునన్ = వరుసవెంబడిని, మనోరమయందు విజయుండును = మనోరమ యనుభార్యయందు విజయుఁడు, విభావసియందు మేరునందనుండును = విభావసి యనుభార్యయందు మేరునందనుఁడు, కళావతియందు విభావసుండును = కళావతి యనుభార్యయందు విభావసుఁడు, అనునందనులన్ = అనుపేళ్లుగలకొడుకులను, కాంచి = కని, పద్మినీవిద్యాప్రభావంబునన్ = పద్మిని యనువిద్యయొక్క మహిమచేత, పాకశాసనదిశాముఖంబునన్ = తూర్పుదిక్కు మొగదలను, విజయునకు, విజయాఖ్యపురంబును = విజయమను పేరుగల పట్టణమును, కిన్నరేశ్వరహరిదంతంబునన్ = కుబేరునిదైనయుత్తరపుదిక్కు మొగదలను, మేరునందనునకు, గంధవతి యనుపుటభేదనంబును = గంధవతి యను పేరుగల పట్టణమును, దక్షిణంబునన్ = దక్షిణపుదిక్కునందు, విభావసునకు, ధారాహ్వయోదారమహానగరంబును = ధార యనుపేరు గలఘనతవహించిన పెద్దపట్టణమును, కల్పించి = నిర్మించి - కట్టి, అనల్పవిభవంబునన్ = తక్కువకాని వైభవముతో, అక్కుమారులన్ = ఆముగ్గురుకొడుకులను, అప్పట్టణంబులకున్ = ఆమూఁడుపట్టణములకును, పట్టంబుఁగట్టి = పట్టాభిషిక్తులనుగాఁజేసి, కృతార్థుండై = ఎల్లకోరికలు నెఱవేఱ్చుకొన్నవాఁడై, ఒక్కనాఁడు = ఒకానొకదినమునందు - మీఁదికన్వయము.

ఉ. శాసితశత్రుఁ డానృపతిచంద్రుఁడు తూణధరుండు సజ్యబా
ణాసనపాణిపంకజుఁడునై మృగసంఘమును దెల్లఁ బెల్లు సం

త్రాసము నొందఁ గ్రూరత నరణ్యమునన్ మృగయాకుతూహలో
ల్లాసమునం జరించెఁ జలలక్ష్యవిభేదవిధావధానుఁడై ౮౫

అ. శాసితశత్రుఁడు=శిక్షింపఁబడిన పగవారుగలవాఁడైన, ఆనృపతిచంద్రుఁడు=ఆరాజశ్రేష్ఠుఁడు-స్వారోచి, తూణధరుండును = అమ్ములపొదులుదాల్చినవాఁడును, సజ్య. జుఁడునై-సజ్య = ఎక్కుపెట్టఁబడిన, బాణాసన=వింటితోఁగూడిన, పాణిపంకజుఁడునై = హస్తకమలముగలవాఁడునై-ఎక్కుపెట్టినవిల్లు చేతఁబట్టినవాఁడనుట, మృగసంఘములు= మెకములగుంపులు,ఎల్లన్ =అన్నియును, పెల్లుసంత్రాసమున్ =మిక్కిలిభయమును, ఒందన్ =పొందఁగా, క్రూరతన్ =కఠినత్వముతో, మృగయా... మునన్-మృగయా=వేఁటయందలి, కుతూహల=వేడుకవలననైన, ఉల్లాసమునన్ =ఉత్సాహముతో, అరణ్యమునన్ =అడవియందు, చల ..నుఁడై-చల=చలించునట్టి, లక్ష్య=గుఱియొక్క-గుఱియైనమృగముల యొక్క, విభేద=చక్కఁగా భేదించుటయనెడి, విధా=వ్యాపారమునందు, అవధానుఁడై=ఎచ్చరిక గలవాఁడయి, చరించెన్ =సంచరించెను.

తా. పగవారినెల్లను గెలిచి వాసికెక్కినయాస్వారోచిమహారాజు వేఁటాడఁగోరి యమ్ములపొదులు విల్లునుగొని యడవికిఁజని యందలిమృగములు తన్నుఁగని వెఱచి పాఱిపోవుచుండఁగా గుఱితప్పక బాణములు ప్రయోగించి వేఁటాడుచు సంచరించెను.

వ. ఆసమయంబున.

క. కుటిలకృశసాంధ్యరజనీ, విటకోరకకోమలచ్ఛవిస్ఫుటదంష్ట్రో
ద్భటపోత్రఖనిత్రాగ్ర, స్ఫుటితవనీధాత్రి నొక్కకిటిఁ గనియెన్. 86

అ. కుటిల... ధాత్రిన్ -కుటిల=వంకరయైన, కృశ=సన్నగిలిన, సాంధ్య = సంధ్యాకాలమునందలి, రజనీవిటకోరక=బాలచంద్రరేఖవలె, కోమలచ్ఛవిన్ =మృదువైనకాంతిచేత, స్ఫుట=స్వచ్ఛముగా వెలుఁగుచున్న, దంష్ట్రి=కోఱలచేత, ఉద్భట=నిక్కిన, పోత్ర=ముట్టెయనెడి, ఖనిత్ర=గుద్దలియొక్క, అగ్ర=మొనచేత, స్ఫుటిత=భేదింపఁబడిన, వనీధాత్రిన్ =అడవిభూమిగలదానిని- తెల్లగాఁ బ్రకాశించుటచేతఁ జంద్రరేఖలవలెనే కనఁబడుచున్న కోఱలతోడి ముట్టెతో వనభూమిఁ ద్రవ్వినట్టిదానిననుట, ఒక్కకిటిన్ =ఒకయడవిపందిని, కనియెన్ = (స్వారోచి) చూచెను. అలం. నిదర్శన, రూపకమును.

(ఈక్రిందిపద్యము పైపద్యమునర్థమే కలదైయున్నది. ఇది ప్రక్షిప్తమని బ్రౌన్ దొరగారి పుస్తకములో వ్రాయఁబడియున్నది )

సీ. జంభారిభిదురసంరంభంబు వీక్షించి, జరగునంజనమహాశైల మనఁగ
ఝంఝూప్రభంజనాస్ఫాలనంబున కుల్కి, యరుగుసంవర్తకాలాభ్ర మనఁగఁ
గఠినకంఠేకాలకంఠమూలము వాసి, వెస వచ్చునుజ్జ్వలక్ష్వేళ మనఁగఁ
గలుషధూమ్రవహాఖిలోత్కరముపైఁ బఱతెంచు, దండధరక్రూరదండ మనఁగఁ
ఘుర్ఘురారావసంఘాతఘూర్ణమాన
సప్తపాథోధిపాథఃప్రచండనక్ర
తిమితిమింగిల మగుచు సరభసమున మహిఁ
గ్రమ్ముకొని వచ్చునొకయేకలమ్ముఁ గనియె. 87

అ. జంభారిభిద్దురసంరంభంబుక్ = ఇంద్రుని వజ్రాయుధముయొక్క యాటోపమును, వీక్షించి = చూచి, జరగునంజనమహాశైలము = తొలఁగిపోవునట్టి గొప్ప కాటుక కొండయో, అనఁగక్ = అనునట్టుగాను, ఝంఝా...బునకుక్ - ఝంఝాప్రభంజన = వానతోడి పెనుగాలియొక్క, ఆస్ఫాలనంబునకుక్ = చలింపునకు - తాఁకునకు, ఉల్కి = భయపడి - బెదరి, అరుగు ... భ్రము - అరుగు = పోవునట్టి, సంవర్త = ప్రళయకాలమునందలి, కాలాభ్రము = నీలమేఘమో, అనఁగక్ = అనునట్టుగాను, కఠిన...మూలముక్ - కఠిన = క్రూరమైన, (క్ష్వేళమునకు విశేషణము,) కంఠేకాల = శివునియొక్క, కంఠమూలముక్ = మెడయడుగును, పాసి = విడిచి, వెసక్ = వేగముతో, వచ్చునుజ్జ్వలక్ష్వేళము = వచ్చునట్టి వెలుఁగుచున్న విషమో, అనఁగను, కలుష...పైక్ - కలుషధూర్వహ = పాపభారము వహించునట్టి - మిక్కిలి పాపకృత్యములు చేయునట్టి, ఖలోత్కరము పైక్ = దుర్జనుల సమూహము మీఁద, పఱతెంచు. .దండము - పఱతెంచు = వడిగొని వచ్చునట్టి, దండధర = యమునియొక్క, క్రూరదండము = కఠోరమైన దండాయుధమో, అనఁగను, ఘుర్ఘురా...గిలము - ఘుర్ఘుర = గురగురయనునెడి, ఆరావ = ధ్వనియొక్క, సంఘాత = అధికమైన దెబ్బలచేత, ఘూర్ణమాన = తిరుగుడుపడుచున్న, సప్తపాథోధి = ఏడుసముద్రములయొక్క, పాథః = నీటిలోనుండి వెడలిన, ప్రచండ = భయంకరమైన, నక్ర = మొసళ్లు, తిమి = తిములనెడి పెనుఁజేఁపలు, తిమింగిలము = తిములను మ్రింగునట్టి మిక్కిలి పెద్దవైన చేఁపలునుగలది, అగుచుక్ = అవుచును, అభ్రమును = ఆకాశమును, మహియుక్ = భూమియును, క్రమ్ముకొన్ని = ఆక్రమించుకొని, వచ్చునొకయేకలమ్ముక్ = వచ్చునట్టియొకపందిని, కనియెక్ = చూచెను.

మ. కని మౌర్వీనినదంబు సేయుచు భుజంగక్రూరనారాచముం
దనదోర్దండకృతాంతదండనిభకోదండంబునం గూర్చి బో
రన నేయం దమకించుచుండ నొకసారంగాంగనారత్న మ
జ్జననాథాగ్రణిఁ జేరి పంచజనభాషాప్రౌఢిమై నిట్లనున్. 88

అ. కని = ఆపందిని జూచి, మౌర్వీనినదంబు = వింటినారిమ్రోఁతను, చేయుచుక్ = కలుగఁజేయుచు, భుజంగక్రూరనారాచముక్ = పామువలెఁ గ్రూరమైనయినుపబాణమును, తన...దండంబునక్ - తన = తనదైన, దోర్దండ = కఱ్ఱవంటి చేతిలోని, కృతాంతదండ = యమునిదండాయుధముతోడ, నిభ = పోలిన, కోదండంబునక్ = వింటియందు, కూర్చి = సంధించి, (పా. పూన్చి) బోరనక్ = శీఘ్రముగా, ఏయక్ = ప్రయోగించుటకు, తమకించుచుండక్ = త్వరపడుచుండఁగా, ఒకసారంగాంగనారత్నము = మేలయినయొక యాఁడుజింక, అజ్జననాథాగ్రణిక్ = ఆరాజశ్రేష్ఠుని, చేరి - దగ్గఱవచ్చి, పంచజనభాషాప్రౌఢిమైక్ = మనుష్యులమాటలవంటిమాటలయందలి నేర్పుతో, ఇట్లనుక్ = ఇట్లుపలికెను.

తా. స్వరోచి యాపందిని జూచి వింటినారి మ్రోయించి వాఁడియైనయొక యినుపబాణమును వింటియందు సంధించి ప్రయోగింప యత్నించుచుండఁగా నొకయాఁడుజింక యారాజునుజూచి మనుష్యులమాటలతో నిట్లుపలికెను. అలం. ఉపమ, నిదర్శనయు.

క. నృప యీక్రోడము నీ కే, యపకారము సేసె దీని కెలుఁగఁగ నేలా
కృప మదిఁ జొనుపక నాపై, నిపు డీశర మేసి నిగ్రహించుట యొప్పన్. 89

అ. నృప = ఓరాజా, ఈక్రోడము = ఈపంది, నీకు, ఏయపకారము సేసెక్ = ఏకీడు చేసెను, దీనికెక్ = ఈపందియెడల, కృప = దయను, మదిక్ = మనసునందు, చొనుపక = ప్రవేశింపఁజేయకపోకలవాఁడవు

గాక, అలుగఁగన్ = కోపించుట, ఏలా = ఎందుకు, ఇపుడు = ఈసమయమునందు, ఈశరమున్ = ఈబాణమును, నాపైన్ = నామీఁద, ఏసి = ప్రయోగించి, నిగ్రహించుట = త్రోసిపాడుట, ఒప్పున్ = తగును.

తా. ఓ౦జా ! ఈపంది నీకేమియుఁ గీడుచేయలేదే దీనిపైఁ గోపించి చంప యత్నించుట యేల ఇప్పుడు దీనిఁ గరుణించి విడిచి నామీఁద నాబాణము నేసి నన్నుఁ జంపుము. అది యుక్తము గా నుండును.

క. అని పలుక నతఁడు నీ వీ, తనువుపయిన్ రోయనేల ? తద్దయుఁ గృశమై
యునికియుఁ గాదు గదా చెపు, మనవుడు నాహరిణి పల్కె ? నవనీపతికిన్. 90

అ. అని పలుకన్ = ఆయాఁడుజింక యిట్లని యనఁగా, అతఁడు = ఆస్వారోచి, నీవు, ఈతనువు పయిన్ = ఈదేహముమీఁద, రోయనేల = అసహ్యపడనేల, తద్దయున్ = మిక్కిలి, కృశమై = చిక్కి, ఉనికియున్ = ఉండుటయును కాదుగదా, చెపుము = నాతోఁ జెప్పుము - ఆహారాదులులేమిచేఁ జిక్కియున్నను రోయఁదగునుగాని యేదియులేక రోయనేల యనుట, అనవుడున్ = అని యడుగఁగా, అవనీపతికిన్ = రాజుతో, ఆహరిణి = ఆయాఁడుజింక, పల్కెన్ = ఇట్లు చెప్పెను. - అనఁగా స్వారోచి తనతో నట్లు పలికినలేడినిఁ జూచి నిన్నుఁ జూడఁగా సుఖముగా జీవించుచున్నదానివలెఁ దోఁచుచున్న దే యిట్లు దేహత్యాగముచేయఁగోర నేల యని యడుగఁగా నది ప్రత్యుత్తరము చెప్పఁ బూనెను.

ఆ. అన్యసతులయందు ? నాసక్తుఁ డగువానిఁ, దమక మొదవి కూడఁ ? దలఁచుకంటె
మరణమైనమేలు ? మది వితర్కింపంగ, ననుచుఁ బలుకుటయును ? నవనివిభుఁడు.

అ. అన్యసతులయందున్ = ఇతరస్త్రీలయందు, ఆసక్తుఁడు = మక్కువకలిగినవాఁడు, అగువానిన్ = అగునట్టిపురుషుని, తమకము = వలపు, ఒదవి = కలిగి - పొంది, కూడన్ = కలయుటకు, తలఁచుకంటెన్ = ఎంచుటకన్నను, మదిన్ = మనస్సునందు, వితర్కింపంగన్ = విచారింపఁగా, మరణమైనను = చావైనను - చచ్చినను, మేలు = మంచిది, అనుచుఁబలుకుటయున్ = అని యనఁగానే, అవనివిభుఁడు = రాజు. - మీఁదిపద్యముతో నన్వయము

క. తావకహృదయం బెవ్వని, పై వదలక నిలిచె నీదు ? భావము దెలియం
గా వలయుఁ జెప్పు మన్న ధ, రావల్లభుతోడ హరిణి ? క్రమ్మఱ ననియెన్. 92

అ. తావకహృదయంబు = నీమనస్సు, ఎవ్వనిపైన్ = ఏపురుషునిమీఁద, వదలక = మానక - తప్పక, నిలిచెన్ = పొందెను, నీదుభావము = నీతలఁపు, తెలియంగావలయున్ = నేనుదెలిసికోవలయును, చెప్పుము, అన్నన్ = అనఁగానే, హరిణి = లేడి, ధరావల్లభుతోడన్ = రాజుతో - స్వారోచితో, క్రమ్మఱన్ = మరల, పలికెన్ = ఇట్లు చెప్పెను

చ. చెదరక నామనంబు నృప ? శేఖర నీయెడ నిల్చి మన్మథ
ప్రదరపరంపరానిహతి ? పాల్పడి వేఁగెడు నట్లుగాన నా
యెద టడఁగింపు మన్న హరి ? ణాంగన నీవు నరుండ నేముదం
బొదవఁగ నీకు నాకు మిథు ? నోచితకృత్యము లెట్లు చేకుఱున్. 93

నృపశేఖర = రాజశ్రేష్ఠుఁడా, నామనంబు = నామనస్సు, నీయెడన్ = నీయందు, చెదరక = చలింపక - తప్పక, నిల్చి = చేరినదై, మన్మథ .. పాల్పడి - మన్మథ = మన్మథునివైన, ప్రదర = బాణముల యొక్క, పరంపరా = వడదెగనివరుసలయొక్క, నిహతి = దెబ్బలయొక్క, పాల్పడి = పాలై, వేఁగెడున్ =

తపించుచున్నది, అట్లుగానన్ = అటుగనుక - కాఁబట్టి, నాయదటు = నాతమకమును, అడఁగింపుమీ=అణఁపుము, అన్నన్ =అనఁగా, (రాజు) ఈవు=నీవు, హరిణాంగనవు=మృగస్త్రీవి, నేన్ = నేను, నరుండన్ =మనుష్యుఁడను,నీకున్ నాకున్ =నీకును నాకును,ముదంబు=సంతోషము, ఒదవఁగన్ = కలుగునట్లు, మిథునోచితకృత్యములు=ఆలుమగలకూడికకుఁ దగినవ్యాపారములు, ఎట్లు, చేకుఱున్ = సిద్ధించును.

తా. ఓరాజశ్రేష్ఠుఁడా! నామనస్సు నీయందే తగిలి మన్మథవేదనచే దపించుచున్నది. నీవు నాతమకము నణఁపుమనఁగా రాజు నీవు మృగస్త్రీవి నేను మనుష్యుఁడను మనకెట్లు దాంపత్యధర్మము సిద్ధించును. సిద్ధింప ననువుకాదే యనియెను.

క. నానుడు సను నాలింగన, మీూ వనురాగమునఁ జేయు మింతియ చాలున్
భూవర యన్నఁ గృపార్ద్రుఁడు, గావున నానృపతి హరిణిఁ గౌఁగిటఁ జేర్చెన్ 94

అ. నానుడున్ = అని రాజుపలుకఁగానే, (లేడి) భూవర = రాజా, ఈవు=నీవు, ననున్ = నన్ను, అనురాగమునన్ =ప్రేమతో, ఆలింగనము=కౌఁగిలింతను, చేయుము=కావింపుము, ఇంతియ= ఈకౌఁగిలించుటయే, చాలును, అన్నన్ =అనఁగా, ఆనృపతి=ఆస్వారోచిమహారాజు, కృపార్ద్రుఁడు= దయచేత మెత్తపడినవాఁడు, గావునన్ =కనుక, హరిణిన్ =ఆఁడుజింకను, కౌఁగిటఁజేర్చెన్ =కౌఁగిలించుకొనెను.

సీ. వల్లీమతల్లి లావణ్యానవద్యత్వంబు, విమలాంగ రేఖ నావిర్భవింపఁ
మంజులమంజరీమహిత సౌభాగ్యంబు, పరివృత్తకుచవృత్తిఁ బరిణమింపఁ
బల్లవచ్ఛదచారుభావానుభావంబు, మృదుహస్తలీల మూర్తీభవింప
రమణీయముకుళవిభ్రమభాగధేయంబు, కరరుహస్ఫూర్తి సాక్షాత్కరింపఁ
జేసి మృగియై వహించున కేక్షిద్వయంబు, భాసురంబుగఁ దనయంక పాళిలోన
మించుకొమ్మింగ మను పమించు మెలఁతయగుచు, నిలుచునవ్వనదేవత నృపతిఁ జూచి.

అ. వల్లీ..త్వంబు -వల్లీమతల్లి = శ్రేష్ఠమయినతీఁగెలయొక్క, లావణ్య = కాంతివిశేషము యొక్క, నర్వద్యత్వంబు=సౌందర్యమంతయును, విమలాంగరేఖన్ -విమల=నిర్మలమైన, అంగరేఖన్= అవయవములయొక్క సౌష్ఠవప్రకారముతో, ఆవిర్భవింపన్ =పుట్టఁగా-దేహమేర్పడఁగా, మంజుల.. సౌభాగ్యంబు-మంజుల=మనోహరమయిన, మంజరీ = పూగుత్తులయొక్క, మహిత=పూజ్యమైన, సౌభాగ్యంబు = సుభగత్వము-అందము, పరివృత్తకుచవృత్తిన్ - పరివృత్త = అంతటనువర్తులమైన,కుచవృత్తిన్ = స్తనప్రవర్తనముతో - స్తనములై, పరిణమింపన్ =మారఁగా-ఏర్పడఁగాను, పల్లవ.. భావంబు●పల్లవచ్ఛద=చిగురుటాకులయొక్క, చారుభావ=ఒప్పిదముయొక్క, అనుభావంబు=గొప్పతనము, మృదుహస్తలీలన్ -మృదు = మెత్తనైన, హస్తలీలన్ =చేతులప్రకారముచేత-చేతులై, మూర్తీభవింపన్ =స్వరూపమునొందఁగ కాగాను, రమణీ . ధేయంబు-రమణీయ=అందమయిన, ముకుళ=పూమొగ్గలయొక్క, విభ్రమ=విలాసముయొక్క, భాగధేయంబు=భాగ్యము-కలిమి, కరరుహస్ఫూర్తిన్ = గోళ్లయొక్కస్ఫురణచేత-గోళ్లుగాఁ బ్రకాశించుటచేత, సాక్షాత్కరింపన్ = ప్రత్యక్షముకాఁగా-కనఁబడఁగాను, చేసి=కావించి, (కర్త, వనదేవత.) మృగియై=మృగస్త్రీయై, వహించునక్షిద్వయంబు=తాల్చినకన్నులజంట, భాసురంబుగన్ = (కన్నులై) ప్రకాశింపఁగా, తనయంకపాళిలోన్ = తనకౌఁగి

టియందు, మించుక్రొమ్మించుచున్ = మెఱయుచున్న క్రొత్త మెఱపునున్, ఉపమించేమేలంత = సరిపోలునట్టి స్త్రీని, కన్గొనుచున్ = అయి, నిలుచున్నవనదేవతన్ = నిలిచినయావనాధిదేవతను, చూచి, నృపతీ= రాజు - పైకన్వయము.

తా. అప్పుడు మృగస్త్రీరూపముతో నున్నవనదేవత వనములో నీలేఁతతీఁగలే తనకుసుందరమయినదేహమును, పూగుత్తులే స్తనద్వయమును, చిగురాకులే హస్తములును, పూమొగ్గలే గోళ్లును, లేడికైయున్నప్పటికన్నులే కన్నులునై యొప్పఁగాఁ దళతళ మెఱయుచున్న మెఱపుఁదీఁగవలె స్వారోచికాఁగిట నొకమనుష్యస్త్రీరూపముతోఁ గనుపట్టెను అప్పుడు దానిఁజూచి యారాజు. అలం. ఉపమ.

క. పూనినవిస్మయరసమున, మానిని మృగివై చరించి మఱి యంగన వై
కానంబడితివి చిత్రం, బే నెన్నఁడు నెఱుఁగఁ జెప్పవే తెలియంగన్. 96

అ. పూనినవిస్మయరసమునన్ - పూనిన=పొందిన, విస్మయరసమునన్ = ఆశ్చర్యరసముతో - ఆశ్చర్యమునుబొందియనుట, మానిని=ఓవనితా, మృగివై=ఆఁడుజింకవై, చరించి=వర్తించి, మఱి=పిమ్మట, అంగనవై=మనుష్యస్త్రీవై, కానంబడితివి=కనఁబడితివి, చిత్రంబు=ఇదివింతగానున్నది, ఏన్=నేను, ఎన్నఁడున్=ఎప్పుడును, ఎఱుఁగన్ = (ఇట్టివింతచూచి) యెఱుఁగను, తెలియంగన్=ఇట్లగుటకుఁ గారణము తెలియఁబడునట్లు, చెప్పవే=నాతోఁ జెప్పుము

తా. అప్పుడు దానిఁజూచి స్వారోచి యోచిన్నదానా! నీవు తొలుత మృగస్త్రీవైయుండి పిమ్మట మనుష్యస్త్రీవై కనఁబడుచున్నావు. ఇది వింతగానున్నది ఇట్లగుటకుఁ గారణమేమో నాకుఁ దెలియఁజెప్పుమనియెను.

సీ. నావుడు నమరకాంతాతనూభవుఁ జూచి, యివ్వనదేవత నే నరేంద్ర
సకలభూభువనరక్షాదక్షు మనువర్యు, నీయందుఁ బడయు నెన్నిక సమస్త
దివిజులు నన్నుఁ బ్రార్థించిన వచ్చితి, ననురాగవతి నైనన్ను వరించి
పడయుము నాయం దపత్యంబు దీన నీ, కగుఁ బుణ్యలోకసంప్రాప్తి యనిన
నట్లకాకని యయ్యంబుజాయతాక్షి, నేకచిత్తంబుతోడ నంగీకరించె
బాల యిట్లు సుఖాంబుధిఁ దేలుచుండి, యంతగర్భిణియై శుభంబగుదినమున.

అ. నావుడున్ =(అనిస్వారోచి) యనఁగా, అమరకాంతాతనూభవున్ = దేవతాస్త్రీకొడుకైన యాస్వారోచిని, చూచి=(వనదేవత)చూచి, నరేంద్ర=రాజా, ఏన్ = నేను, ఇవ్వనదేవతన్ =ఈయడవికి నధిదేవతను, సకల ..దక్షున్ - సకల=సమస్తమయిన, భూభువన=భూలోకముయొక్క, రక్షా=రక్షించుటయందు, దక్షున్=సమర్థుఁడైనవానిని-చాలినవానిని, మనువర్యున్=శ్రేష్ఠుఁడైన మనువును, నీయందున్=నీవలన్, పడయు నెన్నికన్=కనుతలఁపుతో, నన్ను, సమస్తదివిజులు=ఎల్లదేవతలును, ప్రార్థించినన్=వేఁడఁగా, వచ్చితిన్ =నేనువచ్చినాను, అనురాగవతిని=అనురక్తిగలదానను, ఐననన్నున్=అయినట్టినన్ను, వరించి=పరిగ్రహించి, నాయందున్ = నావలన, అపత్యంబు=సంతానమును, పడయుము= పొందుము, దీనన్ = ఈసంతతిచేత, నీకు, పుణ్యలోకసంప్రాప్తి=పుణ్యలోకములపొందు- సద్గతి యనుట, అగును, అనినన్=అని వనదేవత చెప్పఁగానే, అట్లకాక=అట్లేకానిమ్ము, అని, అయ్యంబుజాయతాక్షిన్=తామరవలె వెడలుపులైనకన్నులుగలయాస్త్రీని, ఏకచిత్తంబుతోడన్=ఒకటేమనసుతో - మనసున నన్యథాభిప్రాయములేక, అంగీకరించెన్ =స్వారోచి పరిగ్రహించెను, బాల=ఆస్త్రీ, ఇట్లు,

సుఖాంబుధిన్ = సౌఖ్యసముద్రమునందు, తేల్చుచున్ = ఈదులాడుచు, ఉండి = ఉన్నదై - అతనితోఁ గూడి మేరలేనిసుఖము ననుభవించుచుండి యనుట, అంతన్ = అటుపిమ్మట, గర్భిణియై = గర్భముధరించినదై, శుభంబు = మంచిది, అగుదినమునన్ = అగునట్టియొకానొకదినమునందు - పైకన్వయము

తా. అట్లు స్వరోచి తనవృత్తాంతము నడుగఁగా నా స్త్రీ "నేనీవనదేవతను. నీవలన మనువు కాఁదగిన యొకకుమారునిఁ బడయుటకై దేవతలు ప్రార్థింపఁగా నీయొద్దకు వచ్చితిని. నన్నుఁగూడి కొడుకుంబడయుము. ఆకొడుకువలన నీకుఁ బుణ్యలోకప్రాప్తియగు" ననఁగా నందులకొప్పుకొని దానిం బరిగ్రహించి సుఖించుచుండఁగా నది గర్భము ధరించి యొకశుభదినమునందు

శా. కాంచెం బుత్త్రు విశాలనేత్రుఁ బృథువక్షఃపీఠవిభ్రాజితుం
బంచాస్యోద్భటశౌర్యధుర్యఘనశుంభద్బాహుఁ దేజోనిధిం
బంచాస్త్రప్రతిమాను మానఘను సామ్రాజ్యైకహేతుప్రభూ
తాంచల్లక్షణలక్షితున్ సుగుణరత్నానీకరత్నాకరున్. 98

అ. విశాలనేత్రున్ = విరివియైనకన్నులుగలవానిని, పృథు . జితున్ - పృథు = విశాలమైన, వక్షఃపీఠ = పీఁటవంటిఱొమ్ముచేత, విభ్రాజితున్ = ప్రకాశించువానిని, పంచా .. బాహున్ - పంచాస్య = సింహముయొక్క, ఉద్భట = హెచ్చయిన, శౌర్య = శూరత్వమువంటిశూరత్వమునకు, ధుర్య = భారవాహియైన, ఘన = దొడ్డదైన, శుంభద్బాహున్ = ఎగుభుజములుగలవానిని, తేజోనిధిన్ = ప్రతాపమునకు స్థానమైనవానిని, పంచాస్త్రప్రతిమానున్ = సౌందర్యముచేత మన్మథునితో సమానుఁడయినవానిని, మానఘనున్ = చిత్తౌన్నత్యముచేత నధికుఁడయినవానిని, సామ్రా.. లక్షితున్ - సామ్రాజ్య = మహామండలేశ్వరత్వమే, ఏక = ముఖ్యమైన, హేతు = కారణముగాఁగల, ప్రభూత = గొప్పవైన, అంచత్ = ఒప్పుచున్న, లక్షణ = సాముద్రికచిహ్నములచేత, లక్షితున్ = చూడఁబడినవానిని - చక్రవర్తిలక్షణములు గలవానిననుట, సుగుణ . కరున్ - సుగుణ = మంచిగుణములనెడి, రత్న = రత్నములయొక్క, అనీక = సమూహమునకు, రత్నాకరున్ = సముద్రుఁడైనవానిని, పుత్త్రున్ = కొడుకును, కాంచెన్ = కనియెను.

తా. వెడలుపయినకన్నులును ఱొమ్మును సింహపరాక్రమమువంటి పరాక్రమమును హెచ్చైన ప్రతాపమును మన్మథునిచక్కఁదనమువంటి చక్కఁదనమును జక్రవర్తి చిహ్నములును సకలసద్గుణములును గలిగినయొకసత్పుత్త్రునిఁ గనియెను. అలం. ఉపమ, రూపకమును.

క. వేడుక నయ్యవసరమున, నాడిరి సురసతులు కిన్నరాంగన లర్థిం
బాడిరి గంధర్వులు గొని, యాడిరి సురతూర్యనినద మగ్గల మయ్యెన్. 99

అ. అయ్యవసరమునన్ = ఆకొడుకుపుట్టిన సమయమునందు, వేడుకన్ = కుతూహలముతో, సురసతులు = దేవతాస్త్రీలు, ఆడిరి = నాట్యము చేసిరి, అర్థిన్ = ప్రీతితో, కిన్నరాంగనలు = కిన్నరస్త్రీలు, పాడిరి = గానము చేసిరి, గంధర్వులు = దేవగాయకులు, కొనియాడిరి = స్తోత్రములు చేసిరి, సురతూర్యనినదము = దేవవాద్యములధ్వని, అగ్గలమయ్యెన్ = అధికమయ్యెను

తే. అట్లు జనియించి స్వారోచిషాఖ్యనతఁడు, శాంతిదాంతిదయాసత్యశౌచనిరతుఁ
డై యకామతఁజిరతపం బాచరించె, నచ్యుతునిఁగూర్చి యంతఁగృపాపాత్రుఁడగుచు.

అ. అట్లు = ఆవిధముగా, జనియించి = పుట్టి, అతఁడు = ఆకుమారుఁడు, స్వారోచిషాఖ్యన్ = స్వారోచిషుఁడనుపేరితో, శాంతి ... నిరతుఁడై - శాంతి = శమమునందును - కామక్రోధాదిగుణములులేకుండుట

యందును, దాంతి=దమమునందును - బ్రహ్మచర్యము మొదలయినతపస్సుల వలనిశ్రమము నోర్చుట యందును, ఘృణా=కరుణయందును, సత్య=నిజమునందును, శౌచ=పరిశుద్ధతయందును, నిరతుఁడై=ఆసక్తుఁడై, అకామతన్=కోరికలేనితనముతో, అచ్యుతునిఁగూర్చి=విష్ణునుద్దేశించి, చిరతపంబు=విశేష కాలము జరపునట్టి తపస్సును, ఆచరించెన్=చేసెను, అంతన్=అటుపిమ్మట, కృపార్ద్రుఁడగుచున్ = దయారసముగలవాఁడగుచు-మిక్కిలిదయగలవాఁడై-మీఁదికన్వయము. (కర్త లక్ష్మీశ్వరుండు.)

సీ. నీలమేఘముడాలు డీలుసేయఁగఁజాలు, మెఱుఁగుఁజామనచాయ మేనితోడ
నరవిందములకచ్చు లడఁగించుజిగిహెచ్చు, నాయతం బగుకన్నుదోయితోడఁ
బులుఁగురాయనిచట్టుపలవన్నె నొరవెట్టు, హొంబట్టుజిలుఁగుగెంటెంబుతోడ
నుదయార్కబింబంబునొఱపువిడంబంబు, దొరలంగనాడుకౌస్తుభముతోడ
జయజయధ్వని మౌళినంజలులు సేర్చు, శర్వశతధృతిశతమన్యుశమనశరధి
పాలకైలబిలాదిదేవాలితోడ, నెదుటఁ బ్రత్యక్షమయ్యె లక్ష్మీశ్వరుండు. 101

అ. లక్ష్మీశ్వరుండు=లక్ష్మీనాయకుఁడయిన విష్ణుఁడు, నీలమేఘముడాలు = నల్లమబ్బుకాంతిని, డీలుసేయఁగన్=క్రిందుపఱుచుటను, చాలు... మేనితోడన్-చాలు=చాలిన-సమర్థమైన, మెఱుఁగు = మినమినమెఱయుచున్న, చామనచాయ=శ్యామలవర్ణముతోఁగూడిన, మేనితోడన్ = దేహముతోను, అరవిందములకచ్చులు=తామరలయొక్క నిక్కులను, అడఁగించుజిగిన్ = అణఁచివేయునట్టికాంతిచేత, హెచ్చు=అతిశయించునట్టి, ఆయతంబు=విశాలమైనది, అగుకన్నుదోయితోడన్=అయినట్టికన్నులజంటతోను, పులుఁగు...వన్నెన్-పులుఁగురాయని=పక్షిరాజైనగరుత్మంతునియొక్క, చట్టుపలవన్నెన్= ఱెక్కలవర్ణమును, ఒర..తోడన్ - ఒరవెట్టు=మచ్చునకై యొరయునట్టి-సరిపోలిన, హొంబట్టు= బంగారువన్నెపట్టయిన, జిలుఁగు=సన్నఁదనముగల, గెంటెంబుతోడన్ = జమిలినేఁతవస్త్రముతోను, ఉదయా..విడంబంబు-ఉదయ=ఉదయించునప్పటి, అర్కబింబంబు = సూర్యబింబముయొక్క, ఒఱపు=సౌందర్యముయొక్క, విడంబంబు=పోలికను, దొర..తోడన్ - దొరలంగనాడు=మార్చివేయునట్టి-అణఁచివేయునట్టి, కౌస్తుభముతోడన్ = కౌస్తుభమనెడిమణితోను, జయజయధ్వనిన్ = జయజయయనెడిధ్వనితో, మౌళిన్=తలయందు, అంజలులు=చేమోడ్పులు, చేర్చు తోడన్ - చేర్చు = పెట్టుకొనునట్టి, శర్వ=శివుఁడు, శతధృతి=బ్రహ్మ, శతమన్యు=ఇంద్రుఁడు, శమన=యముఁడు, శరధిపాలక=వరుణుఁడు, ఐలబిల=కుబేరుఁడు, ఆది=మొదలుగాఁగల, దేవాలితోడన్ = దేవతలపంక్తితోను, ఎదుటన్ = ఆస్వారోచిషునియెదుట, ప్రత్యక్షమయ్యెన్=సాక్షాత్కరించెను

తా. నీలమేఘచ్ఛాయతోడిదేహమును తామరలవలె విశాలము లయినకన్నులును బంగారువన్నెపట్టుపచ్చడమును నుదయకాలమునందలిసూర్యబింబమువలె వెలుఁగుచున్నకౌస్తుభమణియు నొప్పఁగా బ్రహ్మ రుద్రుఁడు యముఁడు వరుణుఁ డింద్రుఁడు కుబేరుఁడు మొదలుగాఁగల దేవతాసమూహములు బద్ధాంజలులై సేవింపఁగా విష్ణుదేవుఁడు స్వారోచిషునికిఁ బ్రత్యక్షమయ్యెను. అలం. ఉపమ, ఉదాత్తమును.

క. ఈతెఱఁగునఁ దోఁచినహరి, కాతఁడు సాష్టాంగ మెరఁగి యంగము పులకా
న్వితంబుగ హర్షాశ్రువు, లేతేరఁగఁ జూచి భక్తి నిట్లని పొగడెన్. 102

అ. అతఁడు=ఆస్వాయంభువుఁడు, ఈతెఱంగునన్ = ఈవిధముగా, తోఁచినహరికిన్ = ప్రత్యక్షమైయినవిష్ణుదేవునకు, సాష్టాంగము=ఎనిమిదియంగములతోను గూడుకొనునట్లుగా- చాఁపఁబడి, ఎఱఁగి= నమస్కరించి, అంగము=దేహము, పులకాన్వితంబుగన్ =గగుర్పాటుతోఁ గూడుకొనఁగా - గగుర్పాటు వడఁగా, హర్షాశ్రువులు=సంతోషమువలనికన్నీళ్లు-ఆనందబాష్పములు, ఏతేరఁగన్ = రాఁగా-పుట్టఁగా, చూచి, భక్తిన్ =భక్తితో, ఇట్లని=ఈమీఁదఁ జెప్పఁబోవునట్లు, పొగడెన్ = స్తుతించెను.

కవిరాజవిరాజితము. జయజయ దానవదారణకారణ శార్ఙ్గరథాంగగదాసిధరా
జయజయ చంద్రదినేంద్రశతాయుత సాంద్రశరీరమహఃప్రసరా
జయజయ తామరసోదరసోదర చారుపదోజ్ఝితగాంగఝరా
జయజయ కేశవ కేశినిషూదన శౌరి హరీ దురితాపహరా. 103

అ. దాన ధరా - దానవ = రాక్షసులయొక్క, దారణ=భేదనమునకు - చంపుటకు, కారణ= హేతువులైన-సాధనములైన, శార్ఙ్గ =సింగిణీవిల్లు, రథాంగ = చక్రము, గదా = గుదియ, అసి=కత్తి, ధరా=(అను నాయుధములను) ధరించినవాఁడా, జయజయ=గెలువుము - ఎల్లశత్రువులను గెలిచి యెల్ల లోకములందు నధికుఁడవై వర్తింపుమనుట చంద్ర . ప్రసరా- చంద్ర=చంద్రునియొక్క, దినేంద్ర=సూర్యులయొక్క, శతాయుత=పదిలక్షలయొక్క - అనేక చంద్రసూర్యులయొక్క యనుట, సాంద్ర = దట్టమయిన-అధికమైన, శరీరమహః=దేహకాంతివంటి దేహకాంతియొక్క, ప్రసరా=వ్యాపనముగలవాఁడా, జయజయ, తామర ఝరా- తామరసోదర = తామరపువ్వులయొక్క లోపలిభాగమునకు, సోదర= తోఁడఁబుట్టువైన-సరిపోలిన, చారు=సుందరమైన, పద=అడుగువలన, ఉజ్ఝిత = విడువఁబడిన-వెడలింపఁబడిన, గాంగ=గంగానదీసంబంధమయిన, ఝరా=ప్రవాహముగలవాఁడా, - గంగానదికి జన్మస్థానమైనపాదకమలముగలవాఁడాయనుట జయజయ, కేశవ=బ్రహ్మరుద్రులకు జన్మస్థానమైనవాఁడా (లేక) మంచితలవెండ్రుకలుగలవాఁడా, కేశినిషూదన=కేశియనురాక్షసునిఁ జంపినవాఁడా, శౌరి=శూరునివంశమునందుఁ బుట్టినవాఁడా, హరీ=హరిశబ్దవాచ్యుఁడా,దురితాపహరా=పాపములను బరిహరించువాఁడా, జయజయ.

తా. రాక్షసులను జంపఁ జక్రగదాఖడ్గశార్ఙ్గములు ధరించినవాఁడవును బెక్కుచంద్రుసూర్యచంద్రులు వెలుఁగునట్లు వెలుఁగుచున్నశరీరకాంతి గలవాఁడవును గంగకుఁ బుట్టినచోటైన పాదపద్మములు గలవాఁడవును బ్రహ్మరుద్రులకు జన్మస్థానమైనవాఁడవును కేశి యనురాక్షసునిఁ జంపినవాఁడవును శూరవంశమునఁ బుట్టినవాఁడవును పాపపరిహారకుఁడవునైన యోహరీ! యెల్లశత్రువులను గెలిచి యెల్లవారియందు నధికుఁడవై వర్తింపుము అలం. ఉపమ.

సీ. అవ్యయానంత విశ్వాత్మక విశ్వేశ, బ్రహ్మవు నీవ కపర్ది వీవ
యింద్రుండ వీవ వహ్నివి యనిలుఁడ వీవ, వరుణుండ వీవ భాస్కరుఁడ వీవ
యముఁడ వీవ వషట్కారము నీవ రుద్రులు, నీవె యాదిత్యులు నీవ విశ్వు
లీవ మరుత్తులు నీవ మంత్రములు నోం, కృతి వషట్కృతి శ్రుతిస్మృతులు నీవ
వేద్య మీవ యీవచ్చిన విబుధగణము, సర్వమును నీవ యెట్లన్న సర్వగతుఁడ
వగుట మఱి నీవు గాని వాఁ డనఁగ నెవ్వఁ, డరయఁగను శేషభూత సమస్తశేషి.

అ. అన్వయ=శుభస్వరూపుఁడా, అనంత=అంతములేనివాఁడా, విశ్వాత్మక=సర్వస్వరూపుఁడా, విశ్వేశ=ఎల్లలోకములకు నీశ్వరుఁడా, బ్రహ్మవు=సృష్టికర్తయయిన చతుర్ముఖుఁడవు, నీవ=నీవే, కపర్ది వి=సంహారకర్తయయినరుద్రుఁడవు, ఈవ=నీవే, ఇంద్రుండవు=త్రిలోకాధిపతియయిన దేవేంద్రుఁడవు, ఈవ=నీవే, వహ్నివి=దిక్పాలకులలో నొక్కఁడయినయగ్నివి, అనిలుఁడవు=దిక్పాలకులలో నొక్కఁడయినవాయువవు, ఈవ=నీవే, వరుణుఁడవు=పడమటిదిక్కు నేలెడి వరుణుండవు, ఈవ=నీవే, భాస్కరుఁడవు=ఎల్లలోకములకు వెలుఁగుగలుగఁజేసెడి సూర్యుఁడవు, ఈవ=నీవే, యముఁడవు= దక్షిణదిక్పాలకుఁడైనయముడవు, ఈవ=నీవే, వసూత్కరము=వసువులసమూహము-అష్టవసువులును, నీవ, రుద్రులు=ఏకాదశరుద్రులును, నీవ, ఆదిత్యులు=ద్వాదశాదిత్యులును, నీవ, విశ్వులు= పదునలువురు విశ్వేదేవతలును, ఈవ=నీవే, మరుత్తులు=నలుబదితొమ్మండ్రువాయువులును, నీవ, మంత్రములును= గాయత్రిమొదలగు మంత్రములును, ఓంకృతి=ఓంకారమును, వషట్కృతి=యజ్ఞాదులయం దుపయోగించెడి వషట్కారమును, శ్రుతి=ఋగ్వేదాదివేదములును, స్మృతులు=ధర్మశాస్త్రములును, నీవ=నీవే, వేద్యము=తెలియఁదగిన ప్రధానవస్తువును, ఈవ=నీవే, ఈవచ్చినవిబుధగణము=ఇప్పుడిక్కడవచ్చియుండెడి దేవతాసమూహము, సర్వమును=అంతయును, నీవ, ఎట్లన్నన్=అదియెట్లనఁగా, సర్వగతుఁడవు = సర్వభూతాంతర్యామివి, అగుటన్=అగుటచేత, మతి=మతియును, అరయన్=విచారింపఁగా, నీవుగానివాఁడు= నీవుగాకుండువాఁడు, అనఁగన్=అనఁగా, ఎవ్వఁడు=ఎవఁడున్నాఁడు, శేషభూతసమస్త=నీకు లోనయిన ప్రవృత్తులుగల సమస్తప్రాణులుగలవాఁడా, శేషి=సర్వప్రపంచమునకును స్వామియైనవాఁడా.

మ. పరతత్త్వం బగునీకు మోడ్పుఁగరముల్ పద్మాక్ష కీర్తించెదం
బురుషార్థస్థితి నొప్పునిన్నుఁ గరుణాంభోధిన్ భవార్తున్ జడున్
శరణార్థిన్ ననుఁ గావఁగాఁ దగుఁ బ్రధానవ్యక్త కాలాత్మ యీ
శ్వర భూతంబుల కీవె కర్తవును బ్రోవన్ భర్తవున్ హర్తవున్. 105

అ. పద్మాక్ష=తామరలవంటికన్నులుగలవాఁడా, పరతత్త్వంబు=పరబ్రహ్మము, అగునీకున్=అయినట్టినీకు, మోడ్పుఁగరముల్=అంజలిబంధము-నమస్కారము, పురుషార్థస్థితిన్=చతుర్విధపురుషార్థముల యునికిచేత, ఒప్పునిన్నున్=అమరియున్న నిన్ను, కరుణాంభోధిన్=దయారసమునకు సముద్రుఁడైనవానిని, కీర్తించెదన్=స్తుతించెదను, భవార్తున్=సంసారముచేఁ బీడితుఁడనైనవానిని, జడున్=ఏమియుఁ దెలియనివానిని, శరణార్థిన్=శరణుగోరినవానిని-శరణాగతుని, ననున్=నన్ను, కావఁగాఁదగున్=రక్షింపఁదగును-రక్షింపుము ప్రధానవ్యక్త=సర్వశేషి యనఁ దేటపడుచుండువాఁడా, కాలాత్మ=కాలస్వరూపుఁడా, ఈశ్వర=సర్వనియామకుఁడా, భూతంబులకున్=ప్రాణులకు, కర్తవున్=సృష్టికర్తవును, ప్రోవన్=పోషించుటకు, భర్తవున్=భారవాహియైనవాఁడవును, హర్తవున్=సంహరించువాఁడవును, ఈవె=నీవే.

తా. ఓహరీ! పరబ్రహ్మమయిన నీకు మ్రొక్కెదను మిక్కిలి భూతదయగలవాఁడవును ధర్మార్థకామమోక్షములనెడి చతుర్విధపురుషార్థముల నెలకొలుపువాఁడవునైన నిన్నుఁ బొగడెద. సర్వశేషివై యొప్పువాఁడవును గాలస్వరూపుఁడవును సర్వనియామకుఁడవు నైన నీవు సర్వప్రాణులసృష్టిస్థితిసంహారము లాచరింతువు గావున సంసారబద్ధుఁడనై మూఢుఁడనై శరణుసొచ్చిన నన్నుఁ గాపాడుము.

చ. విలయతమిస్రవేళ నతిభీవేలమహాంబుధి నూర్ధ్వలోకవా
సులు నతులై కనుంగొనెడుచూడ్కుల కార్ణవహుతాశనక్రియా

కలితగతిం వెలుంగు ఘనకాయవిజృంభణం జోఅమీనవై
కలయఁగఁ గ్రాలునీవెడఁదకన్నులు ప్రోచు మమున్ మురాంతకా. 106

అ. మురాంతకా=మురాసురునికి యముఁడా - మురాసురునిఁజంపిన యోహరీ, విలయతమిస్రవేళన్=ప్రళయకాలపురాత్రిసమయమునందు, అతివేలమహాంబుధిన్ = చెలియలికట్టనతిక్రమించి లోకమంతటనువ్యాపించిన మహాసముద్రమునందు, ఊర్ధ్వలోకవాసులు=స్వర్గము మొదలుగాఁగల మీఁదిలోకములయందుండువారు, నతులై = నమ్రులై-మ్రొక్కుచున్నవారై, కనుంగొనెడుచూడ్కులకున్ = చూచునట్టిచూపులకు, ఔర్వ. గతిన్ - ఔర్వహుతాశన=బడబాగ్నియొక్క, క్రియా=వ్యాపారముతోడ, కలిత=ఒప్పచున్న, గతిన్ = రీతిచేత, వెలుంగు = ప్రకాశించుచున్నట్టి (ఇది కన్నులకువిశేషణము) ఘన జృంభణన్ - ఘన=గొప్పదయిన, కాయ = దేహముయొక్క, విజృంభణన్ = స్ఫూర్తిచేత, చోఅమీనవై =చోఅయనెడి చేఁపవై, కలయఁగన్ =అంతటను, క్రాలునీవెడఁదకన్నులు=ప్రకాశించుచున్ననీవైనవిశాలనేత్రములు, మమున్ =మమ్ము, ప్రోచున్ =రక్షించుఁగాక

తా. మురాసురునిఁజంపిన శ్రీహరీ! ప్రళయకాలమునందలి రాత్రియందు లోకమును ముంచిన మహాసముద్రమునందు మీఁదిలోకములనుండి నమస్కరించుచుఁ జూచువారైన నిత్యసూరుల కన్నులకు బడబాగ్నియో యన్నట్లు వెలుఁగుచున్నవియు మహాదేహము గలచోఅచేప వైననీవియు నైనకన్నులు మమ్మురక్షించుఁగాక. కాయము ఘనముగా విజృంభింపఁగా దానికిఁ దగినట్లు కన్నులును అతివిశాలములై వెలుఁగుచు బడబాగ్నివలె మీఁదనుండువారికి నారాత్రిచీఁకటియందుఁ గానిపించినవని భావము. విశాలములును ప్రకాశమానములు నగుటవలన బడబాగ్నులవలెఁ దోఁచినవనుట. విశాలములగుటకు ఘనకాయవిజృంభణ హేతువు. ప్రకాశమానములగుటకు విలయతమిస్రవేళ పోషకము. అలం. ఉపమ.

చ. చటులకృపీటసంస్థితరసాస్థలి ప్రీలకయుండ గార యి
చ్చుటకునుబోలె శంఖమణిశుక్తికదంబము నుగ్గుగా విశం
కటచరమాంగమంథగిరిఘట్టనఁజేసి ఘరట్టమై కృపా
పటిమ జగంబుఁ బ్రోచునలప్రాక్కమఠంబు నినున్ భజించెదన్. 107

అ. చటుల స్థలి - చటుల=చలించుచున్న-మందరముతిరుగుటచేత మిక్కిలి చలించి మీఁదికి వ్యాపించుచున్న, కృపీట=నీటియందు, సంస్థిత=ఉండునట్టి, రసాస్థలి=భూతలము, ప్రీలకయుండక = విరిసిపోకుండుటకై, గారయిచ్చుటకునుబోలెన్ =సున్నపుగచ్చుచేయుటకే యనునట్లు, శంఖ కదంబము - శంఖ=సంకులయొక్కయు, మణి=రత్నములయొక్కయు, శుక్తి=ముత్తెపుఁజిప్పలయొక్కయు, కదంబము=సమూహము-రాశి, నుగ్గుగాన్ =పొడియగుటకు, విశంకట ..ఘట్టనఁజేసి- విశంకట=విశాలమయిన, చరమాంగ=వీఁపుఁజిప్పయొక్కయు, మంథగిరి=కవ్వపుఁగొండయొక్కయు, ఘట్టనఁజేసి=ఒరపిడిచేత, ఘరట్టమై=తిరుగలియై, కృపాపటిమన్ =దయాసమృద్ధిచేత, జగంబున్ = లోకమును, ప్రోచునలప్రాక్కమఠంబున్ -ప్రోచు=పోషించునట్టి, అల=ప్రసిద్ధమైన, ప్రాక్కమఠంబున్ =ప్రాఁతతాఁబేటిని-ఆదికూర్మమును, నినున్ =నిన్ను, భజించెదన్ = సేవించెదను

తా. నీళ్లయందుఁ దేలుచుండెడి భూమండలము విరిసిపోకుండుటకై సున్నపుగార చేయనో యేమో యనునట్లు తనవీఁపుఁజిప్ప యడుగురాయియు కవ్వపుఁగొండ మీఁదిరాయియుఁ గాఁగాఁ దాను

దిరుగలిగ్రైశంఖములయు రత్నములయు ముత్తెపుఁజిప్పలయు రాశియనైడిసున్నముసోటి లోకమును గాపాడెడి యాదిసూకరమైన నిన్ను సేవించెదను అలం ఉత్ప్రేక్ష.

చ. ఉరుతరవిగ్రహస్ఫురణ నుబ్బిననీరుపరిచ్ఛిదాముఖాం
తరమునఁ దోరమై యెగయుధార నజాండము గాజుకుప్పెతో
సరి యనఁగాఁ దలాతలరసాతలసీమలు సించి ధాత్రి ను
ద్ధరణ మొనర్చినట్టి నిను నాదివరాహము నాశ్రయించెదన్. 108

అ ఉరుతర. స్ఫురణన్ - ఉరుతర = మిక్కిలిపెద్దదయిన, విగ్రహ=దేహముయొక్క, స్ఫురణన్ =అదురుచేత - కదలికచేత, ఉబ్బిననీరు=ఉబికినజలము, ఉపరిచ్ఛిదాముఖాంతరమునన్ - ఉపరి=మీఁదిభాగముయొక్క, ఛిదా=కోఁతదయిన - గండిదియయిన, ముఖ=ద్వారముఖముయొక్క, అంతరమునన్=సందునుండి, తోరమై=అధికమై - ధారారూపమై, ఎగయుధారన్ = పైకెగయునట్టిధారచేత, అజాండము=బ్రహ్మాండము, గాజుకుప్పెతోన్=గాజుమట్టితోఁజేసిన బుడ్డితో, సరి=సమానము, అనఁగాన్=అనునట్లుకాఁగా, తలాతలరసాతలసీమలు = తలాతలము రసాతలము ననెడి క్రిందిలోకములను, చించి=చీల్చి - రంధ్రము చేసి, ధాత్రిన్=భూమిని, ఉద్ధరణము=మీఁదికెత్తుటను, ఒనర్చినట్టినినున్=చేసిననిన్ను, ఆదివరాహమున్=తొలుతటిదైన యజ్ఞవరాహమును, ఆశ్రయించెదన్= అండగొనియెదను.

తా మిక్కిలి పెద్దదైన నీవరాహమూర్తి బ్రహ్మాండమునందలి మహాజలమును బ్రవేశింపఁగానే యాదేహసమృద్ధిచేత నాజలము మిక్కుటముగాఁ బొంగి బ్రహ్మాండముపై చిప్ప భేదించుకొని మీఁదికి నిడుదధారగా నెగసి బ్రహ్మాండము పైనంతయు వ్యాపింపఁగా జలవ్యాప్తమైన బ్రహ్మాండము గాజువలె మెఱయఁగాఁ బైకెగసిన నీటిధార సోగ మెడవలె నొప్పఁగా నా బ్రహ్మాండము సోగ మెడగలయొక గాజు నీసాలాగునఁ దోఁచెను ఇట్లది తోఁచుచుండఁగాఁ గ్రిందిలోకముల నెల్ల భేదించి భూమిని బైకెత్తిన వరాహమూర్తివైన నిన్నాశ్రయించెదను అలం. ఉపమ

మ కరుణించున్ మము నట్టినీదుభుజయుగ్మం బెద్ది పూనెన్ నభో
తరసీమం దితిజాంత్రసక్తనఖసంతానంబుతో నోనృకే
సరి రాత్రించరభీతికై త్రిభువనాస్థానీయవీథిన్ విక
స్వరశోణస్రగలంకృతక్రకచభాస్వత్తోరణస్తంభతన్. 109

అ. ఓనృకేసరి=నృసింహుఁడవైనయోస్వామీ, ఎద్ది=ఏభుజద్వయము, నభోంతరసీమన్ =ఆకాశమధ్యభాగమందు, దితి ..తోన్ - దితిజ=దితికొడుకైన హిరణ్యకశిపునియొక్క, ఆంత్ర = ప్రేఁగుల తోడ, సక్త=కూరుకొన్న, నఖసంతానంబుతోన్=గోళ్లసమూహముతో, రాత్రించరభీతికై=రాక్షసుల వెఱపునకై, త్రిభువనాస్థానీయవీథిన్ - త్రిభువన=స్వర్గముయొక్క, ఆస్థానీయ=కొలువుఁగూటముయొక్క, వీథిన్=మార్గమునందు - తలవాకిటియందనుట, వికస్వర స్తంభతన్ - వికస్వర = వికాసమునొందిన - విరిసిన, శోణ=ఎఱ్ఱనైన, స్రక్=పూదండలచేత, అలంకృత=అలంకరింపఁబడిన, క్రకచ=అంపములచేత, భాస్వత్=ప్రకాశించుచున్న, తోరణస్తంభతన్=గోపురద్వారపుఁగంబములగుటను, పూనెన్=వహించెనో, అట్టినీభుజయుగ్మంబు=అటువంటినీదైనభుజద్వయము, మమున్=మమ్ము, కరుణించున్=దయచేయును - అనుగ్రహించుఁగాకయనుట, (హిరణ్యకశిపుఁడు స్వర్గము నేలుచుండెననుటయు సభాద్వారము

నందు, వాఁడు నృసింహదేవునిచేఁ జంపఁబడెననుటయుఁ బురాణప్రసిద్ధము గనుక, త్రిభువనాస్థానీయవీథిక్ = స్వర్గమర్త్యపాతాళములనెడి మూఁడులోకములయొక్క సభాశ్రేణులయందు. ప్ర [illegible] వాయఁబడి నయర్థము సమంజసముకాదని తోఁచెడి )

తా. ఓస్వామీ! నృసింహుఁడవైన నీవు చేతిగోళ్లయందు హిరణ్యకశిపునికడుపులోని ప్రేఁగులు వ్రేలఁగా బాహువులెత్తుకొని స్వర్గసభాద్వారమునందు నిలిచినప్పుడు నీబాహువులు రాక్షసులకు బెదరు పుట్టించుటకై యెత్తినిపువ్వుదండలచే నలంకరింపఁబడి అంపములు గిట్టినిలిపిన గోపురద్వారపుస్తంభములవలె నుండెను. అట్టి నీభుజద్వయము మమ్ము రక్షించుఁగాక. ఇచట కడుపులోని ప్రేఁగు లెత్తినపూదండలుగాను గోళ్లు అంపములుగాను భుజములు తోరణస్తంభములుగాను పరిణతములు. అలం. నిదర్శన

చ. దనుజకులేంద్రదత్తకరతామరసస్థితదానధారచే
ననిమిషదైన్యదుఃఖితమహామునిమండలదృశ్యకశ్యపాం
గననయనాంబువుల్ గడిగి కంజభవాండము మోవ లీల మైఁ
బెనిచినదంభవామను నుపేంద్రుని నిన్ను సమాశ్రయించెదన్. 110

అ. దనుజ ధారచేక్ - దనుజకులేంద్ర = దానవవంశశ్రేష్ఠునిచేత - బలిచక్రవర్తిచేత, దత్త = ఇయ్యఁబడిన, కరతామరస = హస్తకమలమునందు, స్థిత = ఉండిన, దానధారచేక్ = ఈవినీటిధారచేత, అనిమి. బువులు - అనిమిష = దేవతలయొక్క, దైన్య = పేదఱికముచేత, దుఃఖిత = దుఃఖమునొందిన, మహామునిమండలదృశ్య = సప్తమహర్షిమండలమునందుఁ జూడఁదగిన, కశ్యపాంగన = కశ్యపమహామునిభార్యయయిన యదితియొక్క, నయనాంబువులు = కన్నీళ్లు, కడిగి = తుడిచి - ఆ మెదుఃఖముమాన్పియనుట, కంజభవాండము = బ్రహ్మాండము, మోవక్ = అనునట్లు, లీలక్ = విలాసముగా - అనాయాసముగా, మైక్ = దేహమును, పెనిచినదంభవామనుక్ - పెనిచిన = పెరుఁగునట్లుచేసిన, దంభవామనుక్ = కపటపుఁబొట్టివానిని - వంచనచేయుటకై పొట్టివాఁడుగాఁబుట్టినవానిని, ఉపేంద్రునిక్ = ఇంద్రుని తమ్ముఁడైనవానిని, నినుక్ = నిన్ను, సమాశ్రయించెదక్ = లెస్సగా నాశ్రయించెదను.

తా. బలిచక్రవర్తిచేత మూఁడడుగులభూమి దానముగాఁ బుచ్చుకొని బ్రహ్మాండమంతయు నాక్రమించినకపటవామనుని నింద్రునికిఁ దమ్ముఁడై యవతరించుటచే నుపేంద్రుఁడనఁబరఁగినవానిని నిన్ను నే నాశ్రయించెదను. (మునిమండలదృశ్య యైనకశ్యపాంగన యనుటవలన దానధార తీసికొన్నతోడనే మునిమండలమువఱకుఁ బెరిఁగినాఁడని పెరుఁగుటయొక్క వేగము స్ఫురించుచున్నది ) అలం. పర్యాయోక్తము

చ. తన దగుసంతతిం గనలి తానె వధించినపాపముల్ చెడక్
మునిఁగెడు నా గుణోగ్రకిణముల్ మొనయంగ శమంతపంచక
మ్మునఁ బితృతర్పణచ్ఛలన మున్కలు వెట్టుభవద్భుజాయుగం
బున కిదె వందనంబు భృగుపుంగవరూప విహంగవాహనా. 111

అ. భృగుపుంగవరూప = భార్గవశ్రేష్ఠునిరూపముగల - పరశురామావతారమెత్తిన, విహంగవాహనా = పక్షివాహనుఁడా - విష్ణుదేవుఁడా, తనది = తనవలననైనది, అగుసంతతిక్ = అయినట్టిసంతానమును - అనఁగా క్షత్రియుల సమూహమును, (పరమపురుషుఁడయిన విష్ణునిబాహువులవలన క్షత్రియులు పుట్టి

రని శ్రుతులు పలుకుచున్నవి గనుక నా పురుషోత్తముని యవతారమైన పరశురాముని బాహువులు తమవలనఁ బుట్టిన క్షత్రియుల సమూహమును వధించెనని సంబంధము) కనలి = కోపించి, తానె=కనినతానే, వధించిన పాపములు = చంపిన పాతకములు, చెడన్ =నశించుటకై, మునిఁగెడునాన్ = మునుఁగుచున్నదో యనునట్టుగా, గుణోగ్రకిణములు-గుణ = అల్లెత్రాటిరాయిడిచేనైన, ఉగ్ర=భయంకరములయిన, కిణములు = కాయలు-గట్టిపడిన స్పర్శస్థానములు, మొనయంగన్ = ముందటికి మొగ్గఁగా, శమంతపంచకంబునన్ = క్షత్రియరక్తములచే నైదుమడుఁగులు గావించిన పుణ్యతీర్థములయందు, పితృతర్పణచ్ఛలనన్=తండ్రికిఁ దర్పణము చేయుట యనుమిషచేత, మున్కలువెట్టుభవద్భుజాయుగంబునకున్ - మున్కలువెట్టు=మునుఁగునట్టి-స్నానము చేయునట్టి, భవత్=నీదైన, భుజాయుగంబునకున్=భుజముల జంటకు, ఇదె=ఇదిగో, వందనంబు=నమస్కారము ("విషవృక్షోపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్" అను శ్లోకార్థ మిచ్చట సూచింపనయ్యెను.)

తా॥ పరశురామావతారమెత్తిన యో పురుషోత్తమా! క్షత్రియులు నీ బాహువులవలన జనించినవార్లగుటచే బాహుజులనం బరఁగిరిగదా అట్లు తమబిడ్డలయిన రాజులను దామే చంపినపాపముతొలఁగుటకై పితృతర్పణము చేయుట యనుమిషచేత వింటినారి సోఁకి కాచిన కాయలు ముందటికి మ్రొగ్గఁగా రాజరక్తములచే నైదుమడుఁగులై శమంతపంచక మనం బరఁగిన పుణ్యతీర్థములందు మునుఁగుచున్న నీ రెండు బాహువులకు నిదిగో మ్రొక్కుచున్నాను. అలం. అపహ్నవము.

మ॥ పవిధారాపతనంబు గైకొననియప్పౌలస్త్యుమైన్ సప్తధా
తువులం దూఱుపరిశ్రమంబునకు నుద్యోగించె నా సప్తసా
లవిభేదం బొనరించి నిల్వక సలీలం జన్నయుష్మన్మరు
జ్జవనాస్త్రం బొసఁగున్ సిరుల్ రఘుకులస్వామీ రమావల్లభా. 112

అ. రఘుకులస్వామీ=రఘువంశపురాజైన శ్రీరామా, రమావల్లభా = లక్ష్మీప్రియుఁడా, పవిధారాపతనంబు=వజ్రాయుధముయొక్క పాటును, కైకొనని యప్పౌలస్త్యుమైన్-కైకొనని=లక్ష్యము చేయని, అప్పౌలస్త్య=ప్రసిద్ధుఁడయిన రావణునియొక్క, మైన్=దేహమునందుఁగల, సప్తధాతువులన్= వస అసృక్కు మాంసము మేదస్సు అస్థి మజ్జ శుక్లము అనునట్టి సప్తధాతువులందును, (రోమములు త్వక్కు మాంసము అస్థి స్నాయువు మజ్జ ప్రాణము అనెడివి సప్తధాతువులని కొందఱు) దూఱుపరిశ్రమంబునకున్=చొచ్చునట్టి యభ్యాసమునకు, ఉద్యోగించెన్=ప్రయత్నము చేసెనో, నాన్=అనునట్లు, సప్తసాలవిభేదంబు-సప్తసాల=ఏడు ఏపెమ్రాఁకులయొక్క (పా. సప్తతాల=ఏడుతాటిచెట్లయొక్క), విభేదంబు=తెగనఱకుటను, ఒనరించి=చేసి, నిల్వక=అంతటితో నిలువక, సలీలన్=విలాసముతో-ఆట్లాటవలెననుట, చన్న స్త్రంబు-చన్న=భూమిలోనికిఁ దూఱిపోయిన, యుష్మత్=నీదైన, మరుజ్జవన=వాయువేగమువంటి వేగముగల, అస్త్రంబు = బాణము, (నాకు) సిరులు = సంపదలు, ఒసఁగున్ = ఇచ్చుఁగాక.

తా. రఘురాముఁడవై యవతరించిన యో లక్ష్మీవల్లభా! వజ్రాయుధము దెబ్బను లక్ష్యము చేయని రావణుని దేహమునందుఁ జొచ్చి వసాదులైన యేడుధాతువులను భేదించుపనికి నలవాటు చేసికొననో యనునట్లు సప్తసాలములను భేదించి యంతటితో నిలువక భూమిలోఁ దూఱిపోయిన నీవడిగల బాణము నాకుఁ గలుములనిచ్చుఁగాక (మిక్కిలి కష్టసాధ్యమైనయొకపని చేయవలసియున్నయెడల మును ముట్ట నట్టి

పనుల నభ్యాసము సేయుట స్వాభావికము. రావణుని దేహము వజ్రపు దెబ్బనుగూడ లక్ష్యము సేయనంత యతికఠినమగుటచే నందలి యేడుధాతువులను దూఱుట కష్టసాధ్యమగును గాన నరిదులకై మునుముట్ట నభ్యాసము చేయుచున్నవో యనునట్లు లేడుసాలములఁ దూఱివచ్చినవని భావము.) అలం ఉత్ప్రేక్ష

క. పెరుఁగు ప్రలంబుని పీఁపునఁ, గరిపైఁ హరివోలె విశదకాంతి నిలిచి త
త్కరణం బారాటముగాఁ, బరిమార్చిన నీదుబలిమిఁ బ్రణుతింతు హరీ. 113

అ. హరీ=ఓవిష్ణుఁడా, పెరుఁగుప్రలంబునిపీఁపునన్ — పెరుఁగు = పొడుగుగా నెదుగుచున్న, ప్రలంబుని=ప్రలంబాసురునియొక్క, పీఁపునన్=పీఁపునందు, కరిపైన్=ఏనుఁగుమీఁద, హరివోలెన్=సింహమువలె, విశదకాంతిన్ = తెల్లనివెలుఁగుతో, నిలిచి=నిలువఁబడి, తత్కరణంబు=వానిశరీరము, ఆరాటము=పరితాపముపొందినది, కాన్ = కాఁగా, పరిమార్చిన నీదుబలిమిన్ — పరిమార్చిన=చంపిన, నీదుబలిమిన్=(బలరాముఁడవైన) నీబలమును, ప్రణుతింతున్ = స్తోత్రము చేసెదను – బలరామావతారమెత్తి ప్రలంబాసురుని సంహరించినహరీ! నిన్నుఁ బొగిడెదననుట అలం ఉపమ

తే. కొలుతుఁ దాదృగ్భవద్బాహుఁ గులిశయష్టి, నెద్దిగిరివోలెఁ గడుపులోఁ బెృద్ధిఁబొందఁ
బగిలి రాకాసిదేహంబు మొగపుముత్య, మయ్యె ముంగాముఱారి రంగ్గె మురారి.

అ. మురారి = మురాసురునిశత్రువైన కృష్ణా, ఎద్ది=ఏబాహువు, కడుపులోన్ = గర్భమునందు, వృద్ధిఁబొందన్=పెరుఁగఁగా, రాకాసిదేహంబు=కేశియనురాక్షసునియొక్క శరీరము, గిరివోలెన్=కొండవలెనే, పగిలి=విచ్చి, ముంగాముఱారిన్ = ముంజేతికడియమునందు, (పా. ముంగైముఱారి) మొగపుముత్యము=ముఖభాగమునందలిముత్యము, రంగై=ఒప్పుగా, అయ్యెన్=అయ్యెనో, తాదృ. యష్టిన్ – తాదృక్=అటువంటి, భవత్=నీదైన, బాహు=భుజమనెడి, కులిశయష్టిన్ = వజ్రాయుధదండమును, కొలుతున్ = సేవించెదను.

తా. కొండవంటి కేశియనురాక్షసునినోటిలోఁ జేయి దూర్చి కడుపునందుఁ జక్కఁగాఁ జొప్పించి పెంచి వానిపొట్టపగిల్చి చంపితివి. అట్లు వానికడుపులోఁ బెరిఁగి వానిపొట్టపగిల్చిన వజ్రాయుధము నుబోలిన నీబాహువును నేను సేవించెదను (ఇది బుద్ధావతారమని గ్రహింపవలెను.) అలం రూపకము.

క. కృతయుగ మేతేర నలం, కృతికై కాశ్మీరపంకమిడి యలుకుక్రియన్
క్షితియెల్ల మ్లేచ్ఛరక్త, ప్లుతముగఁ గావించు రౌతుఁ బొగడెద నిన్నున్. 115

అ. కృతయుగము, ఏతేరన్ = రాఁగా, అలంకృతికై = భూమియొక్క యలంకారమునకై, కాశ్మీరపంకము = కుంకుమపువ్వు చేర్చికలిపిన పలుచనిగంధపునీరు, ఇడి=పెట్టి, అలుకుక్రియన్=అలుకునట్టివిధమున, క్షితియెల్లన్=భూమియంతయు, మ్లేచ్ఛరక్తప్లుతముగన్ – మ్లేచ్ఛ=గోమాంసభక్షకులును దురాచారులునైన నీచజాతిజనులయొక్క, రక్త=నెత్తుటిచేత, ప్లుతముగన్ = తడిసినది యగునట్టుగా, కావించురౌతున్ = చేయునట్టిగుఱ్ఱము నెక్కి యుద్ధము చేసెడి బంటయిన, నిన్నున్ = నిన్ను, పొగడెదను

తా. కలియుగము కడచి కృతయుగము వచ్చుసమయమునందు ధర్మప్రవర్తనమునకు నాధారమైనయాయ్యుగము రాకడకును నలంకారముగా నుండుటకై కుంకుమపువ్వు కలిపిన మంచిగంధపునీరుకల

యంపిగాఁజేసి యలికినట్లు కల్కిరూపముతో నధర్మప్రవర్తకులయిన మ్లేచ్ఛుల నెల్ల సంహారించి భూమండలమును వాఁడిచెత్తుటిచేతఁ దుడుపఁగల గుఱ్ఱపు రౌతయిన యోహరీ! నిన్నుఁ బొగడెదను అలం ఉపమ.

వ అని ప్రస్తుతించినం బ్రసన్నుండయి పాంచజన్యధరుండు వాత్సల్యంబున వత్సా వరంబు వేఁడు మనుటయుం బ్రసాదం బని స్వారోచిషుం డిట్లనియె. 116

అ. అని, ప్రస్తుతించినన్ = పొగడఁగా, పాంచజన్యధరుండు=పాంచజన్య మనెడి శంఖమును దాల్చిన విష్ణుదేవుఁడు, ప్రసన్నుండై = అనుగ్రహించినవాఁడై, వాత్సల్యంబునన్ =ప్రేమతో,వత్సా= బిడ్డా - చిన్నవాఁడా, వరంబు వేఁడుము = నీకువలసినవరము నడుగుము, అనుటయున్ =అనఁగా, ప్రసాదంబు=మీయనుగ్రహము, అని, స్వారోచిషుండు=స్వరోచికొడుకు, ఇట్లనియెన్ =ఇట్లుపలికెను.

క దేవ భవద్దాస్యసుఖం, బే వేఁడెద దయకుఁ దగుదునే సాలోక్యం
బీవే యితరము లొల్లన్, నావుడు నాతనికిఁ బద్మనాభుం డనియెన్. 117

అ. దేవ=ఓస్వామీ, భవద్దాస్యసుఖంబు = నీసేవవలని సౌఖ్యమును, ఏన్ = నేను, వేఁడెదన్ = కోరెదను, దయకున్ = నీకరుణకు, తగుదు నేన్ =తగినవాఁడనైనపక్షమున, సాలోక్యంబు=సమానలోకత్వము-నీలోకమునందు నీచేరువ నునికినటుట, ఈవే=ఇయ్యవయ్యా, ఇతరములు=అంతకంటె వేఱయినవానిని, ఒల్లన్ = నేన పేక్షింపను, నావుడున్ =అనఁగా, అతనికిన్ =ఆస్వారోచిషునకు, పద్మనాభుండు=విష్ణువు, అనియెన్ =ఇట్లుపలికెను

క. సాలోక్యముఁ దుది నిచ్చెద, నేలు మిల ద్వితీయమనువ వీవై నయధ
ర్మాలోలబుద్ధిఁ దిరముగ, వేలుపులకుఁ దపసులకును విధికిఁ బ్రియముగాన్. 118

అ సాలోక్యము=నాతోడిసమానలోకత్వమును, తుదిన్ =కడపట, ఇచ్చెదన్ =నీకునిచ్చెదను. ప్పుడు) ఈవు=నీవు, ద్వితీయమనువవై, నయ. . బుద్ధిన్ -నయ = నీతియందును, ధర్మ=పుణ్యమునందును, ఆలోల=అసక్తమయిన, బుద్ధిన్ =బుద్ధితో, తిరముగన్ = స్థిరముగా-చలనములేకుండునట్లు, వేలుపులకున్ =దేవతలకును, తపసులకున్ =తపస్సు చేసికొనెడి ఋషులకును, విధికిన్ =సృష్టికర్తయైన బ్రహ్మకును, ప్రియముగాన్ =ఇష్టముగా, ఇలన్ =భూమిని, ఏలుము = నీవుపాలింపుము - నీవిప్పుడు రెండవమనువవై వర్ణాశ్రమధర్మములుతప్పక న్యాయమున భూమినిపాలింపుము తుదనునీకు సాలోక్యము కూనిచ్చెదను.

చ అని మహిమన్ మనుత్వమున కాతనిఁ బట్టము గట్టి పద్మలో
చనుఁడు విరించిశర్వముఖసర్వసుపర్వులతో నదృశ్యుఁ డై
చనియె నిజాలయంబునకు శాస్త్రవినిశ్చయయుక్తి దండపా
లనముల నవ్విభుండుఁ బ్రజనెలం బ్రజల ట్లరసెం గృపామతిన్ 119

అ. అని=ఇట్లుపలికి, పద్మలోచనుఁడు=కమలములవంటికన్నులుగలవాఁడైన విష్ణుదేవుఁడు, మహిమన్ =ఘనతతో, మనుత్వమునకున్ =మనుభావమునకు-మనుప్రభుత్వమునకు,అతనిన్ =ఆస్వారోచిషుని, పట్టముగట్టి=పట్టాభిషిక్తునిఁగావించి, విరించి...లతోన్ -విరించి=బ్రహ్మ, శర్వ=శివుఁడు, ముఖ=మొదలుగాఁగల, సర్వ=సమస్తమైన, సుపర్వులతోన్ =దేవతలతోడను, అదృశ్యుఁడై=కానరానివాఁడై, నిజాలయంబునకున్ =తనయింటికి-వైకుంఠమునకునని, చనియెన్ = పోయెను, అవ్విభుండును=ఆస్వా

రోచిషమనువును, శాస్త్రవినిశ్చయయుక్తిన్ = శాస్త్రనిర్ణయముతోఁ గూడుకొనునట్లు-ధర్మశాస్త్ర నిర్ణయముచొప్పున, దండపాలనములన్-దండ= దుష్టులను దండించుటచేతను, పాలనములన్=శిష్టుల ను రక్షించుటచేతను, ప్రజలన్ = జనులను, ప్రజలట్లు=తనబిడ్డలవలెనే, కృపామతిన్= దయతోడి బుద్ధితో, అరసెన్=ఏలెను.

తా. అనిచెప్పి స్వారోచిషుని మనుత్వమునకుఁ బట్టాభిషిక్తునిఁజేసి సకలదేవతలతోడను విష్ణుదే వుఁడు అంతర్హితుఁడయ్యెను. అంతట స్వారోచిషుఁడును మనువయి ధర్మముతప్పక రాజనీతి ననుసరిం చి దుష్టశిక్షణ శిష్టరక్షణములు చేయుచుఁ బ్రజలయందు మిక్కిలి కరుణగలవాఁడై భూమి నేలెను. అలం. ఉపమ.

సీ. వానలు సరవితోఁ గురియించె సస్యముల్, వేళ్లఁ గొల్చుగ విఱ్ఱవీఁగి పండె<br>
నారోగ్యపుత్త్రపౌత్త్రైశ్వర్యవంతులై, బ్రదికిరి నూఱేండ్లుఁ బంచజనులు<br>
పూవుఁబోఁడులు పతిదేవతలై రగ్ని, భయతస్కరవ్యాధిభయము లడఁగె<br>
ఫలపయఃకుసుమాదిబహుపదార్థంబులు, రసగంధసామగ్రి నెసక మెసఁగె<br>
నీత్యుపద్రవమృత్యురాహిత్యయుక్తి, ధరఁ బ్రజావృద్ధి తామరతంప మయ్యె<br>
న్యాయపథమున స్వారోచిషాఖ్యమనువు, శ్రీలఁ బెంపొందిపాలించు కాలమునను.

అ. స్వారోచిషాఖ్యమనువు=స్వారోచిషుఁడను పేరుగలయారెండవమనువు, శ్రీలన్=కలుముల చేత, పెంపొంది=వర్ధిల్లి, న్యాయపథమునన్=న్యాయమార్గముచేత, పాలించుకాలమునన్ = ఏలునప్పు డు, ధరన్=భూమియందు, వానలు, సరవితోన్=క్రమముతో-అదనుదప్పక, వర్షించెన్=కురిసెను, సస్యములు=పైరులు, వేళ్లన్=వేళ్లయందుసయితము, కొల్చుగన్=ధాన్యముగలవిగా, విఱ్ఱవీఁగి=మిక్కిలి నిక్కి-చాలఁబొడుగుగాఁ బెరిగి, పండెన్=ఫలించెను, పంచజనులు=మనుష్యులు, ఆరోగ్య...వంతులై- ఆరోగ్య = రోగములేమియును, పుత్త్ర=కొడుకులును, పౌత్త్ర=మనుమలును, ఐశ్వర్యవంతులై=ధన ముకలిమియునుగలవారై, నూఱేండ్లును = పురుషాయుఃప్రమాణమైన నూఱుసంవత్సరములును, బ్రదికిరి= జీవించిరి. పూవుబోఁడులు= స్త్రీలు, పతిదేవతలైరి=మగఁడే దేవుఁడుగా నెంచి వర్తించువారైరి అగ్ని ...ములు-అగ్నిభయ = నిప్పువలని భయమును-ఇండ్లుగాలిపోవుట మొదలుగాఁగలబాధలు కలుగునను భయమును, తస్కర=దొంగలవలనివియు, వ్యాధి=రోగములవలనివియునైన, భయములు=వెఱపులును- దొంగలుదోఁచుట రోగములుబాధించుట లోనగునుపద్రవములును, అడఁగెన్=అణఁగెను-లేకపోయెను. ఫల ..బులు- ఫల=పండ్లు, పయః=పాలు, కుసుమ=పువ్వులు, ఆది=మొదలుగాఁగల, బహుపదార్థంబు లు=పలువస్తువులు, రసగంధసామగ్రిన్-రస=తీపు మొదలయిన షడ్రసములయొక్కయు, గంధ=పరిమ ళములయొక్కయు, సామగ్రిన్=సమగ్రతచేత-పరిపూర్తిచేత, ఎసక మెసఁగెన్=మిక్కిలి యతిశయిం చెను, ఈత్యు. యుక్తిన్-ఈతి=అతివృష్టి మొదలైన (యాఱువిధములుగల), ఉపద్రవ=బాధలను, మృత్యు=అకాలమునందలిచావులును, రాహిత్య=లేకపోవుటతోడి, యుక్తిన్=కూడికచేత-ఈతిబాధ లును అపమృత్యుబాధలును లేకుండునట్లనుట, ప్రజావృద్ధి-ప్రజా=జనులయొక్క, అభివృద్ధి=పెంపు, తా మరతంపము=తామరయల్లుకొన్నట్లు అల్లుకొనునది, (పా. తామరతంపర) అయ్యెన్=ఆయెను.

తా. స్వారోచిషమనువు భూమి నేలునప్పుడు కాలవర్షములు తప్పక కురియుచుండెను. పైరులు చక్కఁగాఁ బెరిఁగి సమృద్ధముగాఁ బండెను. మనుష్యులు కొడుకులతోను మనుమలతోను ధనధాన్యసంప

స్నులై నూఱేండ్లును జీవించుచుండిరి అగ్నివలని భయమును దొంగలవలనిభయమును లేకయుండెను. వ్యాధులు లేవయ్యెను. రసవంతము అయినపండ్లును రుచికరమయినపాలును పరిమళము మించినపువ్వులును సమృద్ధముగాఁ గలిగియుండెను. ఈతిబాధలులేకయు,అపమృత్యువులులేకయుఁ దామరతీఁగ యల్లుకొనునట్లు బంధుత్వముల చేత నల్లుకొని ప్రజలు వర్ధిల్లిరి. అలం. ఉదాత్తము.

క. కోరిక నీస్వారోచిషు, చారిత్రము వినిన వ్రాయఁ జదివిన ధనధా
న్యారోగ్యపుత్త్రవంతులు, నై రూఢిగఁ గంద్రు పిదప నమరత్వంబున్. 121

అ. ఈస్వారోచిషుచారిత్రమున్ = ఈస్వారోచిషమనువుయొక్క చరిత్రమును, కోరికన్ =అభిలాషతో, వినినన్ =(జను లెవరేని) విన్నను, వ్రాయన్ = వ్రాసినను, చదివినన్ = క్రమముగాఁ జదివినను, ధన.. వంతులునై - ధన=విత్తమును, ధాన్య=కొలుచును,ఆరోగ్య=వ్యాధిలేమియును, పుత్త్రవంతులునై=కొడుకులును గలవారై, పిదపన్ =తరువాత, రూఢిగన్ =నిశ్చయముగా, అమరత్వంబున్ =దేవత్వమును, కంద్రు=పొందుదురు.

తే. అని మృకండుతనూభవుఁ డనుఁగుశిష్యుఁ
డై నక్రోష్టికి వినిపించినట్టియాక
థాసుధాధార నించిరి దయదలిర్ప
జైమినిశ్రుతిపుటముల శకునివరులు. 122

అ. అని=ఇట్లని, మృకండుతనూభవుఁడు=మార్కండేయుడు,అనుఁగుశిష్యుఁడు=ప్రియశిష్యుఁడు, ఐనక్రోష్టికిన్ =ఐనక్రోష్టి యనునతనికి, వినిపించినట్టి=వినికిచేసిన- చెప్పిన,ఈకథాసుధాధారన్ =అమృతధారవలె నింపుపుట్టింపుచునట్టియాకథను, శకునివరులు=పక్షిశ్రేష్ఠులు, దయదలిర్పన్ =కరుణయతిశయింపఁగా, జైమినిశ్రుతిపుటములన్ = జైమినిమునీశ్వరునికర్ణగోళములయందు, నించిరి=నిండించిరి-పూర్వకాలమునందు మార్కండేయమహాముని తనశిష్యుఁడైనక్రోష్టియనుమునికిఁ జెప్పినయీపుణ్యకథను బక్షులు జైమినిమునీశ్వరునికిఁ జెప్పెను అలం. రూపకము

శా. వ్యాయామస్థిరసంధిబంధ కటకాధ్యక్షానుగక్షోణిభృ
త్కాయగ్రావభిదావిధాభిదురదోఃఖడ్గాగ్ర యుగ్రాచల
జ్యాయఃకీర్తిభర ప్రపంచ పరపంచారామరామామణీ
గేయామేయజయాంక పంకజదృగంగీకారధీరాకృతీ. 123

అ వ్యాయా బంధ - వ్యాయామ=సాముచేతి, స్థిర =నిలుకడనొందిన-దృఢపడిన,సంధిబంధ=అవయవములకీళ్ల చేరికగలవాఁడా, కటకా . ఖడ్గాగ్ర - కటక=కటకమనెడిపట్టణముయొక్క,అధ్యక్ష=అధిపతియయినగజపతిరాజును, అనుగ=అనుసరించివర్తించువారైన, క్షోణిభృత్ =రాజులయొక్క, కాయ=దేహములనెడి,గ్రావ=కొండలయొక్క,భిదా=భేదనరూపమైన, విధా=వ్యాపారమునందు, భిదుర=వజ్రాయుధమైన, దోఃఖడ్గాగ్ర=చేతికత్తిమొనగలవాఁడా, ఉగ్రా ..ప్రపంచ-ఉగ్రాచల=శివునికొండయైనకైలాసమునకంటెను, జ్యాయః = శ్రేష్ఠతరమైన, కీర్తిభర=కీర్త్యతిశయముతోఁగూడిన, ప్రపంచ=లోకముగలవాఁడా-లోకమునందెల్లయెడల వ్యాపించినస్వచ్ఛమైనకీర్తిగలవాఁడా యనుట, వర...జ

యాంక - వర = శ్రేష్ఠమైన, పంచారామ = అమరారామము కొమరారామము భీమారామము క్షీరారామము దాక్షారామ ములనెడి పంచారామములతోఁ గూడిన దేశమునందలి, రామామణీ = స్త్రీరత్నముల చేతి, గేయ = కీర్తింపఁదగిన, అమేయ = మేరలేని, జయాంక = గెలుపుచిన్నెలుగలవాఁడా, పంకజ .. కృతీ - పంకజన్మ = తామర రేకులవంటి కన్నులుగల (అందగత్తెలైన) స్త్రీలయొక్క, అంగీకార = సమ్మతిగల, స్థిర = స్వతంత్రమైన - సుందరమైన, ఆకృతీ = ఆకారముగలవాఁడా.

తా. అవయవసంధులు గట్టిపడునట్లు సాము చేసినవాఁడవును, గజపతిరాజుతోఁ గెరలి శత్రురాజుల దేహములను వజ్రాయుధము కొండలను భేదించినట్లు భేదింపఁజాలినకత్తిని కేలఁ బట్టినవాఁడవును, వెండికొండవలెఁ దెల్లగా వెలుఁగునట్టి కీర్తి లోకమునం దెల్లయెడలను వ్యాపింపఁగా నున్నవాఁడవును, పంచారామదేశమును గెలిచి వశము చేసికొని యందలి స్త్రీల చేతను గొనియాడఁబడినవాఁడవైనను, స్త్రీలకు మనోహరమైన చక్కఁదనము గలవాఁడవు నైన కృష్ణరాయా (ఇది కృతిపతికి సంబోధనము.) అలం. రూపకము.

క. కాంతా లతాంతశర యే, కాంతికభక్తిప్రతోషితాంభోధిసుతా
కాంతా ప్రతాపరవిశశి, కాంతాయితవిమతనృపతికాంతాహృదయా. 124

అ. కాంతా = సుందరులైన స్త్రీలకు, లతాంతశర = పుష్పబాణుఁడా, ఏకాంతిక - కాంతా - వి కాంతిక = నిరతిశయమైన, భక్తి = సేవ చేతి, ప్రతోషిత = చక్కఁగా సంతోషింపఁ జేయఁబడిన, అంభోధిసుతా కాంతా = లక్ష్మీనాయకుఁడైన విష్ణుఁడు గలవాఁడా, ప్రతాపరవి. హృదయా - ప్రతాప = శౌర్యము లవలని తేజస్సనెడి, రవి = సూర్యుని చేత, శశికాంతాయిత = చంద్రకాంతపుమణులవలె నగుచున్న, విమతి నృపతి = శత్రురాజులయొక్క, కాంతా = స్త్రీలయొక్క, హృదయా = మనస్సుగలవాఁడా.

తా. స్త్రీలకు మోహము పుట్టించుటయందు మన్మథుఁడవును, విష్ణుదేవుని సంతోషపెట్టుటయందుఁ బరమభక్తుఁడవును, చంద్రకాంతమణులను వికాసహీనములనుగాఁ జేయునట్టి సూర్యునివలె శత్రువులభార్యలమనస్సులవికాసము నణఁచివేయునట్టి ప్రతాపము గలవాఁడవు నయిన కృష్ణరాయా. అలం. రూపకము.

వనమయూరము. రాజపరమేశ ఫణిరాజబల ఫుల్లాం
భోజముఖ భోజముఖభూపవిపులాంసో
త్తేజితధరాభరణదీక్షితభుజా ని
ర్వ్యాజభయదాజివిజితారినృపరాజీ. 125

అ. రాజపరమేశ = రాజపరమేశ్వరుఁడను బిరుదాంకము గలవాఁడా, ఫణిరాజబల = సర్పరాజ యగు శేషుని బలమును బోలిన బలముగలవాఁడా, ఫుల్లాంభోజముఖ = వికసించిన తామరలను బోలిన ముఖము గలవాఁడా, భోజ . భుజా - భోజముఖ = భోజరాజు మొదలైన, భూప = భూపతులయొక్క, విపుల = వి శాలములయిన, అంస = మూఁపుల చేత, ఉత్తేజిత = మెఱుఁగుపెట్టఁబడిన, ధరా = భూమియొక్క, భరణ = ధరించుటయందు, దీక్షిత = దీక్షవహించిన, భుజా = బాహువులు కలవాఁడా, నిర్వ్యాజ .. రాజీ - నిర్వ్యాజ = కారణములేని, భయద = వెఱపునిచ్చునట్టి, ఆజి = యుద్ధములందు, విజిత = జయింపఁబడిన, అరినృప = శత్రు రాజులయొక్క, రాజీ = పంక్తిగలవాఁడా.

తా. రాజపరమేశ్వరబిరుదాంకముగలవాఁడవును, ఆదిశేషునివలె బలవంతుఁడవును, విరిసినతామరపువ్వువలె మనోహరమైనవికాసముగల ముఖము గలవాఁడవును, భోజుఁడు మొదలైనరాజులచేఁ నేలఁబడిన భూమండలము నేలువాఁడవును, భయంకరమైనయుద్ధములందు శత్రువులను జయించి పన్నెగన్నవాఁడవు నైన కృష్ణదేవరాయా.

గద్యము. శ్రీమదాంధ్రకవితాపితామహసర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస శఠకోపతాపసప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లీ కాల్లసానిచొక్కయామాత్యపుత్ర పెద్దనార్యప్రణీతం బయిన స్వారోచిషమనుసంభవం బనుమహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

ఈగద్యమున కర్థము ప్రథమాశ్వాసగద్యమునకుంబోలె నెఱుంగునది.



## శుద్ధపత్రము.

పీఠికయందు 18-వ పుట మొదటిబంతిలో 'జంటేఁగ' యనుటకు 'తేఁటి' యనియు, మనుచరిత్రమున 29-వ పుట. 58-వ పద్యము నర్థమున 'పగటిలోఁ బదునాలుగడియలకు మీఁదిముహూర్తము కుతప మనఁబడును' అనుటకు 'పగటిలోఁ బదునాలుగు గడియలకు మీఁది ముహూర్తము కుతప మనఁబడును' అనియును దిద్దుకొనవలయును.